# లలితకళా పదకోశం

సంపాదకులు :

చీమకుర్తి శేషగిరిరావు

తిరుమల రామచంద్ర

వజ్ఝ శ్రీనివాసశర్మ



ప్రచురణ :

తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు.

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు.

ప్రథమ ముద్రణ

*1991*

ప్రతులు : 2,000

మూల్యం : రూ. 55/-

ప్రతులకు :
తెలుగు విశ్వవిద్యాలయం,
లలితకళా క్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు - 500 004

ముద్రణ :
ఇండియన్ ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్స్,
గన్‌ఫౌండ్రి, హైదరాబాదు.

# భూమిక

తెలుగు భాషా సాహిత్య కళాసంస్కృతుల సర్వతోముఖ వికాసానికి, వికసనానికి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ చేసిన చట్టం ప్రకారం 1985 డిసెంబరు 2వ తేదీన రూపుదాల్చిన విశిష్ట విద్యాసంస్థ తెలుగు విశ్వవిద్యాలయం. బోధన, పరిశోధన, ప్రచురణ లతోపాటు, విస్తరణసేవ, రాష్ట్రేతరాంధ్రులకూ, విదేశాంధ్రులకూ సహాయ సహకారాల కల్పనవంటి బహుముఖీన కార్యక్రమాలను కూడా ఈ విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నది. పూర్వంవున్న అకాదమీలు, తెలుగు భాషా సమితి, అంతర్జాతీయ తెలుగు కేంద్రం విలీనం కావడంతో విశ్వవిద్యాలయం వివిధ పీఠాల, కేంద్రాల, విభాగాల సమాహారంగా వ్యవహరిస్తున్నది.

తెలుగు జాతి వైభవోన్నతులకు అద్దంపట్టే గ్రంథాల ప్రచురణ విశ్వవిద్యాలయ ప్రధాన అంశాల్లో ఒకటి. విశ్వవిద్యాలయంలో విలీనం అయిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవిశ్రాంత కృషిద్వారా దేశసాహిత్య రంగంలో విశిష్టస్థానం సంతరించుకుంది. 1957 ఆగష్టు 7వ తేదీన, ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పాటైన ఈ అకాడమి దేశం మొత్తం మీద ప్రప్రథమ రాష్ట్రస్థాయి అకాడమీ కావడం విశేషం. ఈ అకాడమీ ప్రామాణిక మైన నిఘంటువులు, పదకోశాలు, కావ్యాలు, ప్రబంధాలు, వ్యాసాలు, విమర్శలు, కల్పనా సాహిత్యం, పరిశోధనాత్మక గ్రంథాలు, జీవిత చరిత్రలు, అనువాదాలు మొదలైనవి 168 గ్రంథాలు ప్రచురించింది.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు, బ్రౌణ్య నిఘంటువు, సంస్కృతాంధ్ర పదార్ణవము, తెలుగు నిఘంటువు మొదలైన నిఘంటువులు పండితులనుంచీ సాహిత్య వేత్తలనుంచీ, సామాన్య పాఠకులనుంచీ విశేష ప్రశంసలందుకున్నాయి.

తెలుగు విశ్వవిద్యాలయం ఈ ప్రచురణ సత్సంప్రదాయాన్ని కొనసాగిస్తూ ఇప్పటివరకు 1,4 గ్రంథాలను వెలువరించింది.

ప్రస్తుతగ్రంథం విలక్షణమైన నిఘంటువు. 'లలితకళా పదకోశం' నిర్మాణం కావడం భారతీయ భాషల్లో ఇదే ప్రప్రథమం. పూర్వంవున్న ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ ఈ నిఘంటు నిర్మాణ ప్రతిపాదనకు నాంది పలికింది. లలితకళా రంగంలో విస్తృతానుభవానికి తోడు బహుభాషా పాండిత్యంవున్న శ్రీ చీమకుర్తి శేషగిరిరావు, డా॥ తిరుమల రామచంద్ర, శ్రీ వఝ్ఝ శ్రీనివాసశర్మ సంపాదక బాధ్యత వహించారు. వీరు అనేక గ్రంథాల సహాయంతోనూ, ఎందరో పండితుల సహకారంతోనూ చిత్రశిల్ప కళా పారిభాషిక పదాలను సేకరించారు. ఆంగ్లపదాలకు తెలుగు సమానార్థకాలు నిర్ణయించడంలో ఇదివరకు తెలుగులో వెలువడిన లలితకళా గ్రంథాల్లోని కొన్ని పదాలను సంపాదకులు స్వీకరించారు. అవసరమైనప్పుడు పాతపదాలతో పాటు కొత్త పదాలకు రూపకల్పనచేసి పదకోశంలో చేర్చారు. ఉదాహరణకు : 'డిస్టెంపర్' అనే పదానికి కలలం, జిగురురంగు అనే సమానార్థకాలూ, 'డ్రైపు' అనే పదానికి అర్థిక, డ్రైపు అనే సమానార్థకాలు ఇచ్చారు.

ఈ పదకోశ నిర్మాణంలో విశేష కృషిచేసిన సంపాదకులకు తెలుగు విశ్వవిద్యాలయం తరపున కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఉత్తమ గ్రంథాలను అందించాలనే తెలుగు విశ్వవిద్యాలయ సంకల్పానికి ఈ బృహద్గ్రంథం మరొక నిదర్శనం. 'లలితకళా పదకోశం' అన్ని వర్గాల పాఠకుల ఆదరాభిమానాలు పొందగలదని విశ్వసిస్తున్నాను.

సి. నారాయణరెడ్డి
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు.
తేది . 17–2–1991.

# A

**Aaron's rod** : *ఆరాను దండం.*

చుట్టగా చుట్టుకొన్న సర్పం, లతలు, ఆకులతో కూడిన వర్తులాకారపు ప్రలక్షణం; ఇది పాశ్చాత్య శిల్పాల్లో కనబడుతుంది.

**abaculus** : *అస్తరిక.*

చిత్రపట్టము (*tessera*) నకు ఇది పర్యాయనామం. కాని ప్రస్తుతం ఇది వాడుకలో లేదు.

**abacus** : *ఫలక.*

**abbreviation** : *సంకేతం; సంక్షిప్తనామం.*

**ABC art** : *ఆరంభ కళ.*

(చూ : *minimal art*)

**abozzo** : *మౌలం.*

1. చిత్రలేఖనంలో కాడిక మీద రచించే తొలిరేఖా చిత్రం
2 కాడిక మీద పూసే తొలి రంగుపూత
8. శిల్పంలో ముందుగా మలచే స్థూలాకృతి. 'అబొజ్జో' అన్నది ఇటాలియన్ భాషా పదం; దీనికి పాండులేఖ్యం (స్కెచ్) అని అర్థం

**abrasion** : *రాపిడి; ఘర్షణం.*

**abrasive** : *ఘర్షణి.*

**abraum** : *శోణిక.*

ఒక శోణమృత్తికా వర్ణం; మహాగనీ దారువును ఎర్రపరచడానికి ఉపయోగించేది.

**absorbancy** : *గ్రసన శీలత.*

ఒక ద్రవపదార్థమును లేదా వర్ణమిశ్రితమగు ఒక ద్రవపదార్థమును పీల్చుకొనగలుగు స్వభావము.

**absorbed** : *గ్రసితం.*

'పీల్చుకొనబడినది' అని దీని అర్థము.

**absorbent cloth** : *పీల్పు గుడ్డ; ఊత్పాయి వస్త్రం.*

**abstract art** : *వివిక్త కళ; సారాంశ కళ; నైరూప్య కళ.*

ప్రకృతిలోని సహజ ఆకృతులను చిత్ర రచనావసరాలకు అనుగుణంగా మార్చిగాని, పూర్తిగా విసర్జించిగాని-ఆ ఆకృతులలో నిండి ఉన్న సౌందర్య సారాన్ని నిర్దిష్ట రీతులలో, రేఖలలో, రంగులలో సృష్టించే కళ. ఒక్కొక్కప్పుడు కొన్ని సహజ ఆకృతులు ఉన్నా అవి శైలీకృతాలై, ఆ ఆకృతులు అనేక రకాలుగా విభజన చెంది, తిరిగి విభిన్న క్రమాలలో అమర్చబడి మళ్ళీ మళ్ళీ అవే రూపాలు వేరు వేరు స్థానాలను ఆక్రమించి గుర్తించటానికి వీలులేని విధంగా ఉంటాయి.

ఈ విధంగా ఆకృతులను పాక్షికంగా ఛిన్నాభిన్నం గావించే పద్ధతి పాక్షిక సారాంశ కళ (*semi-abstract art*). నిజాకృతులు పూర్తిగా కన్పించని కళనే ప్రాతికాల్పనికేతర కళ (*non - representational art*) అని అంటారు. దీన్నే వాసిలీ కాన్‌డిన్‌స్కీ (1866 - 1944) వస్తు రహిత కళ (*non-objective art*) అని వ్యవహరించాడు. ఇతడు 1910లో రచించిన ఒక నీటి రంగుల చిత్రాన్ని తొలి వివిక్త చిత్రంగా విమర్శకులు భావిస్తారు. వాస్తు, సంగీత కళలు రెండు కూడా ప్రాథమికంగా ప్రకృతిని అనుకరించని కళలు. ఈ కళలు అనుభవించే స్వేచ్ఛను చిత్ర కళకు అందించటానికే వివిక్త కళ ఆవిర్భవిం

చించని చెప్పవచ్చు. సంగీతం అనుభవించే స్వేచ్ఛను కాన్ డిన్స్కీ వాస్తుకళ అనుభవించే స్వేచ్ఛను మాక్రిటియస్ చిత్రకళలోకి తీసుకొని రావడానికి తొలుతగా ప్రయత్నించినవారు. ఈ వివిక్తకళ మౌలికంగా క్రొత్త రాతియుగంనాటి శిల్పాలనుంచి చరిత్రలో ప్రత్యక్షమౌతునే ఉన్నది. కాని పాబ్లో పికాసో, జార్జి బ్రాకీల స్ఫూటతావాదము (*Cubism*) తోనే ముఖ్యమైన సౌందర్య మీమాంసా సూత్రంగా ఇది 20వ శతాబ్దంలో అభివృద్ధి చెందింది. ఈ కళ ఆవిర్భవించిన తొలిదశలో ప్రముఖతను ఆర్జించిన పద్ధతులు హాలండ్‌లోని నవకల్పనా వాదం (*neo-plasticism*), రష్యాలోని పారమ్యవాదం (*suprematism*).

**abstract expressionism :** ***వివిక్త విభావనా వాదం.***

ప్రాతికాల్పనిక కళ, విభావనా వాదం అన్నవి రెండూ సమ్మిళితమైన పద్ధతికి చెందిన ఈ కళ, న్యూయార్కు నగరంలో, 1940వ సంవత్సరంలో ఆవిర్భవించి 1950 నాటికి న్యూయార్కు కళా సంప్రదాయానికి సంపూర్ణ ప్రతీకగా నిలిచింది. ఈ ఉద్యమంలో శైలీభేదాలు చాలా సంభవించాయి. సాధారణంగా ఈ చిత్రాలన్నీ పెద్దవిగాను, తీక్ష్ణమైన భావోద్వేగం చూపేవిగాను ఉంటాయి చిత్రరచనలో ఒక రంగుతో ఇంకొక రంగు కలిసేటప్పుడు యాదృచ్ఛికంగా ఏర్పడే రూపాలు కూడ వీటికి అందాన్ని చేకూరుస్తాయి.

ఈ పద్ధతికి ముఖ్యనాయకుడు జాక్సన్ పొల్లాక్ (1912–1956). రంగులను పలచగా కలిపి చిత్రంపై పోసి, చుక్కలు చుక్కలుగా నాలుగుపక్కల చిలకరించి పలచని అల్లికలాగా చిత్రాన్ని పొల్లాక్ తయారు చేసేవాడు. ఇందుకోసం యనామెల్ రంగులను కూడ వాడేవాడు. ఈ పద్ధతి ముఖ్యంగా వాసిలీ కాన్ డిన్స్కీ (1866–1944) మొదలైనవారి నవవిభావనా వాదపు (*new-expressionist*) చిత్రాలనుంచే ఆవిర్భవించింది. ఇది న్యూయార్కులో బలపడడానికి దోహదం చేసిన ప్రముఖ కళాకారులు: చాగల్, డూ చాంప్, లీజర్, మీరో. వీరు ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో యూరపు నుంచి కాందిశీకులుగా వచ్చి న్యూయార్కులో స్థిరపడ్డారు. వివిక్త విభావనా వాదంలో పేరొందిన కళాకారులు: విల్లెమ్ డి కూనింగ్; అడాల్ఫ్ గోట్లీయబ్, ఫ్రాంజ్ క్లైయిన్; ఫిలిప్ గస్టన్; రాబర్ట్ మదర్‌వెల్.

**abstract surrealism :** ***వివిక్త అధివాస్తవికతా వాదం.***

**acdemic :** ***పరిషదీయ***

**academic art :** ***పరిషదీయ కళ.***

పరంపరాగత ప్రమాణాలకు బద్ధమైన కళ. అధికార యుక్తంగా పరిషత్తు నిర్ణయించే పద్ధతులకు ఇది అనుగుణమైంది. ఛాందస పద్ధతిని అనుసరించే కళకుగాని, పరిషత్తు సాధికారంగా నిర్ణయించే సంప్రదాయాన్ని పాటించే కళకుగాని ఈ పదాన్ని ఉపయోగిస్తున్నారు. ఈ శతాబ్దిలో ఈ పదాన్ని పాతబడ్డ పద్ధతులను అనుసరించే కళకు నిందాత్మకంగా ఉపయోగిస్తున్నారు ఈ పద్ధతి అనుభావనా వాదము (*impressionism*) నకు, దాని తరవాత వచ్చిన విభిన్నవాదాలకు వ్యతిరిక్తమైనది. ఆధునికతావాదులు (*modernists*) ప్రాతికాల్పనిక కళను నిందిస్తారని భావించకూడదు.

వారు పునరావృతాలై, మేధా సంపత్తి విహీనాలై, గణనీయాలు కాని రచనలను మాత్రమే పరిషదీయ రచనలని వ్యవహరిస్తారు.

**academician** : *పరిషత్ సభ్యుడు; అకాడమీయుడు*

పరిషదీయ పద్ధతుల్ని అనుసరించి కళా రచన చేసేవాడు

**academicism** : *పరిషదీయత.*

పరిషదీయ ప్రమాణానుసారంగా కళారచన చేయడం. పరిషదీయ పద్ధతులనుంచి విడివడి రచన సాగినప్పటికీ అక్కడక్కడ ఈ ఛాయలు కన్పించే రచనలను కూడ ఈ పదంతో వ్యవహరిస్తారు.

**academy** : *పరిషత్తు; అకాడమీ.*

జాతీయ కళలను ప్రోత్సహించడం, కళాకారులకు శిక్షణ ఇవ్వడం, వారి పురోభివృద్ధికి కృషి చేయడం, అందుకై వారి రచనల ప్రదర్శనలను ఏర్పాటు చేయడం, పరిణతులైన కళాకారులకు గౌరవసూచకంగా సభ్యత్వాలను ప్రకటించడం-అనే ఉద్దేశాలతో ఏర్పడ్డ కళాకారుల సంస్థ. కళకు సంబంధించిన ఈ పరిషత్తులు 16వ శతాబ్ది నాటికి ఇటలీలో, 17వ శతాబ్దినాటికి ఫ్రాన్సులో, 18వ శతాబ్దినాటికి ఇంగ్లండులో, 19వ శతాబ్దిలో అమెరికాలో ఏర్పడ్డాయి. ఈపరిషత్తులు సాంప్రదాయిక పద్ధతులకు మాత్రమే స్థానమిచ్చి, వాటికి భిన్నంగా ఆలోచించే కళాకారులను, వారి రచనలను తిరస్కరించాయి. ప్రతిభావంతాలైన సమకాలీన రచనలలోని నవ్యత్వాన్ని తిరస్కరించి, పాత పద్ధతులకు మాత్రమే స్థానమిచ్చేవి కాలక్రమాన ఈ పరిషత్తుల ప్రమాణాలు కూడ మారుతూ వచ్చాయి. అవి తిరస్కరించిన రచనలలోని నవ్యతా, విభిన్నతలు ఒక తరం తరవాత కొత్త ప్రమాణాలుగా అంగీకరించబడేవి.

ఈ విధంగా నవ్యతను విభిన్నత్వాన్ని అంగీకరించలేని ఈ పరిషత్తులు కొత్త రీతులలో పురోగమించే కళాకారులకు ప్రయోజనకరాలుగా ఉండగలిగేవి కావు. అటువంటి కళాకారుల చిత్రాలకు ఈ పరిషత్తుల ప్రదర్శనలలో స్థానం లభించేది కాదు. ఈ 20వ శతాబ్దంలో సమకాలీన కళకు, నవ్యకళకు స్థానమిచ్చే అనేక ప్రదర్శనశాలలు ఏర్పడ్డ తరవాత ఈ పరిషత్తుల ప్రాముఖ్యం చాలవరకు తగ్గింది. ఇవి ఇప్పుడు పూర్వ సంప్రదాయాలను పాటించే రచనలకు మాత్రం స్థానాలుగా ఉన్నాయి. ఈ కాలంలో ముఖ్యమైన అకాడమీలు: అకాడమీ దే బో ఆర్ట్స్, పారిస్; రాయల్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్, లండన్; నేషనల్ అకాడమీ ఆఫ్ డిజైన్, న్యూయార్క్.

**academy blue** : *పరిషన్నీలం; అకాడమీ నీలం.*

ఒక రకమైన హరితనీలం; కొద్దిగా ఆకుపచ్చ ఛాయతో కూడిన ఒక కలగలుపు రంగు. ఆకుపచ్చతో, సముద్రనీలం కలిపి ఈరంగును తయారు చేయవచ్చును.

**academy board** : *పరిషదాస్తరం; అకాడమీ అట్ట.*

నూనెరంగులతో రచించే చిన్న చిత్రములకు, పాండులేఖ్యాలకు పనికివస్తూ తక్కువ ధరకు లభించే అట్ట. దీనిమీద, గరుకుగా ఉండడానికి, ఏదైనా రంగును ముందుగా పూసి వాడేవారు. ఇప్పుడు దీని స్థానంలో శాటి కాస్తరం (కేన్వాసు అట్ట), శాటికలాగా చిత్రించడానికి అనువుగా తయారుచేసిన పెక్కురకాల అట్టలు వచ్చాయి.

**academy figure : *అభ్యాస మూర్తి.***

అభ్యాసం కోసంగాని, శిక్షణ-ఇవ్వడానికి గాని జీవప్రమాణార్ధం (*Half life-size*) లో చిత్రించిన రేఖాచిత్రం లేదా వర్ణ చిత్రం. ఇది అభ్యాసం కోసమేగాని కల్పనా చాతుర్య ప్రదర్శనానికి కాదు. అందువల్ల ఏదైనా చిత్రం చైతన్యవంతంగా కనిపించకున్నప్పుడు, నిందాత్మకంగా, ఈ పదాన్ని ఉపయోగిస్తారు.

**acanthus : *అకాంతసం.***

కొంతవరకు శైలీకృతమై, స్తంభమకుటాలపైచెక్కిన అలంకారం ఇది ముఖ్యంగా గ్రీకు వాస్తు కళలోని కొరింతియన్ వైఖరిలోను, రోమన్-గ్రీకు మిశ్ర వైఖరిలోను, 12వ శతాబ్ది చెక్కడాలలోను కన్పిస్తుంది. మధ్యధరా ప్రాంతంలో అత్యధికంగా కన్పించే ఆకాంతస్ అనే మొక్కను శైలీకృతంగా స్తంభమకుటాలపై రచించడంవల్ల ఈ పేరు వచ్చినా, గోక్షుర, సింహపర్ణి, అజామోద పత్రాలు కూడా అకాంతసంతో పాటుగా ఆ శిల్పాలలో గోచరిస్తాయి.



స్తంభమకుటమున అకాంతస శిల్పం

**accelerated test : *పరిత్వరిత శోధన.***

చిత్రకారులు ఉపయోగించే రంగులను, ఇతర పదార్థాలను పరీక్షచేసి, కాలక్రమాన ఈ పదార్థాలలో కలిగే మార్పులను-ప్రయోగశాలలలో-కొన్ని ప్రక్రియలద్వారా-శీఘ్రగతిని తెలుసుకొనే విధానం. చిత్రాలలో కాలక్రమాన కలిగే రంగుమాపును, పగుళ్లను, ఇతరవిధాలైన లోపాలను ఈ ప్రక్రియ ద్వారా తెలుసుకోవచ్చు ఈ ప్రక్రియలు, చిత్రాలలో కాలాను గతంగా కలిగేమార్పులను యథాతథంగా తెలుపక పోయినప్పటికీ, వివిధ పదార్థాలలోని తులనాత్మక నిరోధక శక్తిని, సాధక ద్రవ్యాల మేళనాల సిద్ధాంతులను విస్పష్టంగా తెలియజేస్తాయి.

పైపూత (*coating*)కై ఉపయోగించే అనేక పదార్థాలలో ఏ పదార్థం ఎంత వరకు కాంతి రాసాయనిక భిదురత (*photo-chemical embrittlement*)ను నిరోధిస్తుందో తెలుసుకొనే ప్రక్రియను, ఈ పరిత్వరిత శోధనకు ఒక ఉదాహరణంగా పేర్కోవచ్చు. పలచని లోహపు రేకులపై పైపూతగ పూసే ఒక పదార్థాన్ని పటలవర్తిని (*film applicator*) సాయంతో పూసి, శాస్త్రీయ పద్ధతులలో దానిని నిర్ణీత సమయం వరకు (కొన్ని గంటల కాలం) అతినీలలోహిత కాంతి (*ultraviolet light*) ప్రసరణకు గురిచేస్తారు. తరవాత ఈ లోహపు రేకును ప్రామాణికమైన ఒక ఉక్కుదండంపై వంచి దానివల్ల సూచనప్రాయాలుగా ఏర్పడ్డ పగుళ్ళను పరీక్షిస్తారు. ప్రస్ఫుటాలైన ఫలితాలు బయటపడేవరకు మళ్ళీ మళ్ళీ అతినీలలోహిత కాంతి కిరణాలకు లోహపురేకును గురిచేస్తారు. ఈ విధంగా కొద్ది రోజులు జరపడంవల్ల కలిగే మార్పులను కొన్ని సంవత్సరాలకాలం సూర్య

రశ్మి పతనం వలన కలిగే మార్పులుగా నిర్ణయించవచ్చు.

**accelerator** : *పరిత్వారకము*

ప్రతిచర్య (*Reaction*) ను త్వరితం చేసే పదార్థం; శిల్పంలో పారిస్ సుధాపిష్టము (*plaster of paris*) ను గట్టిపరచడానికి ఉపయోగించే పటిక; పోర్ట్‌లాండ్ సిమెంటుకు దృఢత నివ్వడానికి మిశ్రం చేసే పదార్థం; పాలిస్టర్ యక్షధూపాలలో గట్టి పరచడానికై వాడే దృఢకారి. బాగా పని చేయడానికి, గట్టిపడేకాలాన్ని తగిన విధంగా అదుపులో ఉంచడానికి వాడే రాసాయనిక ద్రవ్యానికి కూడ ఈ పదం వాడబడుతుంది. నూనెరంగు త్వరగా ఆరడానికి ఉపయోగించే శోషణిని కూడ కొన్నిసార్లు పరిత్వరకంగా భావిస్తారు.

**accidental** : *ఆనుషంగిక; యాదృచ్ఛిక.*

**accroides** : *తృణజం (ఒక యక్షధూపం).*

**acetate** : *అసితేతం.*

**acetylene** : *అసితలీనం.*

రంగేదీ లేక వాయురూపంలో ఉండే ఒక విధమైన హైడ్రోకార్బనం దీపానికై దీన్ని వాడినప్పుడు, సాధారణమైన దీపవాయువుకన్న 15 రెట్లు ఎక్కువ వెలుతురును ఇది ఇస్తుంది.

**acetylene black** : *అసితలీన అసితం.*

కర్బనంతో తయారయ్యే వివిధాలైన నలుపురంగుల్లో ఒకటి. ఇది బెంజోల్ నలుపు మాదిరిగా ఉంటుంది.

**achromatic colours**: *ప్రసారక వర్ణాలు; ఛాయారహిత వర్ణాలు.*

తెలుపు, నలుపు, ధూసరవర్ణాలకు జాతి నామం. ఛాయాభిన్నవర్ణాల (*chromatic colours*) కన్న ఇవి వేరైనవి (చూ : *chroma*)

**acid bath** : *అమ్ల పాత్ర.*

సూచీ చిత్రణలో క్షయంకరిని ఉంచుకొనే పాత్ర. దంశనం (*etching*) చేయవలసి ఉన్న ఫలకాన్ని ఈ పాత్రలో మునిగేట్లుగా ఉంచుతారు. సూచీ చిత్రణ ప్రక్రియలో లోహ ఫలకాలను వాడేటప్పుడు, క్షయంకరిని ఉంచే అమ్లపాత్ర, అమ్ల నిరోధక పదార్థంతో- అంటే పింగాణీ, గాజు వంటి దానితో-తయారై ఉండాలి. ఒక్కొక్కప్పుడు లోహఫలకం పైనే కడయంచులలో గోడలక్కతో చుట్టును కట్టను కట్టి, అమ్ల పాత్రను వాడవలసిన అవశ్యకత లేకుండా కూడా చేసుకోవచ్చు.

**acid impurities** : *అమ్ల కాలుష్యాలు.*

**acid proof** : *అమ్ల ప్రతిరోధి.*

**acid resist** : *అమ్ల నిరోధి.*

ఒక ఉపరితలంపై క్షయంకరి (*mordant*)ద్వారా కలిగే కోతను ఆపడానికై ఈ నిరోధిని విశేషంగా వాడుతారు.

**acrolith** : *మిశ్రవిగ్రహం; అగ్రప్రస్తరి*

ఒక శిల్పంలోని మొండెమును మాత్రం కొయ్యతోగాని, వేరేపదార్థాలతో గాని తయారు చేసి, శిరాన్ని తక్కిన అవయవాలను చలువ రాతితో మలచి దుస్తులను తొడిగిగాని, లోహపు రేకులతో దుస్తులను తయారు చేసిగాని అలంకరించే పద్ధతి. ఇది ముఖ్యంగా ప్రాచీన గ్రీకు సంప్రదానియాకి చెందినది. కొన్నిసార్లు ఈ శిల్పాలకు బంగారుపూతను పూయడం కూడ ఉండేది.

**acrylic acid :** *అక్రిలీయామ్లం.*

**acrylic brush :** *అక్రిలీయ కూర్చిక; అక్రిలీయ కుంచె.*

నైలాన్‌తో తయారయ్యే ఒక విధమైన కుంచె వేరే వేరే ఆకారాలలో ఇది లభ్యమవుతుంది. అక్రిలీయ వర్ణాలను, పాలిమర్ వర్ణాలను వాడడానికి ఇది ప్రత్యేకంగా తయారు చేయబడింది. ఈ రంగులు త్వరితంగా ఆరి గట్టిపడతాయి. అందువల్ల వీటిని వాడే కుంచెలను వెంటవెంటనే నీటిలో ముంచాలి. జంతు రోమాలతోను, పీచుతోనూ తయారయ్యే కుంచెలను ఎక్కువ కాలం నీటిలో ఉంచితే వాటి గట్టితనం తగ్గుతుంది కాని నైలాన్ కుంచెలు అట్లా ఉండవు; ఇవి ఎక్కువ రంగులను తమలో ఇముడ్చుకోగలిగి పనిచేయడానికి సులభంగా ఉంటాయి. తడిగా ఉన్నపుడు వీటిని చల్లని నీటితో కడిగి శుభ్రం చేయవచ్చు. అవి గట్టిపడినట్లయితే వేడినీటిలో ఉంచినప్పుడు శుభ్రమవుతాయి. తక్కిన కుంచెలను కూడ, పాలిమర్ అక్రిలీయ రంగులకై వాడవచ్చు.



అక్రిలీయ కుంచె

**acrylic canvas :** *అక్రిలీయ కాటిక.*

పాలిమర్ రంగుల వాడకానికై పాలిమర్ మౌలికంతో తయారు చేసిన కాటిక. తైలవర్ణాలకన్నా ఎక్కువ మన్నికగల ఒదుగుతనాన్ని ఈ పూత రంగులు కలిగి యుండడంవల్ల, ఈ అక్రిలీయ కాటికపై చిత్రరచన, 'తక్కువపై ఎక్కువ' అనే నియమానికి విరుద్ధంగా, సాగుతుంది. అంతేకాదు; అక్రిలీయ పటలానికిని తైలవర్ణానికిని మధ్య అధిసక్తత చిరకాలం నిలిచిఉండడం కూడ సందేహాస్పదం.

**acrylic colours :** *అక్రిలీయ వర్ణాలు.*

పాలీమెథిల్ మెథాక్రెయిలేట్ ద్రావణాన్ని ఖనిజ శేషువులతో కలిపి తయారు చేసిన మేలి రంగులు వీటిని పాలిమర్ రంగులకు భిన్నంగా అక్రిలీయ వర్ణాలు, ప్లాస్టిక్ వర్ణాలు అని వ్యవహరిస్తారు. అక్రిలీయ వర్ణాలు వివర్ణత చెందవు, త్వరితంగా ఆరుతాయి; ఖనిజ శేషువుతోగాని, కర్పూర తైలంతోగాని వీటిని తుడిచి వేయవచ్చు. అందువల్ల శిథిలములైన చిత్రాలను పునరుద్ధరించడానికి ఈ రంగులు పనికివస్తాయి.

**acrylic resin :** *అక్రిలీయ యక్షధూపం.*

కృతక యక్షధూపాన్ని,దేనినైనా పైపేపన వ్యవహరిస్తారు. వీటిలో పాలీమెథిల్ మెథాక్రెయిలేట్ చాలాముఖ్యమైనది. ఒక రూపాన ఇది కర్పూరతైలంలో కరుగుతుంది. ఇది ఒక గురుతర ద్రావణంగా అక్రిలాయిడ్ యఫ్-10లూ, సైట్-44 అనే పేర్లతో లభిస్తుంది. ఇంకొక రకం-పైన పేర్కొన్న ఏద్రావణంలోను కరగనిది-తుల్‌వాల్‌తో చేరి-అక్రిలాయిడ్ బి-72 అనే పేరుతో లభిస్తుంది. పాలీమెథిల్ మెథాక్రెయిలెట్‌గాని, అక్రిలిక్ ద్రావణాలుగాని చిత్రాలపై పూసే వార్నిషును తయారు చేయడానికి, అక్రిలీయ వర్ణాల నిర్మాణానికి ఉపయోగపడతాయి. పాలీమెథిల్ మెథాక్రెయిలేట్ ఘనరూపంలో ప్లెక్సిగ్లాస్, లూసైట్ అనే పేర్లతో అద్దపు పలకల రూపంలో లభిస్తుంది. దీన్ని ఆధునిక

శిల్పంలోను ఇతర నిర్మాణాలలోను వాడు తున్నారు. దీన్ని వేడిచేసి కావలసిన రూపాలలో మలచుకోవచ్చు.

**acrylic varnish :** *అక్రిలీయ వార్నిషు.*

(చూ : *picture varnish*)

**actinic :** *ఆక్టినికము.*

(చూ : *ultraviolet light*)

**action painting :** *చలచ్చిత్రణ.*

వివిక్త విభావనా వాదానికి ఒక తీరైన రూపం. న్యూయార్క్ సంప్రదాయంతో ఇది ముడిపడి ఉన్నది. కొన్ని సందర్భాలలో వివిక్త విభావనా వాదానికే పర్యాయ పదంగా దీన్ని వాడుతున్నారు. పూతరంగును తీవ్ర, ద్రుత, ఉద్వేగయుత తూలికాహతులతో గాని, నేరుగా ఉపరితలంపై పడేటట్లు చెదరగొట్టి గాని, విసరిగాని ఈ చిత్రణ కొనసాగిస్తారు. కళాకారుని భావతీవ్రతను, చిత్రణలోని గతి శీలతను చిత్రంలో చక్కగ ద్యోతకమయేట్లు చేయడమే దీని ధ్యేయము. ఈ రకమైన చిత్రణలో అత్యంత ప్రసిద్ధిని ఆర్జించిన వాడు, జాక్సన్ పొల్లాక్ (1912-1956). చలచ్చిత్రణనే ఫ్రెంచి భాషలో టాచిజమ్ అని వ్యవహరిస్తారు.



చలచ్చిత్రణ (జాక్సన్ పొల్లాక్ రచించిన "నెంబరు-12" చిత్రము 1949, సంవిధాన ఫలకముపై అమర్చిన కాగితముపైన చేసిన తైలచిత్రణ ఇది. మ్యూజియం అఫ్ మోడరన్ ఆర్ట్, న్యూయార్కు.)

**actor :** *తైలూషుడు; నటుడు.*

**additive :** *సంకలిత; అనుబద్ధ.*

(చూ : *poppy seed oil*)

**additive colour :** *అనుబద్ధ వర్ణం.*

(చూ : *colour*)

**additive system :** *కలివివేత పద్ధతి; సంకలన పద్ధతి.*

**adeaux crayons :** *ఖటీకద్వయీ చిత్రం.*

రెండు రంగులలో, సీమ సున్నంతో రూపించిన చిత్రం. సాధారణంగా ఈ రెండు రంగులూ నల్లసీమసున్నం, ఎర్ర సీమసున్నం అవుతాయి. కొన్ని సందర్భాలలో నల్లసీమ సున్నానికి బదులుగా బొగ్గును వాడటం కూడా జరుగుతుంది.

**adhesion :** *అధిసక్తత.*

**adhesion of oil paint :** *తైలప్రలేపపు అధిసక్తత.*

భూమిక నుంచి ప్రలేపం ఏనాడున్నూ విడివడకుండా ఉండటానికై ముందుగా వర్ణ ఫలకంపై చిక్కబడి ఉండని, తాజా రంగులను వాడడం చాలా ఆవశ్యకం. భూమిక సైతము, ఇందుకు అనువుగా, ఆ తాజా రంగులను

గ్రహించి గట్టిగా ఉంచుకోవటానికిగాను తగినంత కరుకుదనాన్ని కలిగి ఉండాలి.

**adhesive :** *అధినక్తం.*

**adhesive thinner :** *అధినక్త విరళిక.*

**adjunct products :** *అనుబద్ధ ఉత్పన్నాలు.*

**adjustable curve ruler :** *ఆనమనీయ వక్రరేఖిణి.*

వంచటానికి వీలుగాఉండి, ఏ వక్రరేఖాకృతిలో అయినా పట్టి ఉంచడాకి వీలయ్యే ఒక కొలబద్ద. ఇందులో ఒకరకం, బద్దపడిన సన్నని లోహపు రేకుతో చేయబడి, నమనీయమైన ఒక లోహరజ్జువుకు సంధానితమై ఉంటుంది. ఈ లోహరజ్జువు వల్ల ఈ కొలబద్దను-ఏ ఆకృతిలో కావలసివస్తే ఆ రీతిలో — ఉంచే వీలు కలుగుతుంది. ఇంకొక రకపుది సీసంతో చేసే



ఆనమనీయ వక్రరేఖిణి

సన్నని కమ్మీ; దీనిని నమనీయంగా కల్పకపు (ప్లాస్టిక్స్) కంచుకంతో ఉంచుతారు. దీని వెలుపలి భాగం చాలానున్నగా ఉండటంవల్ల దాన్ని అనుసరించి రేఖను గీయడం చాలా సులభం. ఈ రెండు విధాలైన కొలబద్దలూ, వివిధ ప్రమాణాలలో, లభిస్తాయి. వీటిలో గరిష్ఠపు దాని పరిమితి 75 సెం. మీ. ఫ్రెంచి వక్రరేఖిణితో పాటుగా గాని, లేదా దానికి ప్రత్యామ్నాయంగా గాని, సాధారణ రేఖారచనలో కొలబద్దగ ఈ వక్రరేఖిణిని ఉపయోగిస్తారు.

**adjustable triangle :** *ఆనమనీయ త్రిభుజము.*

రేఖాకారుడు (*Draftsman*) ఉపయోగించే త్రిభుజాకార పరికరము. ఈ త్రిభుజంలో ఒక భుజం కదల్చటానికి వీలుగా ఉండి ఏ కోణానికి వంచి ఉంచాలన్నా సాధ్యమవుతుంది. వేరే వేరే ఆకృతులు గల త్రిభుజాలను దీనితో సుఖంగా నిర్మించవచ్చు (చూ : *drafting machine*).

**adsorption :** *అధిచూషణము*

ఒక పదార్థాన్ని పొరగా పరచినప్పుడు అందులోని అణువులు వేరే ఇంకొక పదార్థపొరతో, 'అతికి ఉన్నట్టుగా' సక్తతను ప్రదర్శించడం. శిలా ముద్రణ ప్రక్రియలో చిత్రరచనకు ఉపయోగించటానికై సుద్దతో గీసే గీతలు, చెరిపినా చెరగవు. ఇవి చెరగనంతే ఉపరితలాన్ని గట్టిగా అరగిదీయా ఇట్లా చెరగకుండా ఉండటానికి కారణమైన ప్రక్రియ అధిచూషణం చేసినందునే, ముద్రణకు ఉపయోగించే సిరాలు వాటికి అంటుకొని ముద్రణ సాధ్యమవుతుంది.

**advancing and returning :** *ఆగత ప్రత్యాగత*

**advancing and retreating colours :** *ఆగామి తిరోగామి వర్ణాలు*

చిత్ర రచనలో కవోష్ణ వర్ణాలు దగ్గర కుడికి దగ్గర కావడం, శీతల వర్ణాలు దూరం కావడం ఆ వర్ణాల లక్షణాలు. ప్రకృతిలో కూడా దగ్గరగా ఉండే దృశ్యంలో కవోష్ణ దూరంగా ఉన్న దృశ్యంలో శీతల వర్ణాలు ఎక్కువగా చూడవచ్చు. అందువల్ల ఆగామి తిరోగామి వర్ణ సిద్ధాంతము

గత దృష్టి ప్రక్రమగతితో ముడిపడి ఉన్నది. ప్రకృతి దృశ్యాలను చిత్రించేటపుడు జ్యామితీయ దృక్క్రమంతో పాటుగా ఈ పద్ధతిని ఉపయోగిస్తారు. గత శతాబ్దిగా ఈ పద్ధతిని కొన్ని ప్రత్యేక సందర్భాలలో మాత్రమే వాడుతున్నారు. దీన్ని గుడ్డిగా అనుకరిస్తే దూరంగా కనబడే సూర్యాస్తమయాదులను నీలవర్ణంతో చిత్రించవలసివస్తుంది. దీనివల్ల ఎటువంటి రసభంగము కలుగుతుందో చెప్పాల్సిన పని లేదు. అందువల్ల ఆగామి తిరోగామి వర్ణ సిద్ధాంతాన్ని తిరుగులేని శాస్త్రీయ సిద్ధాంతమని చెప్పటానికి అవకాశం లేదు.

**advancing color :** *ఆగామి వర్ణము.*

**adze or adz :** *చేబాడిన; కుఠారిక.*

కొయ్యలో శిల్పాన్ని చెక్కటానికి ముందుగా స్థూలమైన ఆకృతిని చెక్కటానికి ఉపయోగించే సాధనం. దీనికి రెండు చివరలా చెక్కటానికి పనికివచ్చేట్లుగా వాదరలు ఉంటాయి.



చేబాడినలు

**ae or aet** . *వ లేదా వయ.* (చిత్రములోని వ్యక్తి యొక్క వయసును తెలియజేసే సంజ్ఞ)

ఎటేటిస్ ***(Aetatis)*** అనే లాటిన్ పదానికి ***Ae, Aet*** అనేవి సంక్షిప్త రూపాలు. రూప చిత్రంలో ఒక ప్రక్కనగాని, వెనుక వైపున, గాని చిత్రంలోని వ్యక్తి యొక్క వయసు తెలియ చేసేందుకు ఈ సంజ్ఞకు పక అంకెను వ్రాసేవారు. ఐరోపా చిత్రకళలో 1 శతాబ్ది మధ్యకాలం వరకు చిత్రకారులు సంప్రదాయం పాటిస్తూవచ్చారు.

**Aegean art :** *ఈజియన్ కళ.*

క్రీ.పూ. 26—12 శతాబ్దాల మ గ్రీసు దేశంలోను, ఇతర గ్రీకు ద్వీపాలలో వర్ధిల్లిన కళ.

**aerial perspective :** *వాయుగత ప్రక్రమత; వాయుగత దృక్క్ర వాయుగత దృష్టిక్రమ*

ప్రకృతి దృశ్యాలను చిత్రించటంలో ప్రదేశాలు ఇతర ప్రదేశాలకన్న చాలాదూ ఉన్నవనే భ్రాంతిని కల్పించటం. దూ ఉండే వస్తువు—ఆ సమయంలో గాలిలో చెమ్మదనాన్ని అనుసరించి-ప్రకృతిలో మైన గాలిపొరల వల్ల ఎక్కువ తక్కు లలో నీలిరంగుగా కనపడుతుంది. అ దూరంగా ఉండే దృశ్యం వర్ణాలలోన లోను అస్పష్టతను చూపుతుండగా, దృశ్యం స్పష్టంగా తేజోవంతంగా చి ఉట్టిపడుతుంది. చీనాదేశపు చిత్రకళలో ను మబ్బును సృష్టించి చిత్రంలోని ప్రదేశాలలో ఇటువంటి భ్రాంతిని వారు. స్పష్టతకు, వర్ణాల మిశ్రమాని ధించినంతవరకు సంప్రదాయ పద్ధతి చిన అన్ని ప్రకృతి దృశ్యాలకు వ దృక్క్రమత వర్తిస్తుంది. రేఖారూపమైన మతను అనుసరించే వర్ణవ్యక్తమత ఉంటుంది. (చూ : ***perspective***

**aerugo :** ధాతుమలం; కిట్టం.

రాగి, కంచు మొదలైన లోహాలపై ఆకు పచ్చ వర్ణంగా చేరే మైలతుత్తం.

**aesthetic :** సౌందర్యతత్త్వ సంబంధి; సౌందర్య విషయిక; రసాత్మక.

**aesthetic content :** సౌందర్యానత్త.

**aesthetic experience :** రసానుభూతి.

**aestheticism :** సౌందర్య భావనావాదము.

'కళ' అనేది స్వయంభూతమైన సత్తా కలిగింది అనీ, దానికి ఇతరమైన ధ్యేయమేదీ ఉండదనీ తెలిపే ఒక అతిమాత్రపు కళా వాదము. ఇదే చివరకు 'కళ కొరకే కళ' అనే వాదానికి దారి తీసింది.

**aesthetic movement :** సౌందర్యోద్యమం.

**aesthetic value :** రస ప్రతిపత్తి.

**aesthetics :** సౌందర్య మీమాంస.

'ఈస్థటిక్స్' అనేది గ్రీకుభాషా పదము. ఇంద్రియ వేద్యత అని దీని అర్థము 18వ శతాబ్ది మధ్య భాగంలో గాట్లిబ్ బామ్‌గార్టెన్ (1714-62) అనే పండితుడు, ఇంద్రియ వేద్యమయ్యే సౌందర్యాన్ని వివరీకరించే సిద్ధాంతవాదానికి ఈ పేరు ఉపయోగించాడు 1859 నాటికి ఇది దృఢతను అర్జించింది. పాశ్చాత్యులు లలిత కళలుగా ఆనాటికి గుర్తించిన సాహిత్యము, సంగీతము, చిత్రలేఖనము, శిల్పము, వాస్తువిద్య, నాట్యము అనువివి ఆ సౌందర్యాన్ని స్ఫోరకం చేసేవిగా గుర్తించబడి, ఆ సౌందర్యాన్ని వివరించే శాస్త్రానికి ఈ పేరు వచ్చింది. ఇది భారతీయుల 'రస' విచారానికి కొంతవరకు సన్నిహితం

**aes ustum :** తామ్రమలము.

రాగి కంచులపై కాలక్రమాన పట్టే కిట్టముకు ప్రాచీననామం.

**african blackwood or grenadilla :** ఆఫ్రికేయ కృష్ణదారువు; గ్రెనడిల్లా.

చేవకలిగి నల్లగా ఉండే ఒక విధపు కొయ్య. ఇది వృక్షశాస్త్రరీత్యా డల్‌బెర్జియా మెలనోక్సిలన్ జాతికి చెందినది. దీనినే మొజాంబిక్ ఎబోనీ అని కూడా అంటారు. దారుశిల్పాలను చెక్కటానికి ఇది అనువుగా ఉంటుంది. శబ్దప్రసారానికి అనువైన శక్తి దీనికి ఉన్నందువల్ల దీన్ని క్లారినెట్ వంటి వాయువాద్యాల తయారీకి కూడ ఉపయోగిస్తారు.

**after :** అనుగతము.

ఒక కళాకారుడు ఇంకొక కళాకారుని రచనను అనుసరించి తయారుచేసిన చిత్రాన్ని సూచించే పదం. సాధారణంగా ఈ పదము ఒక చిత్రానికి తీసిన నకలుకు వర్తిస్తుంది; కాని కొన్ని సందర్భాలలో, పూర్తిగ నకలు కాకపోయినా, ఒక చిత్రాన్ని కొన్ని పద్ధతులలో అనుసరించినపుడు కూడా ఈ పదాన్ని వాడుతున్నారు. ఉదాహరణ: మిల్లెట్ చేసిన రచనను దృష్టిలో ఉంచుకొని వాంగో రచించిన 'కోత పనివాండ్రు' అనే చిత్రము.

**after-yellowing :** అనుగత వివర్ణత.

(చూ : *yellowing*)

**agalma :** ప్రతిమూర్తి.

'అగల్మ' అనే పదాన్ని గ్రీకులు మొట్ట మొదట్లో ఎటువంటి శిల్పాన్ని సూచించటానికైనా వాడుతూ వచ్చారు. తరువాత కాలంలో పూజించటానికి ఉద్దేశించిన దేవతామూర్తికే ఈ

పదాన్ని వాడారు. కొన్ని సందర్భాలలో చిత్రాలకు కూడ ఈ పదం ప్రయుక్తం కావడం ఉంది.

**agalmatolite :** *దేవశిల.*

మృదువుగా ఉండి పసుపు, ఆకుపచ్చ, బూడిద రంగులలో ఉండే శిల. దీన్నే 'ఆలాయిక' (*pagodite*) అని కూడా అంటారు. దీనిని దేవళములకు, విగ్రహాలకు చైనీయులు ఉపయోగించే వారు.

**agate :** *రక్తోపలం; వర్ణశిల.*

(చూ : *burnisher*)

**agglutinant :** *సంలగ్నకం.*

జిగురు, సర్వ్రేసులవలె అతికించటానికి ఉపయోగించే పదార్థాలలో దేనికైనా ఈ పదము వర్తిస్తుంది. ముఖ్యంగా నీటిరంగులను, రంగు కణికెలను, చిత్రాలకు వాడే సిరాలను తయారు చేయడంలో ఇటువంటి సంలగ్నకాలు పనికి వస్తాయి.

**aggregate :** *సమాహారము.*

కాంక్రీటును తయారు చేయడంలో సిమెంటులో కలిపే అప్రవర్తక పదార్థం. ఇసుక, బిరకగా ఉండే పాలరాతిపొడి, సన్న కంకర దీనికి ఉపయోగపడతాయి. ఒక్కొక్కసారి ఈమూడింటిని ఒకేసారి సిమెంటులో కలపటంకూడా ఉంది. సుధాపిష్టము, సుధామృత్తిక, గచ్చులను ఉపయోగించి చేసే రచనలకు గిరుకు కాంతపములను కల్పించటానికి వాడే ఇటువంటి అప్రవర్తక ద్రవ్యాలకు కూడా ఈ పేరే ఉపయోగిస్తారు.

**aigretta ·** *తురాయి.*

**air-brush :** *వాయు కూర్చిక; గాలికుంచె; తుషార కూర్చిక.*

ఇది ఒకరకమైన కలం మాదిరిగా ఉంటుంది. ఒక ఔన్సువరకు పలచని రంగు పట్టే గిన్నె ఒకటి దీనిపైన అమరి ఉంటుంది. ఆ గిన్నె నుంచి ఒక వక్రనాళిక - కర్బన వాయువుగాని, ఒత్తిడితో నింపిన గాలిగాని ఉండే-సిలెండరుకు కలపబడి ఉంటుంది. ఒక రంగుతో ఇంకొక రంగును, ఛాయలను మేళవించటానికి ఈ పరికరాన్ని ఉపయోగిస్తారు. కుంచెతో జరిగిన అటువంటి మేళవింపుకున్నూ, గాలి కుంచెతో జరిగే మేళవింపుకున్నూ మధ్యగల భేదాన్ని చూచినంతనే గ్రహించవచ్చు. ఈ సాధనాన్ని ఎక్కువగా వాణిజ్య కళలోనే వాడుతున్నారు.



గాలికుంచె

**air-craft curve :** *విహంగ వక్రరేఖ.*

(చూ : *french curve*)

**air eraser :** *వాయు మార్జని.*

ఇది కూడా గాలికుంచె లాగానే పని చేస్తుంది. కాని దీనిలో రంగులకు బదులు గాజుపొడి వంటి పదార్థాన్ని వాడతారు. చిత్రంపై దీన్ని ఉపయోగించి సిరాలను రంగులను తుడిచి వేయవచ్చు.

**a jour or ajoure : ఛిదా లంకరణ.**

అలంకారాలుగా ఉపయోగించే వస్తువుల పై వెలుతురు పారేటట్లుగా రంధ్రాలతో లతాదులను సృష్టించే పద్ధతి. వెండిపళ్ళెంపైనా, ఇతర విధాల లోహపు చెక్కుడు పనులపైనను ఇటువంటి అలంకరణలను చేస్తారు. మన దేశంలో తోలుబొమ్మల ఆభరణాదులను ఈ విధంగానే సృష్టిస్తారు. ఆభరణాలను ఆ విధంగా రూపొందించి, మిగత భాగాలపై రంగులను పూసి, వెలుతురుకు ఎదురుగా నిలపటం వల్ల, ఆ ప్రదేశాలు బంగారు వర్ణాలను ఇతర వర్ణాలను కలిగి ఆభరణాలుగ కన్పిస్తాయి.

**alabama cream : అలబామా నవనీతం.**

అమెరికా దేశంలో లభించే చంద్రశిలలలో ఒక తరగతిది. శిల్పానికి ఇది బాగుగా పనికి వస్తుంది.

**alabaster : మృదుశిల.**

స్వల్పంగా పారదర్శకత కలిగి, తెల్లగా ఉండే శిల. ఉలులతో తేలికగా మలచటానికి వీలైన మృదుత్వం దీనికి ఉంది. ఎండ, వానల దెబ్బకు చెడిపోకుండా దీనితో చెక్కిన శిల్పాలను భద్రపరచాలి.

**alabastron : అండిక.**

ప్రాచీన గ్రీసుదేశంలో వాడుకలో ఉండిన ఒక మట్టిపాత్ర. కోసుదేలి, గుండ్రని దిగువ అడుగును కలిగిఉండేది ఈ పాత్ర. తైలాన్ని దీనిలో ఆ కాలంలో నిలుపచేసి ఉంచుకొనేవాళ్ళు. క్రీడారంగంలో పేరొందినవాళ్ళు తమ శరీరాలను మర్దించుకోవటానికి వాడే తైలాన్ని దీనిలో నింపుకొని, తమతో తీసుకొని పోయేవాళ్ళు.



అండిక

**a la Grecque : యావనీ వక్**

గ్రీకుల శైలిని పోలినది అని దీని అర్థం. ప్రాచీన గ్రీకు శైలిని-అందులోనూ ముఖ్యంగా దాని విస్పష్ట లక్షణావలిని-అనుకరించి, లేదా దానివల్ల ప్రభావితమై సాగిన కళాఖండ రచనను తెలియజేయటానికి ఈ పదము పూర్వ కాలంలో విస్తృతంగా ప్రయుక్తమైంది.

**Albany slip : అల్బనీ సరకము.**

న్యూయార్క్ రాష్ట్రపు అల్బనీ ప్రాంతంలో లభించే ఒక సరక మృత్తిక. దీనివల్ల నలుపు లేక ఆకుపసిమి ద్యుతికమును సాధించవచ్చు. ఈ సరకాన్ని, ఇటువంటివే అయిన స్థానికములైన కొన్ని మృత్తికలను, శిలామూర్తవముల తయారీలో అమెరికా లోని పనివాళ్ళు తొలుత వినియోగించారు.

**Alberene stone : అల్ బెరీన్ శిల.**

అమెరికాలోని వర్జీనియా రాష్ట్రంలో లభించే ఒక విధపు స్నేహశిలకు వ్యాపారనామము. దీనిలో వివిధ వర్ణాల శిలలున్నాయి. మధ్యమ ధూసరము మొదలుగా కారునలుపు వరకు ఇందులో విభేదాలు కనపడతాయి.

**Albertina :** అల్‌బెర్టినా.

వియెన్నా నగరంలోని ఒక సుప్రసిద్ధ సంగ్రహాలయం పేరు. వ్యక్తులు సముపార్జించిన అటువంటి వాటిలో, రాసిలో పు, వాసిలోను ఇది మిన్న. ఆర్చ్‌డ్యూక్ ఆల్‌బెర్ట్ (1788-1822)న్నూ, అతని భార్యయున్నూ, కుమార్తెయున్నూ తమ జీవితాలను ఈ సంగ్రహణకై అర్పించారు.

**alcohol :** మద్యసారము.

**alcohol colours :** మద్యసార వర్ణాలు.

ఒక విధపు ఉజ్జ్వల ద్రవవర్ణాలు. మద్యసారంతో తయారు కాగల అనిలీన రంజక ద్రవ్యాల (*Dyes*)ను, నీరు కలిసిన ఒక వాహకంతో చేర్చి వీటిని తయారు చేస్తారు. వాయుకూర్చికతో పూత పనిని నిర్వహించటానికి పనికి వచ్చేట్లు వీటిని రూపొందిచటం జరుగుతుంది. ప్రత్యుత్పన్నం కావలసిన పనికే దీనిని తరచుగా వాడతారు. దేశపటరచనలో ఈ వర్ణాలు బాగా ఉపకరిస్తాయి; నీటి రంగులను గ్రహించలేని అన్నిచోట్లా వీటిని వాడవచ్చు. అయితే కాంతిప్రసరణకు ఈ రంగులు ఎక్కువగా తట్టుకోలేవు. కాబట్టి చిరస్థాయిగా మనవలసిన కళాఖండాల రచనలకు ఇవి పనికిరావు.

**Alexander mosaic :** అలెగ్జాండర్ చిత్రాస్తరము.

రోమన్ కళావిదులు రూపొందించిన ఒక రమణీయ చిత్రాస్తరము. పాంపీ నగరపు అవశేషములలో లభ్యమైన ఈ కళాఖండము ప్రస్తుతము నేపిల్స్ నగరమున భద్రపరుపబడి యున్నది. పారసీక ప్రభువగు డెరయస్‌ను గ్రీకు విజేతయగు, అలెగ్జాండరు ఓడగొట్టినన దృశ్యము (క్రీ. పూ. 333) ఇందు చిత్రితము. క్రీ. పూ. 300న గ్రీసునందు ఒక కళాకారుడు రూపొందించిన ఒక చిత్రలేఖనమును అనుసరించి, ఈ చిత్రాస్తరము రూపొందింపబడి యుండునని పండితుల అభిప్రాయము.

**Alexandrian art :** అలెగ్జాండ్రియ కళ.

(చూ : ***Hellenistic art***)

**Alexandrian school :** అలెగ్జాండ్రియ సంప్రదాయం.

ఈజిప్టును టోలెమీ రాజవంశం పాలించే కాలంలో ఆ దేశంలో అలెగ్జాండ్రియా నగరంలో వర్ధిల్లిన ఒక కళాసంప్రదాయం. హెల్లెనీయ కళలోని శిల్పంలో ఇది ఒక కోవకు చెందినదనీ, శిశువులకున్నూ, స్త్రీలకున్నూ శిల్పంలో మూర్తికల్పన చేయడంలో ఆకోవకు చెందిన శిల్పులు ఎక్కువ శ్రద్ధ వహించారనీ కొందరు భావిస్తారు. అయితే హెల్లెనీయ కళతో దీనికిగల సామ్యాలు చాలా తక్కువ అని చెప్పవచ్చు.

**alicatado :** చిత్రకోణిక.

బహు దుజముల చిన్న చిన్న మెరుగు పెంకుల తునియలను తగిన రీతిలో సంధించి తయారు చేసిన చిత్రాస్తరపు (మొజాయిక్) పని. అరబ్బులూ స్పెయిన్‌వాసులూ తమ వస్తువులందు ఈ పనితనాన్ని ఎక్కువగ అభిమానించారు.

**alignment :** పదిలిక.

**alizarin :** మాంజిష్ఠ.

**alizarin brown :** మాంజిష్ఠ కపిశము.

అస్పష్టమైన ఎరుపువాతతో పారదర్శకంగా ఉండే ఒక కపిశ వర్ణద్రవ్యం. మాంజిష్ఠ

ఘనారుణమును, రూపొందించే ప్రక్రియలోనే కొద్ది మార్పుచేసి దీనిని తయారు చేస్తారు. దాదాపు దాని వర్ణద్రవ్య ధర్మాలనే ఇది కూడా కలిగి ఉంటుంది. మాంజిష్ఠ ఘనారుణాన్ని తయారు చేయటంలో కలిగే లోపంవల్ల కూడ ఇది ఒక్కొక్కసారి ఉత్పన్నం కావచ్చు.

**alizarin carmine :** ***మాంజిష్ఠ రక్తరేణువు.*** (***alizarine crimson*** కు ఒక పర్యాయ నామం)

**alizarin crimson :** ***మాంజిష్ఠ ఘనారుణం***

ఒక కాంతిమంత, పారదర్శక, రంజక వర్ణద్రవ్యం. ఇది ఎరగా ఉండే ఘనరక్తపు రాశిస్థాయిని, నీలివాటి అధస్థాయిని కలిగి ఉంటుంది. సంయోజిత వర్ణద్రవ్యమైన అలిజారిన్ (మాంజిష్ఠం) నుంచి దీన్ని తయారు చేస్తారు. కొలిమిలో తయారయ్యే ఖనిజ వర్ణ ద్రవ్యములంతగా సుస్పష్ట చిరస్థాయిత దీనికి లేకపోయినా, కళాఖండ పరిరక్షణను — సాధారణ పరిస్థితులలో — సాగించే సందర్భంలో చిరస్థాయి సారణి చిత్రణలకు ఈ మాంజిష్ఠ ఘనారుణం బాగా ఉపకరిస్తూనే ఉన్నది. పారదర్శకంగా వాడినప్పుడు ఇది పద్మరాగపు ఎరుపును ప్రదర్శిస్తుంది. తెలుపుతో కలిపి వాడినప్పుడు కాంతిమంతమైన పాటలవర్ణపు నుం శ్వేత రక్తిపు వర్ణాన్ని ద్యోతకం చేస్తుంది. రాశిస్థాయి రీతిలో దీన్ని తైలంలో వాడటానికి సావధానతగల కళాకారులు పూనుకోరు; అట్లా దీన్ని వాడినపుడు ఇది పలకీతిగా చిత్రతలంలో నెరియలు తేలుతుంది. అందువల్ల తొలుత సాంద్రతరములైన వర్ణద్రవ్యాలను దిగువన ఉపాధిగ వాడిన తరువాతనే, దీన్ని పైన వాడటం బాగుంటుంది. ఈ శతాబ్దపు ఇరవైలలో ఈ ఘనారుణం మేలి తరగతిగా తయారుకావటం మొదలైంది; ఈ వర్ణాలు ప్రాతవాటికన్నా ఉజ్జ్వలతరాలు. కళాకారులు వాడటానికి సముచితాలని నిర్ణయించబడిన వర్ణద్రవ్యాలలో దేనితోనైనా దీన్ని కలిపి వాడవచ్చు. తెల్లసీసంతో కలిపితే ఎటువంటి రసాయనిక ప్రతిచర్య కూడా ఇందులో కనపడదు. ఇనుము కలిసిన వర్ణద్రవ్యాలతో కలిపినపుడు కూడా ఇది గోధుమ రంగుగా మారదు.

జర్మన్ దేశీయులైన ఇద్దరు రాసాయనికులు — గ్రేబ్, సి. లీబెర్మాన్ అనేవారు — 1868 లో ఈ మాంజిష్ఠ ఘనారుణాన్ని ఆవిష్కరించారు. ప్రకృతిలో సహజంగా లభించే రంగు పదార్థాలను రాసాయనికంగా ప్రయోగశాలలో తయారు చేయటానికి జరిగిన కృషి, మొదట మాంజిష్ఠం విషయంలో మాత్రమే సఫలత చెందినది. తరువాత ఆ వెనువెంటనే దాని నుంచి మాంజిష్ఠ ఘనారుణాన్ని రూపొందించటం జరిగింది. తత్ఫలితంగా సహజ సిద్ధమైన మాంజిష్ఠ రంజక ద్రవ్యం వాడుక అంతరించింది. సహజమైన దానికన్నా ఈ సంయోజితరూపం నాణ్యతలో మిన్న.

**alizarin violet :** ***మాంజిష్ఠ నీలలోహితం***

పారదర్శకమైన ఒక నీలలోహిత వర్ణ ద్రవ్యం. సంయోజితమైన పర్పూరిన్ అనే రాసాయనిక ద్రవ్యంనుంచి దీనిని తయారు చేస్తారు. వర్ణద్రవ్య ధర్మాలలో మాంజిష్ఠ ఘనారుణానికి ఇది సరిపోతుంది. అయితే కళాకారులు సాగించే చిరస్థాయి చిత్రణకు ఇది తగినది కాదు. దీనితో సాగిన రచన, కాంతి

పాతానికి ఎక్కువ కాలం గురి అయినపుడు నలుపు వాతగానో, కొన్ని సంవత్సరాలలో కారునల్లుపుగానో మారిపోతుంది.

**alizarin yellow :** *మాంజిష్ఠ పీతం.*

కాంతిహీనమై, గోధుమరంగువాతగా ఉండి పారదర్శకమైన పసుపువర్ణపు ద్రవ్యం. చాలా వరకు మాంజిష్ఠ పునారుణ ప్రక్రియను అనుసరించే దీనిని తయారు చేస్తారు. దాదాపుగా ఆ వర్ణద్రవ్యపు ధర్మాలనే ఇదికూడా కలిగి ఉన్నా, విశ్వాసయోగ్యమైన చిరస్థాయిత ఇందులో కనపడదు.

**alkaline glaze :** *క్షార ద్యుతికం.*

ఒక మార్దవ ద్యుతికం. దీనికి ప్రసవణంగా ఒక క్షారద్రవ్యాన్ని-బోరాక్స్, సోడా భస్మాల వంటి దానిని, సీసం మాత్రం కాకుండా-వాడుతారు. దీన్ని వాడిన పింగాణీ పాత్రలను, కొద్ది ఉష్ణోగ్రతలో కాలుస్తారు. అటువంటి కాల్పువల్ల రమణీయమైన ఫలితాలను-ఈజిప్షియన్ నీలిమ, ప్రషియన్ నీలిమవంటి వాటిని-పొందవచ్చు. క్షారాలు నీటిలో కరిగేవి కావటం వల్లనూ, ద్యుతికంతో మేళవించినప్పుడు అట్ట కట్టేవి కావడం వల్లనూ వీటి వాడకం సహజంగా కొన్ని అవధులకు లోబడి మాత్రమే జరగవలసి ఉన్నది.

**alkanet :** అలక్తకము

ప్రకృతి సిద్ధమైన ఒక రాగద్రవ్యము. ఒక యూరపీయ ఉద్భిజ్జము (అల్‌కన్నా టింక్టోరియా) నుంచి దీన్ని తయారు చేస్తారు. ప్రాచ్యదేశాలలో లభించే ఇంకొక ఉద్భిజ్జం (లాసోనియా ఆల్బా) నుంచి కూడా దీన్ని తయారు చేయవచ్చు. ఇది శీఘ్రంగానే రంగు మాసిపోతుంది. కాబట్టి దీన్ని ఈ కాలంలో గుడ్డల అద్దకానికిగానీ, రంజక వర్ణాల తయారీకిగానీ ఉపయోగించటం లేదు.

**alkyd resins :** *ఆల్కిద యక్షధూపాలు.*

సంయోజిత యక్షధూపాల ఒక బృందం. వీటికి చాలా మేలిరకపు పటల నిర్మాణధర్మాలు ఉన్నాయి. 1930 మొదలుగా పారిశ్రామిక గృహ చిత్రణలోను, యనామెల్ అలంకరణలోను, వార్నిషుల తయారీలోను వీటిని వాడకం చేస్తున్నారు. కళాకారుల ద్రవ్యాలలో సైతం వీటి వాడుక కొంత ఉందంటారు. కాని దాని వివరాలు ప్రచురితం కాలేదు. వీటిలో కొన్ని మేలి రకాలున్నాయి. వీటి వర్ణధారణయు, నమనీయతయు హెచ్చు స్థాయికి చెందినవి. అందువల్ల తైలచిత్రణ మాధ్యమాలలో సాధక ద్రవ్యాలుగా వీటికి తగిన రాణింపు కలిగింది. పూతరంగుల వాహకాలుగ ఇవి అంతగా సరికుదిరేవి కావు. వీనిని పట్టించిన ఉపరితలం అతిశీఘ్రంగా ఆరిపోవటం జరుగుతుంది. చెక్కులు గట్టే అవగుణం ఇందులో ఉండటం అందుకు ముఖ్య హేతువు. ఇప్పుడు సాధారణంగా ఉపయోగంలో ఉన్నది తైలవివర్తితమైన ఆల్కిద యక్షధూపం. దాని తయారీలో శోషక తైలం కూడా చేరి ఉంటుంది. కుసుమగింజలు, సోయాచిక్కుళ్లు లేదా పొగాకు విత్తనాల నుంచి తయారు చేసిన నూనెలను వాడి తయారు చేసిన రకాలు, అవిసె నూనెతో తయారు చేసిన రకాలకన్న, ఎక్కువ వర్ణధారణ కలవి. అయితే అవిసె నూనెతో తయారైన వాటిలో వాతావరణపు దెబ్బలను తట్టుకొనే శక్తి అధికంగా ఉంటుంది.

**alla prima :** *సద్యఃపుష్ట చిత్రణ.*

ఒక విధమైన తైలచిత్రణ. మొదటి

పూతతోనే పరిపూర్ణ ఘటనలను సాధించటం ఇందులో జరుగుతుంది. దీనినే అపరోక్ష చిత్రణ (*direct painting*) అని కూడా అంటారు. మౌలము (*abozzo*) కు ఇది విపర్యయం. మౌలంలో కాటికపై పొరపైన పొరగా పూతను సాగించి తద్వారా మాత్రమే పరిపూర్ణ ఘటనలను సాధించటం జరుగుతుంది దీన్నే ఫ్రెంచి భాషలో ప్రీమియర్ కూప్ అంటారు.

**alligatoring or alligator cracks :** *మకర ఛిద్రత.*

ఒక విధమైన నెరియపగులు. కొన్ని చిత్రాలపై కాలక్రమేణా రూపొందే ఒక విధపు దోషం ఇందువల్ల అడ్డదిడ్డపు పగుళ్ళుదారలు ఏర్పడి, అవి చూడటానికి మొసలి చర్మాన్ని తలపింపచేస్తాయి.

**all-over glaze :** *పిలగలయు ద్యుతికం; సర్వ ద్యుతికం.*

**alloy :** *మిశ్రలోహం*

రెండు లేదా అంతకన్న ఎక్కువ సంఖ్యలో ఉండే వేరువేరు లోహాలను కరగించి కలిపినందువల్లనో, కలిపి కరగించి నందువల్లనో రూపొందే సమ్మిశ్ర ధాతువు. ఈ పద్ధతిలో రాగితో తుత్తునాగాన్ని మేళవించగా ఇత్తడీ, రాగితో తగరాన్ని కలపగా కంచున్నూ రూపొందుతున్నాయి. ఉక్కును సైతం మిశ్రలోహంగా పరిగణించాల్సిందే. అందులో ఇనుముతో పాటుగా కర్బనం కూడా చేరి ఉంటుంది కర్బనం లోహం కాకపోయినా, ఈ సందర్భంలో ఉక్కును మిశ్రలోహంగా పరిగణించడమే సముచితం. ఒక మిశ్రలోహంలో చేరి ఉండే మౌలిక లోహాలలో దేనితో పోల్చి చూసినా కఠినత్వం లోనూ ద్రావ్యతలోనూ మిశ్రలోహం మిన్నగా ఉంటుంది. కాని ఉద్వర్తనీయత మాత్రం తక్కువగా ఉంటుంది. జనక లోహాలకన్నా మిశ్రలోహము, జారణను ఎక్కువగా నిరోధించ గలిగేదేకాక, దాని ద్రవీభవన బిందువు సైతం—జనక లోహాలతో దేనితో పోల్చినా—తక్కువగా ఉంటుంది. తనలో చేరిన ఏ లోహపు వర్ణాన్ని పోలి ఉండక, మిశ్రలోహము వేరే ఇంకొక వర్ణంతో ఉంటుంది.

**all-purpose ground :** *సర్వార్థ భూమిక.*

చూ. (*multipurpose ground*)

**altar :** *వేది, పూజా వేదిక.*

**altarpiece :** *వేదికాలంకరణ.*

క్రైస్తవపూజావేదికను అలంకరించటానికిగాను ఉపయోగించే సామగ్రిలో దేనికైనా ఈ పదం వర్తిస్తుంది అవి: 1 అలంకృత యవనిక 2. ఒక చిత్రం 3 మలచిన లేదా చిత్రిత మైన ఫలక సంపుటి 4 వేదికకు దిగువనో, వెనుకనో - చిత్రాలు, శిల్పమూర్తి విశేషాలు, లేదా ఉబ్బెణ శిల్ప సందోహాలు కలిగి ఉండే రీతిగా - నిర్మితమయ్యే కట్టడం పునరుజ్జీవన యుగంలో ఈ వేదికాలంకరణను ముప్పలక (చూ *triptych*) వల్ల సాధించేవారు. ఆ ముప్పలకల అంచులు మడత బందుల వల్ల సంధించబడేవి. ఒక్కొక్కప్పుడు ఒక విధపు శిలా ఫలకంమీద ఉబ్బెణరీతిలో శిల్పాలను చెక్కి ఇందుకై వాడేవారు వెనిస్ లోని సెయింట్ మార్క్ చర్చిలోని వేదికాలంకరణలో బంగారు పగిషీపని కూడా కనపడుతున్నది. ఈ వేదికాలంకరణలో ఎత్తునేగాక సుసంపన్నత విషయంలోను అలంకరణ

లోను మిన్న అయినవి స్పెయిన్‌లోను, లాటిన్ అమెరికాలోను కనపడతాయి.

(చూ: *predella* కూడ )

**alternative :** *ప్రత్యామ్నాయం.*

**alto-rilievo :** *అధికోల్బణము.*

(చూ : **relief** )

**alumina hydrate :** *అల్యూమినా ఉదజం; అల్యూమినా హైడ్రేట్.*

దీని రసాయనిక నామం అల్యూమినియం హైడ్రాక్సైడ్. ఇది తెల్లగా, తేలికగా, ధూళి లాగా ఉండే పొడి. ఒక జడ వర్ణద్రవ్యంగా దీనికి వాడుక ఉంది. రంజక వర్ణద్రవ్యాలకు భూమికను దీనితో చాలా చక్కగా ఏర్పరచ టానికి వీలవుతుంది. తైలంలో దీన్ని కలిపి నపుడు, ఇది రంగు లేనిదిగా మారడంవల్ల భూమికగా ఇది బాగా పనికివస్తుంది. తైలవర్ణా లకు అపేక్షణీయరీతిలో సుస్థిర తూలికాచర్యను ఇటువంటి భూమిక సమకూర్చకలగటమేకాక, వర్ణ ద్రవ్య విశ్లేషణకు దృఢతను కల్పిస్తుంది.

**aluminium leaf :** *అల్యూమినియా ఆకు (పత్రం).*

వెండి పనితనపు భ్రాంతిని కల్పించ టానికై వాడే ఒక సన్నని అల్యూ మినియం రేకు. దీన్ని వాడటం వల్ల రంజన (*gilding*)కై వెండిని వాడినట్లే కొంత వరకు భ్రాంతిని కలిగించటానికి వీలున్న ప్పటికీ, అచ్చపు రజతపత్రానికి లేదా పల్లేడియా పత్రానికి ఏవిధంగానూ ఇది సరి అయిన ప్రత్యామ్నాయం కాలేదు. ముఖ్యంగా వాణిజ్య కళలలో నామఫలకాలను వ్రాయటా నికీ, ఆఖ్యా సమ్ముద్రణకు, పుస్తకాల అట్ట లపై రేఖాకృతి రచనలకు ఇది ఉపయోగపడు తున్నది.

**amaranth :** *అమరంథం.*

1. కాంతివంతమై అతి నీలలోహిత వర్ణంతో ఉండే చేవగల కర్ర. ఇది గయానాలో లభిస్తుంది. దీని ఉపరితలం నునుపుగా ఉంటుంది. దారుశిల్పాలను చెక్కటానికి దీన్ని ఉపయోగించటం కద్దు.
2. ఈ కర్రనుంచి తయారు చేసే అతి నీలలో హితవర్ణం. 'అమరాంథ్' అనే పేరుగల గ్రీకు పౌరాణిక వృత్తాన్ని బట్టి దీనికి ఈ పేరు వచ్చింది. ఆ పౌరాణిక గాథను బట్టి ఆ రంగు మాసిపోని రంగు. అయితే ఈ అమరంథము మాత్రం మన్నిక లేనిది.

**amarna art ;** *అమర్నా కళ.*

ప్రాచీన ఈజిప్టులో 18వ రాజవంశపు కాలంలో అఖినేతన్ పరిపాలించే టప్పుడు-వర్ధి ల్లిన విశిష్ట కళారీతి. అదివరకు సాంప్రదాయి కంగా దేశంలో పాటిస్తున్న బహుదేవతారాధ నకు అఖినేతన్ స్వస్తి చెప్పి, 'ఏకైక దేవుడు సూర్యుడే' అనే మతానికి వ్యాప్తి కల్పించాడు. ఇందు కనుగుణంగా చిత్రలేఖనంలో పెద్ద మార్పు సంఘటిల్లి, పౌరాణికములై ఊహా కల్పనా మాత్రాలైన రూపాలు అంతరించి, వాస్తవికతకు రాణింపు వచ్చింది. ఇదే అమర్నా కళలోని విశిష్ట లక్షణం. అయినా, శిల్పంలో- అందునా మూర్తి శిల్పంలో - ఎటువంటి మార్పును-ఈ కళ తీసుకొని రాలేకపోయింది.

**amasette :** *ప్రలేపని.*

వర్ణఫలకంపై రంగులను కలపటానికై ఉప యోగించే కత్తి. దీన్ని కొమ్ముతో తయారు

చేసేవారు. ప్రస్తుతంలో దీన్ని స్టెయిన్‌లెస్ స్టీలుతో తయారు చేస్తున్నారు

**amateur : *ఔత్సాహికుడు***

వృత్తిగా కాకుండ, కేవలం వినోదానికీ, ఆత్మ సంతృప్తికీ కళాకృషిని సాగించేవాడు. కళలను వృత్తిగా గ్రహించిన వారిపట్ల ప్రాచీన కాలంలోను, మధ్యయుగాలలోను, చాలా దేశాలలో నిరసన ఉండేది ఆయినా దీనితో పాటుగా ఈ కళలు విజ్ఞతను ఆలించే ప్రతిపౌరుడికిన్నీ అభ్యసనీయములే అనే భావన కూడా కొంత ప్రాబల్యాన్ని ఆర్జించింది. తత్ఫలితంగా జీవికకైగాక, కేవలము అభిరుచిని అనుసరించి ప్రభువులూ, ఎందరో సామాన్య ధనికులూ వీటిని అభ్యసించి కృషి చేయగా, కళను వృత్తిగా గ్రహించిన వారినుంచి వీరిని వేరుపరచి తెలపటానికి యీ పదం వాడుకలోకి వచ్చింది.

**amber : *తృణమణి; అంబరి.***

భూమిలోపలి శిలాస్తరం నుంచి లభించే ఒక విధపు యక్షధూపం యక్షధూపాలన్నిటిలో ఇది కఠినతమం ద్రావణీయత కూడా చాలా తక్కువ ఉష్ణోగ్రత స్థాయిలో ఉన్నప్పుడు మాత్రమే, తైలాలతోగాని, ఇతర యక్షధూపాలతోగాని కలిసి ఇవి ద్రవంగా రూపొందగలవు అయినా వార్నిష్ యక్షధూపములందన్నింటిలో ప్రశస్తతమంగా ప్రాచీనకాలం నుంచీ ఇది పేరొందింది మధ్యయుగాల రచయితలు పూతరంగుల ప్రసక్తిలో దీన్ని వివిగా పేర్కొన్నారు అతికష్టం మీద కరిగే ఈ తృణమణిని, వారు పూతరంగుగా పలుకావుల పేర్కొనటం చూడగా వారు అచ్చపు తృణమణికి బదులుగ ఏ ఇతర యక్షధూపమునో (బహుశః సంవారకమును) వాడి, దానినే తృణమణిగా భ్రమపడి ఉండవచ్చని పలువురి అభిప్రాయం.

**American vermilion : *అమెరికా సిందూరిక.***

ఎర్ర సీసం మొదలైన వాటిని ఆశ్రయంగా గ్రహించి తయారుచేసే ఒక విధపు రంజక వర్ణద్రవ్యం; తక్కిన వర్ణద్రవ్యాలకన్న ఇది భారతరం. కళాకారుల పూతరంగులలో చిరకాలపు మన్నికపు పనికి ఇది పనికిరాదు. ఈ అమెరికా సిందూరికకే అనుకారిణి సిందూరిక (*imitation vermilion*), సిందూరికావటి (*vermilionette*) అన్న పర్యాయ నామాలున్నాయి.

**Amiens, school of: *అమీన్స్ సంప్రదాయం.***

ఫ్రాన్సు దేశంలో రూపుగొన్న ఒక కళా సంప్రదాయం. ఫ్లెమిష్ కళతో దీనికి సాన్నిహిత్యం ఎక్కువ. ఈ సంప్రదాయానికి సంబంధించి అత్యంత ప్రజ్ఞానిధిగా పేరొందిన వాడు సైమన్ మార్మియన్.

**ammonia : *నవాసారము; అమ్మోనియా.***

వర్ణరహితమైన ఒక విధపు క్షారవాయువు. నత్రజని, ఉదజముల సంయోగంవల్ల ఇది రూపొందుతుంది ఈ వాయువును నీటిలో కలిపినపుడు వచ్చే నవాసారజలాన్ని (అమ్మోనియా నీటిని) శోధకం (*cleaner*) గాను, ద్రావకి (*emulsifier*) గాను, వివిధ సముపచయనము (*concentration*) లలో వాడుతారు. ఏదైనా చిరస్థాయి వర్ణపు తయారీకి ఒక క్షారద్రవ్యము కావలసినప్పుడు, అందుకు సర్వసాధారణంగా నవాసారాన్నే అభిమానించడం జరుగుతున్నది. నవాసారము అతిబాష్ప శీలమై, క్షారవంతమగు ఉపోత్పన్నమును దేన్నీ కల్గించకపోవడం ఇందుకు గల ముఖ్య కారణం.

**anatomy** : *శారీరము; శరీర వ్యవచ్ఛేద విజ్ఞానం.*

మానవ శరీరం, కళాకారులకు సైతము, ఒక పరిశీలనీయ విషయంగా చాల కాలం నుంచీ గ్రహించబడుతూ వచ్చింది. పునరుజ్జీవన కాలపు ప్రముఖ కళాకారులు – లెయొనార్డో, పోల్లయ్‌లూవో మొదలైనవారు—ఈ విజ్ఞాన శాఖలో పరిశీలనలను సాగించి, కొన్నింటిలో వైద్యశాస్త్ర పండితులకు కూడా మార్గదర్శకులైనారు. శిల్పానికి సంబంధించిన కొన్ని అకాడమీలు, శస్త్రచికిత్సా విదులను కొందరిని ప్రత్యేకంగా ఇందుకై నియమించి, శిల్పులకు ఆ విజ్ఞాన విషయాలను బోధింప జేసిన సందర్భాలు కూడా ఉన్నాయి. అయితే ఈ విజ్ఞాన శాఖను కూలంకషంగా తెలుసుకోవాల్సిన అవసరం లేదనీ, మానవుని బాహ్య రూప వైఖరియే కళాకారుని ధ్యేయ వస్తువు కావడం వల్ల, లోపలి ఎముకలు మొదలైన వాటి అమరికను గ్రహించ వలసిన అవసరమంతగా ఉండదని వాదించిన వారు కూడా మొదటి నుంచీ ఉంటూ వచ్చారు. ఇది ఎట్లున్నా 19వ శతాబ్దిలో, కళాశిక్షణలో శారీరానికి ప్రతిపత్తి కొనసాగుతునే ఉండింది. కాని కాల క్రమాన కళాకారుల దృష్టిలో దాని ప్రతిపత్తి సన్నగిల్లి, చేతనాచేతనాల రూపవిజ్ఞానం (*morphology*) మాత్రమే బోధించబడుతున్నవి.

శారీర విజ్ఞానం, కళాకారులకు, కొన్ని సందర్భాలలో ఉపకరిస్తున్నా ఛాందసంగా దాని నంటిపెట్టుకోవటం వల్ల కొన్ని నష్టాలు కూడా కలిగే అవకాశం లేకపోలేదని నేటి కాలపు విజ్ఞుల అభిప్రాయం.

**ancien** : *వరిష్ఠుడు; బడిపెద్ద.*

కళాబోధన చేసే తరగతులలో క్రమ శిక్షణను అమలు పరచే విద్యార్థి. ఇతడు సాధారణపు పాఠశాలలోని 'మానిటర్' వంటి వాడు.

**ancient** : *ప్రాచీన.*

మధ్య యుగానికి పూర్వం; సాధారణంగా క్రీస్తుశకపు అయిదవ శతాబ్దికి పూర్వకాలం.

**ancona** : *వేదికా శిల్పం.*

(చూ: **altarpiece**)

**androsphinx** : *పురుష సింహాకృతి; నరసింహాకృతి.*

(చూ: *sphinx*)

**angel** : *దేవదూత.*

క్రైస్తవ కళలో కనిపించే అలౌకిక మూర్తి అస్సీరియన్ కళలో తొలుత కనిపించిన, రెక్కలుగల వార్తాహర దివ్యమూర్తియే కాలక్రమాన క్రైస్తవ కళలో దేవదూతగ పరిణమించినట్లు చెప్పవచ్చు. క్రీ.శ. నాలుగవ శతాబ్దికి పూర్వపు క్రైస్తవ కళాఖండాలలోని దేవదూతలకు రెక్కలుండేవి కావు. యువకుల వలెనో, వయసు మీరిన మానవుల వలెనో వారు అందు తీర్చబడేవారు. 4వ శతాబ్దిలో రెక్కలు గల దేవదూతలను రూపొందించడం పరిపాటి అయింది. ఈ మూర్తికి పొడుగుపాటి వ్రేలాడే శిరోజాలున్నూ ఉండేవి. 5వ శతాబ్ది నుంచి, ఈ దేవదూతల మూర్తులకు తెల్లని వస్త్రాలూ, ప్రభా చక్రాలూ చేరాయి.

**Anglo-saxon art** : *ఆంగ్లో-శాక్సన్ కళ.*

క్రీ. శ. 5వ శతాబ్ది మొదలుగా 11వ శతాబ్ది వరకు ఇంగ్లండులో వర్ధిల్లిన కళా విశే

వం. ఆనాటి క్రైస్తవాలయాలలో అత్యధికములు కొయ్యతో నిర్మించబడినవి. 8వ శతాబ్ది నాటికి రాతిలో వాటిని నిర్మించడం మొదలైంది. కాని వాటిలో అనేకం శిథిలమైనాయి. వాటిని గురించిన కొన్ని వివరాలు నాటి సాహిత్యం వల్ల మాత్రమే కొంత వరకు తెలుసుకోవడానికి వీలవుతున్నది

శిల్ప వస్తువులలో కన్నా ఆంగ్లో-శాక్సన్ కళా రమ్యతకు నిదర్శనాలు ఎక్కువగా గ్రంథచిత్రణలలో కానవస్తున్నవి. ఇవి తమ కాలపు యూరపీయ కళపై కూడా ప్రభావాన్ని నెరప గలిగినవి

**angular** : *కోణీయ*

**angular liner** : *కోణీయ రేఖిక.*

(చూ. ***liners and stripers***)

**angular perspective** : *కోణీయ దృక్క్రమత.*

సమకోణీయ ఘనరూపాన్ని చిత్రించేటప్పుడు అందులోని మూడాయతనాలలో ఒక దానికి సంబంధించిన రేఖాకృతిని మాత్రం చిత్ర ఫలకపు అక్షరేఖకు సమానాంతరంగా అమర్చి, తక్కిన రెండు ఆయతనాలను ప్రదర్శించటానికై అవలంబించే రేఖికా దృక్క్రమత. ఈ రెండాయతనాల ముఖాలూ ఇందు ప్రదర్శితములైనా, దీనిలో ఏవీ చిత్రతలానికి సమానాంతరంగా ఉండవు. అందువల్ల ఇట్లా చూపబడే ఈ రెండు ముఖతలాలూ చిత్రతలం నుంచి విభిన్న కోణసీమలకు పయనిస్తూ క్రమంగా తిరోగమిస్తాయి ఈ రెండు కోణాలూ సమానాలు కావచ్చు; లేదా వేర్వేరుగా ఉండవచ్చు. చక్రవాళ రేఖతో సంబంధించినంతవరకు - చిత్రిత వస్తువు అమరి ఉండే కీలిని బట్టి, చిత్రతలానికిన్నీ, చిత్రిత వస్తువుకున్నూ మధ్య ఏర్పడి ఉండే కోణాన్నిబట్టి చిత్రంలోని పై రెండుముఖ తలాలు చిత్ర తలంతో చేసే కోణాలు సమములుగా ఉండటం, లేదా విభిన్నములుగ ఉండటం అనేవి ఏర్పడతాయి ఈ రెండు ముఖతలాల నిర్దేశక రేఖలూ, చక్రవాళ రేఖ వద్ద సంశ్లేషిస్తాయి. ఈ రెండు రేఖల కున్నూ తిరోధానక బిందువులు వేర్వేరుగా ఉంటాయి. ఈ విధంగా కోణీయ దృక్క్రమతలో ఒక వస్తువును చిత్రించినప్పుడు రెండు తిరోధానక బిందువులు ఏర్పడడం వల్ల, దీన్నే బిందుద్వయ దృక్క్రమతలో ప్రదర్శించినట్లు కూడా చెప్పవచ్చు.

**aniline purple** : *అనిలీన ధూమ్రం.*

'మావ్' వర్ణానికి పాతకాలపు పేరు.

**animal black** *అస్థి కజ్జలం*

ఎముకలను కాల్చి తయారు చేసే ఎముక నలుపు (బోన్ బ్లాక్)కు పర్యాయనామం

**animal glue** : *పనిబంక*

**animal style** . *జంతుశైలి.*

మానవ నాగరికతా పరిణామంలో ఒక నిర్దిష్ట కాలంలో, యూరప్‌లోనూ, ఉత్తర ఆసియాలోనూ సంచారజాతులలో వ్యాప్తి నంది, వారి అభిమానానికి పాత్రమైన ఒక కళాశైలి. వివిధ జంతు రూపాలను, పలు మాధ్యమాలలో రూపొందించడం ఇందులోని విశిష్టత.

క్రీ. పూ. 1000 మొదలుగ క్రీ పూ. 5వ శతాబ్ది వరకు వివిధ ప్రాంతాలలో ఇది వాడుకలో ఉన్నట్లు నిదర్శనాలున్నాయి. కాకసస్ పర్వత ప్రాంతాలలో ఇది మొదట రూపు గొని, వివిధ సంచారక జాతుల వల్ల పలు

ప్రాంతాలకు వ్యాపించినట్లు కనపడుతుంది. ఇటువంటి సంచార జాతులలో సిథియనులు ఈ విషయంలో ఎక్కువగా పాల్గొన్నారు. ఈ జంతు రూపాలన్నీ, సాధారణంగా, అడవి జాతులే కావటం చూడగా, ఆదిమ నాగరిక జాతులు, తాము వేటాడే జంతువులు సమృద్ధిగా తమకు లభించటానికిగాను వాటి రూపాలను సాధనాలుగా గ్రహించి సాగించిన తాంత్రికారాధనయే ఇటువంటి జంతుశైలికి దారి తీసి ఉంటుందని భావించటానికి అవకాశం ఉంది.

ఇటువంటి జంతుశైలులు గల కళా ఖండాలన్నీ, సాధారణంగా శవ పేటికలలో లభిస్తున్నాయి. వీటి రూపకల్పనకు ఎముక, కొమ్ము, అడవిపంది దంతం, అంతటంతట కొయ్య, లోహము వాడబడినాయి. ఇటువంటిది ప్రతిదీ ఒక సాధారణపు వాడుక వస్తువుకు పిడిగానో, లేదా వేరొక ఉపాంగంగానో ఉండటం వల్ల ఆ వస్తువులు మృతుడు తన జీవితకాలంలో వాడుకొన్నవై, అతనితో పూడ్చిపెట్టబడి ఉండవచ్చునని, పండితులు భావిస్తున్నారు.

**ankh** : అంఖం.

ఇది ఒక సంకేత రూపం. లాటిన్ సిలువ ఆకారంలో అడ్డంగా ఉండే కర్ర పైన చక్రం వంటి ఆకృతి ఒకటి ఇందులో అమరి ఉంటుంది. దీన్ని జీవితానికి సంకేతంగా, ఈజిప్టు కళలో తరచుగాను, అస్సీరియన్ కళలో అక్కడక్కడ వాడారు.

**annatto** : అన్నాతం.

ప్రకృతి సిద్ధమైన ఒక రంగు పదార్థం. అన్నాత వృక్షపు పండును, మధ్య సారాన్ని ద్రావణీయ తైలాన్ని ఉపయోగించి దీన్ని తయారు చేస్తారు. చిరస్థాయిగా మనేటటువంటి రంగగా దీనికి పరిగణన లేదు. వెన్నకు, జున్నుకు నిరపాయకరమైన రంగును వేయటానికి మాత్రమే దీన్ని వాడుతున్నారు. ఈ రంగు పదార్థానికే ఆర్లియన్, తెర్రా ఒరెల్లానా అను పర్యాయ నామాలు కూడా వాడుకలోకి వచ్చాయి.

**anneal** : స్థిరతాపనం చేయు.

**annealing** : స్థిర తాపనము.

ఒక ద్రవ్యపు పెళుసుదనాన్ని తగ్గించటానికై సాగించే తాపన ప్రక్రియ. అట్లా కాలిన తరవాత దానిని చల్లార్చేటంతట సుత్తె పనికి, మెరిపెట్టటానికి, వంగ తీయటానికి ఆ ద్రవ్యం అనువుగ పరిణమిస్తుంది. కొన్ని ద్రవ్యాల విషయంలో తగిన ఫలితాలను సాధించటానికి ఈ స్థిర తాపనాన్ని అదే పనిగా సాగించవలసి ఉంటుంది.

**anodizing** : ధనీకరణ.

ఇది ఒక విద్యుతీకరణ ప్రక్రియ. ఒక లోహంపై రక్షకంగా గాని, అలంకారంగా గాని, విద్యుదీకరణ ద్వారా జరిగే పైపూత ఈ పద్ధతిలో అల్యూమినియం వస్తువులపై అల్యూమినియం ఆక్సైడును విద్యుతీకరణ ద్వారా సమానంగా పూస్తే ఆ లోహం, సురక్షితంగా ఉండటయే గాక, రంగులను పైపూత ద్రవ్యాలను వేయటానికి అనువుగా ఉంటుంది.

**Ansate Cross** : అంచిత క్రూశం.

(చూ : *ankh*)

**anthemion** : పత్ర పుష్పాలంకరణ.

రమ్యత ఒడుపు నటులు రచించిన ఆకుల పుష్పాలు గల అలంకృతులు. దీనిని పురాత







పత్రపుష్పాలంకరణ.
ప్రాచీన గ్రీకుల కలశములపై కననగు
పట్టబంధపు అలంకృతులు.

గ్రీకు శిల్పాలలో, కంచుపోత శిల్పాలకు, పింగాణి పాత్రలపై రచించిన వర్ణాలంకృతులకు వాడేవారు. ఈ రకమైన అలంకరణ మూడు, నాలుగు తీరులుగ ఉన్నది. వీటిని వేరువేరుగా గాని, రెండు మూడింటిని కలిపి గాని అలంకరణ చేయటం కూడా ఉంది. దీనికే తేనెపట్టు అలంకరణ. (*honey suckle*) అనే పేరు కూడా కలదు.

(చూ : *palmette*)

**antic work** : *అపరూప కృతి; విరూప కృతి.*

విలక్షణంగాను, విపరీత రూపాలతోను కొన్ని మానవాకృతులను గాని, జంతువాకారాలను గాని, లతాపుష్పాదులనుగాని కొన్ని యెడల అలంకారికంగా రచించే పద్ధతి. కొన్ని సందర్భాలలో ఇది హాస్యజనకంగా ఉంటుంది.

**antimony** : *సౌవీరం.*

**antimony orange; antimony vermilion:** *సౌవీర కాషాయ వర్ణం; సౌవీర సిందూర వర్ణం.*

ఆన్టిమనీ ట్రైయి సల్ఫైడ్‌తో తయారయే కాషాయ, సిందూర వర్ణాల వివిధ ఛాయలు. ఇవి అంతగా ప్రాచుర్యంలో ఉన్నవి కావు. వీటిని 1847లో స్కాట్లండులో, మర్డాక్ అనే అతడు కనిపెట్టి దీని తయారీ హక్కులను సంపాదించుకొన్నాడు. ఇవి పొడిగా ఉన్నప్పుడు తేజోహీనాలై వెలవెల పోయేవైనా, నూనెరంగులుగా వాడినపుడు ప్రకాశవంతాలుగా ఉంటాయి. సీసంతో తయారయే వర్ణ ద్రవ్యాలతో కలిసినపుడు ఇవి నల్లగా ఉంటాయి. అందుచేత 1920లో, కాడ్మియం వర్ణాలు వచ్చినప్పటి నుంచి వీటి ఉపయోగం మాటనపడింది.

**antimony sulphide** : *సౌవీర గంధకి.*

స్టిబ్నైటు అనే ఒక నల్లని యాంటిమనీ ట్రైయి సల్ఫైడ్‌ను పొడి చేస్తే తయారయ్యే వర్ణ ద్రవ్యం దీనిని రాసాయనిక పద్ధతిలో కూడా తయారు చేయవచ్చు. దీనికి వర్ణంగా ఎటువంటి ఉపయోగం లేకపోయినా, కుహనా వర్ణము (*camouflage paint*) గా వాడుతారు దీన్ని అధశ్శోణ (*infra red*) పటలంతో ఫోటో తీసినప్పుడు, దీనికి ఆకుపచ్చ రంగుగానే కాంతి పరావర్తనపు విలువ కలుగుతుంది.

**antimony white** : *సౌవీర శ్వేతం*

యాంటిమనీ ఆక్సైడ్‌ను 70% బేరియమ్

సల్ఫేటుతో సహా ప్రవేశపెంచినప్పుడు తయారయ్యే తెలుపురంగు. దీనికి టిటానియమ్ తెలుపుకుండే గుణాలన్నీ ఉన్నా, మార్పు చెందే గుణం ఎక్కువగా ఉంది, గంధక ధూమము తగిలినప్పుడు కొంచెం పసుపు రంగుగా మారడం వల్ల చిత్రకారులు దీనిని వాడరు. 1920లో బ్రిటన్‌లో, ఈ రంగు టిమోనాక్స్ (*Timonox*) అనే పేరుతో ప్రవేశపెట్టబడినా, అమెరికాలో దానిని ఎవరూ వాడలేదు.

**antimony yellow :** *సౌవీర పీతం.*

(చూ : *Naple's yellow*)

**Antipodeans :** *వ్యతికాపోతులు.*

ఆస్ట్రేలియా దేశపు ఒక కళాకార బృందం గ్రహించిన నామవిశేషం. వీరు 1959లో తమ చిత్రాల ప్రదర్శనను జరుపుతూ, ఒక వివరణ పత్రాన్ని ప్రచురించారు. వివిక్త కళావాదాన్ని వీరు నిశితంగా ఖండించి, ప్రాతి కాల్పనిక కళను సమర్థించారు. ఈ బృందంలో తక్కిన వారితో పాటుగా చార్లెస్ బ్లాక్‌మన్, ఆర్థర్ బాయిడ్, డేవిడ్ బాయిడ్, జాన్ బ్రాక్, రాబర్ట్ డిక్కర్‌సన్, జాన్ పెర్సివల్, క్లిఫ్‌టన్ పూఘ్ సభ్యులుగా ఉండేవారు.

**antiquarianism :** *ప్రాక్కాలీనతావాదం.*

గతకాలపు, అందునా ప్రాచీన కాలపు, కళాకృతుల పట్ల అత్యంత శ్రద్ధా భక్తులు కలిగి ఉండటం. ప్రాచీనమైనంతటనే, శైలి గాని కళాఖండం గాని స్తుతిపాత్రమని భావించే ధోరణి ఈ వాదావలంబకులందు కనపడుతుంది. సాధారణంగా న్యూనతా స్ఫోరకంగా ఈ పదం వాడుక కెక్కింది.

**antique :** *ప్రాక్కాలికం.*

1. ప్రాచీన కళకు సంబంధించినది.

2. గతించిన కాలంలో రచించిన ఒక కళాఖండం; ఆ కాలమున కళాత్మకంగా రూపొందించిన వస్తువు.

**antoxidant :** *ప్రత్యాక్సికరి.*

తైలవర్ణ చిత్రణలో వాడిన రంగులు పెచ్చులు పెచ్చులుగా ఊడిపోకుండటానికి అటువంటి రంగులలో వాడే ద్రవ్యం

(చూ: *retardant*)

**Antwerp blue :** *ఆంట్‌వర్ప్ నీలం.*

తక్కువ ప్రకాశం కలిగిన ఒక విధపు ప్రష్యన్‌నీల వర్ణము. దీనిలో నీలకర రంగు 75% ఉంటుంది. దీనినే హార్లెమ్ (*haarlem*) నీలం అనీ, ఖనిజ నీలం అనీ అంటారు. ఖనిజ నీలమనే పేరును ఇతర విధాలైన నీలాలకు కొన్నింటికి కూడా వాడతారు. చిర స్థాయిగ ఉండటాని కుద్దేశించిన చిత్రాలలో దీనిని వాడరు.

**Antwerp red :** *ఆంట్ వర్ప్ ఎరుపు*

ఇటుక రంగుకు దగ్గరగా ఉండే, వర్ణానికి మరొక పేరు.

**Antwerp school :** *ఆంట్‌వర్ప్ సంప్రదాయం.*

16వ శతాబ్ది ప్రారంభంలో ఆంట్‌వర్ప్ నగరంలోని ఫ్లెమిష్ చిత్రకారుల శైలీ విధానం. క్వెంటిన్ మాసిస్, అతడి అనుయాయులు ఈ సంప్రదాయంలో అగ్రేసరులు వీరు ఇటలీలోని పునరుజ్జీవన కళారీతులను పెక్కింటిని తమ సంప్రదాయంలోకి తీసుకొన్నా, తమ ఫ్లెమిష్ విశిష్టతను విడనాడలేదు.

**anvil : దాగలి.**

లోహపు పనివారు వాడే ఇనుప దిమ్మె. సాధారణంగా ఈ దిమ్మెకు పైభాగంలో ఉక్కు తొడుగు ఉంటుంది. దీనిపైన ఏ లోహాన్నయినా సమ్మెటతో గాని, సుత్తెతో గాని కొట్టి కావలసిన ఆకారాన్ని మలుస్తారు. ఎర్రగా కాలి సులభంగా వంగేట్లు తయారైన లోహాన్ని కూడా దీనిపై పెట్టి సుత్తెతో కొట్టి కావలసిన ఆకారాన్ని తీసుకొని వస్తారు.

**apotheosis : దైవత్వారోపణ.**

సామాన్య మానవుడుగ జన్మించినను, మహత్తర శక్తులను ఆర్జించిన ఒక జీవి, మరణానంతరమున దేవలోకమును చేరి దైవత్వమును ఆర్జించునని పూర్వపు గ్రీకులు విశ్వసించిరి. హోమర్ మొదలగు మహాకవులును తదితరులగు కొందరు మహాపురుషులును అట్టి ఘనతను ఆర్జించిరని వారి అభిప్రాయము. ఇటుల నూత్నముగ దేవలోకమును చేరవచ్చు వానికి, దివ్యప్రభామండితమగు దేవలోకపు వారలు ఎదురువచ్చి స్వాగతం పలికి కొనిపోవుదురని వారు నమ్మిరి. ఈ నమ్మిక యూరపున చాలా కాలము మన్ననను ఆర్జించి, ఐరోపి (యూ) చిత్రణలో దృశ్య రూపమును పొందినది. "జేమ్సు ప్రభువునకు దైవత్వారోపణ" అను పేరున రూబెన్స్ లిఖించిన చిత్రం ఇట్టిదియే. అతనికి సమకాలీనులగు ఇతర యూరపీయ చిత్రకారులును ఇట్టి వానిని కొన్నింటిని రూపొందించిరి.

**applied art : వినియుక్త కళ.**

నిత్యావసరాలకు పనికి వచ్చే పాత్రాదుల పైనా, ఇతర వస్తువులపైనా చేసే అలంకరణలోను, అటువంటి ఆకారాదులను సృష్టించడంలోను ఉన్న కళ. ఈ అలంకరణాదులు ఆ వస్తువు యొక్క ప్రయోజనానికి భంగం కల్గించేవిగా ఉండరాదు. ఉదాహరణ: అనేక నిత్యావసర వస్తువులపై అలంకరణలు; కథల్లోని, గ్రంథాల్లోని దృశ్యాల చిత్రణ; అలంకారంతో నిండిన అక్షరాలు మొదలైనవి. వాస్తుకళను కూడ వినియుక్త కళలో ఒక భాగంగా ఎంచవచ్చు. కేవలం సౌందర్యభావనే ప్రధానంగా లలిత కళలనున్నూ, ఇతర కళలనున్నూ గల భేదాన్ని తెలియ చేయటానికే ఈ మాటను వాడుతున్నా, ప్రస్తుత కాలంలో ఏది వినియుక్త కళను చెందిందో, ఏది లలిత కళను చెందెనో తెలుసుకోవటం అంతగ సులభంగా లేదు.

**applique : అనుయోజనం.**

అలంకరణ యుక్తముగ ఒక ఉపరితలం మీద అదే పదార్థంగాని, వేరేవేరే పదార్థాలు గాని అతికి తయారు చేసే విధానం. దుస్తులను తయారు చేయడంలో దీనిని సాధారణంగా వాడతారు. ఒక రంగు గుడ్డపై, వేరువేరు రంగుల గుడ్డలను-అనేక కోణాలలో కత్తిరించి-పట్టడం ఈ విధానంలో తరచుగా కనపడుతుంది. లోహ పాత్రల పైనా, కాగితాల పైనా సాగే ఈ అనుయోజనాన్ని పత్రఖండరచన (*decoupage*) అంటారు.

**apprentice : అంతేవాసి.**

**aqua fortis : స్థిర జలం.**

నత్రికామ్లానికి లాటిన్ పర్యాయ పదం ఆక్వా ఫోర్టిస్. ముద్రణార్థము లోహ ఫలకాలపై ఆకారాలను ముంచటానికి ఉపయోగించే రసాయనమిది.

**aquarelle : తరళ చిత్రణ.**

నీటి రంగులను పారదర్శకంగా ఉపయోగించి చిత్ర రచన చేసే పద్ధతి. అట్లా చిత్రిం

చిన చిత్రానికి కూడా ఈ పేరును ఉపయోగించటం ఉంది.

**Aquatec : అక్వాటెక్.**

ఒక అమెరికన్ కంపనీ తయారు చేసే అక్రిలీయ పాలిమర్ వర్ణాలకు, తదనుబద్ధములకు వాడుకలో ఉన్న వ్యాపార నామం.

**aquatint : జలచ్ఛవి.**

లోహ ఫలకాలపై చిత్రాలను ముద్రణకు తయారు చేయటంలో, ఒక వర్ణం యొక్క ముదురు, లేతఛాయలను సృష్టించటానికి వీలయ్యే పద్ధతి. ఇటువంటి ఫలకాలను ముద్రించటం వల్ల వచ్చే రూపాలు, నీటి వర్ణాలలో చిత్రించిన చిత్రాలవలె ఉండుట వలన దీనికి ఈ పేరు వచ్చింది. ఇట్లా తయరు చేయటానికి ముందుగా ఈ ఫలకాలపై గుగ్గిలపు పొడిని నేర్పుగా చల్లుతారు. ఆ పొడి లోహ ఫలకానికి బాగా అతుకుటకై కొంచెం వేడి చేస్తారు తరవాత ఈ ఫలకాన్ని క్షయకరి అయిన రసాయనంలో వేసినప్పుడు గుగ్గిలపు పొడి ఉన్న భాగం అట్లానే ఉండి, తక్కిన భాగం కొరుకుడు పడుతుంది. అట్లా తయారైన ఫలకాన్ని ముద్రణకు ఉపయోగించినప్పుడు, ఫలకంలో ఉన్న బిందువుల యొక్క సాంద్రతా భేదాల వల్ల చక్కని ఛాయా భేదాలు కనపడతాయి. మధ్య మధ్యలో క్షయకరి రసాయనం నుండి ఫలకాన్ని తీసి పరిశుభ్రపరచి మళ్ళీ మళ్ళీ రసాయనంలో ఉంచడం వల్ల ఎన్నో ఛాయలను, ఛాయాంతరాలను సృష్టించవచ్చు. ఫలకంలో క్షయం చేయనవసరంలేని భాగాలను, ముందుగానే క్షయకరి నిరోధక ద్రవ్యాన్ని ఒక దానిని పూస్తారు. దీనివల్ల ఆ ఫలకాన్ని ముద్రించినప్పుడు ఆ భాగం తెల్లగా ఉంటుంది.

ఈ గుగ్గిలపు పొడి అతికే పద్ధతిని 1769లో జీన్ బాప్టిస్టే లె ప్రిన్స్ కనిపెట్టాడు. ఇదిగాక కావలసిన భాగాలను ఇసుకతో గరుకుగా చేసే పద్ధతి, గంధకంతో ఫలకాన్ని క్షయీకరించే పద్ధతి అమలులో ఉన్నాయి.

ఈ పద్ధతులన్నీ సాధారణంగా వివిధ వర్ణాలతో ముద్రాంకములను తయారు చేయటంలో వాడుటకు మిక్కిలి అనువుగ ఉంటాయి. తెలుపు-నలుపు ముద్రాంకములను ఈ పద్ధతిలో తయారు చేయటానికి ముందుగా ఫలకపు ఉపరిభాగాన్ని సమానంగా గరుకుగా తయారుచేస్తారు. అంతట అధికేఖనం వల్లగానీ సూచీప్రక్రియ వల్లగానీ కావలసిన అనుగీస్తారు; లేదా అటువంటి గీతలను సూచీచిత్రణ ప్రక్రియ ద్వారా ఏర్పరస్తారు. గోయా తయారు చేసిన ముద్రాంకములలో అధిక భాగం ఇటువంటివే. జలచ్ఛవి ముద్రణ పద్ధతులు ఇప్పటి కాలంలో గ్రాఫిక కళాకారుల మన్ననలు ఆర్జించినవి. ముఖ్యంగా వర్ణ ముద్రాంకముల తయారీకి దీన్ని వారు ఎక్కువగా వాడుతున్నారు.

**aqueous : జలకము; నీటి (ని కలిగిన)**

**aqueous paint : వారి లేపం; జలన ప్రలేపం.**

నీటిలో కలపదగిన వర్ణ పదార్థాలు. ఇటువంటివి నూనెలో కలిపే వర్ణాలకంటే భిన్నమైనవి (చూ: ***water colour; gouache; tempera, casein colour, designer s colours; polymer colours, scenic colours***)

**arabesque : వర్ణలతా ఫణితి.**

ఆకులు, పుష్పాలు, పండ్లు, జంతువులు

**archaic** : *ప్రాక్తన.*

ఏదైనా ఒక ప్రాంతపు కళేతిహాసపు చరిత్రలో కళ ఎక్కువగ పరిణతిని సాధించని యుగానికి జోడించే విశేషణం అయినా, ఇది అచ్చంగా ఆదిమ మానవ కళను చెందిందిగానే గాక కొంత క్రమబద్ధత కలిగి ఉంటుంది. ఏ నాగరికతను చెందిన కళా చరిత్రలోనైనా, పరిణత శైలీ, కొన్ని దృఢ సంప్రదాయాలూ ఏర్పడటానికి ముందుగా ఇటువంటి కళారూపాలు సృజించడం జరుగుతుందని తెలుస్తున్నది.

**Archaic period** : *ప్రాక్తన యుగం.*

హెల్లెనీయ కళా సంప్రదాయంలోని నాలుగో దశ అయిన హెల్లెనీయ కళ క్రీ పూ 600 - 500లో వర్ధిల్లింది. ఇది ప్రాచ్య ప్రభావ యుగానికి, ప్రామాణిక యుగానికి మధ్య కాలంలో సంభవించింది. పాత్రలపై చిత్రరచన యీ యుగంలోనే ప్రామాణిక స్థాయికి చేరింది. ఈ చిత్రాలు రేఖలతో రచింపబడి, రంగులు మందపతి (*flat*)గా నింపబడి యున్నను, ఇవి నిత్య జీవితంలోని దృశ్యాలనే గాక, పౌరాణిక దృశ్యాలను కూడ తెలియచేస్తూ చైతన్యవంతములై, సహజతతో నిండి ఉండేవి. ఆ కాలపు కుడ్య చిత్రాలు ఏవీ మనకు లభించక పోయినా, కుడ్య చిత్రాలు సైతము ఆ కాలంలో ఇట్లానే రచితమై ఉండవచ్చునని పండితులు భావిస్తున్నారు. హెల్లెనీయ శైలిలోని పెద్ద శిల్పాన్ని ఐరోపా కళా చరిత్రలోనే స్వచ్ఛంద శిల్పంగా భావించవచ్చు. స్వచ్ఛంద శిల్పము *(free standing)* అంటే సర్వాంగములు కలిగి, అధిష్ఠానం వంటి ఆధారము ఏదీ లేకుండా నిలిచిన శిల్పం. ఇటువంటివి భవనాల అలంకరణకై నిర్మింపబడినవి కావు. తొలి దశలోని శిల్పాలు కొయ్యబారి చైతన్య రహితాలుగ ఉండి, ఈజిప్టు దేశపు కళా ప్రభావాన్ని ప్రదర్శించేవి. కాలక్రమంగా ఈ సంప్రదాయపు శిల్పంలో జీవకళా, లావణ్యమూ కుదురుకొన్నవి. శైలి పరిణతిని చెందిన కాలపు ఇటువంటి శిల్పాలలో మిక్కిలి కుశలతతో మలచబడిన శరీర నిర్మాణ రీతి ప్రదర్శితం. ఈ శిల్పాలపై ఉన్న వస్త్రాలు కూడా శరీరం యొక్క వంపు సొంపులను చక్కగా చూపుతున్నవి. చైతన్య స్ఫోరకమైన చిరునవ్వు, ఈ శిల్పాలలో కనపడే ఒక విశిష్ట లక్షణం. దీనినే ప్రాక్తన స్మితం (*Archaic smile*) అని చిత్ర కళేతిహాస వేత్తలు వ్యవహరిస్తారు. ఈ శిల్పాలపై సాధారణంగా సహజ వర్ణాలను పూసేవారు. అందువల్ల వాటిలోని సహజత, ఆ కాలంలో ఎక్కువగా ద్యోతకమై ఉండవచ్చు. ఆ యుగంలోనే ఇటువంటి పెద్ద శిల్పాలతో పాటుగా పెద్ద భవనాల నిర్మాణం కూడా హెల్లెన్స్ (గ్రీసు) దేశంలో సాగింది.

**archaism** *ప్రాక్తనాభిరుచి.*

(చూ : *archaic*)

**archaistic** : *ప్రాగాభాసిక.*

గతకాలపు శైలి అనుకరించడానికి ప్రయత్నించే కళావిధానానికి సంబంధించినది. అయినా గ్రీకు శిల్పంలో మాత్రం ఈ పదము, ప్రత్యేకంగా హెల్లెనీయ కళలోని ఒక నిర్దిష్ట కాలపు కళను మాత్రమే ఉపయోగిస్తారు. ఆ కాలంలో హెల్లెనీయ సంప్రదాయం ప్రచారంలో ఉన్న అన్ని దేశాలలోను ఈ ప్రాగాభాసిక శైలిని అనుసరించటం జరిగింది. అవి అనుకరణలే అయినా ఆనాటికి శిల్ప పరిణతిలో స్థానం పొందిన మెళకువలు సైతం అందులో చేరడం వల్ల కొంత మార్పు కూడ

**architrave** : *ఉత్తీరం.*

రెండు నిలువు స్తంభాలు ఆధారంగా అమరి ఉండే అడ్డు దూలము. ప్రామాణిక వాస్తులో దీనికి ప్రముఖస్థానం ఉన్నది.

**area of colour** : *రంగుతావు.*

**arenato** : *సికతా లేపనం; ఇసుకపూత.*

కుడ్యచిత్ర రచనలో భూమికగా పూసే పూతలలో మూడోపూత. 'అరెనాటో' అనే పదం ఇటాలియన్ భాషకు చెందినది. ఆంగ్లంలో దీన్ని శాండ్ కోట్ (*sand coat*) అనికూడా అంటారు.

**armature** : *శిల్పకంకాళం; మూలపంజరం.*

శిల్ప నిర్మాణంలోపల ఆధారంగా ఉండటానికి గాను దీన్ని నిర్మిస్తారు. దీనిపై తెల్ల బంకమట్టిని గాని, పారిస్ ప్లాస్టర్‌ని గాని, మలచటానికి వీలయ్యే ఇతర ద్రవ్యాలను గాని ఉపయోగించి శిల్పాన్ని తయారు చేయటం జరుగుతుంది.

(చూ : *bust peg*; *butterfly*)



శిల్పకంకాళం. కంకాళపు అంతర్భాగమును అమర్చిన చెక్క కొయ్యపై మట్టిముద్దనో, సుద్ద ముద్దనో నిలిపి, దానిని శిల్ప రూపరచనలో వినియోగించుదురు.

**Armenian blue** : *ఆర్మీనియన్ నీలం.*

సముద్ర నీలానికి పురాతన కాలంలో ప్రయుక్తమైన పర్యాయనామం. దీన్ని వైదూర్యం నుంచి తయారు చేసేవాళ్ళు.

**armlet** : *అంగదం; దండవట్టీ.*

**Armory show, the** : *ఆర్మరీ ప్రదర్శనం.*

1913లో ఫిబ్రవరి 17 మొదలుగా మార్చి 15వరకు సాగిన ఒక కళాప్రదర్శనం. న్యూయార్కు నగరంలో రెజిమెంట్ ఆర్మరీ లోని ఒక భవనంలో ఈ ప్రదర్శనం జరగటం వల్ల ఇటువంటి పేరు దానికి వచ్చింది. ఈ ప్రదర్శనను ఏర్పాటు చేసినది అసోసియేషన్ ఆఫ్ అమెరికన్ పెయింటర్స్ అండ్ స్కల్‌ప్టర్స్. ఇందులో 1600 రచనలు ప్రదర్శితాలైనాయి. ఇది అచ్చంగా రెండు ప్రదర్శనలసంయుక్త రూపం అని చెప్పవచ్చు. అమెరికన్ కళాకారులకు సంబంధించినంత వరకు తీవ్రవాద కళకు ప్రాతినిధ్యం లభించగా, విదేశాల విషయంలో పారిస్‌లోని ఎకోల్ ది పారిస్‌కు ముడిపడ్డ ఉద్యమాలకు అందులో ప్రాతినిధ్యం లభించింది.

**arm palette** : *ముంజేతి ఫలకం.*

ముంజేత ఉంచుకొని, సులభంగా మోయటానికి వీలయ్యేటుగా వంపుగా, కత్తిరించి తయారు చేసిన వర్ణఫలకం. కొంతమంది చిత్రకారులు దీని సమతూకానికిన్నీ, సౌలభ్యా

నికన్నీ ఎక్కువ మక్కువపడి దీన్ని అభిమానించినా, మరి కొందరు అటువంటి భావనను అర్థరహిత ఛాందసమని తిరస్కరించారు. ఇది 19వ శతాబ్దిలో ఎక్కువ ప్రచారంలో ఉండేది ప్రస్తుతం చాలమంది కళాకారులు పర్ణఫలకాన్ని సాధారణంగా తమ ప్రక్కనే ఒక ఎత్తయిన స్థానంలో ఉంచుతారు.



ముంజేతి ఫలకం

**Arretine ware** : *అరెటియం సామగ్రి.*

రోమనుల కాలపు (ర. క్రీ. పూ. 30- ర. క్రీ. శ. 40 ) ఒక విధపు మట్టి సామగ్రి. ఇటలీలోని అర్రెటియం నగరంలో ఈ సామగ్రి మొదట తయారు కావడంవల్ల ఈ పేరు పెట్టింది దీనికి ఎర్రమట్టిని వాడేవాళ్ళు. సాంప్రదాయికమై, అచ్చున దీసినట్లుగా ఉండే అలంకరణతో ఇది కూడి ఉండేది. 18వ శతాబ్దంలో ఈ ప్రాచీన సామగ్రికి చెందిన కొన్ని అవశేషాలు లభ్యమై సమకాలీన కళాకారుల ప్రశంసలను ఆర్జించగలిగినవి.

(చూ : *terra sigillata*)

**arriccio** : *కవిశచ్ఛాదనం.*

కుడ్యచిత్రానికై భూమికను తయారుచేయటానికి పూసే పూతలలో రెండవది. ఇది ఎర్రని ధాతు మృత్తికతో తయారవుతుంది. 'అర్రిసియో' అనేది ఇటాలియన్ పదం. ఆంగ్లంలో దీన్ని బ్రౌన్ కోట్ (*brown coat*) అంటారు.

**arris** : *కోణాంచలం.*

వాడిగా ముందుకు చొచ్చుకొని ఉండే అంచు. సమంగానో, వక్రంగానో ఉండే రెండు ఉపరితలాలు సంధించేటప్పు డేర్పడే కోణం ముఖ్యంగా సంధానంలోని అంచు, లేదా లంబపర్శ్వక.

**arsenic yellow** : *మణిశిల పసిమి.*

రాజపీతము (*king's yellow*)నకు పర్యాయ నామం

**art** : *కళ.*

**artefact, artifact** : *కౌశలికం.*

జనుల నిత్యోపయోగార్థం అందంగా ఆకర్షణీయంగా తయారు చేసిన గృహపరికరము లేదా అట్టిదే అగు వస్తువు.

**art for art's sake** : *కళార్థమే కళ; కళ కోసం కళ.*

కళయొక్క స్వేచ్ఛను తెలియజేసే ప్రామాణిక సూక్తి. 1870వ సంవత్సరం మొదలుగా ఇది వాడుకలోకి వచ్చింది. ఏదైన ఒక ఐతిహాసిక సంఘటనను వర్ణించటం, నైతిక మూల్యాల సముద్ధరణ కోసం కృషి చేయడం, వేరేదైనా సంస్కరణను ఉద్దేశించటం – అనే వాటిలో ఎటువంటిదానితోగాని కళకు సంబంధం ఉండరాదనీ, సౌందర్య భావనే కళయొక్క ముఖ్యోద్దేశమనీ దీని తాత్పర్యం.

**art gallery** : *కళా ప్రదర్శిక; చిత్రశాల.*

**artificiality** : *కృత్రిమత.*

**artificial ultramarine** : *కృత్రిమ అతిసాగరిక.*

19వ శతాబ్దిలో వాడుకలోకి వచ్చిన ఒక పదవిశేషం సహజసిద్ధంగా వైదూర్యంనుంచి తయారయ్యే దాని నుంచి, విభిన్నమని తెలియ చేయటానికై సాధారణపు వాడుకలో ఉన్న అతిసాగరిక నీలిమకు ఉపయోగించిన పేరిది.

**artisan** : *కారుకుడు.*

ప్రజలు నిత్యం ఉపయోగించే వస్తువులను ఆకర్షణీయంగాను అందంగాను తయారుచేసే పనివాడు

**artist** : *కళాకారుడు; కళావేత్త; కళావిదుడు*

ప్రస్తుతం ఈ పదాన్ని శిల్పికీ, చిత్రకారుడికీ వాడుతున్నారు.

**artiste** : *కళాజీవనుడు; కళాజీవి.*

ఆంగ్లభాషకు సంబంధించినంతవరకు ఈ పదాన్ని ప్రదర్శక కళలను సాధన చేసే కళాకారులకు మాత్రమే - అంటే నృత్య, నాటక, సంగీతాది కళాకారులకు మాత్రమే - వాడుక చేస్తున్నారు.

**artistic convention** · *కళాధర్మ.*

**art mobilier** : *జంగమ కళ.*

ఒక చోట నుంచి వేరొక చోటికి సులభంగా తరలించటానికి వీలైన చిన్న కళాఖండాలకు సాధారణంగా ఉపయోగించే పదం. మహత్తర కళాఖండాల నుంచి వీటిని వేరుపరచి చెప్పటానికిగాను వ్యత్యస్తతా సూచకంగా ఈ పదాన్ని వాడుతున్నారు. చిన్న చిన్న రాతి పలకల మీది అధిలేఖనాలు, అస్థి తక్షణములు, గుహాలలో శిలాశ్రయాలలో - ఇంకా తక్కిన పురా చారిత్రిక స్థలాలలో - లభించే నానావిధ వస్తువులూ, సంచార జాతులు నిర్మించిన కళాఖండాలూ ఇందుకు ఉదాహరణలుగ పేర్కొన దగినవి

**art nouveau** : *నవ్యకళ.*

19వ శతాబ్ది అంతంలో చిత్రలేఖనం, శిల్పం, ఆద్దకపు చిత్రణ, అలంకారిక చిత్ర రచనలలో ఉద్భవించిన ఒక నూతన శైలి. 1880లో ఇంగ్లండులో రూపుగొన్న ఈ శైలి ప్రగతి సాధక (*avant garde*) కళగా 1895 నుంచి 1905 వరకు రాణించింది. ఖాపన్యో రకాలైన రేఖలు నీటిధారలలాగా జారుతూ వ్యతిరిక్త వక్రగతుల (*reverse curves*)తో ఒక దానితో వేరొకటి పెనవేసు కొన్న రూపములు కుదురుకొని ఉండటం ఇందులో ముఖ్యలక్షణం. ఈ శైలికి చెందిన అలంకారిక చిత్రాలలో లతా పుష్ప రూపాలు తరచుగా ఉండేవి ఈ విధంగా సహజ రీతిలో లతా పుష్పాలు తొట్ట దొలుతగ ఈ శైలిలోనే ప్రత్యక్షమైనవి ఈ శైలికి సమకాలీనంగా ఇంకొక శైలి కూడా ఆ యుగపు అంతంలో ఆదరించబడింది అందులో ఋజురేఖలు, ద్విచతురస్ర ప్రరూపణాలు(*motifs*) ఎక్కువగా చోటు చేసుకొన్నాయి 19వ శతాబ్దపు ఉత్తరార్ధంలో వర్ధిల్లిన ఆంగ్ల సంస్కృతి లోని కొన్ని ప్రముఖ మూల స్రోతస్సుల నుంచి - ముఖ్యంగా కళా కౌశలోద్యమం (*arts and crafts movement*) నుంచి - ఈ శైలి అవతరించింది కెల్టిక్ కళ, రొకోకో, ప్రాచ్య దేశాల లిపి చిత్రణ (*calligraphy*), జపనీయ వాస్తువు - ఈ శైలి ఆవిర్భావానికి కొంత తోడ్పడినవి. ఈ కళా శైలి ఇంగ్లండు నుంచి యితర యూరపీయ దేశాలకూ, అమెరికాకూ త్వరగా ప్రాకింది. ఈ శైలి యొక్క

ప్రభావం ఈ నాటికీ ఈ దేశాల భవన నిర్మాణాలలో కాంచవచ్చు. ప్రఖ్యాత వాస్తువేత్త, ఫ్రాంక్ లాయిడ్ రైట్ నిర్మించిన గుగెన్ హెమ్ మ్యూజియంలోను, ఈరో సారినెన్ అనే సుప్రసిద్ధ వాస్తువిదుడు నిర్మించిన ట్రాన్స్ వరల్డ్ ఏర్‌లైన్స్ వారి కెన్నెడీ ఎయిర్‌పోర్ట్ భవనంలోను ఈ శైలీ ప్రభావం కానవస్తుంది. ఈ శైలికి లక్ష్యాలుగా ఎంటోనీ గాడీ, విక్టర్ హోర్టాలు రూపొందించిన భవనాలు, ఆబ్రే బియర్డ్స్లీ యొక్క రేఖా చిత్రాలూ, లూయీ కంఫర్ట్ టిఫ్ఫానీ యొక్క గాజు సామాగ్రీ, హెన్రీ వాన్ డి వెల్డీ లూయీ, సల్లివాన్‌లు సాగించిన వాస్తు ఖండాలంకరణా, గృహాంతర్భాగాలంకరణలు. చార్లెస్ రెన్నీ మేకిన్‌టోష్ రూపొందించిన కుర్చీలు మొదలైన ఉపకరణ సామగ్రి, ఆల్ఫోన్సో మూచా వెలయించిన కుడ్య పత్రాలూ ***(posters)*** పేర్కొనదగినవి ఈ శైలినే ఫ్రాన్స్ దేశంలో యాటింగ్ శైలి అనీ, జర్మనీలో జుగెండ్ స్టిల్ అనీ, ఆస్ట్రియాలో సెజెషన్ అనీ, ఇటలీలో స్టయిల్ లిబర్టీ అనీ వ్యవహరిస్తున్నారు.

కొందరు కళాచరిత్రకారులు ఈ నవ్య కళకూ, తరవాత వచ్చిన అనేక విప్లవాత్మక కళారీతులకూ జనక జన్య సంబంధాన్ని ఆపాదిస్తున్నారు. వారి అభిప్రాయంలో ఈ శైలిలోని వక్రరేఖా గతి స్థూలతావాదులకూ, ఋజు రేఖాగతి నవకల్పనా వాదులకూ, మార్గదర్శులైనాయి. వివేచనా వాదులపైన కూడా ఈ శైలీ ప్రభావం చాలావరకు పడిందని చెప్పవచ్చు. ఈ శైలివల్ల ప్రభావితులైన వారిలో ప్రముఖులు: గాగిన్, వాంగో, టోలూస్ ల్యాత్రెక్, రోడిన్, ఎడ్వర్డ్ మంచ్, గస్టావ్ క్లింట్.

**art requester :** *ప్రాక్ భిత్తి కళ.*

ప్రాగైతిహాసిక గుహావాసుల భిత్తి చిత్రణకు వాడే ఫ్రెంచి పదం.

**arts and crafts :** *కళా కౌశలములు.*

1. సాధారణంగా ప్రజల వాడుకలో ఉంటూ, అలంకరణయుక్తంగా ఉండే వస్తువులను చేతితో నిర్మించే కళా ప్రక్రియకు ఆధునిక యుగంలో ఈ పదం వాడుక చేస్తున్నారు. ఇటువంటి కళాకౌశలాలలో గృహపరికర నిర్మాణము, లోహపు పని, కొయ్యపని, నేతపని, అల్లిక పని, మట్టిసుద్ద వస్తువుల పని, చెక్కడపు పని, అద్దకపు చిత్రణ, చిత్రణ మొదలైనవి ఉన్నాయి. పాఠశాలలలోను, శిక్షణ శిబిరాలలోను, కొన్ని సంస్థలలోను ఇటువంటి కళా కౌశలాలు, వృత్తి విద్యలుగా నేర్పబడుతున్నాయి. అక్కడ కొంతమంది ఔత్సాహికులు కూడా ఒక వినోద కార్యక్రమంగా గాని, సృజనాత్మక కార్యక్రమంగా గాని దీన్ని అభ్యసిస్తున్నారు. రోగ చికిత్సకు కూడ ఈ కళా కౌశలముల శిక్షణ వినియోగపడుతుంది.

2. 19వ శతాబ్ది మూడవ పాదంలో ఇంగ్లండున వెలసిన ఒక కళోద్యమం. ఈ ఉద్యమ స్థాపకుడు విలియం మారిస్. దీనికి ఎక్కువ ఉత్తేజాన్ని కలిగించినవారు: జాన్ రస్కిన్, ఆగస్టస్ ప్యూజిన్. పారిశ్రామిక విప్లవం వల్ల, కళకు కలిగిన వికృతికి ప్రతిచర్యగా ఈ ఉద్యమం ఆవిర్భవించింది. ఈ ఉద్యమం చేతిపనుల పునరుద్ధరణకు కారణమైంది. ఈ ఉద్యమంవల్ల రూపొందిన నవ్యశైలులు, విక్టోరియా యుగంనుంచి వచ్చిన సంప్రదాయాలను మార్చి నవ్యకళకు మార్గం చూపినవి.

(చూ: ***art nouveau***)

**art student :** *కళా విద్యార్థి.*

**art studio :** *కళా నిలయిక.*

**art trend :** *కళావైఖరి.*

**Arundel prints :** *అరండేల్ ముద్రాంకాలు.*

ఇంగ్లండులో 1849లో స్థాపితమైన అరండేల్ సొసైటీ అనేది తన సమాజ సభ్యుల కొరకై తయారు చేయించి, పంచి పెట్టిన ప్రాచీన కళాపండిత రచనల ప్రత్యుత్పన్నములు ఇవి. ఈ సమాజం 1897 లో అంత రించింది. ఆ తరువాత ఆరండేల్ క్లబ్ అనేది రూపొంది, అంతగా ప్రాచుర్యం పొందని కళా వేత్తల రచనలకు కొన్నింటికి ప్రత్యుత్పన్న ములను వెలువరించింది.

**asbestos board :** *రాతినార ఫలకం.*

రంగుపూతకు, అలంకరణకు ఆలంబనాలుగ కళాకారులవల్ల కొన్ని సందర్భాలలో వాడబడే, పారిశ్రామిక కుడ్యాస్తంకలలో దేనికైనా ఈ పేరు వర్తిస్తుంది. రాతినారను, పోర్టులాండ్ సిమెంట్‌ను ఉపయోగించి తయారు చేసే ఈ ఫలకం అగ్నినిరోధకమే అయినా బరువూ, పెళుసుదనము దీనికి ఎక్కువ. ఈ ఫలకాలలో సర్వసామాన్యంగా వాడుకలోఉండే దానికి ఫ్లాట్ ట్రాన్సైట్ (*flat transite*) అనే వ్యాపారనామం ఉంది. దానిలో రాతి నారకు సిమెంటుతో ఉన్న నిష్పత్తి 80:20గా ఉంటుంది

**Ash-can school:** *భస్మపాత్ర సంప్రదాయం.*

( *చూ . Eight, the* )

**ash glaze :** *మెరుగు బూడిద.*

పింగాణి వస్తువుల తయారీలో మెరుగు వేయటానికి ఉపయోగించే, వృక్షసంబంధమైన, బూడిద. చీనాలోని హాన్ రాజవంశపు కాలం మొదలుగా ఇది ఆ దేశంలో వాడుకలో ఉంది నిరుపయోగ పదార్థాలైన ఎండాకులు, కాయపై తొక్కలు, రంపపుపొట్టు, పొయిలోని బూడిద వంటి వాటిని ఈ మెరుగు బూడిదను తయారు చేయటంలో వాడవచ్చు

**askos :** *తైలిక.*

ప్రాచీన గ్రీసుదేశంలో తైలాలను ఉంచు కోవటానికి వాడిన ఒక పింగాణి పాత్ర ఈ పాత్ర అప్పుడు వాడుకలో ఉన్న మేకతోలు సంచిని పోలి ఉండేది.

**asphalt :** *శిలాజిత్తు; గనితారు.*

కొన్ని దేశాలలో భూమిలో జరిపే త్రవ్వకాలలోను, పొడుపడ్డ సరస్సులలోను సహజ సిద్ధములుగ లభించే నల్లని లేదా నలుపువాక గోధుమ రంగుగా ఉండే - యక్షధూపాలలో దేనికైనా ఈ పేరు వర్తిస్తుంది ఇవి ఆమ్ల నిరోధకాలలో ఉన్నతస్థాయికి చెందినవి. అందువల్ల సూక్ష్మ చిత్రణ (*etching*) లో నిరోధకాలుగ వాడుకలో ఉన్నాయి. వాటిని ఈజిప్టువాసులు శవాలకు చెడిపోకుండా కల కాలం భద్రపరచటానికి దిద్ది వాడారు. అయినా ఈ యక్షధూపపు పైపూతలో కాం క్రమంగా పైపొరపగుళ్ళు ఏర్పడతాయి, కాబట్టి కళాకారులు వాడే రంగులలో చెప్పి ఉపయోగించరు గిల్సనైట్ అనే వ్యాపార నామంతో ప్రసిద్ధిని ఆర్జించిన యుయిన్‌టైట్ అనే ఈ రకపు యక్షధూపం, యు. స్టే. లోని ఊటా రాష్ట్రంలో లభిస్తున్నది ఆమ్లనిరోధక మిశ్రమాలకు దృఢత కలిగించటానికి దీన్ని వాటితో కలుపుతారు.

**asphaltum :** *తారురంగు; డాంబరు రంగు.*

ఆస్ఫాల్ట్ అనే ఖనిజ లింపు తైలసెనూనెలో కరిగించటంవల్ల తయారై, పారదర్శకంగా

ఉండే ముదురుగోధుమ రంగు. ఇది సరిఅయిన వర్ణద్రవ్యం కాదు; కొద్దిపాటి వేడికిగూడా నూనెలలో కరిగిపోతుంది. 19వ శతాబ్దిలో ఇది వాడుకలో ఉండేది; కాని దాని దుష్ఫలితాలు తెలియవచ్చిన తరవాత దానికి బదులుగా పారదర్శకపు గోధుమ రంగుగల అటువంటి వాడుకలోకి వచ్చింది 'మమ్మీ' అనేపేరున వాడుకలో ఉన్న వేరొక తారురంగు (ముదురు గోధుమ రంగు) ఇటులనే ఉపయోగాన్ని కోల్పోయింది.

**asphalt varnish resistant** : *తారువార్నీషు నిరోధకం.*

**auspicious features** : *శుభ లక్షణాలు; మంచి లక్షణాలు.*

**assemblage** : *సమ్మేళన ప్రక్రియ.*

వివిధ వస్తువులను – అందునా ముఖ్యంగా నిర్మిత వస్తువులను – సమైక్య రీతిలో మూడు ఆయతనముల కళాఖండాలుగ రూపొందించే ప్రక్రియ. ఇటువంటిసమ్మేళనము తనకు తానుగ విడిగ నిలబడునదిగా గానీ, శిల్పరూపంగా గానీ, ఫలకంపై చిత్రణగా గానీ ఉండవచ్చు. ఇందులో పద్ధాలను, స్థాపత్యాన్ని గూడా ఉపయోగించవచ్చు ఈ ప్రక్రియలో తొలుతటి చిత్రము: పికాసో రచించిన 'సారాయి పాత్ర' (1914)

**assembly** : *సమాహారం (శిల్పం).*

**associate** *సహ సభ్యుడు.*

**Assyrian art** : *అస్సీరియన్ కళ.*

క్రీ. పూ. 1500 మొదలుగ క్రీ. పూ. 612 వరకు మెసపొటేమియా (నేటి ఇరాక్)లో వర్ధిల్లిన ఒక విశిష్ట కళ. టైగ్రిస్ నది తీరపు మోసల నగరం దీని తొలుతటి కేంద్రం. దీనిని పోషించిన అస్సీరియన్ ప్రభువులు, ఆ ప్రాంతాన్ని బేబిలోనియనుల నుంచి వశపరచుకొని ఆ ప్రాచీనుల కళా సంస్కృతులనే కొనసాగించటం వల్ల దీన్ని బేబిలోనియన్ కళలోని ఒక శాఖగానే పరిగణించవచ్చు. అయినా ఆ కళలకు, స్వీయ ప్రతిభను జోడించి దానికి కొంగ్రొత్త రూపాన్ని అస్సీరియనులు సంతరించారు. ఉబ్బెత్తు శిల్పము, చిత్రలేఖనము ఎక్కువగా ఆ కాలంలో రాణించాయి అందులోను జంతువులను రూపీకరించటంలో అస్సీరియన్ కళాకారుల పనితనం అసామాన్యం. రాజుల ప్రీతి కోసం రచించిన ఆ కళాఖండాలలో యుద్ధం, వేట వంటివాటి దృశ్యాలు ఎక్కువగా కనపడతాయి. మూర్తులన్నీ పార్శ్వభంగిమలలో ఇందులో రూపితములు.

**astragal** : *గుల్భిక.*

చిన్నదిగాను, సరళంగాను, ఉబ్బెత్తుగాను, గుండ్రంగాను ఉండే అచ్చు దిగిన ఆకారం.

**asymmetry** : *అసమ్మితి; అసౌష్ఠవం.*

ఒక కళాఖండంలో స్పష్టమైన సమ్మితిత్వము లేకపోవటం. జీవవంతమైన, ఏ రూపంలోను కుడి ఎడమల మధ్య అచ్చువు సాదృశ్యము ఏనాడూ ఉండనేరదనే సూత్రాన్ని ఆధార పరచుకొని, మానవరూప చిత్రణలలోను, శిల్పాలలోను సహజత్వం కోసం ఇటువంటి అసౌష్ఠవాన్ని కల్పించటం అవసరమవుతుంది. సౌందర్య మీమాంసను బట్టి కూడా, సౌష్ఠవ నిర్మాణం చైతన్య రహితమై, సహజతకు దూరంగా ఉంటుంది. ఇటువంటి అసౌష్ఠవ కల్పనలో సైతం, అవ్యవస్థత విపరీతంగా కనపడ కూడదు. అందుకుగాను తుల్యరా సూత్రాలు పాటించవలతప్పదు.

**ataurique** : పత్ర శిల్పం.

'అతారిఖ్' అనేది అరబ్బీ పదం; 'వరఖ్' అంటే ఆకు; ఆకుకు సంబంధించింది అని 'అతారిఖ్' అనే పదపు అర్థం. సుధా పిష్టమునో, సుధా మృత్తికనో వాడి కుడ్య ముఖతలంలో పత్ర పుష్ప ప్రలక్షణాలు రూపొందించటం జరిగేది. స్పెయిన్‌ను పాలించిన మూరుల కాలంలో భవనాల గోడలపై ఇటువంటి అలంకృతి నెలకొన్నది.

**atelier** . శిల్పశాల.

1. కళాకారుడు లేదా చేతిపనివాడు పని చేసే స్థలం ఇది అచ్చంగా నిలయం (స్టుడియో) కాదు; ఇది ఒక విధమైన కర్మాగారం ఇక్కడ కళాకారుడు ఒకడే తనపనిముట్లతో తనకృషి సాగిస్తాడు నిముకరో ఎందరో చిత్రకారులకు ఒక కళావేత్త శిక్షణ నివ్వటమూ, వాళ్ళు అతని పర్యవేక్షణలో పనిచేయటం జరుగుతుంది.

2. ఈ పదం ఫ్రాన్స్ దేశంలో ఇంకొక అర్థంలో వ్యవహారంలో ఉంది అటెలియర్ లైబ్రే అనే దానికి సంక్షిప్తరూపంగా దీన్ని అక్కడ వాడతారు. అటెలియర్ లైబ్రేలో, చిత్రరచనకు ఆధారభూతులైన మోడల్‌లు కొన్ని నిర్ణీత సమయాలలో నగ్నంగా నిలిచి ఉంటారు అక్కడ శిక్షణనిచ్చేవాళ్ళు ఉండరు; శిక్షణ గాని ఉండదు. ఇటువంటి శిల్పశాలలో అతి ప్రసిద్ధమయిన దానిని 1925 ప్రాంతంలో పారిస్‌లో సుశీ అనే మోడల్ మహిళ ప్రారంభించింది ఆ శిల్పశాలలో డెలాక్రాయి, కోర్బె, మానే, సిజానే మొదలైన ప్రఖ్యాత కళాకారులు పనిచేసిరి 1860లో పారిస్‌లో సంస్థాపితమైన అటెలియర్ జూలియన్ అనే సంస్థ ఈ శిల్పశాలా భావనను నూతన పద్ధతిలో ముందుకు తీసుకొనిపోయి, అక్కడ శిక్షణకు కూడా తగిన ఏర్పాటులు చేసింది. మేటిస్సె, లెగె అక్కడ శిక్షణ పొందారు.

**altantes** : స్తంభ పురుషులు.

అట్లాస్ అనే గ్రీకు పదానికి బహువచన రూపం అట్లాంటెస్. మానవాకృతిగా చెక్కిన స్తంభాన్ని గ్రీకులు అట్లాస్ అని వ్యవహరించేవాళ్ళు. అట్లాస్ అనే ఒక మహాబలుడు - హిందువుల పురాణాలలోని శేషుడిలాగా - భూమిని మోస్తూ ఉంటాడు. ఈ రకపు స్తంభాన్నే రోమనులు తెలామన్ అని వ్యవహరించేవారు దీని స్త్రీ రూపము స్తంభకన్య (కెర్యాటిడ్).

**atmosphere** . వాతావరణం

చిత్రలేఖన దర్శనంలో ద్రష్టకు కలిగే స్పందన, లేదా చిత్తవృత్తి వాయుగత దృక్క్రమం ద్వారా, ఒక సంవిధానంలో సృష్టించిన మూడాయతనముల భావనకు కూడా ఈ పదం వాడతారు.

**atmospheric** . వాతావరణ గత

**atmospheric perspectivic** వాతావరణ దృక్క్రమత.

అభిభావనావాదులు-అందులోను ముఖ్యంగా పిస్సారో, మోనే, సిస్లీ అనేవారు-'వాతావరణ దృక్క్రమత' అనే దానికి ఒక ప్రత్యేకార్థాన్ని నిర్దేశించి తదనుగుణంగానే తమ చిత్రాలలో దానిని ప్రవేశింపచేశారు. టర్నర్ అనే ఆంగ్ల చిత్రకారుడి రచనలు ఈ విషయంలో వారికి మార్గదర్శకాలయినాయి. పురోభూమి నుండి తిరోగమించే కొద్దీ, వెలుగు చీకటుల మధ్య వ్యత్యస్తతల బలిమిని మెల్ల మెల్లగా తగ్గించుకొని పోవటం మాత్రమే ఈ వాతావరణ దృక్క్రమత కాదనీ, స్థానికవర్ణాలు కాంతివల్ల

పొందే పరిసరాల విస్తృతిని పెంపొందించి తద్వారా తిరోగతని వ్యంజింప జేయటమే అది అని వీరు భావించారు. ప్రఖ్యాత చిత్రకారుడు సిజానే ఈ విషయంలో వారితో విభేదించాడు. వారి చిత్రణ ఛాయా చిత్రణరీతికి చెందిందని ఆయన ఆక్షేపించి, అందులో ఒక దృశ్యపు తాత్కాలిక గోచరత మాత్రమే ప్రస్ఫుటం కాగలదని విమర్శించి, తాను అపేక్షించేది దృశ్యపు పరిస్థాయి గోచరత అని ఆయన స్పష్టంచేశాడు (చూ. *aerial perspectiva*)

**atomiser** . అణుకారకం.

మంచు తుంపరలాగా సన్నగా రంగులను చల్లటానికి ఉపయోగించే సాధనం. దీనిలో ఒక గాజుపాత్ర, లోహనాళిక, ఒక రబ్బరు గోళం ఉంటాయి. [illegible]వర్ణపు చిత్రాలు వేసే ఒప్పుడు రంగులలోని తడి ఆరిపోకుండా ఉంచటానికై నీటిని చల్లటానికి కూడా ఈ సాధనాన్ని ఉపయోగిస్తారు. దీని ఉపయోగాలలో ముఖ్యమైనవి పొడి రంగులను (సుద్ద రంగులను) గాని, బొగ్గునుగాని వాడి రూపొందించిన రేఖాచిత్రాలు చెదిరిపోకుండా పైపూత వేయటం, చిత్రపు ఉపరితలం ఎక్కువగా ఆర్ద్ర [illegible] చేయటానికై [illegible] ప్రస్తుతం పెద్ద [illegible] సాధనాలు వాడుకలోకి రావటం వల్ల అణుకారక ఉపయోగం తగ్గిపోయింది

**atramentum** . ఆట్రామెంటం.

[illegible]లతో తయారుచేసే వివిధమైన నల్లరంగులను, సిరాలను సమష్టిగా రోమనులు వాడిన పదం. చిత్రాలకు మెరుగు తేవటానికి ఉపయోగించిన ద్రవ్యానికి కూడా రోమనులు ఈ పదాన్నే వాడుచేశారు.

**a trois crayons** : త్రిఖటికా చిత్రం.

మూడు పొడి రంగులతో (సుద్ద రంగులతో) తయారు చేసిన చిత్రం. ఈ మూడూ సాధారణంగా ఎరుపు, నలుపు, తెలుపులై ఉంటాయి.

**attributes** : లాంఛనాలు.

లౌకిక, ధార్మిక మూర్తి కళలో సాధారణంగా ఉపయోగించే ఒక పారిభాషిక పదం. ఒక ప్రసిద్ధ మూర్తికి సాధారణంగా అనుబద్ధమై ఉండే ఆయుధ, వస్త్ర, పరికరాదులకు ఈ పేరు వాడుతారు. ఒక మూర్తి రచనలో కనపడితే ఆయా లాంఛనాలను బట్టి ఆ మూర్తిని గుర్తించటం వీలుపడుతుంది. పాశ్చాత్య ధార్మిక మూర్తులలో జోవ్ నిగ్రహపు చేతిలో కనపడే కులిశం, సెయింట్ పీటర్ చేతిలోని తాళపుచెవి, సెయింట్ కేథరీన్ యొక్క చక్రం మొదలైనవి ఇటువంటివే. (హిందూ విగ్రహాలలో సుదర్శనం, శంఖం, త్రిశూలం మొదలైనవి కూడా ఈ కోవకు చెందినవే)

**attribution** : ఆపాదనం.

కళా చరిత్రలోను, కళా విమర్శనంలోను ఉపయుక్తమయ్యే ఒక పారిభాషిక పదం. ఒక రచన యొక్క కర్తృత్వము తెలియరానప్పుడు, కొన్ని బలవత్తర సాక్ష్యాల సాయంతో, ఆ రచన ఒక నిర్దిష్ట కళాకారునిదని నిర్ణయించడాన్ని ఈ పదం తెలియజేస్తుంది.

**Augsburg Renaissance** : ఆగ్స్‌బర్గ్ పునరుజ్జీవనం.

16వ శతాబ్ది ప్రారంభంలో జర్మనీలోని ఆగ్స్‌బర్గ్ నగరంలో చిత్ర, శిల్పకళలలో వచ్చిన మార్పు. హాన్స్‌బర్గ్ బర్క్‌మీర్

(జ్యేష్ఠ) అనేక కళాకారుని నాయకత్వంలో పలువురు కళాకారులు ఇటలీలోని పునరుజ్జీవన పద్ధతులను జర్మనీకి ఈ ఉద్యమము ద్వారా తీసుకొని వచ్చిరి. ఇటలీలోని వెనిస్ నగర కళాకారుల ప్రభావం ఈ ఉద్యమంపై ఉంది.

**au premier coup :** (చూ : *alla prima*)

**aureole :** *ప్రభామండలం; పరివేషం.*

దేవతా, మహాపురుష చిత్రాల వెనక భాగంలో చిత్రితమయ్యే కాంతిమండలం. ఇది ముఖ్యంగా మధ్యయుగ, పునరుజ్జీవన యుగ కళా సంప్రదాయాలలో కానవస్తుంది. బాదంకాయ ఆకారంలో ఉండే కాంతి చక్రం, మధ్యయుగపు క్రీస్తు, మేరీల చిత్రాలలో కనబడుతుంది. ఇటాలియన్ భాషలో బాదంకాయను మండోర్లా అంటారు అందువల్ల ఇటువంటి ప్రభామండలాన్ని సైతం వారు మండోర్లా *(Mandorla)* అని వ్యవహరించారు

**aureolin :** *ఆరియోలిన్.*

కోబాల్ట్ పసుపుకు పర్యాయ నామం.

**aurum musivum :** *అరం మూసివం; నాగస్వర్ణం.*

తగరంతో తయారై, భిత్తి చిత్రాలలో ఉపయోగించే బంగారు వర్ణం.

**authorities :** *ప్రామాణికులు; ప్రమాణ రచనలు.*

**auto lithography :** *స్వతశ్శిలా ముద్రణ; ఆద్యశిలా ముద్రణ.*

చేతితో కళాత్మకంగా ప్రతులు తీసే పద్ధతి. ఇది వ్యాపార పద్ధతిలో, వేలాది ప్రతులను తయారు చేయటానికి ఉపయోగించే శిలా ముద్రణ కన్న భిన్నమైనది. కొందరు కళాకారులు క్షయీకరణ పద్ధతినికూడ ఉపయోగించక, నేరుగా రంగులను, కావలసిన ఆకారాలలో శిలాఫలకాలపై వేసి ముద్రిస్తారు ఈ పద్ధతిలో కూర్చికా విన్యాసానికి రేఖా లావణ్యాలకు చోటుంటుంది

**automatism :** *స్వాచ్ఛంద వాదం.*

మనస్సును కేంద్రీకరించక యథాలాపంగా చిత్రరచన చేయటం అధివాస్తవిక కళలోను, చలచ్చిత్రణ *(actionpa inting)* లోను ఇది కానవస్తుంది.

**automatistes, les :** *స్వతశ్చారకులు.*

కెనడా దేశపు ఒక అతివాద అధివాస్తవిక బృందము పెట్టుకొన్న పేరు వీరి నాయకుడు పాల్-ఎమిలీ బోర్డో. ఇందు జీన్ పాల్ రియోపెల్లే, ఆల్బర్ట్ డూమోచెల్, ఫెర్నాండ్ లెడక్, జీన్-పాల్ మౌసే మొదలైనవారు సభ్యులుగా ఉండిరి. 1948లో వీరు తమ వాదాన్ని తెలిపే వివరణ పత్రాన్ని ఒకదానిని ప్రచురించారు. అందులో కళను, కెనడా దేశపు తక్కిన జీవిత రీతులను నిశితంగా వారు విమర్శించారు. 1951 దాక ఈ బృందం పనిచేసింది.

**automne, salons d' :** *ప్రౌఢ ప్రదర్శన.*

ఫ్రాన్సు దేశంలో ఒక కళావాద బృందం వారు సంవత్సరానికొకసారి ఇచ్చే ప్రదర్శనకు పేరు. ఇటువంటి సాంవత్సరిక ప్రదర్శనలలో మొట్టమొదటిది 1903 అక్టోబరులో జరిగింది. దీనిని వన్యవాది (ఫావీ) కళాకార బృందమును, సొసైటీ డి లా నేషనల్‌కు చెందిన కొందరు కళాకారులును కలిసి ఏర్పాటు చేశారు. మొదటి ప్రదర్శన, గగూ

యెన్ స్మారక ప్రదర్శనగా నిర్వహించబడి నది; తద్వారా ఆ ప్రముఖ కళాకారుని రచనా వైశిష్ట్యాన్ని యుపతరం గుర్తించ గలిగింది; తరవాత 1906లో జరిగిన ప్రదర్శనము సిజానే రచనలకు ఉద్దిష్టమైనది

**avant garde :** *పురోగామి; ప్రగతిసాధకుడు.*

ప్రస్తుతము వాడుకలో ఉన్న కళకూ, అభిరుచులకూ భిన్నంగా సృష్టించే నూతన కళాశైలికీ, అటువంటి శైలికి కారకులైన కళాకారులకూ ఉపయోగించే పదం. ఆవాంట్ గార్డే అనేది ఫ్రెంచి పదం ఈ పదము అతివాద కళాశైలులకు, అతివాద కళాకారులకు సైతం వర్తిస్తుంది.

**Avignon school :** *అవిగ్నాన సంప్రదాయం.*

క్రైస్తవ మతంలోని ఒకశాఖకు పీఠాధిపతి అయిన పోపు, కొన్ని రాజకీయ కారణాలవల్ల పీఠ కేంద్రమైన రోము నగరాన్ని వదలి, ఫ్రాన్సులోని అవిగ్నాన్ నగరంలో తలదాచుకొన్న కాలం (క్రీ శ. 1309-1377)లో, ఆ పీఠపు పోషణలో కొందరు కళాకారులు పని చేశారు. వారి కళపై ఇటలీ కళాకారుల శైలి చాల ప్రభావం నెరపింది. అంతట పోపు ఆ నగరాన్ని వదలి స్వస్థలానికి పోయిన తరువాత, అవిగ్నాన్ కేంద్రంగా ఒక కళా సంప్రదాయం పెంపొందింది ఇందులో ఇటలీ కళతో పాటుగ, ఉత్తర ఫ్లెమిష్ సంప్రదాయాలు కూడా చేరాయి. ఈ సంప్రదాయానికి చెందిన రచనలలో అత్యుత్తమమైన పీటా అనే దానిని లావ్రే మ్యూజియంలో నేడు కూడా చూడవచ్చు.

**avodire :** *ఔదీరం.*

ఆఫ్రికాలోని ఒకరకపు వృక్షంనుంచి లభించే కఠిన దారువు. ఇది తెలుపు మీరిన పసిమిరంగుతో నునుమెత్తని కాంతపము కలిగి ఉంటుంది. ఒకటి లేదా రెండంగుళాల మందం గల పలకచెక్కలుగా ఇది లభిస్తుంది. ఆలంకారిక కృషికి దీన్ని ఎక్కువగా ఉపయోగిస్తారు.

**axis** *అక్షరేఖ.*

1. ఆలేఖన రచనలో స్థల నిర్దేశానికి సాయపడే రేఖా విశేషం.

2. ఒక ఆంగ్ల త్రైమాసిక పత్రిక పేరు వివిక్త కళను సమర్థించటం దీని ధ్యేయం. దీని ప్రారంభ సంచిక 1935 లో వెలువడింది. దాని సంపాదకుడు మేఫానీ ఈవాన్స్, అతని సహాయకుడు జాన్ పైపర్. ఈ పత్రిక క్రమంగా 8 సంచికలను మాత్రమే వెలువరించ గలిగింది దాని ప్రోత్సాహ ఫలితంగా తొలి తటి వివిక్త కళా ప్రదర్శనను 1936లో నికొలెట్ గ్రే నిర్వహించెను. వివిక్త కళలోని సమకాలీనపు పోకడలను ఆంగ్లేయులకు పరిచితమైనవిగా చేయడంలో ఈ పత్రిక ఎక్కువ కృషి చేసింది

**axonometric :** *అక్ష మాత్రిక.*

**ayous :** *అయనం.*

ఆఫ్రికాలోని ఒకరకపు వృక్షమునుంచి లభించే దారు విశేషం. తెలుపువాక పసిమి రంగు కల ఈ కొయ్యలో దారరీతి నిర్దిష్టంగ కన్పిస్తుంది. ఇది చాల తేలికగా ఉంటుంది; అయితే గట్టితనంలో మిన్న. దీనిపై పని చేయటం చాలా సుకరం. దీనికే ఒబీచీ, సాంబా అనే పర్యాయ నామాలున్నాయి.

**Ayr stone :** *అయిర్ శిల.*

కఠినంగా, నునుపుగా ఉండే సానరాయి;

దీనిని శిల్పులు తమ పనిముట్లకు పదును పెట్టుకోవటానికీ, పాలరాతికి మెరుగు పెట్టటానికీ వాడుతారు. స్కాట్లండ్‌లోని అయిర్ నదీప్రాంతంలో ఇటువంటి శిల ఎక్కువగా లభించడంవల్ల అయిర్ శిల అనే వ్యవహారం దానికి ఏర్పడింది.

**azo colours** : *అజో వర్ణాలు*

కాంతివంతంగా ఉండి శాశ్వతత్వంగల కృత్రిమ వర్ణాలు. ముద్రణకు అనువైన సిరాను తయారు చేయటం, పరిశ్రమలకు ఉపయోగపడే రంగుల తయారీ మొదలైన వాటిలో వీటిని ఉపయోగిస్తారు.

**azure blue** : *ఆకాశ నీలిమ.*

**azure cobalt** : *అంబరావర్తిక;*

*అంబరావర్తి నీలిమ.*

ఆవర్తి నీలిమలలో ఒక ప్రత్యేకపు తరగతికి చెందిన రంగు. సాధారణపు ఆవర్తి నీలిమల కన్న ఒక ఛాయ తక్కువగా ఇది ఉంటుంది.

**azurite** : *నీల ధాతువు.*

స్వచ్ఛమై, గాఢ నీలవర్ణంతో స్ఫటికాలుగా తీరి ఉండే ఒక ఖనిజ విశేషం. దీని రాసాయనిక నామం కాపర్ కార్బొనేట్. రోమనుల కాలం నుంచీ కూడా చూర్ణ రూపంలో, ఇది పూత రంగులలో కలుపబడి వాడుకలో ఉంది. తరవాత కూడా కలల వర్ణములందును, సిరి రంగులలోను చిరస్థాయి నీలిమగా ఇది నిలవగలిగింది. కాని ఆధునిక కాలంలో చౌకగా లభించే నీలవర్ణాలను ఎన్నింటినో కనుక్కోవటం వల్లనూ, అవి ఆదరణను ఆర్జించటం వల్లనూ నీలధాతువు వాడుక తగ్గిపోయింది. తైల వర్ణంగా ఇది పనికిరాదు.

**azzurro oltremarino** : *సాగరోత్తర నీలిమ.*

వైదూర్య నీలిమకే ఇటాలియన్ భాషలో అజ్జుర్రో ఓల్ట్రేమారినో అనే పేరు ఉంది. దీని అర్థము 'సముద్రపు ఆవలనుంచి లభించే నీలిమ' అని. (చూ: *lapis lazuli*)



**Babylonian art** : *బేబిలోనియన్ కళ.*

మెసపొటేమియా (నేటి ఇరాక్)లో ప్రాచీన కాలంలో నెలకొన్న ఒక కళారూపం. మొదట్లో ఆ ప్రాంతంలో నాగరికత నెలకొల్పి పోషించిన సుమేరియన్ ప్రభువుల పాలనను అంతమొందించి, బేబిలోనియనలు క్రీ. పూ. 2800లో దేశాన్ని వశపరచుకొన్నారు. అయి నప్పటికీ పూర్వ సంస్కృతిని వారు స్వీయం చేసుకొని, తమ ప్రతిభతో దానికి కొత్త రూపాన్ని సంతరించారు కళాకారులకూ, చేతి పనివారలకూ భేదము ఆనాడు ఉండేది కాదు వారంతా 'ఈ' అనే దేవత అనుగ్రహం పొం దిన వారు అనే మన్నన వారికి ఉండేది. వాస్తు, శిల్ప, చిత్రలేఖనాలు ఆనాడు వర్ధి ల్లాయి. మట్టి ఇటుకలను - అందులోను ఎక్కు వగా పచ్చి ఇటుకలను . నిర్మాణాలకై విరివిగ వాడటం జరిగింది; శిల్పము ఉల్బణరీతిలో ఎక్కువగా సాగింది. 'ఉర్' నగర శిథిలాలలో లభించిన ఒక చిత్ర పట్టిక ఆనాటి చిత్ర కళా విదగ్ధతకు ఒక నిదర్శనం.

(చూ : *Assyrian art*)

**back ground** : *పశ్చాత్ భూమి; పృష్ఠ భూమి.*

చిత్రంలో వెనకగా కనుపించే దృశ్యం. రేఖా దృగ్గరితలో ఇది ఒక భాగం.

**background paper** : *పశ్చాత్ పత్రం.*

(చూ : *sign paper*)

**back - painting** : *పశ్చాచ్చిత్రణం*

గాజు ఫలకపు వెనక భాగంలో రంగు లతో చిత్రించటం. ఈ పద్ధతి యూరపులో 17, 18 శతాబ్దాలలో బహుళ ప్రచారాన్ని పొందింది. ఈ పద్ధతిలో మొదట ఒక కాగి తంపై చిత్రాన్ని ముద్రిస్తారు; తరవాత ఆ కాగితాన్ని నీటిలో నానబెట్టి పండనిస్తారు ఎండిన కాగితాన్ని, చిత్రం అద్దంపై అనే ట్లుగా తిరగవేసి, దానిపై కర్పూర తైలాన్ని పూస్తారు. కాగితం పూర్తిగా అద్దంపై అంటు కొన్న తర్వాత నీటిలో గుడ్డను తడిపి కాగి తంపైరుద్దుతారు. అప్పుడు ఆ కాగితం పొరలు పొరలుగా ఊడి చిత్రపు ఆకారం మాత్రం అద్దంపై మిగులుతుంది. ఆ ఆకారాలపై నీటి రంగులు పూసి, పైన వార్నిషు పూస్తారు. ఈ పద్ధతిని ఫొటోగ్రాఫులకు రంగులు వేయ టంలో కూడా 19వ శతాబ్దిలో అవలంబిం చారు

**backrest** : *అనుడు కర్ర.*

**badger blender** : *బేడ్జరు తూలిక.*

బేడ్జరు అనే ఒక రకపు జంతు రోమా లతో నిర్మితమైన కుంచె. దీన్ని విసనకర్ర



బేడ్జర్ తూలిక

ఆకారంలో తయారు చేస్తారు. రంగులను మృదువుగ కలపటానికి ఇది అనువుగా ఉంటుంది.

**badigeon** : *మక్కుడు.*

శిల్పాలలో లోపాలను సరిదిద్ది నింపటానికి ఉపయోగించే ముద్దగా ఉండే పదార్థం. దీన్ని సాధారణంగా సున్నపురాయి, ప్లాస్టరులతో తయారు చేస్తారు.

**bag wall : పొదువు గోడ.**

ఆటంలోని సెగ బయటకు వృథాగా పోకుండా ఉండటానికి నిరోధకంగా నిర్మించే గోడ.

**baked enamel : యనామెల్ కాల్పుపూత.**

ఎక్కువగా అడుగువలకు అవకాశం ఉండే వస్తువులపై పారిశ్రామిక రీతిలో పొందు పరిచే ఒక విధపు పూత. సంయోజిత పద్ధతిలో ప్రయోగ్యోే ఒక యక్షధూపాన్ని ఇందులో వాడుక చేస్తూ, కావలసిన వర్ణద్రవ్యాన్ని అందులో చేర్చటం జరుగు తుంది. ఈ పూతపని జరిగిన తరవాత ఆ వస్తువును ఒక పొయ్యిలో 250° ఫా నుంచి 350° ఫా. వరకు వేడి చేస్తారు. గాలిలో ఆరిన పూతకన్న, ఈ కాల్పుపూత చాలా మేలైనది. పింగాణి పైపూత కన్న ఇది వేరైనది.

**balance : తూకం**

(చూ : *Equilibrium*)

**baldachin or baldaquin : వితానం.**

సింహాసనాలకూ, యజ్ఞవేదికలకూ, పీఠాధి పతుల పీఠాలకూ పైన గొడుగులాగా అమరి ఉండే విశేషాలంకరణం. ఊరేగింపు సమయా లలో సైతం ఇటువంటివి కుర్చీలపైన అమర్చు కొనిపోవటం జరిగేది.

**ball clay : ముద్దమట్టి.**

ఒక విధపు పింగాణి మృత్తిక. దీనిలో సన్నని కణాలు ఉండటం వల్ల అతిమృదువుగా మలిచేందుకు ఉపయోగపడుతుంది. అందుచేత మెత్తగా ఉండటానికై వేరేవిధాల మృత్తికలతో గూడా దీన్ని కలుపుతారు.

**ballet : నృత్య నాటిక.**

**balsa : బాల్సా.**

తేలికదనానికి పేరొందిన కొయ్యజాతులలో ఇది ఒకటి; దక్షిణ అమెరికాలోని ఒక రకపు వృక్షం నుంచి లభిస్తుంది. మృదువుగానూ, సూక్ష్మ రంధ్ర యుతంగాను ఉండే ఈ కొయ్యను మలచటం చాలా సులభం. బరువు తక్కువ అయినప్పటికి దీనిలో మన్నిక ఎక్కువగా ఉంటుంది.

**balsam : బాల్సమ్ తైలం.**

కొన్ని వృక్ష జాతుల నుంచి తయారు చేసే కర్పూర తైలం వంటి, నూనె పదార్థం. ఇది వార్నీషును తయారు చేయటంలోనూ, యూన పీయ తైల చిత్రణంలోనూవివిధిగా ఉపయుక్తం మైంది.

**bamboo brush : వెదురు కుంచె.**

ప్రాచ్య దేశాలలో వాడే కుంచెలకు సాధా రణమైన పేరు. ఎండిన వెల్లు ముక్కలకు జంతువుల రోమాలను బిగించి ఈ కుంచెలను తయారు చేసేవారు. వీటికి వెదురుతో ఎటు వంటి సంబంధం లేకపోయినా ఆ పేరు వచ్చింది. ఇదిగాక అచ్చపు వెదురు కుంచె కూడా ఒకటి ఉంది. వెదురును ఒక వైపు సన్నగా చెక్కి చివరి భాగాన్ని మెత్తగా నలగ గొట్టి ఈ వెదురు కుంచెను తయారు చేసే వారు; కాని ఆ కుంచె ఎక్కువగా వాడకంలో లేదు.

**bamboo pen : వెదురు కలం.**

జపానులో వాడే ఒక రకపు కలం; వెదురు బద్ద చివరను సన్నగా పాళీలాగా చెక్కి దీన్ని తయారు చేసేవారు. దీన్ని అక్షర విన్యాస నానికీ, రేఖా రచనకూ జపానీయులు వాడే వారు.

**banana oil** : *అరటి నూనె; కదళీతైలం.*

అమిల్ అసిటేట్ అనే రసాయన ద్రవ్యానికి జనవ్యవహారంలో ఉన్న పేరు. లాక్షా ద్రవ్యాలను కరగించటానికి ఇది ఉపయోగపడుతుంది. దీని వాసన ఘాటుగా, అరటి వాసనను పోలి ఉంటుంది.

**banderole** : *చిత్రపట్టిక.*

మలచినటువంటి లేదా చిత్రించినటువంటి ఒక అలంకరణ విశేషం. ఇది రిబ్బనులాగా పొడుగ్గా, పీలికగా ఉంటుంది. ఒక్కొక్కప్పుడు దీనిపై ఒక వ్రాత కూడా ఉండటం చూస్తాం.

**banding wheel** : *తిరుగుడు బల్ల; తిరుగుడు చక్రం.*

గుండ్రంగా తిప్పటానికి అనువుగా ఉండే బల్ల వంటి సాధనం. దీన్ని పింగాణి సామానులపై అలంకరణ చేసేటప్పుడు ఉపయోగిస్తారు. పింగాణి సామానును బల్లపై ఉంచి, రంగులో ముంచిన కుంచెను చేతితో నిశ్చలంగా పట్టుకొని బల్లను గుండ్రంగా తిప్పుతారు. దీనివల్ల గుండ్రంగా రంగుపట్టీ ఏర్పడుతుంది.

**banker** : *పనిపాటి బల్ల*

మామూలుగా దృఢంగా పెద్దదిగా ఉండి, పని చేయటానికి ఉపయోగించే బల్ల. కొన్నిటి పైభాగము తిరగటానికి అనువుగా అమర్చబడి ఉంటుంది. దీనిమీద బొమ్మలను, రాతి లోను, శిల్పాలను చెక్కటంలో సౌలభ్యం ఎక్కువ.

**barbarian art in Europe** : *యూరపీయ బర్బర కళ*

యూరపులో, పాషాణశిలా యుగం ఆరంభమైనప్పటి నుంచి దాదాపు క్రీ. పూ. ఆరవ శతాబ్ది వరకు క్రమగతిలో వర్ధిల్లిన కళను, ఈ పదాన్ని ఉపయోగిస్తున్నారు. తూర్పు యూరపుకు సంబంధించినంత వరకు ఈ కళాయుగం రమారమి క్రీ. పూ 3000లతో మొదలు కాగా, పశ్చిమ యూరపులో క్రీ. పూ. 2000 దరిదాపులలో మొదలైనట్లు చారిత్రికుల అభిప్రాయం. కుమ్మరిసారెతో ఆ కాలపు వారికి పరిచయం లేకపోయినా తమ కౌశలాన్ని ఉపయోగించి వారు చక్కటి మట్టి శిల్పాలను, అలంకార సమన్వితాలైన మట్టి పాత్రలను నిర్మించారు; గోడలపై మట్టి రంగులతో చక్కని చిత్రాలను రూపొందించారు. ఈ కళలో మానవ రూపాలకన్నా సంఖ్యాధికతలో జంతు రూపాలు ఎక్కువగా కనపడతాయి. ఆ యుగపు ఉత్తర భాగంలో బ్రాంజి కూడా శిల్పాదులకై ఉపయోగంలోకి వచ్చింది.

**barberini faun** : *మత్త కిన్నరమూర్తి.*

గాఢ నిద్రావస్థలో పడిఉన్నట్లు శిల్పులు చలువరాతిలో మలచిన కిన్నరమూర్తి. ఈ మూర్తి ఇప్పుడు మ్యూనిచ నగరంలోని గ్లిప్టోతెక్ మ్యూజియంలో ఉంది. ఎంతగానో ఓజస్విత్వను ప్రకటించే దీని శైలి హెలెనీయ శైలికి సన్నిహితం.

**barbizon school** *బార్బిజాన్ వర్గం.*

1830, 1880ల ప్రాంతంలో, ఫ్రాన్సులోని బార్బిజాన్ గ్రామంలో నివసించి, ఒక పద్ధతిలో ప్రకృతి దృశ్యాల చిత్రణను సాగించిన ఫ్రెంచి కళాకారుల బృంద నామం. ప్రకృతి నుంచి నేరుగా ప్రకృతి దృశ్యాలను గ్రహించి చిత్రించటం వీళ్ళతోనే మొదలయింది. ఆ కాలం వరకు తక్కిన కళాకారులు స్టూడియోలలోనే, తమ ఊహపై ఆధారపడి

ప్రకృతి దృశ్య చిత్రణ సాగించేవారు. ప్రకృతి నుంచి నేరుగా చిత్రించటంలోనూ, అతిసహజంగా ప్రతి సృష్టి చేయటంలోనూ ఈ వర్గం అనుభూతివాదులకు మార్గదర్శకమైంది. ఈ వర్గానికి నాయకత్వం వహించినవారు థియోడోర్ రూసో (1812-67); చార్లెస్ ఫ్రాంతాయిస్ డాబినీ (1817-78); కేమిల్లీ కోరో (1793-1875). వీరిలో కడపటివాని ప్రకృతి దృశ్యాలలో, సహజత తక్కువ; వెలుగు మెరపణి ఎక్కువ కావటంవల్ల అవి పైవారికి విభిన్నంగా ఉంటాయి.

**bardiglio** : *చారల పాలరాయి.*

లేత నీలంగా, లేదా ముదురు బూడిద రంగగా ఉండి నల్లని చారలు అక్కడక్కడ ఉండే పాలరాయి. ఇది ఇటలీ దేశంలో లభిస్తుంది.

**baren** : *మర్దనిక.*

కొయ్యదిమ్మెపై నున్న లేఖనపు ముద్రను కాగితముపైకి గ్రహించుటలో వాడబడు ఒక పరికరము. నున్నగా, బల్లపరపుగా వర్తులముగనో లేదా అండ వృత్తాకారముగనో ఉండు చెక్క ఇది. దిమ్మెపై సిరా పూసి, కాగితమును దానిపైన పరచి, దానిపై భాగమును మర్దనికతో బాగుగ తట్టగా, కాగితముపై సరియైన ముద్ర లభిస్తుంది. తొలుత జపానున ఈ పరికరము వాడుకలోకి వచ్చింది. అపుడు దానిని, బంకపూసిన గట్టి అట్టతో జపానీయులు తయారు చేసేవారు: ఇపుడు కొయ్యతోను, నైలానుతోను తయారైనవి వాడుకలో ఉన్నవి.

**barium yellow** : *బేరియం పసిమి.*

కాంతి నిరోధకమై, వెలతెలపోతూ, పండిన అరటిపండు తొక్కలాగా ఉండే పసిమిరంగు గల వర్ణద్రవ్యం. దీని రాసాయనిక నామం బేరియం క్రోమేట్. స్ట్రాన్షియమ్ పసిమి కన్నా, బేరియం పసిమిలో ద్రావణీయత చాలా తక్కువ. అందు వల్ల, రంగులో ఈ రెండూ ఒకే తీరుగ ఉన్నా, కళాకారుల వర్ణంగా స్ట్రాన్షియమ్ పసిమికే ఎక్కువ మన్నన ఉంది. దీనికే బ్రిటనులో 'నిమ్మపండుపసిమి' (*lemon yellow*) అనే వ్యవహారం ఉంది.

**Baroque** : *బరోక్ శైలి.*

17వ శతాబ్దంలో యూరపులో అంతటా కళలలోను, వాస్తురీతులలోను వర్ధిల్లిన శైలి కొన్ని ప్రాంతాలలో ఈ శైలి 1750 వరకు ప్రచారంలో ఉండినది. ఇది నాటకీయ రమ్యత కలిగిన శక్తివంతమైన శైలి. సహజత, అలంకార యుక్తత, వివిధ కళల ప్రభావం ఇందులో మేళవించడంవల్ల ఇది ఒక గొప్ప శైలిగా భాసించింది.

దీని పరిశుద్ధ రూపము గియాన్‌లారెన్జో, బెర్నిని (1598-1680) ఫ్రాన్సిస్కో బోరోమిని (1599-1667)ల రచనలలో కనపడుతుంది. వారి రచనలు శిల్ప, వాస్తుకళల మేళవింపుతో కంటికి ఇంపుగా ఉంటాయి. ఈ శైలి ఇటలీలోని భిత్తి చిత్రాలలో - అందులోనూ ముఖ్యంగా భవనాలలోని లోకప్పు అలంకరణలో - భవన నిర్మాణ రీతిలో చేరి, రమ్యతను చేకూర్చింది. పెట్రో డా కోర్టోనా (1596-1669), గైనొన్ని లాన్‌ఫ్రాన్కో (1582-1647), గొర్సినో (1591-1666) ఈ శైలిలో ప్రసిద్ధులు.

చిత్రకారుడు కరవాగ్గియో (1573 - 1610)ను ఈ శైలికి ప్రారంభకుడని చెప్ప

వచ్చు. సాంప్రదాయిక ధార్మిక విషయాల చిత్రణలో సైతం అతడు ప్రదర్శించిన వాస్తవికత, వెలుగు నీడలను చూపటంలోని నాటకీయ రమ్యత, తదనంతరకాలపు రూబెన్స్, రెంబ్రాంట్, వెర్మియర్‌లను ఎక్కువగా ప్రభావితులను చేసినవి.వీటిలో రూబెన్స్ చిత్రాలు, క్రైస్తవ మత గాథలకున్ను గ్రీకు పౌరాణిక కథలకున్ను చెందినవి. రెంబ్రాంట్, వెర్మియర్, ఫ్రాన్జ్ హాల్స్‌ల చిత్రాలు సమకాలీన జీవితానికి చెందినవి బరోక్ శైలిలో పేరొందిన ఇతర ప్రముఖులు: వాన్‌డిక్, వెలాస్క్వెజ్.

**baryta water :** *బెరైటా జలం.*

బేరియం హైడ్రాక్సైడ్ తృప్త ద్రావణము. సున్నపు నీటికి బదులుగా, దీన్ని ప్లాస్టరుపై చల్లుతారు ఇట్లా చల్లటంవల్ల ప్లాస్టరు సంతప్తమై రంగులు వేయటం సులభమవుతుంది.

**barytes :** *ముగ్గురాయి.*

**basalt :** *బసాల్టుశిల, అగ్గిరాయి.*

ఇది లావాద్రవంవల్ల ఏర్పడ్డ కఠిన శిల. ప్రాచీన ఈజిప్టువాసులు భవనాల నిర్మాణానికి, శిల్పాలను చెక్కటానికీ దీనిని ఉపయోగించారు. ఇది నలుపు, ముదురు ఆకుపచ్చ, ముదురు గోధుమ రంగుల్లో లభిస్తుంది. ఇది దృఢంగాను, నునుపుగాను ఉండటాన్ని బట్టి పాత్రల నిర్మాణానికి కూడా దీన్ని వాడారు.

**Basalt ware or Basaltes ware :** *బసాల్ట్ సామగ్రి.*

1768 లో జోసయా వెడ్జ్‌వుడ్ అనే అతడు తయారుచేసిన నలుపురంగు పింగాణీ సామగ్రి. ఇది సహజమైన బసాల్ట్ శిలతో చేసిన దాని వలె కన్పిస్తుంది. దీనిపై నవ్యప్రామాణిక (నియోక్లాసికల్)సంప్రదాయ రీతిలో రూపాలు, తెలుపులో గాని వేరే వర్ణంలో గాని, కనపడతాయి.

**base [1] (column) :** *స్తంభవేదిక.*

**base [2] :** *ఉపాధి; ఆధారం.*

1. ఎటువంటి రాసాయనిక చర్యకు లోను గాని, వర్ణరహితమైన పొడి దీనిలో ఏ వర్ణం కలిసినా, ఆ వర్ణం నిలిచి, మార్పుపొందక ఉంటుంది పారదర్శకతను వర్ణాలలో కలిగించటానికి అల్యూమినా హైడ్రేటును, కాంత్యభేద్యత (*opacity*) ను వర్ణాలలో కలిగించటానికి బ్లాంక్ ఫిక్సె అనే పదార్థాన్ని ఉపాధులుగా వాడుతారు.

2. శిల్పంలో కూడా ఈ పదము శిల్పాన్ని నిలపటానికి ఉపయోగించే పీఠానికి వాడుతారు ఇది కేవలము ఆధారంగా ఉండటమే గాక, అనేకాలంకారాలతో, చక్కని ఆకారంలో ఉండి శిల్పసౌందర్యాన్ని ఇనుమడింపజేస్తుంది.

**bas-relief :** *అల్పోల్బణ*

( చూ . *Relief* )

**bassetaille :** *బాసెటెయిల్లి.*

లోహంపై ఎనామెల్‌ను వేయటానికి ఉపయోగించే ప్రక్రియ. ఈ ప్రక్రియను సాధారణంగా ఆభరణాల తయారీలో ఉపయోగిస్తారు. ముందుగా లోహాన్ని అల్పోల్బణంలో చెక్కి, రంగు ఎనామిల్‌ను నింపుతారు. ఒక్కొక్క రంగు పూర్తిగా ఆరి గట్టిపడిన తరవాత ఇంకొక రంగును నింపాల్సి ఉంటుంది. లేకపోతే ఒక రంగుతో ఇంకొక రంగు కలిసిపోతుంది. ఈ రంగులు రెండు మూడు పొరలు పట్టిన తరవాత వీటిని వేడి చేస్తారు.

**basic :** *ప్రాతిపదిక.*

**basin slant** : *వాలు వళ్లెం.*

**basso-rilievo** : *అలో్ప్రత్నత్తి*
(చూ **Relief**)

**bat** : *మృత్ఫలకం.*

పింగాణి వస్తువులను తయారు చేయటంలో ఉపయోగించే ఫలకం తెల్ల సుద్దమట్టితోగాని ప్లాస్టరుతో గాని దీన్ని తయారుచేస్తారు. తెల్ల సుద్దమట్టితో చేసినప్పుడు దీన్ని ఆవంలో కాల్చటం మంచిది. ప్లాస్టరుతో చేసినఫల కము, పింగాణి సామగ్రిలలో అనవసరంగా ఉండే చెమ్మను పీలుస్తుంది.

**Batesville marble** : *బేట్స్‌విల్లీ చలువరాయి.*

యు. స్టేట్స్‌లోని ఆర్‌కాన్సస్ రాష్ట్రంలో లభించే ఒక విధపు సున్నపురాయి అది ధూసరవర్ణంగానో లేదా మిగుడ రంగుగానో ఉంటుంది.

**batik** : *బతికా అద్దకం.*

వస్త్రాలపై జరిపే ఒక తీరు అద్దకపు పని. ఇండోనేసియాలోని సెలెబెశ్, జావా, మదుర దీవులలో ఇది చాలాకాలంనుంచీ వాడుకలో ఉండి అక్కడనుండి, తక్కిన దేశాలకుకూడా వ్యాపించింది. అద్దకము పడవలసిన అవసరం లేని వస్త్రభాగాలపై మైనపు పూతను ముందుగా పట్టించి, ఆ తరువాత వస్త్రాన్ని మొత్తంగా రంగులో ముంచటం దీనిలోని విశిష్టలక్షణం ఇట్లా మైనాన్ని పట్టించటం - మొదట్లో - కొన్ని వెదురు కలాల సాయంతో సాగేది. కాని 17వ శతాబ్దం మొదలుగ 'జంతింగ్' అనబడే రాగి పాత్రను ఒకదానిని దీనికోసం వాడుతున్నారు. ఈ పాత్రకు ఉండే నాళికల ద్వారా కరగిన మైనాన్ని గుడ్డపైకి కావలసిన రీతిలో ప్రసరింపజేస్తారు మొదట ఇటువంటి అద్దకానికి ఒకే ఒక రంగు ఉపయోగించేవారు కాని 18వ శతాబ్ది నుంచి బహువర్ణాలను వాడటం మామూలు అయింది.

**battle-piece** : *యుద్ధ చిత్రం.*

ప్రాచీన ఈజిప్టులోను, పశ్చిమ ఆసియా లోను చిత్రరచనలో, అంతగా ఎక్కువగా కాకపోయినా, కొంతవరకైన యుద్ధదృశ్యాలను చిత్రించటం ఉండేది. ఆయా రాజులను గురించిన చారిత్రక విషయ కథనానికి గాను చిత్రణనుఉపయోగిస్తూ అప్పటి కళాకారులు-సామంతులు కప్పములివ్వటం, బందీలను హాజరు పరచటం, వేటాడటం మొదలైన చిత్రాలను కొన్ని సమయాలలో చిత్రించారు. కాని వాటికి వారు ప్రముఖ స్థానాన్ని కల్పించలేదు కాదు. కాని అస్సీరియన్‌ల కాలంలో, పశ్చిమాసియాలో ఈ యుద్ధచిత్ర రచనకు అని తర ప్రాముఖ్యం వచ్చింది ఇందుకోసం తూలికా పర్ణాంనేకాక, రంగుల దిళ్లలనుసైతం ఆనాటి కళాకారులు వినియోగించారు. తర వాత గ్రీకులూ, రోమనులూ కూడా తమతమ విజయగాథల చిత్రణకై ఇటువంటి రచనలు చేపట్టారు.

**Bauhaus** : *బహౌస్ పాఠశాల.*

జర్మనీదేశంలో 1919-33 మధ్య ప్రవర్తిల్లిన పారిశ్రామిక కళాసంప్రదాయపు పాఠశాల.దీన్ని వాస్తుశాస్త్రజ్ఞుడు వాల్టర్ గ్రోపియస్ 1919లో ప్రవర్తింపజేశాడు. అతడు స్టాట్ లిచెస్ బహౌస్ (ప్రభుత్వ నిర్మాణ భవనం). అనే పేరుతో వివిధ కళలను, హస్తకళలను సంఘటితం చేశాడు. దీని ప్రారంభోద్దేశ ప్రకటనలో "మేము కళాకారులమనుకున్నా, చేతివని

వారికిన్నీ మధ్యగల తారతమ్యపు గోడలను తొలగిస్తాం. భవిష్యత్తులో వాస్తు, శిల్ప, చిత్రకళల సమన్వయానికి త్రికరణశుద్ధిగా కృషిచేస్తాం. స్ఫటిక స్వచ్ఛమైన ఈ నిర్మాణ భవనం భవిష్యత్తులో నూతన విశ్వాసానికి చిహ్నం అవుతుంది. దీనిని కోట్లాది పనివారి చేతులతో రూపొందిస్తాం'' అని ఉంది.

జర్మనీ అప్పట్లో యుద్ధరంగంలో పొందిన పరాజయమే ఇటువంటి చైతన్యానికి చారిత్రాత్మక సాంఘికకారణం, విభావనావాదుల పృథక్త్వ ధోరణులకు భిన్నంగా వీరు సుసంఘటిత ధోరణులనూ హేతుబద్ధాలూ, సునిశితాలూ అయిన నిర్మాణ పద్ధతులను చేపట్టారు. కళలలో ఇమిడి ఉన్న ఏకత్వాన్ని పునరుద్ధరించి ఆధునిక వాస్తుకళను, పారిశ్రామిక నాగరికతావిశ్వకతలకు అనుగుణంగా తీర్చి దిద్దడం ఈ సంప్రదాయపు ప్రత్యక్షోద్దేశం. ఈ సంప్రదాయం వారి అభిప్రాయాల ప్రకారం నిర్మాణ, అలంకార కళలు వేరేవేరేగా ఉండరాదు. ఈ సంప్రదాయపు పాఠశాల లలిత కళలు అభివృద్ధి చెందటానికి కారణమై, ఆధునాతన పద్ధతులకున్నూ, అభిప్రాయాలకున్నూ ఆలవాలమైంది ఇక్కడ సంస్కృతికి, కళలకు సంబంధించిన పరిశ్రమ ఎక్కువగా సాగింది.

ఇక్కడ సాగిన విద్యకు గ్రోపియస్‌తో పాటుగా ఫెనిన్‌జర్ (1919-33), పాల్ క్లీ (1920-29), ఓస్కార్ ష్లెమ్మర్ (1921-29), కాన్‌డిన్‌స్కీ (1922-32), లాస్‌జ్లో మొహోలీనేగి (1923-28) మహోపాధ్యాయులుగా పని చేశారు. గుడ్డలపై చిత్రణ, అద్దంపై చిత్రణ, సూత్రపాఠాలను క్లీ బోధించాడు. ఈ సూత్రాలను, తాను రచించిన పెడగాగికల్ స్కెచ్‌బుక్ అనే గ్రంథంలో పొందుపరచి 1925లో ఆయన ప్రకటించాడు. కాన్‌డిన్‌స్కీ సామాన్య సూత్రాలను బోధించినా, వివిక్త కళారూపాల రచనలో, నిర్మాణ చిత్రణలో ఎక్కువ శ్రద్ధ చూపించాడు. బహౌస్‌లో వీటి ప్రభావము ప్రబలంగా ఉన్నప్పటికీ, వీరి అభిప్రాయాలకంటే ఫెనిన్జర్, నాగీల అభిప్రాయాలే ఎక్కువ ఆదరణ పొందాయి. వీరిద్దరూ బహౌస్ సిద్ధాంతాలకు అనుగుణంగా లోహాలతోను, ప్లాస్టిక్‌తోను రూపాలను నిర్మించడంలోను, నాటక, నృత్య ఛాయా చిత్రణ, లిపి లేఖనాదుల్లోను తీవ్ర పరిణామాలకు కారణభూతులైనారు. బహౌస్ పాఠశాల సాగినంత కాలం ఫెనిన్జర్, నిర్మాణాత్మక సౌందర్య సూత్రాలను ఆచరణలో పెట్టాడు.

1929లో అభివృద్ధి నిరోధకుల ఒత్తిడి వలన బహౌస్ పాఠశాల డెస్సావ్‌కు మారింది. 1933 లో వాల్టర్ దాన్ని మూసివేసాడు. గ్రోపియస్ 1928లో బహౌస్‌ను వదలి పెట్టాడు. ఫెనింజర్ 1937లో అమెరికాలో స్థిర పడ్డాడు. అక్కడ వారిద్దరి ప్రభావము పాటి కళాకారులపైన ప్రసరించింది. నాగీ, పై ఇద్దరినీ అమెరికాలో కలుసుకొని బహౌస్ పునరుద్ధరణ యత్నంగా చికాగోలో నవ బహౌస్‌ను స్థాపించాడు. ఈ కళకు సంబంధించిన సింహావలోకన ప్రదర్శనలు 1938న న్యూయార్క్‌లోను, 1950న మ్యూనిచ్‌లోను జరిగాయి.

**bayeux tapestry : బేయో చిత్రాంశుకం.**

ఆంగ్లోసాక్సన్ కళా వైభవానికి మేలి లక్ష్యంగా లెక్కకెక్కిన ఒక కళాఖండం. ఇది నిజానికి బుటేదారీ పనితనపు వస్త్రమే

అయినా, చిత్రాంశకంగా పరిగణితమవుతున్నది. ఇది క్రీ. శ. 1066, 1077 మధ్య కాలంలో కేంటర్‌బరీలో వినిర్మితం. దీని పొడవు 230 అడుగులు; వెడల్పు 19అం లు. దీనిలో 79 దృశ్యాలు రూపించటం జరిగింది. నార్మనులు ఇంగ్లండును జయించిన గాథకు సంబంధించినవి ఈ దృశ్యాలు; దీనిలోనే లాటిన్ భాషలో ఒక వివరణ ఉంది.

**bead and reel** : *పూస కదురు చెక్కడు.*

పూసలూ, మధ్యన కదురు గొట్టాలున్నూ అమరినట్లు సాగించిన చెక్కడు పని లేదా అలంకరణం.

**bead molding** : *పూస చెక్కడు.*

వర్తులంగానూ దీర్ఘవర్తులంగానూ – దారాన గుచ్చిన పూసలవలె – మలచిన అలంకరణ విశేషం.



పూస చెక్కడు (ఎగువన);
పూసకదురు చెక్కడు (దిగువన).

**beak molding** : *వంక చెక్కడు.*

గద్దముక్కు ఆకారంలో వంపుగా ఉండి, పక్కనుంచి చూసినప్పుడు కొనదేలిన విధంగా ఉండే చెక్కడం. సాధారణంగా స్తంభాల పైనా, గోడల చూరుల పైనా ఇటువంటి వాటిని చెక్కుతారు.



వంక చెక్కడు

**beam-of-light** : *కాంతి పుంజం.*

**beauty** : *సౌందర్యం; అందం.*

**Beaux-Arts, Eccole des** : *బో ఆర్ట్స్ ఎకోల్ దె.*

పారిస్‌లోని ఒక సుప్రసిద్ధ కళాబోధన శాల.

**beeswax** : *తేనెమైనం; మధూచ్ఛిష్టం.*

**Belgian black** : *బెల్జియన్ చంద్రశిల.*

బెల్జియంలో లభించే సాంద్రమూ, కఠినమూ అయిన ఒక విధపు నల్లని చలువరాయి. తక్కిన నల్లచలువ రాళ్ల కన్నా మెరుపుకు ఎక్కువగా ఇది పనికివస్తుంది.

**Bengal cutch** : *వంగ కాచిక.*

(చూ : *cutch*)

**Benin art** : *బెనీయ కళారీతి.*

యూరపీయుల దృష్టిని విస్తృతముగా ఆకర్షించిన ప్రప్రథమపు ఒక ఆఫ్రికన్ కళారీతి. ప్రస్తుతపు నైగీరియా దేశమందలి ఒక ప్రాచీన నగరము 'బెనిన్'లోని ఆరాధన మందిరములను రాజమందిరములను అ[illegible]

యించి, ఆ కళారీతి కాంస్యమునను, దంతమునను, కొయ్యలోను వర్ధిల్లినది. ఆ ఆరాధన మందిరములలో నరబలియు, పశుబలియు విరివిగ జరిగెడివి వానిని ఆపుటకై 1897లో బ్రిటిష్ ప్రభుత్వము ఒక సైన్యమును పంపగా, అది అచటి ప్రజల తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కొని, ఆ పట్టణమును వశపరచుకొనినది. ఆ సమయమున బ్రిటిష్ సైనికులు అచటి కళా సంపదను దోచుకొని, యూరపు నందలి వివిధ దేశములలో విక్రయించిరి. ఇప్పుడు అందలి విశేషభాగము బెర్లిన్ మ్యూజియమున కలదు. తక్కినది వైయక్తిక కళాఖండ భాండారములలో చెదరి యున్నది ఇప్పటి నైగీరియా ప్రభుత్వము అందు ఉత్తమములగు వానిని కొన్నింటిని కొనుగోలు చేసి స్వదేశమునకు చేర్చినది.

వేనీయ కళాఖండము లో కొన్ని అత్యుత్తమ స్థాయికి చెందినవి కలవు. కంచు పోతలలో మధూచ్ఛిష్ట విధానముతో నీగ్రోలకు 16వ శతాబ్దికి పూర్వమే పరిచితి కలదనియు దంతమున జిలుగు పనితనములో అచటి శిల్పులు కుశలులనియు అవి తెల్పుచున్నవి.

**bent gouge, bent chisel** : *వంక ఉలి.*

కొయ్యను చెక్కే ఒక విధమైన ఉలి. దీని చివర చంచాలాగా వంపుగా ఉండడంవల్ల సాధారణపు ఉలికన్నా లోతుగా చెక్కగలదు.

**bentonite** : *బూడిద మట్టి.*

అగ్నిపర్వతాల బూడిద నుంచి ఏర్పడే అతిమృదువైన మట్టి పింగాణిమట్టి యొక్క మెత్తదనాన్ని పెంచటానికి దీన్ని వాడుతారు. సుద్దమట్టి కన్నా ఇది నాలుగురెట్లు మృదువైంది. వర్ణద్రవ్యాల తయారీకికూడా దీన్ని వాడవచ్చు.

**benzol black** : *బెంజోల్ నల్లరంగు.*

కర్బనపు నలుపు వర్ణాలలో నీలివర్ణం కలిసిన అతిగాఢమైన నలుపు రంగు.

**Berlin blue** · *బెర్లిన్ నీలం.*

ప్రషియన్ నీలానికి ఇంకో పేరు

**bianco sangiovanni** : *సెన్నినీ తెలుపు.*

కాల్షియమ్ హైడ్రాక్సైడును కాల్షియమ్ కార్బొనేట్‌తో కలిపినప్పుడు ఏర్పడే తెలుపు రంగు దీన్ని ఇప్పుడు కూడా భిత్తిచిత్రాలకు వాడుతున్నారు సున్నపు గళ్లను చిన్నముక్కలుగా చేసి, మసక పడని చోట, గాలిమాత్రం తగిలేటట్టు కొన్నినెలలు ఉంచితే. ఇది తయారవుతుంది ఈ రంగును ప్రవర్తిల్ల జేసినవాడు సెన్నినో సెన్నిని అనే ఇటలీ వాసి.

**Bible paper** : *బైబిల్ కాగితం.*

ఇండియా కాగితానికే మరొక పేరు.

**Biblia pauperum** : *విశదిత బైబిల్; బిబ్లియా పాపరమ్.*

మధ్యయుగములందు క్రైస్తవ మత ప్రతీకల వివరణకై రూపొందింపబడిన, తొట్టతొలి తపి ప్రామాణిక గ్రంథము. క్రీస్తుయొక్క జీవితమునందలి ముఖ్యవిశేషములు ఓల్డ్ టెస్టమెంట్‌లోనే ముందుగ సూచితములైనవనుట ఇందు చిత్రసహితముగ విశదీకరించబడినది. దక్షిణ జర్మనీలో 18వ శతాబ్ది ఉత్తరార్ధమున రూపొందింపబడిన ఈ గ్రంథము కొయ్యదిమ్మల (బ్లాక్) పద్ధతిలో ముద్రితము. ఇందు 40 ఖండములు కలవు. ఒక్కొక్క ఖండమున దానికి ఇరువైపుల రెండు చిన్న చిత్రములును, అంశములతో సంబంధించి ఓల్డ్ టెస్టె

మెంట్‌లో కనసగు భవిష్యత్ కథనములను తెలియజేసే నాలుగు ఉల్లేఖనములును కన నగును. తరువాతి కాలమున ఉత్తరమధ్య యుగమున ఇందలి చిత్రముల అనుకరణ విరివిగ శిల్పము లందును, చిత్రాంతకము లందును, విలిప్త కాచములందును, సారణిక చిత్రములందును కొనసాగినది.

**bibelot :** *చిత్ర మండనం.*

**bice :** *బైస్.*

జర్మనీలోని బ్రెమన్‌లో తయారైవచ్చే నీలం, ఆకుపచ్చ రంగులకు బ్రెమెన్ నీలం, బ్రెమెన్ ఆకుపచ్చ అను పేర్లు ఉండేవి. వాటినే కాలక్రమమేణా నీలంబైస్, ఆకుపచ్చ బైస్ అని వ్యవహరించటం పరిపాటి అయింది. ఆకుపచ్చ బైస్‌ను ఇప్పటికిన్నీ నీటివర్ణంగా వాడుతున్నారు.

**Biedermeier :** *బీదర్‌మీర్.*

1820న మొదలై ఆ శతాబ్దపు ఏభైలలో కూడా కొనసాగిన జర్మన్ కళారీతికిన్నీ, గృహోపకరణ రూపకల్పనారీతికిన్నీ వ్యంగ్య రీతిలో వాడుకకు వచ్చిన ఒక నామం. ఫ్రెంచి సామ్రాజ్యపు కళాశైలిని ఊహాశూన్యంగా అనుకరించి, ఉద్దేశపూర్వకంగా క్లుప్తీకరించ టంవల్ల ఆ కళారీతులు హాస్య పాత్రాలైనవి. ఈ రీతులలో గ్రామీణుల జీవితాన్ని తెలిపే దృశ్యాలు ముఖ్యంగా కానవస్తాయి. డూసెల్ డార్ఫ్ పాఠశాల ఈ కళారీతులకు కేంద్రంగా ప్రవర్తిల్లింది.

**billowy :** *ఊర్మిమయ.*

**billowing :** *తరంగిత.*

**binder :** *బంధకం; సంలగ్నకం.*

వర్ణద్రవ్యంలో ఉండే జిగురుగల పదార్థం. దీనివల్ల వర్ణద్రవ్య కణాలు ఒకదానితో ఇంకొకటి చక్కగా కలిసి, చిత్రంలో గట్టిగా అతుక్కొంటాయి. పొశిరంగులలోను (సుద్ద రంగులలోను), సిరాలలోను, పింగాణీ సామానులు మెరుపు పెట్టటంలోను వాడే బంకకూ ఈ పేరు ఉపయోగిస్తారు

**Biomorphic form :** *జీవవికృతి.*

జంతు వృక్ష ఆకారాలను సూచించే వివిక్త కళారూపం. ప్రఖ్యాత శిల్పి, చిత్రకారుడూ అయిన హాన్స్ ఆర్ప్ (1887-1966) ఇటువంటి రూపాలను చాలా సృష్టించాడు.

**birch :** *భూర్జదారువు.*

వృక్ష ప్రపంచంలో బెతూలా కుటుంబానికి చెందిన చెట్లలో దేనినుంచి అయినా లభించే కఠిన దారువుకు ఉపయోగించే సామాన్య నామం. ఇది గట్టిగా ఉండి, సున్నిక కలిగి చౌకగ లభిస్తుంది. దీని నుంచి తయారయ్యే పొర చెక్కలు *(plywood boards)* చిత్ర రచనకు ఫలకాలుగా ఉపయోగపడతాయి.

**birds eye :** *కన్నునుడి.*

కొయ్యలోనూ, రాతిలోనూ ప్రకృతి సహజంగా వచ్చే సుడులవంటి గీతలు.

**bird's-eye view :** *విహంగ దృష్టిగతి; విహంగ వమీక్ష.*

చిత్రించాలనుకున్న దానినంతటిని, ఆకాశం ఎగువనుంచి సమగ్రంగ చూసినప్పుడు కనవడే రీతిలో చిత్రించిన దృశ్యం. ఇటువంటి చిత్రాలలో భూమ్యాకాశాలను కలిపే రేఖ చిత్రపు పైభాగంలో గాని, చిత్రాన్ని దాటి

గాని – ఉంటుంది. ఇటువంటి చిత్రరచనను విశాల దృశ్యాలు, చారిత్రక చిత్రాలు, యుద్ధ చిత్రాలు విస్తరంగా చూపేటప్పుడు ఉప యోగిస్తారు.

**biscuit :** *ముడి పింగాణీ.*

కాల్చి ఇంకా మెరుగుపెట్టని పింగాణీ పాత్ర దీన్నే బిస్క్ అని కూడా అంటారు.

**biscuit mold :** *పింగాణీ మూస.*

పింగాణీ పాత్రలు తయారు చేయటంలో వాడే మూస దీన్ని తక్కువ వేడిగల ఆవంలో కాల్చి, అంతగా మెరుగు పెట్టకుండా ఉన్నందు వల్ల మళ్ళీ మళ్ళీ వాడటానికి ఉపయోగపడుతుంది.

**bishop's half length :** *బిషప్ అర నిలువు.*

(చూ : *canvas Sizes, portrait*)

**bishop's length :** *బిషప్ నిండు నిలువు.*

(చూ : *canvas sizes; portrait*)

**bishop's whole length :** *బిషప్ నిలువు.*

(చూ : *canvas sizes, portrait*)

**bismuth white :** *బిస్మత్ తెలుపు.*

19వ శతాబ్ది మొదటి దశాబ్దాలలో, తెల్ల సీసానికి బదులుగా విరివిగా వాడుకలో ఉన్నటువంటి ఒక విధపు తెలుపురంగు. తెల్లసీసమంతగా ఇది విషమయం కానందు వల్ల ఆనాడు దీనికి వ్యాప్తి లభించింది. కాని నాగశ్వేతపు ఉత్పత్తి కాలక్రమంలో విరివిగా సాధ్యమైనందువల్ల బిస్మత్ తెలుపు వాడుక అంతరించి, నాగశ్వేతము ఆ స్థానాన్ని ఆక్ర మించింది.

**bisque :** *ముడిబొమ్మ.*

1. (చూ : *biscuit*)

2. ఈ పదాన్ని మెరుగుపెట్టని పింగాణీ బొమ్మకు వాడతారు. ఇటువంటి బొమ్మలు చాలా నాజూకుగా ఉంటాయి.

**bisque fire :** *తొలి ఆవం.*

పింగాణీ వస్తువులను మొట్ట మొదటిసారిగా కాల్చటం. తరవాత మెరుగురాపటానికోసం వాటిని ఎక్కువ ఉష్ణంలో కాలుస్తారు.

**bistre :** *తారు గోధుమరంగు.*

భూర్జజాతికి చెందిన బీచి కర్రను కాల్చగా వచ్చిన తారువంటి నల్లటి మసి నుంచి తయా రయ్యే గోధుమ రంగు దీనిని 14-19 శతా బ్దాల మధ్య నీటి వర్ణ చిత్రాలలో తరచుగా ఉపయోగించారు ఈ రంగు నీటిలో ఉన్న ప్పుడు చాలమన్నిక కరిగి ఉంటుంది; కాని సూర్యరశ్మి తగిలితే త్వరగా వెలిసిపోతుంది. ఏకవర్ణ చిత్రాలలో సెపియాలాగా దీన్నికూడా తరచుగా వాడుకచేసేవారు. దీనివల్ల చక్కని ఛాయాంతరాలను సృష్టించవచ్చు సెపియాతో పోల్చి చూసినప్పుడు ఇందులో ఎక్కువ శీతలత్వం, తక్కువ ఎరుపుదనం కనిపిస్తాయి. సెపియాకూ దీనికీ మధ్యగల భేదము ముడి అంబరు, కాల్చిన అంబరులకు మధ్య ఉండే భేదం వంటిది.

**biting :** *దంశనం.*

ఆమ్లంలో లోహఫలకాన్ని ఉంచినప్పుడు ఆమ్లం ఆ లోహఫలకాన్ని తినివేయటం. ఇటు వంటి ఆమ్లాన్ని తయారుచేయటం, దానిశక్తి, దాని ఉష్ణోగ్రత, దాన్ని లోహఫలకంపై ఉప యోగించే నేర్పు - అనే వాటిపై ఫలకంలో రూపొందే చిత్రం ఛాయాకు రేఖల ఆకారం, మార్దవం ఆధారపడి ఉంటాయి. ఈ ఆమ్లం

అంతర్వాహినిగా లోహాన్ని తినివేయగలదు. అందువల్ల ఫలకంలో రేఖలు సరిగా ఉన్నా, లోపల గుల్ల ఏర్పడే అవకాశం ఉంది. ఇటు వంటి క్రియను ఆపటానికి నత్రికామ్లంలో ఫెర్రిక్ ఆమ్లాన్ని కలపటం ఉంది. ఆమ్లం ఈ విధంగా కొరికివేయటాన్ని అదుపులో పెట్టటానికి ఆమ్ల స్వభావాన్ని మార్చటం, లోహఫలకాన్ని అవసరమైనంత కాలంవరకే ఆమ్లంలో ఉంచటం ఆవశ్యకం. ఫలకాన్ని అప్పుడప్పుడు ఎత్తిచూస్తూ, రేఖ కావలసిన రీతిలో ఉన్న చోట ఆమ్ల ప్రయోగాన్ని ఆపి, లేకపోతే మళ్ళీ కావలసినంత వరకు ఆమ్ల ప్రయోగాన్ని జరుపుతూ ఉండాలి.

**bitumen** : *శైల నిర్యాసం.*

తారు, డాంబరు వర్గానికి సామాన్య నామం. దీనినుంచి ఆస్ఫాల్టమ్ అనేదాన్ని శైల వర్ణానికిగాను ప్రత్యేకంగా తయారు చేస్తారు

**Bizen ware** : *బిజెన్ సామగ్రి.*

నిత్యం వాడుకునే జపాన్ పింగాణి సామగ్రి; బిజెన్ రాష్ట్రంలోని ఇంబ్రే అనేచోట 14వ శతాబ్ది నుంచీ తయారవుతున్నది ఇది బూడిద రంగుగా గాని ముదురు గోధుమ రంగుగాని ఉంటుంది. ఒక్కొక్కప్పుడు దీనిలో ఎరుపు వాకగాగాని తేయాకు పచ్చగాగాని చారలు ఏర్పడుతాయి. బట్టీలో కాల్చేటప్పుడు ఆకస్మికంగా వచ్చే మార్పులవల్ల ఇటువంటి చారలు ఏర్పడతాయి.

**black-and-gold marble** : *కృష్ణ స్వర్ణ చంద్రశిల.*

ఇది ఇటలీదేశపు చంద్రకాంత శిల. దీనిలో అత్యుత్తమమైంది కారు నలుపుగా ఉండి, దానిపై ఒక క్రమరీతిలో బంగారువాక గీతలు ఉంటాయి తక్కువ నాణ్యతగల శిల ముదురు బూడిద రంగుగా గానీ, ముదురు గోధుమ రంగుగా గానీ ఉండి దానిలో బంగారు చారలు గజిబిజిగా ఉంటాయి. ఈ శిలలలో ఉత్తమమైనదానిని పోర్టోశిల లేదా పోర్టార్ శిల అని కూడా అంటారు స్పెజియా సింధుశాఖలోని పామేరియా ద్వీపంలోను, పోర్టో వెనిరులోను ఈ రాయి తవ్వకం ద్వారా లభిస్తుంది.

**black chalk** : *నల్ల సుద్ద.*

నల్లగానో, లేదా ధూసరపు నలుపుగానో భూమినుంచి లభించే ఒక విధపు సుద్ద దీనిలో కర్బనం లేదా నూనెరాయి చేరి ఉంటాయి. ఇటికలను తయారు చేయటానికి, కొన్ని సందర్భాలలో దీన్ని అరుదుగా వినియోగిస్తారు.

**black-figured pottey** : *అసిత మూర్తిక కౌశలం; నల్లబొమ్మల మట్టి సామగ్రి.*

ప్రాచీన గ్రీకుల కాలపు మట్టి సామగ్రి. దీనిపై నల్లని రేఖలతో అలంకరణ చిత్రాలను రచించేవారు క్రీ పూ. 6వ శతాబ్దిలో ఏథెన్సు



అసిత మూర్తిక కౌశలం
(క్రీ పూ. 550)

ప్రాంతంలో ఈ మట్టి సామగ్రి ప్రచారంలో ఉండేది. దీనికంటె ఎక్కువ నేర్పుతో తయారు

చేసిన ఎర్రబొమ్మల మట్టి సామగ్రి దీని స్థానాన్ని తరవాత ఆక్రమించింది.

**black iron oxide :** *నల్లభస్మం*

సహజ సిద్ధంగా భూమిలో లభించే ఒక వర్ణ ద్రవ్యం. ఇది నల్లని రంగుగల ఇనుప భస్మం. అయస్కాంత ధర్మం దీనిలో వ్యక్తమవుతుంది. అంతిమ్పంగా గోధుమవాక రంగును ప్రదర్శించే ఈ వర్ణద్రవ్యం నిస్సారహితమై, సులభంగా చెమ్మగిల్లుతుంది. అయినా గరుకుదనం దీనిలో యెక్కువగా ఉండటంవల్ల చిత్రకారులకు ఇది పనికిరాదు.

**black japan :** *నల్ల జాపాన్.*

(చూ : *japan*)

**black letter-hand, black letter type**

(చూ *Gothic*)

**black oil :** *కృష్ణ తైలం.*

పట్టెంత తెల్లసీసాన్ని (*white lead*) కలిపి మరగ గాచిన అవిసె నూనె.

**black oxide of cobalt .** *కోబాల్ట్ భస్మం.*

ఇది నల్లని ఇనుపతుప్పును పోలి ఉంటుంది. దీన్ని రంగుగా ఉపయోగించటం లేదు దీన్ని కోబాల్టు నలుపు అనికూడా అంటారు. పింగాణి సామానులను మెరుగు పెట్టటంలో నీలిరంగును తేవడానికి దీన్ని ఉపయోగిస్తారు.

**black oxide of manganese :** *మాంగనీస్ నల్ల భస్మం.*

సహజసిద్ధంగా లభించేఒక వర్ణద్రవ్య విశేషం. దీని రాసాయనిక నామం మాంగనీస్ డయాక్సైడ్. శోషకములను శోషకతైలాలను తయారు చేయటానికి ముడి వస్తువుగా దీన్ని ఉపయోగిస్తారు. ప్రాచీనులు దీనిని ఒక వర్ణద్రవ్యంగానే వాడి ఉండటం యథార్థమే అయినా ఈ కాలంలో పూతరంగులలో దీని చూర్ణాన్ని వాడటంలేదు. రాసాయనిక రీతిలో కృత్రిమంగా తయారుచేసిన మాంగనీస్ నలుపు (*manganese black*) అనేది దీనికి బదులుగా వాడుకలోకి వచ్చింది.

**black pigments :** *నల్లని వర్ణద్రవ్యాలు.*

ఈ దిగువ పేర్కొన్న నల్లని వర్ణద్రవ్యాలు తైలప్రలేపాలలో వాడదగినవిగా ప్రామాణికంగా పరిగణనను పొందాయి; ఆ విధంగానే గాక సాంకేతిక చిత్రణలోను అక్లిన్న చిత్రణా ప్రక్రియలలోను కూడా వాడదగినవిగ కూడా వాటికి పరిగణన లభించింది. అవి: దీపపు మసి, దంతపు మసి, మార్స్ నలుపు.

**black watercolour :** *సూమీ రంగు.*

చిత్ర రచనకు ఉపయోగించే జపాన్‌దేశపు నలుపు సిరా రంగు. దీన్ని చిత్ర రచనకు ఉపయోగిస్తారు. సూమీ అనేది దీని జపానీయ నామం

**bladder :** *వర్ణ భస్త్రి; రంగుల తిత్తి.*

తైల వర్ణాలను కలిపి నిలవచేసి ఉంచే సంచి. దీన్ని తోలుతో తయారు చేసేవారు. ముద్దగా కలిపిన రంగును ఆ సంచిలో వేసి, మూతిని గట్టిగా బిగిస్తారు. క్రింది భాగంలో సన్నని బెజ్జంవేసి, సంచిని గట్టిగా వత్తినపుడు కావలసినంతగా రంగు ఇవతలకు వచ్చేది. రంగు అవసరం లేనప్పుడు ఆ బెజ్జానికి సరిపడే బిరడాను పెట్టేవారు. ఇది క్రీ.శ.1850 ప్రాంతం నుంచి, ఉపయోగంలోకి వచ్చింది. అంతకు పూర్వం, ఎప్పుడు కావాలంటే అప్పుడు మాత్రమే రంగులను నూరుకొని ఉపయోగించేవారు. 18వ శతాబ్దిలో బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీలలోను 19వ శతాబ్దిలో

అమెరికాలోను రంగుల వ్యాపారస్తులు, ఇటు వంటి సంచీలను తయారుచేసి, రంగులు, నింపి అమ్మటం ప్రారంభించారు ఈసంచు లలో రంగును కొన్ని నెలలకు మించి నిల్వ ఉంచడం సాధ్యమయ్యేది కాదు 1886లో సిరంజి (పిచికారి) వంటి సాధనం వాడు కలోకి రావటం వల్ల ఈసంచులు మూల బడ్డాయి. కాని 1880లో వత్తుకు గొట్టాలు *(collapsible tubes)* వాడుకలోకి రావ టంతో ఆ సంచులతో పాటు సిరంజి కూడా వాడుక లోంచి అంతరించింది.

**bladder green** : *భస్త్రి హరితం.*

పసరురంగు (*sap green*)కు 19వ శతా బ్దిలో వ్యవహార నామం.

**blade** : *వాదర.*

**blanc d' argent** : *బ్లాంక్ డి అర్ జెంట్*

రజత శ్వేతానికి ఫ్రెంచి నామం కళా కారులు వాడే మేలిరకపు తెల్లసీసపు రంగు.

**blanc fixe** : *వివర్ణోపాధి; శ్వేతోపాధి; స్థిరశ్వేతం.*

బేరియం సల్ఫేటు పైన రసాయనిక చర్య వల్ల రూపొందించ జేసిన ఒక కాంత్యభేద వర్ణ ద్రవ్యం. ఇది ఇతర వర్ణద్రవ్యాల కలయిక వల్ల మార్పు చెందదు. అందువల్ల రంజక(చూ) వర్ణాలలో దీన్ని ఉపాధిగా వాడతారు పార దర్శకం గాని నీటి వర్ణాలలో దీన్ని కలువు తారు. 1885లో ఫ్రాన్స్ దేశంలో యఫ్. కుల్‌హన్ అనే వ్యక్తి దీన్ని కనిపెట్టాడు ముగ్గురాయికన్నా, ఇది చాలా మృదువుగా ఉంటుంది. ఎనామెల్ తెలుపు, శాశ్వతపు తెలుపు అనికూడా దీనికి పేర్లున్నాయి.

**blanket** : *ఉన్ని బొంత.*

ఎచ్చింగ్ ఫలకాన్ని ముద్రించేటప్పుడు యంత్రపు రోలరుకూ, ముద్రించే కాగితానికీ మధ్య ఉంచే ఉన్నితో చేసిన బొంత. దీని వల్ల కాగితానికిన్నీ ఫలకానికిన్నీ మధ్య కలిగే వత్తిడి సమానంగా ఉంటుంది, కాగితపు అంచులు చిరిగి పోకుండా ఇది తోడ్పడు తుంది.

**Blaue Reiter, der** : *'నీలాశ్వికో' ఉద్యమం.*

జర్మనీ దేశంలో జన్మించిన ఒక విధపు సారాంశ ప్రకటనా వాదోద్యమం (వివిక్త విభావనా వాదోద్యమం). కాండిన్‌స్కీ రచిం చిన 'నీలాశ్వికుడు' అనే చిత్రం వల్ల ఈ ఉద్యమానికి ఈ పేరు వచ్చింది. ఈ శతాబ్ది ఆరంభంలో కళోద్యమాలకు, పుట్టి ల్లుగా ఉన్న మ్యూనిచ్‌లో 1911న ఈ ఉద్యమం, పై చిత్రంతో ప్రారంభమైంది. ఫ్రాంజ్ మార్క్, పాల్ క్లీ, ఆగస్ట్ మేకే ఈ ఉద్యమంలో సుప్రసిద్ధులు ఆ కాలపు పురోగామి ఉద్యమం ఇదే అని చెప్పవచ్చు. బ్రూకీ ఉద్యమంతో కలిసి, ఇది నవ్యకళపై చాల ప్రభావాన్ని నెరపింది. ఈ ఉద్యమ కర్తల చిత్రాల ప్రథమ ప్రదర్శన 1911, డిసెంబరు 18న 43 చిత్రాలతో ప్రారంభమైనది. దీనిలో రూసో, డెలానే, ఎప్ స్టీన్, కప్లార్, మేకే, గ్లోచీ, స్కోన్ బెర్గ్, డేవిడ్, బర్లుక్, నియుస్లే, మ్యూన్టర్, కాన్‌డిన్‌స్కీ, మార్క్, కాంపెండ్ నాక్‌ల చిత్రాలు ఉండినవి. మూడు నెలల తరవాత వీరి రెండో ప్రదర్శనంలో రేఖా చిత్రాలు, ఎచ్చింగ్స్ మాత్రమే ప్రదర్శిత మైనాయి. దీనిలో బ్రూకే వర్గం కూడా పాల్గొన్నది. చాలా మంది ప్రథమ శ్రేణి ఫ్రెంచి కళా

కారులు కూడ పాల్గొన్నారు. ప్రథమ ప్రపంచ యుద్ధంతో ఈ ఉద్యమం అంతమైనది. మేకే 1914లోను, ఫ్రాంజ్ మార్క్ 1916లోను చనిపోయారు. క్లీ, కాన్ డిన్ స్కీ బహౌస్ పాఠశాలలో మహోపాధ్యాయులుగ చేరారు. 1949లో ఈ ఉద్యమపు పునరాలోకన ప్రదర్శనం మ్యూనిచ్‌లో జరిగింది.

**Blaue vier** : *నీల చతుష్టయం.*

ప్రత్యేక వ్యక్తిత్వాలను ప్రస్ఫుటం చేసిన నల్గురు ప్రసిద్ధ చిత్రకారులకు సమష్టినామం. ఇంగ్లీషులో వీళ్ళను బ్లూ ఫోర్ అంటారు. వీరు: కాండిన్ స్కీ, క్లీ, ఫెనిన్‌జెర్, జాలెన్‌స్కీ. 1922లో జర్మనీ, అమెరికాలలోను మరియు 1924లో మెక్సికోలోను తమ చిత్ర ప్రదర్శనలను వారు నిర్వహించారు.

**bleaching** : *వివర్ణీకరణం.*

**bleach** : *వివర్ణం చేయటం.*

**bleaching powder** : *చాకలి పవుడు.*

**bleed** : *వర్ణ ప్రవాహం.*

1. తైలవర్ణాలలో ఒక ముదురు రంగు ఇంకొక లేత రంగుపైకి పాకటం. ఇటువంటి దోషాలున్న కొన్ని కృత్రిమ రంగులను చిత్ర రచనలో ఉపయోగించరు. ఇట్లా పాకే రంగు ప్రక్కన తెలుపు రంగు వేస్తే, కొంతకాలానికి తెలుపు రంగుకు ప్రాకేడు రంగు ఛాయలు ఏర్పడతాయి. కాలక్రమంలో ఈ మార్పు ఇంకా ఎక్కువవుతుంది.

2. చేతి ముద్రణలో, చిత్రానికి చుట్టూ తెల్లగా జాగా ఉంచక, అంచుల వరకు ముద్రించటం.

**blender** : *గుండ్రని కుంచె; స్థూల తూలిక.*

మొనతో ఉండకుండా, పరుచుకొని ఉండే కుంచె. చిత్రాలలో రంగులను ఒకదానిపై ఇంకొకటి కలపటానికి ఇది బాగా పనికివస్తుంది. దీన్ని చెమ్మలేకుండా పొడిగానే వాడతారు. వ్యజన తూలిక (*fan brush*)లు కూడా ఈ తరగతివే. బేడ్జర్ అని వ్యవహరించ బడుతూ నేల బొరియలలో వసించే ఒక జంతు విశేషపు వెండ్రుకలతో స్థూల తూలికను తయారు చేస్తారు.

**blending** : *మేళనం.*

చిత్రంలో రెండు వర్ణాలను క్రమంగ మేళవించటం. తైలవర్ణాలు పొడి రంగులూ ఈ విధంగా మేళవించటానికి సాధ్యమవుతుంది. జిగురురంగులను, గహనవర్ణాలను(*gouache*) మిగత వర్ణాలను ఈ విధంగా మేళవించే వీలు లేదు. క్షాళన వర్ణాల నీటి రంగులలో, ఒక దానిలోకి వేరొక దానిని పాకించటం ఇటువంటిదే. తైలవర్ణాలలోను, పొడిరంగులలోను, కుంచె నడక, గీతలు, స్పష్టంగా కనపడినను ఆ వర్ణాలు అంచులలో క్రమంగా కలిసి పోతాయి. కళా విద్యార్థులకు, కుంచె నడిపే రీతి స్పష్టంగా కనపడేందుకు శిక్షణ ఇస్తారు. అతిమాత్ర స్థాయిలో ఈ వర్ణ మేళనం జరిగినట్లైతే రూపాలు దుర్బలంగా, స్థూలు తేజో విహీనంగా తయారు కావచ్చు. అయినా తైల వర్ణ చిత్రరచన ప్రారంభమైనప్పటి నుంచి, మేళనానికి ప్రాముఖ్యం ఉన్నది. ఉపక్కగా ఆర నటువంటి రెండు వర్ణాలపై కుంచెను రుద్ది మేళనాన్ని సాధించవచ్చు. స్థూలతూలిక దీనికి బాగా పనికివస్తుంది. పొడి రంగులను వ్రేలితో మేళనం చేయటమే సులభం. కొంచెము గట్టిగా చుట్టిన కాగితపు చుట్టను

కూడా ఇందుకు వాడవచ్చు. కాంత్యభేద్యవ నీవి వర్ణాల విషయంలో కుంచెను అర్థంగాను, నిలువుగాను నడిపి క్రమరీతిలో మేళనాన్ని సాధించవచ్చు. ముద్రణలో ఇటువంటి మేళనం లభించటానికి, ఒక అద్దంపై కావలసిన రంగులను ప్రక్క ప్రక్కన వేసి, ఒక దానితో ఇంకొకటి కొంచెంగా రుద్ది ముద్రించవచ్చు.

**blind printing :** *నతోన్నత ముద్రణ.*

అచ్చుసిరాలను వాడక, కేవలము ఫలకాన్నే ముద్రణ యంత్రంపై ఉంచి అచ్చొత్తటం. దీని వల్ల రూపాలు కాగితంపై ఉబ్బెత్తుగా వస్తాయి. ఈ ప్రక్రియ తొలుత జపానులో ప్రచారంలోకి వచ్చింది. ఆధునిక కళాకారులు తెలుపు-పై-తెలుపు (*white-on-white*) ఆకారాలు రావటానికి ఈ ప్రక్రియను వాడుతున్నారు. సిరా పోయని ఫలకంపై, వంచని కాగితాన్ని తడిపి వేసి దానిపై ముద్రించ వలసిన కాగితాన్ని ఉంచి, ఎచ్చింగు యంత్రంలో నడిపితే ఇటువంటి చిత్రాలు తయారవుతాయి.

**blister :** *స్ఫోటం; బొబ్బ.*

తైలవర్ణ చిత్రంలో కొన్ని సమయాలలో ఏర్పడే బొబ్బ. ఇది రెండు వర్ణపు పొరల మధ్యగానీ, కాటికకు రంగుపొరకు మధ్యగానీ ఏర్పడవచ్చు. వాతావరణంలోని వేడివల్ల చెమ్మ వల్ల ఇది ఏర్పడుతుంది. కాటిక వెనక భాగం నుంచి నీరు చొరబడటం వల్ల గూడా ఇటువంటి బొబ్బ రావచ్చు. ఇటువంటి బొబ్బలు చిట్లినపుడు అక్కడి రంగు పూర్తిగా రాలిపోతుంది. ఇటువంటి బొబ్బలున్న చిత్రాన్ని చక్కదిద్దటానికి, బొబ్బలను జాగ్రత్తగా ఒత్తి అణచివేయాలి.

**blister glaze :** *బొబ్బమెరుగు; స్ఫోటద్యుతి.*

పింగాణి పాత్రకు అలంకరణార్థం కల్పించే ఒక విధమైన మెరుగు; ఆధునిక పింగాణి సామగ్రులలో కూడా దీనిని అవలంబిస్తున్నారు. సాధారణపు మెరుగుకు ఉపయోగించే ద్రవ్యాలతోపాటు, వేడి తగిలినంతనే వాయురూపం పొంది ఐరికగా ఉండే ద్రవ్యాలను వాడినపుడు ఇటువంటి బొబ్బమెరుగు వస్తుంది. కాల్షియమ్ లేదా మెగ్నీషియం కార్బొనేట్లు, కాల్షియమ్ సల్ఫేటు, మెంగనీజ్ డయాక్సైడులు ఇందుకు వాడవచ్చు. యాదృచ్ఛికంగా కలిగే బొబ్బలను ఉమ్మిబొబ్బ (*spit-out*)లు అంటారు.

**block :** *దారుకం; దిమ్మె; బ్లాకు.*

**block book :** *దారుక పుస్తకం.*

దారు తక్షప్రక్రియ (చెక్కపై రూపాలను



దారుకపుస్తకం

అక్షరాలు చెక్కే పద్ధతి) సాయంద్వారా ముద్రించిన పుస్తకం. ఇటువంటి పుస్తకాలకు ఒక్కొక్క పుటకు ఒక్కొక్క బ్లాకు (ముద్ర) విని యుక్తమవుతుంది. అచ్చు యంత్రాలు తయారు కావడానికి పూర్వం, చేతివ్రాత పద్ధతిలోనే గాక, ఈ పద్ధతిలో కూడా పుస్తకాలను, కావలసినన్ని ప్రతులలో, తయారు చేసేవారు. 15వ శతాబ్దిలో యూరపులో ఉత్తరప్రాంతంలో ఈ పద్ధతిలో ప్రార్థన గ్రంథాలు తయారు చేసేవారు.

**block-out** : *మరుగు పరచు (పు).*

**block-out stencil method** : *విధాన పద్ధతి; సంవృత లై జన విధానం.*

సిల్కు తెరలపై ముద్రణ జరిపే ప్రక్రియలో, ముద్రించ నవసరంలేని భాగాలకు, నీటితో కలిపిన వజ్రాన్ని (ఒక విధపు జిగురును) పూయటం. అందువల్ల తక్కిన ప్రాంతంలో మాత్రమే రంగు చక్కగా పడుతుంది. ఇటు వంటి సులభ ప్రక్రియ వల్ల జిలుగులతో ఉన్న రూపాలను ముద్రించటం సాధ్యపడదు; నీటి రంగులను వాడటం కూడా ఈ పద్ధతిలో సాధ్యం కాదు. వజ్రానికి బదులుగా లక్కను వాడటం ఉంది. దీన్నే వజ్ర లేప ఛాదన పద్ధతి (*glue-cutout method*) అని అంటారు.

**block print** : *దారుక ముద్రణ.*

1\. చెక్క మీద ముద్రణకు అనువుగా రూపాలను చెక్కి ముద్రించటం.

(చూ : *block book*)

2\. ఈ రీతిలో అద్దకం వేసిన గుడ్డ.

**block scraper** : *చెక్కుడు రంపం.*

ప్లాస్టరు శిల్పాలలో అవసరంలేని ప్లాస్టరును చెక్కి వేయటానికి ఉపయోగించే సాధనం. దీని ఒకవైపు రంపంలాగా ఉంటుంది.

**blood painting** : *శ్యావ చిత్రణం.*

లేత వర్ణాలతో చిత్రించటం. బోటిసెల్లి రచించిన చిత్రాలు ఇటువంటివే. వీనికి వ్యతిరేకాలైన వాటికి లక్ష్యాలుగా రెంబ్రాంట్ రచించిన చిత్రాలను ఉదాహరించవచ్చు.

**bloom** : *మసక.*

చిత్రాలపై మంచులాగా, లేదా బూజులాగా, ఉపరితలం మీద కలిగే తెలుపు రంగు. ఇది తుడిచినా పోదు. వార్నిషులో స్వతస్సిద్ధంగా ఉండే లోపం వల్లగాని, ఆ వార్నిషులో చేరు కొన్న చెమ్మవల్లగాని ఇది ఏర్పడుతుంది.

**blot drawing** : *లాంఛనాలేఖనం; మచ్చల చిత్రం.*

అలెగ్జాండర్ కోజెన్స్ అనే అతడు 1786 లో వెలయించిన ఒక విధపు చిత్రకళా ప్రక్రియ. ఒక కాగితంపై కాకతాళీయంగా ఏర్పడే ఒక మచ్చ, లేదా రంగు బుడగను ఆధారంగా గ్రహించి ఊహాజన్యమైన ప్రకృతి దృశ్యాన్ని చిత్రించడం ఇందులో జరుగు తుంది. లియొనార్డో డా వించి దీన్ని లోలుత భావించి ఉన్నాడని అతని రచనల వల్ల తెలుస్తున్నది. ఇరవయ్యో శతాబ్దిలో అధి వాస్తవికతావాదులు కూడా, అంతశ్చేతనా జన్యమైన ఊహా కల్పనను రేకెత్తించటానికి ఈ ప్రక్రియను ఉపయోగించారు.

**blown oil** : *ఇగురు నూనె.*

మూత లేని పాత్రలో, చిక్కనై, తెల్లగా, తేనెలాగా కన్పించే వరకూ మరగ కాచిన అవిసెనూనె. ఈ విధంగా కాచేటప్పుడు గాలిని దీనిలో ప్రవేశపెడతారు. ఈ నూనెపు వాడిన చిత్రంలో రంగు త్వరగా మారిపోతుంది.

**blue ashes** : *నీల భసితం.*

బ్రెమెన్ నీలిమకు గల చాలా పర్యాయ నామాలలో ఇది ఒకటి.

**blue black** : *గజదంత కృష్ణ వర్ణం.*

ఏనుగుదంతం వల్ల ఈ రంగును తయారు చేస్తారు.

**blue four** : *నీల చతుష్టయం*

నలుగురు ప్రముఖ చిత్రకారులు - క్లీ, కాండిన్ స్కీ, ఫీనిన్ జర్, జాలెన్ స్కీలు - తమ చిత్రాలతో, యూరపు అమెరికాలలో సమిష్టిగ ప్రదర్శనలను జరిపినప్పుడు తమ నలుగురికీ ఉమ్మడిగ వాడుకొన్న పదబంధం.

**blue frit** : *నీల కాచిక.*

ఈజిప్టు నీలిమకు పర్యాయ నామం.

**blue lake** : *నీల రంజకం*

ప్రసియా నీలిమను జడమిశ్రితం చేయగా లభించే ఒక వర్ణద్రవ్యం.

**blue malachite** : *నీలి మైలతుత్తం.*

అంబర నీలిమకు పర్యాయ నామం; పేరుతో మైలతుత్తము అనే పదం కలిసి ఉన్నా, దీనికి దానితో సంబంధం లేదు.

**blue pigments** : *నీల వర్ణ ద్రవ్యాలు.*

వాటి అంతశ్ఛవులను అనుసరించి - లోహితపు వాక మొదలుగా ఆకుపసిమి వాక వరకు - ఈ దిగువ పేర్కొన్న నీల వర్ణ ద్రవ్యాలను తైల వర్ణాలకు తగ్గట్లు ప్రామాణికంగా నిర్ణయించటం జరిగినది. (సారణిక, అక్లిన్న ప్రక్రియలలో కూడా వీటిని వాడవచ్చు). అవి: అతి సాగరిక నీలిమ, మధుధాతు నీలిమ, గగన నీలిమ, మాంగనీజు నీలిమ, తాలస్యానిక నీలిమ.

**blue print** : *తుది విన్యాసం.*

**Blue rose** : *బ్లూ రోజ్.*

1905 విప్లవానికి ముందు రష్యాలో ఉన్న ఒక చిత్రకారుల సంఘం. పతితమవుతున్న ఆనాటి సంఘ వ్యవస్థ నుంచి మనసును మరల్చుకొని ఊరట పొందటానికై తమ చిత్రాలలో విచిత్రపు ఊహలను, చిహ్నాలను ఆ చిత్రకారులు చొప్పించారు.

**blunger** : *మిశ్రకం.*

మృత్సరకములను, ద్యుతికములను తయారు చేయటానికై వాడే ఒక యంత్రం. ఈ రకపు యంత్రాలలో మెల్లని మిశ్రకం అనేది శ్రేష్ఠతరం. దీని తెడ్డు మెల్లగా చలిస్తుంది. కాబట్టి ముద్దలను ఏకరీతిలో విశీర్ణం చేయగలుగుతుంది. ద్రుత మిశ్రకపు తెడ్డులు అతి శీఘ్రముగ చలించటం వల్ల, మట్టి ముద్దలను దానిలో వాడినప్పుడు, అవి చిన్నచిన్న ముక్కలుగా విరిగి అవతల వచ్చి పడుతాయి. కాబట్టి అటువంటి ద్రుత మిశ్రకాల కన్నా మెల్లని మిశ్రకాలకే ఎక్కువ మన్నన ఉన్నది.

**board** : *ఆస్తరము; అట్ట; బోర్డు.*

కొన్ని పొరలను అతికిగాని ఒకే పొరతో గాని దీన్ని తయారు చేయవచ్చు. వీనిలో కొన్ని అట్టలపై కాగితాన్ని అతికిస్తారు. చిత్రాలను రచించటానికి ఇది ఉపయోగపడుతుంది.

**bodied linseed oil** : *సాంద్రా అతసి తైలం.*

ఎండలో ఉంచి చిక్కబరచిన అవిసె నూనె.

**body** : *సంఘాతం.*

తైలాలలోను, వార్నిషులలోను ఘనతను తెలియజేసే సామాన్య పదం. పై పూతకు

వారఐదే ఒక ద్రవ్యపు నిబిడతకు లేదా శీన తకు, ఆ ద్రవ్యపు భారం లేదా విశిష్ట గురుత్వంతో ఒక విధపు పర్యాప్త సంబంధం ఉంటుంది. ఎక్కువ శీనత కలిగిన ఒక వార్నిషు, లేదా తైలము, అసాధారణ రీతిలో చాలా తగ్గు స్థాయిలోని విశిష్ట గురుత్వంకలిగి ఉన్నప్పుడు ఆ తైలాన్ని లేదా వార్నిషను అలీక సంఘాతం (*false body*) కలదాని నిగా పేర్కొంటారు.

**body colour** : *సంఘాత వర్ణం.*

చిక్కగా కాంత్యభేద్యంగా ఉండే వర్ణాల రచనకు సామాన్య నామం. పారదర్శక వర్ణానికి ఇది విభిన్నం. ఉదా: పొడి రంగులు, తైల వర్ణాలు, గహన వర్ణాలు, జిగురు వర్ణాలతో తయారు చేసిన చిత్రాలు, నీటి రంగులతో తయారు చేసిన చిత్రాల కంటే భిన్నంగా ఉంటాయి. ఈ రకమైన కాంత్యభేద వర్ణాల రచనను స్తోమ స్థాయి ( *mass-tone* ) అని కూడా వ్యవహరిస్తారు.

**body stain** : *విలిప్త వర్ణం.*

పింగాణి పాత్రను తయారు చేయటానికి వినియోగించే మట్టిలో కలిపే రంగు. పింగాణి పాత్రలలో మెరుగుపై వేసే రంగు కన్నా ఇది భిన్నం. రంగు సిమెంట్లకు కూడా ఈ పదాన్ని వాడతారు.

**Bohemian school** : *బొహీమియా సంప్రదాయం.*

క్రీ.శ. 14వ శతాబ్ది ఉత్తరార్థంలో బొహీమియాలో వర్ధిల్లిన ఒక కళాసంప్రదాయం. జర్మనీలోని బొహీమియాకు, వారసత్వరీత్యా పాలకుడై, తరవాత చక్రవర్తి పదవిని ఆర్జించిన చార్లెస్, ప్రేగ్ నగరంలో తన నివాసాన్ని ఏర్పరచుకొని, కళలను పోషించి ఎన్నో ప్రాంతాలనుంచి, కళాకారులను అక్కడకు ఆకర్షించాడు. అటువంటి వివిధ ప్రాంతీయుల కృషి వల్ల రూపొందిందే బొహీమియా కళ. ఇది ఒక ప్రత్యేక సంప్రదాయం అనటం అపార్థజనకం. ఇందు వివిధ కళాశైలులు స్థానం కల్పించుకొన్నవి. అయినా ఈ మిశ్రమ శైలియే 'బొహీమియా సంప్రదాయం' అని రూఢత చెందింది.

ఈ సంప్రదాయపు కళాఖండాలు, తరవాతి కాలపు అరాజక పరిస్థితులలో చాలా వరకు అంతరించాయి. కొన్ని ఫలక చిత్రాలున్నా, సద్యస్కములును మాత్రమే మిగిలి ఉన్నాయి. కాని వాటిలో చాలామంచి రచయితల పేరులు తెలియరావు. పేర్కొనదగిన వానిలో ఇటాలియన్ శైలీ, ఫ్రెంచి ప్రభావమూ గణనీయంగా కనపడుతున్నాయి. ఆ సంప్రదాయం మనిన కాలంలో తక్కిన చిత్రకళా ప్రక్రియలతో పాటుగా గ్రంథ చిత్రణం కూడా బాగా రాణించింది. 15వ శతాబ్దికి, ఈ సంప్రదాయము నామావశిష్టమైంది.

**boiled oil** : *క్వథిత తైలం; ఉడుకునూనె.*

త్వరితంగా ఆరిపోవటానికి ఉపయోగించే ద్రవపదార్థాన్ని కలిపి కాచిన అవిసెనూనె. దీన్ని గృహోపకరణాలపైనా, తలుపులపైనా వేయవచ్చు. కాని చిత్రకారులకు ఇది పనికి రాదు. దీనితో కలిపిన రంగులు తేజోవంతాలుగా ఉండవు.

**boite** : *చిత్రకోశం.*

చిత్రకారుడు తన చిత్రాల నమూనాలను భద్రపరచే ఆల్బము వంటిది.

**bold face (printing type)** : *స్పష్టముఖి (ముద్రార్థిక)*

**bole** : కేసురు మట్టి.

**Bolognese school** : బొలోనా సంప్రదాయం

మధ్య యుగాలలో ప్రసిద్ధ విశ్వ విద్యాలయానికి నెలవుగా రాణించిన ప్రాప్పు నందలి బొలోనా నగరాన్ని కేంద్రంగా గ్రహించి వర్ధిల్లిన ఒక కళా సంప్రదాయం దీనిలోని వాస్తువికసనం, అక్కడ ఈ నాటికీ నిలిచి ఉన్న చర్చిలలో కనపడుతున్నది. ఆ చర్చిలలోని ఉల్బణ శిల్పాలు ఆ సంప్రదాయపు శిల్పుల పరిణతికి లక్ష్యాలు. కొన్ని సద్యస్కములను అక్కడక్కడ కనపడుతున్నాయి. విశ్వ విద్యాలయాన్ని ఆశ్రయించి గ్రంథ చిత్రణ కూడా విరివిగా ఆ కాలంలో సాగింది. 16వ శతాబ్ది నుంచి ఈ సంప్రదాయంపై ఇటలీ కళాకారుల ప్రభావము ఎక్కువగా కనపడుతుంది. అయినా ఆ శతాబ్దపు అంతానికి ఈ సంప్రదాయం ఒక విశిష్టతను, ప్రత్యేకతను ఆర్జించి, గైడో రెనీ వంటి సుప్రసిద్ధ కళాకారుల చేత పోషితమైంది. 19వ శతాబ్దికి ఈ సంప్రదాయం తన పటిమను కోల్పోయి లుప్తత చెందింది. 20వ శతాబ్దిలో ఈ సంప్రదాయాన్ని పునరుద్ధరించే ప్రయత్నం కొంత జరిగింది.

**Bologna chalk** : బొలోనా ఖటిక.

ప్లాస్టర్ ఆఫ్ పారిస్ నుంచి తయారయ్యే ఒక విధపు సీమసున్నం.

**bolting cloth** : జల్లెడ గుడ్డ.

రంగు పొడులను జల్లించటానికి వీలుగా తయారు చేసిన పట్టు గుడ్డ. దీనిని కౌశేయ ముద్రణ (*silk-screen printing*) లో కూడా వాడతారు. దీని తయారీలో పడుగు పేకలు కలిసే చోట దారం ముడిపడి ఉండటంవల్ల దృఢంగా ఉండటమే గాక, ముద్రించే టప్పుడు రంగును, స్పాంజివలె పీల్చుకొంటుంది.

**bond paper** : బాండు కాగితం.

ఒక విధమైన కాగితం; శాశ్వతంగా ఉండవలసిన దస్తావేజులకూ, లెటర్ హెడ్డులకూ దీనిని వాడతారు. దీనిలో చాలా రకాలున్నాయి. అత్యుత్తమమైన బాండు కాగితం చాలా కాలము తరవాత కూడ రంగు మారదు; విరిగిపోదు; సిరాలను పీల్చుకోదు. కలంతోను, పెన్సిలుతోను రేఖాచిత్రాలను రచించటానికి చిత్రకారులు దీన్ని ఉపయోగిస్తారు. దీని ఉపరితలం చాలా నునుపుగా ఉంటుంది.

**bone ash** : అస్థి భస్మం.

ఎముకలను కాలిస్తే వచ్చే మసి. దీన్ని సీమ పింగాణి (*bone china*) మట్టిలో కలుపుతారు. కసాయి దుకాణాల వద్ద లభించే ఎముకలను కాల్చటంవల్ల వచ్చే కాల్షియం పాస్ఫేట్ అనే రసాయనిక పదార్థాన్నే అస్థి భస్మం అంటారు.

**bone black** : ఎముక మసి; అస్థిమషి.

ఎముకలను బాగా మాడ్చి తయారుచేసే ఒక పారిశ్రామిక వర్ణద్రవ్యం. కర్బనానికి ఇది ఒక అస్వచ్ఛ రూపం. పూత రంగులకు గాని, సుధాపిష్టంలోగాని సాధారణపు ఎముక మసిని ఉపయోగించరు. అయితే దంతపు మసి (*ivory black*) అనే పేరుతో ఎముక మసిని శుద్ధిచేసి తయారుచేసే ఒక మసి చిత్రకారులవాడుకకు బాగా పనికి వస్తుంది.

**bone brown** : అస్థి కపిలం; ఎముక గోధుమవన్నె.

ఎముక మసి వలెనే తయారై నలుపు చాక

గోధుమరంగు కలిగిన ఒక కర్బన వర్ణ ద్రవ్యం. ఎముక మసిలో జరిగినంతగా కర్బ నీకరణము దీనిలో జరగదు; కాబట్టి చిర స్థాయి చిత్రాల రచనకై, ఎముక మసికన్నా ఇది తగనిది.

**bone carving** : *అస్థి తక్షణం; ఎముక చెక్కడు.*

ఏనుగు దంతాన్ని వాడుక చేసినట్లే తక్కిన జంతువుల ఎముకలను కూడా ఉపయోగించే వీలున్నది. అయితే వీటి వల్ల రూపొందించేవి ఏనుగు దంతపు వాటివలె శోభను, ఒదుగు తనాన్ని కలిగి ఉండవు. అయితే ఏనుగు దంతమంత గట్టిగా తక్కిన జంతువుల ఎము కలు ఉండవు కాబట్టి వాటి ఉపరితలం మీదనే గాక, ఇంకా లోతుకు కూడా సుల భంగా చెక్కటానికి వీలవుతుంది.

**bone china** : *నేమ పింగాణి.*

గట్టిగా తెల్లగా ఉండి, ఎముకల పొడి ఎక్కువగా కలిపి తయారు చేసిన పారదర్శ కపు పింగాణి సామాను. దీనిని మొదట జోసియా స్పోడ్ అనే ఆంగ్లేయుడు 1800లో తయారు చేశాడు. ఈనాడు కూడా ఇటువంటి సామగ్రి ఎక్కువగా ఇంగ్లండు, ఐర్లండు లలో తయారగుచున్నది.

**bone folder** : *దంత వ్యావర్తని.*

దంతంతో గానీ ప్లాస్టిక్‌తో గానీ తయారు చేసిన పలుచటి బద్ద. దీని అంచులు మొన దేలక, గుండుదీరి నునుపుగా ఉంటాయి. కాగి తంపై చేతితో దిమ్మెల సాయంతో అద్దకం చేసేటప్పుడు ఇది పనికివస్తుంది.

**bone white** : *అస్థి మార్జం.*

ఎముకలను కాలిస్తే తయారయ్యే తెల్లని పొడి. ఇది ఎటువంటి రసాయన చర్యకూ లోనుగాదు. భిత్తిచిత్రాలకు దీన్ని తొలి పూతగా పూసేవారు దీన్ని గురించి 15వ శతాబ్దిలో సెన్నినో సెన్నిని ఇట్లా పేర్కొ న్నాడు: "కోళ్ళ రెక్కల వద్ద ఉండే ఎము కలు, కాళ్ళలోని ఎముకలు దీనికి చాల బాగా పనికి వస్తాయి. కోడి ఎంత ముదిరితే దాని ఎముకలు అంత శ్రేష్ఠంగా దీనికి ఉపకరి స్తాయి. మాంసాహారులు తినగా మిగిలిన ఇటు వంటి ఎముకలను, ఉన్న తీరుగానే, నిప్పులో వేసి కాలిస్తే ఈ చూర్ణం తయారవుతుంది."

**book of hours** : *హోరా గ్రంథం.*

మధ్యయుగాలలో సంకలితమైన ప్రార్థన గ్రంథం. ఇందులో ప్రతిదినం ఏ సమయంలో ఏ ప్రార్థన చేయాల్సింది సూచించ బడింది. ఇటువంటి గ్రంథాలు క్రైస్తవ మఠాలలోను, ధనవంతుల యిండ్లలోను ఉండేవి. వీటిలో ఆయా కాలాలను అనుగుణంగా చక్కటి చిత్రా లుండేవి. ప్రస్తుతకాలంలో లభించే ఆటువంటి గ్రంథాలలో చాలా చక్కని లఘు చిత్రాలు ఉన్నాయి

**Book of the Dead** : *ప్రేత గ్రంథం; అపర కాండ.*

ఈజిప్టు దేశంలో అపర కర్మలకు సంబం ధించిన సారస్వతం. 18, 19 రాజవంశాల కాలంలో, ఈ గ్రంథాలు చాలా అందంగా రచించబడ్డాయి. వీటిలో శీర్షికలు ఎరుపు రంగు లోను అక్కడక్కడ పలు వర్ణాల చిత్రాలూ కనపడతాయి. అక్షయికా చిత్రణలోనూ, దీప్తి చిత్రణలోనూ వీటిని తొలి గ్రంథాలని చెప్పవచ్చు.

**bordering wax** : *అంచు మైనం.*

(చూ: *walling wax*)

**boss** : *గండరింపు.*

కొయ్య, రాయి, లోహాలు ఉపయోగించి తయారుచేసే శిల్పాలలో పైకుబికి బిళ్లవలె ఉండే అలంకరణ విశేషం దీనిలోలతా గుల్మాదులు చెక్కుతారు. వాస్తు శిల్పాలలో పైకప్పు లోపల భాగాలకూ, అటువంటి అలంకరణలను గండరించేవారు. దీన్ని ఎక్కువ లోతుగా చెక్కరు; అతికించిన బిళ్ల లాగా ఇది కన పడుతుంది

**bottega** : *పటుక శాల.*

అనుభవజ్ఞుడైన కళాచార్యుడు నడిపే ఒక శిక్షణ కేంద్రం. అక్కడ విద్యార్థులు గురువుతో కలిసి పనిచేసేవారు. కాని ఆ కేంద్రంలో రూపొందే చిత్రాలన్నింటిపైనా గురువు యొక్క సంతకమే ఉండేది పునరుజ్జీవన యుగంలో ఫ్లారెన్స్ నగరంలో దాదాపు 80 పటుకశాలలు వర్ధిల్లాయి ఇటువంటి వాటిని నడిపిన వారిలో లియొనార్డో డా వించి, రూబెన్స్ ముఖ్యులు. బొట్టెగా అనేది ఇటాలియన్ భాషా పదం

**bottle** నీసా; *కూపిక.*

**boulle-work or boulle** : *పొదిగే సామగ్రి.*

అందంగా లతాదులు చెక్కిన కుర్చీలు, బల్లలు మొదలైన సామగ్రి ఇటువంటి చెక్కడాలలో ఇత్తడి, తాబేటిడిప్ప మొదలైన వాటిని చక్కగా పొదిగేవారు. అంద్రే చార్లెస్ బౌలే అనే ఫ్రెంచి వడ్రంగి పేర ఈ సామగ్రి ప్రసిద్ధి చెందింది.

**boxwood** : *బాక్సు దారువు.*

ఒక రకపు చేవగల గట్టికర్ర. ఇది మరిచి గంధపు రంగులో నునుపుగా ఉంటుంది. దీనిపై చెక్కడపు పని చాల కష్టం. ఈ కర్రతో అద్ద కపు దిమ్మెలు, ఎక్కువ మనవలసిన జారుడు కొలబద్ద (*slide rule*) లు, సంగీత పరికరాలు తయారు చేసేవారు.

**bracket** : *కుండలిక.*

**brand** : *అంకనం.*

**brass** : 1. *ఇత్తడి.*

రెండు వంతుల రాగి, ఒక వంతు తగరం ఉండే ఒక మిశ్రలోహం; దీనిలో కొన్ని ఇతర లోహాలను కూడా కలపవచ్చు. ఇది బంగారు ఛాయతో మెరుస్తూ రాగికన్నా గట్టిగా ఉంటుంది; దీన్ని సులభంగా మలచవచ్చు; తీగగా కొట్టవచ్చు; అయినా ఇందు కలిసిన లోహాల నిష్పత్తులను బట్టి దీని గుణాలు మారుతుంటాయి.

2. పిత్తలిక

అలంకరణ యుక్తంగా లతాదులు చెక్కిన ఇత్తడి పళ్ళెం. యూరపీయ పునరుజ్జీవన యుగంలో చనిపోయినవాళ్ళ జ్ఞాపకార్థం వీటిని తయారు చేసేవారు. మరణించిన వ్యక్తియొక్క శైలీకృత రూపాన్ని దీనిపై చెక్కేవారు. ఇటువంటి వాటిని యూరపులోని చర్చీలలో ఈ కాలంలో కూడా చూడవచ్చు.

**brass sand** : *ఇత్తడి ఇసుక.*

(చూ. *foundry sand*)

**bravura** : *తూలికా పాటవం.*

చిత్ర రచనలో కుంచెతో రమ్యంగా విన్యాసాన్ని చూపించే నేర్పు.

**brayer** [1] : *నంవర్తని.*

ముద్రించే అచ్చులపై సిరా పూయటానికి ఉపయోగించే రోలరు. దీనికి సామాన్యంగా రబ్బరును తొడుగుతారు. వజ్రం (ఒక విధమ లేపం)తో చేసిన తొడుగులు కూడా వాడుకలో ఉన్నాయి. వివిక్త (సారాంశ abstrac

చిత్రాలలో పెద్దవైన వాటిలో ఎక్కువ భాగానికి రంగును పూయటానికి కూడా ఈ పరికరాన్ని వినియోగిస్తారు. ఒక ఛాయలో ఇంకొక ఛాయను క్రమరీతిలో మేళవించటం దీనివల్ల సాధ్యం.

**brayer** [2] **:** హస్తావర్తిని.

ఉల్బణ దారుకాలకు సిరాను పట్టించటానికి



హస్తావర్తిని

వాడే సాధనం; దీనిని చేతితో నడుపుతారు.

**Brazilian art :** *బ్రెజిల్ కళ.*

దక్షిణ అమెరికాలోని బ్రెజిల్-పోర్చుగీజు పాలన నుంచి - విముక్తిని పొంది స్వతంత్రతను ఆర్జించినది (1822) మొదలుగా ఆ దేశంలో వర్ధిల్లిన కళావిశేషము. అదివరకే 1816లో కొందరు ప్రసిద్ధ ఫ్రెంచి కళాకారులు అక్కడ చేరి, ఒక లలిత కళా అకాడమిని స్థాపించి పని చేయటం వల్ల అదివరలో అక్కడ నెలకొన్న బరోక్, రొకోకో శైలులు ఉత్తములై నవ్య సాంప్రదాయిక కళ నెలవును ఆర్జించింది. ఆ తరవాత ఈ ఫ్రెంచి కళాశైలీ ప్రభావమే 100 ఏండ్ల కాలం దేశంలో ఆధిపత్యం నెరపింది. తుట్టతుదకు ఈ శతాబ్దపు ఇరవైలలో బ్రెజిల్ కళ స్వీయమైన ఒక ప్రతిపత్తిని ఆర్జించింది. తక్కిన కళారంగములన్నింటి కంటే వాస్తువులో ఈ దేశం ఎంతో ప్రతిష్ఠను ఆర్జించింది. సుప్రసిద్ధ వాస్తువిదుడు లె కోర్బుజియెర్ ఇచ్చిన సలహాలతో నూత్న మార్గాలను అనుసరించి వాస్తు నిర్మాణరీతి దేశపు ముఖ్యనగరాన రియోడీ జనిరోలో మొదలైంది. ఇదే దేశానికి క్రొత్త ముఖ్య నగరమైన బ్రసీలియాను నిర్మించటంలో పరాకాష్ఠను అందుకొన్నది.

**brazing :** *సంశ్లేషణ.*

ఒక విధమైన సంధాన (వెల్డింగు) ప్రక్రియ. అతకవలసిన లోహం కరిగే వేడికి తక్కువైన వేడివల్లనే కరుగగలిగి, త్రుప్పుపట్టి పీలుపడని లోహాన్ని వాడి, లోహపు ముక్కలను అతకటం దీనిలో జరుగుతుంది. సాధారణంగా ఇటువంటి అతుకుకై, 60 శాతము రాగి, 40శాతము తగరం కలిపి తయారు చేసిన మిశ్రలోహ దండాన్ని వాడతారు. దీన్ని అతకవలసినచోట పెట్టగానే, ఇత్తడి కరిగి, అతుకుదగ్గర బాగా ప్రసరించి, వ్యాపిస్తుంది.

**bridge :** ఆలంబనం.

లేఖన ఫలకము (*drawing board*) పైనగాని, శిలాలేఖనానికి ఉపయోగించే శిలపైనగాని చిత్రరచనను సాగించేటప్పుడున్నూ, కాడిక లేదా కాగితంపై చిత్రలేఖనం చేసేటప్పుడున్నూ చిత్రిత భాగంపై చేయి తగలకుండా వేరుగా ఉంచటానికి చేతి క్రింద ఆధారంగా దిండు వలె ఉంచుకొనే సాధనం. ఇది దీని సాయంతో, చేయి నిర్దుష్టంగా, పటిక

కుండా తన పనిని సాగించే వీలుంది. ఋషులు ఉపయోగించే యోగదండాన్ని ఇది పోలి ఉంటుందని చెప్పవచ్చు.

**Brazil wax** : *బ్రజిల్ మైనం.*

(చూ . *carnauba wax*)

**Brazilwood lake** : *బ్రజిలీయ రంజకం.*

బ్రజిలీయ దారువు అనబడే ఒకవిధవు కొయ్య నుంచి తయారు చేసే ఒక రంజక వర్ణద్రవ్యం. నెత్తుటి ఎరుపు రంగు గలిగి సహజసిద్ధమైన ఈ రంగు పదార్థము, మధ్య అమెరికా నుంచి 16వ శతాబ్దిలో యూరపుకు తీసికొని రాబడింది. చిరస్థాయిత దీనికి చాల తక్కువ; అయినా చౌకగా లభించేది కాబట్టి తక్కిన ఎరుపు రంగులకన్నా దీన్ని ఎక్కువగా కొందరు అభిమానిస్తున్నారు.

**bright** : *బ్రైట్ కుంచె.*

తైల వర్ణాలతో వాడే ఒక విధమైన కుంచె. దీన్ని మొదటి సారిగా తయారు చేసిన బ్రైట్ అనే ఆంగ్లేయుడి పేర దీనికి ఈ పేరు వచ్చింది. ఇది ఎట్టని సేబిల్ రోమాలతో తయారై పలచగా, బద్దవాలుగా ఉంటుంది. కుంచెలోని వెంట్రుకల భాగపు పొడవు, వెడల్పుకు 1½ రెట్లు ఉంటుంది. నవనీత వర్ణాలను ఉపయోగించేటప్పుడు ఈ కుంచెను సాధారణంగా వాడతారు.

**brilliance** : *ఉజ్జ్వలత.*

**brilliant scarlet** : *ఉజ్జ్వల సిందూరం.*

అయొడిన్ ఎరుపుకు ఇంకో పేరు.

**Bristol board** : *బ్రిస్టల్ అట్ట; పొరల అట్ట.*

ఒక్కొక్కటి 0.006 అంగుళం మందంగల పొరలు, ఒకటినుంచి నాలుగువరకు చేర్చి ఉండే ఒక విధపు అట్ట. ఇది చాలగట్టితనం కలది. ఇది రకరకాల నమూనాల నునుపుదనములలో దొరుకుతుంది. ఎటువంటి నీటిరంగులతోనైనా, దీనిపై చిత్రణ సాగించవచ్చు. ఈ అట్టను రెండు వైపులా వాడటానికి వీలవుతుంది. రేఖా చిత్రాలకూ, అక్షరాలను చక్కగా వ్రాయటానికి బాగా పనికి వస్తుంది.

**Bristol glaze** : *బ్రిస్టల్ ద్యుతి; బ్రిస్టల్ మెరుపు జిగురు.*

కాగితాలను అంటించటంలోను, పారదర్శక, గహన, తదితర నీటి వర్ణాలలోను, పింగాణీ పనిలోనూ వాడే ఒక విధపు మెరుపు జిగురు.

**British gum** : *సీమ జిగురు.*

**Bristol gum** : *బ్రిస్టల్ జిగురు.*

కాగితాలను అంటించటంలోనూ గహన, పారదర్శక, తదితర నీటి వర్ణాలలోనూ వాడే ఒక విధపు జిగురు.

**Britannia** : *బ్రిటానియా.*

ప్రాచీన రోమన్ చక్రవర్తులలో ఒకడైన క్లాడియస్ పరిపాలన కాలం (క్రీ.శ.41-54) లో ఆతడు, దక్షిణ బ్రిటన్‌పై రోమన్ ఆధిపత్యాన్ని సూచించటానికి వెలువరించిన ఒక నాణెంపై కనపడే స్త్రీ మూర్తి. తరవాత కాలంలో ఇంగ్లండును పాలించిన చార్లెస్ II, బ్రెడా శాంతి సంధికి గురుతుగ వెలయించిన ఒక పతకంపై ఇటువంటి స్త్రీమూర్తినే,

ఇంగ్లండు దేశానికి ప్రతీకగా ముద్రించ వేశాడు. ఆ పతకాన్ని రూపొందించి అచ్చు గుద్దించిన కళాకారుడు జాన్ రోటెయిర్స్ అనే డచ్చిదేశీయుడు.

**britannia metal** : *బ్రిటానియా లోహము*

ఇంగ్లండులో 18వ శతాబ్దంలో తయారైన శ్రేష్ఠమైన ఒక మిశ్ర లోహం. ఈ లోహంలో అత్యుత్తమ స్థాయికి చెందిన దానిలో 94 శాతం తగరము, 5 శాతము యాంటిమొనీ, ఒక శాతం రాగి చేరి ఉంటాయి. రాగిని కలపడం వల్ల ఈ మిశ్ర లోహానికి కొంత పసుపు ఛాయ వస్తుంది. తగరం ఎక్కువ భాగం ఉండటంవల్ల అధిక మార్దవము దీనికి లభిస్తుంది. విద్యుత్ రంజక విధానం ద్వారా దీనికి వెండిపూతను పెట్టవచ్చు.

**British pigment standard** : *బ్రిటిష్ వర్ణ ప్రామాణిక స్థాయి.*

బ్రిటన్ దేశపు ప్రామాణిక సంస్థ వారిచే ***B S*** 2876 నెంబరుగా 1857లో ప్రచురితమైన బ్రిటిష్ స్టాండర్డ్ & స్పెసిఫికేషన్ ఫర్ ఆర్టిస్ట్స్ యూజ్ (కళాకారుల ఉపయోగానికై బ్రిటిష్ ప్రభుత్వము నిర్ణయించిన ప్రామాణిక వర్ణ స్థాయీ నిర్దేశనం) అనే కరపత్రానికి సంక్షిప్త నామం చాల రంగులకు గల వివిధ నామాలను పరామర్శించి ప్రతి ఒకదానికీ, ఒక నిర్దిష్ట నామాన్ని స్థిరపరచటం దీనిద్వారా జరిగింది. అమెరికా దేశంలో కొన్ని వర్ణాలకు సాధికారంగా స్థిరపరచిన ప్రామాణిక నామాలకు విభిన్నమైనవి ఈ కరపత్రంలో ఇవ్వడం జరిగింది. ఉదా. అమెరికా వారి లెక్కలో అల్ట్రామెరీన్, కోబాల్ట్ యెల్లో, మాంగనీజ్ వయొలెట్ అని పేర్కొనబడినవే బ్రిటిష్‌వారి నిర్దేశనంలో క్రమంగా ఫ్రెంచి అల్ట్రామెరీన్, ఆరియోలిన్, మినెరల్ వయొలెట్ అని పేర్కొనబడటం జరిగింది. కళాకారులు ఉపయోగించే వర్ణాలను మాత్రమే అమెరికన్ ప్రామాణిక సంస్థ పేర్కొనగా, బ్రిటిష్ సంస్థ అన్నివిధాల రంగులకు ప్రామాణిక నామాలను స్థిరపర్చింది.

**broad manner; fine manner** : *విశాలరీతి; లలితరీతి.*

లోహఫలకాలపై రూపాలు చెక్కటంలో రేఖలు మందంగా, పెద్దవిగా చెక్కే పద్ధతిని విశాలరీతి అనీ, రేఖలు నిశితంగా, సన్నంగా, అడ్డంగా, నిలువుగా గీసే పద్ధతిని లలితరీతి అనీ వ్యవహరిస్తారు. మొదటి రీతిలో తీసిన ముద్రణం కుంచెతోగాని వెడల్పు మొనగల సాధనంతోగాని చేసి లిఖించిన రేఖా చిత్రం లాగా ఉంటుంది. రెండో రీతిలో తీసినది సన్నని పాళీతో రచించిన చిత్రంలాగా కనపడుతుంది.

**broken color** :- *త్రుటిత వర్ణం.*

1. చిత్రంలో నేర్పుగా ఒక వర్ణం మధ్య ఇంకొక వర్ణాన్ని వేసి, రెండూ కలసి మరొక వర్ణం ఏర్పడినట్లు కంటికి కన్పింప జేయటం. వర్ణఫలకంపై రెండు రంగులనూ కలిపి, వేరొక రంగును తయారు చేయటం కన్నా ఇది విభిన్నం.

2. ఒక పరిపూరక (***complementary***) వర్ణాన్ని కలపటం వల్ల దేని యొక్క కాంతి తగ్గిపోతుందో అటువంటి వర్ణం. ఇట్లా కాంతిని కోల్పోయినవి మట్టి రంగుగా ఉంటాయి.

**bronze** : *కంచు; కాంస్యము; బ్రాంజి.*

రాగి, తగరాల మిశ్రమ లోహం. దీనిలో కొన్ని సందర్భాలలో కొద్ది మొత్తాలలో తుత్తు

నాగం, భాస్వరం కూడా చేరి ఉంటాయి. ఇత్తడి కన్న గట్టిగాను, మన్నిక ఎక్కువ కలదిగాను, వంచటానికి వీలుగాను ఇది ఉంటుంది. లోహశిల్పాల పోతకు ఇదిపూర్వకాలం నుంచి ఎక్కువగ వాడుకలో ఉన్నది. ఈ మిశ్రలోహంలో తెలుపువాక మొదలుగా తామ్ర వర్ణం వరకు రకరకాల వన్నెలు గలవి ఉన్నాయి. అమెరికాలో ప్రామాణిక స్థాయికి చెందినదిగా పరిగణితమైన కంచులో, 90 శాతం రాగి, 7 శాతం తగరం, 3 శాతం తుత్తునాగం చేరి ఉన్నాయి.

**bronze blue** : *కాంస్య నీలం.*

ప్రష్యన్ నీలానికి ఇంకొక పేరు.

**bronze disease** : *కాంస్య రుగ్ణత.*

కంచుకు పట్టే ఒక విధపు తుప్పు. దీని వల్ల కాలక్రమంగా లోహం శక్తిహీనమవుతుంది. కంచుకు సాధారణంగా పట్టే ఆకుపచ్చని చిలుము కన్న ఇది విభిన్నం.

**bronze leaf** : *కాంస్య పత్రం.*

**bronze powder** : *కాంస్య చూర్ణం.*

కంచు, ఇత్తడి మొదలైన పచ్చని మిశ్రలోహాల చూర్ణం. దీన్ని వార్నిషులో కలిపి బంగారురంగుగా వాడుతారు. బంగారపు సాటి వన్నెను దీనితో సృష్టించవచ్చు. కాని కొద్ది కాలంలోనే అది వన్నె మాసి మెరుగును పోగొట్టుకొంటుంది.

**bronze sculpture** : *కాంస్య శిల్పం.*

తగరాన్ని, రాగిని కలపగా తయారయ్యే మిశ్రలోహం బ్రాంజి (కాంస్యం). దీనికుండే ద్రఢిమా, ఆకర్షణా పలువిధాలైన పనితనానికి, విగ్రహ రచనకు దీన్ని ఉపయోగించేచేట్లు స్తున్నాయి. పునరుజ్జీవన యుగపు కాంస్య విగ్రహాలూ, ఆధునికయుగపు కాంస్య విగ్రహాలూ మట్టిపంటి దానితో నిర్మితములైన ప్రతిమానాలను అనుసరించి పోతపోయబడినవిగా ఉన్నవి. ప్రాచీన గ్రీకు విగ్రహాలు కొయ్య మలావుకు వాటిని అనుసరించి పోత పోయబడినవిగా కనపడతాయి. కాంబోడియాలో మధ్యయుగాలలో పోత పోయబడిన విగ్రహాలు, ఏదియో మలచబడిన ఒక ప్రతిమానం నుంచే పోత పోయబడి ఉంటాయని పండితుల అభిప్రాయం.

విగ్రహాన్ని ఒక మొత్తంగా, పోత పోయటానికి బదులుగా, వివిధాంగాలను వేరేవేరేగా పోతపోసి వాటిని తగిన రీతిలో సంధించటంలో ఎక్కువ సౌలభ్యం కళాకారునికి ఉంటుంది. ఇటువంటి విగ్రహాలు బోలుగా ఉండటంవల్ల, బరువు తక్కువగా ఉండి, ఎక్కడికైనా తీసుకొని పోవటానికి వీలుగా ఉంటాయి. మొట్టమొదట్లో ఇటువంటి కాంస్య విగ్రహాలను ఘనరూపమున (బోలుగా గాకుండ) పోత పోయటమే జరుగుతూ ఉండేది. అయితే దీనిలో ఒక ప్రమాదం ఉంది. ఘనరాశిగా ఉండే లోహం. పోత పోసిన తరవాత చల్లబడుటలో విషమరీతిలో అక్కడక్కడ క్రుంగుదలలను పొంది, తద్వారా రూప వికృతిని చెందవచ్చు. బోలు విగ్రహాల (సుషిర విగ్రహాల) పోతలో ఈ ప్రమాదము చాలా తక్కువ. ఇటువంటి బోలు విగ్రహాల పోతకు రెండు పద్ధతులు - మధూచ్ఛిష్ట విధానం (*lost wax process*), సికతా నిష్యందం (*sand casting*) అమలులో ఉన్నాయి.

(చూ : *lost wax process; sand casting*).

**bronzing** : *కాంస్యీకరణ.*

ప్లాస్టరు విగ్రహాలు, కంచు విగ్రహాల వలె కనిపించటానికిగాను రంగువేయటం. కిలుము రంగు (*vert antique*) అనే దానిని తరచుగా దీని కోసం వాడతారు.

**bronzing liquid** : *కాంస్యీకరణ ద్రవం.*

లోహ వర్ణాలను తయారు చేయటానికి అల్యూమినియం, కంచు చూర్ణాలలో వాడే చమురు. దీన్ని ఎప్పటికప్పుడు కలుపుకోవటం శ్రేష్ఠం.

**brown coat** : *విరంగ పటలం; గోధుమ పూత; ముదురు పూత.*

భిత్తి చిత్రాలను రచించటానికి సిద్ధపడే ఉపరితలంపై పూసే రెండవ పూత. దీనిలో ఒక పాలు సున్నం, రెండున్నర పాళ్లు ఇసుక గాని, పాలరాతి పొడిగాని ఉంటాయి. తొలి పూత పూర్తిగా ఆరి గట్టిపడ్డ తరవాత, నీటిని చల్లి ఈ పూత పూయాలి. కొన్ని సందర్భాలలో దీన్ని రెండుసార్లు కూడా వేస్తారు. అప్పుడు మొదటిసారి పలచగా పూసి, రెండో సారి చిక్కగా, మందంగా పూస్తారు. దీని ఇటాలియన్ భాషా నామం అర్రిసియో (*arriccio*).

**brown pigments** : *కపిశ వర్ణద్రవ్యాలు; గోధుమరంగు వర్ణద్రవ్యాలు.*

ప్రామాణిక వర్ణ పట్టిక (పెయింట్ స్టాండర్డ్) లో అంగీకరించబడిన గోధుమ రంగులు: ముడి అంబర్, కాల్చిన సియెన్నా, పారదర్శక కపిశ వర్ణం.

**Brucke, die** : సేతువు

1905లో డ్రెస్‌డెన్ నగరంలో స్థాపితమైన భావనావాద కళాకారుల సమాఖ్య. దీనిని స్థాపించినవారు : ఎరిక్ హెకెల్, ఎర్నెస్ట్ లడ్విగ్ కిర్చ్‌నర్, కారల్ ష్మిట్, రాట్లఫ్ ప్లీట్ బెయిల్. తరవాత ఆ సమాఖ్యలో యాక్సెల్ గేలెన్, ఎమిల్ నోల్డ్, మేక్స్ పెక్‌స్టీన్, ఆటో ముల్లరు చేరారు. వీరి రచనలపై వాంగో, గాగిన్, మంచ్‌ల ప్రభావమే గాక వన్యవాద (ఫావిజమ్)పు ప్రభావం కూడా గాఢంగా ప్రసరించింది. ఆదిమ మానవ కళా ప్రభావం కూడా దీనిపై పడింది. 1913లో తాను విడిపోవటానికి ముందుగా ఈ సమాఖ్య, జర్మనీలో నవ్యకళ పట్ల అభిరుచిని, గ్రాఫిక కళలలో అభిమానాన్ని వృద్ధి పరిచింది. వీరి ప్రతికల్పనా రూపాలకున్నూ, తరవాత వచ్చిన నీలాశ్విక వర్గపు చిత్రాలకున్నూ మధ్య వైరుధ్యం ఉంది.

1905లో ఈ సమాఖ్య తాను రూపొందిన్నప్పటి నుంచి, ప్రదర్శనలను అనేక ప్రాంతాలలో నిర్వహించింది. 1908లో పారిస్ నగరంలో ఖ్యాతి నార్జించిన కీస్ వాన్ డాన్‌జన్ ఈ సమాఖ్యకు తన సానుభూతిని ప్రకటించాడు. బెర్లినర్ స్ట్రాస్‌లో కిర్చ్‌నర్ స్టూడియో ఉండేది. అది వస్తుతః ఒక అంగడి. దానిలో గోడలపై కిర్చ్‌నర్ అనేక చిత్రాలను రచించి స్టూడియోగా మార్చాడు. అక్కడనే తరచుగా ఈసమాఖ్య సమావేశమవుతూ ఉండేది. అక్కడి వారు తయారు చేసిన దారుశిల్పాలు, పాత చెక్క పెట్టెలను విరగగొట్టి చేసిన కుర్చీలు ఉండేవి. అక్కడనే ఒక మోడలును పెట్టుకొని వాళ్ళందరు కళాసాధన చేస్తూ ఉండేవారు. తరవాత ఈ సమాఖ్య బెర్లినుకు తరలి పోయింది. ఇట్లా తరలి పోవటానికి పూర్వమే 1910లో ముల్లరు ఈ సమాఖ్యలో చేరాడు. అప్పటికే సమాఖ్యా సభ్యులలో భేదాభిప్రా

హాలు కలిగాయి. 1907లో కోర్డ్, 1909లో బ్రెయిల్ విడిపోయారు పెక్‌స్టీన్ 1912లో సమాఖ్య నుంచి బహిష్కృతుడైనాడు

ఈ సమాఖ్య ఆనాటి జర్మన్ ప్రజల మనసులలోని అశాంతికి చిహ్నమని చెప్పవచ్చు. దీనిలోని కళాకారులంతా, ధార్మిక, లైంగిక, రాజకీయ, నైతిక సమస్యలలో ఏదైనా ఒక దానిలో చిక్కుకొన్నవారే. నాటకీయమైన ప్రకృతి దృశ్యాలు, నగ్న చిత్రాలు, మగ్న భావనలు, పల్లె సీమల వీధులు, సర్కసులు, పానశాలలు -వీరి రచనా వస్తువులు. కాంతివంతములైన తీవ్ర రేఖలపై, ఆకారాలపై నీగ్రో కళ, ఆదిమ దారు శిల్పాల, శిల్పాల ప్రభావము ఉంది తొలిదశలో ఈ సమాఖ్యలోని సభ్యులు ఒకే ప్రదేశంలో తమ రచనలు సాగించడంవల్ల వీరి శైలి ఒకే తీరున ఉండేది కాని వీరిలో విభేదం పొడచూపి సమాఖ్య బెర్లిన్ నగరానికి తరలి వెళ్ళిన తరవాత వ్యక్తిగత శైలులు ఆరంభమైనాయి మొదటి ప్రపంచ యుద్ధం ఆరంభం కావడంతో వీరిలో ఎవరి దారి వారిదైంది.

**Bruges school:** *బ్రుగెస్ కళాసంప్రదాయం.*

15వ శతాబ్దిలో బెల్జియంలోని బ్రుగెస్ నగరంలో ఫ్లెమిష్ కళాకారులు ప్రవర్తింప జేసిన ఒక సంప్రదాయం. వీరిలో ప్రథమ గణ్యులు: జాన్ వాన్ ఐక్, హ్యూబర్ట్ వాన్ ఐక్ వీరినే సమగ్ర ఫ్లెమిష్ సంప్రదాయ స్థాపకులని అనవచ్చు. బ్రుగెస్ సంప్రదాయంవారు తమ చిత్రాలలో మూర్తులతో పాటు, ఆ మూర్తుల పరిసరాలకున్నూ ప్రాధాన్యమిచ్చారు తరవాతి కాలపు చిత్రకారుడైన పెట్రస్ క్రిస్టస్, పైజాన్, హ్యూబర్ట్‌ల సుసంపన్న శైలిని కొనసాగించారు. కాని, హాన్స్ మెమ్లింగ్, ఘిరార్డ్ డేవిడ్ అనే చిత్రకారుల రచనలే మధ్యతరగతి వాళ్ళను బాగా ఆకర్షించాయి.

**Brunswick blue :** *బ్రన్స్‌విక్ నీలిమ.*

ఒక రకపు ప్రషియన్ నీలిమ. అయితే ప్రషియన్ నీలిమలో కన్నా ఎక్కువగ ముగ్గురాతిని, కొన్ని సందర్భాలలో అతిసాగరిక నీలిమను కూడా కొంత కలుపుతారు. అందువల్లనే ఉన్నతస్థాయికి చెందిన పరిశ్రమలలో పైపూతలకుగాని, చిత్రకారుల రంగులలోగాని దీనికి వాడుక కనపడదు.

**Brunswick green :** *బ్రన్స్‌విక్ హరితం.*

క్రోమ్ హరితంలో ఒక రకానికి చెందినది. బ్రన్స్‌విక్ నీలిమను. జడ మిశ్రితమైన క్రోమ్ పసిమిని ఉపయోగించి దీన్ని తయారుచేస్తారు. దీనికి "ప్రషియన్ హరితం" అనే పేరు కూడా ఉంది

**brush :** *కుంచె, తూలిక.*

రంగు పూయటానికి ఉపయోగించే సాధనం జంతు రోమాలను కావలసిన రీతిలో దీనికై గుచ్చియెత్తి, రేకు గొట్టంలో బిగించి, ఆ గొట్టానికి కొయ్య పిడి ఏర్పరుస్తారు, ఎర్ర



కుంచె, (తూలిక).

సేబిల్ రోమాల కుంచెలు చాల ఖరీదైనవి. మెత్తని రోమాల కుంచెలను, నీటి వర్ణాలకు, అప్పుడప్పుడు తైలవర్ణాలకు కూడా వాడుతారు. బిరుసైన రోమాల కుంచెలు తైలవర్ణాలకే పనికి వస్తాయి. అక్రిలీయ, పాలిమర్ వర్ణాలతో వాడటానికి, ఇప్పుడు నైలాన్ కుంచెలు కూడా తయారవుతున్నాయి. కుంచెలలో ఎన్నో రకాలున్నాయి. ఇంచుమించు అన్ని రకాల కుంచెలు, చేతితోనే తయారవుతున్నాయి. కుశలులైన పనివారు మేలి రకపు రోమాలతో ఉత్తమమైన కుంచెలను తయారు చేయగలరు.

**brush, acrylic :** *అక్రిలీయ కుంచె; అక్రిలీయ తూలిక.*

నీటితో కలిసే అక్రిలీయ, పాలిమర్ వర్ణాలతో వాడటానికి నైలాన్ నారతో తయారయ్యే కుంచె; పై రంగులు త్వరితంగా ఆరిపోయేవి కాబట్టి కుంచెలను ఒకసారి వాడి, రంగుతోనే విడిగా ఉంచవలసినప్పుడు, నీటితో ముంచి ఉంచాలి. జంతు రోమాలతో తయారైన కుంచెలు ఎక్కువ కాలముంచితే దెబ్బతింటాయి. కాని నైలాన్ కుంచెలు చెడిపోవు. ఈ కుంచెలు ఎక్కువ రంగునుకూడ గ్రహించగలవు. తడిగా ఉన్నప్పుడు చల్లటి నీటిలోను, ఎండినప్పుడు వేడి నీటిలోను నానబెట్టి ఈ కుంచెలను శుభ్రపరచవచ్చు.

**brush, bristle:** *వరాహ తూలిక.*

మగపంది శరీరంపై ఉండే బిరుసైన రోమాలతో తయారయ్యే కుంచె. దీన్ని తైలవర్ణాలతో వాడుతారు. ఈకుంచె గుండ్రంగాను, బద్దవాటు గాను, కోలగాను, పొడుగు గాను పొట్టిగాను ఉండవచ్చు. ఇది 0 నుంచి 12 నెంబరు సైజు వరకు ఉంటుంది. మళ్ళీ వీటిలో ఒక్కొక్క దానిలో, రోమపు పొడవును బట్టి, వేరే వేరే రకాలు తయారవుతాయి. ఉత్తమమైన తైలవర్ణపు కుంచెల రోమాలు లోపలి వైపుకు వంగి ఉంటాయి. దీనివల్ల కుంచెను నొక్కి పూసినప్పుడు రోమాలు అటూ ఇటూ చెదరిపోక, సమానంగా, కలిసి ఉంటాయి. 1860 కు పూర్వం గుండ్రని కుంచెలనే వాడేవారు; కాని ఇప్పుడు బద్దవాటు కుంచెలనే ఎక్కువగ వాడుతున్నారు.

**brush cleaner or brush washer :** *తూలికా శోధని.*

కుంచెలను కడగటానికి కర్పూర తైలం వంటి ద్రవాలను పోసే పాత్ర. నీటి రంగులను వాడే కుంచెలను కడగటానికి ఉపయోగించే పాత్ర, గాజుతో చేయబడి, కూజాలాగా ఉంటుంది. కుంచె చివర పాత్రలో మునిగేట్టు, కుంచె పిడి కూజా పై అంచును తగులుకొని ఉండేటట్లు ఏర్పాటు ఉంటుంది. ఇందువల్ల కుంచెలు, అడుగు తగలకుండా, నీటిలో వ్రేలాడ గలుగుతాయి. తైల వర్ణాలను వాడే కుంచెలను కడగటానికి ఉపయోగించే పాత్ర రెండు పొరలు కలిగి తొట్టిలాగా ఉంటుంది. పైపొర అడుగుభాగము జల్లెడలాగా ఉంటుంది. కుంచెను దానిపై రుద్దినప్పుడు దానికి పట్టుకొన్న రంగంతా కర్పూర తైలంలో కరిగి పోతుంది.



తూలికా శోధని.

**brush drawing : *తూలికా లేఖనం.***

తూలిక చిత్రలేఖనానికే గాక, ఆలేఖనానికి కూడా పనికి వస్తుంది. ఇటువంటి ఆలేఖానికి తూలికను ఎక్కువగా ఉపయోగించిన వాళ్ళు చీనీయ కళాకారులు. చీనీయుల లిపియే ఇటువంటి ఆలేఖనంగా పరిగణించ దగినది. చీనీయులే గాదు; అతి ప్రాచీన పురా చారిత్రక కళ అయిన మెగ్దలీనియన్ కళలోకూడా ఆలేఖనానికి తూలిక వాడబడినట్లు వాళ్ళ రచనలు స్పష్టం చేస్తున్నాయి. ప్రాచీన గ్రీసులోను, రోమనులోను మధ్యయుగాలలోను తూలికను ఈ విధంగానే పనిగొన్న నిదర్శనాలున్నాయి.

ఆధునిక యుగంలో తూలికను ఆలేఖనాలకై వాడినప్రముఖ చిత్రకారులు : గెరికాల్ట్, డె-క్రాయ్, డామియెర్, దేగాస్.

**brush, hair : *రోమ తూలిక.***

సున్నితంగా ఉండే జంతువుల మృదుమైన రోమాలతో తయారైన కుంచె. ఇటువంటి కుంచెలలో అత్యుత్తమమైనవి ఎర్రసేబిల్ అనబడే జంతువు యొక్క రోమాలతోను, తగ్గరకపు ఎద్దు రోమాలతోను తయారవుతాయి. ఉడుత వెంట్రుకలతోకూడ కుంచెలను తయారు చేస్తారు వీటినే ఒంటె రోమపు తూలికలంటారు బేడ్జర్, ఫిట్చ్ అనే జంతువుల రోమాలను కూడా కుంచెలకు ఉపయోగిస్తారు.

(చూ : *Camel hair*)

**brush, quill : *ఈకకుంచె.***

రేకు గొట్టంలో గాక, పక్షి ఈకకు కట్టి తయారు చేసిన కుంచె. దీన్ని సాధారణంగా కొయ్యపిడి లేకుండానే వాడతారు. 19వ శతాబ్ది నాటికి వీటి వాడుక అంతరించింది.

**brush, red sable : *ఎర్రసేబిల్ కుంచె.***

సైబీరియాలోని కొలిన్స్కి అనే జంతువు రోమాలతో తయారు చేసే కుంచె. ఈ జంతువునే ఎర్రసేబిల్ అని కూడా వ్యవహరిస్తారు. స్నిగ్ధమైన తైల పదార్థాలకున్నూ, నీటి రంగులకున్నూ, దీనిని వాడతారు. ఈ రోమాల ఆకారమూ, మార్దవము, కుంచెలను సూది మొన తేలేటట్లు చేస్తాయి. సరియైన గుండ్రని కుంచె, గొట్టంలో బిగించిన చోట కొంత సన్నంగాను మధ్యన పొట్టవలె ఉబ్బి లావుగాను, చివరన సూక్ష్మమైన లాగాను ఉంటుంది.

**brush stroke : *తూలికా పరిమర్శనం;***

***కుంచె విసురు; తూలికా ప్రహారము; తూలికాహతి***

**bubinga : *బుబింగం.***

పశ్చిమ ఆఫ్రికాలో ఒక రకపు వృక్షం నుంచి లభించే దారువిశేషం. ఇది గట్టితనానికి, మన్నికకు పేరు పొందింది. కూర్పు చెక్క (*veneer*)గా దీన్ని విశేషంగా వాడతారు

**bucchero ware : *బుచెరో సామగ్రి.***

ఎట్రుస్కన్ తెగవారు తయారు చేసిన నల్ల పింగాణి పాత్రలు. నలుపు మెరుగును పాత్రలకు పెట్టటాన్ని గ్రీకుల నుంచి తాము నేర్చుకోవటానికి పూర్వం, ఎట్రుస్కన్‌లు ఇటువంటి సామగ్రిని తయారు చేసేవారు. ఇనుపఖనిజము ఎక్కువగ కలిగిన పింగాణిమట్టితో ఈ పాత్రలను నిర్మించి, తక్కువ వేడిలో కాల్చేవారు.

**buckeye : *హారిబాళికం.***

అత్యధిక సంఖ్యలో అమ్ముడు పోవటానికి గాను - వైవిధ్యం అనేది ఏ మాత్రం లేకుండా తయారైన ప్రకృతి దృశ్య తైలచిత్రాల ఒక వర్గానికి హేళన పూర్వకంగా పెట్టిన పేరు. వీటిని కారు చౌకగా బజారులో అమ్మేవారు.

అటువంటి చిత్రాలు 19వ శతాబ్ది ఉత్తరార్థంలో విరివిగా వచ్చినా, ఈ కాలంలోనైతము తయారవుతూనే ఉన్నాయని చెప్పవచ్చు.

**buckling** *ముడత.*

1. చట్రానికి బిగించిన కాటిక వదులుగా ఉండటంవల్ల వచ్చే ముడత; ఏదైనా కాగితాన్ని అట్టపై అతికించిన తరవాత కాగితం మీద వచ్చే ముడత.

2. భూమికకు, ఉపాధికి మధ్య వచ్చిన దీటువల్ల చిత్రంలో అలలాగా ఉబ్బెత్తుగ కనపడే భాగం.

**bucranium :** *వృషభ శిరం.*

అతి ప్రాచీనమైన సుమేరియన్, క్రీటు నాగరికతలో చిత్రితమైన కుండలపై కనపడే ఆలంకారిక ప్రలక్షణం. దేవతాబలులకై నిర్దేశించిన పశువుల తలలను సూచించటానికి ఇది మొదట్లో ప్రయుక్తమై ఉంటుందని పండితుల ఊహ.

**buhl :** *బౌలీ*

(చూ : *boulle - work*)

**building board :** *నిర్మాణాస్తరం*

(చూ : *wall board*)

**bull hide :** *అర్షభ చర్మం;*

*ఎద్దు చర్మం.*

**bull point :** *అక్షసూచి*

(చూ : *point*)

**buon fresco :** *అచ్చ నవ్యసున్నం;*

*అచ్చ భిత్తిచిత్రం.*

అటువంటి చిత్రాన్ని రూపొందించటానికి గోడపై భూమికగా పూసిన పూత. తడిగా ఉండగానే దీనిపై రంగులను వేయాలి. ఇదే నిజమైన భిత్తిచిత్రం. ఆరిపోయిన భూమికపై చిత్రిస్తే నిజమైన భిత్తిచిత్రం కాదు.

**Burgundy, school of :** *బర్గండీ సంప్రదాయం.*

ఫ్రాన్సులో 14వ శతాబ్ది అంతాన, 15వ శతాబ్ది పూర్వార్ధాన వర్ధిల్లిన ఒక కళా సంప్రదాయం అప్పటిలో దేశపాలకుడైన చార్లెస్VI యుక్తవయస్కుడు కానందువల్ల అతనికి పోషకుడుగా ఉన్న ఫిలిప్పు (బర్గండీ జమీందారు) యొక్క ఆదరణలో ఈ సంప్రదాయం రూపొందింది. ఆ ఫిలిప్పు యొక్క భార్య ఫ్లాండర్సుకు చెందింది కావటం వలన, ఆ జమీందారుని ఆస్థానంలో ఫ్లెమిష్ కళాకార ప్రముఖులు పలువురు చేరి ఆ సంప్రదాయానికి రూపు ఇచ్చారు కొన్ని ఫలక చిత్రాలను, కొన్ని అలంకృత చిత్రాలను వారు రచించారు. వీటిలో ఫ్రాన్సు దేశపు లక్షణాలకన్నా ఫ్లాండర్సు లోనివే ఎక్కువగా కనపడతాయి. అప్పటి వరకు ఫ్రాన్సులో వ్యాప్తిలో ఉన్న ఇటలీయ శైలికి తగిన మార్పులను ఈ ఫ్లెమిష్ చిత్రకారులు సమకూర్చారు తరవాతి కాలంలో ఈ సంప్రదాయమే అంతర్జాతీయ గాతిక్ శైలికి దారితీసి ఉంటుందని పండితుల అభిప్రాయం.

**Burgundy turpentine :** *బర్గండీ కర్పూర తైలం.*

యూరపీయ దేవదారు వృక్షం నుంచి లభించే ఒక విధపు రాల్చం (తైలయుక్త రూపం). ఫ్రెంచి కర్పూరతైలానికిన్నీ, యుక్త రూప వస్తువులకున్నూ కూడా ఈ దేవదారు వృక్షమే ఆలంబనం. సులభంగా బజారులో లభ్యమయ్యే వెనిస్ కర్పూర తైలం కన్న బర్గండీ కర్పూర తైలము మేలైంది కాదు.

**Burgundy violet :** *బర్గండీ రాజనీలం.*

మాంగనీస్ రాజనీలానికి ఒక పర్యాయ నామం.

**burl**: *కొయ్య ముడి.*

చెట్లలో బోదెలలోను, కొమ్మలలోను సహజంగా ఏర్పడే ముడి. దీన్ని కోస్తే లోపల చక్కటి గీతలు గల డాయలు వస్తాయి.

**burnisher** : *తేజకము; రోచకము; మెరుగు పనిముట్టు*

ఇది, పనుపై గుండ్రంగా ఉండే మొన కలిగిన పనిముట్టు మెరుగు పెట్టటానికి, నునుపు చేయటానికి దీన్ని వాడతారు. ఇది అనేక పరిమాణాలలోను, ఆకారాలలోను లభిస్తుంది. దీన్ని సాధారణంగా ఒకవిధపు కెంపుజాతి రాయి (*Agate*)తో తయారు చేసి కొయ్యపిడిలో బిగించేవారు. ఇది చాల ఖరీదైనది. అందువల్ల ప్రసిద్ధ కళాకారుడు, రచయిత అయిన సెన్నినో సెన్నిని, కాకిరాతి (హెమటైట్)నిగాని, పక్క దంతాన్ని గాని ఇందుకై ఉపయోగించ వలసిందిగా సలహా ఇచ్చారు.



తేజకములు

**burnt carmine** : *తప్త జతువం.*

జతుసమును జాగ్రత్తగా దహించి, లేదా మార్చి తయారు చేసే ఒక వర్ణద్రవ్యం. ఇది కపిశచ్ఛాయ గల నీలలోహితంగానో లేదా నీలలోహిత ఛాయ గల కపిశంగానో కన పడుతుంది.

**burnt gypsum** : *జిప్సం పొడి.*

నీటిని పూర్తిగ తొలగించివేసిన జిప్సం (ఒక విధపు సున్నపు రాయి). కీనీ సిమెంటు మొదలైన ప్లాస్టర్లు తయారు చేయటానికి ఇది పనికి వస్తుంది. ఇటువంటి ప్లాస్టర్లు చాల మన్నిక కలిగి గట్టిగా ఉంటాయి.

**burnt ochre**: *తప్త రక్తోపలం.*

పసుపువాక కాకి రాళ్లలో మేలైన రకాన్ని పేరి భస్మీకరించటం వల్ల లభించే ఎర్రని వర్ణ ద్రవ్యం.

**burnt-oil varnish** : *తప్త తైలిక*

(చూ : *litho varnish*)

**burnt sienna** : *తప్త స్యేన్నం.*

ఇటుక రంగుకు దగ్గరగా ఉండే వర్ణం. ఒక విధపు మట్టిని కాల్చినప్పుడు తయారయ్యే రంగు. ఇది మిక్కిలి ఉపయోగకరమైన కాంతి వంతమైన రంగు. ఇటలీ లోని సీనా నగర పరిసరాలలో స్వచ్ఛమైన ఇటువంటి మట్టి లభిస్తుంది. అందువల్లనే దీనికి పాశ్చాత్య భాషల్లో సీనా అనే పేరు వచ్చింది.

**burnt umber** : *తప్త కృష్ణమటి, కాల్చిన అంబరు.*

**burin** : *పోగర.*

(చూ: *graver*)

**burr** : *గొగ్గు; వంవరము.*

లోహ ఫలకం పై రేఖలు చెక్కేటప్పుడు ఆ రేఖలలో వచ్చే పొచ్చు తగ్గుల చీలిక. ఒక్కొక్కప్పుడు ఈ గొగ్గులను ఉన్నట్లే వదలి వేస్తారు రేఖ సూటిగా ఉండవలెనంటే అటువంటి గొగ్గులను వదునుబద్దతో తొలగించి చక్క జేస్తారు.

**bushhammer** : చెక్కుడు సుత్తి.

రెండు వైపుల మొనలుదేలిన పెక్కు గుబ్బలు కలిగి, ఇటుక ఆకారంలో ఉండే బరువైన



చెక్కుడు సుత్తి

సుత్తి. దీన్ని రాతి చెక్కడపు పనిలో ఉపయోగిస్తారు ఇది చాలా సైజులలో లభిస్తుంది.

**bust** : ఊర్ధ్వకాయ వక్షస్యం

శిరస్సు, భుజాలు, ఉరస్థలం వరకు మాత్రమే ఉండే శిల్పం లేదా చిత్రం. దీనిని సాధారణంగా స్తంభంవంటి ఎత్తైన పీఠంపై ఉంచుతారు.

**bust peg** : శిల్పాధారం.

చదరంగా ఉండే ఒక కొయ్యపలక. దీని మధ్యన ఒక నిటారైన కొయ్యను బిగిస్తారు. ఈ కొయ్యపైనే మట్టితో చేసే శిల్పాలను మలుస్తారు

**butterfly** : తిక్కుడి పలక; చిత్రాంగం.

శిలువ ఆకారంగా ఉండే ఒక కొయ్య పరికరం మట్టితో శిల్పాలను తయారు చేయటంలో, ఆ మట్టి జారి పడిపోకుండా ఇది ఆధారంగా ఉంటుంది. శిల్పాలను తయారు చేసేటప్పుడు అవసరం బట్టి చాలా చోట్ల దీన్ని తగిలించవచ్చు

**bu tery paints** : నవనీత వర్ణాలు.

**butt join** : అంచతుకు.

ఒక ముక్క, రెండవ ముక్కపై ఎక్కకుండా, అంచులను అతికి ఒకటిగా చేయటం. పెద్ద చిత్రాలను తయారు చేసేటప్పుడు, ఆ చిత్రాల కొన్ని భాగాలను విడివిడిగా ముందు తయారు చేసి, తరవాత వాటిని ఈ పద్ధతిలో అతుకుతారు

**Byzantine** · బైజాంటీయ

రోమన్ సామ్రాజ్య పతనానంతరం ప్రాచ్య భాగంలో రూపొందిన క్రైస్తవ సామ్రాజ్యంలో వర్ధిల్లిన కళకు ఉపయోగించే విశేషణం. కాన్‌స్టాంటినోపిల్ నగరము రాజధానిగా ఆ సామ్రాజ్యం మనినంత కాలం క్రీ. శ. 330 మొదలుగా ఆ కళ వర్ధిల్లింది. ఈ కాన్‌స్టాంటినోపిల్ ఉన్న స్థానంలోనే ప్రాచీన కాలంలో బైజాంటియం అనే గ్రీకు నగరం ఉండేది. అందువల్లనే ఈ కళకు బైజాంటీయ కళ అనే పేరు వచ్చింది. క్రీ. శ. 1450 ప్రాంతంలో తురుష్కులు, కాన్‌స్టాంటినోపిల్‌ను వశపరచుకోవటంతో ఆ కళ అంతరించింది. ఆ కాన్‌స్టాంటినోపిల్ నగరము ఈ కాలంలో ఇస్తాన్‌బుల్ అని వ్యవహృతమవుతున్నది.

బైజాంటీయ కళ అచ్చంగా మతపరమైనది. ఆ కాలంలో చర్చిలను చిత్రాస్తరాలతో, భిత్తి చిత్రాలతో, రాతి చెక్కడాలతో సమగ్రంగా అలంకరించారు. ఇటలీలో రావెన్నా నగరపు దేవాలయాలలోను ఇటువంటి కళ కనపడుతుంది. ఈ రావెన్నా నగరము ఒకప్పుడు రోమన్ రాజధానిగా ఉంది, క్రీ.శ. 584 నుండి 752 వరకు ప్రాచ్య క్రైస్తవ సామ్రాజ్యానికి సామంత రాజ్యంగా ఉండినది.

క్రీ. శ. 726 నుంచి 824 వరకు చెలరేగిన విగ్రహారాధనా వ్యతిరేకోద్యమపు కాలంలో జ్యామితీయరూపాలు, వృక్ష లతా గుల్మాది రూపాలు ఈ కళలో అభివృద్ధి చెందాయి. తరవాత వచ్చిన విగ్రహాలు క్రైస్తవాగమాలను అనుసరించి ఉన్నాయి. శిల్పము అల్పోల్పణ రూపాలకే పరిమితమైనా దంత, లోహ, ఆభాసికం పనితనంలో, గ్రంథచిత్రణంలో, ఈ కళ గొప్ప స్థాయిని అందుకొన్నది. ఆనాటి వాస్తుకళ హెల్లెనీయ, రోమన్, ప్రాచ్య శైలుల సమ్మేళనమై అలంకారపూర్ణంగా ఉండినది.

# C

**cabinet picture** : *సముద్గ చిత్రం.*

సొరటి (*easel*)పై కాటికను ఉంచి రచించే చిన్న చిత్రం ఇది సాధారణంగా 76 సెం మీ వెడల్పుకు మించి ఉండదు ఇండ్లలో చిన్న చిన్న గదులలో వ్రేలాడ తీయటానికి, దగ్గర నుంచి చూడటానికి ఈ చిత్రాలు అనువుగా ఉంటాయి.

**cabinet work** : *సముద్గ రచన.*

కొయ్యను, అందుతోపాటుగా గాజు పలకలను కూడా కొన్ని సందర్భాలలో వాడి, సొరుగులు గల పెట్టెలను తయారు చేసే పని.

**cable** : *ప్రరజ్జువు*

**cabochon** : *గోళాలంకృతి.*

కొయ్యలో గాని, రాతిలో గాని అర్ధ గోళాకారంగా, ఉన్నెత్తుగా ఉండే లతాపుల గంధరింపు

**cachet** : *సంకేత ముద్ర.*

సంతకాలకు బదులుగా వాడే ఒక విధమైన ముద్ర. దీనిలోని అక్షరాలు అందంగా, జంతువుల, ఆకుల, పూల రూపంలో అలంకృతాలై ఉంటాయి

**Cadmium green** : *కాడ్మియం హరితం.*

శాశ్వత హరితానికి ఒక పర్యాయ పదం. కాడ్మియం అనేది ఒక లోహం.

**cadmium red** : *కాడ్మియం ఎరుపు.*

ఈ ఎరుపులో అనేక విధాలున్నాయి. కాడ్మియమ్ సల్ఫైడ్, కాడ్మియమ్ సెలనైడు అనేవి వివిధ నిష్పత్తులలో కలియటం వల్ల ఈ ఎరుపు రంగులు తయారవుతున్నాయి. (తక్కిన వివరాలకు చూ: *cadmium yellow*)

**cadmium yellow** : *కాడ్మియం పసుపు.*

ఈ పసుపు రంగులు కాడ్మియం సల్ఫైడ్ నుంచి తయారవుతాయి. ఈ పసుపు రంగులు గానీ, కాడ్మియం ఎరుపు రంగులుగానీ, మన్నిక గలిగి, సాంద్రమై, తేజోవంతంగా, కాంత్యభేద్యాలై ఉంటాయి. కళాకారుడు ఉపయోగించే వర్ణాలలో ఇవి చాలా ముఖ్యమైనవి.

**Caen stone** : *కేనీయ శిల.*

మీగడ చాయ గల ఒక విధపు సున్నపు రాయి; మృదువుగా, లేతరంగు గలిగి ఉంటుంది. ఇది ఫ్రాన్స్ దేశమున నార్మండీలో 'కేయన్' అనే చోట లభిస్తుంది. ఆధునిక ఆంగ్లశిల్పులు దీన్ని శిల్పంలో వాడుతున్నారు. గృహాంతరపు అలంకరణకు ఇదిబాగా పనికివస్తుంది. ఇది మలచటానికి చాలా అనువైనది. దీనిలోని దారకూర్పు చాలా రమ్యంగా ఉంటుంది.

**caeruleum** : *సెరూలియం.*

ఆకాశ నీలిమ వర్ణానికి లాటిన్ భాషా పదం. ఈజిప్టు నీలిమకు ఇది పర్యాయ నామం. (చూ: *cerulean blue*)

**calcimine or kalsomine** : *అలేప సుధ.*

తెల్ల మట్టి, సుద్ద, సరీసులను, నీటిలో కలిపి తయారు చేసే లేపం. ఇది ఇంటి కప్పులకు గాని, గోడలకుగాని వేయటానికి ఉపయోగిస్తుంది. ఇది చాల తెల్లగా ఉంటుంది. దీన్ని నీటితో చెరిపివేయ వచ్చు.

**calcination** : *భస్మీకరణం.*

**calcine** : *భస్మీకరించు.*

బట్టీలో వేసి ఎక్కువ ఉష్ణోగ్రతతో కాల్చటం ఇట్లా కాల్చడం వల్ల ఒక పదార్థాన్ని మెత్తని పొడిగా చేయవచ్చు. మట్టి రంగుల ధాతువులను మార్చటానికి, ఖనిజాలలోని నీటిని తీసివేయటానికి భస్మీకరణం పనికి వస్తుంది.

**calcined magnesite** : *భస్మీకృత మాగ్నసైట్.*

ఆక్సీ క్లోరైడ్ సిమెంట్‌ను తయారు చేయటానికి పనికి వచ్చే వివిధ పదార్థాలలో ఇది ఒకటి. మెగ్నీషియమ్ కార్బొనేట్‌ను-దానిలోని 90% మెగ్నీషియమ్ ఆక్సయిడుగా మారేంత వరకు-వహించడం వల్ల ఇది రూపొందుతుంది.

**Caledonian brown** : *కెలెడోనియా కపిశం*

సహజ సిద్ధంగా భూమిలో లభించే ఒక మట్టి రంగు. తప్ప స్విన్నాన్ని, ఇది కొంత వరకు పోలి ఉంటుంది. అయితే పూతరంగుగా అంతగా గణనీయం కాదు.

**Caledonian white** : *కెలెడోనియా తెలుపు.*

పూతవనికి పనికివచ్చేదిగా 19 వ శతాబ్దిలో వాడుకలో ఉండిన ఒక వర్ణ ద్రవ్యం. లెడ్ క్లోరో - సల్ఫయిడ్ అనేది దీని రాసాయనికనామం. అయితే దీన్ని ఇపుడు చాలా అరుదుగా ఉపయోగిస్తారు.

**calendering** : *స్నిగ్ధీకరణం.*

రెండు రోలర్లమధ్య ఏదైనా ఒక కాగితాన్ని గానీ, గుడ్డను గానీ ఉంచి, ఒత్తిడి కలిగించి నునుపుదనము తేవటం. ఆ ఒత్తిడిని ఎక్కువ చేసినప్పుడు అటువంటి వస్తువుకు మెరుగు కూడ వస్తుంది.

**calf-skin glue**: *మేలి జిగురు; మేలి వజ్రీను.*

**calipers**: *సందంశ మాపకం.*

పట్టుకారు లాగా ఉండే ఒక విధమైన కొలత పరికరం. శిల్పులు వాడే ఇటువంటి పరికరాన్ని కొయ్యతో చేసి, చివర లోహపు పట్టుకారును బిగించేవారు. ఇప్పుడీ సాధనం



సందంశ మాపకం

అల్యూమినియంలో తయారవు తున్నది. శిల్పాల కొలతలు తీసుకోవటానికి, శిల్పాల నకళ్లను తీసుకోవటానికి ఇది బాగా పనికి వస్తుంది. వివిధ ప్రమాణాలలో ఇవి తయారవుతున్నవి.

**calligraphy**: *లిపి చిత్రణ; అక్షర విన్యాసం.*

కళాత్మకమైన చేతివ్రాత. అలంకరణ సాధించడంలో లిపిలోని సహజత కొంత తగ్గి పోవచ్చు. వీటిలో మూడు ముఖ్య శాఖలు-గోతిక్, రోమన్, ఇటాలిక్-ఉన్నాయి ఇవి 12 - 15 శతాబ్దాల మధ్య రూపుగొన్నవి. ఈ చిత్రణ నిమిత్తం ప్రత్యేకమైన లేఖినిని వాడతారు. దీన్ని రమ్యలేఖని (*lettering pen*) అంటారు. అయినా మధ్యయుగాల లోని వ్రాతప్రతులలో ఇటువంటి చిత్రణతె

తలకలను, సూదిగా చెక్కిన పుల్లలను వాడే వారు.

**calm :** *కేమిక.*

*came* అనే దానికి పర్యాయ రూపం.
(చూ : *came*)

**Calvary cross:** *కల్వారీ శిలువ.*

మూడు మెట్లు గల దిమ్మెపై కట్టిన లాటిన్ సిలువ (చూ: *cross*). ఈ మూడు మెట్లు క్రైస్తవ మత మూల లక్షణాలైన శ్రద్ధ, ఆశ, వదాన్యత అనే వాటికి చిహ్నాలు.

**camaieu:** *వర్ణైక చిత్రం*

ఒకే రంగు యొక్క వివిధమైన ఛాయలతో రచించిన చిత్రం. దీన్ని బూడిద రంగు ఛాయలలో రచించినప్పుడు ధూసర వర్ణైకం (*grisaille*) అనీ, పసుపు రంగు ఛాయలలో రచించినప్పుడు పీత వర్ణైక (*cirage*) మనీ అంటారు. ఈ రీతిలో గోడలపై చిత్రించే రంగవల్లులూ, ఇతర అలంకరణలూ ఉబ్బెత్తు శిల్పం మాదిరిగా కనపడతాయి.

**Cambodia, art of :** *కాంభోడియా కళ.*

క్రీ. శ. 1వ శతాబ్దిలో భారతీయ సాహసికులు కొందరు, ఆగ్నేయాసియాలోని కాంభోడియాలో దిగి అక్కడ ఒక రాజ్యం నెలకొల్పారు. వారు అక్కడ క్రమంగా హీనయాన బౌద్ధమతాన్ని, హిందూమతాన్ని ప్రవేశపెట్టగా, ఆ మత సంప్రదాయాలను ఆశ్రయించిన కళాసంపత్తి ఆ దేశంలో విశేషంగా రూపు దాల్చింది. అయినా హిందూ మతందే పైచేయి. అందు వల్లనే ఇప్పుడు కానవచ్చే ఆనాటి విగ్రహాలలో శివ, హరిహర విగ్రహాలు ఎక్కువ. వీనికి సమకాలీన పల్లవ శిల్పాలతో సాన్నిహిత్యం ఎక్కువ. ఇక కాంభోడియాలోని బౌద్ధశిల్పాలలో గుప్తశైలి కానవస్తుంది. ఇక్కడి ఆలయ వాస్తువు చాలవరకు జావాలోని ఆలయ శిల్పాన్ని అనుసరించి, క్రమక్రమంగా ఆలయ నిర్మాణము సుమేరువును అనుకరించాలి అనే అభిప్రాయం బలపడింది. ఆ దేశంలో ఈ నాటికీ కన్పించే అంకోర వాట్ మొదలైన ఆలయాలు ఈ కోవకు చెందినవే.

**Camden town group :** *కామ్‌డెన్ నగర బృందం*

1911లో లండన్‌లో ఏర్పడ్డ ఒక సుప్రసిద్ధ కళాకార బృందం. గగూయెన్, వాన్ గోల శైలిచే ప్రభావితులైన సికెర్ట్, హెరాల్డ్ గిల్‌మన్ మొదలైన వారు తమ కళా సూత్రాలు, అప్పటి న్యూ ఇంగ్లిష ఆర్ట్ క్లబ్ వారు ఆమోదించిన కాంతి ఘటనలకు సరిపోనందువల్ల తామే స్వయంగా ఒక ప్రత్యేక కళాకార బృందంగా ఏర్పడి, దానికి కామ్‌డెన్ టౌన్ గ్రూప్ (కామెడెన్ నగర బృందం) అని పేరు పెట్టుకున్నారు. అందున పైవారు గాక లూసియెన్ పిస్సారో, ఆగస్టస్ జాన్, హెన్రీ లాంబ్, కళా విమర్శకుడైన ఫ్రాంక్ రట్టర్, రాబర్ట్ బెవాన్, వాల్టర్ బేయెస్, చార్లెస్ జిన్నర్, విన్‌డామ్, జేమ్స్ డిక్ ఇన్నెస్, జె. బి మేన్సన్ సభ్యులుగా ఉండిరి. స్పెన్సర్ గోర్ ఈ బృందానికి అధ్యక్షుడు. ఈ బృందము నాలుగు కళా ప్రదర్శనలను నిర్వహించిన తరవాత 1913లో లండన్ బృందంలో లీనమైంది.

**came or calm :** *కేమ్; గాడిబద్ద; కేమిక.*

రంగుగాజు పలకలను కిటికీలకూ, తలుపులకూ అమర్చటానికి ఉపయోగించే సీసపు చట్రం. ఈ చట్రపు బద్దల అంచులలో గాడు

ఉంటాయి ఈ గాజులో గాజు పలకల అంచులను దూర్చి బిగిస్తారు. చిత్రాలను ఇటువంటి చట్రాలలో బిగించినప్పుడు ఈ అద్దాలు కూడ చిత్రాలలో భాగాలుగా కనపడతాయి.

**camel hair** : *క్రమేలక రోమాలు.*

తూలికకై ఉపయోగించే మృదువైన రోమాలు. దీని పేరులో ఒంటె (*camel*) పదం ఉన్నా, వాస్తవానికి ఉడుతతోకలో ఉండే వెంట్రుకలనే దీనికి వాడతారు. ఉడుత రోమాలు తారుచౌక గాబట్టి వాటితో చేసిన తూలికలను పిల్లలు సైతం విశేషంగా వాడుతున్నారు.

**camera lucida** : *రూప ప్రసారిణి*

ఒక వస్తువు రూపాన్ని, ఒక ఉపరి తలంపై ప్రసరింప జేయటానికి ఉపయోగించే సాధనం. అట్లా ప్రసారితమయ్యే రూపపు బాహ్య రేఖను అనుసరించి గీతలను గీయవచ్చు. మూలవస్తువు యొక్క రూపాన్ని ఈ సాధనపు సాయంతో మనకు కావలసిన ప్రమాణానికి ప్రసరింపజేయవచ్చు. దీన్ని వ్యాపార కళలో ఎక్కువగా వాడతారు ఇది వివిధ ప్రమాణాలలో లభిస్తుంది. దీన్ని 1674లో రిచర్డ్ హూక్ కనిపెట్టారు.

**camera obscura** : *ప్రసార పేటిక.*

ఒక చిత్రం, లేదా దృశ్యం యొక్క ప్రతికృతిని తయారు చేయటానికి పనికివచ్చే సాధనం. స్వేచ్ఛగా ఒక చిత్రపు ప్రతికృతిని రచించటంకన్నా ఈ పద్ధతి ఎక్కువ సులభం. ఒక పెద్దపెట్టెకు ఒక వైపున ఉన్న రంధ్రానికి జమిలి కుంభాకార కటకాలను బిగిస్తారు. ఈ కటకం ద్వారా వస్తువు నుంచి కాంతి ప్రసారితమైనప్పుడు, వస్తువు యొక్క ప్రతిబింబము, దగ్గరఉన్న పలచని కాగితంపైన గానీ, స్వల్ప ప్రసారకమైన గాజు ఫలకంపై గానీ ఏర్పడుతుంది. దాన్ని అనుసరించి రేఖలను గీయవచ్చు. పూర్వము ఒక గదినే పూర్తిగా ఇటువంటి పెట్టెలాగా వాడేవారు దీన్ని ఆధునిక కెమేరాలకు నాంది అని చెప్పవచ్చు. ఈ ప్రసార పేటిక ప్రస్తుతం వాడుకలో లేదు.

**camp** : *శిబిరం; నివేశనం; విడిది; మజిలీ.*

**camouflage paint** : *కుహనా వర్ణం.*

**camphorwood** : *కర్పూరదారువు.*

సువాసనాయుతమగు ఒక కఠిన దారు విశేషం. తైవాన్, బోర్నియోలలో మాత్రమే కానవచ్చే ఒకవిధపు కర్పూరవృక్షము వల్ల ఇది లభిస్తున్నది. 10 సెం. మీ మందం ఉండే పలకల రూపంలో ఈ చెక్క ఆ దేశాల నుంచి ఇతర దేశాలకు ఎగుమతి అవుతున్నది.

**Camunian art** : *కెమోనికా కళ.*

ఇటలీ దేశంలో ఆల్ప్స్ పర్వతాలలో, బ్రెస్కియా నగరానికి ఉత్తరాన, కెమోనికా లోయలో శిలలపై కనపడే ప్రాచీన అధిరేఖనాలు. నవ్యశిలా యుగపు ఉత్తరార్థం మొదలుగా వివిధ కాలాలకు చెందిన అధిరేఖనాలు ఇక్కడ కనపడతాయి. క్రీ.పూ 16లో రోమనులు ఆ ప్రాంతాన్ని జయించే వరకు ఆ కళ అక్కడ రాణించినట్లు నిదర్శనా లున్నాయి ఈ శతాబ్దపు ఏభైలలో ఇజ్రాయెల్ దేశపు మానవ విజ్ఞానవేత్త యెమ్మాన్యుయెల్ అనాతి అనే అతడు ఈ లోయలోని అధిరేఖనాల అవశేషాలన్నిటిని పరిశోధించి, సమాచారాన్ని సేకరించాడు.

తీకలను, సూదిగా చెక్కిన పుల్లలను వాడే వారు.

**calm :** *కేమిక.*

*came* అనే దానికి పర్యాయ రూపం.
(చూ : *came*)

**Calvary cross:** *కల్వరీ శిలువ.*

మూడు మెట్లు గల దిమ్మెపై కట్టిన లాటిన్ సిలువ (చూ: *cross*). ఈ మూడు మెట్లు క్రైస్తవ మత మూల లక్షణాలైన శ్రద్ధ, ఆశ, వదాన్యత అనే వాటికి చిహ్నాలు.

**camaieu:** *వర్ణైక చిత్రం*

ఒకే రంగు యొక్క వివిధములైన ఛాయలతో రచించిన చిత్రం. దీన్ని బూడిద రంగు ఛాయలలో రచించినప్పుడు ధూసర వర్ణైకం (*grisaille*) అనీ, పసుపు రంగు ఛాయలలో రచించినప్పుడు పీత వర్ణైక (*cirage*) మనీ అంటారు. ఈ రీతిలో గోడలపై చిత్రించే రంగవల్లులూ, ఇతర అలంకరణలూ ఉబ్బెత్తు శిల్పం మాదిరిగా కనపడతాయి.

**Cambodia, art of :** *కాంబోడియా కళ.*

క్రీ. శ. 1వ శతాబ్దిలో భారతీయ సాహసికులు కొందరు, ఆగ్నేయాసియాలోని కాంబోడియాలో దిగి అక్కడ ఒక రాజ్యం నెలకొల్పారు. వారు అక్కడ క్రమంగా హీనయాన బౌద్ధమతాన్ని, హిందూమతాన్ని ప్రవేశపెట్టగా, ఆ మత సంప్రదాయాలను ఆశ్రయించిన కళాసంపత్తి ఆ దేశంలో విశేషంగా రూపు దాల్చింది. అయినా హిందూ మతందే పైచేయి. అందు వల్లనే ఇప్పుడు కానవచ్చే ఆనాటి విగ్రహాలలో శివ, హరిహర విగ్రహాలు ఎక్కువ. వీనికి సమకాలీన పల్లవ శిల్పాలతో సాన్నిహిత్యం ఎక్కువ. ఇక కాంబోడియాలోని బౌద్ధశిల్పాలలో గుప్తశైలి కానవస్తుంది. ఇక్కడి ఆలయ వాస్తువు చాలవరకు జావాలోని ఆలయ శిల్పాన్ని అనుసరించి, క్రమక్రమంగా ఆలయ నిర్మాణము సుమేరువును అనుకరించాలి అనే అభిప్రాయం బలపడింది. ఆ దేశంలో ఈ నాటికీ కన్పించే అంకార వాట్ మొదలైన ఆలయాలు ఈ కోవకు చెందినవే.

**Camden town group :** *కామ్‌డెన్ నగర బృందం*

1911లో లండన్‌లో ఏర్పడ్డ ఒక సుప్రసిద్ధ కళాకార బృందం. గగూయెన్, వాన్ గోల్ శైలిచే ప్రభావితులైన సిక్కెర్ట్, హెరాల్డ్ గిల్‌మన్ మొదలైన వారు తమ కళా సూత్రాలు, అప్పటి న్యూ ఇంగ్లిష్ ఆర్ట్ క్లబ్ వారు ఆమోదించిన కాంతి ఘటనలకు సరిపోనందువల్ల తామే స్వయంగా ఒక ప్రత్యేక కళాకార బృందంగా ఏర్పడి, దానికి కామ్‌డెన్ టౌన్ గ్రూప్ (కామెడెన్ నగర బృందం) అని పేరు పెట్టుకున్నారు. అందున పైవారు గాక లూసియెన్ పిస్సారో, ఆగస్టస్ జాన్, హెన్రీ లాంబ్, కళా విమర్శకుడైన ఫ్రాంక్ రట్టర్, రాబర్ట్ బెవాన్, వాల్టర్ బేయెస్, చార్లెస్ జిన్నర్, విన్‌డామ్, జేమ్స్ డిక్ ఇన్నెస్, జె. బి మేన్సన్ సభ్యులుగా ఉండిరి. స్పెన్సర్ గోర్ ఈ బృందానికి అధ్యక్షుడు. ఈ బృందము నాలుగు కళా ప్రదర్శనలను నిర్వహించిన తరవాత 1913లో లండన్ బృందంలో లీనమైంది.

**came or calm :** *కేమ్; గాడిబద్ద; కేమిక.*

రంగుగాజు పలకలను కిటికీలకూ, తలుపులకూ అమర్చటానికి ఉపయోగించే సీసపు పట్టం. ఈ పట్టపు బద్దల అంచులలో గాడు

ఉంటాయి ఈ గాడులో గాజు పలకల అంచులను దూర్చి బిగిస్తారు. చిత్రాలను ఇటువంటి చట్రాలలో బిగించినప్పుడు ఈ బద్దలు కూడ చిత్రాలలో భాగాలుగా కనపడతాయి.

**camel hair** : *క్రమేలక రోమాలు.*

తూలికకై ఉపయోగించే మృదువైన రోమాలు. దీని పేరులో ఒంటె (*camel*) పదం ఉన్నా, వాస్తవానికి ఉడుతతోకలో ఉండే వెంట్రుకలనే దీనికి వాడతారు. ఉడుత రోమాలు తారుచౌక గాబట్టి వాటితో చేసిన తూలికలను పిల్లలు సైతం విశేషంగా వాడుతున్నారు.

**camera lucida** : *రూప ప్రసారిణి.*

ఒక వస్తువు రూపాన్ని, ఒక ఉపరి తలంపై ప్రసరింప జేయటానికి ఉపయోగించే సాధనం అట్లా ప్రసారితమయ్యే రూపపు బాహ్య రేఖను అనుసరించి గీతలను గీయవచ్చు. మూలవస్తువు యొక్క రూపాన్ని ఈ సాధనపు సాయంతో మనకు కావలసిన ప్రమాణానికి ప్రసరింపజేయవచ్చు. దీన్ని వ్యాపార కళలో ఎక్కువగా వాడతారు ఇది వివిధ ప్రమాణాలలో లభిస్తుంది. దీన్ని 1674లో రిచర్డు హూక్ కనిపెట్టాడు.

**camera obscura** : *ప్రసార పేటిక.*

ఒక చిత్రం, లేదా దృశ్యం యొక్క ప్రతికృతిని తయారు చేయటానికి పనికివచ్చే సాధనం. స్వేచ్ఛగా ఒక చిత్రపు ప్రతికృతిని రచించటంకన్నా ఈ పద్ధతి ఎక్కువ సులభం. ఒక పెద్దపెట్టెకు ఒక వైపున ఉన్న రంధ్రానికి జమిలి కుంభాకార కటకాలను బిగిస్తారు. ఈ కటకం ద్వారా వస్తువు నుంచి కాంతి ప్రసారితమైనప్పుడు, వస్తువు యొక్క ప్రతిబింబము, దగ్గరఉన్న పలచని కాగితంపైన గానీ, స్వల్ప ప్రసారకమైన గాజు ఫలకంపై గానీ ఏర్పడుతుంది. దాన్ని అనుసరించి రేఖలను గీయవచ్చు. పూర్వము ఒక గదినే పూర్తిగా ఇటువంటి పెట్టెలాగా వాడేవారు. దీన్ని ఆధునిక కెమేరాలకు నాంది అని చెప్పవచ్చు. ఈ ప్రసార పేటిక ప్రస్తుతం వాడుకలో లేదు

**camp** : *శిబిరం; నివేశనం; విడిది; మజిలీ.*

**camouflage paint** : *కుహనా వర్ణం.*

**camphorwood** : *కర్పూరదారువు.*

సువాసనాయుతమగు ఒక కఠిన దారు విశేషం. తైవాన్, బోర్నియోలలో మాత్రమే కానవచ్చే ఒకవిధపు కర్పూరవృక్షము వల్ల ఇది లభిస్తున్నది. 10 సెం. మీ మందం ఉండే పలకల రూపంలో ఈ చెక్క ఆ దేశాల నుంచి ఇతర దేశాలకు ఎగుమతి అవుతున్నది.

**Camunian art** : *కెమోనికా కళ.*

ఇటలీ దేశంలో ఆల్ప్స్ పర్వతాలలో, బ్రెస్కియా నగరానికి ఉత్తరాన, కెమోనికా లోయలో శిలలపై కనపడే ప్రాచీన అధిరేఖనాలు. నవ్యశిలా యుగపు ఉత్తరార్ధం మొదలుగా వివిధ కాలాలకు చెందిన అధిరేఖనాలు ఇక్కడ కనపడతాయి. క్రీ.పూ 16లో రోమనులు ఆ ప్రాంతాన్ని జయించే వరకు ఆ కళ అక్కడ రాణించినట్లు నిదర్శనా లున్నాయి. ఈ శతాబ్దపు ఏభైలలో ఇజ్రాయెల్ దేశపు మానవ విజ్ఞానవేత్త యెమ్మాన్యుయెల్ అనాతి అనే అతడు ఈ లోయలోని అధిరేఖనాల అవశేషాలన్నిటిని పరిశోధించి, సమాచారాన్ని సేకరించాడు.

**Canada, National Gallery of :** *కెనడా జాతీయ కళా వీథిక.*

ప్రసిద్ధ కళావస్తు సేకరణకై 1880లో కెనడాలో నెలకొన్న శ్రేణిక అత్యుత్తమ స్థాయికి చెందిన కళాఖండాలను మాత్రమే ఇది సేకరిస్తుంది. తమ వసరుల హద్దు లో ఈ నియమాన్ని, ఈ శ్రేణికను నిర్వహించే ధర్మకర్తృ సంఘం పాటించడం వల్ల ప్రపంచపు చిన్న శ్రేణికలన్నిటిలో గణనీయమైన ఖ్యాతిని ఈ శ్రేణిక ఆర్జించింది.

**Canada, Royal Canadian Academy :** *కెనడా రాయల్ అకాడెమీ.*

కెనడాదేశపు కళాకార పరిషత్తు 1880లో ఇది వ్యవస్థితం. సుప్రసిద్ధులైన చిత్రకారులు, శిల్పులు, వాస్తువిదులు, ముద్రాంక నిర్మాతలు, అలంకారిక కళావిదులు ఇందులో సభ్యత్వం పొందటానికి అర్హులు. తమ తమ రచనలలో ప్రసిద్ధిని, పరిగణనను ఆర్జించిన వాటిని ఈ కళాకారులు కెనడా జాతీయ శ్రేణికలో భద్రపరుస్తారు.

**Canadian art:** *కెనడా కళ.*

మొదట్లో ఫ్రెంచివారి వలసగాను, తర్వాత బ్రిటిష్‌వారి వలసగాను ఉండి, తరవాత అధినివేశ ప్రతిపత్తిని ఆర్జించిన కెనడాలో 17వ శతాబ్ది ఉత్తరార్ధం మొదలుగా కళ క్రమాభివృద్ధిని సాధించింది. ఆయా కాలాలలో, ఫ్రాన్సు, ఆంగ్ల కళా శైలులు ఈ దేశపు కళపై తమ ప్రభావాన్ని ప్రసరింప చేశాయి.

**canalete or canaletta:** *జరస్కాంతం.*

వెస్ట్ ఇండీస్ దీవులలో పెరిగే 'కార్డియా జరస్కాంత' వృక్షం నుంచి లభించే ఒక కఠిన సాంద్ర దారు విశేషం దీనిలో లోహపు మెరుపు కలిగిన నల్లని చారలు కనపడతాయి. ఈ కొయ్యలోని చేవకర్రకు నీలలోహిత ఛ్ఛాయ కల ఊదా రంగు ఉంటుంది. 2.5 సెం.మీ. మందం గల చెక్కల రూపంలో ఇది లభిస్తుంది.

**candelilla wax :** *కండీలిలా మైనం*

గోధుమ రంగు గలిగి, ఉన్నిలా జన్యమైన ఒక రకపు మైనం. మెక్సికోలోను, యు.స్టే.లోని టెక్సాస్‌లోను లభించే ఒక విధపు అడవి మొక్కలనుంచి దీన్ని తయారు చేస్తారు. కర్నౌబా మైనం తరవాత కాఠిన్యంలో దీనికే పేరున్నది. దీని ద్రవీభవన ప్రవృతి 67°-71° సెం.గ్రే.

**canopy:** *వితానం; ఛాదిని*

వాస్తువులో ఒక శాల, లేదా గూటిపై అమరి ఉండే చిన్న పై కప్పు; దీనిపై వివిధ అలంకరణలు కూర్చడం జరుగుతుంది.

**cantharus:** *యవన పాత్ర.*

1. రెండు పక్కలా చక్కగా అలంకృతములైన పిడులు, కింద కాళ్ళు ఉండే గ్రీకు పింగాణి పానపాత్ర.

2. చర్చిలలో పవిత్ర జలాన్ని ఉంచుకొనే పాత్ర.

**canvas :** *కాటికి; కేన్వాసు, కళావస్త్రం.*

తైల చిత్రణకు ఉపయోగించే లావైన, గట్టి, ముతక గుడ్డ. దీనిపై తైలవర్ణాన్ని పట్టించటానికి అనువుగా తెల్ల భూమికను తయారు చేస్తారు. ఇటువంటి గుడ్డను వేరే వేరే పన్నాలలో తయారు చేసే ప్రసిద్ధ

సంస్థలున్నాయి. సాధారణంగా కాటికను చట్టంపై బిగించి, తర్వాత చిత్రాన్ని వేస్తారు. ఒక్కొక్కప్పుడు, కాటికను పరచి, చిత్రాన్ని దానిపై రచించిన తరవాత గోడపైగానీ, చెక్కపైగానీ దాన్ని అతకడం కూడా ఉంది. ఈ ప్రక్రియను అనులగ్నం (*Marouflage*) అంటారు 'కాటిక', అనే పదాన్ని చట్టంలో బిగించిన తైల చిత్రణకు సంసిద్ధంగా బజారులో లభ్యపడే దానికి, అటువంటి తైల చిత్రానికి కూడ వాడతారు. కాటికను స్వయంగా కూడా తయారు చేసుకోవచ్చు. మూతక వటా గుడను తీసుకొని, దానిపై ఒక వంతు జింకాక్సైడు, రెండు వంతుల సుద్ద పొడి, ఒక వంతు అవిసె నూనె, తగినంత నీరు కలిపి రెండు పూతలు పూయాలి.

**canvas board:** *కాటికా స్తరిక; కేన్వాస్ బోర్డు.*

తైల చిత్రణకై సిద్ధం చేసిన కాటికను అతికించిన గట్టి అట్ట, లేదా పలక మోసుకొని పోవటానికి ఇది అనువుగా ఉండటం వల్ల అరుబయట చిత్రణకు కూడా పనికి వస్తుంది. ఇది చౌకగా లభించటం చేత, విద్యార్థులకు కూడా ఉపయోగకరమైంది.

**canvas carrier:** *కాటికా వాహనం.*

రెండు కాటికా చిత్రాలను ముఖాముఖి పెట్టి బంధించి తీసుకొని పోవటానికి ఉపయోగించే సాధనం. ఈ సాధనంలో కాటికలను పట్టుకొని ఉంచటానికి రెండు లోహపు బిగుతలు (క్లిప్పులు) ఉంటాయి. ఒక పిడి కూడా ఉంటుంది. తడి ఆరక పోయినా, చిత్రాలను చెరిగిపోకుండా మోసుకొని పోవటానికి ఈ సాధనం పనికి వస్తుంది.

**canvas pin or canvas tack :** *కాటికా కీలం.*

అరఅంగుళం మందం గల గుండ్రని ఈపుపు లేదా కొయ్య బిళ్ళకు రెండు వైపుల మొనదేలిన మేకులమర్చిన సాధనం. ఒక కాటికను



కాటికా కీలం

నాలుగు మూలలా ఇటువంటి కాటికా కీలాలను గుచ్చి వాటిపై ఇంకొక కాటికను తిరగేసి ఉంచినొక్కితే, రెంటింటినీ ఒకటిగా తీసుకొనిపోవచ్చు. ఇందు వల్ల తడిగా ఉండే రెండు కాటికలను చెడిపోకుండా తీసుకొని పోవచ్చు.

**canvas sizes, French :** *కాటికా పరిమాణాలు (ఫ్రెంచి)*

చట్టంలో బిగించి అమ్మే కాటికలు, ఫ్రాన్స్ దేశంలో మూడు పరిమాణాలలో లభిస్తున్నవి: 1. ప్రకృతి దృశ్యం (*paysage*); 2. మూర్తి చిత్రం (*portrait*); 3. సాగర దృశ్యం (*marine*) అందులో 10 ప్రామాణిక పరిమాణాల కొలతలు, సెంటిమీటర్లలో ఈ దిగువ రీతిగా ఉన్నాయి.

| పరిమాణ సంఖ్య | మూర్తి చిత్రం | ప్రకృతి దృశ్యం | సాగర దృశ్యం |
|---|---|---|---|
| 1 | 22×16 | 23×14 | 22×12 |
| 2 | 24×19 | 24×16 | 24×14 |
| 3 | 27×22 | 27×19 | 27×16 |
| 4 | 33×24 | 33×22 | 33×19 |
| 5 | 35×27 | 35×24 | 35×22 |
| 6 | 41×33 | 41×27 | 41×24 |
| 8 | 46×38 | 46×33 | 46×27 |

| | | | |
|---|---|---|---|
| 10 | 55×46 | 55×38 | 55×33 |
| 12 | 61×50 | 61×46 | 61×38 |
| 15 | 65×54 | 65×50 | 65×46 |
| 20 | 73×60 | 73×54 | 73×50 |
| 25 | 81×65 | 81×60 | 81×54 |
| 30 | 92×73 | 92×65 | 92×60 |
| 40 | 100×81 | 100×73 | 100×65 |
| 50 | 116×89 | 116×81 | 116×73 |
| 60 | 130×97 | 130×89 | 130×81 |
| 80 | 146×114 | 146×97 | 146×89 |
| 100 | 162×130 | 162×114 | 162×97 |
| 120 | 195×130 | 195×114 | 195×97 |

పైవాటి పేర్లను బట్టే, వాటి ఉపయోగం వ్యక్తమవుతున్నది. కాని ప్రస్తుతం వాటిని కళాకారులు ఆ పేరులకు అనుగుణంగా మాత్రమే వాడటంలేదు. అయినా కొలతల పరిమితులవల్ల ఏర్పాటు తయారు చేయటం సులభమవుతున్నది.

**canvas sizes, landscape** : ***ప్రకృతి దృశ్య కాటకా పరిమాణాలు.***

ప్రకృతి దృశ్యాలను చిత్రించటానికి ఇంగ్లండు, అమెరికాలలో మూడు పరిమాణాల కాటకలున్నాయి. వాటికొలతలు అంగుళాలలో: 30×50; 36×54; 40×60.

**canvas sizes, portrait** : ***మూర్తి చిత్రణ కాటకా పరిమాణాలు.***

అమెరికా, ఇంగ్లండులలో మూర్తి చిత్రణకు వాడే కాటకలలో ఈ క్రింది పరిమాణాలున్నాయి. (కొలతలు, అంగుళాలలో):

| | |
|---|---|
| బిషప్ నిలువు | 70×106 |
| పూర్తి నిలువు | 58×94 |
| చిన్న నిలువు | 52×88 |
| బిషప్ అర నిలువు | 44×56 |
| అర నిలువు | 40×50 |
| చిన్న అర నిలువు | 34×44 |
| కిట్ కేట్ | 28×36 |
| ముప్పాతిక నిలువు | 25×30 |

పూర్తి నిలువుకాటకలు పూర్ణ మూర్తి చిత్రాలకు వాడతారు. కిట్ కేట్ పరిమాణపు చిత్రాలు చిన్న గదులలో వ్రేలాడదీయటానికి అనువుగా ఉంటాయి. కిట్-కేట్ అనే పేరు గల క్లబ్బులోని సభ్యులు క్రిస్టఫర్ కేట్ తాలూకు భోజనశాలలో సమావేశమయ్యే వారు. వీళ్ళందరిని సర్ జఫ్రీ నెల్లర్ అనే చిత్రకారుడు ఒకే చిత్రంలో చిత్రించాడు. ఆ చిత్రపు పరిమాణానికి కిట్-కేట్ అనే పేరు వచ్చింది.

**canvas tack** : ***కాటకా బంధం.***

(చూ: ***canvas pin***)

**capital** : ***స్తంభమకుటం; స్తంభశీర్షం.***

**caposcuola** : ***ప్రవర్తకుడు.***

తత్వశాస్త్రంలోగాని, కళలోగాని నూతన సంప్రదాయాన్ని నెలకొల్పే ఆచార్యుడు.

**Cappagh brown** : ***కపాహ కపిలం.***

ఐర్లండులో సహజ సిద్ధంగా లభించే ఒక విధపు కపిల వర్ణం గల మట్టిరంగు. త్వరగా మసిని ఇది పోలిఉండటం యథార్థమే అయినా, రంగుగాగాని, వర్ణద్రవ్యంగా గాని, గుణ విశేషంలో దానికన్న తగ్గు స్థాయిలో ఉన్నది.

**capriccio** : ***విలక్షణాలంకృతి.***

శిల్పాలలోగాని, చిత్రాలలోగాని వికృతం నుంచి కూడా అద్భుతాన్ని కలిగించే అలంకరణం.

**caput mortuum** : ***చిప్ప రంగు.***

ఇండియన్ ఎరుపు కన్నా, ఎక్కువ నీల

వాకగానూ గాఢతరంగానూ ఉంది, చిరస్థాయి ఎరుపు రంగుగల ఇనుప భస్మానికి పూర్వం వాడుకలో ఉన్న పేరు. దీన్ని ఎవరూ ఇప్పుడు వాడరు.

**Caravaggisti** : *కరవజ్జీయులు.*

సుప్రసిద్ధ ఇటాలియన్ చిత్రకారుడు కరవజ్జియో (1573-1610) యొక్క సాంకేతిక పద్ధతుల వల్ల ప్రభావితులైన యువ కళాకారుల ఒక బృందం. 17వ శతాబ్దిలో తొలి దశకంలో వీరు ఇటలీని దర్శించి కరవజ్జియో రచనలను పరిశీలించి, అతని సాంకేతిక పద్ధతుల వల్ల - అందునా ముఖ్యంగా నాటకీయ వాస్తవికతను వెల్లడించే వెలుగు చీకటుల అమరిక వల్ల - ముగ్ధులై దాన్ని రచనలలోకి తీసుకొని రావటానికి యత్నించారు. వీరిలో ప్రముఖుడు ఓరేజియో జెన్‌టిలెస్చి.

**carbon bisulfide** : *కార్బన్ బైసల్ఫైడ్.*

బాష్పశీలమైన ఒక ద్రావణం. ఘాటైన, అసహ్యమైన వాసనను ఇది వెలువరిస్తుంటుంది. ఇది విషపదార్థం కూడాను. కొయ్యతో తయారైన కళాఖండాలను పరిరక్షించటానికి దీన్ని వాడతారు. కొయ్యకు పట్టే లద్దె పురుగులను ఇది నశింప జేస్తుంది.

**carbon black** : *శుద్ధమషి; పక్కా మసి.*

లోహానికి తగిలిన పొగ ఇటువంటి మసిగా తయారవుతుంది. బెంజోల్‌ను కాల్చి బెంజోల్ నలుపును, అసిటలీన్‌ను కాల్చి అసిటలీన్ నలుపును తీయవచ్చు. చమురు వల్ల వచ్చే పొగ నుంచి తీసే మసిని దీపపు మసి అంటారు.

**carbonisation** : *కర్బనీకరణం.*

**carbon paper** : *మసి కాగితం; మషీపత్రం.*

**carbon pencil** : *బొగ్గు పెన్సిల్.*

సాధారణపు పెన్సిల్‌లాగా దీన్ని గ్రాఫైటుతో తయారు చేయక, దీపపు మసి వంటి దానితో తయారు చేస్తారు. ఇది వేరేవేరే ఛాయలలో లభిస్తుంది. ఈ ఛాయలు కారునలుపు మొదలు బూడిదనలుపు వరకు ఉంటాయి. స్కెచ్చిని రచించటంలో ఈ పెన్సిల్ బాగా పనికి వస్తుంది.

**carbon pigments** : *కర్బన వర్ణద్రవ్యాలు.*

స్వచ్ఛమైన, లేదా మలినమైన కర్బనం నుంచి తయారయ్యే నల్లని వర్ణద్రవ్యాలు. దంతపు నలుపు, ఎముక నలుపు, పక్కా మసి, బొగ్గు, దీపపు మసి, ద్రాక్ష బొగ్గు ఇటువంటివే. గ్రాఫైటు కూడ ఒక రకపు బొగ్గే అయినా ఈ వర్గానికి చెందదు.

**carborundum** : *కార్బరండం.*

సిలికాన్ కార్బైడ్‌తో తయారయ్యే సాన రాయి, లేదా మెరుగు కాగితం. తొలుత దీనిని కృత్రిమ రీతిలో తయారు చేసిన ఒక వ్యాపార సంస్థ వల్ల దీనికి ఈ పేరు వచ్చింది.

**cardboard** : *అట్ట; అస్తరిక.*

అట్టలు, లేదా అస్తరికలు. చిత్రాలకు తగిన ఆధారాలుగా 19వ శతాబ్ది నుండి మొదలిడి కళాకారులు వీనినిఉపయోగిస్తున్నారు. ఎడ్గార్ డెగా అనే కళాకారుడు, తన రమణీయ నగ్న చిత్రాలకు అట్టనే ఉపాధిగ వాడాడు. అట్లాగే బోనార్డ్, వుయిలార్డ్, టౌలౌజ్ - లాట్రెక్ మొదలైన వాళ్ళు కూడా తమ రచనలకు అట్టనే వాడారు. ఈ ఇరవయ్యో శతాబ్దిలోని కళాకారులు అట్టకు జిగురును ముందుగ పట్టించటం జరుగుతున్నది.

**carelessness** : శ్రద్ధాహీనత.

**cargo carrier** : సౌపవాహ రథం, సరకు బండి.

**caricature** : హాస్య చిత్రం

ఒక వ్యక్తి యొక్క స్వభావ స్వరూపాలలో



డావించీ రచించిన హాస్య చిత్రం



బెర్నిని రచించిన ఒక హాస్యచిత్రం



హోగార్త్ లిఖించిన ఒక హాస్య చిత్రం

గాని, సంఘంలోగాని, సంస్థలోగాని ఉన్న లోపాలను, వ్యసనాలను అవహేళన చేయటానికి వ్యంగాత్మకంగా, అతిశయోక్తులతో రూపొందించిన చిత్రం. ఇందులో అన్ని రసాలను చూపించవచ్చు. మత, రాజకీయ, సాంఘిక, దోషాల విమర్శనల కిది చక్కటి ఆయుధం. ఇది ఒక వరంపరా చిత్రంగా గాని, ఏకమాత్ర చిత్రంగా గాని ఉండవచ్చు. మొదటి నుంచి కళాకారులు ఇటువంటి చిత్రణను ఒక ఉబుసు పోకగా చేపట్టారు అటువంటి వారిలో గణ్యులు: లియోనార్డో డావించి (1452-1519), జియాన్ లారెంజో బెర్నిని (1598-1680) విలియం హోగార్త్ (1697-1764) ఫ్రాన్సిస్కో-గోయా (1746 1828), థామస్ రౌలాండ్సన్ (1756-1884), జేమ్స్‌గ్రిల్‌రే (1757 - 1815). చార్లెస్‌ఫిలిపాన్ (1800-1862), థామస్ నాస్ట్(1840-1902), మాక్స్ బీర్‌బోమ్ (1872-1956), డేవిడ్ లో (1891-1963).

**carmine** : ఊదాన వర్ణం.

చాల కాలం మనగలిగే ఎరుపు రంగు, మెక్సికోలోని కోకినీల్ అనే క్రిమినుంచి ఈ రంగు లభిస్తుంది. కళాకారుల వర్ణాలలో 16-

19 శతాబ్ది వరకు ఈ వర్ణం ప్రముఖ స్థానం వహించింది. దీన్ని తయారు చేసే విధానాన్ని మొదట స్పెయిన్‌లో 1760 ప్రాంతంలో కనుగొన్నారు. ఈ వర్ణంలో మేలిరకపు దానిని వెనిస్, యాంట్‌వెర్ప్, ఫ్రాన్స్‌లలో 17వ శతాబ్దిలో తయారు చేశారు. 18వ శతాబ్దికి చెందిన ఒక ఇంగ్లీషు రచయిత, ఈ రంగులో మేలిరకం తమ దేశంలో లభించకపోవడంతో తన దేశపు స్త్రీలనే నిందిస్తూ "ఉన్న మంచి రంగునంతటినీ తమ ముఖాలకే వాళ్ళు పూసుకొంటున్నారు." అని వ్రాశాడు. 19వ శతాబ్ది చివరలో మంజిష్ఠపు ఎరుపు (మేదర్‌లేక్), అలిజారిన్ శోణవర్ణం వాడుకలోకి వచ్చిన తర వాత దీని వాడుక తగ్గింది. ఈ వర్ణానికే ఈ దిగువ పేర్లున్నాయి: వియెన్నా లేక్, మ్యూనిచ్ లేక్, నకారటు కార్మెయిన్. జతుస వర్ణాన్ని చక్కగా అగ్నితప్తం చేయడంతో తప్త జతుస వర్ణం (బరన్ట్ కార్మైన్) అనే ముదురు గోధుమఛాయ గల రంగు వస్తుంది.

**carmine red :** ***లాక్షా శోణం.***

ఒక విధమైన లక్క ఎరుపు

**carnation :** ***శరీర పాటలి.***

యూరప్‌వాసుల సహజ శరీరచ్ఛాయను అనుసరించే రంగు. ప్రస్తుతం ఈ పదం వాడుకలో లేదు.

**carnauba wax :** ***కర్నాబ సిక్థం; కర్నాబ మైనం.***

వనస్పతి సిక్థము లన్నిటిలో కఠినతమంగా ఇది పేరు పొందింది. బ్రెజిల్‌లోని ఒక వృక్ష జాతినుంచి ఇది లభిస్తున్నది. దాని ద్రవీభవన బిందువు 88°, 86°C మధ్య ఉంటుంది. ఈ సిక్థంలో పలురకాలున్నాయి. మీగడ పన్నె, పసుపువాక తెలుపు మొదలుగా, ముదురు గోధుమ వరకు రంగులున్నాయి దీనికే బ్రెజిల్ సిక్థం, లేదా బ్రెజిల్ మైనం అని కూడా పర్యాయ నామాలున్నాయి.

**Carolingian art .** ***కరోలింజియన్ కళ.***

క్రీ. శ. 8వ శతాబ్ది మధ్యకాలం మొదలు 10వ శతాబ్ది వరకు వర్ధిల్లిన ఫ్రాంకు జాతీయుల కళ. రోమన్ నాగరికతను పునరుద్ధరించాలని కలలు కంటూ షార్లమేన్ ప్రభువు సాగించిన కృషికి ఫలితంగా ఈ కళ వర్ధిల్లింది. ఆ కాలంలో గ్రంథాలలోని చిత్రణ ఈ రీతిలో విస్తరించింది. రోమన్, బైజాన్టైన్ కళలను ఇది పునరుజ్జీవింప జేసింది. గ్రంథాల అట్టలపై బంగారును, వెండిని, వెలగల రాళ్ళను పొదిగి అలంకరణ చేసేవారు.

**capenter's penci l:** ***వడ్రంగి పెన్సిలు.***

బద్దవాటుగ ఉండి కొయ్యపై గీయటానికి ఉపయోగించే పెన్సిల్.

**carpet :** ***తివాచీ; అథునిక.***

**carpet area :** ***అథున మానం.***

**carpet weaver :** ***తివాచి పనివాడు; అథునికాకారుడు.***

**Carrara marble .** ***కర్రారా చలువరాయి.***

ప్రపంచ విఖ్యాతమైన చలువ రాయి ఇది ఇటలీలోని కర్రారా జిల్లాలో లభిస్తుంది. దీని బాలు మంచుతెలుపు నుంచి బంగారు ఛాయ వరకు ఉంటాయి. దీనిలో అత్యుత్తమ మైంది, కొంచెం పారదర్శకంగా ఉండి, చక్కెరలాగా తీయగా ఉంటుంది. ప్రాచీన యుగంలోనే గాక,

మధ్య యుగ, పునరుజ్జీవన యుగాలలోను ఇది విరివిగా వాడబడింది. మైకేలేంజెలో చెక్కిన శిల్పాలన్నీ ఈ రాతిలో మలచినవే.

**cartography** : *దేశపట రచన.*

**cartoon**[1] : *విపుల చిత్రం.*

గట్టి కాగితంపై, పూర్తి పరిమాణంలో గీసిన విపులమైన చిత్రం. ఇది పరిపూర్ణ చిత్రాన్ని తయారు చేయటానికి ప్రాతిపదికగా ఉపయోగిస్తుంది. కార్టూన్ అనే పదం, కార్టనీ అనే ఇటాలియన్ పదం నుంచి ఉత్పన్నం. కార్టనీ అంటే ఆ భాషలో, చిత్రాలను గీసే కాగితం అని అర్థం. ఇటువంటి విపులచిత్రాన్ని భిత్తిచిత్రాలుగ మార్చటానికి వీలుండదు. విపుల చిత్రమున్న కాగితంలోని రేఖలను అనుసరించి భిత్తిపై చిల్లులను పొడిచిగానీ, గళ్ళు గీచి గానీ గోడపై చిత్రించేవారు. ఇటువంటి విపుల చిత్రాల సాయంతో భిత్తి చిత్ర కళాకారుడేగాక, తన సహాయకులు కూడా దాని ఆధారంతో భిత్తిచిత్రణను సాగించటానికి వీలుండేది. ఈ పద్ధతిగాజుఫలకలనుఅతికి తయరు చేసే చిత్రణకు, గుడ్డపై చిత్రాలను నేయటానికి, చిత్రాస్తరాలకు కూడా ఉపయోగపడుతుంది. చిత్రాన్ని ఊహించిన చిత్రకారుడూ, దాన్ని తయారు చేసే పనివాళ్ళు వేరుగా ఉన్నప్పుడు ఈ పద్ధతి చాలా అవసరం. వాటికన్ భవనాలలో సిస్టేన్ చేపల్ లో ఉన్న నేతచిత్రాలకు ఆధారాలైన రేఫెల్ చిత్రాలు జగత్ ప్రసిద్ధాలు. వీటిలో కొన్ని లండనులోని విక్టోరియా అండ్ ఆల్బర్ట్ మ్యూజియంలో ఉన్నాయి.

**cartoon 2** : *వ్యంగ్య చిత్రం.*

వ్యంగాత్మకమైన చిత్రం లేదా చిత్రాల వరస ఇందులో రచనా విధానానికి గాక రచనా వస్తువుకే ప్రాధాన్యం ఎక్కువ. ఇటువంటి చిత్రాలను సాధారణంగా రేఖలలోనే రచిస్తారు. వీటి ప్రయోజనం సాధారణంగా వినోదోల్లాససాధనే. అయినప్పటికీ రాజకీయ, సాంఘిక విషయాలలో ఘాటైన విమర్శలకును వీటిని బాగా ఉపయోగించ వచ్చు.

**cartouche 1** : *అలంకార ముద్రిక.*

విచిత్రంగా చెక్కిన ఆభరణ విశేషం. దీని మధ్య అండాకారంగాగానీ,వర్తులంగాగానీ ఒక రేఖ ఉంటుంది. దాని చుట్టూ లతాద్యలంకరణ ఉంటుంది.మధ్యనఉన్న ఖాళీభాగాన్ని అక్షరాలను చెక్కటానికి వినియోగిస్తారు. ఇటువంటి అలంకరణ రీతులు చిత్రాలలోనూ, దారుశిల్పాలలోను, సామాన్య శిల్పాలలోనూ ఉండవచ్చు.



అలంకార ముద్రికలు

ఇవి 16, 17వ శతాబ్దాంలో చాలా ప్రచారంలో ఉండేవి. పుస్తకాల అట్టలపై కూడా ఇటు

వంటి అలంకృతులను చిత్రించేవారు. ఈజిప్టు కళలో ఇటువంటి ముద్రికలు ఎన్నో తీరులలో కనపడతాయి. ఈ ముద్రికలపై ఉండే కాలి భాగాలలో చక్రవర్తుల, దేవతల పేరులు చెక్కే వారు.

**cartouche** ² **:** ***ఆవర్తిక.***

సాలంకృతమై, అంచు మడిచినట్లుండే వంక విశేషం. ఒక శాసనమో, లేదా రాజ ముద్రికో దీనిపై అమరి ఉంటుంది.

**cartridge paper :** ***గరుకు కాగితం.***

గరుకుగా ఉండి, చౌకగా లభిస్తూ, చిత్రాలకు ఉపయోగపడే కాగితం. ఆంగ్లంలో కార్ట్రిడ్జి (తుపాకి తోటా) కాగితం అనటానికి ఒక కారణమున్నది. అటువంటి తోటాలను, ఇతర ప్రేలుడు వస్తువులను తయారు చేయటంలో కూడా ఈ కాగితాన్ని ఉపయోగించే వారు. అందువల్ల ఆ పేరు వచ్చింది.

**carver :** ***తక్షకం.***

చివర కోణం కలిగిన ఒక విధపు పొట్టి కత్తి. దీని పిడికి తాడును ఒకదాన్ని చుట్టుతారు. కొయ్యపై చెక్కుడు పనిలో దీన్ని ఉపయోగిస్తారు.

**carving :** ***చెక్కుడుపని; తక్షణ కర్మ.***

శిల్పాల చెక్కుడు పని; ఈ పనికి కత్తులు, ఉలులు, పోగరలు, గొడ్డళ్లు, సుత్తులు సాధనాలు. ఒక చేతితో ఉలిని పట్టుకొని రెండవ చేతిలోని సుత్తెతో కొడతారు. చెక్కటం, మలచడం. అనేవి శిల్పంలో రెండు ముఖ్య పద్ధతులు. ఈ కాలంలో లోహశిల్పాలలో అతకడం కూడా ప్రధానమైన పద్ధతిగా తయారైంది. చెక్కిన శిల్పాన్ని 'చెక్కడం' అని అనవచ్చు గాని 'శిల్పం' అనే పదమే కళాత్మకమైన చెక్కడానికి సరియైన పదం.

**caryatid :** ***స్తంభకన్య.***

వాస్తుశిల్పంలో ప్రస్తరాన్ని మోయటానికి గాను ఏర్పడి ఉండే స్తంభాన్ని రూపొందించే స్త్రీ విగ్రహము. చూడటానికి బరువుగంతని ఇదే మోస్తున్నట్లు ఉంటుంది. ఇటువంటివి అందంగా చక్కని పొడవైన దుస్తులలో ఉంటాయి. ప్రాచీన గ్రీసుదేశంలోని లాకోనియా రాష్ట్రంలోని 'కరియా' నగర కన్యల పేరును బట్టి గ్రీకు భాషలో ఇటువంటి స్తంభా



స్తంభకన్య

నికి కర్యాటిడ్ అనేపేరు వచ్చింది. ఈ కన్యలు 'ఆర్టెమిస్' విగ్రహం ముందు మత సంబంధ నృత్యాలు చేసేవారు. ఈ విధంగానే స్తంభం మీద మగ విగ్రహాన్ని చెక్కినప్పుడు. దాన్ని గ్రీకులు 'అట్లాంటెస్' అని, రోమనులు 'టెలమాన్'అని వ్యవహరించారు. దీన్ని స్తంభపురుషుని అనవచ్చు. భారతీయ శిల్పంలో కూడా ఇటు వంటివి ఉన్నాయి.

**casein** : *దధి మార్జం.*

పాలలోని మాంసకృత్తులతో తయారయ్యే పదార్థం; ఇది జిగురుగాను, దధిమార్జ వర్ణాలలో వాహకంగాను ఉపయోగిస్తుంది. పెరుగును ఎండబెట్టి పొడి చేసినప్పుడు ఇది తయారవుతుంది. నీటిలో ఇది కరగాలంటే, ఆ నీటిలో అమ్మోనియా వంటి ఆల్కలీలు (క్షార పదార్థాలు) ఉండాలి. అందువల్ల దీన్ని ఉపయోగిస్తే, వర్ణాలు ఆరిన పిమ్మట, నీటి వల్ల చెరిగిపోవు. 19వ శతాబ్దిలో, ఇది మొదట్లో వ్యాపార స్థాయిలో ఉత్పత్తి అయింది. పురాతన కాలంలోనూ, దీన్ని రంగులలో ఉపయోగించి ఉండవచ్చు. 11వ శతాబ్దికి చెందిన లిఖిత గ్రంథాలలో ఇది ఉదహృతం. దీన్ని సర్వీన్‌వలె వేడి చేసి, వాడే అవసరం లేదు.

**casein colours** : *దధిమార్జ వర్ణాలు.*

దధిమార్జం కలిపి తయారు చేసి, కళాకారులు ఉపయోగించే వర్ణాలు. కాలం గడచిన కొద్దీ ఇవి పెళుసుగ తయారవుతాయి. కాబట్టి పిసతో గుడ్డపై చిత్రించటం కూడదు. మందంగా ఈ రంగులను పూస్తే బీటలు వారుతాయి కాబట్టి పలచగనే పూయాలి. తైలవర్ణ చిత్రాలకు తొలిపూతగను, మెరుపుగాను వాడవచ్చు. 1940వ పూర్వం అమెరికాలో ఈ రంగులు విరివిగా వాడుకలో ఉండేవి. ఇటువంటి రంగులలో చాలా వాటిని ట్యూబులలో ఉత్పత్తి చేసి అమ్మేవారు

**casket** : *కరండకం.*

**cassel earth** : *కాజలీ మట్టి.*

సహజ సిద్ధంగా లభించే గోధుమ వన్నె మట్టిరంగు. ఇందులో కర్బన పదార్థం చేరి ఉంటుంది. వాన్‌డైక్ కపిలాన్ని, ఇది చాలా పోలి ఉంటుంది. ఈ కాజలీ మట్టికే కోలోన్ మట్టి అనికూడా వ్యవహారం ఉన్నది.

**cassel green** : *కాజలీ హరితం.*

మాంగనీజు హరితానికి పర్యాయనామం.

**cassone painting** : *పేటికా చిత్రణ.*

ఇటలీ దేశవాసులు తమ గృహాలలోని పెద్ద పెట్టెలపై, 15వ శతాబ్దంలో రమ్యత కొరకై చేసిన చిత్రణ. దీనిలో అలంకారాలు, దృశ్యాలోపచిత్రాలు, చెక్కడాలు కూడా ఉంటాయి. ఈ పేటికలను చక్కటి నైపుణ్యంతో చేసేవారు. బొట్టిసెల్లి, పావ్‌లో, ఉచ్చెల్లో వంటి ప్రముఖులు ఇటువంటి చిత్రాలు రచించారు.

**cast** : *పోత.*

మూసనుంచి అచ్చుతీసే పద్ధతితో శిల్పానికి నకలు తీసే పని,

**casting** 1 : *పోతపని.*

**casting** 2 : *నిషిక్తం.*

(పోతపోసిన విగ్రహం అనే అర్థంలో)

**cast materials** : *నిషిక్త ద్రవ్యాలు.*

**casting plaster** : *నిష్యంద సుధావిష్టం; పోత సుద్ద.*

ఒకరకమైన ప్లాస్టర్ ఆఫ్ పారిస్. మూసలో పోసి అచ్చులు తీయటానికి తరవాత అవసరాన్ని బట్టి చెక్కి సరిచేయటానికి అనువుగా ఉంటుంది. తెల్లగా, మృదువుగా ఉండి, సూక్ష్మ వివరాలను రూపంలో మలచటానికి ఇది పనికి వస్తుంది.

**castor oil** : *ఆముదం.*

ఎప్పటికీ ఆరని ఏకైక తైల విశేషం. కాని ఆల్కహాలులో పూర్తిగా కరిగిపోతుంది. లాక్షా

వర్ణాలతో కలపటం వల్ల వాటి పెళుసుదనం పోయి, అవి ఆరటానికి కొంత వ్యవధి కలుగుతుంది

**cast shadow :** ***క్షిప్త ఛాయ.***

చిత్రంలోని ఒక రూపపు నీడ ఇంకొక వస్తువుపై పడినట్లుండటం. సహజ చిత్రణ దీనిని గమనించడం ముఖ్యం కట్టి, రూపాలను వాటినుంచి కలిగే ఛాయలను చిత్రించటంలో దృష్టిప్రక్రమ గతిని పాటించాలి. రూపము యొక్క సాంద్రత, స్థానం, ప్రమాణం, ఆకృతి, చిత్రంలో చూపే వెలుతురు - అనే వాటిని బట్టి ఈ ఛాయ ఉండాలి. ఇటువంటి నీడలను చూపే చోట్ల అనుభూతివాదులు అనేక వర్ణాలను వాడారు. 1920 నుంచి ఇటువంటి ఛాయలను చిత్రించటం తగ్గిపోయింది.

**catenary curve :** ***శృంఖల రేఖ.***

రెండు చివరలు కొంచెం దూరంగా ఒకే ఎత్తున కట్టి వ్రేలాడదీసిన త్రాడు వంటి వంపు ఇటువంటి వంపులు అలంకరణ చిత్రణలో సామాన్యంగా కనపడతాయి

**caulking (tracing) :** ***అనులేఖనం.***

కొంచెం పారదర్శకమైన కాగితాన్ని చిత్రంపై ఉంచి రేఖలను అనుసరించి గీయటం.

**cauteria :** ***నిర్ణత సామగ్రి.***

మైనపు రంగులు వేయటానికి రోమనులు ఉపయోగించిన పరికరాలు. ఈ పరికరాలలో రాగి, లేదా వెండి వర్ణ ఫలకం, దాని క్రింద ఉంచే నిప్పుల కుంపటి, చిత్రం వేయటానికి ఉపయోగించే రంగుడాకు మొదలగునవి ఉంటాయి.

**alier, projection :** ***వాలు ప్రక్షేపం.***

(చూ : *oblique projection*)

**cavetto :** ***పుటికీల.***

కొంచెం లోతుకు దొల్చుకొని ఉన్నట్లు వక్ర రేఖగా తీరి ఉండే శిల్ప రీతి.

**cavityless casting :**

(చూ *lost pattern casting*)

**cavo - relief :** ***నిమ్నోల్బణ రీతి***

గుంటగా ఉండే ఉల్బణ చిత్రణరీతి.

**cavo-rilievo :** ***గుహోల్బణం.***

(చూ : *relief*)

**cedar, oil of :** ***దేవదారు తైలం.***

సిరా వర్ణంలో కలిపే బంధకముల నుంచి చెడు వాసన రాకుండా ఉండటానికి కలిపే వాసన నూనె.

**ceiling :** ***లోకప్పు; అంతశ్ఛాదనం.***

**celadon :** ***వర్ణశ్యామం.***

ఇనుము చేరిఉండే ఒక రకపు మార్దవ ద్యుతికం. ఎర్రని ఇనుప భస్మం (ఫెర్రిక్ ఆక్సైడు)ను ఆక్సీహరణాగ్నికి గురిచేసి నల్లని ఇనుపభస్మం (ఫెర్రోసో-ఫెర్రిక్)న్ని, తయారు చేయటంలో ఇది సిద్ధిస్తుంది. ఇట్లా ఆక్సీహరణం వల్ల లభించే ద్యుతికపు రంగు లలిత్ ఆకుపచ్చగనో, దూసరపు ఆకుపచ్చగనో, లేదా దూసరంగానో ఉంటుంది. వర్ణశ్యామ ద్యుతికపుమార్దవ సామగ్రి, చీనాదేశాన్ని పాలించిన సుంగ్ రాజవంశ కాలంలో ఆదరణ పొంది, నవీపుష్టతను ఆర్జించింది. వర్ణశిలను ఇది పోలి ఉండటం వల్లనే చీనీయులు దీన్ని ఎక్కువగా అభిమానించారు. పాశ్చాత్య దేశాలలోనూ దీనికి అత్యధికాదరణ లభించింది.

**celadons :** ***ఆకుపచ్చపాక రంగులు.***

**celestial blue : అంతరిక్ష నీలిమ.**

ఒక చౌకరకపు ప్రష్యన్ నీలిమ; దీనిలో 95% దాకా ముగ్గురాయి చేరి ఉంటుంది. చిరస్థాయి చిత్రణలకు ఇది ఉపయోగించదు.

**celite : సెలైట్.**

తయారీ పూతరంగులలో జడ వర్ణద్రవ్యాలుగాను, పూరకాలుగాను, మంద్రకారులుగాను వాడకంలో ఉండే అగ్నిశిలా మృత్తికలలో చాలా తరగతులవాటికి వాడుకలో ఉన్న వ్యాపార నామం.

**cell : శిలికం; కోశిక.**

**celluloid : సెల్యులాయిడ్; కోశపటలం.**

ఒక విధమైన కల్పకానికి వ్యాపారనామం. సంయోజిత రీతిలో 1876లో తయారైన తొట్ట తొలుతటి కల్పకమిది. దీనిని రూపొందించటంలో సెల్యులోజ్ నైట్రేట్ అనే రసాయనిక పదార్థం ప్రాతిపదికగా వినియుక్తం; కాని దానికి కల్పకతను సిద్ధింప చేయటానికి కర్పూరం వినియోగ మయ్యేది. ఈనాడు సంయోజిత యక్షరూపాలు అనేకములు, రసాయన శాస్త్ర వికసనం వల్ల తయారు కాగల్గుతున్నా సెల్యులోజ్ నైట్రేటు ప్రాతిపదికగా కర్పూరంతో కలిపి తయారు చేసే కల్పకము లకు వాడుక ఎక్కువగనే ఉన్నది. అయితే ఈ సెల్యులోజ్ (కోశికా) కల్పకములు లలిత కళలలో ఉపయోగించేందుకు, తగినంత చిరస్థాయిత ఉన్నవి కావు.

**cellulose : కోశిక; సెల్యులోజ్.**

**cellulose acetate : కోశికా అసితేతం.**

కోశిక నుంచి లభించే ఒక ఉత్పన్నం. ఛాయాచిత్రక పటలాలను, కల్పకములను, జవుళి తంతులములను, లాక్షా ద్రవ్యాలను తయారు చేయటానికి దీనిని ఉపయోగిస్తారు. పటలం (ఫిల్మ)ను తయారు చేయటానికి సెల్యులోజ్ నైట్రేటుతో తయారయ్యే ఫిల్ముకు సులభంగా నిప్పంటుకొంటుంది. కాని కోశికా అసితేతంతో తయారు చేస్తే అంతగా నిప్పంటుకోదు. యితే కోశికా ఉత్పన్నాలలో ఏదీ తగినంత ధృతి ఉన్నది కాదు; కాబట్టి అవి చిరస్థాయి చిత్రణకుగాని, రచనకుగాని పనికి రావు.

**cellulose cement : సెల్యులోజ్ సిమెంట్; కోశికా సిమెంట్.**

అగ్ని దారుకం (*pyroxylin*) లేదా కోశ పటలికా ద్రవ్యాన్ని లాక్షాద్రావణంలో కలిపితే తయారైన జిగటగా ఉండే ఒక ద్రవ విశేషం. అధిసక్తకంగానూ, మరమ్మతు పనులలోనూ, వాడటానికి పనికివచ్చే ఈ ద్రవం నాటకలలో అమ్మకానికి లభిస్తున్నది. ఈ రకపు వాటిలో డూకో సిమెంటు అనబడేవి ప్రశస్తం.

**celullose nitrate or nitrocellulose : సెల్యులోజ్ నత్రితం లేక నత్రిత సెల్యులోజ్.**

కోశపటలికా తంతులములను నత్రితీకరించటం వల్ల తయారయ్యే ఒక పారిశ్రామికపు ముడి పదార్థం లాక్షాద్రవ్యాల తయారీలో ఇది ముఖ్య సాధనద్రవ్యం. ఎన్నో తీరుల కల్పకాలను పటలాలను తయారు చేయటానికి ఇది ఉపయోగపడుతున్నది; దీనితో తయారయ్యే లాక్షా ద్రవ్యాలుగాని, కల్పకాలుగాని చిరస్థాయి చిత్రాల రచనకు ఉపకరించవు.

**celotex : సెలోటెక్స్.**

చక్కెరచెరకు పిప్పినుంచి తయారయ్యే

ఒక రకపు అస్తరానికి వాడుకలో ఉన్న వ్యాపార నామం. ఈ అస్తరపు నిర్మాణరీతి సడలుగా ఉంటుంది; లాంతవత చాల ముతకగా ఉంటుంది. దీన్ని కొందరు చిత్రకారులు వాడటం నిజమే అయినా, చిత్రపు ఆలంబనంగా ఇది అంతగా గణనీయం కాదు.

**Celtic art :** *కెల్టిక్ కళ.*

యూరపులోని ప్రాచీన జాతులలో ఒకటి అయిన కెల్టిక్ జాతి వల్ల ప్రవర్తిల్లిన కళా విశేషం. మొదట క్రీ.పూ. 5వ శ.లో దక్షిణ జర్మనీలోను, తూర్పు ఫ్రాన్సులోనూ వసించే కెల్టిక్ తెగల నాయకుల ఆదరణలో రూపు గొన్న ఈ కళ కాలక్రమంగా కెల్టిక్ జాతి వారితో పాటుగా యూరపులో అత్యధిక భాగంలో వ్యాపించి ఎన్నో రీతుల వికసించింది. ఇటలీ నుంచి ప్రాచీన గ్రీకు కళా శైలులతో పాటుగా ప్రాచ్య కళా రీతులను కూడా వీరు గ్రహించి, వాటికి తమ ప్రతిభతో కొత్త కొత్త రూపాలను కల్పించారు. వీరి శిల్ప రచన బంగారంలో, కాంస్యంలో ఎక్కువగా కనపడుతున్నది. క్రీ.పూ. 8వ శతాబ్దిలో ఇది బ్రిటనుకు వ్యాపించింది. ఆధిరేఖనంలో జంతు రూపాలు ఈ కళలో ఎక్కువగా కనవస్తాయి.

**Celtic cross :** *కెల్టు సిలువ.*

గుండ్రని చట్రం ఉండే లాటిన్ సిలువ. దీనిని అయోనా సిలువ అని కూడా అంటారు.

**cement :** *సిమెంటు; బంధకం.*

1. రెండు పదార్థాలను సంధించటానికి, లేదా మరమ్మతు చేయటానికి ఉపయోగించే ఏదైనా ఒక పదార్థం. ఉదా: రబ్బరు సిమెంటు, పెంకు సిమెంటు, సెల్యులోజ్ సిమెంటు.

2. కట్టుబడిపనిలో వాడే ఒక పదార్థం. సున్నం, ఇసుక, అల్యూమినా నే మట్టి ఈ సిమెంటు తయారీలో వినియుక్తాలు అవుతున్నాయి.

**cement fondu :** *అల్యూమినీ సిమెంటు.*

దీనిని శిల్పాల పోతలో వాడతారు. ఇది నాలుగు గంటలలో గట్టిపడుతుంది. దీనిని ఇసుకతో కలిపినప్పుడు కాంక్రీటులాగా తయారవుతుంది. ఇంకా వేరు రీతుల పదార్థాలను కలిపి దీన్ని మార్చవచ్చు. గాజు పీచుతో ఈ సిమెంటును కలిపి తేలికగా ఉండే పోతలను తయారు చేయవచ్చు.

**central visual ray :** *కేంద్ర దృగ్రేఖ; కేంద్ర వీక్షణ కిరణం.*

వీక్షణ శంకువులోని కేంద్రంపై సూటిగా పడే దృష్టి రేఖ. ఈ రేఖ, చిత్ర తలానికి 90° కోణం ఉంటుంది. (చూ. *perspective*.)

**centrifugal casting :** *కేంద్రాపసారక పోత; కేంద్రాపసార నిష్యందం.*

ఒక విధమైన పోత పద్ధతి; మధూచ్ఛిష్ట విధానంలో ఒక రీతి. ఇందులో అచ్చును తీయటానికై మూసను గుండ్రంగా తిరిగేట్లు అమరుస్తారు అప్పుడు మూసలో ఏత్తిడి మార్పు చెందడం వల్ల పోతపోసే లోహంలో సందులు ఏవీ ఏర్పడవు. అటువంటి అచ్చు పలచగా ఉంటే మూసలోని వివరాలు అన్నీ దానిలోకి చక్కగా వస్తాయి. ఇటువంటి పద్ధతిని, సాధారణంగా చిన్న చిన్న విగ్రహాలను పోత పోయటానికి, బంగారు, వెండి, ప్లాటినంవంటి విలు

వైన లోహాలలో పోత పోసేటప్పుడూ వినియోగిస్తారు. కంచు, ఇత్తడి, అల్యూమినియంలు వాడి కూడా ఇట్లా పోతపోయవచ్చు.

**cera colla :** *మధూచ్ఛిష్ట ద్రవం.*

కరగిన తేనె మైనమూ, నీళ్లలో కరగించిన సర్కీసూ కలిసిన ద్రవం. ప్రస్తుతం దీన్ని, శుద్ధపరచిన తేనె మైనంలో, అమ్మోనియాకు కొన్ని జిగురులను, దధియార్థాన్ని కలిపి తయారు చేస్తున్నారు. దీనిని నీటి రంగులలో బంధకంగా వాడతారు

**ceramic colours :** *పింగాణీ రంగులు; మార్తవ వర్ణాలు.*

కాల్చిన మట్టి విగ్రహాలపైనా, పింగాణీ పాత్రల పైనా చిత్రించటానికి వాడే లోహ భస్మాలు. చాలా పింగాణీ రంగులు చూడటానికి పేలవంగా ఉండి, కాల్చిన తరవాతనే తేజస్సు పొందుతాయి.

**ceramics :** *మార్తవ కళ; పింగాణీ కళ.*

పింగాణీ మట్టితో చేసి, బట్టీలో కాల్చి, వస్తువులను తయారు చేసే కళావిశేషం. ఈ విధంగా పాత్రలను, శిల్పాలను తయారు చేయవచ్చు. వీటిపై అలంకరణలకు, ఉబ్బెత్తుగా, అదే పింగాణీమట్టితో గానీ, వేరే రంగులు వేసిగాని తీర్చవచ్చు. ఈ అలంకరణ కళ చాల పురాతనం. చీనాలోను, ప్రాచీన గ్రీసులోను ఈ కళ ఉన్నత స్థాయిని అందుకొన్నది.

**ceresin :** *దివ్య శ్వేతం; మాయమైనం.*

స్వచ్ఛమైన ఒక తెలుపు రంగు; దీనిలోని కొన్ని రకాలలో పసుపువాక కూడా కొద్దిగా కనపడుతుంది. ఇది ఒక విధమైన ఖనిజ సిక్థం. ఓజోకెరైటు అనే ఖనిజ ద్రవ్యాన్ని శుద్ధి చేస్తే ఇది లభిస్తుంది. చూడటానికి ఇది మట్టిమైనం (*paraffin*) లాగా కనపడుతుంటేగాని, దాని ద్రవీభవన బిందువు కన్నా ఎక్కువ స్థాయిలో 60°–80° సెంటిగ్రేడ్ల మధ్య ఇది కరుగుతుంది. అందువల్ల తేనె మైనానికి ప్రత్యామ్నాయంగా దీనిని శిల్పాలలో వాడుతున్నారు

**cerography ;** *సిక్థ లేఖనం.*

1 కొవ్వు లేదా మైనం పూసిన పలకంపై ఆలంకరణలను వ్రాతలను చిత్రించే పద్ధతి.

2. వేడి కొవ్వు లేదా వేడిమైనం రంగులతో చిత్రించే పద్ధతి.

3. ముద్రణకోసం కొవ్వు లేదా మైనంతో తయారైన రూపాలను విద్యున్ముద్రా (*electrotype*) ఫలకాలపైకి మార్చటం.

**certificate :** *ధ్రువ పత్రం; సర్టిఫికేట్టు.*

**cerulean blue :** *గగన నీలం; ముదురు ఆకాశ నీలం.*

కోబాల్ట్ స్టానేట్ అనే రసాయనిక సంకేతంగల వర్ణద్రవ్యం. దీనిలో ఆకుపచ్చ ఛాయ అంతర్భాగంగా ఉంటుంది. ఈ వర్ణం చాల మన్నికగలది. కోబాల్టును, తగరపు ఆక్సైడును కలిపి భర్జించటం వల్ల ఈ వర్ణం లభిస్తుంది. ఈ పద్ధతిని జర్మనీ దేశపు హోప్నర్ 1805లో కనిపెట్టాడు. 1870 లో కెరూలియమ్ అనే పేరుతో ఇంగ్లండులో ఈ వర్ణద్రవ్యం ప్రచారం పొందింది.

**cestrum :** *శస్త్రం.*

కొవ్వు (మైనం)తో చిత్రాలు రచించేటప్పుడు వాడే ముఖ్యమైన పనిముట్టు. ఇది రెండు వైపులా పదును గల కత్తిలాగా

ఉంటుంది. ప్రస్తుతం వాడుకలో ఉన్న ఫలక చురిక (*palette knife*)ను ఇది పోలి ఉంటుంది.

**Ceylonese art :** *శ్రీలంక కళ.*

శ్రీలంకలోని కళ. బౌద్ధ ధర్మానికి - అందునా థేరవాదపు పెంపుదలకై వినియుక్తం. దీనిపై శైలీ విషయకంగా భారతదేశ ప్రభావం ఎక్కువగా అక్కడక్కడ ఉన్నా, శ్రీలంకలో ఒక సంప్రదాయరీతిగా, నిరంతరాయంగా ఇది సాగిందని చెప్పవచ్చు. క్రీ.పూ. 247లో అశోకుడి కుమారుడు బౌద్ధమత ప్రచారానికై శ్రీలంకలో, బోధి వృక్షశాఖతో కూడ, అడుగు పెట్టాడని సాంప్రదాయిక కథనం తెలుపుతుంది. తదాదిగా బౌద్ధస్తూపాలు, విహారాలు మొదలైనవాటిని ఆశ్రయించి వాస్తు, శిల్ప, చిత్రలేఖనాలేగాక తదితర కళలు కూడా వర్ధిల్లాయి. వీటిలో మొదట చెప్పినవాటిలో, ఆంధ్రదేశపు అమరావతిలోని శిల్ప శైలీ, తరవాతి కాలపు వాటిలో, దక్షిణ భారతపు పల్లవశైలీ, బౌద్ధమత లక్షణాలతో కనపడుతున్నాయి. సింహగిరి, పోలన్నారువ, మణియనంగన మొదలైన చోట్ల శిల్పాలు-అందునా పరినిర్వాణబుద్ధ శిల్పాలు-అతి రమణీయమైనవి. ఆ ప్రదేశాలలో కొన్నింట చిత్రలేఖనాల అవశేషాలు కూడా కానవస్తున్నాయి. సిగిరియాలోని చిత్తరువులు, అజంతా చిత్తరువుల లాగా, కళావిదుల మన్ననలు పొందాయి. 18వ శతాబ్ది ప్రారంభంగా కాంస్య విగ్రహ నిర్మాణంలో శ్రీలంకలోని రాజులూ, కళాకారులూ ఉత్తుకత ప్రదర్శించారు. ఆకాలంలో రూపొందిన ఒక తారాదేవి విగ్రహం ప్రపంచపు ఉదాత్త లోహ శిల్పాలలో ఒకటిగా పేరు పొందింది; ప్రస్తుతం అది బ్రిటిష్ మ్యూజియంలో ఉన్నది.

**chalk :** *సీమసున్నం; ఖటిని; సుద్ద.*

దీని రాసాయనిక నామం కాల్షియమ్ కార్బొనేట్. ఇది ముద్ద రూపంలో ఉన్నప్పుడు 'వైటింగ్' అంటారు. కృత్రిమంగా తయారయ్యే కాల్షియమ్ కార్బొనేట్‌ను, 'అవక్షిప్త సీమసున్నం' (*preciepletated chalk*) అని అంటారు. పొడి రంగులకు కూడ ఈ పేరునే వాడతారు.

**chalkiness :** *సుద్దపాటు.*

**chalking :** *పొడి రాల్పు.*

రంగులోని బంధకంయొక్క లోపంవల్ల, రంగు పొడిపొడిగా కావటం చేత చెరిపితే చిత్రం చెడిపోతుంది. చిత్రకాయం పట్టాలలో కంటే, ఎండలకు ఎతిడివానలకు తడిసే గోడలకు పూసే రంగులలోనే ఇటువంటి పొడిరాల్పు ఎక్కువగా కనపడుతుంది.

**chalk manner :** *సుద్ద పద్ధతి.*

(చూ. *crayon manner*)

**chalk roll :** *బిందు కరణి;*

*ఖటిన్యావర్తని.*

ముద్రించటానికి ఉపయోగించే ఫలకాలపై చుక్కలు, ముక్కలుగా ఉండేట్లు చేసే సాధనం. ఇది ఒక విధమైన రౌలెట్టి అనే సాధనం.

**chamois :** *గోవీ చందనం.*

ఇంగ్లీషులో దీనిని "యెల్లో ఓకర్" (*yellow ochre*) అని కూడా వ్యవహరిస్తారు.

**champleve :** *నతాలంకృతి.*

అభాసితను చేయటానికి ఉపయోగించే సాంకేతిక పద్ధతి; అటువంటి పద్ధతిలో తయారు

చేసిన ఆభాసికా వస్తువు. లోహంపై గుంటలుగా వచ్చేటట్టుచేసి, ఆ గుంటలలో పింగాణిని నింపి, బట్టీలో కాలుస్తారు. ఇది సీమితాలంకృతి (*Cloisonne*) పద్ధతికి భిన్నం. దీనిలో రంగుల చుట్టూ అంచు కట్టిఉండదు. రోమనుల కాలం నుంచీ ఈ పద్ధతి వాడుకలో ఉన్నది. మధ్యయుగాలలో గృహోపకరణాల పైనా, చర్చిలలోను ఇది వాడుకలో ఉండేది.

**charcoal** : ***బొగ్గు కణిక***

సన్నని పుల్లలను కాలిస్తే వచ్చే, బలపం వలె ఉండే బొగ్గు సాధారణంగా పేము, ద్రాక్ష తీగెలను దీని కోసం కాలుస్తారు. కావలసిన మందములలో, తగినంత మెత్తగా ఉండేట్లు దీనిని తయారు చేసుకోవచ్చు. దీనితో చిత్రాలను రచించటానికి బొగ్గుకాగితం (*charcoal paper*) చాలా ఉపయుక్తం కాటికపై మొదట గీసే స్కెచ్చిలకు కూడా దీన్ని ఉపయోగించవచ్చు. పొడి రంగుల చిత్రాలలో నల్లరంగుగా దీనిని వాడతారు దీనితో గీసిన చిత్రాలను వేలితో చెరిపి, చక్కటి ఛాయలను సృష్టించవచ్చు. ఇటువంటి చిత్రాలు చెరిగిపోకుండా ఉండటానికి వాటిపై బంధకాన్ని చల్లాలి.

**charcoal black; charcoal gray .**

***బొగ్గు నలుపు; బొగ్గు బూడిద రంగు.***

బొగ్గును మెత్తగా పొడి చేసి తయారు చేసే వర్ణ ద్రవ్యాలు. వీటిని కళాకారులు చిత్రాలలో వాడరు.

**charcoal paper** : ***బొగ్గుకాగితం.***

మెత్తదనం కలిగి, ఉపరితలం గరుకుగా ఉండే కాగితం దీనిపై బొగ్గు కణికతో చిత్రాన్ని వేస్తారు. ఇతర వర్ణాలను కూడా సులభంగా దీనిపై వాడవచ్చు. ఈ కాగితం తెలుపులోను, తక్కిన రంగులలోను లభిస్తుంది. దీనిలో మేలిరకపు వాని తయారీలో గుడ్డ ముక్కలను వాడతారు. అటువంటి కాగితంలో నీటిగుర్తు (*water mark*) వేస్తారు.

**charm** : ***కమనీయత.***

**chart** : ***రేఖాపటం.***

**chasing** : ***అనుధావనం.***

1. లోహంపై సుత్తెమొనతో కొటి చిన్ని చిన్ని సొట్టలు చేసి, అలంకరణ రూపాన్ని తయారు చేయడం. లోహపు రేకును వెనక వైపు నుంచి కొట్టి, ముందు వైపున ఉబ్బిన రూపాలను తెచ్చే రీతికి ఇది భిన్నం అటువంటి దానిని తిరోఘట్టన (*repousse*) ప్రక్రియ అని అంటారు.

2. శిల్పంలో పోతలో వచ్చిన లోపాలను, అంచులను సంచేయటం.

**chassis** : ***అడుగు చట్టం.***

1 చిత్రరచనకై కాటికను బిగించే చట్టం.

2 ప్లాస్టరు ముద్రపు నకలును తయారు చేయటానికి లోపలి వైపున ఉండే చట్టం.

**chatter mark** : ***వాటగీత.***

పింగాణీ పాత్రలు పచ్చిగా ఉన్నప్పుడు దాకువంటి సాధనంతో నిలువుగా గీసే గీత. ఈ గీత, పాత్రను నునుపు చేసేటప్పుడు పొరపాటున కూడా సంభవించవచ్చు. లేదా, ఉద్దేశపూర్వకంగా అలంకరణార్థం పెట్టవచ్చు.

**checking** : ***పలక పగుళ్లు.***

1. చిత్రంపై సులిపలకలుగా కనిపించే పగుళ్లు.

2. కర్రలో వస్తు ఇవి కర్ర యెండే టప్పుడు ఏర్పడతాయి.

**chef d'oeuvre** : *ఉత్తమ రచన.*

ఉత్తమమైన కళారచన. ఆంగ్లంలో దీని పర్యాయపదం. 'మాస్టర్ పీస్'

**chemical (n)** : *రసాయన ద్రవ్యం.*

**chemical(adj)** : *రసాయనిక.*

**chemigraphy** : *రసాయనిక లేఖన ప్రక్రియ*

రాసాయనిక ప్రక్రియ ద్వారా లోహఫలకం పై రూపాన్ని చెక్కటం.

**chemist** : *రసాయనికుడు.*

**cherry gum** : *చెర్రీ నిర్యాసం.*

వృక్షసంబంధమైన ఒక విధపు జిగురు. నానబెట్టినప్పుడు ఇది ఉబ్బుతుంది నానిన తర వాత దీన్ని రంగులలో బంధకంగా వాడవచ్చు.

**cherrywood** : *కృష్ణాగర్భిక.*

కృష్ణాగ్నిగర్భ వృక్షపు దారువిశేషం; దీని లోని చారకూర్పు చాలా దట్టంగా ఉంటుంది. ఎర్రదనపు ఇది పేరు గాంచింది. మిలమిలలాడే పసిమి లేదా ఎరుపువాక రంగులో ఉండే ఈ కొయ్యలో మిసిమితనం కావలసినంతగా కల్పించవచ్చు. చక్కటి నతోన్నత శిల్పాలకు ఇది పనికి వస్తుంది. సముద్గ రచనకు ఇది బాగా ఉపకరిస్తుంది.

**cherub** : *దివ్యార్భకుడు.*

**chest** : *మందసం.*

**chestnut brown** : *శ్యావ కపిశం.*

అంబరుకు సమానార్థకం; కాని దీనికి అంతగా వాడుక లేదు.

**chiaroscuro** : *స్పష్టాస్పష్ట చిత్రణ; వెలుగు నీడల చిత్రణ.*

రేఖా చిత్రణంలోను, రంగుల చిత్రణం లోను, రూపాలపైనా వాటి పరిసరాలపైనా పడే వెలుగు నీడలు చిత్రించటం. దీని వల్ల, చిత్రములందు లోతు, వాతావరణముల భ్రమను కలిగించవచ్చు. ఇటువంటి చిత్రణ యూరపియ పునరుజ్జీవన యుగంతో మొదలైంది. దీనిలో లియొనార్డో డా వించి, రెంబ్రాంట్ ప్రసిద్ధులు. (చూ: *tenebrism*).

**chiaroscuro woodcut** : *వెలుగు నీడల చెక్కుముద్ర; స్పష్టాస్పష్ట దారుముద్ర.*

చెక్క పలకలపై చెక్కి, ముద్రణ చేయ డంలో, వెలుగు నీడలు చూపటానికి వేర్వేరు పలకలను ఉపయోగించటం, ముద్రించడం, వేర్వేరు రంగులు ముద్రించటానికి వేర్వేరు పలకలను తయారుచేసినట్లే, వేర్వేరు ఛాయలు ముద్రించటానికి వేర్వేరు పలకలను ఉపయో గించాలి.

ఇటువంటి ముద్రణలలో తరచుగ వాడుక చేసేవి : బూడిదరంగు, ముదురు గోధుమ, ఆకుపచ్చ, సెపియా. లోహ పలకాలతో ముద్రణ అభివృద్ధి చెందినప్పటినుంచి ఈ పద్ధతి వెనుకపడింది.

**Chicago school** : *చికాగో సంప్రదాయం.*

వాస్తువులో లోహానికి కల్పించదగిన ప్రతి పత్తిపై తగిన ప్రయోగాలను నిర్వహించిన, చికాగోలోని ఒక కళాకారబృందం. వాస్తువులో పెద్దనిర్మాణాలను, ఇనుపకడ్డీలు వినియోగించి, కట్టుటను ప్రారంభించి, రూపొందించిన సంప్ర దాయం. ఈ సంప్రదాయం 1871లో మొదట

ఆచరణలోనికి తీసుకొని రావడం జరిగింది. దానిని అనుసరించి, చాలా అంతస్థుల భవనాన్ని, ఇనుప కడ్డీల ఆస్థిభారంతో, మొదట నిర్మించిన వాస్తువిదుడు విలియం లే బారన్ జెన్నీ (1832-1907). సుల్లివాన్ ఈ రకమైన భవనాలకు రమణీయతను కూర్చే పద్ధతులు కనిపెట్టాడు.

ct **chic anglais** : *చిక్ ఆంగ్లే.*

18వ శతాబ్దంలో ఆంగ్లేయ చిత్రకారులు వాడిన ఉజ్జ్వల వర్ణాల రమ్యతను వర్ణించు ఫ్రెంచి పదం.

**children's art** : *బాల కళ.*

సరిఅయిన సాధన సంపత్తి, అవకాశమూ లభించే పక్షంలో శిశువులుకూడా తమ భావాలను రంగులలో, రేఖలలో, కల్పిత పదార్థాల ముద్దలతో నిర్మితాలయ్యే ఆకృతులలో వెలువరించ గలుగుతారని పండితుల అభిప్రాయం. ఎన్నో పరిశోధనల వల్ల ఈ అభిప్రాయం సరి అయినదే అనీ, ఎక్కువ ప్రగతిని సాధించిన వర్గాలకేగాక ఆదిమ స్థాయిలో ఉన్న వర్గాలకు సైతం ఇది వర్తిస్తుందనీ రుజువైంది. రెండేండ్ల బిడ్డకు సైతం ఒక పెన్సిలు ఇస్తే, ఏదో ఒక గీతనూ - సాధారణంగా ఒక అవక్రమ వృత్తాన్ని - ఆ బిడ్డ గీస్తుంది. రెండు పెన్సిళ్లు ఇస్తే, ఒక్క తడవనే రెండు అవక్రమ వృత్తాలను గీయడంకూడా కద్దు. మూడు నాలు గేండ్ల వయసు వచ్చిన బిడ్డలు సున్నలకు బదులుగ గుర్తించటానికి వీలయ్యే తలలు మొదలైన శరీర భాగాలను గీస్తారు. ఇట్లా ఒక పద్ధతిని అనుసరించి బిడ్డలలో కళాకుశలత క్రమక్రమంగా అభివృద్ధి కావటం అనుభవవేద్యం.

**chill** : *అస్పష్టత.*

( : *bloom*)

**China clay** : *చీనా పింగాణిమట్టి.*

దీని రాసాయనిక నామం అల్యూమినియం సిలికేటు దీనితో చీనాదేశంలో పింగాణి పాత్రలు తయారు చేయటం వల్ల, దీనికి ఈ పేరు వచ్చింది కయోలిన్ అనేది తెల్లని శుద్ధమైన చీనా మట్టి. చీనా పింగాణి మట్టినే ఆంగ్లంలో పైప్ క్లే (*pipe clay*) అని అంటారు

**chinese ink** : *చీనా సిరా.*

**china painting** : *పింగాణి చిత్రణ.*

పింగాణి పాత్రలపై రంగులతో అలంకరణ చేయడం. ఇది ముఖ్యంగా స్త్రీల పని. గడచిన రెండు శతాబ్దాలుగా, ఇది చాలా ప్రచారంలో ఉంది. దీనికి కావలసిన సాధనాలు తెల్లని పింగాణి పాత్రలు స్త్రీలు వీటిపై చిత్రించి, కాల్చటానికి వాటిని బట్టీలకు పంపుతారు,

**Chinese art** : *చీనీయ కళ.*

చీనీయ చిత్రకళ ప్రాగైతిహాసిక కాలం నుంచి, క్రమాభివృద్ధిని పొందినట్లు తెలుస్తున్నది హన్ రాజవంశకాలపు (క్రీ పూ. 206-క్రీ.శ. 286) పూర్వ భాగంలో కుడ్య చిత్రరచన ఎరుపుగా నీలిరంగులలోనేగాక, తైల వర్ణాలలో కూడా సాగినట్లు నిదర్శనాలున్నవి. యువాన్ - టీ (క్రీ పూ. 48-34) పరిపాలన కాలంలో జీవించి ఉన్న మావో-యన్ షూ అనే అతను చరిత్రకు తెలియవచ్చిన ప్రప్రథమ చీనీయ చిత్రకారుడు. ఆ చిత్రకళ చిన్ రాజవంశ కాలంలో (క్రీ.శ. 265-420) ఒక స్థిరతను ఆర్జించి పెక్కురచనా రీతులలో

సాగింది. ఆ కాలంలో బౌద్ధ మతం కూడా దానిపై ప్రభావం నెరిపింది. కళా విషయిక మూలసూత్రాల ప్రచారం కూడా విస్తృతంగా సాగింది. అప్పటి నుంచీ నూనె రంగులకు బదులుగా సిరా, రెల్లు కలానికి బదులుగా కుంచె వాడుకలోకి వచ్చి, ఆ కళకు ఒక విశిష్టతను సమకూర్చాయి. సుంగ్ రాజవంశీయుడైన హుయిత్ సుంగ్ చిత్రకారుడుగాను, గొప్ప చిత్రకళా పోషకుడుగాను పేరు పొందాడు.

**Chinese blue : *చీనీయ నీలం.***

ప్రష్యన్ నీలంలో ఒక ఛాయ.

**Chinese insect wax : *చీనీ మైనం; చీనీ కీటక సిక్థం.***

79°–83° సెం. గ్రేడ్ మధ్య కరిగే ఒక విధమైన మైనం. ఇది చీనాదేశంలో కొన్ని క్రిముల వల్ల ఉత్పత్తి అవుతుంది. కళలలోనే గాక, ఇతరత్రానూ ప్రయోజనం గలదిగా, ఇది తరతరాలుగా వాడుకలో ఉన్నది. తేనె మైనానికి బదులుగా దీనిని వాడవచ్చు. ఈమైనాన్ని ఉత్పత్తి చేసే క్రిములు చీనాలోని యూనాన్ రాష్ట్రంలో చెట్లపై గుంపులుగా చేరుతాయి. అక్కడ నుంచి వాటిని షెక్వాన్ రాష్ట్రానికి తీసుకొని వెళ్ళి అక్కడ వేరే విధమైన చెట్లపై వదులుతారు. అక్కడనే ఆ మైనాన్ని తీస్తారు.

**Chinese red : *చీనీ యెరుపు.***

క్రోమ్ యెరుపుకు ఇంకో పేరు

(చూ : *chrome yellow*)

**Chinese vermillion : *చీనీ సిందూరం.***

చీనాలో తయారయ్యే 'చూ షా' అనే సిందూరానికి మొదట్లో ఈ పేరు ఉండేది. ఈ కాలంలో ఆ తీరునే అమెరికా, ఇంగ్లాండులలో తయారయ్యే అటువంటి సిందూరానికి ఆ పేరే వాడుకలో ఉంది.

**Chinese white : *చీనీ తెలుపు.***

తుత్తునాగం నుంచి తయారయ్యే తెలుపు రంగు. దీనిని 1884లో ప్రఖ్యాతి పొందిన 'విండ్‌సర్ అండ్ న్యూటన్' అనే రంగుల సంస్థవారు తయారు చేశారు. దీనిని పారదర్శకంగా కూడా వాడవచ్చు

**Chinese yellow : *చీనీ పసిమి.***

రాజపీతానికే ఇంకో పేరు,

**Chinoiserie : *చీనీ రీతి.***

చైనీయ శైలులచే ప్రభావితమైన అలంకార కళ. గృహోపకరణాలపైనా, గృహాభ్యంతరాలలోనూ, వాస్తు శిల్పాలలోనూ, పట చిత్రాలలోనూ, కుడ్య పత్రాల (*wall papers*) మీదా, ఇటువంటి కళారీతి వ్యాపించింది. 18వ శతాబ్దిలో దీని ప్రభావం ఎక్కువగా కనబడింది.

**chipboard : *చౌక అట్ట.***

ఇది చిత్తు కాగితాలతో తయారై చౌకగా లభిస్తుంది. చిత్రాల వెనక అతికించటానికి ఇది పనికిరాదు

**chi - rho : *కిరో.***

క్రిస్టస్ అనే గ్రీకు పదంలో వచ్చే మొదటి రెండు గ్రీకు అక్షరాలతో ఏర్పడే క్రైస్తవ చిహ్నం. ఆ రెండు అక్షరాలను, ఒక దానిపై వేరొకటి వ్రాస్తే ఆ చిహ్నం ఏర్పడుతుంది.

మొదటి క్రైస్తవ చక్రవర్తి అయిన కాన్స్టన్‌టయిన్ యొక్క పతాకం మీద ఈ చిహ్నం ఉండేది.



కిరో

**chisel:** ***ఉలి; టంకము; రాతి ఉలి.***

దీనిలో అనేక పరిమాణాలు, ఆకారాలూ ఉన్నాయి. కొయ్య శిల్పాలను, రాతి శిల్పాలను, ముద్రణకు ఉపయోగించే చెక్క పలకలను తయారుచేయటానికి, ఈ పనిముట్టు ఉపయోగ పడుతుంది. శిఖావతులు (పాయింట్లు) అను పరికరములు కూడ ఉలుల కోవకు ఒకరికి చెందినవే.




ఉలులు, శిఖావతులు;

1. శిఖావతులు, 2. పెద్దశిఖావతి, 3. బద్ద ఉలి, 4. పంటి ఉలి, 5. చలిమిరి ఉలి, 6, నాటుఉలి, 7. తిక్కడి ఉలి; 8. చుక్క బరమా.

**chisel brush:** ***ఉలికుంచె; టంకతూలిక.***

ఉలిమొన ఆకారంలో రోమాలను అమర్చిన కుంచె.

**chi shih:** ***చీనీ మట్టి.***

చీనా దేశపు ఒక విశమైన మట్టి వర్ణం. ఇది ఇటుక ఎరుపులో ఉంటుంది. సర్వీసులో కలిపి దీన్ని వాడవచ్చు.

**chopped strand mat :** ***శకలిత తంతుకటం.***

అనియత రీతిలో అక్కడక్కడ కుదురు కొన్న గాజు తంతులముల వల్ల రూపొందిన కటరీతి. ఈ తంతులములలో ప్రతిఒకటీ రమారమి 5 సెం. మీ. పొడవుంటుంది. దానిలో అనేకములైన అంశుకములు (*filaments*) ఇమిడి ఉంటాయి. ఈ అంశుకములను అన్నిం టిని కలపటానికి ఒక విధపు సైజు ఉపయుక్తం. ఈ సైజు, పాలియెస్టరు యక్షధూపంలో బాగా కరుగుతుంది. అందువల్ల దీని మూలకంగా ఆ యక్షధూపం బాగా గట్టి దేలుతుంది. ఇటువంటి సమ్మిశ్రిత ద్రవ్యాన్ని ఫలకంగా తీర్చినప్పుడు, శిల్పానికి ఉపయుక్తమై, చిరకాలం మనగల పోత పదార్థం దానివల్ల లభిస్తుంది.

**Christogram :** క్రైస్తవ ముద్ర

జీసస్ క్రీస్తుకు సంకేతంగా వాడబడే ముద్ర. కి, రో అను గ్రీకు అక్షరాల అమరిక, ఇటువంటి ముద్రలలో ముఖ్యమైంది.

(చూ: *chi - rho*)

**chroma :** *స్ఫుటత.*

ఒక రంగును వివిధ సాంద్రతలతో ఉపయోగించేటప్పుడు కనపడే ఛాయల మార్పు. వర్ణప్రస్తారాన్ని గురించి మన్‌సెల్ ప్రతిపాదించిన పద్ధతిలోని త్రివిధ ప్రతిఫలనాలలో ఇది ఒకటి. నలుపు, తెలుపు, బూడిద రంగులు ఈ పద్ధతికి చెందినవి కావు.

**chromatic colours :** *ఛాయా భిన్న వర్ణాలు; స్ఫుటవర్ణాలు.*

నలుపు, తెలుపు, బూడిద తప్ప మిగిలిన వర్ణాలు. ఈ మూడు వర్ణాలను ఛాయారహిత వర్ణాలని అంటారు.

**chromaticity :** *వర్ణతత్త్వం.*

ఒక వస్తువులో ఉండే రంగుయొక్క లక్షణం. సాంకేతికంగా వర్ణంయొక్క సాంద్రత, పారిశుద్ధ్యం. మేక్స్‌వెల్ త్రిభుజము, లేదా వర్ణ త్రిభుజం అనే పేరులు సైతం కలిగిన వర్ణతత్త్వచక్రం, ఆ యా వర్ణాలలోని ప్రాథమికమైన మిశ్రమం పాళ్లను తెలియజేస్తుంది.

**chrome green :** *క్రోమ్ హరితం.*

క్రోమ్ పసుపు, ప్రషియన్ నీలాల మిశ్రవర్ణం. ఇండ్లలోను పరిశ్రమలలోను దీన్ని తరచుగా వాడతారు. ఇది కళాకారుల వర్ణాలలో పనికిరాదు దీన్ని పలుఛాయలలో తయారు చేయవచ్చు. దీనికే రాజహరితం, జిన్నోబర్ హరితం, తైల హరితం అనేవి పర్యాయ నామాలు. దీని ఛాయాంతరాలలో పత్రి హరితం, కంద హరితం, శైవల హరితం, మూర్త హరితం అనేవి కొన్ని. బ్రన్స్విక్ హరితంకూడా ఇటువంటిదే.

**chrome orange :** *క్రోమ్ నారింజరంగు.* (చూ: *chrome yellow*)

**chrome yellow, chrome orange, chrome red.**

*క్రోమ్ పసుపు, క్రోమ్ నారింజ; క్రోమ్ ఎరుపు.*

ఈ మూడూ కూడా లెడ్ (సీసపు) క్రోమేటు నుంచి తయారవుతాయి. తయారు చేసే పద్ధతుల వల్ల, పేలవంగా ఉండే పసుపు రంగుమొదలు కాంతిమంతమైన ఎరుపు రంగు వరకు తయారు చేయవచ్చు. 1818లో వ్యాపారసరళిలో ఇవి తయారు చేసారు; అప్పటి నుంచి ఇండ్లలోను పరిశ్రమలలోను విరివిగ వాడబడుతున్నాయి. వాటిలో కాంత్యుజ్జ్వలత, వర్ణద్రవ్యత మెండుగా ఉన్నప్పటికీ, ఎక్కువ కాలం మనజాలవు. వాతావరణంలోని గంధకం వల్ల ఇవి గోధుమ వర్ణంగా మారిపోతాయి; ఇతర వర్ణ ద్రవ్యాల సంపర్కానికి లొంగిపోతాయి సూర్యరశ్మి తగలడంవల్ల ఆకుపచ్చగా మారవచ్చు. ఈరంగులలో తుత్తునాగ సంబంధములైన విషపదార్థాలు ఉన్నాయి, కాడ్మియమ్ ఎరుపు, పసుపు వర్ణాలు వీటికన్న అనువైనవి. టర్నరు, వాంగో తాము రచించిన చిత్రాలలో ఈ క్రోము వర్ణాలను వాడడంవల్ల ఆ చిత్రాలు వర్ణతను కోల్పోయినాయి.

క్రోమ్ ఎరుపునే, చీనా ఎరుపు, డర్బీ ఎరుపు అనీ, క్రోమ్ పసుపునే లిప్‌జిగ్ పసుపు, పారిస్ పసుపు అనీ వ్యవహరిస్తారు. విక్టోరియా ఎరుపు, క్రోమ్ ఎరుపుకు వ్యాపార నామం. వియన్నా ఎరుపు, ప్రషియన్ ఎరుపు అనేవి దీని వేర్వేరు రూపాలు.

**chromium oxide** : క్రోమియం భస్మం.

**chromium oxide green** : క్రోమియమ్ భస్మ హరితం.

సాంద్రత గలిగి, కాంత్యభేద్యమై, పేలవంగా ఉండే ఆకుపచ్చ రంగు ఎక్కువ ఉష్ణోగ్రతకు ఇది తట్టుకోగలదు; ఇట్టికో ఇది తయారవుతుంది; చాల మన్నికగలది; ఇతర వర్ణాలతో కలపటానికి అంతగా పనికిరాదు. ఎక్కువ మంది కళాకారులు దీన్ని వాడరు. 1797లో ఫ్రాన్స్ దేశంలో వాక్వెలిన్ అనే వ్యక్తి మొదటిసారిగా దీన్ని తయారు చేశాడు. దీన్ని ఎక్కువగా పింగాణి పాత్రలపై వాడతారు. దీనిలో ప్లెస్సీ హరితం, డింగ్లేర్ హరితం, ఆర్నాల్డిన్ హరితం, ష్నిట్జర్ హరితం అనే రకాలున్నాయి ప్లాటినమ్, స్టెయిన్ లెస్ స్టీలు పాత్రల మెరుగుకు క్రోమియమ్ భస్మం ఉపయోగిస్తుంది.

**chromo** : చౌకబారు చిత్రం.

**chromolithograph** : వర్ణ శిలాలేఖనం.

రాతి ఫలకపు సాయంతో ముద్రించిన వర్ణ చిత్రం; ప్రత్యేకంగా పాత పద్ధతులలో చేతితో చేసిన వర్ణ ముద్రణం

(చూ: *oleograph*)

**chryselephantine** : దంత సౌవర్ణికం

దంతంతో నిర్మితమై, అక్కడక్కడ బంగారంతో అలంకృతమైన మూర్తిశిల్పం. ఇటువంటి విగ్రహపు శరీరంలో, జుట్టు, దుస్తులు బంగారంతో తయారు చేసేవారు ఇటువంటి విగ్రహాలు మధ్యధరా ప్రాంతంలోనూ, తూర్పు దేశాలలోనూ ప్రాచీనకాలంలో ఎక్కువగా ఆదరించబడేవి. క్రీ. పూ. 5 వ శతాబ్దిలో గ్రీకులు తమ దేవాలయాలలోని విగ్రహాలను కూడ ఈ విధంగానే రూపొందించారు. ఫిడియాస్ అనే ప్రసిద్ధ శిల్పి తయారు చేసిన ఒలింపియన్ జ్యూస్, ఎథీనా పార్థినాస్ విగ్రహాలు ఇటువంటివే ఈ విగ్రహాల్లో ప్రతి ఒక్కటి 40' అడుగుల ఎత్తు ఉండేది.

**chrysocolla** : స్వర్ణ నిర్యాణం.

సహజ సిద్ధమైన ఒక హరిత వర్ణద్రవ్యం. రాసాయనికంగా దీన్ని కాపర్ సిలికేటుగా పరిగణిస్తారు. మైలతుత్తంలాగా ఇది కూడా ప్రాచీన నాగరికతలలో హరితవర్ణం కోసం వాడబడింది. తరవాతి కాలంలో కొన్ని స్థలములలో - అందునా ముఖ్యంగా క్రీటు దీవిలో - దీనికి బదులుగా ఈజిప్షన్ నీలిమ వాడుకలోకి వచ్చింది.

**chrysography** : స్వర్ణలేఖనం.

బంగారు, వెండి రంగుల సిరాలతో వ్రాసిన అక్షరాలు. గ్రీకులు, రోమనులు ధూమ్ర (*purple*) వర్ణంపైన, బంగారు, వెండి సిరాల అక్షరాలను వ్రాసేవారు 6, 7 శతాబ్దాలనాటి, హిబెర్నో-సాక్సన్ (ఐర్లాండుకు చెందిన సాక్సన్ జాతీయుల) పుస్తకాలలో కూడా ఇటువంటి లేఖనాలు చాలా ఉన్నాయి. 10వ శతాబ్దం వరకు ప్రచారంలో ఉన్న ఈ కళ తరవాతి కాలంలో క్షీణించినా, యూరోపీయ పునరుజ్జీవన యుగంలో దీనిని కొంత వరకు పునరుద్ధరించడం జరిగింది.

**cinnabar** : రససిందూరం, రక్తపారదం.

ఇది ఎర్రని వర్ణద్రవ్యం. సహజసిద్ధంగా లభించే పాదరసపు యౌగికం; రాసాయనికంగా దీని సంకేతం మెర్క్యూరిక్ సల్

ఫైడ్. సంయోజితరీతిలో సిందూరం రూపొంది, అది సహజ రససిందూరం కన్నా మేలైనదని రుజువు కావడంతో, రససిందూరపు వాడుక తగ్గింది.

**cinquecento :** *సింక్వెసెంటో; షోడశి*

'16వ శతాబ్దికి సంబంధించిన' అని చెప్పటానికి ఇటాలియన్ భాషారూపం. ఆ కళా ఇప్పు ఇటాలియన్ కళకు కూడా దీన్ని వాడుతారు.

**cinquefoil :** *పంచపత్రిక.*

(చూ: *foil*)

**cipher** · *లిపాక్షరి*

**cirage :** *పీత వర్ణకం*

(చూ : *camaieu*)

**circle cutter :** *వృత్తఛేదకం.*

(చూ : *compass cutter*)

**circle template :** *ప్రతివృత్తరేఖిక; వృత్తధారుకం*

**cire perdu :** *మధూచ్ఛిష్ట విధానం*

మధూచ్ఛిష్ట విధానానికి ఫ్రెంచి భాషాపదం.

**cissing :** *రంగు చీలిక, రంగు వెలితి.*

చిత్రంమీద వార్నిషు సరిగా వ్యాపించకపోవటం వల్ల ఏర్పడే మచ్చలు, గీతలు. దీనికే ఇంగ్లంలో క్రాల్ (*crawl*), క్రీప్ (*creep*) అను పేర్లున్నాయి

**citron yellow :** *దబ్బపండు పసిమి.*

వెలవెలబోయే పసిమి రంగుకు వాడుకలో ఉన్న పేరు; ఈ రంగు నిలకడమీద ఆకుపసిమిచాకగా మారిపోవటం . యథార్థమే అయినా, ఆకుపసిమి గాక పసుప్పచ్చగా లెక్కించటానికి వీలైనంతగా ఆ మార్పు ఉండదు. స్ట్రాన్షియమ్ పసిమిని, తుత్తునాగ పసిమిని ఈ ధాయకు ఉదాహరణలుగ పేర్కొనవచ్చు.

**clam :** *బట్టీ మూత.*

పింగాణి బట్టి గూడును మూయటానికి తెల్లమట్టి, బూడిద కలిసి మెత్తటం. విద్యుత్తుతోను, నూనెతోను పనిచేసే బట్టీలకు ఇది అవసరం లేదు.

**clarity :** *స్వచ్ఛత.*

**Classic acrycolor :** *క్లాసిక్ యాక్రికలర్.*

ఒక అమెరికన్ వ్యాపారసంస్థ, తాను తయారు చేసిన (నీటితో కలిపే) పాలిమర్ వర్ణాలకు పెట్టిన వ్యాపార నామం.

**classical :** *ప్రామాణిక.*

1. గ్రీకుల, రోమనుల కళకు సంబంధించిన,

2. అత్యుత్తమమూ, శుద్ధమూ అయిన కళాసృష్టి జరిగిన యుగంనాటి కళా సంప్రదాయ శైలులకు చెందిన.

**classical abstraction :** *ప్రామాణిక సారాంశత; ప్రామాణిక వివిక్తత.*

(చూ : *geometric abstraction*)

**classical period :** *ప్రామాణిక యుగం.*

ప్రాచీన గ్రీకుకళలో, అత్యుత్తమకళాసృష్టి జరిగిన యుగం. ఇది క్రీ పూ. 500 మొదలు క్రీ. పూ 323 వరకు వ్యాపించింది. ఇది ప్రాక్తన కళాకాలానికీ, హెలెనీయ కళా కాలానికి మధ్య అని చెప్పవచ్చు. ఈ కళలో మానవ విగ్రహాలు అతి భంగిమలో ఉంటాయి. దీనివల్ల అవి లయబద్ధములై, ప్రశాంతంగాకన్పిస్తాయి అనేక రూపాల సమూహాలను లయబద్ధములుగ ఉండేట్లు సృష్టించటానికి

ఇందువల్ల అవకాశం కలిగింది. ఈ మూర్తులు ఆదర్శరూపాలు కలిగి, సహజత్వానికి కొంత అతీతంగా కన్పించినా, ముఖాలలో మనోభావాలను తేటతెల్లంగా ప్రదర్శిస్తాయి. ఉబ్బెత్తు శిల్పాలు కథావస్తువులను చిత్రిస్తూ, రచనా వైశిష్ట్యంతోను, చక్కగా అమర్చిన రూపాలతోను అలరారాయి. వాస్తు కళలో ఈ యుగం సాధించిన ప్రగతికి పార్థెనాన్ దేవాలయం ఒక చక్కని ఉదాహరణం

**classicism** : *ప్రామాణికతా వాదం.*

గ్రీకుల రోమనుల కళకు సంబంధించిన ప్రామాణిక శైలుల అభివ్యక్తీకరణం. గ్రీకు, రోమను ప్రామాణిక కళాశైలుల ననుసరించిన పాశ్చాత్యకళా సంప్రదాయం.

19వ శతాబ్దపు పరిషదీయ వాదంపై కూడా ఈ ప్రామాణికతావాదపు ప్రభావం ఉంది.

**Claude Lorrain glass** : *క్లాడ్ లోరియన్ దర్పణం*

దృశ్యాలు చిన్నవిగాను, కాంతి తక్కువగా ఉన్నట్లుగానూ కన్పింపజేసే కుంభాకారపు అద్దం. క్లాడ్ లోరియన్ అనే కళాకారుడు (1600–1682) దీన్ని మొదట కనిపెట్టాడు. ఇది 19వ శతాబ్దిచరకు వాడుకలో ఉండినది.

**clay** : *బంక మట్టి*

ఇది, రాయి శిథిలం కావటంవల్లతయారవుతుంది. దీనిలో అల్యూమినియం సంబంధ ఖనిజాలు ఉంటాయి రంగులలో, రాసాయనిక చర్య లేని ద్రవ్యంగా ఇది ఉపయోగపడుతుంది. తేమగలిగిన ఈ మట్టిని, పింగాణి పాత్రలను చేయటానికి వాడతారు పింగాణీలో శిల్పాలను, పాత్రలను చేసేవారు. కాల్చటానికి అనువైన మట్టినే వాడతారు. కయోలిన్ కలిసిన మట్టి-ఇతర విధాల మట్టికన్నా-ఎక్కువ ఉష్ణోగ్రతవల్ల గట్టిపడుతుంది. శిల్పాలలో వాడే మట్టి తేమను ఎక్కువ కాలం నిలుపుకోగలిగి, మృదువుగా ఉండాలి.

**clay body** 1 : *పింగాణీ మూలం.*

పింగాణి పాత్రలు తయారు చేయటానికి పనికి వచ్చే మట్టి. ఈ మట్టిలో చాలా రకాలున్నాయి. మృదుత్వం, సునుపుదనం, రంగు, కుంగుదలం, వేడికి తట్టుకోవటం- అనే గుణాలలోని వైవిధ్యంవల్ల ఈ రకాలు ఏర్పడ్డాయి. పాత్రను తయారుచేయుటంలో అనుసరించే విధానాన్ని—మట్టిని ముద్దలుగా విసరడం, వేళ్లతో మలచటం, మూసలోయటం, బిళ్లరూపంలో చేసి వేరే రూపంపై ఒత్తటం అనే పద్ధతులను -బట్టి, ఒక్కొక్క పద్ధతికి ఒక్కొక్క విధమైన మట్టి అవశ్యకం. వివిధములైన కాల్పు పద్ధతులను బట్టి కూడా, పాత్రలకు ఉపయోగించే మట్టిరకం మారుతుంటుంది.

**clay body** 2 : *పింగాణి ముడిసరుకు.*

అలంకారాలూ, మెరుగులూ తీర్చి ఉంచటానికి ముందుగా కాల్చిఉంచిన పింగాణిసరకు.

**cleaner** : *శోధకం.*

**cleavage** : *పొరసందు.*

చిత్రంలో ఒక పట్టానికి, దానిపై ఉన్న ఇంకొక పట్టానికి మధ్య యేర్పడే ఖాళీ. రంగులలో కొన్ని జిగురు పదార్థాల శక్తి తగ్గటంవల్ల ఇది సంభవిస్తుంది. వాడిన పదార్థాలు సరిఅయినవి కాకపోవటంవల్లనూ, ఉపయోగించే పద్ధతి సరిఅయినది కాకపోవడంవల్లనూ కూడా ఈ పొరసందు

ఏర్పడుతుంది. ఈ లోపంవల్ల చిత్రంలో కొన్ని ముడుతలు, పొడిరాల్పు సంభ వించవచ్చు.

**client : అధ్యాయత్తుడు.**

**cloison : అంచు మతత.**

ఆభాసికా వర్ణాలు పూయటానికి అను వుగా లోహ పాత్రలపై నిర్మించే అంచు.

**cloisonne : సీమితాలంకృతి.**

ఆభాసికా వర్ణాలు వేయటానికి అనువుగా, పాత్రలపై అంచులు కట్టి అలంకరించటం. ఈ అంచు కట్టటానికి సన్నని తీగెను ఉపయో గిస్తారు. తీగతో గట్టిన గళ్ళమధ్య ఆభా సికా వర్ణాన్ని నింపుతారు. తరవాత బట్టిలో కాల్చి మెరుగు పెడతారు. పశ్చిమ యూరపు న మధ్యయుగంలోను, బైజాంటైన్ కాలం లోను, ఇది బాగా వర్ధిల్లింది. ఇది, సన్నగా ఉన్న గీతల మధ్య రంగులను నింపే నతా లంకృతికన్నా భిన్నమైనది.

**coach varnish : కోచి వార్నీషు.**

ఉత్తమ శ్రేణికి చెంది చక్కని మెరుపుగల వార్నీషు. గుర్రపు బగ్గీలకు కార్లకు దీనిని వాడ తారు. 1920లో లక్క పూతలు ( *laquet finishes* ) వచ్చినప్పటి నుంచి దీని ఉప యోగం అంతరించింది.

**coal-tar colours : బొగ్గుతారు రంగులు.**

ఇవి తారునుంచి తయారయ్యే వర్ణాలు. తారునుంచి బెంజీన్, టోల్వీన్, జైలీన్, నఫ్తాలీన్, యాంత్రసీన్- అనే అయిదు రసా యనిక పదార్థాలు తయారవుతాయి. ఈ అయి దింటి నుంచి, రాసాయనిక చర్యవల్ల ఇంకా ఎన్నో పదార్థాలు తయారవుతాయి. ఈ విధం గా తయారైన వివిధ పదార్థాలనుంచి భిన్న భిన్న మిశ్రమాల ద్వారా రంగులను తయారు చేస్తారు. వీటిలో కొన్ని సూర్యరశ్మి వల్ల వెలిసి పోయేవి ఉంటాయి; కొన్ని నూనెలలో కరగవు; అయినా చాల రంగులు కళాకారులు ఉపయోగించటానికి పనికివస్తాయి.

**coated paper : పూత కాగితం.**

సర్వీసు కానీ, దధిచూర్ణం కానీ కలిపిన బంకమట్టి పూసిన కాగితం. ఇటువంటి కాగి తాంలో కొన్ని మెరుగు గలిగినవిగాను, కొన్ని గరుకుగాను ఉంటాయి. మెరుగు గలిగిన కాగితాన్ని యనామెల్ కాగితం అంటారు.

**coating : పైపూత.**

**cobalt : అవర్తి; మధుధాతువు; కోబాల్ట్.**

**cobalt black : కోబాల్టు నలుపు.**

**cobalt blue : కోబాల్టు నీలిమ; మధు ధాతు నీలిమ.**

కాంతిమంతమూ, స్వచ్ఛమూ అయి రంగు మారని. నీల వర్ణద్రవ్యం. కోబాల్టు, అల్యూమినియం, భాస్వరాలను భాస్వరామ్లంతో కలిపి కొలిమిలో కాల్చినప్పుడు ఈ వర్ణ ద్రవ్యం తయారవుతుంది ఇది సాగర నీలా నికి దగ్గరగా ఉన్నా, దానికన్నా ఎక్కువ పచ్చ ఛాయతో ఉంటుంది. దీని 1802 న ఫ్రాన్స్ దేశంలో బే:న్ ఎల్. జె. తీనార్డ్ కనిపెట్టాడు. మొదట్లో దీనికి ఒలింపియా నీలం, వియెన్నా నీలం, వియెన్నా సాగర నీలం అనే పేర్లు ఉండేవి. కోబాల్టు నీలిమ లోనే లేతఛాయ గలదాన్ని అజూరీ కోబాల్టు అని అంటారు.

**cobalt green : మధుధాతు హరితం; కోబాల్ట్ హరితం.**

కోబాల్టను జింక్ ఆక్సైడులతో కలిపి

పదగాల్చటంవల్ల కొలిమిలో చివరకు మిగిలేది ఈ వర్ణద్రవ్యం. అందువల్లనే దీనికి రాసాయనికంగా కోబాల్ట్ జింకేట్ అనే పేరుంది. మొదట్లో స్వీడెన్‌లో 1780 లో ఇది తయారైంది 1885 మొదలుగా కళాకారుల వాడుకలోకి వచ్చింది.

**cobalt ultramarine :** *మధుధాతు అతిసాగరిక; కోబాల్టు అతిసాగరిక*

అతిసాగరిక నీలిమలోని ఒక ఛాయాంతరంగా గణించటానికి పైవైన కోబాల్టు నీలిమను అనుకరించే రంగుకు, దాని నిర్మాతలు కల్పించిన పేరు.

**cobalt violet :** *మధుధాతు కోణనీలిమ; కోబాల్ట్ కోణనీలిమ.*

స్వచ్ఛమై, అర్ధ కాంత్యభేద్యత కలిగిన ఒక చిరస్థాయి వర్ణద్రవ్యం కోబాల్ట్ ఫాస్ఫేట్, కోబాల్ట్ ఆర్సెనైట్ - అనే రెండు విధాల రసాయనిక రూపాలు ఇందులో ఉన్నాయి; తత్ఫలితంగా ఈ వర్ణద్రవ్యం రెండు రంగులలో - నీలివాక కోణనీలిమ, ఎరుపువాక కోణనీలిమలలో - లభిస్తున్నది 1860 లో మొదటిసారిగా వాడుకలోకి వచ్చిన ఈ వర్ణద్రవ్యం తదాదిగా 1950 వరకు ఏకైక కాంతివంత కోణనీలిమగ, చిత్రకారుల మన్నన పొందగలిగింది. అయితే అచ్చపు కోబాల్టు కోణనీలిమలో, విషద్రవ్యమైన ఆర్సెనైటు ఏ కొంచెమైనా ఉండే అవకాశం ఉన్నందువల్ల, ఆ తరవాత దాని వాడుక తగ్గి దాని స్థానంలో మాంగనీజ్ కోణనీలిమ చాలవరకు ప్రవేశించింది.

**cobalt yellow :** *మధుధాతు పీతం; కోబాల్ట్ పసిమి.*

ఒక చిరస్థాయి వర్ణద్రవ్యం. దీని రాసాయనిక సంకేతం కోబాల్ట్ పొటాసియమ్ నైట్రేట్. ఉజ్జ్వలమైన బంగారు పసిమి పారదర్శకతను ఇందులో చూడవచ్చు. ద్యుతిక పూలకూ ఛాయపనికీ ఇటువంటి పారదర్శకత బాగా ఉపయోగిస్తుంది. 1848 లో దాన్ని మొదటిసారి కనుక్కోవడం జరిగింది; 1852 లో అది వర్ణద్రవ్యంగా వాడుకలోకి వచ్చింది. కోబాల్ట్ పసిమికే 'ఆరియోలిన్' అనే ఇంకొక పేరుంది.

**cochineal :** *తితిభం; కోకనీలం*

(చూ : *scarlet lake*)

ఒక క్రిమివల్ల లభించే సహజసిద్ధమైన రంగు పదార్థం. మెక్సికోలో ఇది దొరకుతుంది. అక్కడ నుంచి మొదట 1560 లో ఇది యూరపును చేరింది. అప్పటినుంచీ ఒక వ్యాపార వస్తువుగా ఇది అతిప్రసిద్ధిని పొందింది. కాని 19వ శతాబ్దిలో, సంయోజితరీతిలో, రంగు పదార్థాల తయారీ సాధ్యమై తరవాత, దీని వాడుక చాలవరకు తగ్గిపోయింది. అయినా, చిరస్థాయిత కన్నా తక్కువ ఖరీదునే చూసుకొనే చిత్రకారులు కొందరు ఈ నాటికీ దీన్ని వాడుతూనే ఉన్నారు.

**coleanaglyphic sculpture :** *సుషిరోన్నత శిల్పం.*

**cogging :** *అనుసరణిక.*

(చూ : *caulking*)

**coil method :** *రజ్జు పద్ధతి.*

మట్టి త్రాళ్లను ఒకదానిపై వేరొకదానిని

అనుర్చి తద్వారా మృత్పాత్రను రూపొందించు పద్ధతి. పురాచారిత్రక యుగమున మృత్పాత్రల నిర్మాణము ఈ తీరుగనే సాగినది మృత్పాత్రల నిర్మాణమున కృషిచేయ దలచు వానికి తొలి పాఠముగ ఇట్టి కృషి ఉపకరించును; క్లిష్టపరికరాల సాయంలేకుండానే కుంభకార విద్యతో దీని వలన తొలిపరిచయాన్ని సాధించవచ్చు.

**cold chisel :** *చలిమిరి ఉలి; గట్టి ఉలి.*

గట్టి ఉక్కుతో చేసిన పొడుగైన ఉలి. లోహాన్ని వేడిచేయకుండానే దీనిని ఉపయోగించి, సమ్మెటతోకొట్టి చెక్కవచ్చు,నరకవచ్చు. దీన్ని రాతిచెక్కుడు పనిలో కూడా వాడతారు.

**cold cut :** *శీతల ముద్ర.*

(చూ *varnish*)

**cold pressed oil :** *ముడి నూనె.*

వేడి చేయకుండా, గింజల నుంచి పిండిన నూనె. 1980వరకు అన్ని ప్రశస్తమైన రంగులలోను ఇటువంటి నూనెలే కలిపేవారు. ఇప్పుడు, రంగులకు వాడే నూనెలను, ఆవిరి ఒత్తిడివల్ల తయారు చేస్తున్నారు.

**cold-pressed paper :** *శీతలపత్రం.*

(చూ *water-colour paper*)

**cold rubber :** *చల్లని రబ్బరు.*

**collage :** *సమాకలన ప్రక్రియ; కొల్లాజ్.*

ఒక ఫలకంపైనగాని, వాటికపైనగాని కొంచెం ఉబ్బెత్తుగా ఉండేట్లు కాగితాలు, గుడ్డలు, ఇతర వస్తువులు అతికించి చేసే చిత్ర రచన. చిత్రాలను పూర్తిగా ఇటువంటి వస్తువులతోనే తయారు చేయవచ్చు; లేదా రంగుల చిత్రాన్ని తయారు చేస్తూ అక్కడక్కడ వీటిని అతికవచ్చు. ఈ విధంగా వేర్వేరు పదార్థాలతో మూడు ఆయతనాలలో శిల్పాన్ని తయారుచేసే ప్రక్రియను సమాహార ప్రక్రియ*(Assemblage)* అంటారు సమాకలన (కొల్లాజ్) చిత్రాలు 19వ శతాబ్దిలోని ఖచ్చి పత్ర ప్రక్రియ *(papiers colles)* నుంచి రూపుగొన్నవని చెప్పవచ్చు. ఈ పద్ధతిలో లతాదుల రూపాలకై రంగు కాగితాలను కత్తిరించి అతికించేవారు. 1912-13లో దీన్ని పికాసో, బ్రాక్ చిత్రకళలో ఉపయోగించారు. వార్తా పత్రికల ముక్కలను, టిక్కెట్లను, కాగితపు మడతలను, కర్ర, గాజు ముక్కలను, తీగెలను, ఇసుకను కూడా వీరు ఉపయోగించారు. నూతన పథములలో చిత్రరచన చేయటానికి వీలవటంవల్ల వీరు ఈ పద్ధతులు అవలంబించారు దాదావాదులు దీన్ని చేపట్టిన తరవాతనే 'కొల్లాజ్' అనే పేరు దీనికి వచ్చింది. మేక్స్ ఎర్నస్ట్, హాన్స్ ఆర్ప్ రచించిన పటిగాగా చిత్రాలు(1919)ఈ కోవలోని ప్రసిద్ధమైన తొలి రచనలు. కుర్ట్ ష్విట్టర్స్ ఇటువంటి రచనలకు సుప్రసిద్ధుడు.

దీనిలో సరిగాని జిగురులు, మన్నికలేని వస్తువులు వాడకూడదు. ప్రస్తుతం పాలిమర్ జిగురులనే వీటిలో ఎక్కువగా వాడుతున్నారు

(చూ *collagraph, frottage, montage*).

**collagraph, intaglio print :** *రేఖోల్బణ ముద్రణ.*

సమాహరణ ప్రక్రియలో లాగానే ఉబ్బెత్తుగా తయారుచేసిన దిమ్మెనుంచి తీసే

ముద్రణ. ఉబ్బెత్తు ముద్రణలోలాగానే ఉబ్బెత్తుగా రాయటానికి అనేక వస్తువులను ఫలకాలపై అతికించవచ్చు. సిరాలు సరిగా అంటని వస్తువులైతే వాటిపై ప్లాస్టిక్‌పూత వేస్తారు. ఇటువంటి దిమ్మెలపై ముద్రణసిరాలను వేసి, తుడిచివేస్తే, పల్లంగా ఉన్న చోట్లలో, మాత్రం సిరా నిలిచిపోతుంది. తరవాత సూచీ చిత్రణ (ఎచ్చింగు)లో ముద్రణ జరిపే విధంగానే, ఒత్తిడి ఆధారంగా ముద్రిస్తారు. దీనిలో చాలా పద్ధతులు ఉపయోగించి చిత్ర విచిత్రంగా ప్రతులు తీయవచ్చు. సూచీలేఖన ఫలకాలను, ఫోటోపద్ధతిలో తయారైన స్క్రీన్ బ్లాకులనుకూడా, ఫలకంపై అతికించవచ్చు. ఇటువంటి దిమ్మెలు ఎక్కువ ఉబ్బెత్తుగా లేనిపక్షంలో చక్కటి ప్రతులు లభిస్తాయి. ముద్రించే కాగితాన్ని తడిపి, దిమ్మెపై జరపవలసిన ఆమొత్తాన్ని సూచీచిత్రణ యంత్రంలో నడపాలి.

**collapsible tube** : *సంకోచ్య నాళిక; ఒత్తుడుగొట్టం.*

**cologne earth** : *కొలోన్ మృత్తిక.*

కాసెల్ మృత్తికకు పర్యాయనామం.

**colophony** : *కొలోఫోని.*

యక్షధూపాలకు పర్యాయనామంగా ఫ్రాన్స్, జర్మనీలలో ఈనామకూడా వాడుకలో ఉన్నపేరు. ఇది గ్రీకుభాషాపదమనీ, ఆ భాషలో ఈ పదానికి 'ధ్వని నిర్మాణం' అనే అర్థం ఉందనీ. ఫిడేల్‌వాద్యాల కమానులకు వాడే యక్షధూపాలకు ఈ పేరు మొదట వర్తించిందనీ కొందరంటారు. కాని గ్రీసులో అంతర్భాగమైన అయోనియలోని కోలోఫన్ ప్రాంతంలో లభించేది కాబట్టే దీనికి ఈపేరు వచ్చిందని భావించటం సబబుగా ఉంటుంది.

**colorimetre** : *వర్ణమాపకం.*

వర్ణాల గుణాలను పరీక్షించటానికి ఉపయోగించే ప్రయోగశాలా పరికరం. ఈ పరికరంలో ఒక దీపం, మూడు వర్ణశోధనులు, కాంతి విద్యుత్ ఘటాలు లేదా కాంతి నాళికలు, మానవనేత్రేంద్రియంలాగా పనిచేసే వైద్యుతిక వివర్తములూ ఉంటాయి.

**colorimetry** : *వర్ణమాపన.*

వర్ణం కొలవటానికి ఉపయోగించే శాస్త్రం.

**colossal** : *బృహదాకారం.*

సహజప్రమాణానికి రెట్టింపుకంటే పెద్దదిగా ఉండే శిల్పమూర్తి.

(చూ : *Heroic*)

**colour** : *వర్ణము; రంగు; వన్నె.*

1. కాంతి తరంగాలలోని ప్రసరణ సంబంధమైన వైవిధ్యం వల్ల, నేత్రేంద్రియంలో కలిగే ఉత్తేజన ఫలితంగా, చూపరుల మనస్సుల్లో కలిగే సంవేదన ఈ కాంతితరంగాలు పట్టకం (*prism*) నుంచి ప్రసారితమైనప్పుడు, విశ్లేషించెంది ఇంద్రధనుస్సులోని వర్ణాలే ఇక్కడా రూపొందుతాయి. ఒక ఉపరితలంపై కాంతితరంగం పడ్డప్పుడు, ఆ ఉపరితలపు స్వభావాన్నిబట్టి, ఆ కాంతితరంగపు ప్రతిఫలన రీతి మారుతుంది. ఆ ఉపరితలంపై ఉన్న రంగు, కాంతికిరణాలలోని అదే రంగును బయటికి వదలి మిగిలిన వర్ణాన్ని స్వీకరిస్తుంది ఉదాహరణకు, ఎరుపు రంగు గల వస్తువు, ఎరుపురంగు కిరణాలను మాత్రమే ప్రసరింపజేసి, మిగిలిన వాటిని స్వీకరిస్తుంది. నలుపు రంగు, అన్ని వర్ణాల కాంతిని పీల్చుకొని

ఏ రంగును కూడా పరావర్తింపజేయదు. తెలుపురంగు, ఏ కిరణాన్నీ శోషించుకోక, అన్నింటిని విసర్జిస్తుంది. అన్ని వర్ణద్రవ్యాలు, వర్ణాలు, తమ వర్ణాన్నేగాక తెలుపును కూడా ప్రసరింపజేస్తాయి.

వర్ణద్రవ్యాలను, రంగులను ఒకదానితో ఇంకొక దానిని కలిపి, వేరు వర్ణాన్ని తయారు చేయటాన్ని తీసివేత పద్ధతి (*subtractive-system*) అంటారు. దీనికి కారణం, ఒక వర్ణంలో ఇంకొక వర్ణాన్ని కలిపినప్పుడు, రెండింటిలోను ఒక వర్ణభాగం నశిస్తుంది. సిద్ధాంతరీత్యా వర్ణమాల (*spectrum*) లోని ఏ రంగునైనా ప్రాథమిక వర్ణా (*primaries*) లయిన ఎరుపు, పసుపు, నీలాల కలయిక వల్ల సృజించ వచ్చు. కాని నిజానికి, కాంతిగల అనేక వర్ణాలు వేరువేరు వర్ణద్రవ్యాల ద్వారానే లభిస్తాయి. ద్వితీయ శ్రేణి వర్ణాలు, రెండు ప్రాథమిక వర్ణాల మిశ్రమంవల్ల ఏర్పడతాయి. ఉదాహరణకు ఆకుపచ్చ= నీలం+ పసుపు; రాజనీలం= నీలం+ఎరుపు; నారింజ= ఎరుపు+ పసుపు.

తృతీయశ్రేణి వర్ణాలు మూడు ప్రాథమిక వర్ణాల మిశ్రమం వల్ల ఏర్పడతాయి. ప్రతి వర్ణానికిన్నీ ఒక పరిపూరక వర్ణం ఉంటుంది. ఇటువంటి పరిపూరక వర్ణం, వర్ణచక్రంలో దానికి సంబంధించిన వర్ణానికి ఎదురుగా ఉంటుంది. అవి ఎరుపు-పచ్చ; నీలం-నారింజ; పసుపు-రాజనీలం. ఒక వర్ణం, తన పరిపూరక వర్ణం శోషించుకోలేని కాంతికిరణాలను శోషించుకోగలదు. ఒక ఎర్రని పదార్థం, ఆకుపచ్చ పదార్థం ప్రసరింపజేసే కాంతి కిరణాలను శోషించుకోగలదు. పరిపూరక వర్ణాలను ఒక దానిపక్కన వేరొకదాన్ని ఉంచినప్పుడు వాటి తేజస్సు ఇనుమడిస్తుంది.

వర్ణాలవలె, వర్ణద్రవ్యాలవలెగా కుంత రంగుదీపాలు, ఒక రంగుకో ఇంకొక రంగును కలుపుకొని, కలిపివేత పద్ధతిన, పనిచేస్తాయి. రంగు దీపాల వర్ణ ప్రసరణలో ప్రాథమిక వర్ణాలు: ఎరుపు, ఆకుపచ్చ, నీలం. ఈ మూడురంగుల కాంతికిరణాలను ఒకే చోటులో ప్రసరింపజేసినపుడు తెల్లటి కాంతి వస్తుంది ఇది చిత్రకారులకన్నా, ఛాయా చిత్రకారులకు చాలా ముఖ్యం.

2. కళాకారులు ఉపయోగించుకోవటానికి తయారుచేసిన రంగు. ఇదిసాధారణంగా నాళికలలోను, పింగాణీ సీసాలలోను, అచ్చుల రూపంలోనూ లభిస్తుంది. ఇటువంటివి బహుధా నా భేదాలలో లభిస్తాయి. కళాకారులు ఉపయోగించే రంగులలో ముఖ్యమైనవి: పారదర్శకమైన నీటి రంగులు, కాంతి అభేద్యమైన నీటి రంగులు, తైల వర్ణాలు, గహన వర్ణాలు; దధిచూర్ణ వర్ణాలు; పాలిమర్ వర్ణాలు, ఆలంకారిక వర్ణాలు, పోస్టరు రంగులు.

**colourant** : *వర్ణకరి.*

**colour characteristic** : *వర్ణ విలక్షణత.*

**colour chart** : *వర్ణ పట్టిక.*

వర్ణ సిద్ధాంతాన్ని వివరించటానికి, వర్ణాల పేర్లను లక్ష్యాలతో తెలియజేయటానికి, వివిధ వర్ణాల నమూనాలను ప్రక్క ప్రక్కన అమర్చి ఉంచిన పట్టిక.

**colour circle** ; వర్ణ వృత్తం.

వర్ణమాలలోని వివిధ వర్ణచ్ఛాయలను, ప్రకృతిలో వేద్యమయ్యే రీతిలోనే, అమర్చిన చక్రం ఇందులో ఆకుపచ్చ, ఎరుపు పసుపు రంగులున్న అర్ధవృత్తంలో ఉష్ణవర్ణాలు ఉంటాయి రాజనీలం ఉన్న అర్ధ వృత్తంలో శీతల వర్ణాలు, ఉంటాయి ఆకు పసిమి, పరిపూరక వర్ణాలు, ఒకదానికి ఇంకొకటి ఎదురుగా ఉంటాయి (చూ: చిత్రం)




వర్ణవృత్తం

**colour comparison** : వర్ణ తోలన

రంగుల వైవిధ్యాన్ని పోల్చి పరిశీలించటం ఇందుకు మూడు విధానాలు అమలులో ఉన్నాయి 1. కంటితో చూసి అనుభవంతో పోల్చడం 2 వర్ణచ్ఛాయా మాపకాన్ని (*spectro Photo metre*) ఉపయోగించటం. 3. వర్ణ మాపకాన్ని (*colorimetre*) ను ఉపయోగించడం.

అనుభవజ్ఞుడు రంగులను చూడగానే, దాదాపు నిశితంగా వాటిలోని భేదాలను పోల్చగలడు. కాని స్పష్టమైన సాంకేతిక పరీక్ష, పరిశోధన శాలలోనే జరగాలి. ప్రస్తుతం వైద్యుతిక (*Electronic*) పరికరాలను దీనికోసం వాడుతున్నారు

**coloured cement** ; రంగు సిమెంటు.

తెల్లని పోర్ట్‌లాండు సిమెంటులో, నీటితో చెరిగిపోని వర్ణద్రవ్యాలను కలిపి తయారుచేసే పదార్థం దీనిని ఆరుబయట ఉండే భిత్తి చిత్రాలలో వాడవచ్చు ఈ రంగులు చాల మన్నిక కలవి

**coloured chalk** ; గైరికం; కావిరాయి.

**colour effect** ; వర్ణ ఘటన; వర్ణానువృత్తం.

ఒక వర్ణంలోని మౌలిక ధర్మాలూ (స్పష్టత, కాంతి భేదకత, సూక్ష్మత) వర్ణ తత్త్వమూ చేసే ద్రష్టకు కలిగించే సమష్టి భావం సాధారణంగా ఒక చిత్రంలో, ఒక ప్రత్యేక వర్ణాన్ని వాడటంలో గల ఔచిత్యాన్ని ఈ పదం సూచిస్తుంది.

**colour extender** ; వర్ణ విస్తారకం.

**colour filter** : వర్ణశోధని.

**colour maker** ; వర్ణకారి.

**coloured pencil** ; రంగు పెన్సిల్.

గ్రాఫైట్‌తో గాక, వర్ణద్రవ్యాలతో తయారు చేసిన పెన్సిలు. జిగురుమట్టికి సంబంధించిన బంధకంతో, వర్ణద్రవ్యాన్ని కలిపి గ్రాఫైటు పెన్సిల్ లాగానే దీన్ని తయారు చేస్తారు. దీనిలో చాలా రకాలు లభిస్తాయి. కాని ఇవి కళాకారులు వాడదగినంత ఉత్తమమైనవి కావు నీటిలో కరిగే రంగులతో తయారు చేసిన

పెన్సిళ్లు కూడ లభిస్తాయి. ఈ పెన్సిళ్ళతో ముందుగా కాగితంపై చిత్రాన్ని గీసి, తర వాత కుంచెతో నీటిని పైనపూసి తడిపితే, అది నీటి వర్ణపు చిత్రాన్ని పోలిఉంటుంది. కాని ఈ పెన్సిళ్ళు అంతగా ఉపయోగమైనవి కావు.

**coloured print** : *వర్ణిత ముద్రణ.*

ఒకే దారుకంతో వివిధ వర్ణాలను ముద్రించే ప్రక్రియ. ఈ ప్రక్రియలో, దారుకంలో ఏ ప్రాంతంలో ఏ రంగు ఉండవలెనో నిర్ణయించి, అక్కడ రంగును చేతితోగాని, రోలరుతోగాని నింపాలి. వేరువేరు రంగులకు వేరువేరు దారుకాలను ఉపయోగించే రంగు అదకాల ప్రక్రియకు ఇది విభిన్నం. బహువర్ణిత ముద్రణలకు శిలాలేఖనము (లిథోగ్రఫీ), చెక్కముద్రలు (*wood cuts*) ఉత్తమమైనవి. వట్టుతెర పద్ధతిని రంగు అద్దకాల ప్రక్రియలో మాత్రమే వాడతారు. వర్ణోత్కీర్ణ (*Intaglio*)ను, ఏక వర్ణచిత్రాలకే సర్వసాధారణంగా వాడతారు.

(చూ : *colour prints*)

**coloured sculpture** : *వర్ణయుత శిల్పం.*

(చూ : *polychrome*)

**colouring power or staining power** : *వర్ణ శక్తి*

ఒక వర్ణద్రవ్యంలో ఉండే రంజకశక్తి.

**colourist** : *వర్ణవేత్త; రంగారి.*

వర్ణాలను చాకచక్యంతో అమర్చగల కళాకారుడు; చిత్రరచనలో వర్ణాల అమరికకు ప్రాధాన్యమిచ్చే కళాకారుడు.

**colour lithography** : *వర్ణ శిలాలేఖనం.*

రాతిపలకలనుంచి బహువర్ణ చిత్రాలను ముద్రించటం ఒక్కొక్క ప్రాతిపదిక వర్ణానికి ఒక్కొక్క పలకను వాడతారు. ఈ రంగుల పలకలను ఒక తొలిపలక (*key-stone*) ఆధారంగా తయారుచేస్తారు. తొలుతగా చిత్రాన్ని నలుపు తెలుపులలో పూర్తిగా తొలిపలకపైన చిత్రిస్తారు. తరవాత రంగులను విభజించి, ఆ విభజన ఆధారంగా వేరువేరు రంగుపలకలను తయారు చేస్తారు ఇట్లా చేయటానికి పారదర్శకమైన కాగితాన్ని తొలి పలకపై పెట్టి, ఆ యా రంగులు వేయవలసిన ఒక్కొక్క ప్రదేశాన్ని విడివిడిగా చిత్రిస్తారు. ఆ కాగితపు వెనుక భాగాన ఎర్రటి సుద్దపొడిని పులిమి రంగుపలకల పై వేరువేరుగా గీస్తారు. ఒక్కొక్క రంగు పలకపైనా శిలాఖనిక (*Litho–crayon*) తో, ఆకారాన్ని దిద్దితే, అది, అచ్చుసిరాపూసి ముద్రించటానికి తగిఉంటుంది. రంగులు తమ తమ స్థానాలను మీరకుండా ఉంచటానికి పలకాల చివర ప్లస్ (+) గుర్తులు పెడతారు. ముద్రించే అన్ని వర్ణాలు, ఒకదానిపై ఇంకొకటి ఆ ప్లస్ గుర్తుపై పడేటట్లుగా జాగ్రత్త వహిస్తే, వర్ణాలు తమతమ స్థానాలలో సరిగా అమరుతాయి. ఈ విధమైన మొదటి చిత్రాన్ని ఎడ్వార్డ్ మానె 1874 లో రచించాడు. దానిలో అతడు ఏడు రంగులను ఉపయోగించాడు. తూలోసో లాత్రే ఈ ప్రక్రియకో సుప్రసిద్ధుడు. ఈనాటికిన్ని ఇది బహుళ ప్రచారంలో ఉన్న కళ.

**colour notation** : *వర్ణవర్గీకరణ.*

సంఖ్యల ద్వారా వర్ణాలను వర్గీకరించి

గుర్తించే పద్ధతి. ఇది సాంకేతిక, విజ్ఞాన శాస్త్రాలలో చాల ఉపయుక్తం. నిత్యోపయోగంలో సైతం, వర్ణాలలోని ఛాయాభేదాలను గుర్తించటం చాలా ఉపయోగకరం. ఈ వర్ణ వర్గీకరణలో రెండు ముఖ్యమైన పద్ధతులున్నాయి.

1. మన్సెల్ పద్ధతి; 2 ఓస్ట్వాల్డ్ పద్ధతి. ఇవిగాక కొన్ని ఇతర పద్ధతులు కూడా ఉన్నాయి: 1. ప్లోచర్ వర్ణపద్ధతి. 2. అట్లాస్ డి లో కలర్ అనే గ్రంథంలో అనుసరించబడిన పద్ధతి (1947). 3. మీర్జ్-పాల్ వర్ణ నిఘంటువులోని పద్ధతి (1951).

**colour oxides :** ***వర్ణభస్మములు.***

పింగాణీ పనిలో వాడే వర్ణ మిశ్రమాలు; వీటిని లోహ భస్మాలతో తయారు చేస్తారు. (చూ: *ceramic colours*).

**colour prints ;** ***రంగు అద్దకాలు; వర్ణ ముద్రాంకాలు.***

(చూ : *coloured print*)

ముద్రణలో ఒక్కొక్క రంగుకు ఒక్కొక్క ఫలకం చొప్పున ముద్రించే చిత్రాలు. వీటి ముద్రణకు శిలా ఫలకాలు (*litho-stones*), లోహ ఫలకాలు (*metal plates*), పట్టుతెర (*silk-screen*) ఉపయోగిస్తారు. చిత్రంలో రావలసిన రంగులను అన్నిటినీ, ప్రాతిపదిక వర్ణాలుగా విభజించి, వీటిని తయారు చేస్తారు. ఈ ప్రాతిపదిక వర్ణాలు ఒక దానిపై ఇంకొకటి పడటం వల్ల ఇతర వర్ణాలు వస్తాయి. ఇటువంటి ముద్రణను ఫలకం నుంచి కూడా చేయవచ్చు. ఒకే ఫలకంతో వివిధ వర్ణాలను ముద్రించ వలెనంటే, ఫలకంలో ఏ రంగు ఉండాలో నిర్ణయించి, అక్కడ రంగును చేతితో గాని, రోలరుతో గాని నింపాలి. దీనినే వర్ణిత ముద్రణ (*coloured print* అంటారు.

**colour properties :** ***వర్ణ ధర్మాలు.***

వర్ణద్రవ్యంలోని రంగు విలక్షణతను విలువ కట్టటం లేదా అది వర్ణించటానికి ఈ పదం వర్తిస్తుంది. వర్ణ ద్రవ్య లక్షణాలు—అంటే భౌతిక, రసాయనిక, నిర్మాణ లక్షణాలు. తెలియజేయటానికి దీనికి సామ్యంలేదు.

**colour relationship :** ***వర్ణ సమన్వయం.***

**colour run :** ***రంగువేత.***

**colour scheme :** ***అంగివర్ణ రీతి.***

చిత్రాలలోగాని, నిర్మాణంలో గాని వాడిన కొన్ని వర్ణాలకు మాత్రమే ప్రాముఖ్యమిచ్చి సాధించిన వర్ణ సమ్మేళనం. ఇది ఒక క్రమ పద్ధతిలో జరగాలి. ఉదాహరణకు సూర్యాస్తమయాన్ని చిత్రించే దృశ్యాలలో ఎరుపు, పసుపు ప్రముఖంగా సమ్మేళనమై కనపడతాయి. రాత్రిని చిత్రించే సందర్భంలో ధూసర నీలవర్ణాలు ప్రముఖ పాత్ర వహిస్తాయి.

**colour sketch:** ***రంగుస్కెచ్చి, వర్ణలేఖ్యం.***

సుద్దరంగులతో, నీటిరంగులతో చిత్రించిన లేఖ్యం (స్కెచ్చి) తరచుగా ఇటువంటిది సంపూర్ణ చిత్రాన్ని రచించటానికి ప్రాథమిక దశగా పనికి వస్తుంది. ప్రకృతి దృశ్యాలను చిత్రించేటప్పుడు సూర్యరశ్మి చలనాన్ని బట్టి దృశ్యరూపం మారుతుంటుంది అటువంటి దృశ్యాలను చిత్రించటానికి ప్రతిరోజూ ఒకే సమయంలో పనిచేయాల్సి ఉంటుంది. అప్పుడు వ్యవధి స్వల్పంగా ఉంటుంది. అందువల్ల

అటువంటి వ్యవస్థలో రేఖాన్ని మాత్రమే తయారు చేయటానికి వీలవుతుంది. కొందరు చిత్రకారులు పెన్సిల్ రేఖాన్ని గీసి, దృశ్య వివరాలు అక్కడ మాటలతో వ్రాసి, మొదట చూసిన దృశ్యపు మనశ్చిత్రాన్ని ఆధారం చేసుకొని చిత్రిస్తారు.

**colour solid** : *వర్ణ ఘన రాశి.*

(చూ *Ostwald system*)

**colour stability** : *వర్ణ స్థిరత.*

చిత్రించిన పర్ణంలో ఏవిధమైన మార్పు రాకుండా ఉండే లక్షణం.

**colour stencil printing** : *వర్ణ స్టెన్సిల్ ముద్రణ.*

**colour theory**: *వర్ణ సిద్ధాంతం.*

**colour triangle** : *వర్ణ త్రిభుజం*

చూ *chromaticity*

**colour wheel** : *వర్ణ చక్రం.*

ఒక ఆధారంపై అమర్చి, వేగంగా తిప్పటానికి వీలుపడే చక్రం. దీనిపై వివిధ వర్ణాలను అవసరాన్ని బట్టి అమర్చి, వేగంగా తిప్పటం వల్ల, మనకు కావలసిన వర్ణాల సమ్మేళనాన్ని ఊహించటానికి వీలవుతుంది. సప్త వర్ణాలను వేసిన చక్రాన్ని వేగంగా తిప్పితే తెల్లగా కన్పిస్తుంది.

**colour value** : *రంగు విలువ.*

**column (printed page)** : *పుటాంశం; కాలం.*

**column** : *స్తంభం.*

**comb** : *కంకతం; దువ్వెన.*

**combed decoration** : *కంకతాలంకృతి.*

మెత్తటి మన్నుతో శిల్పాన్ని మలిచేటప్పుడు ఉపయోగించే అలంకరణ పద్ధతి. దువ్వెన పండ్లలాగా ఉండే సాధనంతో మెత్తటి మట్టిపై గీసి ఈ అలంకరణ సాధించవచ్చు

**commercial art** : *వాణిజ్య కళ.*

**commercial artist** : *వాణిజ్యకళాకారుడు.*

వాణిజ్యప్రకటనలకై చిత్రాలను, పరిశ్రమలలో తయారయ్యే వస్తువులపై అలంకృతులను రచించే కళాకారుడు. అటువంటి కళాకారుడికి కృషి అవసరాలను తయారు చేయించుకొనే గాలి ఆమోదానికి లోబడి ఉంటుంది. అన్నపు లలిత కళలలో కృషి చేసే కళాకారుడు తన ఇష్టం వచ్చినట్లు చిత్రించటానికి స్వేచ్ఛ కలిగి ఉంటారు వాణిజ్య కళారంగంలో స్వేచ్ఛ లేదు. ప్రస్తుతం ఈ రెండు కళల మధ్య భేదం సన్నగిల్లింది.

**commission** : *నియామకం.*

**Commission Internationale de l'Eclairage**

*ఉద్దీపన సంబంధి అంతర్జాతీయ సంఘం.*

ఇది 1931లో స్థాపితమైంది. కాంతి చ్ఛాయామాపన విజ్ఞానం ద్వారా వర్ణ సంపీడనను గురించి గణితశాస్త్రరీత్యా వర్ణాన్ని నిర్దేశించే పద్ధతిని ఈ సంఘం వాడుకలోకి తెచ్చింది. ఆపద్ధతినే ఇప్పటికీ కళాకారులు అనుసరిస్తున్నారు.

**compass** ; *వృత్త లేఖిని*

వృత్తాలను, వృత్తఖండాలను గీయడానికి ఉపయోగించే సాధనం. సాధారణమైన వృత్తలేఖినికి రెండు కాళ్లుంటాయి. అందులో ఒక కాలి చివర మొనదేలి ఉంటుంది. రెండవ దాని

చివర పెన్సిల్, కలం వంటి సాధనాన్ని బిగించే వీలుంటుంది. వృత్తలేఖినులలో చాలా రకాలున్నాయి. కాగితాలను గుండ్రంగా కత్తిరించటానికి పనికివచ్చే వృత్తలేఖినులుకూడా ఉన్నాయి.

**compass cutter** : *వృత్తచ్ఛేదిని.*

కాగితాలను, కాగితపు అట్టలను గుండ్రంగా కత్తిరించటానికి ఉపయోగపడే సాధనం వృత్తలేఖినిలో, పెన్సిలును అమర్చే సాధనం లో పదునైన పనిముట్టును అమర్చి దీన్ని తయారు చేస్తారు.

**complementary colour** : *పరిపూరక వర్ణం.*

విపర్యయములైన వర్ణాల జంటలో ఒక వర్ణం. ఉదాహరణ: ఎరుపు-పచ్చ;-పసుపు రాజనీలం; నీలం-నారింజవర్ణం ఒక ప్రాథమిక వర్ణంయొక్క పరిపూరక వర్ణం, మిగిలిన రెండు ప్రాథమిక వర్ణాల కలయిక వల్ల ఏర్పడుతుంది. ఉదా: నీలం, పసుపు కలపటంవల్ల పచ్చరంగు వస్తుంది. ఇది ఎరుపుకు పరిపూరక వర్ణం. ద్వితీయ శ్రేణికి చెందిన పరిపూరక వర్ణాలుకూడా ఇదే విధంగా తయారవుతాయి.

**complete palette** : *పూర్ణ వర్ణఫలకం.*

**composite order** : *సమ్మిశ్రిత పద్ధతి.*

**composite pigment** : *సమ్మిశ్రిత వర్ణద్రవ్యం.*

ఒకటి కంటే ఎక్కువ ప్రాతిపదిక ద్రవ్యాలు కలిసిన వర్ణద్రవ్యం. కాడ్మియం-బేరియం పసుపురంగు ఇటువంటిదే.

**composite white** : *సమ్మిశ్రిత శ్వేత వర్ణం.*

40% టిటానియా తెలుపు, 60% తుత్తునాగపు తెలుపుల సమ్మిశ్రిత వర్ణం. ఈరెండు తెలుపులలో ఏ ఒకదాన్ని వాడడంకంటే, వాటి సమ్మిశ్రిత శ్వేతవర్ణాన్ని వాడటం శ్రేష్ఠం. దీనికే ఈ దిగువ తెలిపిన ప్రసిద్ధ వ్యాపార నామాలున్నాయి: పెర్మాల్బా సుపెర్బావైట్, మిక్స్‌డ్‌వైట్, పర్మనెంట్ వైట్, అల్బావైటు

**composition** : *సంరచన; సంవిధానం.*

'కాంపోజిషన్' అనే పాశ్చాత్య భాషా పదం యూరపులో ప్రాచీన కాలంలో సాహిత్యంలోనే వాడుకలో ఉండేది. వాగర్థాల రమణీయ సంయోజనానికే వారు 'కాంపోజిషన్' అనే పేరు వాడారు. 17 వ శతాబ్దపు ఆరంభపు ప్రాంతాలలో ఈ పదం కళాసిద్ధాంత చర్చలోకి కూడా వచ్చి చేరింది. అప్పటిలో చిత్రలేఖనంలో ముఖ్యాంగాలుగా ఆయిదింటిని-యోజన (*invention*), తాళమానం (*proportion*), వర్ణం (*colour*), చేతన (*motion*), అమరిక (*disposition*) అనే వాటిని-విమర్శకులు గుర్తించారు. ఈ అమరికయే కాలక్రమాన సంరచన (*composition*)గా మార్పు పొందింది.

ప్రాచీన గ్రీకుల కాలం నుంచి కూడా ఇటువంటి అమరికను గురించిన కొన్ని సిద్ధాంతాలు, కళాప్రపంచంలో, వ్యాప్తిలో ఉన్నాయి తాళమానమూ సమరసత (*harmony*), వివిధాంగాల మధ్యనేగాక, వాటికి మొత్తం చిత్రంతో ఉండే సంబంధంలో ద్యోతకం కావాలి, ఆ ప్రాచీనుల అభి

ప్రాయం. కళలో సమరసతకుగల స్థానాన్ని, పాశ్చాత్యులకు సంబంధించినంతవరకు, చక్కగా తన గ్రంథంలో వివరించినవాడు రోజెర్ డిపైల్స్ (1708). ఆధునిక కాలంలో 'సంరచన'కు గల ప్రాముఖ్యాన్ని తాను రచించిన 'థియరీ ఆఫ్ బ్యూటీ' అనే గ్రంథంలో హెచ్. ఆస్‌బార్న్ చక్కగా వివరించాడు.

**composition board** : *సంరచన ఫలకం.*

**composition leaf** : *సంరచిన పత్రం.*

చూ : *Dutch metal*

**concave relief** : *నత శిల్పం.*

పైపైవు ఉబ్బెత్తుగా ఉండక, లోపలికి గుంటగా చొచ్చుకొనిపోయిన శిల్పరీతి.

(చూ :*relief*)

**concentrated** : *సముపచితం.*

**concentrated preservative** : *సముపచిత గోపకం.*

**concentration** : *సముపచయనం.*

**concept** : *భావన.*

**nceptual colour** : *సంభావిత వర్ణం.*

యథార్థంగా ఒక వస్తువులో కన్పించే వర్ణాన్ని, ఆ వస్తు చిత్రంలో చిత్రించక, దానికి బదులుగా ఊహతో చిత్రించిన ఇంకొక వర్ణం. ఏదైనా సిద్ధాంతరీత్యాగాని, గుప్తార్థాన్ని సూచించటానికిగాని ఇటువంటి వర్ణాన్ని వాడవచ్చు.

**concours** : *వరిష్ఠ ప్రదర్శనం.*

లలితకళాశాలా విద్యార్థుల చిత్రాలలో ఉత్తమమైనవాటిని ఎన్నుకొని, ఏర్పాటుచేసే ప్రదర్శనం. ఇది విద్యా సంవత్సరాంతంలోగాని, పరీక్షార్థమై రచించిన చిత్రాలతోగాని ఏర్పాటు చేయవచ్చు.

**concrete painting** : *అవివి చిత్రణ.*

ఆధునిక చిత్రణలో వాడుకలో ఉన్న ఒక పారిభాషిక పదం. ఏ మూర్తికీ ఏరీతిగానూ సంబంధించి ఉండకుండా, చిత్రరచనా ప్రాథమికాంగములైన దీర్ఘ చతురస్రం, చతురస్రం వంటి వాటిని గ్రహించి, సాగించే సంరచనలకు చెందిన శైలులకు సామాన్య నామంగా ఈ పదం వాడుకలో ఉంది.

**cone of vision** : *వీక్షణ శంకువు; దృక్ శంకువు.*

చిత్రాన్ని చూస్తున్న ప్రేక్షకుడి దృష్టిక్షేత్రం, కన్ను కేంద్రంగా ఊహించే అనేక దృగ్రేఖలు కలది. కంటినుంచి దూరం ఎక్కువైనకొద్దీ, ఆరేఖలమధ్య దూరంకూడా ఎక్కువవుతుంది. నిజానికి కాంతి రేఖలు చిత్రంనుంచి బయలుదేరి, రానురాను వాటి మధ్యదూరం తగ్గగా, అవి కంటిలో కేంద్రీకృతములవుతాయి.

**configuration** : *రూపరేఖా విశేషం.*

**confluent colour** : *సంగమ వర్ణం; కలయిక రంగు*

ఒకదానిప్రక్కగా ఇంకొకవర్ణం వేసినప్పుడు, ఆ రెండూ కలిసేచోట ఏర్పడే వర్ణం.

**connoisseur, connoisseurship** : *సహృదయుడు (రసికుడు); సహృదయత (రసికత).*

పాశ్చాత్య దేశాలలో ఈ పదాల వాడుక

పునరుజ్జీవన కాలంలో ఇటలీలో మొదలై, కాలక్రమాన 17వ శతాబ్దిలో ఫ్రాన్సుకు, అక్కడ నుంచి 18వ శతాబ్దిలో ఇంగ్లండు మొదలైన చోట్లకు వ్యాపించింది. 'కన్నాయిసూర్' అనే పాశ్చాత్య పదానికి మూలమైన లాటిన్ పదానికి, 'అభిజ్ఞత' అని అర్థం నాగరిక పౌరుడికి కళాభిజ్ఞత ఒక ముఖ్యలక్షణమనీ, అది కలవాడు 'సహృదయుడు' అనీ కొందరు రచయితలుకూడా 18వ శతాబ్దంలో వ్రాసారు. నేడు దీనికి విపులార్థం లభించింది. కేవలం కొత్వాహకుడిలాగాగాక, ఒక కళాఖండంలోని సౌందర్యస్ఫోరకత యొక్క లోతుపాతులను చక్కగా గుర్తించ గలిగే విచక్షణశక్తిని పెంపొందించుకొన్నవాడే సహృదయుడనిపించుకోగలడనే అభిప్రాయం నేడు రూఢతను పొందింది.

కళాభిజ్ఞత అనేది ప్రాచీన కాలంనుంచీ కూడా, ఏదో ఒక తీరున, కనపడుతున్నది. కాని దీని ప్రమాణాలు మాత్రం క్రమక్రమంగా ఆయా నాగరితల లక్షణాలను అనుసరించి మారుతూవచ్చాయి.

**conservation** : ***పరిరక్షణ; సంధారణ.***

కళాఖండాలను భద్రంగా రక్షించే కార్యకలాపం. ఈపనిని నిర్వహించే వ్యక్తిని పరిరక్షకుడు (*conservator*) అంటారు. ఇది వరలో ఈ కార్యకలాపాన్ని పునరుద్ధరణ (*restoration*) అనీ వ్యవహరించేవారు. ఇప్పుడు ఆ పదాన్ని ఒక కళాఖండంలో పాడైన భాగాన్ని బాగుచేయటానికి మాత్రమే వాడుతున్నారు. ఈ కాలంలో పరిరక్షణ కోసం చాలా సాంకేతిక వైజ్ఞానిక పద్ధతులు కనిపెట్టటం జరిగింది.

**conservator** : ***పరిరక్షకుడు; సంధారకుడు.***

**consistency** : ***ధృతి.***

**constant white** : ***స్థిర శ్వేతం.***

గహన వర్ణాలలో వాడే 'బ్లాక్‌ఫిక్స్' అనే తెలుపు వర్ణద్రవ్యం.

**construction** : ***నిర్మాణం.***

శిల్పంలో కొన్నిభాగాలను చేర్చి ఒకటిగా అతకటం. సమాహరణం (*Assemblage*). కూడా ఒక విధమైన నిర్మాణమే.

**construction paper** : ***అతుకుడు కాగితం; నిర్మాణపత్రం.***

వివిధ రూపాలలో కత్తిరించి వాడటానికి అనువుగాఉండి, చౌకగా లభించే కాగితం. ఇది పలురాయలలో లభిస్తుంది. ఎక్కువ మన్నిక కలది కాదు.

**constructivism** : ***నిర్మాణ కళావాదం.***

రష్యాలో ప్రారంభమైన వస్తురహిత (*Non objectve*) కళ. ఆధునిక కళపై దీని ప్రభావం అత్యధికంగా పడింది. వ్లాడిమిర్ టాట్లిన్ (1886–1958 1918 ప్రాంతంలో రచించిన ఒక చిత్రం ఈ వాదానికి నాంది పలికింది. ఇది స్థూలతావాదానికి దగ్గరగా ఉంది, టాట్లిన్‌వాదం అని మొదట్లో వ్యవహృతమైంది. 1921 వరకు ఈ వాదపు సిద్ధాంతాలు ధ్రువపడలేదు. నిత్యజీవితంలో ఉపయోగపడే లోహాలు, గాజువంటి పదార్థాలను, ఈ వాదావలంబకులు ఈ కళలో వాడారు. దీనికి కొంతకాలం ఉత్పాదన కళ (*production art*) అనే పేరుకూడ ఉండేది. కళాకా

రుశైన ఇంజనీర్లను తయారుచేసి, వస్త్రక్రమం లోని నమూనాలలో విప్లవాత్మకమైన మార్పులను తీసికొనిరావటం దీని ధ్యేయం. కళపెల్లి ప్రస్తుత సమాజానికి ప్రయోజనం లేదని టాట్లిన్ భావించినా, ఆ వాదావలంబకులలో ఇతరులు యాంటోయిని పెవ్స్నర్ (*Antoine pevsner*), నాహమ్ గేబో ( *Naum Gabo*) -కళకు ఇంకా సమాజంలో స్థానంఉందని నమ్మారు పారమ్యవాదం (*suprematism*) తో ఈ నిర్మాణ కళావాదానికి సంబంధం గాఢమైంది. ఈ రెండు వాదాలలోను సమాన విశ్వాసంగల కళాకారులు చాలమంది ఉండేవారు. 1917లో జరిగిన రష్యా విప్లవం తరవాత, 1922 వరకు విప్లవ ప్రభుత్వం వీళ్ళను ప్రోత్సహించి, ప్రజలలో కళా ప్రచారం చేయటానికి అవకాశం కల్పించి, అనేక కళా పాఠశాలలను స్థాపించింది. 1922లో రష్యా ప్రభుత్వం ఈ ఉద్యమాన్ని నిషేధించటంవల్ల ఈ కళాకారులలో చాలమంది ఫ్రాన్స్ దేశానికి తరలి పోయారు.

**contained shadow** : *నిహితచ్ఛాయ.*

చిత్రంలో ఒక రూపంపై ఉండే నీడ ఆ రూపంపైనే నిలిచి ఉన్నట్లుగా చూపేకీలి. (చూ: *cast shadow*)

**container** : *సంచయని; సంపుటి; ద్రోణి, గిన్నె.*

**Conte crayons** : *కాంటీ ఖటికలు.*

సుప్రసిద్ధమైన ఫ్రెంచిదేశపు సుద్దరంగులకు పర్యాయనామం. ఇవి నాలుగు పలకలుగా ఉండే కణికల రూపంలోనూ, పెన్సిళ్లగానూ లభిస్తాయి. ఇందులో వర్ణద్రవ్యాలు, బంధకమూ చిత్రరచనకు ఎంతో అనువైనవి. వీటిలో జిడ్డు పదార్థాలు ఉండవు. అందువల్ల శిలాచిత్రణలో ఇవి చాలా ఉపయోగకరం. వీటిని పాస్టెల్ పద్ధతిలో కూడా వాడవచ్చు. ఇవి ఇటుక యెరుపురంగు, సెపియా, తెలుపు లలోను, నలుపులలోనూ, మూడుఛాయలలోనూ లభిస్తాయి. గ్రాఫైట్ పెన్సిల్‌ను సృష్టించిన నికొలస్ జాక్విస్ కాంటీ పేరిట ఈ ఖటికలకు ఈ పేరు వచ్చింది.

**content** : *సాహిత్యం; అంతస్సారం; వస్తువు.*

ఒక శిల్పంలోని, లేదా చిత్రంలోని రూపలావణ్యం, కళాకారుని చాతుర్యాలుగాక మేధకు, రసవివేచనకు, ఆధ్యాత్మిక భావనకు, వర్ణనారీతికి సంబంధించిన విలువల సమష్టి స్వరూపం. రూపం, సాహిత్యం అనే రెండింటి ఆధారంతో ఒక కళాఖండం రూపొందుతుందని చెప్పవచ్చు.

**contour** : *పరిధిరేఖ.*

ఒక వస్తువు లేదా రూపం ఆకృతిని తెలిపే స్థూలరేఖ. ఈ రేఖకు లోపలే రూపం అంతా ఇమిడి ఉంటుంది.

**contour drawing** : *పరిధి లేఖనం.*

'రేఖాచిత్రణకు సహజమార్గం' అనే అర్థమిచ్చే పేరుగల తన గ్రంథంలో కిమోన్ నికోలైడ్స్, ప్రచారానికి తెచ్చిన ఆలేఖ్యపద్ధతి. ఈ పద్ధతి విద్యార్థులకు చాల ఉపకరిస్తుంది. అభ్యాసకుడు కాగితంమీద పెన్సిలును ఆనించి, చిత్రించవలసిన వస్తువుపై దృష్టిని కేంద్రీక

రించి, కాగితపు వైపుకు చూడకుండా, పెన్సిల్ మొనను పైకెత్తకుండా, నిదానంగా



పరిధి రేఖనం

రూపపు బాహ్యస్వరూపాన్ని స్థూలంగా ఇందులో రేఖారూపంలో గీస్తాడు. ఇందులో చిత్రితమయ్యే వస్తువుయొక్క బాహ్యపరిధిని మాత్రమే చిత్రకారుడు పరిశీలిస్తాడు. బాహ్య రేఖను గీసినప్పుడు రెండు ఆయతనములు మాత్రమే ప్రదర్శితమవుతాయనీ, పరిధిలేఖనంలో మూడాయతనాలు ప్రదర్శితాలవుతాయనీ నికోలైడ్స్ భావించాడు.

**contrapposto** : *అతిభంగ భంగిమ.*

ఒకే కాలిమీద భారమంతా మోపినట్లుగా ఉండే మానవ శిల్ప భంగిమలు. శిల్పము యొక్క మొండెము S ఆకారంలో ఇందులో వంగి ఉంటుంది. పాశ్చాత్య శిల్పాలలో తొలిసారిగా ప్రామాణిక యుగంలో గ్రీసులో ఇది కానవచ్చింది పునరుజ్జీవన కాలంలో మళ్ళీ ప్రచారానికి వచ్చింది. ఇటువంటిది భారతీయ శిల్పాలలో ప్రాచీనకాలంనుంచికూడా కనబడుతూనే ఉంది.

**contraction** : *సంకోచనం.*

**Contrary** : *విరుద్ధ; వ్యతిరేక.*

**converge** : *సముపగమించు.*

**conversation piece** : *సంవాద చిత్రం.*

1. ఒక కుటుంబానికి చెందిన వాళ్ళంతా, ఒకేచోట ఉండి, ఏదో ప్రసంగిస్తున్నట్లు చిత్రించిన చిత్రం.

2. వైవిధ్యం కలిగి, ద్రష్టలో చర్చను రేకెత్తించగల చిత్రం.

**convex** : *ఉత్తల; కుంభాకార.*

**convolute** : *సంవలయిత.*

**cool colours** : *శీతల వర్ణాలు.*

నీలపు ఛాయ కలిగిన వర్ణాలు. ఈ తరగతిలో ఆకుపచ్చ, రాజనీలాలు కూడ చేరతాయి. నీలపు ఛాయగల ధూసర వర్ణాలను శీతల ధూసరములు [*cool grays*] అంటారు. శీతల వర్ణాలు అన్నీకూడా వర్ణవృత్తంలో ఆకుపచ్చ-రాజనీలాలకు చెందిన అర్ధవృత్తంలో అమరిఉంటాయి.

**cool grays** : *శీతల ధూసరములు.*

**coordinate** : *ప్రతిఫలనం.*

మన్‌సెల్ తన వర్ణప్రస్తర పద్ధతిలో ఆయా రంగుల విషయమై, దృగింద్రియమున వేద్యములయ్యే ప్రతిఫలనమును మూడు రీతులుగా విభజించాడు.

[చూ : *Munsell*]

**copaiba balsam** : *కొపైబా బాల్సం.*

జిగటగా, ద్రవరూపంలో లభ్యమయ్యే ఒక తైల యుక్తధూపం. పశ్చిమార్ధగోళపు ఉష్ణమండలాలలో పెరిగే కొపైబా వృక్షాల నుంచి ఇది లభిస్తుంది. ఈ తైల యుక్త ధూపంలో రెండు రకాలు- 1. మారకైబో బాల్సమ్, 2. పరాబాల్సమ్ అనేవి ఉన్నాయి. ఇందులో మొదటిది వెనిజ్యూలా దేశంలో లభిస్తుంది. రెండవ దానిలో అత్యంత బావ్ప

శిలక ద్రవ్యాలూ, అత్యల్పంగా ఘన ద్రవ్యాలూ చేరి ఉంటాయి; ఇవి బ్రెజిల్ దేశంలో లభిస్తుంది. కొపైబా బాల్సం, మెల్లగా ఆరే స్వభావం కలది; ద్రఢిమ చాల తక్కువ. అందువల్ల పూతరంగుల వాహకాలలోగానీ, మాధ్యమాలలోగాని దీన్ని ఇప్పుడు చేర్చటంలేదు. తైల చిత్రణలు శుద్రపరచటానికీ, పాత చిత్రణలకు తిరిగి నవ్యత కల్గించటానికీ, దీన్ని వాడటం ఉంది.

**copal** : కోపలం.

వృక్షసంబంధములయిన యశ్మఘాపాలకు– అవి భూగర్భ గతములే అయినా, లేదా సన్నిహిత కాలానికి చెందినవి అయినా– అన్నిటికీ సమిష్టిగా వ్యవహృతమయ్యే పదం. భూగర్భంలో లభించే నిర్యాసాలు, ఎక్కువ ఉష్ణోగ్రతవల్ల మాత్రమే కరుగుతాయి. అటువంటి వాటిని నూనెలలో కలిపి ఉడికించినప్పుడు మన్నికగల వార్నీషు తయారవుతుంది. 19 వ శతాబ్దిలో చిత్రకారులు దీని వార్నీషులను వర్ణబంధకముఌగా, పై పూత మెరుగులుగాను వాడేవారు. ప్రస్తుతం సంయోజితోత్పన్నులు వీటి స్థానాన్ని ఆక్రమించాయి.

**copper blue** : తామ్రనీలం.

బ్రెమెన్ నీలిమయొక్క పర్యాయనామాలలో ఇది ఒకటి.

**co-precipitate** : సహప్రక్షేపించు.

**Coptic art** : కాప్ట్ కళ.

ఈజిప్టులో వర్ధిల్లిన ప్రాచీన క్రైస్తవ కళ. ముఖ్యంగా క్రి. శ. 4 వ శతాబ్దినుంచి 7 వ శతాబ్ది వరకు ఈ కళ ప్రవర్తిల్లింది. ఆ కాలంలో కొంతవరకు రోమన్ సామ్రాజ్యం లోనూ, తరవాత బైజాంటియన్ సామ్రాజ్యం లోనూ అంతర్గతమై ఈజిప్టు ఉండేది. కాప్ట్ కళకు మూలం క్రైస్తవ శకారంభపు ఈజిప్టు కళే అయినా, బైజాంటైన్ కళాప్రభావం తరవాత దాన్ని మార్చివేసింది. అందువల్లనే బైజాంటైన్‌యికళ వలెనే ఇదికూడా మంద్రగతిలో, శైలీకృతరీతిలో నడచింది. కోప్టులు చిత్రాంకితాలను సైతం కొన్నింటిని రచించారు. అందులో ఉద్భిజ్జ, పక్షి రూపాలు, అలంకార రీతిలో పొందుపరచేందుకు ఉన్నిని, నారపట్టును వాడటం జరిగింది. ఇవేకాక రాతిలోను, ఏనుగు దంతాలలోను మంచిన శిల్పాలుకూడా ఉన్నాయి.

**copy** : నకలు; ప్రతికృతి.

1. ఒక కళాఖండాన్ని అనుసరించి తయారు చేసిన ప్రతికృతి. ఇది మౌలిక కళాఖండపు శైలిలోనే ఉండాలి. కాని అదే పరిమాణంలోను, అవే వర్ణద్రవ్యాలతోను చిత్రించవలసిన పనిలేదు. మౌలిక కళాఖండంకన్న ప్రతికృతి చిన్నదిగా ఉండవచ్చు. మౌలికఖండంతైలవర్ణంలో ఉన్నా ప్రతికృతి నీటివర్ణంలో ఉండవచ్చు. లేదా దీనికి విపర్యయంగా కూడ ఉండవచ్చు.

2. ఒక మూలచిత్రపు ముద్రిత ప్రతి.

3. ముద్రణకు ముందు తయారుచేసిన వ్రాతప్రతి, లేదా టైపు ప్రతి; దీనిలో కావలసినచోట చిత్రాలను, ఛాయాచిత్రాలను చేర్చి ఉండవచ్చు.

4. అనేక చిత్రాలకు నమూనాగా ఉపయోగపడే మూలచిత్రానికి కూడా అప్పుడప్పుడు వాడబడే పదం.

**copying press** : *కాపీ ప్రెస్సు; నకళ్ళ యంత్రం; ప్రతికృతి యంత్రం.*

ఒక ప్రత్యేకపు సిరాతో వ్రాసిన పత్రం నుంచి నకళ్ళను తయారుచేసే యంత్రం. దీన్ని ఇనుముతో పోతపోస్తారు. బరువుగా ఉంటుంది. పూర్వం టైపురైటరులు వాడుకలో లేనప్పుడు, ఆఫీసులలో దీన్ని వాడేవాళ్ళు. లేఖలను, వ్యవహార పత్రాలను దీనిలో ఉంచి, యంత్రాన్ని ఒత్తితే నకళ్ళు తయారయ్యేవి. ప్రస్తుతం కళాకారులు-కాగితాలను ముడుతలు లెకుండా అట్టలమీద అతికించటానికీ, ముడతలు పడ్డ కాగితాన్ని చదును చేయటానికీ- ఈ యంత్రాన్ని వాడుతున్నారు. గ్రాఫిక కళలలో చిత్తుప్రతులు (*poorfs*) తీయటానికి దీన్ని వాడవచ్చు. ఈ యంత్రం చాలా పరిమాణాలలో తయారవుతున్నది. అన్నింటికన్న పెద్దది 20''×24'' పరిమాణంలో ఉంటుంది. ఈ యంత్రానికి బరువైన రెండు లోహపు పలకలుంటాయి. క్రింది పలక స్థిరంగా ఉండగా, పైపలక మాత్రం మరచట్టుగల కడ్డీ ద్వారా పైకీ, కిందికీ త్రిప్పటానికి వీలుగా ఉంటుంది. కడ్డీని తిప్పటం ద్వారా పై పలక, క్రింది పలకకు దగ్గరగా వచ్చి ఒత్తిడి కలిగిస్తుంది.

**coquille board** : *కొకిల్లీ అస్తరిక; కొకిల్లీ అట్ట.*

కథా చిత్రాలు రచించటానికి ఉపయోగించే అట్ట. దీనిపై ఉబ్బెత్తుగా చుక్కలుగాని, నిలువు గీతలుగాని ఉంటాయి. దీనిపై పెన్సిల్ లేదా సుద్ద కణికలతో గీసినప్పుడు, అర్ధకాంతి స్థాయి (*half tone*) ఉమ్మెపై ఉండే చుక్కల జవనిక (*screen*) లాగా కన్పిస్తుంది.

**coral** : *ప్రవాళం; పగడం.*

**corbel** : *కోదెకట్టు.*

**cordate** : *హృదయాకార.*

**core** : *కెంతు; అంతర్భాగం.*

బోలు (సుషిర) విగ్రహాలు పోతపోయటంలో మూసలోపల అమర్చే గట్టిభాగం. ఇది గాక మూసలో ఇంకొక భాగం పైన ఉంటుంది. పై భాగంలో అచ్చు తీయాల్సిన రూపం ఉంటుంది ఈ రెండు భాగాలమధ్య ఉండే దూరాన్నిబట్టి, విగ్రహం మందం ఉంటుంది.

**Corinthian order** : *కొరింథియన్ పద్ధతి.*

**cork black** : *బెలుగ నలుపు.*

బెలుగ కొయ్యను తగలబెట్టి తయారుచేసే ఒక రకపు ద్రాక్షమసి అయిన స్పానిష నలుపుకు ఇంకొక పేరు.

**cornice** : *కపిశీర్షం; కపోతం; మసూరకం.*

**coroplast** : *పుత్తళికారుడు; నకాషీ.*

ప్రాచీన గ్రీసు దేశంలో, మట్టితో చిన్న చిన్న శిల్పాలను తయారుచేసేవారు. అటువంటి పనిని చేసే వ్యక్తిని 'కోరోప్లాస్ట్' అని గ్రీకులు వ్యవహరించేవారు.

**corporation piece** : *సంఘ సంబంధి చిత్రం.*

ఒక సంఘపు, లేదా ఆ సంఘంలోని సభ్యుడి మూర్తి చిత్రం (*portrait*). ఇటు

వంటి ఏసంఘమైనా కోరినప్పుడు మాత్రమే కళాకారుడు వానిని తయారు చేస్తాడు; అతడు తనంతట తానుగా దానిని తయారుచేయడు.

**correction** : *విశోధనం.*

**correction white** : *దిద్దుబడి తెలుపు; అవమర్శకశ్వేతం.*

త్వరితంగా ఆరిపోయే లక్షణంగల, కాంతి భేద్యమైన తెలుపురంగు. దీనిపూత నల్లని గీతలను కూడా మరుగు పరచగలదు. అయినా ఇది మన్నికగల రంగు కాదు.

**Cosmati** : *చిత్ర శిల్పం.*

రోమ్‌నగరంలో క్రీ.శ.12వ శ. మొదలుగా 14వ శ.వరకు ప్రవర్తిల్లిన ఒక విధపు శిల్పకృషి; చర్చిలు, ప్రాసాదములు వంటి ఉదాత్త భవనాలకు గాజు, చలువరాతి పలకలను తగినరంగులలో అమర్చి శోభనుచేకూర్చటం దీనివల్ల ఆ కాలంలో సాధ్యమైంది. ఈ కృషిలో మొదట పాల్గొన్న రెండు కుటుంబాల పేర్లు-కాస్మాస్, కాస్మాటస్ అనేవి-ఈ శిల్పకృషికి 'కాస్మటి' అన్న పేరు రావడానికి కారణమైనవి. తన రచనపై రచయిత సంతకం చేసేపద్ధతిని వీళ్ళే మొదటిసారి ప్రవేశ పెట్టారు. 18వ శతాబ్దికి రోములో సాగిన అలంకారిక శిల్పకృషికి ముఖ్యంగా గాజును లేదా రంగు రాళ్లను పొదిగిన చలువరాతి చిత్రాస్తర కృషికి-ఈ పేరు సాధారణంగా వాడుతున్నారు.

**corrosion** : *క్షారణం.*

వాతావరణం వల్ల లోహం క్రమంగా క్షీణించటం; తుప్పుపట్టటం; ఇనుముపై పట్టే త్రుప్పు, రాగి, కంచు మొదలైన వాటిపై వచ్చే పచ్చని చిలుము ఇటువంటివే.

**cosmogram** : *జగద్వర్ణన యంత్రం.*

విశ్వనిర్మాణానికి సంకేతమైన యంత్రం.

**cotton gauze** : *కార్పాస వికశిక.*

**counter part** : *అనురూపిక.*

**cover** : *ఛాదనం; పైకప్పు*

**covering power** : *ప్రచ్ఛాదన శక్తి.*

ఒక నిర్దిష్టాయతనం కలిగిన పూతరంగు గాని, వార్నిషుగాని ఒక పూతలో బాగా కప్పివేయగలిగే పరిమాణ వైశాల్యం. పారిశ్రామిక పు రంగుపూతలో ఈ శక్తిని ఒక గేలనుకు ఇన్ని చదరపు అడుగులు అని లెక్కించటం జరుగుతున్నది. ఈ ప్రసరణశక్తినే ఆచ్ఛాదకశక్తి (*Hiding power*)గా పొరపడటం కూడా ఉంది.

**crack** : *నెరియ; పగులు.*

చిత్రంలోని రంగు పొరంలోగాని, ఉపాధిలోగాని ఏర్పడే చీలిక. ఇటువంటి చీలిక చిత్రపు ఉపరితలంలో లంబంగా తీరి ఉంటుంది. పొరసంధ (*cleavage*) అనేది దీనికన్న భిన్నం.

**cracking** : *నెరియబోక; స్ఫుటనం.*

**crackle** : *అల్లిక పగులు.*

1. కాలక్రమాన తైలవర్ణ చిత్రాలలో ఏర్పడే చిన్న చదరాల వంటి పగుళ్లు; రంగులు పెళుసు కావటంవల్ల ఇవి ఏర్పడతాయి.

2. పింగాణీ పాత్రలలో మెరుగుపై వచ్చే సన్నని చదరాల వంటి పగుళ్లు పింగాణీ పాత్రలపై ఉద్దేశపూర్వకంగానే ఇటువంటి వాటిని వచ్చేట్లు చేస్తారు.

**crader** : ***డోలని.***

(చూ : *rocker*)

**cradle** : ***డోలిక.***

కాటికను చట్రంపై బిగించినపుడు, చట్రం వంకరలు తిరగకుండా దృఢంగా ఉండటానికి వెనుకభాగంలో అమర్చే కొయ్యపట్టీ.

**craft** : ***కౌశలం***

1. కళారచనలో చూపే సాంకేతిక పరిజ్ఞానం, నేర్పు. ఇది, ఆ రచనలో ప్రదర్శితమయ్యే సౌందర్యభావనకన్నా భిన్నమైనది.

2. లలిత కళలకంటే ఇది భిన్నం ఇందు చేతిపనితనమూ, సౌందర్య భావనా మేళనం చెందుతాయి. చేతిలో అందమైన వస్తువులు తయారు చేయటం ఈ కోవకు చెందినదే

**craquelure** : 'crackle' ***అనే ఇంగ్లీషు పదానికి ఫ్రెంచి పర్యాయ పదం.***

(చూ : *crackle*)

**crawl-cissing, creep** : ***రంగుచీలిక; రంగువెల్తి.***

**crawling fissure** : ***పారాడే నెరియ.***

**crayon** : ***ఖటిక; కటిక.***

కటికలాగా తయారుచేసిన రంగు. ఇది సుద్దతో కలిసి ఉంటుంది. ఈ పదాన్నే బొగ్గు కటికలకు, చమురు కటికలకు, రాతి కటికలకు కూడా ఉపయోగిస్తారు. కటిక గుండ్రంగా గాని, నాలుగుపలకలుగాగాని ఉంటుంది. వీటిలో కొన్నిటికి కాగితాలు చుడతారు ఇంకా కొన్నిటిని చెక్కలలో బిగిస్తారు.

**crayon manner** : ***ఖటికా రీతి.***

సూచీ చిత్రణ (ఎచ్చింగు), రేఖా శిల్పము (ఎన్‌గ్రేవింగ్)లలో అవలంబించే ఒక సాంకేతిక రీతి. లోహ ఫలకంపై చిత్రాన్ని గీయటంలో, ఖటికతో చిత్రించినట్లుగా చుక్కలు చుక్కలుగా వచ్చేట్లు చేయటానికి ఒక విధమైన గంటాన్ని వాడతారు ఆ గంటానికి ఒక ముల్లుగాక చాల ముళ్లుంటాయి. గీరలు వచ్చేట్లు చేయటానికి ఇంకా కొన్ని పరికరాలు వాడుకలో ఉన్నాయి ఇటువంటి ఫలకాలపై అచ్చుసిరాలను ఉపయోగించి ముద్రించవచ్చు. ఖటికా చిత్రాలలాగా ముద్రించే పద్ధతి 18 వ శతాబ్దిలో బహుళ ప్రచారంలో ఉండేది. ఎర్రని సుద్దను కూడా సిరాగా వాడి ముద్రించవచ్చు.

**crayon sauce** : ***సుద్ద బిళ్ళ***

బిళ్ళ ఆకారంలో తయారుచేసిన సుద్ద రంగు. ప్రస్తుతం ఇది వాడుకలో లేదు.

**crazing** : ***జాలీగా దోషం; ఇత్థరత.***

పింగాణీ పాత్రపై మెరుగులో వచ్చే సన్నని చతురస్రాకారపు పగుళ్ళు ఇవి వాంఛనీయాలు కావు. కాల్చిన తరవాత చల్లార్చడంలో పైభాగం లోపలి భాగం సమానంగా కుంచించుకొక పోవటంవల్ల ఈ పగులు సంభవిస్తుంది.

**cream colour** : ***మీగడరంగు***

**creative** : ***సర్జనాత్మక; సర్జనశీల.***

**creep – crawl, cissing** : *రంగు చీలిక; రంగు వెలితి.*

**Cremnitz white** : *క్రెమింజ్ శ్వేతం.*

తెల్ల సీసంలో చాల ఉత్తమ తరగతికి చెందిన ద్రవ్యవిశేషం. తుషార శ్వేతాన్ని తయారుచేసే పద్ధతి గాకుండా ఇంకో పద్ధతిలో దీన్ని మొదట 19 వ శతాబ్దిలో తయారు చేయటం జరిగింది. ఛాయాంతరాలను తెలియ జేయటానికి క్రెమింజ్ శ్వేతాన్ని, దాని ప్రక్కన తుషార శ్వేతాన్ని కళాకారులు వాడుతారు.

**creeping fissure** : *దోగాడే నెరియ.*

**crenellation** : *కొమ్మంచురీతి: శృంగాలంకరణం.*

కొనలు దేరిన కోటకొమ్ములలాగా ఉండే అలంకరణరీతి; ఈ తీరు అలంకరణను, మట్టి పాత్రల పైనా, వస్త్రాల అంచులపైనా పురాతనకాలం నుంచీ వాడుతున్నారు.

**creta laevis** : *క్రేటా లేవిస్.*

అనేక రంగులలో లభించే సుద్దరంగుల పెన్సిళ్లకు బ్రిటిష్ వ్యాపార నామం. 19వ శతాబ్ది అంతంలోను, 20వ శతాబ్ది ఆరంభం లోను ఈ రంగులు వాడుకలో ఉండినవి.

**creve'** : *ఛిద్రదోషం, కోత.*

సూచీ చిత్రణలో, లోహ ఫలకాన్ని ఆమ్లంతో క్షీణింపజేయటంలో కలిగే దోషం. ఇది ఫలకంపై జరిగే అతిదంశనం(*over biting*) వల్ల కలుగుతుంది. ఇటువంటి దోషం వల్ల రెండు రేఖలు కలిసిపోవచ్చు లేదా రేఖలు కావలసిన దానికన్నా ఎక్కువ లోతుకు కోసుకొని పోవచ్చు. ఇటువంటి దోషాలను తొలగించటానికి, ఆ ప్రదేశాన్ని గోకివేసి తిరిగి రసాయన చర్య వల్ల రేఖలను పునరుద్ధరించవచ్చు.

**cribble (cribbled)** : *చాలనీ ప్రక్రియ.*

చిన్న చుక్కలచేతగాని, రంధ్రాలచేతగాని నింపటం; లోహంపైనా, కొయ్యపైనా ఇటువంటి అలంకరణను చేస్తారు.

**crimson** : *లోహిమ; ఘనారుణం.*

ప్రస్తుతం, ఒక ముదురు ఎరుపురంగు ఛాయకు ఈ పేరుంది. పూర్వం ఒక క్రిమి నుంచి తయారైన ఎరుపు రంగుకు ఇటువంటి పేరే ఉండేది.

**crimson lake** : *రక్తరంజకం.*

పారదర్శకమూ, గాఢమూ అయిన రంగు. దీనిలో కొంచెం నీలచ్ఛాయ ఉంటుంది. క్రిమి సంబంధమైన కార్మైన్ అనే వర్ణపదార్థం నుంచి దీన్ని తయారు చేస్తారు. ఫ్లోరెన్ టెయిన్ లేక్ అని కూడా దీనికి వ్యవహారం ఉంది. ఇది చాల పురాతన కాలంనుంచి కూడా ఉపయోగంలోఉంది. ఈజిప్టువాసులు, గ్రీకులు, రోమనులు కూడా దీన్ని వాడారు. 'కార్మైన్' అనే ఇంకొక వర్ణం 16వ శతాబ్దం నుంచి దీని స్థానాన్ని కొంత ఆక్రమించినప్పటికీ, 19వ శతాబ్దిలో మంజిష్ఠ, అలిజారిన్ వర్ణాలు వచ్చేవరకు ఇది ఉపయోగంలో ఉండినది.

**crisp** : *విస్ఫుట.*

**croquis** ; *పాండు లేఖ్యం.*

శిల్పం, చిత్రం, వాస్తు శిల్పాలను తయారు చేయటానికి ముందుగా రచించే చిత్తు

నమూనా. దీని రచనకు పెన్సిలు, కలం, రంగుసుద్దలు వాడవచ్చు. తయారుచేయవలసిన కళారూపాన్ని క్లుప్తంగా చూపిస్తూ, చిత్తుప్రతిగా ఇది ఉపయోగ పడుతుంది. కాబట్టి దీన్ని కళాకారులు సంక్షిప్త లేఖనం (*stenography*) అని కూడా అంటారు. ఈపదాన్ని ఎక్కువగా కళాపరిషత్తులలోను, కళాబోధనశాలల్లోనూ, ఉపాధ్యాయుల సహాయం లేకుండా రచించే స్కెచ్చీలకునూ వాడుతున్నారు.

**criosphinx** : మేషసింహిక.

**crockets** : గ్రంథికలు.

వాస్తు విషయకమైన పారిభాషిక పదం. స్తంభమకుటాలు మొదలైన వాటిపై జరిగే రమ్యమైన గుబ్బల అమరింపుకు ఇది వర్తిస్తుంది. 18వ శతాబ్దంలో ఇది విరివిగ వ్యాప్తిలో ఉండేది.

**cross** : నిలువ; క్రాశం.

రెండు గాని, అంతకు మించిగాని కర్రలను అడ్డంగాను, నిలువుగాను అమర్చి తయారుచేసిన రూపం. అలంకృతులలోని ఇటువంటి రూపాలు ప్రాగైతిహాసిక యుగంనుంచి కూడా కనబడుతూనేఉన్నాయి ఇంచు మించుగా ఇవి అన్నీ పవిత్రతకు చిహ్నాలు. అస్సీరియన్, ఈజిప్షియన్ కళలో 'అంఖ్' అనే పేర ఇటువంటి రూపం తరచుగా కనపడుతుంది. క్రీస్తును సిలువకెక్కించిన దృశ్యానికి ప్రతీకంగా లాటిన్ సిలువను చూపుతారు. కాని మొదట ఈ దృశ్యాలలో వాడినది 'టౌ' సిలువే. గ్రీకు అక్షరమైన 'టౌ' ను ఇది పోలి ఉంటుంది. వివిధ క్రైస్తవ సంప్రదాయాలకు చెందిన చర్చిలలో, ఆయా సంప్రదాయాల అభిరుచులననుసరించి, విభిన్న రూపాల సిలువలు వాడుకలో ఉన్నాయి. మధ్య యుగంలోని యోధుల కుటుంబాలు తమ ఫలకాల (డాలుల) పై వీరచిహ్నాలతో పాటుగా సిలువనుకూడా ప్రదర్శిస్తూ ఉండే వాళ్ళు. ఈ విధంగా సిలువ అనేక రూపాలు పొందింది. తమపూర్వులు మతయుద్ధాలలో పాల్గొన్నారని తెలియజేయటానికి కొన్ని యోధ కుటుంబాలు ఇటువంటి సిలువలను ప్రదర్శించేవి.

**cross-hatching** ; జాలికావర్తన; వత్ర వర్తన,

**cross line** : అడ్డుగీత.

**cross - section** : పరిచ్ఛేదం.

ఒక రూపవు, లేదా నిర్మాణపు అంతర్భాగాన్ని - అంటే ఆ రూపాన్ని నిలువునగానీ, అడ్డంగా గానీ కోసినప్పుడు కనపడే ముఖభాగాన్ని - చూపటానికి గీసే రేఖా చిత్రం. ఉదాహరణకు అడ్డంగా కోసినప్పుడు నారింజ పండులో కోతభాగం వృత్తాకారంలో ఉండి, కోతపడ్డ తొనలు, అందులో కేంద్రం నుంచి వ్యాపించే వృత్తభాగాలలాగా ఉంటాయి. వాటిలో తొనల భాగాలలో పాటుగ విత్తనాలను కూడా చూడవచ్చు.

**cross-section paper** : పరిచ్ఛేద పత్రం.

బట్టలను ముడిపదార్థాలుగా వాడి తయారు చేసే కాగితం. దీన్ని లెడ్జరు కాగితం అని కూడా వ్యవహరిస్తారు. ఈ కాగితంపై గళ్ళు గీసి ఉంటాయి. ఇవి చదరపు అంగుళానికి 16 నుంచి 100 వరకు ఉంటాయి. ఒక్కొక్క చదరపు అంగుళం చుట్టూ మందమైన గీత ఉంటుంది. చార్టులు, గ్రాఫులు గీయటానికి ఈ

కాగితం ఉపకరిస్తుంది. చిన్న చిన్న గళ్ళు ఉండి, చదరపు అంగుళం చుట్టూ మందపు గీతలేని బాండు కాగితాన్ని 'క్వాడ్రిల్' అని వ్యవహరిస్తారు.

**crowquill** : కాకియీక పాళీ.

ఉక్కుతో తయారుచేసే సన్నటి పాళీ. దీంతో చాలా సన్నటి గీతలు గీయవచ్చు. 19 వ శతాబ్దిలో ఇటువంటివి వాడుకలోకి వచ్చాయి. అంతకు పూర్వం కాకిరెక్కల ఈకెలను దీనికోసం ఉపయోగించే వాళ్ళు.

**crucible** : మూస.

శిల్పాలను పోతపోయటానికి ముందుగా, లోహాన్ని కరగించటానికి ఉపయోగించే పింగాణి పాత్ర.

**cruciform** : క్రాస్ ఆకారం; సిలువ ఆకారం.

సిలువ ఆకృతిని అనుకరించే నిర్మాణం. గోతిక్ చర్చిల నిర్మాణం ఈ ఆకారంలో ఉండేది.

**crushed relief–relievo stiacciato; relievo schiacciato** : నిరుద్ధోల్బణ

(చూ : **relief**)

**crystal** : స్ఫటికం.

**crystalline glaze** : స్ఫటిక స్నిగ్ధం; స్ఫటిక ద్యుతి.

స్ఫటిక రూపంగా తీర్చిన మెరుగు. జింకు సిలికేట్‌తో ఇటువంటి మెరుగును చక్కగా తీసుకొని రావచ్చు. ఇది చాలా నేర్పుతో చేయవలసిన పని.

**cubism** : స్థూలతావాదం; స్థౌల్యవాదం; క్యూబిజం.

1907–1914 మధ్యకాలంలో ప్రవర్తిల్లిన విప్లవాత్మక కళోద్యమం. దీనికి ప్రవర్తకులు: జార్జి బ్రాక్ (1882–1963), పాబ్లో పికాసో (1881–1974) ఈ ఉద్యమం మూడు ఘట్టాలలో ప్రవర్తిల్లింది. మొదటిదైన ఆంశిక స్థూలతావాదం [*facet cubism*] లో రూపములను నిర్దిష్ట, జ్యామితీయ అంశాలుగా విభజించి అమరుస్తారు. ఇందులో సిజానే రచనల ప్రభావం కనపడుతుంది. రెండోది వైశ్లేషిక స్థూలతావాదం [*analytical cubism*] : ఇందులో ఒక రూపాన్ని, దాని అర్థాన్ని అనుసరించి, విశ్లేషించి, విభజించి, ఆయా వివిధ వైఖరులను ఏక సమతలంలోనే చిత్రించి, వేద్యం చేయటం జరుగుతుంది. మూడోది సంయోజిత స్థూలతావాదం [*synthetic cubism*]. దీనిలో కళాకారుడు, సంపూర్ణ స్వేచ్ఛతో, సాంప్రదాయిక రూపరచనను వదలిపెట్టి, వాస్తవిక, ఊహా రూపాలను మేళవించి చిత్రిస్తాడు. సిజానే, సురాత్ రచనలూ, ఆఫ్రికా శిల్పాల పరిచయం ఆ కాలంలో ఫ్రాన్సులో ప్రబలి ఉండటంవల్ల ఈ స్థూలతా వాదానికి అక్కడ మాన్యత లభించింది. సమాహరణ పద్ధతి మొదలైన అతికించే ప్రక్రియలు స్థూలతావాదంతోనే ఆరంభమైనాయి. మొదట ఈ వాదానికి వ్యతిరేకత ఎదురైనా, ఒక నూతన శకానికి ఇది ప్రవర్తకం కాగలిగింది. తరవాతి దశాబ్దాలలోని కళాకారులకు స్థూలతావాదం ఉత్తేజం కలిగించి, వినూత్న మార్గాలను అవలంబించటానికి ఇది అవకాశం కల్పించింది. పికాసో,

ప్రాక్‌ల సంయుక్త కృషివల్లనే ఈ వాదం సమర్థతను, ఉత్పాదన శక్తిని, నూతనత్వాన్ని సంతరించుకొన్నది. తరవాతి కాలంలో ఈ వాదాన్ని అవలంబించిన ప్రముఖ కళాకారులు: జువాన్ గ్రిస్ (1887-1927), ఫెర్నాండ్ లెజే (1881-1955).

**Cupid :** *మన్మథుడు.*

*cupid*ను రోమనులు ప్రేమదేవతగా సంభావించారు. వాళ్ళు ఇతణ్ణి సుందర బాలకుడిలా చిత్రించేవారు; లేదా విగ్రహంగా మలిచేవారు. ఈబాలుడికి రెక్కలు, చేతిలో బాణాలు ఉంటాయి.

**cupola :** *హర్మ్య శిఖరి.*

**curio :** *అపురూప వస్తువు.*

**currier and Ives prints :** *కరియర్-ఐవ్స్ ముద్రాంకాలు.*

నెతేనియల్ క్రియర్, జేమ్స్ యం. ఐవ్స్ అనేవాళ్ళు 19వ శతాబ్దిలో న్యూయార్కులో ప్రచురించిన, ఒక రీతి ముద్రాంకాలు. ఇవి ప్రజల మన్ననలను అత్యధికంగా సముపార్జించాయి.

**cure :** *పదును వేయు.*

కాంక్రీట్ గట్టిపడేటప్పుడు, వేగంగా అది గట్టిపడి పోకుండా, దానిపై చల్లటి ఆచ్ఛాదన ఏర్పాటు చేసే కృషి విశేషం. ఇందువల్ల కాంక్రీటులో అంతటా, ఏకరీతిగా పాటవం ఏర్పడుతుంది.

**cursive :** *గొలుసుకట్టు.*

1. గొలుసులాగా కలిపి వ్రాసిన వ్రాత లేదా ముద్రణ. ముద్రణలో, అందులోని అక్షరాలు నిజంగా కలిసి ఉండవు కాని కలిసి ఉన్నట్లు కన్పిస్తాయి.

2. గొలుసు కట్టులాగా వక్రరేఖలతో చిత్రించిన అలంకారం.

**curve :** *వక్రిక.*

(చూ : *French curve*)

**curved line :** *వక్రరేఖ.*

**curvilinear :** *వక్రరేఖాబద్ధం.*

**cusp :** *కలాగ్రం; కోణవంకి.*

గోతిక్ మొదలైన వాస్తు విధానాలలో కొన్నిటిలో జరిగే అలంకరణ కృషిలో, రెండు వక్రరేఖాకృతులు పరస్పరం ఖండించుకోవటం వల్ల రూపొందే బిందువిశేషం; వాస్తు నిర్మాణాలలో గవాక్షాదులపై ఆర్చీ వలె శలాకలను అమరించేటప్పుడు సన్నిహిత వక్రశలాకల దళాగ్రములు పరస్పరం ఉత్తరించు కొనేటప్పుడు ఇటువంటిది ఏర్పడుతుంది.

**cut :** *కట్టు.*

1. ఒక ద్రావణంలో యశదూపాన్ని కరిగించటానికి, వార్నిషు పనివాళ్ళు ఉపయోగించే పదం. అట్లా కరిగించగా తయారయ్యే పదార్థానికికూడా ఈ పేరును వాడతారు.

2. ముద్రణాలయంలో, చిత్రాన్ని ముద్రించటానికి ఉపయోగించే అచ్చు.

**cutch :** *చేవరంగు; కాచవర్ణం.*

కొన్నిరకాలైన తుమ్మ జాతి చెట్లలో, చేవ కొయ్య నుంచి లభించే ఒకానొక రంగు పదార్థం. గోధుమ, నలుపు, ఖదరీ వర్ణాల ఛాయాంతరాలను ప్రస్ఫుటంగా తెలియజేయటానికి

ఉపకరిస్తూ దాదాపుగా చిరస్థాయి పర్ణాలుగా చెప్పదగిన వనస్పతి వర్ణపదార్థాలలో ఇది ఒకటి.

**cut-card work** : *ఆరోప ప్రక్రియ.*

లోహంతో తయారయ్యే వస్తువుపై, అదే లోహపు రేకును కత్తిరించిన అలంకరణను అతకటం. ఇటువంటివి ముఖ్యంగా వెండితో తయారవుతాయి. 18వ శతాబ్దిలో ఈ ప్రక్రియ ప్రచారంలో ఉండేది.

**cutting test** : *ఛేదక శోధనం.*

**cuttlefish ink** : *చేవ సిరా.*

రోమనుల కాలంలో చేవలనుంచి తయారు చేస్తూ వచ్చిన ఒక విధమైన సిరా; ఇది కపిల వర్ణంలో ఉండేది.

**cyan** : *మరకత నీలం.*

ఆకుపచ్చ ఛాయగల ముదురు నీలవర్ణం. వర్ణఛాయా చిత్రణ (***colour photography***) లో ఈ పదానికి ఎక్కువ వ్యాప్తి ఉంది. దీని పరిపూరక వర్ణం కొంచెం ఎరుపు వాక కలిసిన పసుపు.

**cyanine blue** : *శ్యామీ నీలం.*

ప్రష్యన్ నీలిమ, మదుధాతు నీలిమల నుంచి తయారయ్యే ఒకానొక సమ్మిశ్రిత వర్ణద్రవ్యం. సంయోజిత రీతిలో తయారయ్యే ఒక రంగు పదార్థానికి కూడా ఈ పేరును వాడుతున్నారు.

**Cycladic art** : *సైక్లదీయ కళ.*

ఈజియన్ సముద్రంలో ఉన్న సైక్లేడ్స్ ద్వీపాలలోని, నాగరికతకు సంబంధించిన కళ. ఈ కళ క్రీ.పూ. 2600 నుంచి క్రీ.పూ. 1600 వరకూ వర్ధిల్లింది. ఈ కళా విభవం, ఆ ప్రాంతంలో దొరకిన అలంకృత వస్తువులు, మట్టి పాత్రలు, పాలరాతి విగ్రహాలలో కనపడుతుంది. ఈ శిల్పాలలో తరచుగా స్త్రీల విగ్రహాలూ, వాద్యగాంధ్ర విగ్రహాలూ కనపడతాయి. శివప్రమాణంలో ఉండే నగ్న స్త్రీల శిల్పాలు అందులో అత్యంత రమణీయాలు. సైక్లేడ్స్ ద్వీపవాసులు సముద్రయానంలో ఆరితేరినవాళ్ళు కావడం వల్ల వారి కళ, మధ్యధరా సముద్ర ప్రాంతం వరకూ, ఈజియన్ సముద్రంలోని తక్కిన ద్వీపాలకూ- అందులోనూ ముఖ్యంగా క్రీటు దీవికి- విస్తరించింది.

**cyma (Ogee)** : *అవగ్రహాకం.*

**Cyprian green earth** : *సిప్రియ హరిత మృత్తిక.*

సహజ సిద్ధంగా భూమిలో లభిస్తూ, పసుపువాక రంగులో ఉండే హరిత మృత్తిక; ఇది అత్యుత్తమ స్థాయికి చెందింది. సైప్రస్ దీవిలో దీన్ని గనుల నుంచి తవ్వి తీస్తున్నారు.

**cyprus umber** : *సిప్రియ అంబరిక.*

అంబరికలలో అత్యుత్తమ తరగతికి చెందింది. సైప్రస్ దీవిలోని కొన్ని గనుల నుంచి దీన్ని తవ్వి తీస్తున్నారు దీనికే టర్కీ అంబరిక, టర్కీ కపిలం అనే పేర్లుకూడా ఉన్నాయి.

**Dabber** : *స్ఫాలని.*

1. చేతితో సాగించే ముద్రణలో ఉపయోగించే సాధనం. మెత్తని తోలుతో దీన్ని బంతిలాగా చేసి, పట్టుకోవటానికి ఒక పిడిని అమరుస్తారు. ముద్రించటానికి ఉపయోగించే ఫలకంపై, సిరాను అద్దటానికి దీనిని ఉపయోగిస్తారు. తైల వర్ణాలను చిత్రాలపై మృదువుగా మేళవించటానికి దూదితో తయారుచేసిన దిండులాగా దీన్ని తయారు చేస్తారు.

2. ఉడుత వెంట్రుకలతో బొద్దుగా తయారుచేసిన నీటిరంగుల కుంచె.

**dabbing** : *స్ఫాలనం*

**dada** : *దాదా (వాదము); విచిత్ర కళ.*

మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో జ్యూరిక్‌లో బయలుదేరిన కళోద్యమం. ఫ్రెంచి భాషా నిఘంటువునుంచి, యాదృచ్ఛికంగా ఈ పదాన్ని గ్రహించి 1916లో దీనికి 'దాదా' అనే నామకరణం చేశారు. 'దాదా' అనే పదానికి, ఫ్రెంచిభాషలో 'వినోదాశ్వం' అని అర్థం. ఇది యూరోపు, అమెరికాలలో బాగా వ్యాపించగలిగింది. ఈ ఉద్యమ ప్రవర్తకులు· కళాకారుడు హాన్స్ ఆర్ప్; రచయితలు ట్రిస్టాన్ జారా, హ్యూగో బాల్, రిచర్డ్ హ్యూల్‌సన్‌బెక్. 'కళాకారుడు ఏపని చేసినా అది కళే' అని ఈ వాదపు నినాదం. ఈ నినాదం వివాదాస్పదమైనది. దీనివల్లనే అనేక విచిత్ర పద్ధతులు- చిత్తం వచ్చినట్లు కలంతో గీయటం వంటివి- చిత్రాలుగా తయారైనాయి. యాదృచ్ఛికంగా లభించే వేళ్ళు, మొదళ్ళు, ఇతర వస్తువులను, సాంప్రదాయికంగా అంగీకరించని పద్ధతులను ఈ వాదం స్వీకరించింది. సంప్రదాయ శైలులను ఈ వాదం విసర్జించడం వల్ల దీన్ని, కొందరు విమర్శకులు, కళావ్యతిరేక వాదంగా భావించారు.

ఈ కళావాదానికి ప్రచారం కల్పించి, సాధన సాగించడంలో మార్సెల్ డూషాంప్ (1887-1968), మాక్స్ ఎర్నెస్ట్ (1891-) హాన్స్ ఆర్ప్ (1887-1966), ఫ్రాన్సిస్ పికాబియా (1878-1953), మేన్ రే (1890-), కుర్ట్ ష్విట్టర్స్ (1887-1948) సుప్రసిద్ధులు. మార్సెల్ డూషాంప్ రచించిన 'ది ఫౌన్‌టెన్' అనే చిత్రం ఈ కళారీతికి చక్కటి ఉదాహరణ. దీనిలో ఆ కళాకారుడు ఒక పింగాణీ మూత్రపాత్రను చూపాడు. అత్యల్పమైన వస్తువులను వాటి పరిసరాల నుంచి తప్పించి, వాటికి గొప్పదనం ఆపాదించవచ్చునని ఇతని భావం. ఇతనిదే మరొక చిత్రం: డావించి రచించిన సుప్రసిద్ధ చిత్రము మోనాలీసాకు అది ఛాయా చిత్రం. దానికి మీసాలుంచి, ఆ కళాకారుడు ప్రదర్శించటంలో తనకు సంప్రదాయం పట్లగల వైరభావాన్ని వ్యక్తీకరించాడు.

**dado** : *ప్రకాండం.*

వాస్తు విషయిక పారిభాషిక పదం. స్తంభంలో మట్టానికి, కపోతానికి మధ్య ఉండే భాగం; లేదా ఒక గదిలో దిగువ భాగంలో గోడలకు అమర్చిన చెక్కకూర్పు.

**dagger striper** : *ఛురికా తూలిక.*

అలంకారిక చిత్రణకై రూపొందించిన ఒక మృదు తూలిక. బొటనవ్రేలికి, వేరొక వ్రేలికి మధ్య ఇమడగల చిన్న పిడి, పొడుగాటి వెంట్రుకలూ ఇందులో అమరి ఉంటాయి.

వెం్రటుకలు పికి దగ్గర దట్టంగా ఉండి, పోనుపోను చివరకు వచ్చేసరికి సన్నగ కొన దేలుతాయి. సృజన శీలురైన కళాకారులను అక్కడక్కడ దీన్ని వాడటం ఉంది.

**damaged** : *క్షీణిత; శిల.*

**damascene** : *అధ్యారోపక ప్రక్రియ; దమాసీన్ పద్ధతి.*

లోహపు చెక్కడుపనిలో, ఒక లోహంపై, దానికన్నా ఎక్కువ విలువగలిగిన వేరొక లోహాన్ని పొదగటం. బంగారం, వెండి, తెల్లబంగారం (ఎలక్ట్రం), రాగివంటి విలువ గల లోహాలతో తయారుచేసిన సన్నని తీగ లనుగాని, రేకులనుగాని తొలుతటి చెక్కడు పని చేయవలసిన శిల్పంలో, అదివరకే చేసిన గాడులలో, సుత్తెతో కొట్టి అతుకడంవల్ల ఈ అలంకరణ జరిగేది. ఇటువంటి పనితనం కలిగిన కత్తులు కొన్ని, మైసీనీ (గ్రీసు) ప్రాంతపు త్రవ్వకాలలో లభించాయి. మధ్య యుగంలో మధ్యప్రాచ్యంలోని దమాస్కస్ నగరంలో ఈ పద్ధతిని, స్వర్ణకారులు విపులంగా వ్యాప్తికి తెచ్చినందువల్ల దీనికి యూరపీయ భాషలలో దమాసీన్ అనే పేరు వచ్చింది. ఇప్పటికీ మధ్య ప్రాచ్యంలో దీనికి ఎక్కువ ఆదరణ ఉంది.

2. నీటి గీతలలాగా, అలలలాగా, అలంకృతి కనిపించే అలంకారాలుగల వస్త్రాలు, లోహపాత్రలు.

**dammar** : *డంబారు; తారు.*

వెలవెలబోయే గడ్డిరంగును స్ఫురింపజేసే కిరిలో ఉండే ఒక విధపు యక్షధూపం. మలేసియా, ఇండోనేసియాలలో పెరిగేటకరకపు చెట్లనుంచి దీన్ని సేకరిస్తారు. ఆ దేశాలలో నుంచి దీన్ని ఎగుమతి చేయటానికి ఉపయోగించే రేవుల పేరులనుబట్టి దీనిలో ఎన్నో రకాలు ఏర్పడ్డాయి. అందులో సింగపూరు డంబారు అనబడేది ప్రశస్తమంగా పేరు గన్నది; కళాకారుల సాధనద్రవ్యాలలో ఉపయోగించటానికి అనువైనది ఈ డంబారే. ఇది స్వచ్ఛమైన కర్పూర ద్రావకంలో కరుగుతుంది. కాని పెట్రోలియపు ద్రావణాలలో కరగదు.

**dancer** : *నర్తకుడు; నర్తకి.*

**dancer girl** : *గణిక; నర్తకి*

**dance of death** : *మృత్యు నాట్యం.*

పాశ్చాత్య లలిత కళారంగంలో సాహిత్య, సంగీత, చిత్రలేఖనాలలో అధికాదరణను ఆర్జించిన ఒక విశిష్టమైన రచనా ప్రక్రియ. దీనిని గురించి రాస్తూ ప్రసిద్ధ విమర్శకుడు జేమ్స్ యం. క్లార్క్ ఈ విధంగా ఆ రచనను గూర్చి తెలియజేశాడు. ' సజీవులూ, మృతులూ పాల్గొనే ఒక నాట్యాన్ని, లేదా మెరవణి (ఊరేగింపు)ని నిరూపించేదే మృత్యు నాట్యం. అందులో సజీవులంతాను ఏదో ఒక నిర్దిష్టక్రమంలో- పీఠాధిపతి, ఆచార్యుడు, రాజు, సర్దారులు అనే రీతిలో- వరుసదీరి ఉంటారు. మృతులను కూడా ఎందరినో అక్కడ రూపించ వచ్చు లేదా మృత్యువునే ప్రతీకరూపంలో అందులో జోడించవచ్చు.'' ఈ రచనలో వ్యంగ్య రూపంగా ఏదో ఒక నైతిక భావన గర్భితమై ఉండటం స్పష్టమే. ఏదో ఒక రచనలో ఒక కంకాళం, మృత్యుదేవతా మాత్రమే రూపితమై ఉండేటప్పుడు దాన్ని మృత్యు నాట్య

మని అనరు. ఇటువంటి రచనకు ఉపయుక్తమైన మాధ్యమం సాహిత్యం కావచ్చును; సంగీతం కానవచ్చును; దృశ్యకళలైన శిల్ప, చిత్రలేఖనాలుకావ చ్చు.

మధ్య యుగాలలో ఇటువంటి ప్రక్రియ రూపొందింది. మృత్యువు అనివార్యమనీ, దాని దృష్టిలో ధనికుడు, పేద మొదలైన వ్యత్యాసాలు ఏవీ ఉండవనీ తెలియజేయటమే ఈ ప్రక్రియకు ధ్యేయవిషయం. ఇటువంటి చిత్రరచన మొట్టమొదట పారిస్‌లో హోలీ ఇన్నోసెంట్స్ చర్చిలో 1424-5 న జరిగింది. ఇటువంటి దానిని విస్తృత రూపంగా దారుతక్షణంగాగాక సాహిత్యంలోనూ వెల యించిన ఫ్రెంచి ధీమంతుడు గ్యోయట్ మార్చంట్. దీనిని అనుసరించి ఎన్నో రచనలు అనేక మాధ్యమాలలో జర్మనీ, స్విజర్లాండ్, ఇటలీ, స్పెయిన్, ఫ్రాన్సులలో రూపొందాయి.

ఇటువంటి మృత్యునాట్య రచనలలో అత్యంత ప్రసిద్ధి నార్జించింది హాల్స్ హాల్ బీన్ (కనిష్ఠ) రచించింది. 40 వరసల దారు తక్షణములలో అతడు దాన్ని రూపొందించాడు. దాన్ని అతడు పూర్తిచేసిన తేది నిర్దిష్టంగా తెలియకపోయినా, దాన్ని అనుసరించిన ఆలేఖనాలు 1527 నాటికే విస్తృతంగా వెలువడడంవల్ల అంతకు కొద్దికాలానికి పూర్వమే అది రచితమై ఉంటుంది.

**dandelion** : *సింహపర్ణి.*

**Danube school** : *డాన్యూబ్ సంప్రదాయం.*

క్రీ.శ. 16 వ శతాబ్దిలో, డాన్యూబ్‌నదీ లోయలోని నగరాలలో నివసించిన చిత్రకారుల రచనలకు సమష్టి నామం. వీళ్ళు తరచుగా ప్రకృతి దృశ్యాలను చిత్రించారు. ఇటువంటి దృశ్యాలలో చిత్రకారులు తమ ఊహాశక్తికీ, కాల్పనికతకు స్థానమిచ్చారు.

**dark colour** : *ముదురు రంగు.*

**Davy's gray** : *డేవీ ధూసరం.*

ఒక ధూసర పర్ణద్రవ్యం. చక్కగా పలక రాతిని పొడిచేయడంవల్ల దీన్ని రూపొందిస్తారు. ఇది ఈ కాలంలో వాడుకలో లేదు.

**dead colouring** : *స్థూల రంజనం.*

చిత్ర రచనలో వివరాలను సూచించక కాటికను, లేదా ఫలకాన్ని వర్ణాలతో మొదట కప్పడం. చిత్రంలోని వివరాల నన్నింటినీ, ఆ తరువాతనే దీనిపై చిత్రిస్తారు. ప్రస్తుతం యునైటెడ్ స్టేట్సులో 'డెడ్ కలరింగ్' అనే పదం లుప్తమై, అందుకు బదులుగా 'ఫస్ట్ కోటింగ్' (తొలిపూత) అనేది వాడుకలోకి వచ్చింది

**dealer** : *విక్రేత; వస్తు విక్రేత.*

**death mask** : *మృతోపముఖం.*

మృతుని ముఖం నుంచి తీసిన ప్లాస్టరు అచ్చు. పునరుజ్జీవన యుగం తరువాత ఇటువంటి పద్ధతి యూరప్‌లో ఎక్కువగా ప్రచారంలోకి వచ్చింది. మృతుని ముఖంపై చమురు రాచి, ప్లాస్టరు అచ్చు తీస్తారు. ప్రాచీన ఈజిప్టువాసులు పలచని బంగారు రేకుతో ఇటువంటి ఉపముఖాన్ని తయారు చేసేవారు.

**decadence or decadent period** : *క్షీణ యుగం.*

కళోద్యమ చరిత్రలోగాని, కళాశైలీ చరిత్రలోగాని, సర్జనాత్మకకళ క్షీణించిన కాలం.

ఇటువంటి కాలంలో ఉన్న కళాకారులను తక్కువ ప్రతిభ కలవారుగానే పరిగణించటం వరిపాటియే అయినను, ఈ కాలమును, పూర్వ సంప్రదాయాల రీతులూ మారి, కొత్త సంప్రదాయాలు ఉద్భవించటానికి పూర్వభాగమైన సంధికాలమని, ఎంచవచ్చు. ప్రతి కళా చరిత్రలోనూ ఇటువంటిది కనవడుతుంది

**decadent art : *క్షీణ కళ.***

19 వ శతాబ్ది చివర రెండు దశాబ్దాలలో ఇంగ్లండులో ప్రచారంలో ఉన్న సౌందర్యోద్యమాని( *Aesthetic movement* ) కి నిందాత్మకమైన పేరు. ఈ ఉద్యమంలో కళాకారులతో పాటుగా రచయితలుకూడా పాల్గొన్నారు. ఈ ఉద్యమవాదులు రూపానికీ, సౌందర్యానికి మాత్రమే ప్రాధాన్యమిచ్చి, విషయానికి నైతిక మూల్యాలకూ సర్జనాత్మక ప్రక్రియలలో స్థానం లేదన్నారు; వికృత, ఉన్మత్త, తాంత్రిక విషయాలకు ప్రాధాన్యమిచ్చారు. ఆబ్రే బియర్డ్స్లే యొక్క రేఖా చిత్రాలు ఇందుకు సరిఅయిన లక్ష్యాలు.

**decadent period : *క్షీణ యుగం.***

(చూ : *decadence*)

**decal, decalcomania : *మార్పిడి కాగితం.***

ఇంకొక వస్తువుపైకి మార్చటానికి అనువుగా రూపాన్ని చిత్రించిన కాగితం. ఇట్లా చిత్రించిన కాగితంలో, మార్చవలసినచోట, బోర్లవైచి, అతికించేస్తే, చిత్రించిన రంగులు దానిపై అతుక్కొంటాయి. తరవాత కాగితాన్ని తీసివేయాలి. పారిశ్రామిక ఉత్పత్తులలో ఇటువంటి వాటిని ఉపయోగిస్తారు. వీటిని బదిలీలు ( *transfers* ) అంటారు. అధివాస్తవిక వాదంలో రంగులను చిత్రకారుడు ఒక కాగితంపై పూసి, తడి ఆరకమునుపు, ఇంకొక కాగితాన్ని దానిపై ఉంచి. అక్కడక్కడ ఒత్తుతాడు అట్లా ఒత్తటంవల్ల రెండో కాగితంపై గుహలు, వేళ్ళు, చెట్లు, పువ్వులవంటి ఆకారాలు ఏర్పడ్తాయి. మేక్స్ ఎర్నెస్ట్, తైల పర్ణాలతో, ఈ ప్రక్రియలో చాలా అభివృద్ధి సాధించాడు. ఇతడు ఈ విధంగా తయారైన రూపాలపై మళ్ళీ కావలసినట్లు కుంచెతో చిత్రించేవాడు. ప్రస్తుతం దీన్ని భ్రాంతికళ (*psychedelic art*) లో వాడుతున్నారు.

**decor : *అలంకార సామగ్రి.***

**decorated mount : *అలంకృతోపాధి.***

అంటి చిత్రాలు అతికించటానికి ఉపయోగించే, అలంకారయుతమైన అట్ట.

**decorated style : *అలంకృతశైలి.***

మధ్యయుగంలోని వాస్తుశైలులలో ఒకటి. ఆయాశైలులలో కిటికీల తీరులను అనుసరించి ఈ విభజన చేశాడు. టి. రిక్ మన్ అనే పండితుడు సాగించాడు.

**decoration : *సమలంకరణ, అలంకరణ.***

**decorative : *అలంకారిక.***

**decorative art : *అలంకార కళ.***

వినియుక్త కళలో ఒక విభాగం. వస్తువులను అలంకరించటానికి ఇది పనికివస్తుంది. ఇది ప్రయోజనాత్మకం కాబట్టి లలితకళలకు విభిన్నం.

**decorative work : *అలంకారిక కృతి.***

**decorum : *సురీతి.***

సౌందర్య భావనలో ముఖ్యాంగం. ఉదాత్తత ఇందులో ముఖ్యలక్షణం.

**decoupage** : విధాన కళ; పత్రఖండ రచన.

కత్తిరించిన కాగితాలతో చేసిన రూపాలను ఒక తలంపై పూర్తిగా అతికించే కళ.

**deep** : గాఢ; గంభీర; ఘన.

**deep colour** : ఘన వర్ణం; గాఢవర్ణం.

కాంతిని ఎక్కువగా గ్రహించే వర్ణం. తెలుపు స్వల్పంగా మాత్రమే కలిపి రచించిన వర్ణచిత్రాన్ని ఘనస్థాయీ (*deep toned*) చిత్రమని వ్యవహరిస్తారు.

**dee p relief** : అత్యుల్బణ.

(చూ : *relief*)

**deep-toned** : ఘనస్థాయిక.

(చూ : *deep- colour*)

**deesis or deisis** : దైవ చిత్రం.

మేరీకన్య, బాప్టిస్టు జాన్‌లతో కలసిఉన్న క్రీస్తు చిత్రం. ఇటువంటి చిత్రంలో సాధారణంగా క్రీస్తు సింహాసనస్థుడై ఉంటాడు. ఈ రూపాలను ఒకే చిత్రంలో చిత్రించవచ్చు; లేదా వేర్వేరుగా గీసి, పక్కపక్కన కలవవచ్చు.

**defect** : దోషం.

**Defining line** : నిర్దేశక రేఖ.

**deflection** : వివర్తనం.

**deflocculate** : విఘనీకరించు.

ఒక మిశ్రమంలో కనపడే ముద్దలను, గడ్డలను విద్రవింపజేయటం. ఇందువల్ల ఆ మిశ్రమంలో నున్నదనమే గాక, సౌకర్య ప్రసరణమో, ద్రవోద్బంధనమో సంఘటిల్లుతుంది. మార్దవ ప్రక్రియలో మృత్తికకు, సోడియం సిలికేట్, సోడా యాష్ వంటి విద్యుదంశ్యము (*elecrolyte*)ను కలిపి సరకాన్ని రూపొందించటం ఇటువంటి విధానానికి ఒక లక్ష్యం.

**degame** : శిల్పదారువు.

క్యూబా దేశంలో ఒక విధపు చెట్టునుంచి లభించే కొయ్య. దీనిలో పసుపువాక నుంచి, మీగడ తెలుపు వరకు రంగుమార్పులు కనపడతాయి. శిల్పాలను మలచటానికి ఈ కొయ్యను కొందరు వాడతారు. 10 అంగుళాల వ్యాసంతో 12నుంచి 14 అడుగుల వరకు పొడవులుండే కమ్మీల రూపంలో ఈ కొయ్య అమ్మకానికి లభిస్తుంది.

**degraded colour** : అపకృష్ట వర్ణం.

కాంతిని తగ్గించటం కోసం, వేరు వర్ణంతో కలపబడిన ఒక వర్ణం.

**degree** : పరిస్థాయి.

**del** : డెల్

ఈ పదం పాశ్చాత్య శిల్ప పరిభాషలోని ఒక సంకేతాన్ని తెలియజేస్తుంది.

'డెలినియేవిట్' అనే లాటిన్ భాషా పదానికి ఇది సంక్షిప్తరూపం. 'చిత్రించెను' అని దీని అర్థం *Del , Exc., Imp; Inc; Inv; pinx., sculp* అనే సంక్షిప్త పదాలు అన్నీ ఒకే పద్ధతికి చెందినవి. ఒక శిల్పం లేదా చిత్రంలో చివరదాన్ని రచించినశిల్పి, లేదా రచనకు బాధ్యత వహించిన సంస్థ యొక్క పేరుతో కలిపి పై సంకేతాలను వ్రాసేవారు. ముఖ్యంగా ఇటువంటి సంకేతా

లను రేఖాచిత్రాలపై వాడేవారు. ఈ సంకేతాలవల్ల తొలి చిత్రాన్ని ఎవరు చిత్రించారు, లోహఫలకాన్ని ఎవరు చేశారు, ముద్రణ ఎవరు చేశారు, అనేవి తెలియవస్తాయి. *del* అనే పదం, మొదట చిత్రాన్ని చిత్రించిన వ్యక్తి పేరుకు చివర చేర్చబడుతుంది. ఈ చిత్రానికి నకలు తయారు చేసిన వ్యక్తి పేరుకు చివర *pin* అనే సంకేతం చేరుతుంది. *Inv*అనే సంకేతం చిత్రాన్ని రూపొందించిన వ్యక్తి పేరుకు చివర ఉంటుంది. *Inc and sculp.* అనే పదాలు ఫలకాన్ని తయారు చేసిన వ్యక్తి పేరుకు చివర ఉంటాయి ఉదాహరణకు *Brown del ;smith sculp* ,అని ఉన్నప్పుడు 'బ్రౌను చిత్రించిన ఫలకాన్ని స్మిత్ చెక్కాడు.'' అని అర్థం. ముద్రాపకుడి పేరు కనిపించకపోతే ఫలకాన్ని చెక్కేదీ, ముద్రించిందీ ఒక్కరే అని తెలుసుకోవాలి. *Lith* ,లేదా *Lith*-.;అని ఉంటే శిలా లేఖనాన్ని (*Lithograph*) రూపొందించిన వ్యక్తి అని అర్థం.

**delft or delft ware** : *దలత్ సామగ్రి.*

యనామెల్ పూతపూసి, కోబాల్ట్ నీలపు రంగుతో అలంకరించిన మృణ్మయ పాత్ర. నెదర్లాండ్సు దేశంలోని ఒక జిల్లా అయిన దలత్ (*delft*)లో 17వ శతాబ్దిలో మొదట ఇటువంటి సామగ్రి తయారైంది తరువాతగా ఆ ప్రాంతపు పేరుతో ఇది వ్యవహృత మవుతున్నది.

**demi relief-(Half-relief; mezzo rilievo)** *మధ్యమోల్బణ.*
(చూ *relief*)

**Dendition** : *సింహవర్తి.*

**dentils** : *దంతిల పంక్తి.*

దీర్ఘ చతురస్రంగా, ఇటుకలలాగా, వరస దీరి ఉండే ఆకృతులు. ప్రాచీన గ్రీకులు పాటించిన డోరిక, అయోనిక, కొరింథియా, సంయుక్త సంప్రదాయాలలో కపోతశీర్షంలో ఇటువంటి అలంకరణలు కనవస్తాయి.

**depth** : *గభీరత.*

**Derby red** : *డెర్బీ ఎరుపు.*

క్రోమ్ కోణిమకు ఇది పర్యాయ నామం.
(చూ *chrome yellow*).

**derogatory** : *న్యూనతాస్ఫోరక.*

**desco da parto** : *చిత్ర శరావం.*

పురిటిమంచంపై ఉన్న తల్లికి, ఆహారు తులను పెట్టితెచ్చే పళ్లెరం ('డెస్కోడా పార్టో' అనేది ఇటాలియన్ భాషా పదం). ఇటువంటి పళ్లెంపై, మేరీకన్య క్రీస్తును ఎత్తుకొని ఉన్న చిత్రం సాధారణంగా ఉండేది; లేదా సందర్భోచితమైన ఇంకొక చిత్రమైనా ఉండేవి.

**desegno** : *సూత్రపాతం; ఎత్తుగడ; ఆలేఖ్యం.*

'డిసెగ్నో' అనేది ఇటాలియన్ భాషా పదం. ఈ పదానికి సూత్రపాతం, ఆలేఖ్యం అనే రెండు నైఘంటికార్థాలు ఉన్నా, ఈ పదం దృశ్యకళలన్నిటిలోని ముఖ్యాంగములకు కూడా వర్తిస్తుంది.

**desensitized** : *గ్రహణాక్షమం.*
(చూ : *rolling up*)

**design**[1] : *రూపరేఖ (నేతపని మొ).*

**design1 (printing[2]** : ప్రకాశ్రింతం (అచ్చుపని)

**design [3]**: సూత్రపాతం; ఎత్తుగడ; రేఖాకృతి; రేఖాంకనం.

ఒక కళాఖండంలోని మౌలిక భాగాలు యేర్పి అమర్చేతీరు. అటువంటి మౌలిక భాగాల అమరికలో కళాకారుడి భావన ప్రకటితమవుతుంది. అటువంటి మౌలిక భాగాలు :- కళాఖండం ఉండవలసిన తీరు, పరిమాణం, రేఖల కోణాల ఆకృతులు, ఒక రూపానికి, ఇంకొక రూపానికి కల్పించవలసిన సంబంధం, సంవిధాన చాతుర్యం, నిర్దుష్టత, లయబద్ధత అనేవి వర్ణాల అమరిక, కళాకారుని రచనా విధానం. కళాఖండంలోని విషయం లేదా వస్తువు ఈ లెక్కలోకి రావు. వాస్తు, చిత్రలేఖన, శిల్పాలనే మూడు లలిత కళలను సూత్రపాత కళాత్రయం (*the three arts of design*) అని వ్యవహరిస్తారు.

**designer** : *రీతికారకుడు.*

**designer's colours** : *సూత్రపాతి వర్ణాలు.*

మండనిర్యాసం (*dextrin*) బంధకంగా ఉండే, ప్రశస్తములైన గహనవర్ణాలు. ఆఖ్యాయికా చిత్ర రచనకు దీన్ని వాడడం ఉంది. ఇటువంటి చిత్రాలను సాధారణంగా, ముద్రణార్థమే తయారుచేయడంచేత, ఆ ఆఖ్యాయికలను ముద్రించిన తరవాత చిత్రాలను భద్రపరచి ఉంచటం జరగదు. కాబట్టి ఇటువంటి చిత్రాలలో వాడే రంగులకు కాంతియే ప్రధానం గాని మన్నిక ప్రధానం కాదు. అందువల్ల మన్నికలేని రంగులను కూడా వాడతారు.

**desk** : *వ్రాతబల్ల.*

**dessus de porte** : *ద్వారోపరి చిత్రం.*

ద్వారబంధంపై అడ్డంగా తీర్చి ఉంచి వ్రేలాడే చిత్రం. ఈ విధంగా ద్వారాల పైభాగంలో చిత్రాలను వేలాడదీయడం పాశ్చాత్య దేశాలలో 18 వ శతాబ్దంలో ప్రచారంలో ఉండేది.

**de stijl** : *డి స్టైల్*

(చూ : *neoplasticism*)

**develop** : *వివృతీకరించు.*

**development** : *వివృతీకరణ; సంవర్ధనత;*

**device** : *ప్రయుక్తి; పన్నాగం; పరికల్పన.*

**device (v)** : *పరికల్పించు.*

**Devonshire clay** : *డెవన్‌షైర్ మృత్తిక.*

ఇంగ్లండుదేశంలోని ఒక విధపు చీనమృత్తిక.

**dextrin** : *మండ నిర్యాసం; గోధుమ బంక.*

**diablerie** : *సైతానిక.*

పరమేశ్వరుని విరోధి అయిన సైతానుకు సంబంధించినదానిని కళలో ప్రతీకరూపంలో వెల్లడించటానికి సంబంధించింది.

**diaglyph** : *నత శిల్పం*

ఉపరితలం నుంచి పైకి రాక, లోతుగా ఉండే శిల్పం. దీనికి వ్యతిరేకం ఉబ్బెత్తు శిల్పం (*anaglyph*)- కాగితంపై ఉప్పె

త్తుగా రూపాలను అచ్చువేసే అంతఃపాతి (*intaglio*) ని కూడా నతశిల్పం అని అంటారు.

**diamond black** : *వజ్రానితం; వజ్రపు నలుపు.*

కర్బనపు నలుపుకు ఇంకొక పేరు. శుద్ధ మైన కర్బనపు నలుపు, వజ్రపు నలుపు ఒకే మూలపదార్థానికి సంబంధించినవి.

**diaper** : *ముహుర లంకరణ.*

చదరంగాఉండే తలంపై మళ్ళీ మళ్ళీ వచ్చేట్లు తయారుచేసిన అలంకరణ. సాధార ణంగా ఇటువంటిది జ్యామితీయ రూపాలలోనే ఉంటుంది. గోడలను అలంకరించటానికి దీన్ని ఎక్కువగా ఉపయోగిస్తారు.

**diatomaceous earth** : *అగ్నిశిలామృత్తిక.*

పృథ్వి ప్రపంచపు శిథిలాలు అతి సూక్ష్మ రీతిలో కలిగి ఉండే అకర్బన మృత్తిక లేదా ఇసుక. ఇది తేలికగా ఉండి, నీటిని లెస్సగా పీల్చుకొనే స్వభావం కలిగి ఉంటుంది. దీనికే కీసెల్‌గర్ (*keiselgurh*) అనే ఇంకొక పేరు కూడా ఉంది.

**dichroism** : *ద్వైవర్ణత.*

ఒక పదార్థం రెండు వేరు వేరు పరిస్థితు లలో, వేరేవేరే ఛాయలలో కనిపించడం. కోబాల్టు పసుపు, అలిజారిన్ కోజిమ ఇటు వంటివే. కొన్ని తైలవర్ణాలు నిలువుగా పూసి నప్పుడు ఒక ఛాయను, అడ్డంగా పూసి నప్పుడు వేరొక ఛాయను కనిపింపజేస్తాయి.

**didactic realism** : *ఉపదేశక వాస్తవికత.*

**diffraction** : *విదళనం.*

దగ్గర దగ్గరగా సమాంతర రీతిలో పయనించే కాంతికిరణాలు, పారదర్శకంగా ఉన్న ఫలకంపై పడి, వర్ణవిశ్లేషణం చెంది, వర్ణవృత్తంలోని రంగులను అన్నిటిని చూపు తాయి. ఈ లక్షణాన్నే 'విదళనం' అంటారు. ఇటువంటి వర్ణాలను 'విదళన వర్ణాలు' అని వ్యవహరిస్తారు.

**diffused** : *పరివ్యాపిత*

**diffraction colour** : *విదళన వర్ణం.*

వర్ణద్రవ్యాల వల్లగాక, కాంతికిరణాల విదళనంవల్ల కనబడే రంగు. వర్ణమాల (*spectrum*) లోని ఏడు రంగులు మాత్రమే ఇట్లా ఏర్పడగలవు. ఈ విధంగా ఏర్పడ్డ వర్ణాలు ఒకచోట స్థిరంగా ఉండక, కాంతి కిరణాల కదలికనుబట్టి మారుతుంటాయి. ఈ గుణాన్ని 'చలద్వర్ణత' (*iridi-scence*) అంటారు. నీటిపై వేసిన నూనెలోను, సబ్బు బుడగలలోను ఈ వర్ణ విదళనం కానవస్తుంది. రెండు విభిన్న పరావర్తన గుణకాలు గల మాధ్యమాల నడుమ ఉండే పలచని పొర ఇటు వంటి కాంతివిదళనానికి కారణం. ఇటువంటి కాంతివిదళనం పట్టకం వల్లను, దగ్గరగా గీసిన సమాంతర రేఖలు ఉపరితలంలో గల గాజు, ప్లాస్టికుల వల్లనూ కూడా జరుగుతుంది. ఈ వర్ణాలు అతిసాంద్రక గలిగి, వర్ణ ద్రవ్యాలనుంచి తయారయ్యే వర్ణాలకన్నా భిన్నంగా ఉంటాయి.

(చూ : *colour*)

**diluent** : *విలయనీకారకకారి*

ఒక పూతరంగును, తగినంతగా పలచన చేయటానికి కలిపే ద్రవవిశేషం.

**dilute** : *తనూకృత; శ్లీకృత.*

**dilution** : *తనూకరణ; శ్లీకరణ.*

**dimetric projection** : *ద్విమాత్రికా ప్రక్షేపణ.*

యాంత్రికాలేఖనంలో వినియుక్తమయ్యే ఒక విధమైన ప్రక్షేపణ. ఇందులో రెండు అక్షాలు లేదా ఆయతనాలు, వాటి యథార్థపు పొడవుల నుంచి, కుదింపు ఒకే తీరుగా పొందడంవల్ల వాటిని గీయటంలో ఒకే విధపు నియతి (*scale*) అనుసరించబడుతుంది. ఇక మూడవ అక్షంలో కుదింపు విభిన్నంగా ఉండటంవల్ల దాన్ని గీయటంలోని నియతి కూడా వేరుగానే, ఉంటుంది. ఒక దీర్ఘచతురస్రపు ఘనరూపాన్ని, ఈ పద్ధతిలో రూపించే టప్పుడు, అక్షాల సంధింపువల్ల ఏర్పడే మూడు కోణాలలో, రెండు మాత్రం సమానాలుగ ఉంటాయి.

**diminishing glass** : *న్యూనీకర కాచం*

ఎదురుగా ఉండే వస్తువును చిన్నదిగా ఉన్నట్లు చూపే గాజు.

**diorama** : *త్రైస్త్రిరూప్యం.*

1. ఒక దృశ్యం మూడు ఆయతనాలలో తెలిసేటు తయారుచేసిన ప్రతిరూపం. దీనిని మూలదృశ్యం ప్రమాణంలోగాని, దాని కొలతలకు తగిన నిష్పత్తిలో అల్పప్రమాణంలోగాని చూపవచ్చు. ఇటువంటి ప్రతిరూపాలలో భూమికను రంగులతో చిత్రించి, వాయుగత, రేఖాగత దృష్టి ప్రక్రియగతులలో దృశ్యాన్ని నేరం చేయవచ్చు. దీన్ని ఒక పీఠంపై ఉంచవచ్చు; ముందుభాగంలో పారదర్శకమైన అద్దాన్ని పెట్టవచ్చు. లోపల దీపాన్ని ఉంచి, కొంచెం చీకటిగా ఉన్న ప్రదేశాలలో దీనిని పెట్టి చూడవచ్చు; జీవశాస్త్ర ప్రదర్శనశాలలలో వన్యజంతువులను చిత్రాలద్వారా, సహజరీతిలో ప్రదర్శించటానికి ఈ పద్ధతి పనికివస్తుంది.

2. 18, 19వ శతాబ్దాంలో వినోద ప్రదర్శనకోసం ఇటువంటి చిత్రాలను వాడారు. చిత్రాన్ని అద్దంపై పారదర్శకంగా చిత్రించి, వెనుక దీపం ఉంచి ప్రదర్శించేవారు.

**diploma** *అధికరణిక; డిప్లొమా.*

**dipper** : *మజ్జని*

తైలవర్ణాలను వాడే చిత్రకారుని వర్ణఫలకానికి అంట బిగించి ఉండే ఒక చిన్నగిన్నె. దీనిలో మాధ్యమద్రవ్యమో లేదా విలయనియో ఉంటుంది. ఒక్కొక్కప్పుడు మాధ్యమానికి, విలయనికి వేర్వేరుగా పాత్రలు బిగించి ఉంచటం కూడా చూస్తాం.

**diptych** : *మడత పలక.*

మడతబందు ద్వారా కలిపిన రెండు ఫలకాలపై రచించిన చిత్రం, లేదా ఉల్బణ శిల్పం.

**direct** : *ముఖా.*

**direct carving** : *ముఖా శిల్పం.*

తిన్నగా అన్ని వివరాలతో శిల్పాన్ని నేరుగా చెక్కటం. ముందుగా తడిమట్టితో రూపాన్ని మలచి, దాని అచ్చుతీసి, పోత పోయటంకన్నా ఇది భిన్నం. చాలమంది కళాకారులు శిల్పాన్ని చెక్కటానికి ముందు, మట్టితోనో, మైనంతోనో దాని నమూనాను

తయారుచేయడం ఉంది. వేరొకరు తయారు చేసిన నమూనాను అనుసరించిగాకుండా, తాను సూత్రపాతం చేసిన రూపాన్ని అనుసరించి కళాకారుడు తానే చెక్కటానికి కూడా ఇదే పేరు వ్యవహరిస్తారు.

**direct metal sculpture:** *ఋజులోహ శిల్పం.*

మూసలో పోతపోసి తయారుచేసే వస్తువుకు బదులుగా, లోహపు ముద్దను కావలసిన రూపంలో మలచిగానీ, కొన్ని లోహపు ముక్కలను అతికిగానీ తయారుచేసిన ప్రతిమ. దీన్ని సాధించటానికి కావలసిన ప్రక్రియలు: అతకడం, సుత్తెతో కొట్టడం.

**direct painting :** *అపరోక్ష చిత్రణ.*

(చూ : *alla prima*)

**discipline :** *అనుశాసనం; క్రమశిక్షణ.*

**disinfctant :** *నిస్సంనర్గకం.*

**disc :** *అట్టానం*

**Disperse :** *పరివ్యాపించు విస్తరించు.*

**Dispersion :** *పరిసరణం; విస్తారం; విస్తరణం.*

(చూ : *paint*)

**display faces: (printing)** *కన్ను కట్టే ఖాలు; (అచ్చుపని).*

**disposable pallette :** *త్యాజ్య ఫలకం.*

చమురు దిగకుండా ఉండే కాగితాల దొంతరతో తయారై, దీర్ఘచతురస్రాకారంగా ఉండే వర్ణఫలకం. బొటనవ్రేలిని దూర్చి పట్టుకోవటానికి వీలుగా ఒక రంధ్రం దీనికి ఉంటుంది. ఇది వివిధ ప్రమాణాలలో లభిస్తుంది. ఒకసారి చిత్రం వేయటానికి రంగులను ఈ ఫలకంపై వాడిన తరవాత, ఆ చిత్రపు పని కాగానే, ఆ కాగితాన్ని పారవేయవచ్చు. అట్లే ఒక కాగితం తరవాత, వేరొక కాగితాన్ని వాడుకోవచ్చు. ప్రతిసారి వర్ణఫలకాన్ని శుభ్రపరచుకొనే పని, దీనివల్ల తప్పుతుంది. ఒకదానితో ఇంకొకటి కలసి రంగులు మర్దిగాకుండా శుభ్రంగా ఉంచటం ఇందువల్ల వీలవుతుంది.

**disposition :** *అమరిక.*

**distemper :** *కలలాం; జిగురు రంగు.*

దధిమార్గం లేదా వజ్రం, బంధకంగా కలిపి తయారు చేసిన నీటిరంగు. రంగస్థలంపై దృశ్యాలను చిత్రించటానికి, గోడలకు రంగులు వేయటానికి, దీన్ని వాడతారు. కళాకారులు తమ రంగులలో వీటిని వాడరు. విశాల ప్రదేశాలకు రంగులు వేయటానికి ఈ రంగులు పనికివస్తాయి.

**distil :** *అభిషవించు.*

**distillation :** *అభిషవనం; అభిధవనం.*

ద్రవ పదార్థాల తయారీకి, చక్కబరచటానికి, సంస్కరించటానికి వినియుక్తమయ్యే ఒక ప్రక్రియ. తొలుతటి పదార్థాన్ని ఒక ఆసోత్రం (*still*)లో ఉంచి, బాగా వేడి చేస్తారు. పదార్థమంతా ఆవిరి అయ్యేవరకు ఇట్లా వేడిచేయటం జరుగుతుంది. ఆ ఆవిరిని, ఆసోత్రపు సంఘనిక (*condenser*)ద్వారా పోనిచ్చి చల్లబరచి, ద్రవరూపాన్ని కల్పించినప్పుడు దోషరహితమైన ద్రవం సిద్ధిస్తుంది. మద్య సారం, కర్పూర ద్రావకం మొదలైన

వాటి తయారీలో ఈ ప్రక్రియ వాడుకలో ఉంది. తైలవర్ణాలు, వార్నిషుల తయారీలో కర్పూర ద్రావకాదులకు ఉపయోగం ఉంది.

**distinctness :** *విస్పష్టత.*

**distortion :** *వికృతీకరణం; వక్రీకరణం; వికృతి.*

ఒక రూపాన్ని సాధారణంగా చిత్రించే రూపంలో గాక, వేరే విధంగా చూపటం. దృష్టి ప్రక్రమతను, అవయవ ప్రమాణాలను పాటించకుండా చిత్రించటం వల్ల ఇటువంటి అభాసత కలుగుతుంది. రూపాలను అమర్చే తీరులో అసహజమైన వైరుధ్యాన్ని చూపటం వల్లనూ, కొన్ని అవయవాలను, రూపాలను, ప్రమాణాల నతిక్రమించి చిత్రించటం వల్లనూ ఇటువంటిది సంభవిస్తుంది. కళాకారుడు తన భావాలకు అనుగుణంగా ఇటువంటి ప్రక్రియను అనుసరించి, చూపరిలో కూడా ఇటువంటి భావాన్ని కలిగించటానికి ఇందులో అవకాశం ఉంది. కొన్ని దృశ్యాలు, రూపాలు సహజంగా కాక, ఇట్లా వికృతి చెందినప్పుడు చిత్రరచనకు అనుకూలంగా ఉండి, వాటి రూపాల అమరిక చక్కగా కుదురటానికి అవకాశం ఉంది. రీతి సంప్రదాయపు కళ (*mannerist art*) లో, మానవాకారాన్ని వికృతీకరించి, అవయవ ప్రమాణాలను కావలసినట్లుగా మార్చి, చిత్రంలో ఇమడ్చటం వల్ల దాని సౌందర్యాన్ని ఇనుమడింపచేసి ప్రేక్షకులలో భావావేశాన్ని కలిగించవచ్చు. చీనా దేశపు కొన్ని చిత్రాలలో ప్రేక్షకుడు చూచే ఒక రూపాన్నిగాక, అవతలివైపున ఉండే రూపాన్నికూడా చూపటం ఇటువంటిదే. దీన్ని సంసూచక వికృతీకరణ (*Informative distortion*) అనవచ్చు.

ఇటువంటి చిత్రీకరణను, కొందరు ప్రసిద్ధ కళాకారులు,కావాలనే తమ చిత్రాలలో సాధించినట్లు చరిత్రవల్ల తెలుసుకోవచ్చు. గోతిక్ శిల్పంలో ఇది ఎక్కువగా కనపడుతుంది. ఎల్ గ్రెకో రచించిన రీతిసంప్రదాయపు చిత్రాలలో స్థూలతావాద, అధివాస్తవిక వాద, విభావనావాద చిత్రాలలోను తరచుగా ఈ వికృతీకరణ కనపడుతుంది. ఉదా: పికాసో, దాలీ, మోడిగ్లియానీల చిత్రాలు. 15, 16వశతాబ్దాలలోని సుప్రసిద్ధశిల్పులు. మైకేలేన్జలో,డోనాటెల్లో. రూపొందించిన కొన్ని శిల్పాలలోనూ, హెలెనీయ గ్రీకు శిల్పాలలో కొన్నిటిలోనూ, ప్రాచీన భారతీయ కళాఖండాలలో కొన్నిటిలోనూ ఈ వికృతీకరణ కనపడుతుంది.

**diverge :** *వ్యపగమించు.*

**dividers :** *విభాజిని.*

రేఖలను, తగిన ప్రమాణాలలో, విభజించటానికి ఉపకరించే సాధనం. ఇది వృత్తలేఖిని (*compass*) లాగానే రెండు పాదాలు కలిగి ఉంటుంది; కాని దీని రెండు పాదాలకూ మొనలుంటాయి.

**divisionism :** *విసంయోగవాదం.*

యథార్థంగా రంగులను, ఒకదానితో వేరొక దాన్ని కలపకుండానే, చూడటానికి మాత్రం ఒక రంగులో ఇంకొక రంగు కలిపినట్లే కనిపించేట్లుగా చేయటం. వేర్వేరు రంగుల బిందువులను ఒకదాని దగ్గరే ఇంకొకటి

కలియకుండా చిత్రించటం వల్ల ఇటువంటి దాన్ని సాధించవచ్చు. దీన్ని బిందువాదం (*pointillism*) అంటారు.

**doctor or doctor blade : *అనివృత్తం.***

తడి రంగులను తుడిచివేయటానికి ఉపయోగించే తిన్నని వాదర గల సాధనం. దీనిని లోహంతోగాని, రబ్బరుతోగాని, ప్లాస్టిక్‌తోగాని తయారు చేస్తారు.

**dogtooth : *శ్వదంతం.***

ఒక భూషణ విశేషం. ఒక చతుష్కోణ శంకువు (పిరమిడు) లాగా ఉండే దీనిలో, ఏటవాలు ముఖాలు లోపలికి వంపుదిరి ఉంటాయి. ఇటువంటి అలంకృతిని ఇంగ్లండులో 13వ శతాబ్దికోని వాస్తువిదులు, అభిమానించి ముఖశాలల అమరింపులో ప్రవేశపెట్టారు ద్రష్టలకు నాలుగు ఆకులమధ్య ఉన్న పూవులాగా ఇది కనపడుతుంది.

**dolomite; dolomitic lime stone : *దోలమితి; దోలమితిక సుధాశిల.***

ఒక విధమైన సున్నపురాయి; 45% వరకు మెగ్నీశియమ్ కార్బనేటును, కాల్షియమ్ కార్బనేటును కలిగి ఉన్న సున్నపురాయి మాత్రమే దోలమితి అని వ్యవహృతం. అట్లాకాక, కొద్దిగా—అంటే 10% మాత్రమే—మెగ్నీశియమ్ కార్బనేటు ఉన్న సున్నపు రాయిని దోలమితిక సుధాశిల అని వ్యవహరిస్తారు. చలువరాళ్లు అని పిలువబడే శిలలలో ఎన్నో రకాలు ఈ దోలమితియొక్క రూపవికృతులే,

**dominant : *ప్రముఖం; విశిష్టం.***

**dominant colour : *విశిష్ట వర్ణం.***

ఒక వర్ణ చిత్రంలో, తక్కిన వాటికన్నా ప్రస్ఫుటంగా కన్పించే ఒక రంగు.

**donor : *దాతృమూర్తి.***

జీసస్, మేరీమాత మొదలైన పవిత్రమూర్తుల చిత్రాలతో పాటుగా, ఆ చిత్రాల రచనకై కళాకారుడికి పారితోషికమిచ్చి, ప్రోత్సహించిన వ్యక్తిని కూడా చూపటానికి అనుసంధించే మూర్తిచిత్రం,

**door-keeper : *ప్రతీహారి; ద్వారపాలకులు.***

**dossal : *వేదిపటం.***

చర్చిలలోని పవిత్ర వేదికకు వెనక వ్రేలాడ దీసే, చిత్రరంజితమైన వస్త్రం.

**dotted line : *బిందురేఖ.***

**dotted manner; dotted print : *వర్తన రీతి; వర్తనముద్రణం.***

ఛాయాంతరాలను సృష్టించటానికి ఉపయోగించే వర్తనపురీతి (చుక్కలు పెట్టేరీతి). ఇందుకుగాను. రేఖాశిల్ప ఫలకంపై మొనగల పరికరంతో చుక్కలు పొడుస్తారు. ముద్రణ ఉబ్బెణ రీతిలో జరుగుతుంది చుక్కలున్న చోటు ముద్రణలో తెల్లగా అచ్చవుతుంది.

**double convex lens : *ఉభయ కుంభాకార కటకం.***

**double-end tool : *రెండుమొనల పరికరం.***

(చూ. *modelling tools*)

**double image :** *జమిలి రూపం.*

రేఖా, వర్ణ చిత్రాలలో, రెండు విభిన్న రూపాలను ప్రదర్శించగలిగే ఏకైకాకృతి. ఉదాహరణ : ఒక మేఘం, మానవాకృతిని పోలి ఉన్నట్లు చిత్రించటం. పావెల్ చెలిచ్యూ (1898-1957) ఇటువంటి ఆకృతిరచనలో సుప్రసిద్ధుడు.

**drafting :** *రేఖారచన; రేఖనం.*

(చూ : *mechanical drawing*)

**drafting paper :** *రేఖాపత్రం.*

ఉత్తమశ్రేణికి చెందిన కాగితం; నీటి తడికి ఇది తట్టుకోగలదు; ఇండియన్ సిరా తోను, పెన్సిల్‌తోను చిత్రించటానికి మిక్కిలి అనువైనది.

**draftsman or draughtsman :** *రేఖాకర్త; సూత్రగ్రాహి.*

1. ఆలేఖన ప్రవీణుడు ఇటువంటి ప్రావీణ్యం, చిత్రరచనా ప్రాశస్త్యపు ముఖ్యాంగాలలో ఒకటి.

2. వాస్తు రూపాలను, యంత్ర రూపాలను గీయటంలో నిపుణుడు.

**drafts manship :** *రేఖాకర్మ.*

**dragging :** *కర్షణం.*

(చూ : *wiping*)

**dragging stroke or scruffing :** *కుంచి కాకర్షణం*

గరుకుగా ఉన్న కాటికపై తైలవర్ణాన్ని కుంచెలతో, తేలికగా వేగంగా ఒకసారి వేయడం. ఇట్లా వేయటంవల్ల రంగు, కాటికపై ఉండే ఎగుడుపైపై మాత్రమే అంటి, లోతుగా ఉండే భాగాలకు అంటదు దీనివల్ల రంగు, కాటికపై సమానంగా అంటక, చిన్న చిన్న మచ్చలుగా కన్పిస్తుంది. ఇది ఒక ప్రక్రియ. దీనిలోని నేర్పు, కొన్నిచోట్ల ఉపయోగకరం.

**dragon's blood :** *ఫలరుధిరం; హింతాళ నిర్యాసం.*

పుష్యరాగపు ఎరుపు కలిగి, పారదర్శకంగా ఉండే ఒక రంగు పదార్థం ఆసియాలోని ఒక విధపు తాళజాతి వృక్షాల ఫలాల నుంచి వచ్చే, యక్షధూపాన్ని పోలిన, రస నిష్యందమే, ఈ పేరుతో వ్యవహృతం. ఇది అచ్ఛంగా ఒక వర్ణద్రవ్యమని చెప్పటానికి అవకాశం లేదు. కాని మధ్యయుగాలలో గ్రంథ చిత్రణలో ఇది ఎక్కువగా వాడబడింది. రోమనుల కాలంలో కూడా ఆసియా నుంచి రోముకు ఈ ఫలరుధిరపు ఎగుమతి విరివిగా జరిగింది.

**draperie mouillee :** *ఆర్ద్ర వస్త్రిత.*

ప్రతిమా శిల్పంలో దుస్తులు శరీరాన్ని అంటుకొన్నట్లుగా ఉండి, అవయవాల ఆకారాన్ని చూపటం.

**drapery :** *పరిచ్ఛదం.*

**draughtsman :** *రేఖాకర్త; సూత్రగ్రాహి.*

**drawer :** *సొరుగు.*

**drawing** (1) **:** *ఆలేఖనం.*

ఒకే ఆయతనం గల ఉపరితలంపై ఆకృతులను, రూపాలను గీయటం. రంగులను, వర్తనమును, పలచటి రంగునీటిని వాడి ఆలే

ఖనంలో వెలుగునీడలు చూపవచ్చు. ఆలేఖనం సంపూర్ణ కళా ప్రక్రియే అయినా, శిల్పాలను రూపొందించటానికి, వర్ణచిత్ర రచనకూ ప్రాతిపదికగా కూడా ఉపయోగిస్తుంది.

ఆలేఖనంలో అనేక సాంకేతిక పద్ధతు లున్నాయి. సన్నని మొనతో రేఖా లావణ్యాన్ని సాధించవచ్చు; లేదా పెన్సిల్ మొనను బద్దవాటుగా చేసి రేఖావర్తనాన్ని సాధించవచ్చు. పెన్సిల్, కుంచె, రంగు సుద్ద, కసికె, కలం, ఇంకా తదితర పరికరాలను ఇందుకు వాడవచ్చు.

ఆలేఖనాలను, వాటి ప్రయోజనాలను బట్టి, రెండు విధాలుగా విభజించవచ్చు. 1. స్వయం పరిపూర్ణమైన ఆలేఖనాలు. 2. వర్ణ చిత్రాలకు ఉపయోగించటానికిగాను గీసేవి. ఇవి గాక మరొకటి స్కెచ్చి;. ఇది అభ్యాసం కోసం గాని, అసంపూర్ణ చిత్రంగా ఉండి, ఒక పరిపూర్ణ చిత్రానికి ఆధారంగా గానీ గీయవచ్చు. ఊహించిగానీ, ఎదురుగా ఉన్న రూపాన్ని చూసిగాని దీన్ని గీయవచ్చు. ఇటువంటి వాటిని 'అనుశీలనములు (*studies*) అంటారు. వ్యంగ్య చిత్రాలుకూడా ఒక విధపు ఆలేఖనములే; అయినా సాధారణపు ఆలేఖనాలలోకన్నా వ్యంగ్య చిత్రం ఎక్కువ వివరాలు తెలియజేస్తుంది.

ముద్రణ పద్ధతులు వచ్చిన తరవాత ఆలేఖనపు ప్రచారం, ఉపయోగం పెరిగినవి.

**drawing (2)** : ఆకృష్టి.

బట్టీనుంచి పింగాణీ పాత్రలను బయటకు తీయటం.

**drawi g board** : *ఆలేఖన ఫలకం; ఆలేఖనా స్తరిక.*

చిత్రాన్ని లిఖించటానికి అనువుగా ఉండటానికై కాగితాన్ని ఉంచే దీర్ఘచతురస్రాకారపు చెక్క పలక. దీన్ని సాధారణంగా 3/4 అంగుళము మందంగల మెత్తని చెక్కపలకతో తయారుచేస్తారు. దీని ఉపరితలం, నునుపుగా, ఎత్తుపల్లాలు లేకుండా ఉండాలి. దీని వెనక భాగంలో కొయ్యబద్దలు బిగిస్తారు. దీని నాలుగు కోణాలలో ఒక్కొక్కటి 90° ఉండాలి.

**darwing curve** : *ఆలేఖావక్రిక*

(చూ : *french curve*)

**drawing from antique, drawing from cast** : *ప్రాక్తన శిల్పాలేఖనం; నిష్పందాలేఖనం.*

పురాతన శిల్పాలనుంచిగానీ, వాటి ప్లాస్టరు పోతలనుంచిగానీ ఆలిఖించటం. ఇది శిక్షణలో భాగంగా, సజీవ వ్యక్తులను ఎదురుగా ఉంచుకొని చిత్రించటానికి ముందు తరగతులలో, కళాశాలలలో, ఉపయోగంలో ఉండేది. ప్రస్తుతం ఇటువంటి అభ్యాసం క్షీణించింది.

**drawiug from the flat** : *చిత్రాలేఖనం.*

వర్ణ చిత్రాలను చూసి, అందులోని రూపాలను రేఖతో గీసే అభ్యాసపద్ధతి.

**drawing from nature** : *ప్రకృతిలేఖనం.*

ప్రకృతి దృశ్యాలను నేరుగా ఆలేఖనం చేయటం. ఆరుబయట, చిత్రించవలసిన దృశ్యానికి ఎదురుగా నిలిచి, కొన్ని వివరాలను చిత్రించుకొని, తరవాతదానిని, కళాకారుడు,

తన చిత్రకాలలో పూర్తి చేసుకోవచ్చు. ఇది స్మృతిజీవన చిత్రణకన్నా వేరైనది. స్మృతిజీవన చిత్రణంలో, చిత్రించే వస్తువులు ఎదురుగా ఉన్నా, వాటి అమరిక, కళాకారుడి ఇచ్ఛ అనుసరించి ఉంటుందేగాని సహజమైందికాదు. ప్రకృతినుంచి నేరుగా ఆలిఖించడం, ఒక వ్యక్తిని ముందుంచుకొని ఆలిఖించటం, శిల్పాన్ని చూసి ఆలిఖించడం అనేవి ఎక్కువగా అభ్యాసకాలంలో ఉపయోగకరాలు.

**drawing pen** : *ఆలేఖిని.*

**drawing table** : *ఆలేఖనపు బల్ల.*

ఆలేఖనానికి అనువైన బల్ల. కావలసినట్లు ఏటవాలుగా తిప్పుకోవటానికి వీలైన పైభాగాన్ని, ఇది కలిగిఉంటుంది. కొన్నింటిలో, ఎత్తును పెంచుకోవటానికి, తగ్గించుకోవటానికి ఏర్పాట్లు ఉంటాయి. ఇది అనేక పరిమాణాలలో లభిస్తుంది. మడచి తీసుకొని పోవటానికి వీలైనవి కూడ వీటిలో ఉన్నాయి.

**draw-out** : *ఆకృష్టం.*

పరీక్షార్థమై కాగితంపై వేసిన రెండు పారదర్శక వర్ణరేఖల నమూనా. ఈ రేఖలు రెండూ, పక్క పక్కన ఉండటంవల్ల పోల్చి చూసుకొనే వీలుంటుంది. రంగులు వేసే కత్తిని శుభ్రపరచి, దానితో కావలసిన తైల వర్ణాన్ని తీసుకొని, తెల్లటి కాగితంపై ఉంచి గీస్తే, ఆ రంగు దానిపై పలచగా పడుతుంది. ఆ స్థితిలో రంగులయొక్క గుణాలను ఛాయలను సులభంగా పరీక్షించవచ్చు.

**dress** : *ఉపస్కరించు.*

శిల్పం చెక్కిన రాతిని ఉలి, సుత్తెవంటి సాధనాలతో నునుపు చేయటం.

**drier** : *శోషకం.*

నూనె రంగులు త్వరగా ఆరిపోవటానికి సహకరించే యౌగికం. తుత్తునాగం, ఇనుము, కోబాల్టు, మాంగనీజు వంటి కొన్ని లోహాలను అవిసెనూనెలో కలిపి, అత్యధిక ఉష్ణోగ్రతలో కరగిస్తే ఇది తయారవుతుంది. దీనిని స్వల్పంగా తైలవర్ణంలో కలిపిన, ఆ వర్ణాన్ని చిత్రంపై వేసినప్పుడు, అది త్వరితంగా ఎండి గట్టిపడుతుంది. ప్రస్తుతం శోషకాన్ని నఫ్తాలీనునుంచి తయారు చేస్తున్నారు. కోబాల్టుతో తయారుచేసిన శోషకం అత్యుత్తమం. దీనినే కళాకారులు ఉపయోగించే తైలవర్ణాలలో వాడుతున్నారు. కొన్ని వర్ణద్రవ్యాలకు సహజంగా త్వరితంగా ఆరిపోయే గుణమూ, మరికొన్నిటికి ఆలస్యంగా ఆరిపోయే గుణమూ ఉన్నాయి.

**drill** : *వేధని.*

**drollery** : *నర్మచిత్రం.*

హాస్యజనకమైన చిత్రం. జంతువులు, మనుష్యులలాగా దుస్తులు ధరించి, మనుష్యులవలె ప్రవర్తించడం ఇందులో కనపడుతుంది.

**drop black** : *ఘుటికా కాలిమ.*

ద్రాక్షాసితం (*vine black*)లో ఒక స్థాయీభేదంగా పరిగణించాల్సిన ఒక పారిశ్రామికోత్పన్నం. కణికలుగా లేదా ఘుటికలుగానో ఇది బజారులో లభిస్తుంది. దీనికే ఫ్రాంక్‌ఫర్ట్ కాలిమ, జర్మన్ కాలిమ అనే పర్యాయనామాలు కూడా ఉన్నాయి. 19వ శతాబ్దిలో చాలా రీతుల ఘుటికా వర్ణద్రవ్యాలు అమ్మకానికి లభించేవి.

**drop** : *వర్జితం.*

ఫోటో-ఎన్‌గ్రేవింగ్ పద్ధతిలో చుక్కలతో వర్తనముండే కొన్ని భాగాలను కాంతి భేదక ద్రవంతో కప్పటం. ఇట్లా ఫిలింపైనా చేయవచ్చు. లేదా దానినుంచి తీసిన లోహ ఫలకంపై చుక్కలను, వాడిఅయిన సాధనంతో గోకివేయవచ్చు. ఇట్లా చేసినవాటిని హైలైటు హాఫ్‌టోను అని కూడా అంటారు.

**dropper** : *బిందు పాతిని*

**drop pigment** : *వర్ణ ఘుటిక.*

గోలీలలాగా, లేదా శంకువులలాగా తయారు చేసిన వర్ణద్రవ్యాలు. ఇవి మెత్తగాఉండి, సులభంగా రంగును తయారు చేయటానికి అనువుగా ఉంటాయి వీటినే నలువంకల బిళ్లల మాదిరిగా, కడ్డీలలాగా కూడా తయారుచేసేవారు, ప్రస్తుతం ఇవి తయారు కావటం లేదు.

**dry** : *శుష్క.*

**dry (v)** ; *శుష్కించు; శోషించు.*

**dryad** : *వృక్షకి; వృక్షదేవత*

**dry-brush painting** : *నిరార్ద్ర కుంచికా చిత్రణ.*

కుంచెకు అంటిన రంగును చాలా భాగం తుడిచివేసి, కుంచెను ఉపయోగించటం ఇట్లా చేసినప్పుడు పొరలుగా వస్తుంది. కుంచెను అడ్డవాటుగా వాల్చి, వేగంగా కదిల్చినా ఈ విధంగానే వస్తుంది.

**dry colour** : *పొడి రంగు*

పొడి రూపంలో ఉండే రంగు; పరిశ్రమలలో వీటిని వాడతారు.

**dryfoot** : *అడుగు తుడుపు.*

మెరుగు పెట్టటానికి ముందు పింగాణి పాత్రల అడుగు భాగంలో మెరుగు ద్రవ్యాన్ని తుడిచివేయటం. దీని వల్ల కాల్చిన తర్వాత, ఆ భాగానికి మెరుగుపట్టదు.

**drying oil** : *శోషక తైలం.*

అచ్చంగా స్వచ్ఛరూపంలోగానీ, లేదా శోషకం (*dryer*)గా వినియుక్తమయ్యే ఒక లోహలవణంతో కలిపిగానీ, సన్ననిపొరగా పట్టించినప్పుడు, గట్టిగా తోలుపొరలాగా ఘనీభవించే స్వభావంగల, ఏ వనస్పతి తైలమైనా ఈ పేరుతో వ్యవహృతం. ఈ ధర్మంవల్ల ఇటువంటి తైలాలకు పూతరంగులలోను, వార్నిషులలోను వాడుక ఉంది. ఇటువంటి శోషకతైలాలలో అవిసెనూనె, అక్రోటు నూనె, గంజాయిత్తుల నూనె, కుసుమ నూనె అనేవి కళాకారుల వర్ణాలలో వాడుకలో ఉన్నాయి ఇంత ఎక్కువగా కాకపోయినా జనప గింజలనూనె, లంబగోనూనె, పొగాకుగింజల నూనె, పెరిల్లా నూనె కూడా కొంతవరకు వర్ణాలలో వాడబడుతున్నాయి.

(చూ: *sun-refined oil*)

**drying time** : *శోషణ వ్యవధి.*

**dry mounting**: *అలేపన, సమారోపం.*

తెల్లని అట్టపై చిత్రాలను, ఫోటోగ్రాఫులను అతికించే విధానాలలో ఒకటి. దీనికి జిగురు, పిండి వంటివాటిని వాడక, ఒక రకమైన వలపని రబ్బరువంటి పొరను (డ్రయి మౌంటింగు టిస్స్యూను) రెండింటి మధ్య ఉంచి, ఒత్తిడి కలిగిస్తారు. దానిపై ఇస్త్రీ పెట్టెవంటి వేడి ఒత్తుడు యంత్రాన్ని ఉపయో

గించి ఒత్తుతారు. దీని వల్ల చిత్రం అట్టకు చక్కగా అంటుకొని ఉంటుంది. ఇటువంటి సమారోపణ, కొన్ని సమయాలలో చిత్రాన్ని తిరిగితీసివేయటానికి అనువైన రీతిలోనూ, కొన్నిసమయాంలో తీసివేయుటానికి వీలుగాని పద్ధతిలోను జరుగుతుంది.

**dry mounting press:** *అలేప సమారోపకం*

**dry mouning tissue ;** *అట్టతుకు పొర.*

వలుచని రబ్బరుపొర లాగా ఉండే జిగురు పదార్థం చిత్రాలను అట్టలపై అతికించ టానికి ఉపయోగపడుతుంది.

**dry painting :** *ఆలేఖికా చిత్రణ.*

(చూ. *linear*)

**dry point :** *సూచీ ప్రక్రియ.*

అంతఃపాతి (*intaglio*) పద్ధతిన ముద్రిం చటానికి లోహఫలకంపై సూదిమొనగల సాధనంతో గీయటం. ఇట్లా ముద్రించిన చిత్రా లకూ ఈ పేరునే వాడటంఉంది. దీనిలో మొట్ట మొదటి ముద్రణ చక్కగా ఉంటుంది. తర వాత ముద్రించిన చిత్రాలలో రానురాను సూదిమొన గీతలు పూడిపోతాయి అందువల్ల ఈ ప్రక్రియలలో 20నుంచి 30 వరకు మాత్రమే ప్రతులను తీయటం సాధ్యమౌ తుంది. ఇట్లా ముద్రించిన వాటిలో ప్రతివాని పైనా, అది ఎన్నో ముద్రణ అయిందీ ఉంటుంది.

**dry quality:** *అరసికత.*

**Duco :** *డూకో.*

ఇండ్లలోను, పరిశ్రమలలోను వాడబడే పర్ణాలలో ప్రశస్తమైన కొన్నిటి వ్యాపార నామం. మోటారుకారులకు డూకోలక్క పర్ణాలు వాడతారు. కొందరు కళాకారులు వీటిని వాడడం కూడా ఉంది; కాని కళాకారుల పర్ణా లాగా ఇవి మన్నికలవి కావు.

**ductile :** *సువర్తేయం*

**dull (colour)** *క్లాన్త (వర్ణం); జడమైన.*

**dunt :** *వలిపగులు*

పింగాణి పాత్రను బట్టీలో కాల్చిన తరు వాత, దానిని విపరీతపు తొందరతో చల్లబరచ టం వల్ల కలిగే పగులు.

**Dunville stone :** *డన్ విల్లీ శిల.*

మంచి రవకుదిరిక కలిగి, పనితనానికి సులభంగా వొదిగేవచ్చే ఒక సికతాశిల. అది దొరికే ప్రదేశాన్నిబట్టి, దానికి ఆ పేరు వచ్చింది. లేత గోపీరంగు నుంచి, మీగడ రంగు వరకు గల వర్ణ విస్తృతిలో ఈ శిల లభిస్తుంది. గని నుంచి బయటకు తీసి నప్పుడు, ఇది కొంత మృదువుగా ఉంటుంది. కాని గాలిపలన చెమ్మదనం ఇగిరిపోయి క్రమంగా గట్టిదేలుతుంది.

**duplicate :** *ప్రతికృతి.*

**Dusseldorf school :** *డ్యూసెల్ డాఫ్ సంప్రదాయం.*

1767లో, జర్మనీలోని డ్యూసెల్‌డాఫ్ నగ రంలో సంస్థాపితమైన కళాపరిషత్తు. 1830-40 మధ్య ఈ పరిషత్తులోని కళాకారులు చిత్రించిన చిత్రాలు విశేషఖ్యాతి నార్జించాయి. నాజరీన్ కళాకారుల సంప్రదాయాన్ని అను సరించిన కాల్పనిక వాదపు ప్రకృతి దృశ్యా లతో కూడిన ప్రకాశీవన చిత్రణ, వీరి ప్రత్యే

కళ. ఈ కళాకారులు పొందిన శిక్షణకూడా క్లిష్టతరం. వీరి చిత్రాల ప్రభావం అమెరికా వరకూ పాకింది.

**dust box :** *ధూళిపేటిక.*

ముద్రణకు ఉపయోగించే లోహ ఫలకంపై, మెత్తటి యక్షధూపపు పొడిని చల్లటానికి అనువుగా, ఆ ఫలకాన్ని పెట్టి ఉంచే చెక్కపెట్టె. ఈ పేటికల్లో అనేక రకాలున్నాయి. వీటిలో మిక్కిలి సులభమైంది గాలి చొరని పొరచెక్క (*plywood*) పెట్టె. సుమారు 8 అడుగుల ఎత్తును, సమంగా 18 20 అంగుళాల పొడుగు, వెడల్పులు ఈ పెట్టెకుంటాయి. పెట్టె అడుగుభాగానికి దగ్గరగా ఒకవక్కన రెండు అంగుళాల సందున్నూ, దానికి ఒక మడతమూందు తలుపున్నూ అమరిఉంటాయి. ఈ పెట్టెలో 4 ఔన్సులకు మించకుండా, యక్షధూపపు పొడిని వేసి, పెట్టెను వేగంగా అటు ఇటు కదిపి, కుదిపి, కింద పెడతారు. రెండు నిమిషాల తరవాత లోహఫలకాన్ని ఒక పొర చెక్కపై ఉంచి, పైన చెప్పిన సందు ద్వారా ప్రవేశపెడతారు. అప్పటికీ పెట్టెలో నాలుగు మూలలకూ చేరక, ఎగురుతున్న యక్షధూపపు రేణువులు ఫలకపు పైభాగంపై అంటుకొంటాయి. ఫలకంపై గరుకుతనం కావలసిన ఆవశ్యకతను బట్టి, రసాయన ప్రక్రియలో క్షీణింపజేయ వలసిన తీరును బట్టి, ఈ ఫలకాన్ని పెట్టెలో ఉంచవలసిన వ్యవధిని నిర్ణయిస్తారు.

**dusting brush :** *బద్ద కుంచె.*

పొడుగుపాటి, గరుకు రోమాలతో బద్దవాటుగా తయారుచేసిన కుంచె. పెన్సిల్ గీతలను రబ్బరుతో చెరిపినప్పుడు, ఆలేఖన పత్రంపై వడే తునకలను, తుడిచివేయటానికి పనికివచ్చే సాధనం.

**Dutch Caravaggism :** *డచ్చి కారవాగ్గి వాదం.*

డచ్చి చిత్రకళలో 17 వ శతాబ్ది పూర్వార్థంలో వర్ధిల్లిన ఉద్యమం. ఇటాలియన్ చిత్రకారుడు కారవాగ్గియో రచించిన చిత్రాలు ఈ ఉద్యమానికి ఆదర్శాలైనాయి.

**Dutch metal :** *డచ్చిలోహం.*

తగరం తక్కువపాలుగా కలిగిన ఇత్తడి. దీనిని పలచని రేకులుగా తయారుచేసి, బంగారు రేకుకు మారుగా అలంకరణలో వాడతారు. దీనిని లోహపత్రం (*metal-leaf*), సంవిధాన పత్రం (*composition-leaf*), (కాంస్యపత్రం) (*bronze leaf*) అని కూడా వ్యవహరిస్తారు. ఇది త్వరగా నల్లబడకుండా వుండటానికి, దీనిపై వార్నీషు వంటి మెరుగుపూత పూయవలసి ఉంటుంది. దీనిని సాధారణంగా గృహోపకరణాలపైనా, చిత్రాల చట్టాలపైనా వాడతారు. కాని చిత్రరచనలో వాడటానికి పనికిరాదు.

**dutch mordant :** *డచ్చి ఖాదకం.*

లోహఫలకాలపై సూచీ చిక్కణం (ఎచ్చింగు)లో ఉపయోగించే, పొటాషియం క్లోరేట్, హైడ్రో క్లోరిక్ ద్రావకాల సమ్మిశ్ర ద్రావణం. ఈ ద్రావణంతో, లోహ ఫలకాలపై ఎంతో సన్నటి రేఖలు సృష్టించవచ్చు. దీన్ని తామ్ర ఫలకాలపై ఉపయోగిస్తారు.

స్మిల్లీ ద్రావణం (*smillie's bath*) అనేది కూడా ఇటువంటి దేకాని దీనికంటే అధికశక్తి కలది.

**dutch pink** : *డచ్చిపాటలి.*

బంగారు పసిమి రంగుక, పారదర్శకంగా ఉండే, ఒక పసుపుపచ్చని రంజక వర్ణద్రవ్యం. ఒక విధపు రేగుచెట్లనుంచి లభించే దోరవండ్లను ఎండబెట్టి, వాటినుంచి ఈవర్ణద్రవ్యాన్ని తయారుచేస్తారు. దీని రంగు మన్నిక తక్కువే అయినప్పటికి, కళాకారుల వర్ణద్రవ్యంగా, 16 వ శతాబ్ది మొదలుగా అలంకారిక చిత్రణలో, ఇది విరివిగ వాడుక కెక్కింది. 20 శతాబ్ది తొలికాలంలో కూడా కొంతవరకు దీన్ని కొందరు అభిమానించారు.

**dutch-process white lead** : *డచ్చి తయారీ తెల్లసీసం.*

తెల్లసీసానికిని వేరొక పేరు. సీసలోహాన్ని సిరక (*vinegar*) ంచేతగానీ, లేదా అసెటిక్ ఆమ్లం చేతగానీ సంక్షారణ (*corrode*) చేయటం వల్ల ఈ తెల్లసీసం లభిస్తుంది. ఈ ప్రక్రియ, ప్రాచీన గ్రీకుల కాలానికే వ్యాప్తిలో ఉండేది.

**dutch white** : *డచ్చి శ్వేతం.*

ప్రామాణీకరణ పొందకుండానే, వ్యాప్తిలో ఉన్న ఒక పదవిశేషం. ఒక విధపు మృత్తికకూ, స్వచ్ఛమైన తెల్లసీసానికి, ఒక ప్రత్యేక విధపు చౌకబారు తెల్లసీసానికి ఈ పేరును ఇష్టంవచ్చినట్లు వాడుతున్నారు.

**dyer** : *రంగరీజు; రంగుల పనివాడు.*

**dyes; dyestuffs** : *రంగద్రవ్యాలు; అద్దకం రంగులు.*

ద్రావపదార్థాలలో పూర్తిగా కరిగే స్వభావం కల రంగులు. వస్త్రాలపై అద్దకానికీ కొన్ని వర్ణపదార్థాల (*pigments*) తయారీకి వీన్ని. వాడతారు. సహజ రంగుద్రవ్యాలు, వృక్షాల నుంచి జంతువులనుంచి ఉత్పత్తి అవుతాయి. సంయోజితరంగ ద్రవ్యాలు, బొగ్గుతారు మొదలైన వాటినుంచి తయారవుతున్నాయి. ఈ కృత్రిమ రంగు ద్రవ్యాలే, ఈ కాలంలో, సహజ రంగద్రవ్యాల స్థానాన్ని ఆక్రమించాయి. రంగు ద్రవ్యాలు, వర్ణ పదార్థాలకన్నా వేరైనవి. వర్ణ పదార్థాలు నీటిలో కరగక, ఒక ఉపరితలంలో వ్యాపించి, ఆ తలానికి రంగు నిస్తున్నాయి.

**dynamic symmetry** : *చైతన్య సమ్మితి.*

ప్రాచీన కాలపు కళలో వాడుకలో ఉన్నట్లు సంభావితమైన పద్ధతి. ప్రాచీన ఈజిప్టు వాసులూ, గ్రీకులూ తమ కళాఖండాల రచనలలో ఇటువంటి ప్రమాణాన్ని పాటించినట్లు జేహేమ్బిడ్జి (1867-1924) అనే అతడు తాను రచించిన 'డైనమిక్ సిమెట్రీ' గ్రంథలో సిద్ధాంతీకరించాడు. సిద్ధాంతాన్ని బట్టి, ఒక చిత్రంలో సమ్మితి, ఆ చిత్రంలోని కేంద్రానికిన్నీ, నాలుగు ప్రక్కల ఉండే భాగాలకూ గల పరస్పర సంబంధాన్నిబట్టి ఉంటుంది. చిత్రంలోని ఒక భాగంలో రేఖలు ఇంకొక భాగంలోని రేఖలతో సమానంగా లేక పోయినా, కేంద్రానికి నాలుగు ప్రక్కల నిర్దిష్టంగా వర్ణ భాగాలుంటే చాలు. ఈ సిద్ధాంతానికి ఇతడు ప్రకృతిలోని కొన్ని సహజాకృతులను ఆధారంగా గ్రహించాడు.

**dynamism** : *ద్రుతత్వం, చైతన్యం.*

**early Christian art** : *పూర్వ క్రైస్తవ కళ.*

క్రీ.శ. 800 మొదలుగా 750 వరకు, క్రైస్తవ దేశాలలో- అందునా ముఖ్యంగా ఇటలీ, పశ్చిమ మధ్యధరాసముద్ర ప్రాంతాలలో- వర్ధిల్లిన క్రైస్తవ కళ. ఈ యుగానికి తరువాతది మధ్యయుగపు కళ.

**earth colours** : *మృత్తికా వర్ణాలు; మృద్వర్ణాలు; మట్టి రంగులు.*

భూమిలో సహజంగా లభించే వేర్వేరు రంగుల మట్టితోను, రాళ్ళతోను తయారుచేసే రంగులు. వీటిని వర్ణద్రవ్యాలలోనే చేర్చి, ఖనిజవర్ణద్రవ్యాలనే (*mineral pigments*) ఒక వర్గంగా కొందరు పేర్కొంటారు.

**earthenware** : *కౌలాలక సామగ్రి.*

2000° ఫా. ఉష్ణోగ్రతకు తగ్గిన స్థాయిలో కాల్చిన, కాంత్యభేద్యమైన పింగాణి సామగ్రి. ఇది ముదురు పింగాణి (*porcelain*) కన్న వేరైంది. ఆ ముదురు పింగాణి, 2000° ఫా. పైబడ్డ ఉష్ణోగ్రతవల్ల తయారవుతుంది.

**earthenware clay** : *కుండమట్టి.*

**easel** : *సారణి.*

చిత్రకారుడు చిత్రఫలకాన్ని, లేదా శాటికను పెట్టుకొని చిత్రరచన సాగించటానికి ఉపకరించే, నిచ్చెనవంటి సాధనం. చిత్రశాల (స్టూడియో)లో వాడే సారణికి నాలుగు గట్టి కొయ్యబద్దీలతో ఏర్పరచిన చట్టం ఉంటుంది. ఈ చట్టం చతురస్ర రూపంలో ఉంటుంది. దీనిక్రింది భాగం నేలపై స్థిరంగా ఉండటానికి, అడ్డంగా కమ్మీలను బిగిస్తారు. దీని మధ్య భాగంలో ఫలకాన్ని వాల్చటానికి అడ్డంగా ఒకచెక్కను బిగిస్తారు. దీనిమీద ఫలకముంచి చిత్రించటానికి వీలుగా ఉంటుంది. అడ్డంగా ఉండే చెక్కను క్రిందికీ, మీదికీ, జరపటానికి అనువుగా గాడి ఉంటుంది. చట్టాన్ని కావలసిన స్థానంలో బిగించుకోటానికి దీనివల్ల వీలుంటుంది.

దీనిని వహనీయ సారణి (*portable-easel*) అంటారు ఇంకొక రకపు సారణి కావలసిన చోటికి తీసుకొని పోవటానికి అనువుగా ఉంటుంది. దీనికి ముందు రెండు నిలువు కమ్ములు, వెనుక మడతబందుతో బిగించిన ఇంకొక కమ్మి ఉంటాయి. ముందు భాగంలోని రెండు కమ్ములకూ, కొయ్యమేకులు దూర్చటానికి అనువుగా రంధ్రాలుంటాయి. ఈ రంధ్రాలలో కొయ్యమేకులు బిగించి, వాటిపై ఫలకాన్ని వాల్చి చిత్రించవచ్చు. దీనిని మడచి తీసుకొనిపోవచ్చును.

**easel painting** : *సారణిక చిత్రణ.*

సారణిపై ఉంచి సాగించే, సర్జనాత్మకమైన తైల, జలవర్ణ చిత్రం. భిత్తి చిత్రాలు, అలంకరణ చిత్రాలు, గ్రంథచిత్రాలు, వాణిజ్య చిత్రాలకన్న ఇది వేరైనది.

**ebauche** : *తైలోపాధి.*

తైలవర్ణాలతో చిత్రించేటప్పుడు చేసే ప్రాథమిక చిత్రణ. ముందుగా తైలవర్ణాలతో గీసే రూపరేఖ (*sketch*) కూడా ఇటువంటిదే.

**ebony** : *కుదారం.*

మృదువైన రవకుదిరిక కలిగి నలుపుగా, సాంద్రంగా ఉండే వివిధ రీతుల కఠిన దారు

పులలో ప్రతియొకటి. ఈ పేరు స్వప్న హ్నాతం. ఈ రకపు కొయ్యకు మన్నిక చాలా ఎక్కువ; కాని దాని అతిదృఢత, శిల్పక్రియకు కొంతవరకు కష్టదాయకంగా ఉంటుంది. ఇటువంటి వాటిలో, ఆఫ్రికా దేశపు గేబూన్ కుదారం, ఇండియా శ్రీలంక లలో లభించే కుదారం ఎంతో ప్రశస్తమైనవి. ఇవి వాటి ముదురు నలుపుకు పేరొందాయి. తక్కిన రకాలలో నలుపుదనం తక్కువ; తక్కిన రంగుల చారలు అక్కడక్కడ ఉంటాయి; అయినా కొన్ని అలంకరణ ప్రక్రియలలో వాటికి కూడా కొంత వాడుక ఉంది.

**echoppe :** *బద్ద సూది.*

చివరన అండరేఖాకారంగా ఉండే మొన గల సూది. సూచీచిత్రణలో రేఖలను కొంచెం మందంగా చేయటానికి ఇది ఉపక రిస్తుంది. మొదట సూది మొనతో గీసిన గీతపై, దీంతో మళ్ళీ గీస్తే, గీత కొంచెం వెడల్పుగాను, నునుపుగానూ తయారవుతుంది. రేఖలో కొంత భాగం ఎక్కువ మందమెక్కి, తక్కింది కొనదేలునట్లు చేయటానికూడా ఇది ఉపకరిస్తుంది.

**eclecticism :** *సంచరణ వాదం.*

వేర్వేరు కళాకారుల చిత్రాలనుంచి, వేర్వేరు తీరుల సంప్రదాయాలనుంచి స్వీక రించిన పద్ధతులను కలిపి చిత్రించటం. సిద్ధాంతరీత్యా చాలామంది కళాకారుల విభిన్న శైలీ సంప్రదాయాలనుంచి, మంచిని స్వీక రించి, కళాకారుడు తన చిత్రాన్ని, వాటి నన్నింటిని మించేట్లు తయారు చేయటానికి ఈ వాదం ఉపకరిస్తుంది. ఇటువంటి ప్రయ త్నాలు అన్ని కళాయుగాలలోను జరి గాయి. ఇట్లా రచింపబడ్డ చిత్రాలలో కొన్ని మంచివి ఉన్నా, చాలావరకు వ్యర్థప్రయత్నాలే. ఎట్రస్కన్, హెలెనీయ, రోమన్, బైజాం టెయిన్, రోమనస్క్, రీతి సంప్రదాయాల కళారూపాలలో కూడా ఈ వాదపు బలిమి కాన వస్తుంది.

**ecorche :** *నిశ్చర్మకము*

చర్మం ఒలిచిన మానవ, జంతు శరీరాల ఆలేఖనం, లేదా మూర్తిశిల్పం; కళా శిక్ష ణంలో అవయవ నిర్మాణాన్ని తెలుసుకోవ టానికి ఇది ఉపయోగిస్తుంది.

**ectype :** *ప్రతిరచన.*

ఒక చిత్రంనుంచి తయారుచేసిన నకలు

**edition :** *సంప్రదానం; ప్రచురణ.*

**editor :** *సంప్రదాత ; సంపాదకుడు.*

**effect :** *ఘటన; నిష్పన్నం; పరిణామం; అనువృత్తం.*

**efflorescence :** *లవణపాండువు.*

దీపపు మసితో చేసే నలుపురంగు, దంతం నుంచి తయారయ్యే తెల్లని బూజు. ఇది ఉప్పునల్ల కలుగుతుంది.

**egg and dart :** *అండ శిలీముఖం.*

అండాకారమూ, దానిని ఆనుకొని బాణపు ములికి రూపమును వరసగా అమర్చిన అధి కోల్బణరీతి అలంకరణం. గ్రీకు వాస్తు శిల్పా లలో తరచుగా ఇది కన్పిస్తుంది.

**egg and oil tempera :** *గుడ్డు, నూనె కలలు; అండతైల కలలం.*

**egg tempera :** *అండ నిర్యాసిక; అండ కలలం.*

5° కి గుడ్డుసొనను బంధకంగా ఉపయోగించిన కలల (టెంపెరా) వర్ణం.

**egg, use in painting :** *గ్రుడ్డు (అండం), చిత్రణలోని ఉపయోగం.*

గ్రుడ్డుసొన, లేదా అండనిర్యాసం (*egg-yolk*), సాంప్రదాయికంగా కలల వర్ణ మాధ్యమంగా వాడుకలో ఉన్నది నీటిలో వర్ణ ద్రవ్యాలతో సహా, అండనిర్యాసాన్ని కలిపి, ఎండా, గాలీ దానికి తగిలేట్లు చేసినప్పుడు అది గట్టిగా, చర్మరీతిలో పొరదేరి అతుక్కొని ఉంటుంది ఈ లక్షణం దీనిలో ఉండడంవల్లనే, శతాబ్దాల తరబడిగా, పూతరంగు పొరలన్నిటా. చాలా మన్నికకల దిగా పేరొందింది. అండకలల వర్ణంలో గ్రుడ్డుసొనను మాత్రమే వాడి గ్రుడ్డు తెలుపును పారవేస్తారు, కాని అండతైల కలల (*egg-and oil tempera*) చిత్రణలో మొత్తం గ్రుడ్డు అంతటినీ వాడతారు.

**egg yolk :** *అండనిర్యాసం; గ్రుడ్డుసొన*

(చూ : *egg, use in painting*)

**Eyptian blue :** *ఈజిప్టు నీలిమ*

అనేకమైన కాపర్ సిలికేట్ల మిశ్రమం అయిన ఒక వర్ణద్రవ్యం. ప్రాచీన ఈజిప్టులో ఇది మొదట వాడుకలో ఉండేదది ఆ ప్రాచీ దేశంలో కుడ్య చిత్రాలలో నీలిమను, హరితాన్ని రూపొందించటానికి ఈ వర్ణద్రవ్యాన్ని విస్తారంగా వాడటం జరిగింది ఆ కాలంపు తక్కిన నాగరిక దేశాలకుకూడా, ఈజిప్ట్ నుంచే ఇది ఎగుమతి అవుతుండేది. తరవాత ఈ ప్రక్రియా రహస్యాన్ని ఈజిప్టువాసుల నుంచి గ్రహించి ఇటలీవారు పాంపీ నీలిమ అనే పేరుతో దీన్ని తయారుచేయటం ప్రారంభించారు ప్రస్తుతం రాసాయనిక సంయోజనం ద్వారా ఈ వర్ణద్రవ్యాన్ని పోలినవి తయారవుతూ ఉండటంవల్ల, ఈజిప్టు నీలిమ వాడుక చాలావరకు అంతరించింది

**Egyptian brown :** *ఈజిప్ట్ కపిశం*

(చూ : *mummy*)

**Egyptian art :** *ఈజిప్టు కళ.*

పురాతనకాలంలో క్రీ పూ. 3000 నుంచి క్రీ.పూ 332లో అలెగ్జాండరు దండయాత్ర వరకు) ఈజిప్టులో వర్ధిల్లిన కళ. శ్మశానాలలో స్మారక విగ్రహాలతో, స్మృత్యంకితాలతో, మొదట ఈ కళ ఆరంభమైంది ఫారోలని వ్యవహృతులయ్యే ఆ దేశపురాజుల సమాధులపైనా, తక్కిన చిన్న సమాధులపైనా మొదట ఈ విధమైన అలంకరణ ఉండేది. (ఈ సమాధులనే పిరమిడ్లు అంటారు) ప్రతి సమాధిలోనూ మృతిచెందిన వ్యక్తియొక్క ఆత్మ మూర్తి, చిత్రం, అతను జీవితకాలంలో ఉపయోగించిన సామగ్రి వుండేవి అవి ప్రాణం విడిచినవారికై నిదిరంగులతో రూపొందించాలి. చనిపోయిన తరవాత నిత్యజీవితానికన్నీ సుఖానికన్నీ సంబంధించిన దృశ్యాల ప్రాధాన్యం పెంచి చేసి వేలకొద్ది సంవత్సరాలుగా తమననలని వాతావరణంలో దాగి, వదిలుకోతో చుడిచినా, ఇవి చెరిగిపోని ఆ ఈజిప్షుదేశపు ప్రాచీన చిత్రకారులు ఈ చిత్రాలకై వాడిన వర్ణద్రవ్యాలు మనకు తెలిసినవే అయినా, ఏయే బంధకములను ఎట్లా వాడియుండిరో

తెలుసుకోవటం ఇప్పటికీ సాధ్యం కాలేదు. పాలను, మొక్కల రసాన్ని, జిగురును వాళ్ళు బంధకాలుగా వాడినట్లు అర్థమయినా, వాటిని ఏ రీతిగా వాడిందీ తెలియరావటంలేదు. సమాధులపై మలచిన ఉల్బణ శిల్పాలపై కూడా, రంగులను ఆ కాలాన చిత్రించేవారు.

ఈజిప్టుదేశపు ప్రాచీన శిల్పంలో అత్యధిక ప్రశస్తి నార్జించినవి అక్కడి పృథుల మూర్తిశిల్పాలు. సహజత కల్పించటానికై వాటిపై కూడా రంగులు వేసేవారు. ఆ కళాకారులు బంగారంతోను దంతంతోను వస్తువులు తయారుచేయటంలోను, మెరుగుపెట్టిన మట్టిపాత్రలను తయరుచేయటంలోను సిద్ధహస్తులు.

**Egyptian paste :** *ఈజిప్టు పిష్టిక.*

ప్రాచీన ఈజిప్టులో తయారై స్వయం ద్యుతికమైన ఒకవిధపు మార్దవ సామగ్రి. ముడిరాగి ఖనిజపు పొడి, సోడాభస్మం లేదా సోడియం లవణాలూ, కొన్ని విధాలైన మృత్తికలూ ఇందులో బహుళః చేరి ఉంటాయి. ఈపిష్టికతో పరువును బిళ్లలను, కొన్ని మూర్తులను ఈజిప్టువాసులు, మొదటి రాజసంశవు కాలం (క్రీ. పూ. 3200-2980) నాటికే రచింపనేర్చారని తెలుస్తున్నది.

**Egyptian taste :** *ఈజిప్షీయ కళాభిరుచి.*

19వ శతాబ్దంలో, పశ్చిమ యూరపులో ప్రాచీన ఈజిప్టులోని కళారీతులను అభిమానించి, అనుకరించి ప్రోత్సాహాన్ని రేకెత్తించే ఒక ఉద్యమం సాగినది. కొందరు తమ భవనములలో కొన్ని గదులను, ప్రాచీన ఈజిప్టువాసుల రీతిలోనే అలంకరించటం, భూషణాలతో కూడా ఆ ప్రాచీన రీతులను అనుకరించటం కొంతకాలం సాగింది.

**Eight, the :** *అష్టకం.*

20 శతాబ్ది ప్రారంభంలో, ఒక సంఘంగా ఏర్పడ్డ, ఎనిమిది మంది అమెరికన్ ఆఖ్యాయికా చిత్రకారుల సాంకేతిక నామం. ఈ సంఘాన్ని హేళన పూర్వకంగా భస్మపాత్ర సంప్రదాయం (*Ashcan school*) అని కూడా వ్యవహరించేవారు. సామాన్యమైన నగర దృశ్యాలను, నిత్యజీవనాన్ని వీరు చిత్రించి, కాల్పనిక భావాలకు స్థానమివ్వక పోవటం వల్లనే యీ హేళన పూర్వకమైన పేరు వచ్చింది వీరికి. వీరి చిత్రాలు, ఛాందసులైన కళాకారులకు అనుదాత్తంగా కనపడ్డాయి.

**elaborately :** *సువరిష్కృత రీతిలో.*

**elaborate palette :** *విపుల వర్ణ ఫలకం.*

**elasticity :** *స్థితిస్థాపక శక్తి.*

**electrolysis :** *విద్యుద్విశ్లేషణ.*

**electronic circuit :** *వైద్యుతిక వివర్తనం.*

**electroplating :** *విద్యుత్ లేపనం; విద్యుద్ద్రవణనం; విద్యుల్లేపనం.*

ఒక ఉపరితలానికి, లేదా ఒక వస్తువుకు లోహపు పై పొరను వేయటానికి పనికి వచ్చే ఒక విద్యుద్రాసాయనిక ప్రక్రియ. ఈ ప్రక్రియలో, ఒక లవణద్రావణంలో కుదురు కొనజేసిన ఒక విద్యుత్ప్రవాహం, లోహాన్ని వేరుపరచి, దాన్ని ఇంకొక లోహంపైనో లేదా అదివరకే యాంత్రికంగా ఒక లోహం

వల్లనో లేదా గ్రాఫైట్‌తోనో పూతవడి యున్న లోహతలంపైనో నిక్షిప్తం చేయటం జరుగుతుందని సంక్షిప్తంగా చెప్పవచ్చు. లోహశిల్పంలో సాధారణంగా తక్కువలోహం తో-అంటే ఇత్తడి, రాగి మొదలైన వానితో-నిర్మితమైన శిల్పాలపై బంగారునో, వెండినో పూయటానికి ఈ ప్రక్రియను వాడుతున్నారు. 19వ శతాబ్దిలో ఈ ప్రక్రియను కనుక్కొన్నారు. మొదట గ్రాఫైట్‌నో, ఇంకో వేరొక అల్ప లోహాన్నో లక్క, కొయ్య శిల్పాలకు యాంత్రికంగా పూసి దానిపై బంగారు, వెండి పూతలను ఈ ప్రక్రియతో పూయటం జరుగుతున్నది.

**electrum** : *తెల్లబంగారము (వెండి, బంగారం కలిసిన మిశ్రలోహం)*

**elementarism** : *ప్రాథమికతా వాదం*

నవ్య కల్పనవాదం (*Neo-plasticism*) లో వచ్చిన ఒక విధపు మార్పు వల్ల ఈవాదం రూపొందింది. వాన్ డోస్‌బర్గ్, దీన్ని 1920 లలో ప్రారంభించాడు. నవ్య కల్పన వాదం లోని సమకోణతకు అంటిపెట్టుకొని కూడా, అందులోని క్షితిజ-లంబరేఖల సంబంధాన్ని అంతగా పాటించని రీతిలో దీన్ని అతడు రూపొందించాడు.

**elements of architecture** : *వాస్త్వంగాలు.*

**elephant's ear** : *గజ కర్ణిక.*

తూర్పు మధ్యధరా సముద్రంలో లభించే మెత్తటి, వెదల్పయిన స్పాంజి మృణ్మయ పాత్రలు నునుపు చేయటానికి దీన్ని వాడతారు.

**Eleusinian marble** : *యలూసినీయ చంద్రశిల.*

గ్రీసు దేశంలో అట్టికా ప్రాంతంలో లభించే ఒక విధమైన రమణీయ చంద్రశిల. ఇది నలుపు రంగులో ఉంటుంది. భవనాల పట్టబంధం (*frieze*) లోను, అంతరలంకరణలోను, ఇది చక్కగా వనికి వస్తుందని ప్రాచీన గ్రీకులు భావించేవారు.

**elevation** : *ఉన్నతిరేఖ.*

వాస్తు శిల్పపు ఆలేఖనాలలో ఒక నిర్మాణపు రూపాన్ని ఒక వైపునుంచి చూపటం. దీన్ని ఒక ప్రమాణనియతి (*scale*) ని అనుసరించి, ఒక మీటరుకు ఇన్ని మిల్లీమీటర్లు అనే పద్ధతిలో చూపుతారు దీనిలో దృష్టి ప్రక్రమగతిని చూపక రెండాయతనాలనే చూపుతారు.

**ellipse guide** : *అండక రేఖిని; అండవృత్త దర్శిని.*

అండాకారాన్ని లిఖించటానికి అనువుగా ఒక ఫలకంపై అండాకారపు రంధ్రాలను చేసి ఉంచిన ఒక పరికరం. దీన్ని వాడి అండాకృతులను, వక్రరేఖలను కావలసిన ప్రమాణాలలో నిర్దిష్టంగా గీయవచ్చు. కొన్ని ఫలకాలపై అన్ని ప్రమాణాలు 45° వక్రతలోను, కొన్నింటిలో 15°నుంచి 60°వరకు వక్రతలో మార్పులుగల ప్రమాణాలలోను అండాకారాలు ఉంటాయి.

**Elsner green** : *ఎల్‌స్నరు హరితం.*

ప్రెషెన్ నీలిమతో పీతరంజకాన్ని మేళవిస్తే లభించే ఒక సంగ్రథిత (*composite*) వర్ణద్రవ్యం.

**emblems and emblem literature :** *లాంఛనాలు; లాంఛన సారస్వతం.*

చిత్రాల వల్ల మానవ భావాలను వెల్లడిస్తూ ప్రాచీన ఈజిప్టు వారులు రూపొందించిన చిత్రలిపికి ఒక విధమైన ఆకర్షణమే తరవాత మధ్యయుగాలు మొదలుగా 18వ శతాబ్ది వరకు లాంఛనాలు వెలయించి, వాటి వివరణకై గ్రంథాలు రూపొందించటంలో కానవస్తుంది. ఇటువంటి లాంఛనాల రూపకల్పనలో పౌరాణిక, ధార్మిక సారస్వతం ఎంతో తోడ్పడింది ప్రాచ్య, పాశ్చాత్య ప్రాంతాలలో అన్నిచోటా ఇటువంటి సారస్వతం విరివిగా ఉంది

**embossing :** *ఉత్సేధ ప్రక్రియ*

ఒక తలంపై ఉబ్బెత్తుగా రూపాలను సృష్టించే ప్రక్రియ. ఒకే రూపాన్ని హెచ్చు, తగ్గులలో తెలిపే, రెండు అచ్చుల మధ్య చర్మం, లోహం, కాగితం, వస్త్రం మొదలైన వాటిని ఉంచి, యంత్రంలో నొక్కటం వల్ల ఈ ఉత్సేధరూపం తయారవుతుంది. ఈ రెండు ముద్రలలో ఉబ్బెత్తుగా ఉండే దానిని అడుగుభాగంలో, లోతుగా ఉండే దానిని పై భాగంలో ఉంచాలి. నాణెములపై ఉబ్బెత్తు ముద్రణ ఇంకో విధంగా ఉంటుంది.

**embrittlement :** *పెళుసుదనం; భిదురత; పెట్లిపోవటం.*

కాలక్రమంగా, చిత్రంలోని వర్ణాలలోనూ, కాటికలలోనూ కోమలత్వం అంతరించటం. వర్ణాలన్నిటిలోను, తైలవర్ణాలను, పాలిమర్ వర్ణాలను, చిత్రాలంబనాలలో కాటికలలో వారకలిసినవి త్వరగా పెళుసుదనం పొందవు.

**embu :** *కురుమావు*

(చూ sinking in)

**emerald green :** *గరుడపచ్చ రంగు; గారుత్మత వర్ణం; మరకత హరితం.*

ఇది ఆకుపచ్చ వర్ణాలలో చాలా తేజోవంతం, 19వ శతాబ్దంలో ఇది ఎక్కువ వాడుకలో ఉండేది, కాని ప్రస్తుతం దీని వాడుక తగ్గింది ఇది విషపూరితం ఇతర వర్ణద్రవ్యాలతో కలిసినప్పుడు రాసాయనిక ప్రక్రియకు లోనవుతుంది. ఇట్లా కలవటం వల్ల కొన్నిచోట్ల మృదువుగాను, మరికొన్ని చోట్ల గోధుమ రంగుగాను, ఇంకా కొన్నిచోట్ల పేలవంగాను తయారవుతుంది. 1816 లో దీనిని యఫ్. డబ్ల్యు. రస్, విల్ హెల్మ్ సాట్లర్ అనేవారు తొలిసారిగా వ్యాపార సరళిలో తయారుచేశారు. క్రమినాశకంగా వాడే గరుడపచ్చ రంగును పారిస్ హరితం (*paris green*) అంటారు. గరుడపచ్చ రంగు యొక్క రాసాయనిక నామం కాపర్ అసెటో ఆర్సెనైట్.

**emeraude green :** *యమెరాడ్ హరితం.*

విరిద (విరిడియన్) మనే వర్ణద్రవ్యాన్నే సంవర్ధశుద్ధి ఏమి మూలేకుండా, ఔచిత్య రహితంగా, అపార్థజనకంగా, ఈ పర్యాయ పదంతో వ్యవహరిస్తున్నారు.

**empathy :** *తాదాత్మ్యం.*

చూపరి, భావోద్రేకంతో ఒక కళాసృష్టిలో లీనం కావటం.

**Empire style :** *సామ్రాజ్య శైలి.*

ఫ్రెంచి విప్లవం తరవాత పారిస్ నగరంలో రూపొందింది, కాలక్రమాన యూరపులోని

పశ్చ ప్రాంతాలలో ఆదరణను పొందిన ఒక కళాశైలి. గృహోపకరణ సామగ్రికి, గృహాంతరాలంకరణకు ఈ శైలి వినియుక్తం పెర్సియెర్, పియెరే. ఫ్రాంకాయిస్-లియోనార్డ్ ఫాంటెయిన్ అనే ఇద్దరు వాస్తువిదులు ఈ శైలికి తొలుకటి రూపాన్ని కలిగించారు.

**emulsification** : *ఉద్రవీకరణ; దుగ్ధ కరణ.*

**emulsion** : *దుగ్ధకం*

యశమూప సంబంధమో లేదా తైల సంబంధమో అయిన ద్రవ్యంతో విడదీయరాని విధంగా మేళనం చేయబడే పలుచని ద్రవ పదార్థం. నీటితో నూనె కలియదనడం నిజమే అయినా, అండశ్వేతం (అల్బుమెన్) వంటి దుగ్ధక కారకాన్ని ఆ మిశ్రమంలో కలిపినప్పుడు, నూనెతో నీరు చక్కగా కలిసి పోతుంది.

**emulsion ground** : *దుగ్ధక ఉపాధి.*

ఆవిసెనూనె, వైటింగు, తుత్తునాగభస్మం, సర్వీసునంటి బంధకాలలో ఒకదానిని కలిపి పూతపూసి తయారుచేసిన ఉపాధి. ఈ పూత కొంతకాలం మెత్తగా ఉన్నా, కాలం గడిచిన కొద్దీ పెళుసుగా తయారవుతుంది: తేమను సులభంగా పీల్చుకొంటుంది.

**enamel** : *యనామెల్; అభానిక.*

1. మృణ్మయ, లోహపాత్రంపై అలంకరణకు ఉపయోగించే మెరుగు. బట్టీలో కాల్చడంవల్ల పాత్రలపై దృఢంగా పట్టుకొని, ఇది తళతళలాడుతుంది. ఇట్లా అలంకృత మైన పాత్రలనుకూడ యనామెల్ అనే అంటారు. ఇది కాంతిభేద్యంగా ఉండడం వల్లనూ, లోహపాత్రంపై ఉపయోగించటానికి తగినట్లుండటం వల్లనూ, తక్కిన పింగాణి మెరుగులకన్నా ఇది మెరుగైంది. నగలపై కూడా అలంకృతికి మిక్కిలి నేర్పుతో దీన్ని వాడతారు. దీన్నే లోహఫలకాలపై, ఎక్కువ ప్రదేశంపై పూసినప్పుడు దాన్ని పింగాణి యనామెల్ (*porcelain enamel*) అంటారు. మేలైన యనామెల్‌ను 1500° వరకు కాలు ప్చారు

2. నునుపుగా, మెరుగుతో ఉండి, ఆరిన తరవాత గట్టిగాఉండే పూత ద్రవ్యం. యనామెల్ పూసినట్లే దీనిపూత ఉండటంవల్ల దీనికి ఈ పేరు వచ్చింది. దీనిలో ఒక రకపుది గాలికి ఆరి గట్టిపడుతుంది. ఇంకొక రకాన్ని 260° నుంచి 450° వరకు బట్టీలో కాల్చాలి.

2. గాజుపలకపై జరిపే చిత్రలేఖనా లకు, మెరుగుగా వాడబడే స్వల్ప పారదర్శక మైన పదార్థం. ఇది గాజుపొడిని లోహభస్మా లతో రంజితం చేయడంవల్ల తయారవుతుంది. 16వ శతాబ్దంలో మొదట ఈపద్ధతి వాడుకలోకి వచ్చింది. అందువల్ల వేర్వేరు అద్దకపు ముక్క లతో చిత్రం రచించే పద్ధతిలో పెద్ద మార్పు వచ్చి, ఒకే అద్దంపై వేర్వేరు రంగులను చూపటం సాధ్యమైంది.

**enameling** : *మణికాచీకరణ.*

**enamel paper** : *యనామెల్ కాగితం; అభానికా పత్రం.*

మెరుగుపూత పెట్టిన నున్నని కాగితం.

**enamel white** : *యనామెల్ తెలుపు; అభానికా శ్వేతం.*

**encaustic or encaustic painting :**

**దాహచిత్రణ; ఘర్మచిత్రణ.**

తేనెమైనంతో కలిపిన రంగులతో చిత్రించడం. ఇది చాలా చాలా పురాతన పద్ధతి. ప్రాచీన గ్రీసుదేశంలో బహుళ ప్రచారంలో ఉండేవి. తేనెమైనంలో రంగులనూ, కొంచెం జిగురు పదార్థాలనూ కలపగా ఇందులోని వర్ణపదార్థాలు తయారయ్యేవి. రంగు చాకులతోను కుంచెలతోను వేడిగా ఉన్న రంగులను చిత్రాన్ని రచించటానికి వాడేవారు. అన్ని రంగులను, కావలసిన రీతిలో, వేసిన తరవాత, చిత్రాన్ని చదరంగా ఉన్న ప్రదేశంలో బల్లపరుపుగా పెట్టి, కొంచెం ఎత్తు నుంచి వేడి తగిలేట్లు చేసేవారు. ఈ వేడి సమానంగా అన్ని చోట్లకూ తగిలి, రంగులు కొద్దిగా కరగి సమానంగా వ్యాపించేవి. ఎక్కువ వేడి తగిలి, రంగులు ఒకదానిలో ఇంకొకటి కలవకుండా జాగ్రత్త పడేవారు. మైనపు పొర చల్లబడేసరికి, రంగులలోని జిగురు రంగులను గట్టిపరచేవి. ఈ వర్ణాలు మిక్కిలి మన్నిక కలవై, మెత్తని గుడ్డతో తుడిస్తే మెరుగువచ్చి, అందంగా కన్పిస్తాయి.

రంగులను వేసేటప్పుడు, వేడిచేసే సాధనాన్ని చిత్రానికి దగ్గరగా ఉంచితే, రంగులు వెంటనే గట్టిపడక, చిత్రంపై అటూ ఇటూ తేలికగా కదపటానికి, ఒక రంగుతో ఇంకొక రంగును కలపటానికి అనువుగా ఉంటాయి. అట్లా చేయకపోతే రంగపూత సరిగా కలియదు.

ఇప్పుడు, ఈ రంగులను ఉంచి చిత్రించే వర్ణ ఫలకాలు, అందుకు సంబంధించిన వేడి చేసే సాధనాలతో సహా లభిస్తాయి. ఒక రేకు పెట్టెలో కొన్ని బల్బులను వెలిగించి, దానిపై వర్ణఫలకాన్ని ఉంచిగానీ, విద్యుత్ సహాయంతో పనిచేసే కుంపటికి కొంచెం ఎత్తుగా స్టాండుపై వర్ణ ఫలకం ఉంచిగానీ పని చేయవచ్చు. 200° ఫా. దీనికి అనువైన ఉష్ణోగ్రత.

పూర్వకాలంలో గ్రీకు కళాకారులు రాగి, లేదా వెండి ఫలకాలను యెర్రటి నిప్పులున్న డబ్బాపై పెట్టేవారు. చిత్రంపై ఉన్న రంగులపు వేడి చేయటానికి ఒకరకమైన కుంపటిని వాడేవారు. ఇత్తడి చాకులతో రంగును పులిమేవారు. వారు వాడిన మైనం శుద్ధం చేసిన తెల్లటి తేనెమైనమని తెలియవస్తున్నది.

ఈ విధానం చాలా శ్రమకరమైంది కావటం వల్ల రోమనుల కాలంలో దీన్ని వదిలేయడం జరిగింది. దీని స్థానాన్ని క్రమంగా నీటి రంగులను కొద్దిగా తైలవర్ణాలును పునరుజ్జీవన కాలం వరకూ ఆక్రమించి ఉండేవి. 17 వ శతాబ్దివరకు, ముద్దగా వాడదగిన తైలవర్ణాలు ఆవతరించలేదు. ఇవి అవతరించిన తరవాత చిత్రవిధానం బాగా మారిపోయింది. కాని దాహచిత్రణ పద్ధతిని, కొంతవరకు, 20 వ శతాబ్దిలో పునరుద్ధరించటం జరిగింది. దీనిని పోలిన పాలిమర్ వర్ణాలు వచ్చినా, కొందరు కళాకారులు ఈ పద్ధతినే శ్రేష్ఠతరంగా భావిస్తారు.

**engaged : అరూఢం.**

ఏదైనా ఒక నిర్మాణంపై ఆధారపడి ఉన్న శిల్పం. ఇటువంటి శిల్పాలలో చేతులకూ, నడుముకూను మధ్య ఎడముండదు.

**engaged column: నిబద్ధ స్తంభం.**

**English art** : *ఆంగ్లేయ కళ.*

ఆంగ్లజాతి రూపొందడంలో భాగ స్వామ్యం వహించిన కెల్టిక్, రోమన్, తదితర జాతుల కళారీతులన్నీ, ఈ ఆంగ్లేయ కళకు యథారీతి తోడ్పడ్డాయని చెప్పవచ్చు ఆంగ్ల దేశంలో నార్మనుల రాకతో వాస్తువు కొంత పరిణతిని సాధించింది. 13 నుంచి 15వ శతాబ్ది వరకు, గోతిక కళకు ఆ దేశంలో, ఫ్రాన్సు ద్వారా, స్థానం లభించింది. 16, 17 వ శతాబ్దాలలో వాస్తువులో జర్మనీ, ఫ్లాండర్సుల ప్రభావం కొంత రాణించింది. ఇనిగో జోన్స్ (1578-1652) ఇటాలియన్ వాస్తువును ఇంగ్లండులో ఆదరణ కలిగించాడు. సర్ జోషువా రెయినాల్డ్స్, థామస్ గెయిన్స్ బరోల కాలం నుంచి ఆంగ్ల చిత్రకళ ఒక విశిష్టతను ఆర్జింపగోని ముందుకు పయనించగలిగింది. 20 వ శతాబ్దిలో నవ్యవాస్తువుకూ, ఆధునిక చిత్రకళా, శిల్పాలకూ ఆంగ్ల కళాకారులు ఎంతేనో దోహదం చేశారు.

**English green** : *ఆంగ్ల హరితం.*

మరకత హరితానికి పర్యాయ నామం.

**English pink** : *ఆంగ్ల పాటలి.*

దచ్చిపాటలికి పర్యాయనామం.

**English re** : *ఆంగ్ల శోణిమ.*

నేడు ఈషత్ శోణిమ (లైట్ రెడ్) అని వ్యవహృతమయ్యే పదానికి, అమెరికాలో మొదట్లో 1942 వరకు వాడుకలో ఉన్న పదం ఆ తరువాత దానిని తొలగించి, వర్ణ ప్రమాణ సంస్థ నిర్ణయానుసారం, 'లైట్ రెడ్' అనే పేరు వాడుకలోకి వచ్చింది.

**English vermilion** : *ఆంగ్ల సిందూరిక.*

ఇంగ్లాండులో తయారయ్యే ఒక విధమైన సిందూర వర్ణం.

**English white** : *సీమతెలుపు; ఆంగ్ల శ్వేతం.*

వైటింగు అనే ఖనిజవర్ణానికి ఇంకో పేరు.

**engobe** : *నీకతా నరకం.*

కులాల సామగ్రిపైన అలంకరణ చిత్రాల రచనకు పనికివచ్చే ఒక విధమైన నరకం. దీనిలో రంగుమార్గాలతో పాటుగా, మృత్తిక, ఇసుక, ఒకవిధమైన కాకిరాయి చేరి ఉంటాయి.

**engraved** : *అధిరేఖిత; రేఖాశిల్పిత.*

**engraving** : *రేఖాశిల్పం; అధిరేఖనం; నంరేఖనం.*

లోహఫలకాలపైనా, కొయ్య ఫలకలపైనా రూపాలను గోటితో గీసినట్లు చెక్కటం. అలంకరణలుగా ఉపయోగించటానికిగానీ, ముద్రణకుగానీ ఈవిధంగా చేస్తారు. అట్లా ముద్రితమైన చిత్రానికి కూడా ఈ పేరును వాడతారు. బంగారు, వెండి ఆభరణాలు తయారుచేయుటంలో కూడా ఈ ప్రక్రియ పనికివస్తుంది.

19 వ శతాబ్దివరకు, ముద్రణకు ఉప యోగించే అన్ని విధాల ప్లాకులు తయారుచేసే పద్ధతిని ఎన్‌గ్రేవింగ్ అనే పేరుతోనే పిలిచే వారు. ప్రస్తుతం రేఖలను గోటితో గీసినట్లు నిర్వహించే పద్ధతికి మాత్రమే వాడుతున్నారు. ఈ పద్ధతిలో తయారుచేసి తీసిన తొలి ముద్రిత చిత్రానికి కూడా ఇదే పేరు. ఇటు

వంటి ఫలకంలో గీతలు ఎంత లోతుగా ఉంటాయో, ముద్రణలో అవి అంత నల్లగా వస్తాయి. వీటిని తయారుచేసేటప్పుడు తరచుగా చిత్రప్రతులు ముద్రించి, చూసుకొని. కావలసిన మార్పులు చేస్తూ ఉంటారు

**enlarging** : *విపులీకరణ.*

చిత్రాన్ని, తొలుతటి ప్రమాణం కన్నా, పెద్దదిగా చేయడం. చిత్రాన్ని చతురస్రంగా భాగించి, గళ్ళు గీచి. ఈ విపులీకరణ నిపుణతతో చేయొచ్చు లేదా రూప విస్తృతిని (ఫొటోగ్రాఫ్)ని, చలత్ప్రక్షేపకి (*slide-projector*) ని వాడి వాని సాయంతో కూడా చేయవచ్చు.

**enlargement** : *వర్ధమానం; వైపుల్యం*

**entablature** : *ప్రస్తరం.*

ప్రామాణిక వాస్తువులో స్తంభపు మకుటంపై అమరి ఉండే భాగం.

**entrelac** : *అంతర్వ్యావర్తనం*

ఒకదానితో ఇంకొకటి పెనవేసుకొన్నట్లుగా చిత్రించిన రేఖలు, ఎప్రారేఖలు నవ్య కళ (*art noveau*)లో తరచు ఇవి కనపడతాయి

**environment art** : *పరిసర కళ.*

సమ్మేళనప్రక్రియ (*assemblage*)కు సన్నిహితమైన ఒకానొక కళారూపం. ఇటువంటి రూపంలో వివిధాంగాలు చాల పెద్దవియై ఒక చోట చేర్చబడియుండటంవల్ల ప్రేక్షకుడు దాన్ని చూడటంతోపాటు, దానిలో ఒక భాగం కూడా అవుతాడు. ఇటువంటి రచనలలో ఉపయోగపడే వస్తువులు ప్రకృతిలో సహజంగా లభించేవిగా, చేతితో మలచేవిగా ఉంటాయి. 1952 లో న్యూయార్కులోని ఒక యువ కళాకారుల సంఘం, 1955 లో జపానులోని 'గుటాయ్' సంఘం, ఈ కళకు నూతన చైతన్యాన్ని తీసుకొని వచ్చాయి. ఈ మధ్యలో, ఇది ప్రాచుర్యం చెంది, ఎన్నో విధాల అభివృద్ధి చెందింది 'ఫలసిద్ధి' (*happening*) అనే కళాచర్య కూడా ఇందులోని భాగమే ఈ కళారచనలో పేరొందిన వారు: వాల్టెర్ గాడ్నెక్, అల్లాన్ కాప్రో, జేమ్స్ డైన్, క్లేస్ ఓల్డెన్‌బర్గ్, సాల్వడార్ డాలీ.

**equestrian figure** : *అశ్వికమూర్తి.*

**epigone or epigon** : *అనుకర్త.*

1. ఒక గొప్ప కళాకారుణ్ణి అనుకరించి చిత్రించే కళాకారుడు. వీళ్ళ ఇటువంటి రచనలకు విలువ తక్కువ.

2. ఒక గొప్ప సంప్రదాయాన్ని అనుకరించే తక్కువ రకపు సంప్రదాయంలో రచనలు చేసే వ్యక్తి.

**epigraphy** : *లిపివిద్య.*

మట్టి పెళ్ళలపైనా, రాతిపైన, లోహ ఫలకాలపైన చెక్కిన పూర్వకాలపు వ్రాతల పరిజ్ఞానం. ఈ పరిజ్ఞానంపైనే పురాతత్వజ్ఞుల చరిత్ర జ్ఞానం ఆధారపడి ఉన్నది.

**equilibrium** : *సమతూకం; సమతోల్యం; తుల్యత.*

ఒకానొక కళారచనలో వివిధాంగాలను, అంటే రూపపదార్థాదులను కుదిరికగా అమర్చటం ఇటువంటి సమతూకంలేని రచన, ఒక భాగంలో ఎక్కువ లావణ్యం కలిగి, ఇంకొక

భాగంలో వేరుగా ఉంచి, కనుల కింపుగా ఉండదు. అందువల్ల ఒక ఏకారూపంలో అన్ని భాగాలూ చక్కటి కుదురిక గలిగి, కన్నుల కింపుగా ఉండేట్లు రచించటం ముఖ్యం.

**esquisse** : *రూపిక.*

శిల్పానికి, చిత్రానికిగాను ముందుగా తయారుచేసుకొనే తొలి రూపరేఖ ఇటువంటిది సంవిధాన పరిపుష్టతకు, వివిధాంగాల ప్రమాణ నిర్ణయానికి ఉపకరిస్తుంది. చిత్రాలలో రంగులనూ, దృష్టి ప్రక్రమ గతినీ ముందుగా నిర్ణయించుకోవటానికి కూడా ఇది తోడ్పడుతుంది. శిల్పంలో దీనిని సాధారణంగా చిన్నదిగా, మైనంతోనూ, మట్టితోనో తయారుచేస్తారు.

**essential oil or essence** : *సార తైలం; ఆమోదకం; ఆమోద తైలం.*

సువాసన కలిగిన ఒక ద్రవ్యవిశేషం. ఆకులు, తీగెలు, పువ్వులు మొదలైన వనస్పతి ద్రవ్య విశేషాలనుంచిగానీ, కొన్ని జంతుజ ద్రవ్య విశేషాలనుంచిగానీ, అధిషవించియో, వేరు విధంగానో తీసే ద్రవమిది. దీనికి సారతైలం అని వ్యవహృతి ఉన్నా, ఆవిసెనూనె, పెట్రోలియమ్ నూనెలలాగా ఇది వాస్తవిక తైలం కాదు. ఈ సార తైలపు కోవకుచెందిన లవంగతైలం మొదలైనవానిని తైలవర్ణాల తయారీలో వాడుకచేస్తున్నారు. ఈ కోవకు చెందిన మరికొన్ని తైలాలు నీటి రంగులు మొదలైనవాటిలో సుగంధకారులుగా వాడుకలో ఉన్నాయి

**ester** : *యస్తరం.*

**ester gum** : *యస్తరుగోందు.*

ఒక విధమైన యక్షధూపం సాధారణ యక్షధూపాన్ని గట్టిపరచి, విస్గ్ధికరించి సాయనిక, యాంత్రిక ప్రక్రియలవల్ల అందులోని ఆమ్లాన్ని తటస్థీకరిస్తే ఇది రూపొందుతున్నది. ఇట్లా దీని గుణ విశేషాలను మెరుగుపరచటంవల్ల, మేలిరకపు పారిశ్రామికోత్పన్నాలలో వాడటానికి అనువైనదిగా ఇది పేరు పొందింది. కాని కళాకారుల పూత రంగులలోగాని, వార్నిషులలోగాని వాడటానికి ఇది తగినది కాదు.

**etched** : *సూచీ లిఖితం; దంశితం.*

**etching** : *సూచీ చిత్రణ; దంశన ప్రక్రియ.*

ఒక పరితలాన్ని ఒక క్షయకారివల్ల పాక్షికంగా దంశనం చేయించి, ఒక రేఖాకృతిని రూపొందించే ప్రక్రియ. ఆ రేఖాకృతి, ఒక గాజుఫలకంపై అలంకృతిగా వాసించవచ్చు; ఒక లోహఫలకంపై అంతఃపాతి ముద్రణకు, లేదా ఉల్బణ ముద్రణకు అనువైన ముద్రాతలాన్ని రూపొందించవచ్చు. పైవాటిలో రెండవ పనికై అది వ్యాపారార్థకంలో, నాగిదంశన ముద్రణలోను, కాంస్యాధిరేఖనం (రేఖలోను, అర్ధస్థాయిలోను)లోను, కాంతి చిత్రణలోను, లోహఫలకాల ముద్రతలాలను తయారుచేయడంలోను వినియుక్తమవుతున్నది. ఇది రాసాయనిక ప్రక్రియ.

ఒకవిధపు అంతఃపాతి ప్రక్రియే అని దీనిని భావించవచ్చు. ఈ సూచీ చిత్రణ గ్రాఫిక్ కళా సాంకేతికములన్నిటా అత్యంత ప్రముఖమనీ, సాంప్రదాయికంగా సంభావితం. ఇటువంటి ప్రక్రియకోసం నిర్దిష్టరీతిలో తయారయ్యే ఒక గట్టి ఉక్కుసూదిని వాడతారు. సూదిని వాడటానికి ముందుగా, లోహఫలక

మునకు (సాధారణంగా రాగిఫలకానికి) బాగా మిసిమి కల్పించి, ఆమ్ల నిరోధకపు వంటి మైనపుతను పట్టించి, దాన్ని నలుపుగా చేస్తారు. అట్లా నల్లపరచటానికికోసం ఒక్కొక్కప్పుడు పొగ పట్టించటం కూడా ఉంది. యథార్థానికి ఈ ప్రక్రియలో అధికేటకంగా వర్తించేది క్షయకరి. దంశనసూచిచేత గీయబడే రేఖలు, పూత దిగువ ఉండే భాగాలను మాత్రమే వెలికి తెస్తాయి. ఇట్లా సూచిని వాడేటప్పుడు పూతకింద ఉండే లోహంలో లోతుగా ఆ సూచి దిగక, దాని ఉపరితలాన్ని మాత్రమే తాకాలి. ఇట్లా ఫలకంపై రేఖాకృతిని రచించిన తరవాత, ఫలకపు అంచులను వెనక భాగాన తారు-వార్నిషు నిరోధకంతో పరిరక్షించి, ఆ తర్వాత ఫలకాన్ని క్షయకరి ఉండే తొట్టిలో ముంచి దంశింపచేస్తారు. ఒక నిర్ణీత వ్యవధి వరకు ఉంచి, ఆ ఫలకాన్ని బయటకుతీసి ఆర్చి, పరిశీలిస్తారు. ముద్రణంలో స్పష్టత ఎక్కువగా ఉండవలసిన అవసరం లేని రేఖలపై అప్పుడు నిలుపుదల వార్నిషును పట్టిస్తారు (ముద్రాతలం మీద రేఖ ఎంత లోతుగా పడితే, ముద్రణలో రేఖ అంత విస్పష్టంగా కనపడుతుందని ఇక్కడ గమనించాలి.) అప్పుడిక ఫలకాన్ని మళ్ళీ క్షయకరిలో ముంచి ఒక నిర్ణీత వ్యవధి వరకు ఉంచుతారు. అప్పుడు క్షయకరివల్ల రేఖలు కొంత ఎక్కువగా దంశితములవుతాయి. ఈ కార్యక్రమాన్నే- నిలుపుదల వార్నిషును దంశన పూర్తి అయినచోట పట్టించి, ఎక్కువ దంశనం కావలసినదానికై ఫలకాన్ని క్షయకరిలో ముంచటం అనేదానినే- మాటిమాటికి నిర్వర్తించి, ఆయాచోట్ల కావలసిన లోతులను రేఖలు పొందచేయటం జరుగుతుంది. చివరకు రేఖలు అనుకొన్నట్లు ఏర్పడ్డాయని సూచీ చిత్రకుడికి సంతృప్తి కలిగినప్పుడు, ఫలకాన్ని బాగా కడిగి, మిసిమి కల్గించి, స్పాంజితో దానిపై సిరా పట్టించి, తుడవటం జరుగుతుంది. (చూ wiping)

యోధుల కవచాలపై ఆమ్లాల సాయంతో రేఖా కృతులు నిర్మించే మధ్య యుగపు పద్ధతి నుంచి, క్రమదశలో లోహ ఫలకాలపై సూచీచిత్రణను సాగించటం రూపు గొన్నది. ఇట్లా కవచాలపై సూచీ చిత్రణను సాగించే ఒక పనివాడు, డేనియల్ హాప్ఫెర్ (1493-1536) అనే అతడు, మొట్టమొదట ఒక ఇనుప ఫలకంమీద సూచీచిత్రణ సాగించి, అందుపై సిరా పూసి, రుజువును తీయగలిగాడని తెలుస్తున్నది. అయితే అది ఇప్పుడు లభ్యం కావటం లేదు. ఇప్పటికి లభ్యమైన వాటిలో కాలరీత్యా, మొట్టమొదటిది స్విట్జర్లండువాసి అయిన ఉర్స్‌గ్రాఫ్ అనే వ్యక్తి రచించింది దానిపై 1513న అది రచితమయినట్లుంది. నెదర్లాండ్స్, ఇటలీలో ఈ ప్రక్రియకై మొదటి నుంచీకూడా రాగి ఫలకాలే వాడినా, తక్కిన దేశాలలో 17వ శతాబ్దివరకు ఇనుప ఫలకాలను వాడటం జరిగింది. అయితే ఇనుప ఫలకాలపై చక్కటి పనితనపు ఆకృతులను సాధించటం కష్టతరమైనందువల్ల, కాలక్రమాన ఆ దేశాలలోనూ ఇందుకై రాగినే వాడుకలోకి తేవటం జరిగింది. ఇనుప ఫలకాలను ఈ ప్రక్రియలో వాడటంవల్లనే, ఆల్బర్ట్ డ్యూరరు తగిన ఫలితాలు సాధించలేకపోయాడు. రెంబ్రాంట్, వాన్ డైక్, గోయా మొదలైన ప్రముఖ కళాకారులు ఈ ప్రక్రియను ఉపయోగించి తమ చిత్రాల రుజువులను తయారు చేశారు.

19వ శతాబ్దిలో జేమ్స్ మెక్‌నీల్ విస్లర్, జోసఫ్ పెన్నెల్ మొదలైనవారు, సూచీ చిత్రణవల్ల ఎన్నో నవ్యఘటనలను సాధించ గలిగారు. 20వ శతాబ్దిలో ఆ ప్రక్రియతో పని చేసిన చిత్రకారులలో పికాసో, రేనాల్డ్, షాగల్‌లు ప్రముఖులు.

**etching ground** : *దంశన భూమిక; సూచీభూమిక.*

సూచీచిత్రణ (*etching*), జలచ్ఛవి చిత్రణ (*aquatint*) లలో, లోహ ఫలకాలపై రసాయనిక క్రియ జరగకుండా ఉండటానికి పూసే పూత. ఈ భూమికపై సూదివంటి సాధనంతో గీయడం వల్ల, గీత పడినచోట పూత తొలగిపోతుంది. అట్లా తొలగిపోవటంవల్ల క్షయకరియొక్క రాసాయనిక క్రియ, గీత వద్ద ప్రాంతాలలోనే సాధ్యమవుతుంది. సరియైన పూత పూసి, ఫలకాన్ని క్షయకరిలో ఉంచినప్పుడు పూత తొలగిపోదు. పూత తగిన చిక్కదనంతో ఉండి, మెత్తగా, ఎక్కువ జిగురు పదార్థం కలిగి ఉండాలి. అటువంటి పూత, చేతులతో తాకగానే తొలగిపోకూడదు. దీనిలో తేనెమైనం, యక్షధూపం వేర్వేరు ప్రమాణాలలో కలపవచ్చు. ఏ పరిస్థితిలోనైనా, తేనెమైనం, యక్షధూపానికి రెట్టింపు ప్రమాణానికి కొంచెం తగ్గి ఉండాలి. దీన్ని స్వయంగా తయారు చేసుకోవచ్చు; లేదా బజారులో కొనవచ్చు. ఫలకాన్ని వేడి చేసి దానిపై ఈ పూతను రుద్దవచ్చు. ఈ పూత పారదర్శకం; కాబట్టి పూతపూసిన తరవాత దీపపుమసి దానిపై పడేటట్లుచేస్తే, గీతలు స్పష్టంగా కనిపిస్తాయి.

**etching needle** : *దంశన సూచి.*

**etching press** : *సూచీ ముద్రణయంత్రం; సూచీముద్రణి.*

కాగితంపై ఉబ్బెత్తుగా ముద్రణలు చేయటానికి ఉపయోగించే చేతి యంత్రం. ఈ యంత్రంలో పైన ఒక పెద్ద రోలరు, దిగువన, పై దానిలో సగం ప్రమాణం గల ఒక రోలరు ఉంటాయి. వీటి మధ్య ఒక లోహ ఫలకం ఉంటుంది. ఈ ఫలకాన్ని కదలించటానికి పళ్లుగల చక్రాలుంటాయి. ముద్రించవలసిన ఫలకంపై ముద్రణ సిరాపూసి, తుడిచివేసిన తరవాత, దానిపై కాగితం ఉంచి, ఈ ఫలకాన్ని రెండు రోలర్ల మధ్య ఒత్తిడితో నడపటంవల్ల చిత్రం అచ్చవుతుంది. లోహ ఫలకంపై ఛాయాంతరాలను సృష్టించటానికి కూడ ఈ యంత్రాన్ని వాడవచ్చు.

అట్లా సిరాపూసిన ఫలకాన్ని, చెమ్మగిలిన కాగితాల దళ్యాలతోపాటుగా ఒక సూచీ ముద్రణ యంత్రం ద్వారా ముద్రించటం, లేదా లాగటం జరిపి రుజావులు తీయడం జరుగుతుంది. ఫలకంలోని ఆకృతికి, రుజావులోని ఆకృతి వ్యత్యస్తరూపంలో ఉంటుంది. సూచీచిత్రకులలో చాలామంది ఒక్కొక్క ఫలకం నుంచి ఒక నియమిత సంఖ్యలో మాత్రమే రుజావులను-దాదాపుగా 20 నుంచి 50 వరకు-తీస్తారు. కళాఖండ సంగ్రాహకులు సర్వసాధారణంగా వరుసక్రమంలో వెనక వాటికన్న మొదట తీసినవాటికే ఎక్కువ విలువనిస్తారు. రుజావులనుతీయటంలో క్రమంగా ఫలకం అరుగుదలను పొందుతుంది. కాబట్టి మొదటతీసిన వాటిలో స్ఫుటత బాగా ఉంటుంది. అంతఃపాతి రుజావులు అత్యధిక సంఖ్యలో కావలసివచ్చే సందర్భంలో-అంటే

పుస్తకాలలో లక్ష్యచిత్రాల వంటి వాటి విష యంలో. ఫలకానికి ఉక్కు ముసుగు కల్పి స్తారు. ఇందువల్ల ఆ ఫలకం ముద్రణకు అను కూలించే కాలవ్యవధి ఎక్కువవుతుంది సూచీ చిత్రణ ప్రక్రియకు లభించే సాధనాలను, అవలంబించే విధానాలలోను, ఆ ప్రక్రియలోని పరిపుష్టంలోనూ చాల విస్తృతమైన మార్పులు కనవడుతున్నాయి. కొన్ని సందర్భాలలో రాగి ఫలకానికి బదులుగా-దానికన్న చాల చౌక ధరకు లభించే తుత్తునాగ ఫలకం వాడుతున్నారు అయితే రాగిలో ఉన్నంతగా గ్రహణశీలత తుత్తునాగంలో లేదు. ఈ విధంగా సూచీ చిత్రణలో అనేకవిధాలైన రీతులూ, అందుకు తగినట్లు ఆయా సాధన సంపత్తులనూ బాగా రూపొందుతున్నందు వల్లనూ, సూచీ ప్రక్రియ (*Drypoint*), జలచ్ఛవి మొదలైన వాటితో జతపరచి, చాలా ఫలదాయకమైన రీతిలో దీనిని ఉపయోగించే వసతి ఉండటంవల్లనూ, సూచీచిత్రణల్ల పలురకాల ఫలితాలు సాధిం చటానికి అవకాశాలు కలుగుతున్నాయి. అంతే గాదు; స్వీయ కళా విభాగాలకు చక్కగా అను వైన సౌందర్యాన్ని ప్రతి కళాకారుడికీ ఇది కల్పించగలుగుతున్నది

**ethyl alcohol** : *యథిల్ మద్యసారం.*

పారిశ్రామిక రంగంలో విరివిగా వాడుక ఆర్జించిన, ఒక బాష్పశీల ద్రావణం. కాని కళా కారులకు ఇది అంతగా పనికి రావటం లేదు

**ethyl silicate** : *యథిల్ సైకతీయము.*

ద్రవరూపంలో ఉండే ఒక విధమైన సైక తీయము. అక్లిన్న చిత్రణలో వాహకంగా ఇది వాడుకలో ఉంది గ్రిసరశీలమైన ఉపరి తలంపై యథిల్ సైకతీయ ద్రావణంతో సాగిం చిన అక్లిన్న చిత్రణ, సమ్యక్కంతో సైతం మన్నికలో పోటీపడి, నిలవగలిగి, రంగుల ఉజ్జ్వలతలో సమ్యక్కాన్ని తలదన్నేట్లుగా ఉంటుంది.

**Etruscan art** : *ఎట్రుస్కన్ కళ*

మధ్య ఇటలీలో పశ్చిమభాగంలో ఉన్న టస్కనీ రాష్ట్ర ప్రాంతంలో, పురాతన కాలంలో వర్ధిల్లిన కళ. ఆ కాలంలో ఈ ప్రాంతాన్ని ఎట్రూరియా అని పిలిచేవారు. క్రీ.పూ. 6వ శతాబ్దిలో రోమునగరం సైతం వారి అధీ నంలో ఉండేది కాని క్రీ పూ. 5వ శతాబ్ది అంతానికి వారు రోమనులకు లొంగిపోయారు. వారు మధ్య ప్రాచ్యంనుంచిగాని, ఆసియా మైనరునుంచిగాని ఆ ప్రాంతానికి తరలిపోయి ఉండవచ్చు. క్రీ.పూ. 7వ శతాబ్దినాటికి వారు ఎట్రూరియాలో స్థిరపడ్డారు. వారి కళ క్రీ.పూ 700-600 మధ్య ఉచ్ఛస్థితిని చేరు కొన్నది వారి కళపై మెసీనియన్, హెలె నియ, ఈజిప్షన్ కళల ప్రభావం ఉంది ఎట్రు స్కన్ కళ, రోమన్ల కళపై ప్రభావం నెరిపింది

ఎట్రుస్కనుల పురాతన రాజధాని అయిన టార్క్విని దగ్గర వారి శ్మశానవాటికలలోని రాతి సమాధులపై ఉన్న చిత్రాలతో వారి దైనందిన జీవితపు దృశ్యాలు అత్యంత రమ్యంగా కనవస్తాయి ఈ చిత్రాలను వారు తెల్లసున్న భూమికపై భిత్తిచిత్ర పద్ధతిలోను, కలంపద్ధతిలోను రచించారు మట్టితో కాల్చిచేసిన శిల్పాలను జీవప్రమాణాలలోనూ, అంతకు మించిన ప్రమాణాలలోనూ రూపొం దించారు. ఈ శిల్పాలలోని కళలలోని మృతుల

రూపచిత్రాలు ఇక్కడ స్తబ్దంగా ఉన్నట్లుగా కాక, జీవచైతన్యాన్ని ఒలికిస్తున్నాయి. క్రీ.పూ. 6వ శతాబ్దిలోని వీరి కళామూర్తులలో, హెలెనీయ శిల్పాలలో లాగా చిరునవ్వునుకూడా చూడవచ్చు. మట్టి పాత్రలను, రంగులతో నిర్మించిన కూజాలను, దంతపు సామానులను, బంగారు వస్తువులను, కంచు విగ్రహాలనును వారు తయారు చేశారు

క్రీ.పూ. 8వ శతాబ్దిలో కంచులో శీర్ష శిల్పాలను వారు చక్కగా తయారు చేశారు. రోమనుల గ్రంథాల వల్ల ఎట్రుస్కనులు చక్కటి వాస్తుశాస్త్రజ్ఞులు, నగర నిర్మాణ నిపుణులు అని తెలుస్తున్నది. కాని ఆ నిర్మాణాలు ఏవీ ప్రస్తుతం కానరావు.

**etude :** *అనుశీలనం.*

*study* అనే ఆంగ్ల పదానికి ఫ్రెంచి పర్యాయనామం.

**euchrome :** *యూక్రోం.*

తప్త కృణమణికి పర్యాయనామం; ఇది ఈ కాలంలో వాడుకనుంచి అంతరించింది.

**evangeliar or gospel book :** *సువార్తా గ్రంథం*

క్రైస్తవ మత గ్రంథాలలోని నాలుగు సువార్తలనూ, సంకలనం చేసి మధ్య యుగాలలో రూపొందించిన ఒక గ్రంథం. దీన్ని అందంగా తయారుచేసి, చిత్రాలను చిత్రించేవారు. వీటిలో 8వ శతాబ్దికి చెందిన 'కెల్స్' గ్రంథం సుప్రశస్తం.

**even-sided :** *సమవర్తిత.*

రెండు వైపులా ఒకేతీరుగా అమరిక ఉపరితలం కలిగియుండే సంలేఖనా ముద్రణ లేదా సంలేఖనా సూక. ఇటువంటి దానిపై ఒక ఆలేఖనాన్ని గాని, చిత్రాన్నిగాని, అచ్చు వేసినగాని రెండు వైపులా రచించే వీలుంది.

**excellent :** *ఉత్కృష్టం*

**exhibition :** *ప్రదర్శనం.*

**exhudation :** *నిర్యాణం.*

**expansion :** *వ్యాకోచనం.*

**exploded view :** *విదీర్ణ రీతి.*

వాణిజ్య చిత్రాలలోనూ, యంత్రాలేఖనాలలోనూ భాగాలను విడివిడిగా ఆలిఖించి చూపటం. వీటిలో ప్రతి ఒక్కటి, సరిఅయిన పద్ధతిలోనే ఉంచి, దగ్గరకు చేర్చినప్పుడు పూర్ణ రూపం తయారయినట్లుంటుంది.

**expressionism :** *విభావనావాదం; భావ ప్రకటన వాదం; ఎక్స్‌ప్రెషనిజం.*

సంప్రదాయబద్ధమైన సహజత, ప్రమాణాలు వంటి నియమాలు పాటించకుండా, కళాకారుడి భావోద్రేకానికి మాత్రమే ప్రాధాన్యమిచ్చే వాదం. ఈ పరిస్థితులలో రూపరేఖా వికృతులు చిత్రంలో కలగ భావనావాదంలో వచ్చు. (*impre-ssionism*) అను కళాకారులు సహజతనే కొత్త రామణీయకంతో రూపొందించేవారు. వన్యవాదులు (*fauvi-sts*) న్నూ, వాంగోయున్నూ ఇటువంటిభావాలకన్నా, భావోద్రేకానికే అధిక ప్రాధాన్యమిచ్చి, విభావనావాదానికి మార్గదర్శకులైనారు. జర్మనీలో ఈ వాదం, శక్తివంతమైన ఉద్యమంగా, ఇరవయ్యో శతాబ్దపు తొలిపాదంలో రూపొంది, బ్రూక్, బొరీటర్ వంటి కళా

కారులద్వారానూ, కొన్ని కళాకారుల సంఘాల ద్వారానూ ప్రాముఖ్యానికి వచ్చింది.

ఇతర ఆధునిక కళావాదాల లాగానే, విభావనా వాదం కూడా ఆఫ్రికేయ శిల్పాలవల్ల ప్రభావితమైంది. అనుభావనావాదం, వన్య వాదం, అనాగతవాదం, అధివాస్తవికతావాదం వంటి పేర్లన్నీ, ఈ వాదాలనూ అనుసరించిన కళాకారులుగానీ, వాటి ప్రత్యర్థులుగానీ ఉపయోగించినవే; ఇవి స్పష్టంగా కొన్ని సంఘాలకూ ఉద్యమాలకూ చెందినవి. కాని విభావనా వాదం కళాజగత్తులో ఒక మహోధర్మ పరిణామం. ఇది నార్డిక్ (ఉత్తర యూరపీయ) కళలలో ఒక ప్రధానాంగంగా సామాజిక, మత సంక్షోభాల వేళల్లో అక్కడక్కడ తల యెత్తే స్వభావం కలది. భావప్రకటన అనేది కళలో చాల పురాతన ఉద్దేశమే అయినా, విభావనా వాదమనే దానిని తొలిసారిగా, జర్మనీ దేశపు సౌందర్య తత్వజ్ఞుడు హెర్ వార్త్ వాల్‌దెన్, 1910-21 మధ్య సంభవించిన మార్పులనుబట్టి గుర్తించారు.

విభావనావాదానికి సంబంధించి రెండు విరుద్ధ భావనలున్నాయి. మొదటిది కల్పనాత్మకమైన రూపనిర్మాణమూ, దాని స్వతంత్రత; రెండోది మానసిక శక్తి, దాని ప్రభావం. ఇది కొంతవరకు సంప్రదాయవాద, కాల్పనిక వాదాల మధ్యఉండే వైరుధ్యం వంటిది. విభావనావాదాన్ని ఆధునిక కాల్పనిక వాదమని కూడా మనం భావించవచ్చు. ఇది పురాతన కాల్పనిక వాదంలాగాకాక, దుఃఖాన్నే అధికంగా చిత్రిస్తుంది. తొలి విభావనావాదులలో ఎడ్వర్డ్ మంచ్ (1863-1944), మాక్స్ బెక్‌మాన్ (1884-1950), జేమ్స్ ఎన్‌సార్ (1860-1949), ఓస్కార్ కకుస్కా (1886-), ఎమిల్ నోల్డ్ (1867-1956), జార్జి రూవో (1871-1958) గణనీయులు.

**expressionist** : *విభావుకుడు.*

**extender** : *వ్యాపకం; విస్తారకం*

ఒక వర్ణం, లేదా వర్ణద్రవ్యం యొక్క పరిమాణాన్ని పెంచటానికి ఉపయోగించే పదార్థం. ఇటువంటి పదార్థం వర్ణంయొక్క గుణాన్ని తగ్గించి, పరిమాణాన్ని మాత్రమే హెచ్చించినప్పుడు దానిని పూరకం (*filler*) అంటారు. వ్యాపకం అనేది వర్ణాన్ని కావలసిన పరిమితిలో వేయటానికి ఉపకరిస్తుంది. ముద్రణకు వాడే సిరాలలో ఉపయోగించే వ్యాపకం, ఆ సిరాలను ముద్రణకు ఎక్కువ అనువుగా తయారుచేసి, వాటి పారదర్శకతను పెంచుతుంది. కౌశేయ ముద్రణలో వాడే పారదర్శికపు ఉపాధిని కూడా 'వ్యాపకం' అనే అంటారు.

**extension** : *పొడిగింపు; ఆయామం.*

**extra gilders** : *అంతిరంజకం.*

**extra-large** : *అతిమాత్రపు.*

**ex-voto** : *మొక్కుబడి; అర్పణ.*

మొక్కుబడి తీర్చుకోవటానికి దేవాలయంలో సమర్పించే వస్తువు, మతసంబంధమైన చిత్రం, ఇతర కళాత్మక వస్తువు. ఈ విధంగా సమర్పించడం క్రైస్తవమత సంప్రదాయం. భారతదేశంలోకూడా ఇటువంటి సంప్రదాయం ఉంది.

**for fec :** ఫేసిట్ (fecit) అనే పదానికి హ్రస్వ రూపం.
(చూ. *fecit*)

**fabric :** *పోందిక.*
పింగాణి పనిలో కుశలత, వాడిన వస్తువుల గుణాలు, సాంకేతిక పద్ధతి, శైలి, వీటి అన్నింటిని పరిగణనలోనికి తీసుకొనటాన్ని వ్యక్తీకరించే సమాహార పదం.

**facade :** *ముఖాయామం.*

**facet cubism :** *ఆంశిక స్థూలతావాదం.*
(చూ: *Cubism*)

**fading :** *వర్ణక్షయం.*

**fading of colours :** *వర్ణమ్లానత; రంగు మాపు.*
రాసాయనికంగా అస్థిరములైన వర్ణద్రవ్యాలూ, రంగులూ క్రమేణా కాంతి కోల్పోవటం.

**faience :** *మాయపింగాణి.*
పారదర్శకంగాని మెరుగు గల పింగాణి వస్తు సామగ్రి.

**faint lines :** *దుర్బలరేఖలు.*

**false :** *అలీకం.*

**fake, fakery :** *కుహన, కుహనత*
(చూ: *falsification, forgery*)

**false body :** *అలీక సంఘాతం.*
(చూ: *body*)

**falsification :** *ఛద్మకరణం.*
కళారంగంలో, ఒక కళాఖండపు కర్తృత్వాన్ని అన్యథాకరించటానికై, చేసే యత్నానికి ఇది ఒక సామాన్య పదం. కూటకరణం (*forgery*) కూడా ఇటువంటిదే అయినా, కొంత విభేదం ఈ రెంటి మధ్య ఉంది. ఒకరు చేసిన చిత్రానికి నకలు తయారు చేసి అసలు చిత్రంగా చూపటాన్ని 'ఛద్మకరణం' అంటారు. ఒకరు చేసిన చిత్రాన్ని వేరొకరు తమదిగా చూపటాన్ని కూటకరణం అంటారు. (చూ: *forgery* )

**fan brush :** *వ్యజనతూలిక; వీవన కుంచె.*
రోమాలు వలయంగా పేర్చి, విసనకర్రలాగా తయారుచేసిన కుంచె. ఇది ఎర్ర సేబిలు, లేదా పందివెంట్రుకలతో, తయారవుతుంది. ఛాయలు రంగులు వాడకపోతే, ఒకదానితో ఇంకొకటి మృదువుగా కలపటానికి ఈ కుంచె బాగా పనికి వస్తుంది.

**fanciful :** *ప్రకాల్పనిక.*

**fancy picture :** *ప్రకల్పిత చిత్రం.*
18వ శతాబ్ది అంతంలో వాడుకలోకి వచ్చిన ఒక పారిభాషిక పద విశేషం. అచ్చంగా మూర్తి చిత్రంగాగాక, అచ్చంగా సామాన్య జీవన చిత్రంగాగాక మధ్యస్థ రీతిలో ఉండేది. గ్రామాలలో పుట్టి పెరిగిన రైతులు, క్రొత్తగా ఒక నగరానికి వచ్చి, చిత్రాగారంలో ప్రవేశించినప్పుడు వాళ్ళు వ్యవహరించే తీరును సంభావించి రచించే చిత్రాన్ని ఇందుకు ఉదాహరణంగా భావించవచ్చు.

**fast colours** : *మన్నిక రంగులు.*

గుడ్డంపై అద్దకానికి ఉపయోగించే, వెలిసి పోని రంగులు. గుడ్డ మన్నికగా ఉన్నంత కాలం రంగులుకూడా కాంతిని కోల్పోకుండ ఇందులో నిలిచి ఉంటాయి. కళాకారులు వాడే వర్ణాలలో, చిత్రాలను చాల కాలం ఎండలో ఉంచినప్పుడు రంగులు వెలవెల పోకుండా ఉన్నప్పుడే వాటిని మన్నిక రంగులు అంటారు. వీటిలోనే వెలుగు మన్నిక (*light fast*,) ఎండమన్నిక (*sunfast*) అని రెండు రకాలు ఉన్నవి.

**fat** : *జిగి.*

చక్కగా మలచ్చటానికి వీలయ్యే మట్టికి, పింగాణి పరిశ్రమలో, ఉపయుక్తమయ్యే విశేషణం. జిగి గల బిళ్లమట్టి, బూడిదమట్టి వంటి వాటిని జిగితక్కువ మృత్తికలతో కలిపి, వాని జిగిని మెరుగుపరచవచ్చు.

**fat over lean** : *తక్కువ పై ఎక్కువ.*

తక్కువ చమురు కలిపి వర్ణాన్ని పూసిన భూమికపై ఎక్కువ చమురు కలిపిన వర్ణాన్ని వాడటం. తైలవర్ణాలను ఉపయోగించటంలో ఇది సరియైన పద్ధతి. ఎక్కువ చమురు కల భూమికపై తక్కువ చమురు కలిపిన వర్ణాన్ని (ఎక్కువపై తక్కువ) వాడిన, చిత్రంలో కాలక్రమాన పగుళ్లు వచ్చే అవకాశం ఎక్కువ.

**fatty acid** : *వసామ్లం.*

**faultless** : *అవిచ్ఛిద్రం; నిర్దుష్టం.*

**fauves, les** : *వన్యవాది వర్గం.*

20 వ శతాబ్దం ప్రథమ దశాబ్దంలో ప్రభవించి, విప్లవాత్మక భావాలు కల్గిన కళాకారుల సంఘం. పరిభావనవాదులు (*post-impressionists*) అయిన వాంగో, గాగిన్, సిజానేల ప్రభావం ఈ వన్యవాదపు ప్రారంభ రచనలపై ఉన్నప్పటికీ, అనుభావనవాదుల సిద్ధాంతాలను మాత్రం వాళ్ళు కాదన్నారు. వాళ్ళు, రూపాలను, రంగులను ప్రయోగించిన విశృంఖల పద్ధతిని బట్టి మొదటిసారిగా ఒక కళా విమర్శకుడు, వారికి వన్యవాదులు అని పేరుపెట్టాడు. వారి చిత్రాలు ప్రకృతి సహజంగా గాక, మిరుమిట్లు గొలుపుతూ గాంభీర్యంతో ఉండేవి. ఈ రీతిగా అంతర్గత భావాలను చిత్రించవచ్చని వారు భావించారు. సిజానికి వారికొక సంఘం లేకపోయినా, వారి వ్యక్తిగత సాన్నిహిత్యం, తేజోయుతాలైన వర్ణరచనలను బట్టి వారికి ఆ గుర్తింపు కలిగింది. హెన్రీ మాటిస్సే, యాంద్రే డెరైన్, మారిస్ డి వ్లామింక్, ఆల్బర్ట్ మార్కే, రావుల్ డూఫే, జార్జిరౌవా ఈ వర్గంలో సుప్రసిద్ధులు.

**fauvism** : *వన్యవాదం.*

**fawn brown** : *అవభ్రువర్ణం.*

మృదు కపిలం (వెల్వెట్ బ్రౌన్) కు పర్యాయ నామం.

**fecit** : *రచితం.*

'అతడు రూపొందించాడు' అని దీని అర్థం. శిల్పాలపైనా, చిత్రాలపైనా కళాకారుని సంతకంపై ఈ పదం ఉండేది. దీనినే సంక్షిప్తంగా *fec* లేదా *f* అనికూడా వ్రాసేవారు.

**federal style** : *సమాఖ్యా శైలి.*

యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలో, నవ్య ప్రామాణికతా వాదపు ఒక ప్రత్యేక

కైలికి పరిగ్రించే నామవిశేషం. క్రీ.శ. 1780 నుంచి 1820 వరకు ఇది వ్యాప్తిలో ఉండినది.

**feldspar** : *కేదారశిల.*

**felt tip pens and markers** : *నారమైన కలాలు; మదతమైన కలాలు; తంతు లేఖినులు.*

నైలాన్‌తో గాని, నారతో గాని తయారు చేసిన మొనగల కలాలు. రేఖలను కావలసి నట్లు సన్నంగా గాని, మందంగా గాని గీయ టానికి పనికివస్తాయి. వీటినే ఊట కుంచెలు (*fountain brushes*) అని కూడా అంటారు. ఇవి చాలా రంగులలో తయా రవుతాయి. కాని ఈ రంగులకు వెలిసిపోయే గుణం ఉంది. కర్బనపు సిరా వాడటానికి తయారుచేసినవి కూడా వీటిలో ఉన్నాయి.

**fence** : *వేష్టనం.*

నిరాస్త్య సుషిరకం(*waste mold*)గానీ, భాగ సుషిరకం గానీ తయారు చేయటంలో, ఖండాలను విడివిడిగా ఉంచటానికి ఉపయో గించే రేకుముక్క.

**ferric chloride** : *అయనిక వీరేయం.*

సూచీ చిత్రణ (ఎచ్చింగు)లో క్షయకరిగా, వాడే ఒక ఇనుప లవణం. ఒక్కొక్కప్పుడు దీన్ని, వేరొక క్షయకరితో కలిపి వాడటం కూడా ఉంది.

**festoon** : *ప్రాలంబిక.*

వస్త్రగతులలో అందంగా తయారు చేసిన రూపం. దీనికే ఆంగ్లంలో స్వాగ్ (*swag*) అనే పేరు కూడా ఉంది.

**fettle** : *నివర్తించు.*

మూర్తవంలోను, శిల్పంలోను సామగ్రిని అందేఉండే అనావశ్యక సామగ్రిని తొలగించి వేసే పద్ధతి. దీనికోసం ఒక విధమైన చాకును ఉపయోగిస్తారు.

**fiber glass** : *తంతుక కాచం.*

సన్నటి దారాలుగా తీసిన ఒకవిధమైన గాజు. ఇది కాలిస్తే తగలబడదు; తేలికగా ఉన్నప్పటికీ, వస్తుతః ఎక్కువ గట్టితనాన్ని కలిగిఉంటుంది. శిల్పంలో, పాలిమర్, పాలి యస్టరు యిత్యరూపాలకు దృఢతను కల్గించ టానికి వాటితో ఈ తంతుక కాచాన్ని కలుపు తారు.

**fibers** : *పేములు; నారలు; తంతుకాలు.*

**figure** : *ఆకృతి.*

1\. చిత్రలేఖనంలోనూ, శిల్పంలోనూ రూపొందించే మానవాకారం.

2\. అలంకరణలో మళ్ళీ మళ్ళీ వచ్చేట్లు చిత్రించే రూపం.

**figurine** : *అణుమూర్తి.*

పది అంగుళాల ప్రమాణానికి మించని శిల్పం.

**filbert brush** : *బాదాం కుంచె.*

పంది వెంట్రుకలతో తయారుచేసే ఒక విధమైన కుంచె. ఇది బల్లగా, బాదంకాయ ఆకృతిలో ఉంటుంది.

**filigree** : *జరీనగిషీ.*

లోహపురేకుమైగాని, విడిగా గాని, సన్నటి తీగతో అలంకరణ చేసే పని. ఈ తీగను

బంగారు, వెండి, తదితర లోహాలలో దేనితో నైనా తయారుచేస్తారు. ఈ తీగను జడలాగా అల్లిగాని, మెలికలు చుట్టిగాని, పేనిగాని, అనేకాకృతులలో తయారుచేసి, పూసలు మొదలైనవి గుచ్చి అతికిస్తారు. ఇది చాలా పురాతన కాలం నుంచి అమలులో ఉన్న ప్రక్రియ.

**filler** : ***పూరకం.***

రసాయన చర్య చెందని ద్రవ్యం. దీన్ని రంగులో కలుపుతారు.

(చూ - *extender*)

**filler rod** : ***పూరక శలాక.***

ద్రవీభవన బిందువు అత్యున్నత స్థాయిలో ఉండే లోహాలను అనుసంధించటానికై వాడ బడే ఒక కడ్డీ. కాంస్యం, ఇత్తడి, లేదా ఏదైనా ఇంకొక మిశ్రలోహంతో దీన్ని తయారుచేస్తారు. అసిటలీన్ వర్తిక పైనుంచి ఆ శలాకను కొంత కరిగించి తరవాత అను సంధాన క్రియకు వాడతారు.

**fillet** : ***శిల్పపట్టం.***

లతాద్యలంకరణలను రూపొందించే ఓవ్వడు. ఆ అలంకరణలను వేరేవేరేగా తెలియచేయటానికి ఉపయోగించే రూప ప్రక్రియ.

**film** : ***పటలం.***

వర్ణ చిత్రరచనలో రంగుపూత.

**film applicator** : ***పటల వర్తిని.***

**film-former** : ***పటలకారి.***

1. ఒక పూతరంగులోగాని, వార్నిషులోగాని, వేరే ఇంకేదైనా పూత పదార్థంలోగాని ద్రవరూపవు సంఘటకం (*Ingredient*) గా ఉండి, దాన్ని ఒక ఉపరితలానికి పట్టించగానే, ఆ తలాన్ని అంటిపెట్టుకొని ఉండే పటలాన్ని ఒకదానిని రూపొందించే స్వభావం గల పదార్థం.

2. ఒక వాహకం లేక మాధ్యమంలోని బాష్పశీలక విరళక ద్రవ్యంకాని అనుత్పత ద్రవ్యం

**film integrity** : ***పటల సమగ్రత.***

చిత్రంపై పూసిన రంగు, లేదా వార్నిషు పూతలో తేడాలు, వెలితి, రంధ్రాలు లేకపోవటం.

**film-stencil method** : ***పటల తైజస విధానం.***

కౌశేయ ముద్రణ విధానాలలో ఒకటి. దీని కై రంగు గల లాక్షాద్రవం పూసిన కాగితాన్ని ఉపయోగిస్తారు, పూత పూసిన వైపున, కావలసిన ఆకారాన్ని గీసి, అచ్చు కత్తితో కోస్తారు. ఇట్లా కోసేటప్పుడు అడుగునఉండే కాగితం తెగకూడదు. అట్లాకోసిన భాగాన్ని మాత్రం తీసివేసి, మిగిలినభాగాన్ని కాగితంతో సహా, పట్టుతెర (కౌశేయపు) అడుగు భాగంలో అంటుజిగురుతో అతుకుతారు. పైనున్న కాగితాన్ని అప్పుడిక, నేర్పుగా తీసివేయాలి. ఇట్లా తయారుచేసిన కౌశేయంపై రంగులను రుద్దిముద్రించవచ్చు. నూ ఫిలిం, ప్రోఫిలిం అనే వ్యాపారనామాలతో లాక్షాద్రవం పూసిన కాగితాలు చుట్టలుగాను, "80×40" అంగుళముల టావులుగాను లభిస్తాయి. ఈ పద్ధతి వాణిజ్య కళలో ఎక్కువగా పనికివస్తుంది.

**final coating :** *తుది పూత.*

**fin de siecle :** *శతాబ్దాంతం.*

19వ శతాబ్దపు చివరి రెండు దశాబ్దాల కళా సంప్రదాయాలను సమష్టిగా సూచించే పదం.

**fineart :** *లలిత కళ.*

సౌందర్య ప్రకటనే ముఖ్య లక్ష్యంగా ఎంచే కళావిశేషం. చూచి, ఆనందించటం మాత్రమే దీనిలోని ఏకైక ధ్యేయం వినియుక్త కళ (*Applied art*)లాగా ఒక నిర్దిష్ట ప్రయోజనాన్ని సాధించేటానికి ఉపకరించేది కాదు ఇది వర్ణచిత్రరచనే, రేఖాచిత్రరచన, శిల్పం, వాస్తు శిల్పం, చేతితో చేసే కళాత్మక ముద్రణ లలిత కళలుగా లెక్కకు వస్తాయి.

**finger painting :** *అంగుళీచిత్రణ.*

చేతిముని వ్రేళ్లతో, చిత్రంలో రంగులు వేయటం. 1980 నుంచి బాలల కళ అభివృద్ధి చెందటంచేత, ఈ చిత్రణకు ఉపయోగించే రంగులను-చర్మాన్ని పాడుచేసేవి గాకుండాను, కడిగినప్పుడు సులభంగా పోయేవానిగాను. తయారుచేస్తున్నారు. తైలవర్ణాలను, నీటి వర్ణాలను వర్ణిత కళాకారులు కూడా ఈ పద్ధతిలో వాడతారు. చీనాలో చిత్రణను పూర్తిగ వ్రేళ్ల తోను, కొన్ని సందర్భాలలో కొంతవరకు వ్రేళ్లను, కొంతవరకు కుంచెలను వాడి సాగించటం పూర్వకాలం నుంచికూడా ఆచారంగా ఉన్నది.

**finial :** *ముకుటం.*

వాస్తు శిల్పాలలోను, పింగాణీ, కొయ్య, లోహం మొదలైన వాటితోను తయారయిన గృహోపకరణాలలో, పైన శిఖరం వలె నేర్పుగా తీర్చిదిద్దిన భాగం. ఇటువంటి రూపం ప్రయోజనకరమైనదిగా గానీ, కేవలాలంకరణంగా గానీ ఉండవచ్చు. మొగలు, పూలగుత్తులు, జ్వాలలు, కుంభాలు మొదలైన అనేక రూపాలలో ముకుటాన్ని చెక్కుతారు.

**finish :** *తీరుగడ; ముగింపు; సంసాధన.*

1. ఒక కళాఖండపు ఉపరితలం కన్పించే రీతి. ఈ ఉపరితలాన్ని గరుకుగా గాని, నునుపుగా గాని, మెరుగు పెట్టిగాని, పలుగు పేకల వలెగాని, పెక్కురకాలుగా తయారు చేయవచ్చు.

2. కళా విమర్శలో, రేఖా రూప, వివరణలలో శ్రద్ధాసక్తులను ప్రదర్శించేరచనకు వాడేపదం. యాదృచ్ఛికంగాఏర్పడే రూపాలు గజిబిజిగా ఉండే కుంచెనడక వంటి ప్రక్రియతో తయారయ్యే చిత్రాలకు ఈ పదాన్ని వాడరు.

**finishing trowel :** *తీరుగడ తాపీ.*

కాంక్రీటును, ప్లాస్టరును చదునుగా చేయటానికి ఉపయోగించే తాపీ చెక్కవంటి సాధనం.

**fireclay :** *అగ్ని మృత్తిక.*

విపరీతపు వేడిని భరించగల ఒక విధపు మృత్తిక. ఇటువంటిది సాధారణంగా కుండలకు, ద్యుతికములకు యనామెలులకు ఉపయోగించే మట్టికరిగే సమయాలలోని తాప క్రమంలో స్థిరంగా ఉండి, అంతకు చాలా ఎక్కువైన తాపక్రమాలలో మాత్రమే కరగుతుంది.

**fire marble :** *శర్కరాశ్మం.*

చూ: (*shell marble*)

**fire red :** *అగ్నిశోణం.*

పారిశ్రామిక రంగంలోను, అచ్చువనంలోను వాడుకలో ఉండే ఒక వర్ణ ద్రవ్యం. అగ్నిమాపక యంత్రాలకు సాధారణంగా ఈ రంగును వాడతారు. దీని మన్నిక చాల తక్కువ; అందువల్ల కళాకారుల వాడుకకు తగదు.

**firing :** *బట్టీ కాల్పు.*

బట్టీలో వేసి పింగాణీ సామానులను కాల్పటం.

**first coating :** *తొలిపూత.*

**fish glue :** *చేప జిగురు.*

చేప ఎముకలు, చర్మంతో తయారు చేసే జిగురు. ఇది ద్రవరూపంలో లభిస్తుంది. ఇతర సర్వేసుల కన్నా దీని శక్తి తక్కువ.

**fish tailtool :** *చేపతోక ఉలి.*

చేపతోక ఆకారంలో ఉండి, కొయ్యను మలచటానికి ఉపయోగించే ఉలి.

**fissure :** *నెరియ.*

చిత్రతలంలో కనిపించే లోతైన పగులు.

**fit :** *ఉపయుక్తి. (మార్తవ ప్రక్రియ).*

మార్తవ ప్రక్రియలోని ఒక పారిభాషిక పదం. ఉపయోగించిన మృత్తికాద్రవ్యంతో ద్యుతికమునకు ఉండే యాంత్రిక సమన్వయతను ఇది తెలియజేస్తుంది. మృత్తికా ద్రవ్యమూ, ద్యుతికమూ ఒకే రీతి వ్యాకోచక గుణాలను కలిగి ఉన్నప్పుడు, జర్జరత (*crazing*) వంటి ద్యుతిక లోపాలు సంభవించవు.

**fitch :** *విచ్ఛిక.*

1. ధృవ ప్రదేశంలో ఉండే ఒక విధమైన మార్జాలపు వెంట్రుక. దీనిని తూలికల తయారీలో వాడతారు. అటువంటి తూలికను కూడా ఈ పేరే వాడతారు.

2. ఒంటె వెంట్రుకలతో గాని, వరాహ రోమాలతోగాని తయారయ్యే తక్షణ తూలిక (చిజెల్ బ్రష్) కు కూడా, ఈ పేరు వాడతారు.

**fixative :** *నిరూఢకి; స్థిరకారి.*

రంగు సుద్దలతోను, బొగ్గు కణికలతోను, చిత్రించిన చిత్రాలు చెరిగిపోకుండటానికై, చిత్రంపైన పిచికారీ చేసే ద్రవరూపమైన బంధకం. ఈ నిరూఢకులను ఎక్కువగా వాడినప్పుడు చిత్రం పసుపురంగుగా మారుతుంది. నిరూఢకుల పిచికారీవల్ల రంగులలో స్వల్ప భేదం వస్తుంది.

**fixed oil :** *సిరతైలం.*

ఒక ప్రలేపక మాధ్యమంలోగానీ, వార్నిషులోగానీ చేరిఉండే సంఘటకములలో ఉత్పత ద్రావణాలు గాకుండాఉండే ఉత్పతసంఘటకం లేదా పటలకారి తైలం. కాని 'సిరతైలం' అనే పదం నేడు వాడుకనుంచి తొలగిపోయింది.

**flake white :** *మంచుతెలుపు; తుషార శ్వేతం.*

హానికరమైన సీసపుతెలుపు (*lead white*). ఇతర సీస వర్ణద్రవ్యాలలాగానే దీన్ని వాడటంలో కూడా జాగ్రత్త వహించాలి.

**Flamboyant style :** *ఉత్తర గోతిక్ శైలి*
(చూ : *gothic style*)

**flame black** : మంటమసి; జ్వాలా కాలిమ.

తక్కువగా దేలిన బొగ్గుతారును ఖనిజ తైలాలతో కలిపి, మంటబెట్టి అందులోంచి సేకరించే ఒక తక్కువరకపు కార్బనిక వర్ణద్రవ్యం. దీపమసికే అస్వచ్ఛరూపంగా దీనిని భావించవచ్చు.

**flammingo** : ఫ్లామింగో.

ఇటలీలో, అందునా ముఖ్యంగా రోము నగరంలో, వలస ఏర్పరచుకొని, 17వ శతాబ్దంలో పనిచేసిన ఫ్లెమిష్ కళాకారులకు సమష్టిగా వాడిన నామవిశేషం.

**flashing** : కాచబంధ ప్రక్రియ.

గాజు తయారీలో ఇంకా గట్టిపడని గాజుకు రంగు వేయటానికై, రంగు గాజుద్రవం ఉన్న తొట్టిలో దాన్ని ముంచటం, లేదా పారదర్శకంగా ఉండే మందపు గాజుపలకపై, సన్నని రంగుగాజు పలకనుంచి, వేడిచేసి, రెండున్నూ కలిసిపోయ్యేట్లు చేయడం. ఈ విధానం, కనీసం 12 వ శతాబ్ది నుంచిఅయినా అమలులో ఉన్నది. కాంచఖండ ప్రక్రియ (*stained (glass painting*) లో చిత్రాలను తయారు చేయటానికి మందమైన గాజుపలకలు కావలసి ఉంటాయి. కాని మందమైన గాజు ముక్కలు సాధారణంగా కాంత్యభేద్యాలుగా ఉంటాయి, కాబట్టి కాచబంధ ప్రక్రియవల్ల మందపు గాజుముక్కలను, రంగులువేసి పారదర్శకాలుగా చేయవచ్చు.

**flat** : మంద[illegible]ం.

మెరుపులేని చిత్రోపరితలాన్ని వర్ణించే పదం.

**flat colour** : మంద[illegible]వర్ణం.

ఛాయా వైవిధ్యం లేకుండా, సమానంగా వేసిన వర్ణం.

**flat sketching pencil** : బద్ద పెన్సిలు; మంద్రరేఖిని.

మొలికి బద్దవాటుగా ఉండే పెన్సిలు. ఇది రూపరేఖ (స్కెచ్చి) లను గీసేటప్పుడు ఛాయాభేదాలను రూపొందించటానికి, ఉపయోగపడుతుంది.

**flatware** : చపాట సామగ్రి.

కొంతవరకు చదును దేలి ఉండే పాత్రలు లేదా అధిగ్రహణములు (*receptacles*). మార్తవ, కాచ సామగ్రిలో కూడా ఆ రూప విశేషత ఉన్న వాటికిన్నీ, ఈ పేరు వాడటానికి వీలున్నా, సాధారణంగా లోహ నిర్మితములైన వాటికే ఈ పేరు ఎక్కువగా వాడుకలో ఉంది.

**flawless** : దోషరహిత.

**flax** ; మసృణం; అవిసె.

సమోష్ణ, శీతల మండలాలలో పెరిగే ఒక వృక్ష విశేషం. కళాకారులు ఉపయోగించే బాదికను మసృణతంతువుల నుంచే తయారు చేస్తారు. దీని గింజలనుంచే అవిసె నూనెను తయారు చేస్తారు.

**Flemish white** : ఫ్లెమిష్ తెలుపు.

19వ శతాబ్దంలో ఆంగ్లదేశంలో తెల్లసీసానికి వాడినపదం. ఇప్పుడిది వాడుకలో లేదు.

**flesh colour** : పలితవర్ణం.

యూరపియుల మూర్తి చిత్రాలలో, వారి తెల్లని శరీరచ్ఛాయను చిత్రించటానికి ఉపయోగించే వర్ణం. సామాన్యంగా దీనిని తెలుపు, స్వర్ణ గైరికం (*yellow ochre*) లలో కొంచెంగా నలుపు, ఆకుపచ్చవంటి వర్ణాలను కలిపి తయారు చేస్తారు. రంగు సుద్దలలోనూ తైలవర్ణాలలోనూ, ఇట్టి పలితవర్ణం తయారై లభిస్తుంది.

**flesh ochre** : శారీర గైరికం.

శరీరచ్ఛాయను పోలేట్లుగా మిశ్రమం చేసిన మట్టి పసుపు రంగు.

**flexibility** : ఒదుగుబాటు; నామ్యత.

**flexibilty** : ఒదుగుతనం; నమనీయత.

**flexible** : నమ్యమైన; ఒదుగైన

**flint** : అరణి; చెకుముకిరాయి.

ఇది ఒక విధపు పలుగురాయి (క్వార్ట్జ్ స్ఫటిక శిల). మార్దవ ద్యుతికాల కొరకూ, కొన్ని మృద్వస్తు విశేషాల కోసమూ, సిలికాను దీనినుంచి సేకరిస్తారు. మార్దవ సాంకేతికంలో అరణి, సిలికా, స్ఫటికశిల ఏఅనే వాటిని. పర్యాయపదాలుగా ఉపయోగించటం కూడా ఉంది.

**float** : పారశావి.

**floating signature** : విడి సంతకం.

చిత్రంపై వార్నిషును పూసిన తర్వాత చిత్రకారుడు చేసిన సంతకం. ఇది చిత్రంతో బాగంగా ఉండదు. వార్నిషును తుడిచివేస్తే, ఈ సంతకం చెరిగిపోతుంది. సాధారణంగా ఇటువంటి సంతకాలు యథార్థపు చిత్రకారుడివి అయిఉండవు.

**flocking** : ఛాదనం.

పిష్టకాన్ని లేదా వేరే విధమైన అధిసక్తకాన్ని పట్టించిన ఒక ఉపరితలంపై, చూర్ణిత వస్త్రాన్ని అంటజేసి కప్పివుచ్చటం. పిష్ట పత్రా (*pastel paper*)లలో ఒక రకమైనది ఈ విధంగానే తయారవుతున్నది.

**flock prints** : మొఖమల్ ముద్రాంకాలు.

మొఖమల్ పైన సాగే వస్త్రతనాన్ని అనుకరించే ముద్రాంకాలు. చక్కగా మలచిన కొయ్యదిమ్మపై గోదుమ వన్నె జిగురునో, పిష్టాన్నో పూసి, దానిని ఒక కాగితంపై అద్ది, అంతట ఆ కాగితంపై చిన్న చిన్న గుడ్డ ముక్కలను వెదజల్లగా, అవి అందులోని జిగురుకు లేదా పిష్టానికి గట్టిగ అంటుకోవటం వల్ల ఇటువంటి ముద్రాంకం ఏర్పడుతుంది.

**flong** : మృదు పత్రం.

పత్రాస్తర (*papier mache*) ప్రక్రియ కోసం పలచని కాగితాలను జిగురుతో, పొరలు పొరలుగా అతికి తయారు చేసిన పదార్థం.

**flooring** : పరుపుతు

**Florentine brown** : ఫ్లారెంటైన్ కపిశం.

వాన్‌డైక్ కోణవర్ణానికే ఇంకో పేరు.

**Florentine lake** : ఫ్లారెంటైన్ రంజకం.

కుసుంభ రంజకాని (క్రిమ్‌సన్ లేక్)కి పర్యాయ నామం.

**floriated** : చిత్రకుసుమిత.

సహజ రీతిలోగాని, శైలీకృత రీతిలోగాని రూపొందించిన పుష్పాలంకరణ కలది.

**flowing :** *ప్రస్రుత.*

**fluidity :** *ద్రవత.*

**fluorescence :** *కాంతిస్ఫారణ.*

1. కొన్ని పదార్థాలు, ఎలెక్ట్రో మేగ్నటిక్ రేడియేషన్ కాంతిలోగాని, అల్ట్రా వయొలెట్ కాంతిలో గాని ఉంచబడ్డప్పుడు, ఆ పదార్థాలు కాంతివంతములై వెలిగే లక్షణం.

2. కొన్ని రసాయనిక పర్ణాలు రెండు ఛాయలు కలిగి ఉండటం. ఉదాహరణ: ఫ్లోరోసిన్ (యురేనైన్). దీని ద్రవరూపం పసుపు రంగు కలిగి, ఆకు పచ్చని మెరుపుతో ఉంటుంది. 2. రోడమైన్. ఇది ఒక నీలలోహిత పర్ణమైనా, పసుపు మెరుపు కలిగి ఉంటుంది.

**fluorescent paint or day light fluorescent colour :** *కాంతిస్ఫారక వర్ణం.*

ఒక విధపు రాసాయనిక పర్ణం. మిక్కిలి కాంతివంతమై, మెరుపు కలిగి ఉంటుంది. అతి నీల లోహిత (అల్ట్రావయొలెట్) కిరణాలను ప్రసరింపజేసి, రాత్రిపూట కాంతిమంతంగా కనిపించేట్లుగా చేయవచ్చు. కాంతిమంతమైన ఎరుపు, పసుపు, నీలం, ఆకుపచ్చ పర్ణాంలో ఈ రంగులు లభిస్తాయి. ఇవి లలిత కళలలో ప్రయోజనం కలవి కావు.

**fluting :** *నీశారేఖనం*

వాస్తు శిల్పంలో కొన్ని భాగాలలో లోతైన చారలను చెక్కటం. ఇట్లా చెక్కినప్పుడు చారలలో ఒకదానికి, ఇంకొక దానికి మధ్య కర్రను నిలిపిన రీతిలో ఆకృతి ఏర్పడుతుంది. స్తంభాలు మొదలైనవాటి అలంకరణకు ఇది చక్కగా ఉపకరిస్తుంది.

**flux :** *ప్రస్రావణం*

మరొక ద్రవ్యంతో కలిపినప్పుడు, ఆ ద్రవ్యపు ద్రవీభవన బిందువును కిందికి దిగజార్చే ద్రవ్యవిశేషం. పింగాణి తయారీలో ఇటువంటివానిని వాడుకచేస్తారు.

**flux or fluxing ingredient;** *పద్రవణకం లేక ప్రస్రావక సంఘటకం.*

ఒక వస్తువుతోగాని, యౌగికంతోగాని కలిపినప్పుడు ఆ వస్తువుయొక్క లేదా యౌగికపు ద్రవీభవనబిందువును దిగువకు దెచ్చి దాని విలయాన్ని, లేదా కాచీకరణను త్వరితం చేయ గలిగే ద్రవ్యం.

**foamed plastics :** *ఫేనిత కల్పకాలు.*

ఒక కల్పకాన్ని తయారు చేసేటప్పుడే దానిలో అక్కడక్కడ గాలితోగాని లేదా ఇంకొక వాయుద్రవ్యంతోగాని నిండిన శిలికాయను లేదా బుడగలను చేరిఉండేట్లు జాగ్రత్త తీసుకోవటం వల్ల ఫేనిత కల్పకాలు రూపొందుతాయి. ఇటువంటివి బరువు తక్కువగా ఉండి, జల నిరోధకాలై, నీటిపై తేలగలిగి చాలా మన్నిక కలవై ఉంటాయి.

**foliage (foliate) sculpture :** *తరువృద శిల్పం; పత్రశిల్పం.*

శిల్పంలో, ఉద్భిజ్జ ప్రలక్షణములు ఎన్నోరకాలుగా వినియుక్తాలవుతున్నాయి. మూర్తి భృత్యాలకు అనుషంగికాలుగానో, ప్రతీక విశేషాలుగానో, అలంకారిక రూప విశేషాలుగానో ఆ ప్రలక్షణాలం హాదుక అందులోకనపడుతుంది.

అటువంటి చిట్టచివరి రీతికి చెందినదాన్నే తను వృద కిల్పం అని వ్యవహరిస్తారు.

**foliated :** *పత్రిత.*

1. పత్రాలంకృతంతో పొగిన సంలేఖనం కలది.

2. పొరలు పొరలుగా, అప్రకపు బిళ్లల మాదిరిగా విడదీయటానికి వీలయ్యేది.

**folium :** *పర్ణకం.*

వివిధ వనస్పతి రంగద్రవ్యాల నుంచి తయారై, మల్బరీ రంగు కలిగి ఉండే ఒక వర్ణద్రవ్యానికి మధ్యయుగాలలో వాడుకలో ఉన్న పేరు.

**flok art :** *జానపద కళ.*

శాస్త్రీయమైన శిక్షణ ఏమీ లేకుండా, ఏదో పారంపర్యంగా వచ్చే ఒక సంప్రదాయాన్ని అనుసరించి చేసిన కళాసృష్టి చిత్రాలలో, శిల్పాలలో, చేతిపనులలో, అలంకరణలలో ఇది కనపడుతుంది. ఇటువంటి కళా సంప్రదాయం, ప్రతి దేశంలో ఏదో ఒక తీరున కానవస్తున్నది.

**follower :** *అనుయాయి.*

**font (fount) :** *ఉదీరం.*

**Fontainebleau school :** *ఫాన్‌టెన్‌ బ్లూ కళాకార సమితి.*

16వ శతాబ్ది మధ్యభాగంలో, ఫ్రాంసు దేశంలోని ఫొంటెన్ బ్లూలో పర్తిల్లినకళాకారుల వర్గం. 1530లో ఇల్‌రాస్సో అనే కళాకారుడు దీన్ని ప్రారంభించాడు. ఈ సమితి సభ్యుల పద్ధతులు రీతిమార్గ కళకు చెందినవి.

**forceful :** *ప్రబల; శక్తిమంత.*

**fore-edge painting :** *పుర స్తటచిత్రణ.*

ఒక పుస్తకాన్ని మూసినప్పుడు దాని పుటల నిలువునా కొనల కలయికతో ఏర్పడి, కనపడే తలంపై పొగించే సీటరంగు చిత్రణ 18, 19 శతాబ్దాలలో ఇటువంటి చిత్రణకు ఆదరణ ఎక్కువగా ఉండేది. ఈనాడది అంతగా అద్భుతంకాదు. కాని పాతపుస్తకాలను సేకరించేవారు. ఇటువంటి చిత్రణను ఒక గణనీయ ప్రత్యేకతగా భావిస్తారు.

**foreground :** *పురోభూమి.*

చిత్రంలో ప్రేక్షకుడికి, సమీపంగా ఉన్నట్టు చూపే ప్రదేశం. దృష్టి ప్రక్రమగతిలోని మూడు భాగాలలో ఇది ఒకటి.

**foreshortening :** *క్షయవృద్ధి.*

ప్రేక్షకుడికి దగ్గరగా ఉండే అవయవ భాగాలు పెద్దవిగాను, దూరంగా ఉండేవి చిన్నవిగానూ ఉండేట్లుగా ప్రమాణాత్మకంగా చిత్రించే పద్ధతి. ఉదాహరణ: చిత్రంలోని రూపం తనచేతిని ప్రేక్షకుడి వైపుగా చాపి ఉన్నట్లు చూపినప్పుడు, చేతివేళ్లు మిగిన భాగంకంటె పెద్దవిగా కనిపిస్తాయి.

**forest marble or landscape marble :** *అరణ్య రాళ్ళం; లేదా భూదృశ్య రాళ్ళం.*

పాండుర వర్ణంలో ఉండే ఒక విధమైన చలువరాయి. నునుపు చేసినప్పుడు దాని ఉపరితలంలో నలుపు చిన్నెలు అక్కడక్కడ రమ్యంగా కనపడతాయి. అందువల్ల ఒక భూదృశ్య చిత్రం అక్కడ ఉన్నట్లు వ్యంజిత మయ్యే అవకాశం ఉంది.

**forgery :** *కూటకరణం.*

ఇతరులను మోసగించే ఉద్దేశంతో తయారు చేసిన చిత్రం. సాధారణంగా ఇటువంటి వాటిని గతకాలంలోని ప్రఖ్యాత కళాకారుల శైలిలో చిత్రించి, ఆ కళాకారుడే స్వయంగా రచించిన చిత్రమని చలామణీ చేయటం జరుగుతుంది. అటువంటి కూటచిత్రానికి గతకాలంలో ఆనాడు వాడిన వర్ణ ద్రవ్యాదులనే వాడటం కూడా ఉన్నది. ఇటువంటి వాటిని కనిపెట్టటానికి ప్రస్తుతం, అనేక శాస్త్రీయ విధానాలున్నాయి.

**form :** *రూపం; ఆకృతి.*

1. చిత్రణలో కళాకారుడు ఉపయోగించే విశిష్ట విధానం. చిత్రాన్ని ఊహించే రీతి, దానిని అమర్చే విధానం, వర్ణ ద్రవ్యాదులను వాడే పద్ధతి, రచనా విన్యాసం-మొదలైన వాటివల్ల దీని నిర్ణయం ఏర్పడుతుంది.

2. ఒక కళారచనలోని రూప సమూహం సూక్ష్మమైన పొందిక.

**formal :** *ఔపచారిక.*

**formalism :** *నైయమిక వాదం.*

కళాసూత్రాలను మూఢవిశ్వాసంతో అనుసరించటం లోనే ఆసక్తికల పద్ధతి. కాని సోవియట్ దేశంలో, పశ్చిమీయ పద్ధతులను అతిక్రమించి, రచించిన కళాఖండాలను ఈ వాదానికి చెందినవిగా పరిగణిస్తారు.

**Formica :** *ఫార్మికా.*

దళ రూపంగా పొరలు పొరలుగా అమర్చబడ్డ ఫెనాలిక యక్షధూపపు దళ్వరాలకు వాడుకలో ఉన్న వ్యాపార నామం.

**fossil resins :** *శిలీభూత యక్షధూపాలు.*

**foul biting :** *పదంశనం; దుర్దంశనం; విషమ దంశనం.*

సూచీ చిత్రణలో ఫలకంలోని లోపంవల్ల కలిగే మచ్చలు, గీతలు. క్షయికరీ నిరోధకమైన పూతలోని లోపంవల్ల ఇటువంటిది కలగవచ్చు.

**found object :** *ప్రాప్త వస్తువు.*

కళాఖండరూపంలో కళాకారుడు శ్రద్ధతో అమర్చటానికి అనువుగా, ప్రకృతిలో సహజసిద్ధంగా అతడికి ప్రాప్తించే ఎండిన చెట్ల కొమ్మలు, చిత్ర విచిత్ర రూపాలలో ఉన్న శిలలు మొదలైనవి. సాధారణంగా కళాకారుడు ఈ ప్రాప్త వస్తువులో ఏమార్పు కూడా చేయడు. 20వ శతాబ్దంలో అవతరించిన ఒక కళారీతి ఇది. డాడావాదులూ, అధివాస్తవికతావాదులూ దీనికి ప్రాముఖ్యాన్నిచ్చారు. ఇది గాక, యంత్రాదులలోని కొన్ని భాగాలను మాత్రమే తీసుకొని అమర్చి ప్రదర్శించినప్పుడు దాన్ని సిద్ధవస్తువు (*Readymade*) అంటారు.

**foundry sand :** *పోత ఇసుక; కొలిమి ఇసుక.*

పోత పోయటంలో ఉపయోగించే ఒక ప్రత్యేకమైన ఇసుక. దీనిలో సిలికా, అల్యూమినా, ఇటుకలకు వాడే మట్టి కలిసి ఉంటాయి. దీన్నే ఫ్రెంచి ఇసుక (*French sand*), ఇత్తడి ఇసుక (*Brass sand*) అని కూడా వ్యవహరిస్తారు.

**fountain brush :** *ఊటకుంచె.*

వర్ణద్రవ్యాలనుగాని, చిత్రలేఖనపు సిరాలను గాని పై భాగాన నింపవుంచగల కుంచె.
(చూ : *felt-tip pen*)

**foxing :** పనిమి మచ్చ.

తేమ తగలటం వల్ల కాగితంపై పట్టే మచ్చలు. ఇవి గోధుమ రంగుగా గాని, పసుపు రంగుగా గాని ఉంటాయి. దాకలి చవుడు (బ్లీచింగ్ పౌడరు)ను నేర్పుతో ఉపయోగించి ఇటువంటి మచ్చలను తీసివేయవచ్చు.

**fractional rendering** *ఆంశిక చిత్రణ.*

ఒక చిత్రంలో వివిధాకారాలను ఏకంగా గాక, విడివిడిగా చిత్రించడం దీనివల్ల ప్రతి ఆకారాన్ని విపులంగా రూపొందించటం జరుగుతుంది. ఇటువంటివి ముఖ్యంగా తొలి నాగరకతనాటి కళలో, ఈజిప్టుదేశపు ప్రాచీన చిత్రకళలో కనపడతాయి. ఆధునాతన కళా కారులు కొందరు ఈ పద్ధతిని అనుసరిస్తున్నారు.

**fractur or fraktur :** *అలంకరణ లిపి.*

అలంకారయుక్తమైన జర్మన్ - గోతిక్ అక్షర విన్యాసం. ఈ రాతపని చుట్టూ పక్షులు, పువ్వులవంటి రూపాలను నేర్పుతో చిత్రించేవారు. శుభలేఖలు మొదలైనవాటి అలంకరణ ఈ తీరుగా జరిగేది. దీన్ని జాన పద కళగా భావించ వచ్చు.

**frame :** *చట్రం; చట్టం; ఆవరణిక.*

**Frank fort black :** *ఫ్రాంకుఫర్టు నల్ల రంగు.*

ముదిశా కాలిమకు పర్యాయనామం.

**free form shapes :** స్వేచ్ఛారూపాలు.

క్రమబద్ధంకాక, జ్యామితీయ రూపాలలో దేన్నీ పోలిఉండక, వక్రరేఖలలో ఉండి, పక్షుల, జంతువుల ఆకృతులనుగాని, శరీరం లోపల ఉండే కోశాదులను గాని కొద్దిగా పోలిఉండే రూపాలు. ఇటువంటి రూపాలను, ప్రస్తుతకాలంలో భవనాలలోపలి అలంకరణకు ఎక్కువగా వాడుతున్నారు. హాన్స్ఆర్ప్ (1887-1966) రచనలు, ఇటువంటి రూపాలకు చక్కటి ఉదాహరణలు. చీనీయుల 'తైల బిందు' (*oil-spot*) ప్రక్రియలో దీన్ని చూడవచ్చు.

**freehand drawing :** స్వేచ్ఛందాలేఖనం.

సాంకేతిక పరికరాల సాయం లేకుండా, రచించిన ఆలేఖనం (రేఖా చిత్రం)

**free stone :** మెత్తరాయి.

సున్నపురాయి, ఇసుకరాయి వంటి శిల. చెక్కేటప్పుడు ఇటువంటిది పగిలిపోదు.

**French blue :** *ఫ్రెంచి నీలిమ.*

అతిసాగరిక నీలిమకు ఇంకో పేరు. మొదట్లో ఈ వర్ణద్రవ్యాన్ని, తక్కినవాట్ని ఫ్రాన్సునుంచి దిగుమతి చేసుకోవటంవల్ల, 19వ శతాబ్ది పూర్వార్ధంలో దీనికి ఈ పేరు వచ్చింది.

**French chalk :** *పరాసే నేమసున్నం; ఫ్రెంచిచాక్.*

గిరిజామలానికి పర్యాయనామం.

**French curve :** *పరాసే వక్ర.*

ప్లాస్టిక్‌వంటి పారదర్శకపు పదార్థంతో తయారుచేసిన అట్ట; దీన్ని ఆధారంగా

చేసుకొని, హారవృత్తాలనగాని వక్రరేఖలను గాని చిత్రించవచ్చు. ఇట్టి అచ్చులు అనేక ఆకారాలలో పరిమాణాలలో లభిస్తాయి.

**French polish :** ఫ్రెంచి మెరుగు; ఫ్రెంచి పాలిష్

నాజూకైన గృహోపకరణ సామగ్రికి, నూనె కలిపిన మేలి లక్కతో కల్పించే సాంప్రదాయికపు పరిష్కృతి.

**French-process zinc oxide :** ఫ్రెంచి ప్రక్రియా నాగభస్మం.

పూర్తిగా కరిగిన నాగలోహపు ఆవిరిని మండించి, అందులోంచి వచ్చే పొగలను సేకరించగా లభించే నాగభస్మం. దీన్నే నాగ శ్వేతం (*zinc white*) అని కూడా అంటారు.

**French purple :** ఫ్రెంచి ధూమ్రం.

ఆర్చిల్ అనే పేరుగల సహజ రంగ ద్రవ్యంనుంచి తయారు చేసే ఒక రంజక ద్రవ్యం.

**Fre sand :** ఫ్రెంచి ఇసుక.

(చూ: *foundry sand*)

**French ultramarine :** ఫ్రెంచి అతిసాగరిక.

**French veronese green :** ఫ్రెంచి వెరోనీ హరితం.

విరిడియన్ అనే వర్ణద్రవ్యానికే, మరొక పేరు. ప్రస్తుతం ఈ పదం వాడుకలో లేదు.

**Fronch white :** ఫ్రెంచి శ్వేతం

నాగశ్వేతానికే ఇంకో పేరు. ఇది ప్రామాణికత పొందిన పేరుగాకపోయినా, వాడుకలోనే ఉన్నది.

**fresco :** వర్ణ్యాన్వం; ఆర్ద్రభిత్తి చిత్రం; మంద చిత్రం.

'ఫ్రెస్కో' అనే ఇటాలియన్ పదానికి 'తాజాదనం' అని అర్థం. తడిగా ఉన్న సున్నపు గిలాబాపై, సున్నం వల్ల మార్పు చెందని నీటివర్ణాలతో రచించిన చిత్రమిది. ఇది తడిగా ఉన్నప్పుడు సున్నపు గిలాబా లోకి రంగులన్నీ చక్కగా ఇంకి, చాల మన్నిక కలిగి ఉంటాయి. ఇవి రాసాయనికాలైన మార్పులకు లోను కావు కాబట్టి, నిరంతరం తేజోవంతంగా ఉంటాయి. ఇవి ఆరుబయట పనికిరావు. అపరిశుభ్రమైన గాలి, గాలిలోని దుమ్మువల్ల ఇవి చెడిపోతాయి. గోడలపై చిత్రణకు ఈ మందచిత్రణ అత్యుత్తమం. దీనిపై అనావశ్యకమైన మెరుగు ఉండదు. రంగులు తాజాగా, ఉజ్జ్వలంగా ఉంటాయి. దీనిలో పెద్ద ప్రమాణంలో చిత్రాలను, చిత్రించటానికి వీలుంటుంది.

ఈ చిత్రణకు, గోడను మొదట చక్కని నేర్పుతో క్రమబద్ధంగా తయారు చేయాలి. దీని కోసం చాలా పొరలను, గార సున్నంతో పట్టించాలి. ఇందులో తొలిపొర చాల గరుకగా ఉంటుంది. దీన్ని గరుకుపూత (*scratch coat*) అంటారు. దానిపైన ముదురుపూత (*brown coat*); ఆటుతర్వాత దానిపైన ఇసుక పూత (*sand coat*) పట్టించి, చివరకు చిత్రణకు అనువైన వర్ణోపాధి (*Intonaco*)కై పూతపూస్తారు. సాధారణంగా, చిత్రించ వలసిన చిత్రాలను ఇసుక పూతపైనే గాఢములైన నీటి వర్ణాలతో రేఖా రూపంగా చిత్రిస్తారు. చిత్రకారుడు ఈ చిత్రణను సాయంకాలం వరకు గానీ, గోడ తడి ఆరి

రంగులు పీల్చుకోలేని స్థితి వరకుగాని కొనసాగించి, అప్పుడిక ఆపివేస్తారు. చిత్రణ చేయక, ఆరిపోయిన భాగాన్ని తీసి వేసి, మళ్ళీ చిత్రించటానికి ముందు మాత్రమే అక్కడ పూతవేయాలి. ఇటువంటి దానివల్ల వచ్చే అతుకులు కన్పించకుండా ఉండటానికి, చిత్రంలో రేఖలు చూపే ప్రాంతాలలోనే ఈ అతుకులు వచ్చేట్లు జాగ్రత్త పడతారు.

తడిపూతపై చిత్రణ సాగించే పద్ధతి మధ్యధరా సముద్రపు నాగరికతలలో ఎక్కువగా వ్యాప్తి చెందింది. క్రీస్తు పూర్వము 200 నుంచి క్రీ.శ. 600 వరకు చిత్రించిన అజంతా చిత్రాలలో, పైన పేర్కొనిన అతుకులు లేకపోటానికి కారణం విమర్శకులు గ్రహించ లేకున్నారు.

యూరపీయ పునరుజ్జీవన యుగపు కళాకారులు, ఈ కళను, అత్యున్నత స్థాయికి తీసుకొనిపోయారు 17వ శతాబ్దినుంచి ఈ ప్రక్రియ క్షీణించిందని చెప్పవచ్చు. కాని ఆధునిక కాలంలో మెక్సికోలో దీన్ని పునరుద్ధరించారు వస్తుతం భవనాల లోపల ఈ రకమైన చిత్రాలను తైల వర్ణాలు, పాలిమర్ వర్ణాలు, దధిచూర్ణ వర్ణాలతో రచిస్తున్నారు.

గోడలపై సాగించే చిత్రణకు చెందినవే అల్లిన్న చిత్రాలు(*murals*). అయినా వీటికిపై దానితో ప్రక్రియాభేదం ఉంది.(చూ: *mural*)

**freshness** : నవత.

**fret** : వ్యామిశ్రకం.

జల్లెడ లాగా, వివిధ ఆకారాల రంధ్రాలతో చేసిన అలంకరణ.

**fretsaw** : సన్నరంపం.

**fret work** : వ్యామిశ్రకళ.

ఒక కొయ్యలో ప్రత్యేకమైన అంచుతో తీర్చిన, పారిశ్రామిక రూపరచన.

**frieze**[1] : శాఖికం.

(చూ : *vitruvian scroll*)

**frieze**[2] : గళవం

(*architecute*)

**frilling or sagging** : నడలుదల.

చిత్రానికి నిలువరీతిలో రంగుపూత జరిగే టప్పుడు దానికి పట్టించిన బొమ్మకు వార్నిషులోగాని, పలచని రంగుపూతలో గాని అడ్డుగా కనబడే వంకరలు, అలలవంటి గీరలు. చిత్రంలో దీనిని లోపంగా పరిగణిస్తారు.

**frisket** : అనులేఖ్యం.

ఉలిపిరి కాగితంలో కొన్ని రూపాలను చిత్రించి, కొన్ని భాగాలను కత్తిరించివేసి, మిగతా భాగమును రబ్బరు సిమెంటుతో, మరొక కాగితంపై అతికిస్తారు. ఈ విధంగా కత్తిరింపగా మిగిలిన ఉలిపిరి కాగితాన్నే అనులేఖ్య మంటారు. ఇట్లా చేయటంవల్ల, రంగు పూసినప్పుడు, ఉలిపిరి కాగితమున్న ప్రాంతంలో రంగు అంటదు. తరవాత ఉలిపిరి కాగితాన్ని లాగివేస్తారు. గాలి కుంచెతో పని చేసేటప్పుడు వాణిజ్య కళాకారులు. ఈ ప్రక్రియను ఎక్కువగా వినియోగిస్తారు. రబ్బరు సిమెంటు పూసిన అనులేఖ్యం బజారులో సిద్ధంగా లభిస్తుంది.

**frit** : అద్రావం.

ఒక విధమైన మార్దవ ద్యుతికం; ప్రస్రవకమును సైకతం (సిలికా)తోను, వర్ణ

సంఘటకాలతోనూ కలిపి ద్రవింపచేసి, ముద్ద గట్టిన తరవాత చూర్ణీకరిస్తే ఇది లభిస్తుంది.

**frontal depiction** : *అభిముఖ చిత్రణ.*

రూపాన్ని ముఖాముఖిగా ఉన్నట్లు చిత్రించటం. ఈజిప్టు దేశపు ప్రాచీన కళలో ఇటు వంటి రూపాలు అధికంగా కానవస్తాయి. ఇటు వంటి చిత్రాలు మధ్య సూత్రానికి రెండు వైపులా సమరీతిలో ఉంటాయి.

**frosted glass** : *మసక గాజు*

**frottage** : *సంఘర్షణ ప్రక్రియ.*

గోనముక్కలు, ఆకులు, గుడ్డ, కొయ్య వంటి వాటిని కాగితం అడుగున ఉంచి, పై భాగాన్ని రంగుసుద్దతో రుద్దితే వాటి ఆకారముద్రలు ఆకాగితంపై పడతాయి. సంప్రదాయ పూర్వకమైన ఈ ప్రక్రియను అధివాస్తవికవాదులు ఉపయోగించారు. సమాహరణ (*collage*) చిత్రాలలో ప్రప్రథమంగా వారు దీన్ని వాడారు.

**frottis** : *శేషచ్ఛాయ.*

పారదర్శకంగా ఉండే పలచగా వేసిన రంగు; లేదా తైలవర్ణాన్ని కాటికపై వేసి తుడిచి వేసినప్పుడు మిగిలే రంగు.

**fugitive colours** : *చల వర్ణాలు.*

ఎండ తగులటం వల్ల వెలిసిపోయే రంగులు.

**full length** : *పూర్ణాకృతి.*

నిండు రూపాన్ని చిత్రించిన మూర్తి చిత్రం; నిలువెత్తు రూప చిత్రం.

**full mold casting** :

(చూ : *lost pattern casting*)

**full-strength** : *నిండు వలిమ.*

**fumigation** : *అధివాసనం; ధూమ వ్యాపనం.*

గాలి చొరని పెట్టెలో ఒక కళాఖండాన్ని ఉంచి, కొన్ని రాసాయనిక ద్రవ్యాల ప్రభావానికి దానిని లోను చేయటం. ఈ విధంగా చేయటంవల్ల బూజువంటి లోపాలు తొలగిపోతాయి పరిరక్షణ పద్ధతులలో ఇది ఒకటి. ఈ పద్ధతిలో, థైమాల్ అనే రాసాయనిక ద్రవ్యం ఎక్కువ వాడుకలో ఉన్నది.

**functionalism** : *వ్యవహారణ వాదం.*

ఒక వస్తువులో కన్పించే వ్యవహారణ కుశలతకు సంబంధించిగానీ, లేదా దానితో అభిన్నంగాని సౌందర్య భావన దాంట్లో కుదురుకొంటుంది అనే ఒక సిద్ధాంతం. ఈ సిద్ధాంతం అత్యంత ప్రాచీన కాలంలోనే ప్రభవించింది.

**fundamental colours** : *ప్రధాన వర్ణాలు.*

వర్ణమాలలోని ప్రాతిపదిక వర్ణచ్ఛాయలకు- ఎరుపు, నారంగ, పసిమి, ఆకుపసిమి, నీలం, రాజనీలం, ఊదాకి- కొన్ని సమూహాలలో ఉపయోగించే సమాహారనామం.

**furnace** : *కొలిమి; ఉద్మానం.*

**furnace products** : *భట్టీ ఉత్పన్నాలు; ఉద్మాన ఉత్పన్నాలు.*

ఒక విధమైన అకార్బనిక వర్ణద్రవ్యాలు. కొలిమిలో వివిధ ఖాద్యకమాల వద్ద మసక ఎరుపునుంచి మొదలుగా తీవ్రపు వేడి గల మంట వరకు వివిధ ఘట్టాలలో సాగించిన కాల్పులవల్ల ఇవి లభ్యమవుతాయి. వీటి మన్నిక చాలా ఎక్కువ.

**furniture :** *సంస్కారిక; గృహోపకరణాలు.*

**furring :** *అంతుపొర్పు.*

గోడలపై ఉండే చిత్రాలపైన, బయటి వాతావరణపు ప్రభావం ఎక్కువగా పడకుండా ఉంచటానికి అసలి గోడకూ, చిత్రం ఉండే గోడకూ మధ్య ఖాళీ స్థలాన్ని ఉంచటం.

**fusion :** *విలీనీకరణం.*

రెండు వస్తువులను, విపరీతంగా వేడిచేసి ద్రవీకరించటం. ఈ పద్ధతిలో రెండు లోహాలను సంధించటానికి ఈ పదం ముఖ్యంగా వినియుక్తమవుతుంది.

**fusitic :** *విరసిత.*

అమెరికా ఖండంలో పెరిగే ఒక విధమైన చెట్టునుంచి లభించే పచ్చటి సహజ ద్రవ్యం; దీని మన్నిక చాలా తక్కువ.

**futurism :** *అనాగతవాదం; భవిష్య వాదం.*

ఇటలీలో 1909 సం॥లో మారినెట్టి అనే కవి ప్రచురించిన ఒక వాదవివరణ పత్రాన్ని ***(manifesto)*** మూల స్రోతస్సుగా స్వీకరించి బయలుదేరిన ఒక కళావాదం. ఆ తరవాత సంవత్సరంలో ప్రముఖ చిత్రకారులు- కారో కర్రా (1881-), ఉంబర్టో బోకియోని (1882-1916), లుయిగీ రొస్సోలో (1885-1947), జియకామో బల్లా, జీనో సెవిరినీ (జ. 1883) అనేవాళ్ళు- ఈ వివరణ పత్రాన్నే సమర్థిస్తూ, ఇంకొక వివరణ పత్రాన్ని తమ సంతకాలతో ప్రకటించారు. కళకు చెందిన సాంప్రదాయిక భావనలతో దాదాపుగా అన్నింటికీ ఈ అనాగతవాదులు స్వస్తి చెప్తూ ఆనాడు ఉచ్ఛస్థితిలో ఉన్న స్థూలతావాదాన్ని సైతం, చేతన రహిత వాదమన్నీ, ఈ భావన పాతపడిపోయిందని వారు నిరసించారు. అయినా అనాగతవాదపు చిత్రాలకూ, స్థూలతావాద చిత్రాలకూ కూడా వర్తించే కొన్ని సామాన్య లక్షణాలున్నాయనటం యథార్థం. కాలమునూ, దేశమునూ రెండింటని ఒకే ఒకే సమయంలో సూచిస్తూ, అతి తీవ్రమైన గతిశీలతతో వ్యక్తమయ్యే చిత్రం రూపొందించే లక్ష్యం గ్రహించినది అనాగత వాదం. యాంత్రికత, వేగం అనేవి ఇందులోని పరమోద్దేశాలు. 'శక్తిరేఖలను' ప్రాతిపదికలుగా, వస్తువుల రూపాలను చిత్రించాలనటం వీరి వాదం. చలనంలో ఉన్న జంతువులు, తమకు సహజంగా ఉండే కాళ్ళకన్న, ఎక్కువ కాళ్ళు గలిగి ఉన్నట్లు వీళ్ళు చిత్రించేవారు. వీళ్ళ చిత్రాల రంగులు అతి కాంతివంతములై, కొట్టవచ్చినట్లుండేవి. ప్రథమ ప్రపంచ యుద్ధం అంతమయ్యేనాటికి ఈ వాదం నామావశిష్టమైనా, 20 వ శతాబ్దిలోని కళావికసనగతికి ఇది కూడా కొంత.రకు తోడ్పడ్డదనటం సమంజసం. దాదావాదం అధివాస్తవికతావాదం, అపర్తికావాదం స్థూలతావాదం ఈ వాదపు ప్రభావానికి కొంతవరకు లోనైనాయి.

**Gadroon** : *అంచు నగిషీ*

లోహపు పాత్రంపై అంచులను అందంగా లోపలికి మడవటం; వెండి పాత్రల తయారీలో ఇది అధికంగా కనపడుతుంది.

**Gahn's blue** : *గానీయ నీలిమ.*

కోబాల్టు నీలిమ వాడుకలోకి రాక పూర్వం, వ్యాప్తిలో ఉన్న ఒక విధపు వర్ణం జర్మనీలో 1777 లో మొదట దీన్ని తయారు చేశారు. ఇది కోబాల్టు నీలిమ కన్నా నాణ్యతలో తక్కువ.

**gaine** : *చతుష్కోణి.*

శిల్పంలో శిరస్సునూ, భుజములనూ వివరంగా మలచి, కింది భాగాన్ని అస్పష్టంగా చతుష్కోణ రీతిలో వదలివేయడం. ఇటువంటిది ఈజిప్టు, గ్రీసు దేశాల ప్రాచీన శిల్పాలలో కనపడుతుంది.

**gallery** : *గ్రేటిక; గేలరీ.*

**gallery tone** : *గ్రేటికా స్థాయి.*

తైలవర్ణ చిత్రాలపై పూసిన వార్నిషు కాలక్రమాన నల్లబడిపోవటం వల్లనూ, దుమ్ము, మట్టి అతుక్కొని పోవటంవల్లనూ, చిత్రపు వర్ణస్థాయిలో కలిగే తగ్గుదలను సంభావనా పూర్వకంగా పేర్కొనటంలో వాడే పదం. ఇటువంటి తగ్గుదలను, 19 వ శతాబ్ది చివరలోను, 20 వ శతాబ్దంలోనూ శ్లాఘించేవారు. కొందరు చిత్రకారులు, కావాలని తమ చిత్రాల వర్ణాలలో ఇటువంటి తరుగుదలను కల్పించేవారు.

**gall stone** : *పిత్తశిల.*

ప్రస్తుతం వాడుకలో లేని ఒక పచ్చని రంజక వర్ణద్రవ్యం. ఎద్దులాలావుల పిత్తకోశం నుంచి దీన్ని తయారు చేసేవారు.

**gallipot** : *కుంభిక.*

ఒక చిన్న పింగాణీ గిన్నె. ప్రయోగ కాలంలో నూనెలను, మాధ్యమాలను, ఇందులో ఉంచుతారు.

**galvanised metal** : *గాల్వానిత లోహం.*

విద్యుత్ సహాయంతో తుత్తునాగపు పైపూత పట్టించిన లోహం ఈ పూతవల్ల తుప్పు పట్టటం జరగదు

**gamboge** : *కాంబోజ స్వర్ణం.*

కాంతివంతమూ, పారదర్శకమూ అయిన బంగారువన్నె పసుపురంగు. గార్సినియా అనే పేరుగలిగి, ఆగ్నేసియాలో పెరిగే, ఒక విధపు చెట్ల జిగురు నుంచి ఇది తయారవుతుంది. కాంపూచియా, థాయ్‌లాండు దేశాలలో ఇది ఎక్కువగా లభిస్తుంది. మధ్యయుగాలనుంచి ఈ రంగు వాడుకలో ఉన్నది. కాని ఇటీవల, కోబాల్టు పసుపు దీని స్థానం ఆక్రమించింది తైలవర్ణంగా ఉన్నప్పుడు ఇది పేలవంగా ఉంటుంది. నీటిరంగుగా ఉన్నప్పుడు, ఎండ తగిలితే, త్వర త్వరగా తేజస్సు కోల్పోతుంది. వార్నిషులకు ఛాయ రావడంకోసం ప్రస్తుతం ఇది వాడుకలో ఉన్నది. ఇది సారాయీలలో కరుగుతుంది.

**gammadion** : *మూల స్వస్తిక.*

గ్రీకు అక్షరాలలోని 'గమ్మా' అనే అక్షరాన్ని నాలుగువైపులనుంచి చిత్రిస్తే కలిగే



మూలస్వస్తిక

ఎడమవైపుది స్వస్తిక కుడివైపుది గ్రీకుసిలువ

ఆకారం. దీనినుంచి స్వస్తికనూ, గ్రీకు సిలువనూ రూపొందించవచ్చు.

**ganosis :** మైనపుపట్టు

చలువరాతి శిల్పాలపై, మసకరీతిలో మైనపుపూతను అమర్చటానికి ప్రాచీన గ్రీకులు అవలంబించిన ఒక విధానం.

**gargoyle :** *సోమసూత్రం.*

ఒక భవనపు కపోతపాళినుంచో, మిద్దె పిట్టగోడనుంచో, నీరు బయటకు పోవటానికి వింతరీతిలో-మానవ ముఖరూపంలోనో, జంతు ముఖరూపంలోనో-రూపొందించిన ఒకతూము.

**garnet :** *వజ్రోపలిక.*

వజ్రంలాగా మిల మిల మెరిసే తక్కువ రకమైన రాతి వస్తువు.

**garnet paper :** *వజ్రపత్రం.*

ఇది ఒక విధమైన గరుకు కాగితం. ఇది ఇంచుమించుగ మెరుగు కాగితం (ఇసుక కాగితం)లాగానే ఉంటుంది. కాగితంపై వజ్రోపలికలను అంటజేయటం వల్ల ఇది రూపొందుతుంది; ఇది లేతగులాబి వన్నెలో ఉంటుంది.

**garzone :** *కళాంతేవాసి.*

కళాకారుని దగ్గర శిక్షణ పొందుచున్న వాడు. 'గార్జోనె' అనునది ఇటాలియన్ భాషాపదము.

**gas black :** *వాయుకాలిమ;*

కర్బన కాలిమకు ఇంకొక పేరు.

**gate[1] :** *అరరం.*

(చూ; *sprue*)

**gate [2]:** *కుల్య.*

లోహ శిల్పాలను పోతపోసేటప్పుడు, కరగిన లోహం ప్రవహించేదుకు, మూలవాహిక నుంచి నిర్మించే సన్నటి కాలువ.

**gaude yellow :** *మెఱుపు పసిమి;*

*హరిద్రకానికి మారుపేరు.*

**gauze :** *విరళిక.*

**gelatin :** *జలాతిని; జంతులేపం, వజ్రలేపం; వజ్రిక.*

జంతువుల మాంసాదులను ఉడికించి చేసిన మేలురకపు జంక.

**gel-coat :** *కరుపుపూత.*

పాలిమర్ యక్షధూపాలను ఉపయోగించి పోత పోయటంలో, దొల్లచ్చుకు పైన మొదట్లో పట్టించే యక్షధూపపు పూత.

**Gèllert green :** *గెల్లర్ట్ హరితం.*

ఒక రకమైన కోబాల్ట్ హరితం.

**gel medium :** *వకుల మాధ్యమం*

జలాతినీ పొరను స్ఫురింపచేసే రీతిలో పట్టించటానికి అనువుగా తయారయ్యే ఒక పూతరంగు

**general effectiveness** *సార్వత్రిక సార్థకత.*

**genre painting :** *నిత్యజీవన చిత్రణ*

దైనందిన జీవన విధానాల చిత్రణ.

**geometric :** *జ్యామితీయ.*

**geometric abstraction :** *జ్యామితీయ వివిక్తత; జ్యామితీయ సారాంశత; జ్యామితీయ నైరూప్యం.*

జ్యామితీయ రూపాలతో కూడిన వివిక్త రూప చిత్రణ. ఇది సరళ రేఖలు, వృత్తాలు, చతుస్రాలు దీర్ఘ చతురస్రాలతో కూడి ఉంటుంది దీన్నే శాస్త్రీయ వివిక్తత (సారాంశత) అంటారు దీనికిన్నీ వివిక్తతా వాదానికి మధ్య స్పష్టమైన భేదం ఉంది. పారమ్యవాద ప్రతిపాదకుడైన మాలెవిక్, నవ కల్పన వాద ప్రతిపాదకుడైన మాండ్రియన్, దీనికి మార్గదర్శకులు

**geometric period** : *జ్యామితీయ యుగం.*

హెల్లెనీయ కళలోని ద్వితీయ ఘట్టం (క్రీ పూ 900 - 700). ప్రస్తుతం ఈ కళా కాలానికి చెంది లభించే వాటిలో,



హెల్లెనీయ పాత్ర (జ్యామితీయ యుగం)

పర్ణ వృత్తాలు, సమానాంతర రేఖలు, సర్పిలాలు, తదితర జ్యామితీయ రూపాలు కలిగిన పాత్రలు ఉన్నాయి. ఈ ఘట్టపు చివరిదశలో ఇట్లాంటి అలంకారాలలో మనుష్య ఆకృతి రూపాలకు స్థానం లభించింది.

**Georgian style** : *జార్జియ శైలి.*

ఆంగ్లదేశాన్ని వరసగా పాలించిన హానోవర్ వంశీయులలో మొదటి ముగ్గురి కాలంలో (1714-1820) వివిధ కళారంగాలలో వాస్తువు, అలంకరణ, గృహోపకరణ సామగ్రి, వెండి పనితనం-వీటిలో వర్ధిల్లిన ఆంగ్లదేశీయ కళాశైలికి, సర్వ సాధారణంగా ఉపయోగించే పదవిశేషం.

**Georgian white** : *జార్జియా పాలరాయి.*

అమెరికాలో లభించే మేలిరకపు పాలరాయి. శిల్పానికి ఇది చాలా చక్కగా ఉపకరిస్తుంది.

**German black** : *జర్మన్ కాలిమ.*

బిందు కాలిమకు పర్యాయనామం.

**gesso**: *తెల్లలప్పం; శ్యానకం.*

పూతపనికోసం ఉపయోగించటానికి తయారుచేసిన సీమసున్నం, సర్వేసుల మిశ్రమం. కొయ్యపైన, పొరచెక్కపైన అలంకరణను రచించటానికి, దీన్ని ఉపాధిగా వాడవచ్చు. పూతకు ఉండవలసిన గట్టితనాన్ని బట్టి, సర్వేసు కలపవలసిన పరిమితి నిర్ణయించబడుతుంది. పూత పూసినతరవాత మెరుగు కాగితంతో రుద్దితే ఆ ఫలకం దంతపు దానిలాగా కనపడుతుంది. చిగురు పర్ణాలను వేయటానికి, ఈ పూత ఎంతో అనువుగా ఉంటుంది. అయినా ఇది పెళుసుగా ఉండటం వల్ల, కాటికపై పూతకు అనువుగా ఉండదు.

మధ్యయుగం నాటినుంచి ఇది యూరపులో, వాడుకలో ఉన్నది. ప్రస్తుతం, కుందేలు చర్మంనుంచి తయారైన సర్వీసును దీని తయారీకి వాడుతున్నారు. అమెరికాలో తెల్ల లప్పానికి బదులుగా పాలిమర్ పర్ణాంనే వాడుతున్నారు.

**gesso duro** *గట్టి లప్పం*

సర్వీసు ద్రావణంతో గట్టిపరచిన ప్లాస్టర్ ఆఫ్ పారిస్. ఇది మన్నికైన కలడ్; అచ్చులో పోసి లతలు మొదలైనవి చిత్రించేటప్పుడు ఉపయోగపడుతుంది.

**giallolino (giallorino)** *అద్దుపసిమి.*

సీసంనుంచి తయారయ్యే ఒక విధమైన కాంతి నిరోధక పర్ణానికి ప్రాచీననామం.

**gilder's cushion :** *నగిషీవాని దిండు.*

లోహపు నగిషీ పనిచేసేటప్పుడు, లోహపత్రాన్ని ఉంచుకోవటానికి ఉపయోగించే దిండు. ఈ దిండుపై లోహపత్రాన్ని ఉంచి, చదునుచేసి కావలసిన పరిమాణాలలో కోస్తారు. 6x12 అంగుళాల ప్రమాణంలో కొయ్యపలక పై దూదినుంచి, దానిపై మెత్తని చర్మాన్ని కుట్టి, ఈ దిండును తయారు చేస్తారు. వెనక భాగంలో పట్టుకోవటానికి అనువుగా, తోలుతో రెండు ఉంగరాలను కుడతారు. ఒక ఉంగరం, బొటనవేలిని దూర్చి పట్టుకోవటానికి; రెండోది నగిషీ పనిచేసే అతడు కత్తిని ఉంచుకోవటానికి ఉపయోగపడుతాయి.



నగిషీవాని దిండు (ఎగువ సాధారణ రూపం; నడిమిది కుంచె; దిగువన దిండును తెరచినప్పటి రీతి)

**gilder's knife :** *నగిషీవాని కత్తి.*

లోహపత్రాన్ని కావలసిన పరిమాణం, ఆకారాలలో కత్తిరించటానికి ఉపయోగించే కత్తి. ఇది బల్లపరుపుగా ప్రమాణంలో ఉంటుంది. స్వల్పంగా వంగే గుణం కల ఈ కత్తికి, ఆవశ్యకమైన పదును మాత్రమే ఉంటుంది. పదును ఎక్కువగా ఉంటే, దిండును కూడా అది కోసివేసే ప్రమాదం ఉంది.

**gilder's tip :** *నగిషీ కుంచె*

ఉడుత వెంట్రుకలతో తయారుచేసిన కుంచెవంటి సాధనం. చాలా పలచని లోహపత్రాలను దీని సాయంతో పట్టుకొని, కావలసినచోట అతికించవచ్చు.

**gilder's wax :** *నగిషీ మైనం.*

వేడిచేసిన లోహపత్రాన్ని నగిషీ పనిలో అంటించే విధానంలో, పత్రానికి మెరుగు తేవటానికి ఉపయోగించే ద్రవ్యం. దీన్ని రాగి కిట్టం (కిలుం), పటిక, తేనెమైనాలను కలిపి తయారు చేస్తారు. దీన్ని లోహపత్రంపై పూసి, వేడిచేస్తే మెరుగు వస్తుంది.

**gilding** : *లోహరంజనం; లోహలేపనం.*

లోహం పూసినట్లు కన్పించటానికి చిత్రాలపైనా శిల్పాలపైనా, పలచని లోహపుపొరను అతికే కళ. ఇంకను, లోహపు పొడులను బంధకంతో కలిపి వాడవచ్చునుగాని, అటువంటి ప్రక్రియ వల్ల ఫలితం సంతృప్తికరంగా ఉండక, చౌకబారుగా ఉంటుంది. బంగారు, వెండి, పల్లేడియం లోహాల పత్రాలను, దీనికోసం శిల్పంలో, చిత్రలేఖనంలో వాడతారు. దబ్బలోహం, అల్యూమినియం పత్రాలు చౌకగా దొరకటం వల్ల, బంగారు, వెండి పత్రాలకు బదులుగా వాటిని వాడటం ఉంది. లోహపత్రాలను వాడటం, లోహపు పొడులను వాడటంకన్నా శ్రేష్ఠతరం.

**giorna** : *దినకృషి.*

భిత్తిచిత్రణ పద్ధతిలో ఒకరోజున చిత్రించిన భాగం.

**Giotteschi** : *గియొత్తీయులు.*

గియట్టో డి బోన్‌డోన్ (1267?-1337) అనే సుప్రసిద్ధ ఇటాలియన్ కళాకారుడి శైలి వల్ల ప్రభావితులైన చిత్రకారులు.

**gisant** : *శవ శిల్పం.*

శయనించినట్లు రూపొందించిన శిల్పం. ఇటువంటి దాన్ని సాధారణంగా మృతుల సమాధులపై చెక్కేవారు. గోథిక కళలో మృతుల రూపాలను, ఒక వైపున జీవచైతన్యంతో ఉన్నట్లూ ఇంకొక వైపున క్రిములతో నాశనమవుతున్న శవ రూపంలో ఉన్నట్లూ చెక్కేవారు. మొదట్లో ఇటువంటి సమాధి శిల్పాలను, మృతుల గౌరవార్థం చెక్కేవారని భావించవచ్చు.

**glair** : *గుడ్డు జిగురు.*

కోడి గుడ్డులోని తెల్లటిజిగురుతో కొంచెంగా నీరు కలిపి ఒక రాత్రి అంతా నిలవ ఉంచి, లోహ పత్రాన్ని అతకటానికి ఉపయోగించే ఒక రకపు జిగురు. ప్రస్తుతం దీనికి బదులుగా చర్మంతో తయారుచేసిన సరేసునే వాడుతున్నారు.

**glass-etching** : *కాచసూచీచిత్రణం; కాచదంశనం.*

**glassine paper** : *గాజుకాగితం; కాచపత్రం.*

పలచగా ఉండి, సంపూర్ణంగాగానీ, పాక్షికంగా గానీ, పారదర్శకంగా ఉండే నునుపైన కాగితం. దీనికి మైనపు పూతపూసి, తైలవర్ణ చిత్రాలకు రక్షణకుగాను, అతకవచ్చును; అవసరం లేనప్పుడు సులభంగా తీసి వేయవచ్చు.

**glass-lining** : *గాజుతట్టు.*

**glass maker** : *కాచకుడు; గాజుపనివాడు.*

**glass painting** : *కాచచిత్రణ.*

1. పింగాణీపనిలో ఉపయోగించే రంగులను గాజుముక్కలపై వేసి, బట్టీలో కాల్చి, అతికే చిత్రాలను తయారుచేసే పద్ధతి.

2 తైలవర్ణాలు, గహనవర్ణాలు, నీటివర్ణాలతో పారదర్శకంగా ఉండే అద్దంపై చిత్రించటం.

**glass prints** : *కాచ ముద్రాంకాలు.*

ఒక విధపు ముద్రాంకాలు. ఒక ఆకృతిని, ఒక కాచఫలకంపై లిఖించి, దాని దిగు

వన ఒక గ్రహణశీలిత కాంతిలేఖన పత్రా (*sensitized photographic paper*) న్ని ఉంచి, ఆ వస్త్రాన్ని సూర్యతప్తం చేయటం ద్వారా ఇటువంటి ముద్రాంకాన్ని తయారు చేస్తారు.

**glaze** : *తారళ్యం; మెఱుగు ;ద్యుతికం.*

1. తైలవర్ణ చిత్రంలో రంగులు, ఆరిన తరవాత పలచగా వేసిన తైల వర్ణపు పూత. ఈ పూతవల్ల రంగులు పారదర్శకాలుగాను, కాంతిమంతములుగానూ కన్పిస్తాయి.

2. పింగాణి సామగ్రిని కాల్చినప్పుడు మెఱుగు రావడానికోసం పూసే పూత; ఆ విధంగా వచ్చిన మెరుగు

**glaze of art colour** : *తైలవర్ణ ద్యుతి.*

**glazier** : *ద్యుతికారుడు.*

**glazing** : *ద్యుతి కల్పన.*

**gloss** : *నైగనిగ్యం; నిగనిగ; పరిశోభ.*

చిత్రాలపై ఉండే అద్దంవంటి మెరుగు. 19వ శతాబ్దిలో ఇటువంటి మెరుగుకు ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇచ్చేవారు. ప్రస్తుతం కళాకారులు, ఇటువంటి మెరుగును తేవటానికి అంతగా ఇష్టం చూపరు.

**glossy** : *నిగనిగని.*

**glow** : *పరిదీప్తి.*

**glowing** : *పరిదీప్త.*

**glue (1)** : *జిగురు; సరేస్రు.*

రెండు వస్తువులను అతకటానికి పనికివచ్చే జంక పదార్థం. దీన్ని నీటిలో కలిపివాడతారు.

**glue (2)** : *వజ్రలేపం; వజ్రిక*

జంతువుల గాలూకు చర్మాలతోను, ఎముకలతోను తయారయ్యే ఒక జిగురు పదార్థం. ఇటువంటి వాటిలో కుందేలు చర్మంతో తయారుచేసేవి అతి ప్రశస్తం. ఇది చిన్న చిన్న ముక్కలుగాను బిళ్ళలుగాను లభిస్తుంది. వేడిచేయటంవల్ల దీని గుణాన్ని తీవ్రంగా మార్చవచ్చు.

**glue cut-out method** : *వజ్రికా ఛాదన పద్ధతి.*

(చూ : *block-out stencil method*)

**glycerin** : *గ్లిసరిన్*

స్వచ్ఛమూ, విషరహితమూ భారవంతమూ అయిన ఒక విధపు ద్రవపదార్థం. నీటిలో, ఆల్కహాలులో ఇది చక్కగా మోళిస్తుంది.

**glyphic art** : *పరికల్పన కళ.*

నిడుపుగా, గాడి మాదిరిగా రూపొలుండే శిల్పకళ. ఇది అమెరికాలోని ప్రాచీనవాసులైన 'మాయా' ప్రజల నాగరికతలో కన్పించే శైలీకృతమైన కళ.

**glyptic art** : *రత్న శిల్పం.*

1. విలువగల రాళ్ళపై చెక్కిన రూపం, అలంకరణం.

2. మట్టిలో మలచిందిగాక, రాతిలో మలచిన శిల్పం.

**Gmelin's blue** : *మేలిన్ నీలిమ.*

అతిసాగరిక నీలిమకు ఇంకొక పేరు.

**goffer or gauffer** : *రేకంచు.*

1. పుస్తకాల అట్టలపై, పలచని లోహపు రేకు అతకటానికి అనువుగా, ఉబ్బెత్తుగా గాని, లోతుగా గాని చేసే పనితనం.

2. పై పనికై వాడే సాధనం

**golden glow :** *సౌవర్ణదీప్తి.*

**golden mean or golden section**

రమ్యతా నిష్పత్తి.

చిత్రాలు, శిల్పాలు, వాస్తు నిర్మాణాలలో ప్రమాణాల నిష్పత్తిని నిర్ణయించే నియమం. ఇది ఆకారంలోని భాగాల ప్రమాణ నిష్ప... నిర్దేశిస్తుంది. ఈ నియమం ప్రకారం పాదం నుంచి మోకాలువరకు ఉండే కొలత, కాలి ప్రమాణంలో సగం ఉండాలి అట్లానే కాలి ప్రమాణం, మొత్తం దేహ ప్రమాణంలో సగం ఉండాలి ఇటువంటి ప్రమాణాలను



రమ్యతా నిష్పత్తి పరికృతి దృశ్యం; (17వ, శతాబ్ది, అజ్ఞాత ఇటలీయ చిత్రకార రచన, కాడిరపై తైల చిత్రణ, క్షితిజరేఖ, చెట్టుయొక్క బోదెతో కలియుచోట కేంద్రమునకు ప్రథమభాగమున చిత్రపు కాంతి బిందువు రూపొందగా, ఆ బిందువు-కుడి యెడమల దూరమున, ఎగువ దిగువల కొలతన-ఎనిమిది-ట అయిదు భాగముల దూరాన కుదురు కొన్నది).

వాస్తుశాస్త్రంలో కూడా నిర్ణయించారు. యూక్లిడీయ సిద్ధాంతాన్ని అనుసరించి, క్రీ.పూ. 1 వ శతాబ్దిలో, విట్రూవియస్ అనే అతడు తన సిద్ధాంత గ్రంథం 'డి ఆర్కిటెక్చురా'లో, ఈ నిష్పత్తి నియమాన్ని సూచించాడు. యూరపీయ పునరుజ్జీవన కాలంలో లూకా పాసియోలి అనే అతడు 'పవిత్ర ప్రమాణము.' (డివినా ప్రపోర్షనే) అనే గ్రంథాన్ని, ఈ విషయాన్ని తెలుపుతూ, రచించగా, లియోనార్డో డా వించి దీనికి కావలసిన చిత్రాలు రచించాడు. ఈ సిద్ధాంతాన్ని పేరుతో పేర్కొకుండా, స్థూలతావాదులు కొందరు 'సెక్షన్ డి'ఆర్' అనే పేరుతో ప్రవర్తింపచేసి, ఒక పత్రిక నడపి, ఒక ప్రదర్శన నిర్వహించారు.

**gold leaf :** *స్వర్ణపత్రం; బంగారు వరకు.*

లోహరంజన ప్రక్రియ కోసం రేకుగా కొట్టబడిన బంగారం. బంగారం అతిమెత్తని

లోహంకావటంవల్ల, కాంతికి ఎదురుగా ఉంచి నప్పుడు వెలుతురు చొరబడేంతగా వంచని రేకుగా కొట్టవచ్చు. అప్పటికీ అది మెరుగును కోల్పోదు.

స్వర్ణపత్రం, మూడు అంగుళాల చదరం గల, 25రేకులుండే పుస్తకపు రూపంలో లభిస్తుంది. ఇది రిబ్బనులాగా పొడుగు పీలిక లుగా లభిస్తుంది. స్వచ్ఛమైన స్వర్ణపత్రం 28½ వన్నె (కేరట్లు) కలిగి, 1/800,000 అంగుళపు మందంలో లభిస్తుంది. ఇటువంటివి సుమారు 2,000 పత్రాలు 2 1/2 తులం తూకం ఉంటాయి. 18 1/2 వన్నె, లేదా 16 వన్నె గల స్వర్ణపత్రాలు కూడా లభిస్తాయి గాని, అవి అంత పలచగా ఉండవు. స్వర్ణ పత్రాలను చిత్రాలలోను, శిల్పాలలోను, ఇతర మైన అలంకరణలలోను ఉపయోగిస్తారు. జిగురు రంగు చిత్రాలలో ఇది ప్రముఖ పాత్ర వహించింది.

**gold paint** : *బంగారు రంగు.*

బంగారు వర్ణంగా కన్పించటానికి ఉప యోగించే కంచుపొడి. ఇదే విధంగా వెండి రంగుకై, అల్యూమినియం పొడిని వాడతారు. ఈ రెండూ తగినంత మన్నిక కలవికావు; కాబట్టి చిత్రాలలో వాడటానికి అనువైనవికావు.

**gold powder** : *స్వర్ణ చూర్ణం; బంగారు పొడి.*

పొడిగా చేసిన బంగారం; పురాతన కాలపు గ్రంథాలలోని చిత్రాలలో, ఈ పొడిని బంధ కంతో కలిపి వాడేవారు. ఇది స్వర్ణ పత్రం కన్నా విలువైనది, కాబట్టి లభించటం కష్టం. ప్రస్తుతం, విలువైన పింగాణీపాత్రల అలంకర ణలో మాత్రమే వాడుతున్నారు. స్వర్ణ పత్రాలకు తేనెను నీటిని కలిపి, గాజు రోలులో వేసి, దంచి పొడిచేయవచ్చు. ప్రస్తుతం వైద్యుతిక విశ్లేషణ (ఎలక్ట్రొలిటిక్) పద్ధతిలో దీన్ని తయారుచేస్తున్నారు.

**goldsmith** : *స్వర్ణకారుడు; బంగారుపని వాడు.*

**gold tessare** : *సువర్ణ చిత్రపట్టం.*

**Gothic art** : *గోతిక కళ.*

12 వ శతాబ్ది మధ్యకాలం నుంచి, 15 వ శతాబ్ది మధ్యకాలంవరకు యూరపులో ప్రబ లిన కళ. ఈ కళలో, తొలి గోతిక కళ 1137 న, ఫ్రాన్సులోని ఆలయ నిర్మాణా లలో ఆవిర్భవించి, క్రీ. శ. 1200 నాటికి, ఇతరదేశాలకు వ్యాపించింది. 13-14 శతాబ్దుల మధ్య ప్రబలిన ఈ కళాశైలిని 'ఉన్నత గోతిక' అని వ్యవహరిస్తారు. తరవాత ఈ కళ ఉత్తర గోతికశైలిగా కొంతకాలం ప్రవర్తి ల్లింది. 1400-1420 ప్రాంతంలో ఈ గోతికకళా స్థానాన్ని, పునరుజ్జీవన శైలి ఆక్రమించింది.

ఈ కళ వ్యాప్తిలోఉన్న కాలంలో, పెద్దవైన శిల్పాల సృష్టిన్ని పునరుద్ధరించటం జరిగింది ఆ యుగపు చిత్రకళలో గ్రంథచిత్రణ కళ కూడా అత్యున్నత స్థాయికి చేరింది. భిత్తి చిత్రణ, జియొట్టొ అనే కళాకారుడి కృషిలో, పరిణతి చెందింది. చిత్రాలలో వెలుగునీడలను చిత్రించ టానికి ప్రాధాన్యం ఈ కాలంలోనే వచ్చింది. కాచఖండ చిత్రణకూడా, ఈ కాలంలో అభి వృద్ధి చెందింది.

గోతిక కళ లిపిచిత్రణలో కొత్త పుంతలను తొక్కింది. 15వ శతాబ్దంలో గోతిక లిపిచిత్రణ స్థానంలో, రోమక, ఇటాలిక అక్షర పద్ధతులను మానవతావాద సిద్ధాంతులు ప్రవేశ పెట్టారు. తరవాత కాలపు ముద్రణ పద్ధతులలో ఇవి ఉపయోగ పడ్డాయి ప్రస్తుతం గోతిక అక్షరాలను వివాహ శుభలేఖలు మొదలైన వాటిలోను, ఇతర అలంకరణలలోను వాడుతున్నారు. నేటి ఆంగ్ల లిపి ముద్రాక్షరాలలో వెడింగు టెక్స్ట్, ఎంగ్రేవర్స్ ఓల్డ్ ఇంగ్లీషు, క్లాయిస్టర్ బ్లాక్ అనే అక్షరపు అర్తిక (టైపు) లలో మాత్రమే గోతిక స్వరూపాలు మిగిలి ఉన్నాయి. సాన్స్ సెరిఫ్ టైపులు అని వ్యవహరించే వాటిలో - ఫ్యూచురా, వోగ్, ఫ్రాన్ క్లిన్ గోతిక్-అనేవి కూడా గోతిక అక్షరాలే అని అంటారు. కాని యథార్థంగా ఇవి గోతిక లిపిచిత్రణను పోలి ఉండవు.

**gouache** : *గహనవర్ణ ప్రక్రియ.*

కాంతిభేద్యములైన నీటిరంగులను కాగితంపై చిత్రించే పద్ధతి; ఈవిధంగా రూపొందించిన చిత్రం. ఈవిధంగా వాడిన వర్ణాల కాంతి, పారదర్శకవర్ణాల కాంతి కన్నా భిన్నంగా ఉంటుంది. అంతగా తేజోవంతాలు గాని గహనవర్ణాలలో, కొంచెం మోతాదులో సీమసున్నాన్ని కలుపుతారు. దీనివల్ల వర్ణాల కాంతి మెరుగెక్కుతుంది. తక్కిన కాంతిభేద్య వర్ణాలను-సూత్రపాత వర్ణాలు, నీటితో కలిసే వర్ణాలు, చీనాతెలుపుఅనే వాటిని-కూడా ఇటువంటి చిత్రాలలో వాడవచ్చు. నీటి వర్ణాలు, సుద్ద రంగులు (*pastels*), కరక్కాయ సిరా (*Indian ink*) లను, తరచుగా గహన వర్ణాలతో పాటు వాడుతున్నారు.

పూర్వకాలం గ్రంథ చిత్రాల రచనలోను, అలతి చిత్రాలు చిత్రించటానికి ఈ గహన వర్ణ ప్రక్రియను ఉపయోగించారు. 16, 17 శతాబ్దాల తరవాత ఇటువంటి చిత్రాలలో మెరితావు(*High light*)లను సూచించటానికి మాత్రమే, గహనవర్ణాలను వాడటం జరిగింది. ప్రస్తుతపు చిత్రకారులు, పారదర్శక వర్ణాలతో రచించే చిత్రాలలో, అక్కడక్కడ గహన వర్ణాలను వాడటమూ, గహనవర్ణ చిత్రాలలో పారదర్శక వర్ణాలను వాడటమూ ఉంది.

**gouge[1]** : *అర్ధచంద్రాకృతి; నఖాకృతి.*

**gouge[2]**: *వంపు ఉలి.*

కొయ్య చెక్కడులో ఉపయోగించే వంపు కలిగిన ఉలి. ఆంగ్లాక్షరాలైన V, U ఆకారాలలో వివిధ ప్రమాణాలలో ఇవి ఉంటాయి.

**grace** : *లావణ్యం.*

**gradation 1** : *అనుక్రమం,*

1. వెలుగునుంచి చీకటి వరకు కలిగే మార్పును, క్రమగతిలో సూచించే ఛాయాంతర రీతి.

2. ప్రక్కప్రక్కగా ఉన్న రెండువర్ణాలను ఒకదానిలో ఇంకొక దాన్ని క్రమంగా మేళవింప చేయటం.

**gradation 2** : *స్థాయి భేదం.*

**graffito** : *ఘుషలేఖనం; త్వగ్విలేఖనం.*

పురాతత్త్వశాస్త్ర పరిభాషలో, గోడలపైనా, శిలలపైనా అనిద్ధాపూర్వకంగా వ్రాసిన అక్షరాలు. ప్రస్తుత కాలంలో, గోడల పైనా, తక్కినచోట్లా వ్యంగ్యంగాను, అసభ్యంగానూ రాసిన వాటికిన్నీ, ఈ పదాన్ని

వాడుతున్నారు. ఈపదాన్ని ఆంగ్లంలో దాని బహువచన రూపమైన గ్రాఫీటీ అనే రీతిగానే ఉపయోగిస్తారు. స్గ్రాఫిటో అనే అలంకరణకు కూడా గ్రాఫిటో అనేపదాన్నే వాడుతున్నారు (చూ: *sgraffito*). గ్రాఫిటో అంటే 'గీయటం' అని అర్థం.

**grain :** *రవ; వలుకు; కణరేఖ.*

**graining :** *కణరేఖా కరణం.*

1. ప్రత్యేకపు తూలికలు, దువ్వెనలు, స్పాంజీముక్కలతో రంగులనుపూసి కర్రకోతలో సహజంగాకనపడే రేఖలవలె రూపొందించడం.

2. శిలాలేఖన ముద్రణకు అనువుగా శిలాఫలకాన్ని తయారు చేయటం.

3 ముతకగా ఉండే లోహపుపొడులను తయారుచేయటం.

**grainy :** *వలుకు వాటం.*

**grand manner :** *మహారీతి.*

ప్రముఖ కళాపరిషత్తుల (అకాడమీల) చే సమర్థితమైన, చిత్రణ శైలులలోని ఒకఉదాత్త శైలి. దీనిని గురించి, రెయినాల్డ్స్ అనే ఒక ప్రముఖ ఆంగ్ల రచయిత, కళా విషయాలుపివరిస్తూ తాను వెలువరించిన ప్రసంగాలలో మూడోవానిలోను, నాలుగోదానిలోను చర్చించాడు.

**granite :** *నల్లరాయి.*

స్ఫాటికం, కణాత్మకం, స్తరరహితం అయిన ఆగ్నేయ శిల; ఇందులో వలుగురాయి, కేదారశిల, అతి సన్నిహితరీతిలో మేళవించి ఉంటాయి.

**grape black :** *గోస్తనీ కాలిమ.*

ద్రాక్షా కాలిమకు పర్యాయ నామం.

**graphic arts :** *గ్రాఫిక కళలు.*

లలిత కళలో చిత్రాలకు ప్రతులను వీరివీగా తీసే పద్ధతులు. వీటిలో జలఛాయా (*Aquatint*); ఖటికారీతి (*Crayon manner*) సూచీ ప్రక్రియ (*Drypoint*); సూచీ చిత్రణ (*Etching*); రేఖాశిల్పం (*Engraving*); శిలా లేఖనం (*Lithography*); అర్థఛాయ (*Mezzotint*); ఏకార్థిక (*Monotype*); కౌశేయ లేఖనం (*Serigraphy*) మృదుతల సూచీ చిత్రణ (*Soft ground Etching*); బిందులేఖనం (*Stipple engraving*); దారుతక్ష ప్రక్రియ (*Woodcut*); సిక్తపల్కాల ప్రక్రియ, దారురేఖాశిల్పం (*Wood engraving*) ప్రముఖాలు.

**graphite paper :** *నల్లసీసపు కాగితం*

ఒకవైపు నల్లసీసం పూసిన పలచని కాగితం. పూసిన భాగాన్ని తెల్లటి కాగితంపై ఉంచి, పైవైపు గీస్తే ఏర్పడే రేఖలను పెన్సిలు గీతలను చెరిపినట్లు సులభంగా చెరిపివేయవచ్చు.

**grater :** *అఘట్టకం.*

(చూ: *rasp*)

**graticulation :** *జాలీకరణ*

(చూ : *squaring*)

**graver or burin :** *పోగర.*

లోహంపై గీతలను చెక్కటానికి అనువుగా




పోగరలు (పైనఉన్నవి వివిధ రీతుల పోగరలు; దిగువని పోగరలకు అమర్చే పలురీతుల ఉక్కుపాళీలు
A చదరపువి; B చదునైనవి; C గుండ్రనివి,
D గీరలవి, E అండాకారపువి,

తయారుచేసిన ఉక్కుసాధనం ఇది. భిన్న ఆకారాలలోను ప్రమాణాలలోను ఈ సాధనాలు లభిస్తాయి.

**gravure :** ***అభిలేఖనం.***

అంతఃపాతి ముద్రణ ప్రక్రియలకు వర్తించే జాతినామం.

**gray :** ***ధూసరం.***

**grease crayon or grease pencil :** ***వసా ఖటిక లేదా క్రొవ్వు పెన్సిలు.***

పింగాణీ, గాజులపై రాయటానికి పనికి వచ్చే రంగుకణిక. వీటిలోనలుపురంగు దానిని సాధారణంగా కళాకారులు కాగితంపై వాడ తారు. దీని కన్నా స్వల్పంగా భిన్నమైన శిలా లేఖన ఖటికను, కళాకారులు ఎక్కువగా అభిమానిస్తారు.

**greasy :** ***వసామయ.***

**Grecian purple :** *యావనీ ధూమ్రం; తైరియ ధూమ్రానికి పర్యాయనామం*

**Greco-roman :** *గ్రెకో రోమక*

యూరపీయ కళా చరిత్రలో, హెలెనీయ కళను రోమకులు అనుకరించిన కాలాన్ని (క్రీ.పూ. రెండో శతాబ్ది ఉత్తరార్ధం; 1వ శతాబ్ది)నికి వర్తించే విశేషణం గ్రీకుల అనేక కళాఖండాలకు, రోమకులు ప్రతిరూపాలను ఎన్నిటినో తయారుచేశారు. ఈ ప్రతిరూపాలలోనే ఉత్తమమైన హెలెనీయ శిల్పాలను మనం చూడగలుగుతున్నాం. ఈజిప్టులోని ఫయూమ్ దగ్గర లభించిన శవపేటికపై చెక్కిన రూపచిత్రాలు, గ్రెకోరోమక సంప్రదాయానికి చెందినవే

**Greek art :** *యవనకళ; గ్రీకుకళ*
(చూ: *Hellenic art*)

**Greek cross :** *గ్రీకు సిలువ*

+ ఆకారంలో, నాలుగువైపులా సమానంగా ఉండే సిలువ క్రైస్తవ సంస్కృతికి పూర్వం పంటి ప్రతీకాలు ఉండేవి (చూ: *gammadion*)

**Greek pottery :** *గ్రీకు కౌలాలకము; గ్రీకుపింగాణీ.*

ప్రాచీన గ్రీకుల కళలో ప్రాముఖ్యం వహించిన ఒక కళాసృష్టి. వారు కూజాలను వివిధ ఆకృతులలోను, ప్రమాణాలలోను నిర్మించే వారు. మనుష్య చిత్రాలును, అలంకరణలను, ఆకూజాలపై ఉండేవి. హెలెనీయుల చిత్రకళా స్వరూపం ఈ కూజాలద్వారానే మనకు విశదమవుచున్నది. చిత్రితములైన ఇటువంటి కూజాలలో అత్యుత్తమములైనవి ఎథెన్స

నగరానికి చెందినవి. గ్రీకు కళలోని తద నంతర పరిణామాలు, వీటినుంచే ఉద్భవించా యని పండితుల అభిప్రాయం. ఈ కళకు ఇంకొక స్థావరంగా పేరుపొందినది కొరింత్.

**green :** *హరితము; ఆకుపచ్చ.*

**green earth :** *హరిత మృత్తిక.*

ఇనప సిలికేట్ కలిసిన మట్టి; ఇది స్వల్ప ఛాయాభేదాలతో లభిస్తుంది. ఇది మన్నిక కలవర్ణం ఇస్తుంది. దీనిలో అత్యుత్తమమైనది. మధ్య యూరపు, సైప్రసులలో లభిస్తుంది. ఆ ఉత్తమ మృత్తికలను క్రమంగా టైరోలీస్, వెరోనా అనే పేర్లున్నాయి; అవి కొంచెం నీలి వాకగా ఉంటాయి ఈ మృత్తికలలోనే బొహీమియన్ అనబడేవి స్వచ్ఛమైన ఆకుపచ్చ గాను, సైప్రియన్ అనేవి కొంచెం పసుపువాక గానూ ఉంటాయి. ఈ మృత్తికను నీటితో కలిపి వాడే పద్ధతి, బైజాంటియన్, తొలి ఇటాలియన్ భిత్తిచిత్రాలలో ప్రాముఖ్యం పొందింది. ఇది తైలవర్ణాలకు అంతగా పనికిరాదు.

**green pigments :** *హరిత వర్ణద్రవ్యాలు.*

'పెయింట్ స్టాన్‌డర్డ్' అనే పేరుతో ఉన్న ప్రామాణిక ప్రమాణాన్ని అనుసరించి, ఈ దిగువ పేర్కొన్న ఆకుపచ్చ వర్ణాలు, నూనెలతో కలిపి చిత్రలేఖనంలో వాడటానికి అర్హమైనవి: విరిడియం, తేలోసియానిన్ హరితం, క్రోమియం భస్మహరితం, కోబాల్టు హరితం.

(చూ : *pigment*)

**green rouge :** *హరిత రాగిక.*

**green smalt :** *హరిత కాచిక.*

కోబాల్టు హరితానికి ప్రాచీననామం.

**green verditer :** *హరిత తామ్రిక.*

బ్రెమెన్ హరితానికి వ్యాపార నామం.

**greenware :** *ఆమ సామగ్రి*

తయారుచేసి, ఆరబెట్టి, ఇంకా కాల్చని మట్టి సామగ్రి.

**grenadilla :** *గ్రీనడిల్లా;*

*(ఆఫ్రికేయ కృష్ణదారువు).*

**grid :** *తంత్రీ జాలిక*

**griffin :** *గరుడ సింహం.*

**grime :** *కాలుష్యం.*

**grind :** *నూరటం*

**griotte :** *ధూమ చంద్రిక*

ధూమ్రపు రంగువాక కలిగిన చలువరాయి. దీనిపై తెల్లటి మచ్చలుంటాయి; పిరనీస్ పర్వతాలలో ఇది లభిస్తుంది మేలి చలువరాళ్లలో ఇది యొకటి.

**grisaille :** *ధూసరిక.*

1. నలుపు, బూడిదరంగు ఛాయలతో చిత్రించిన ఏకవర్ణ చిత్రం. ఇటువంటి దాన్ని ఎక్కువగా, ఉబ్బెత్తు రీతిలాగా కన్పించేట్లు చేస్తారు ప్రాచీన గ్రీకు యుగంలో ఇట్టివి విశేషంగా కనపడతాయి. చిత్రాన్ని రంగులతో తయారుచేయటానికి ముందుగా ఇటువంటి దాన్ని చిత్రించటం ఉండేది.

2. గాజుపొడి, ఇనుము లేదా రాగి భస్మాన్ని ద్రావకసారాయంతో కలిపితే ఏర్పడ్డ మిశ్రమం; ఆ మిశ్రమంలో కొన్ని ఖండకాలను కూడా కలపవచ్చు. కాచఖండ చిత్రణంలో, ఒకే రంగు అద్దపు ముక్కలో

వేర్వేరు రంగులను తీసుకొని రావటానికిన్నీ, ఈ మిశ్రమం వాడతారు. ఈ మిశ్రమం కనుక్కోవటానికి పూర్వం వేరే వేరే అద్దపు ముక్కలపై వాడేవారు. ఈ మిశ్రమం సాయంతో సులువు గోధుమవర్ణం, ఆకుపచ్చ రంగులను ఒకే వలకంలో తీసుకొనిరావటం సాధ్యమవుతుంది. గాజుపలక చిత్రంలో జుట్టు, దుస్తులు, కన్నులు మొదలైనవాటిని స్పష్టంగా చూపటానికి ఈ మిశ్రమపు వాడుక తోడుపడుతుంది. వర్ణాల తేజస్సును పెంచటం, తగ్గించటం, మూడాయతనాలను చూపటం కూడా దీనివల్ల సాధ్యమవుతుంది.

3. అలంకరణ పూర్వకంగా ఉండే పింగాణి మెరుగు. పారదర్శకస్థితి నుంచి కాంతిభేద్యత స్థితివరకు ఛాయాక్రమాన్ని గాజుపై దీని వలన పొందవచ్చును.

**groove** : *గాడి.*

**grotesque¹** : *వింతయిన.*

**grotesque²** : *వింత శైలి.*

ఒక అలంకరణశైలి; రేఖాశిల్పంలోను, శిల్పంలోను, ఆభరణాలలోను, మానవ, జంతు రూపాలను వృక్షలతా పత్రాదులను శైలీకృతంగా రూపీకరించటం దీని లక్షణం. ఇట్లా రూపొందించిన కళాఖండాన్ని లేదా దానిలో ఒక రూపాన్ని కూడ ఈ పేరుతో వ్యవహరిస్తారు. ఇటలీదేశంలో ప్రాచీన కాలంలో సైతం ఇటువంటి కళాకృషి ఉండేదని తెలుస్తున్నది. తరవాత కాలంలో అది లుప్తం కాగా, రేఫెల్ (1483–1520) ఇటువంటి ఆకృతులను పునరుద్ధరించాడని సంభావితం. ఈ నాటికీ అది కొనసాగుతున్నది.

**ground** : *భూమి; భూమిక.*

1. వర్ణాలను పూయటానికి ఉపయోగపడే తలం; చిత్రాన్ని అనువుగ ప్రారంభంలో పూసే పూత. కాడికపై తైలభూమికను తయారుచేయటానికి, తెల్లటి వర్ణద్రవ్యాన్ని నూనెతో కలిపి వాడతారు. కొయ్యపలకపై భూమికను తయారుచేయటానికి దీన్నిగాని, తెల్లలప్పం (*gesso*) గానీ పూయవచ్చు. పాలిమర్ రంగులు వేయటానికి ప్రత్యేకపు పాలిమర్ భూమికను తయారుచేయాలి.

2. ఉబ్బెత్తు శిల్పంలో, ఉబ్బెత్తు రూపాలకు ఆధారమైన తలం

**group** : *వర్గం; బృందం*

కళాకారుల సమూహం ఇటువంటి వర్గాలు ఒకే శైలికి చెందిన కళాకారులతో ఏర్పడవచ్చు. కొన్ని ఆర్థిక, సాంఘిక, రాజకీయ కారణాలవల్ల, భిన్న సంప్రదాయాలకూ, భిన్న శైలులకూ, భిన్న సౌందర్య సిద్ధాంతాలకూ చెందిన కళాకారులు కూడా ఒకవర్గంగా సంఘటితం కావచ్చు.

**grout** : మెత్తమన్ను

మొజాయిక్ చిత్రణలో రంగుముక్కలను అతకటానికి ఉపయోగపడే తడిసున్నం లేదా సిమెంటు అలంకరణకు ఉపయోగించే రాళ్ళను, రంగుపలకలను అతకటానికి కూడా దీన్ని వాడుతుంటారు.

**guide, printmaker's** : ముద్రాచిత్రకారుని సూచిక

(చూ : *register mark*)

**guild** : *నిగమం; వృత్తికార సంఘం*

**guilded** : *సువర్ణితం;*

**guilloche** : *నాగబంధాలంకృతి.*

ఒక విధమైన అలంకరణ రూపం



నాగబంధాలంకృతి

ఇందులో రేఖలు పెనవేసుకొని ఉంటాయి.

**gum, arabic** : *తుమ్మజిగురు.*

అకేషియా (తుమ్మ) జాతికి చెందిన ఒక చెట్టునుంచి లభించే జిగురు. ఇది ఆఫ్రికా, ఆసియా, ఆస్ట్రేలియా ఖండాలలో లభిస్తుంది. ఇందులో అత్యుత్తమమైనది ఉత్తర ఆఫ్రికాలో దొరుకుతుంది వేడినీటిలో ఇది త్వరగా కరుగుతుంది. దీన్ని జిగురు వర్ణాలలోను, నీటిరంగులలోను బంధకంగా వాడతారు పింగాణిపై మెరుగు బాగా అతకటానికి దీన్ని ఉపయోగిస్తారు. ఔషధాలలోను, తీపి పదార్థాలలోను, కొన్ని పారిశ్రామిక ఉత్పత్తులలోను కూడా దీన్ని ఉపయోగిస్తారు. ఈ జిగురును నీటిలో కరగబెట్టి, బాగా మరగిస్తే దీని స్వభావం మారుతుంది; అప్పుడు నల్లగా మారి, ఘాటైన వాసన వస్తుంది. ఈ జిగురు ముద్దలుగాను, పొడిగాను బజారులో లభిస్తుంది. అకేషియా అనేది దీని ఔషధీయ నామం.

**gum eraser** . *మెత్తని రబ్బరు.*

మెత్తగా ఉండే రబ్బరు ముక్క. కాగితంపై పడే మరకలను, పెన్సిల్ గీతలను, కాగితం చిరగకుండా, అది తుడిచివేయగలదు.

**gum karaya** : *కరాయా జిగురు.*

నీటిలో వేసినప్పుడు ఉబ్బే, వృక్ష సంబంధపు జిగురు త్రగాకాంత జిగురుకు బదులుగా దీన్ని వాడవచ్చు (చూ:*gum tragacanth*) త్రగాకాంత జిగురుకన్నా దీనివెల తక్కువ. పలవ కాగితపు (*marble paper*) తయారీలో దీన్ని అధికంగా వాడతారు.

**gumming up** : *అతికించు.*

శిలాలేఖనంలో, రంగు సిరాను నిరోధించవలసిన చోట్ల తుమ్మజిగురు కలిసిన నీటిని పూయటం. ముద్రణకు ఫలకాన్ని తయారు చేసేటప్పుడు ఇది తుది ప్రక్రియ. ఈ పూత పూసిన తరవాత ఫలకాన్ని ఆరబెట్టాలి.

**gum spirit** . *నిర్యాస శీధువు.*

**gum tempera** · *జిగురురంగు; నిర్యాస కలలం.*

అవిసె నూనెగాని, మేలినూనె (*stand oil*)ను గాని, లేదా తారు వార్నిషుతో కలిపిన మేలినూనెను గాని, జిగురు కలిపిన నీటితో బాగా కలిపి, దానిలో కళాకారులు వర్ణాలను వేసి నూరినప్పుడు తయారయ్యేవి. దీనిలో స్వల్పంగా గ్లిసరీనును కూడా కలుపుతారు. ఇట్లా తయారుచేసిన వర్ణంతో చిత్రించే పద్ధతిని కూడా ఈ పేరుతోనే వ్యవహరిస్తారు. ఈ వర్ణాలు కాంతిమంతాలుగా ఉండి చిత్రకారులు పనిచేయటానికి సులువుగా ఉంటాయి. నీరు తగలగానే చెడిపోక, ఇవి మన్నిక కలిగి ఉంటాయి.

**gum thus** : *తూనిబంక.*

(: *rosin*)

**gum tragacanth** : *త్రగాకాంత జిగురు.*

ఆసియామైనరులో ఉండే 'అస్ట్రిగాలస్' వృక్షజాతి చెట్లనుంచి లభించే జిగురు. ఇది జాడిద లేతపసుపు రంగులలో ఉండి చిన్న చిన్న ముక్కలలోను పొడి రూపంలోను లభిస్తుంది. నీటిలో నానబెట్టినప్పుడు ఇది మెత్తని పారదర్శకపు ముద్దగా తయారవుతుంది. దీన్ని సుద్దకడ్డీలు (*pastels*) తయారుచేయడంలో బంధకంగా వాడతారు. ఔషధ యోగాలలోను, పారిశ్రామికోత్పత్తులలోను, పింగాణికి మెరుగును అతకటానికి కూడా దీన్ని వాడతారు.

**gypsum** : ముగ్గు సున్నం.

ప్రకృతిలో సహజసిద్ధంగా లభించే ఒక ఖనిజ విశేషం. దీని రాసాయనిక నామం హైడ్రస్ కాల్షియం సల్ఫేట్. కళారంగంలో దీనికి ఎన్నో విధాలుగా వినియోగం ఉంది.

# H

**Haarlem blue** : *హార్లెం నీలిమ.*

**Haarlem school** : *హార్‌లెమ్ సంప్రదాయం.*

15 వ శతాబ్దపు ఉత్తరార్థంలో, హాలండు దేశంలోని, హార్‌లెమ్ నగరంలో చిత్రకారులు ప్రవర్తిల్ల జేసిన సంప్రదాయం. వీరు అప్పటిలో ప్రచారంలో ఉన్న ఫ్లెమిష్ సంప్రదాయానికి భిన్నమైన శైలిని అవలంబించిన తొట్టతొలి డచ్ చిత్రకారులు. వీరిలో ప్రముఖుడు గీర్ట్‌జెన్ టాట్ సింట్ జాన్. తక్కినవారిలో చాలామంది పేర్లు తెలియవు. దాదాపు 1600 నాటికి హార్‌లెమ్ నగరం, డచ్చికళకు ప్రధానకేంద్రమై, ప్రామాణిక కళకు పరవడి దిద్దగలిగింది.

**habit** : *అలవాటు; వ్యవహృతి.*

**hachure** : *బిందురేఖనం.*

బిందువులతో ఒక విషయాన్ని సూచించే ఒక విధపు వర్తన ప్రక్రియ; ముఖ్యంగా దేశపటరచనలో భూతలరీతిని తెలియజేయటంలో ఇది వినియుక్తమవుతున్నది.

**Hague school** : *హేగ్ సంప్రదాయం.*

క్రీ శ. 1860 నుంచి 1900 వరకు హేగ నగరంలో కళాకృషిని సాగించిన డచ్చి కళాకార బృందం. తమకు ఎంతో బాగా తెలిసి ఉండే తమ పరిసరాలను వాస్తవికరీతిలో చిత్రించటం వీరి లక్ష్యం.

**half-length** : *అరనిలువు.*

(చూ : *canvas sizes, portrait*)

**half-lifesize** : *జీవప్రమాణార్థం.*

**half-relief** : *అర్ధోల్బణం*

(చూ : *relief*)

**halftone** : *అర్ధస్థాయి.*

1. ఒక వర్ణం యొక్క అతిగాఢ, అతి క్లిష్ట ఛాయలకు మధ్యగా ఉండే ఛాయ.

2. ముద్రణలో బిందువులుగా విభజించి ఉంచిన ముద్రణ ప్రవేశం. అర్ధ స్థాయి యొక్క సాంద్రతను అనుసరించి, చుక్కలను దూరంగానో, దగ్గరగానో అమరుస్తారు. చుక్కల ప్రమాణంలో కూడా భేద ముంటుంది. చుక్కల మధ్య దూరం ఎక్కువగా ఉండే రంగు లేతగాను, దగ్గరగా ఉండే ముదురుగానూ కన్పిస్తుంది. అంతఃపాతి, తలరేఖా, ఉల్బణ ముద్రణ ప్రక్రియలు మూడిటికీ అనువైన అర్ధస్థాయికములను తయారు చేయవచ్చు.

**hallmark** : *ప్రమాణముద్ర.*

బంగారు, వెండి వస్తువుల విశుద్ధతను తెలియజేయుటానికి సాధారణంగా వాటి వెనుక భాగంలో వేసే ముద్ర. లండనులోని బంగారు పనివారి కేంద్రస్థానమైన 'గోల్డ్‌స్మిత్స్‌హాలు' ను బట్టి ఆంగ్లంలో హాల్‌మార్క్ అనే పేరు వచ్చింది.

**handle** : *పిడి.*

**hand-mounting iron** : *హస్త సమారోపకం.*

అలేప సమారోపణం కోసం ఉపయోగించే పేడి ఇస్త్రీపెట్టె దీన్ని అలేప సమారోపకం లేనప్పుడు వాడతారు.

**setting (printing** : *చేయమరిక (అమ్పుపని).*

**hand vise** : *చేపట్టు.*

ఒక విధమైన పటుకారువంటి పరికరం; సాన చక్రానికి, ఒక వస్తువును అంటిపెట్టి ఉంచటానికై దీన్ని వాడతారు.



చేపట్టు

**Hansa yellow**: *హంస పీతం.*

ఒక విధమైన సంయోజిత పీత వర్ణ ద్రవ్యం. 20వ శతాబ్దిలో జర్మనీలో మొదటి సారిగా దీన్ని తయారుచేశారు.

**happening** : *ఫలసిద్ధి.*

'పరిసర కళా' ప్రక్రియావిశేషాలలో ఒకటి. దీన్ని యూరపులో 'మెనిఫెస్టేషన్'లేదా 'రియలైజేషన్' అంటారు. హేపినింగ్ అనే పదాన్ని 1950లో తొలిసారిగా అల్లాన్ కాప్రోల్ ఉపయోగించారు. ఇవి చిన నాటికల వంటివి. విటిలో నటన క్రమబద్ధంకాక సూచనాత్మకంగా ఉంటుంది. ప్రేక్షకులు రంగస్థలానికి ఎదురుగా కూర్చొని ఉన్నను. ప్రేక్షకుల మధ్యకు నటకులు వచ్చి అక్కడ నటించటం కూడా సంభవిస్తుంది.

**hard-edge painting** : *విశిష్ట చిత్రణ.*

చిత్రరూపాలను, రంగులు, రేఖల సహాయంతో-స్పష్టంగా తొలుతనిర్దేశించి చిత్రాలను చిత్రించే ప్రక్రియ. ఇటువంటిది ప్రాతినిధ్యకళలోకన్నా జ్యామితీయ వివిక్తకళలో సుసాధ్యం.

**hardener** : *దృఢకరి; స్తంభకం.*

**hard paste; hard-paste porcelain** : *కఠిన పిష్టం; గట్టిపింగాణీ.*

బాగుగా కాల్చిన మేలిరకపు పింగాణీ.

**Hatchett's brown** : *హాచెట్ గోధుమ రంగు.*

వాన్ డెక్ శోతనలోని గోధుమ ఛాయలకు వాడే పేరు.

**hatching** : *రేఖా వర్తనం.*

జాగ్రత్తగా గీసిన సమాంతర రేఖా సహాయంతో వర్తనం (*shading*) సాగించటం. ఒక ప్రక్కనుంచి వచ్చే సమాంతర రేఖలను, ఇంకొక ప్రక్కనుంచి వచ్చే సమాంతర రేఖలు ఖండించేట్లు గీస్తే, వ్యత్యస్త రేఖావర్తనం (*cross hatching*) అంటారు. సమానాంతర రేఖల మధ్య దూరాన్ని, వాటిమందాన్ని మార్చడం వల్ల వివిధ ఛాయాంతరాలను, వెలుగు నీడలను సృష్టించవచ్చు. ఈ పద్ధతిని సూచీ చిత్రణ, రేఖా శిల్పాలలో కూడా సౌలభ్యంతో ఉపయోగించవచ్చు. గుడ్డలపై రూపాలను నేయటంలో ఈ విధానం ఉపయోగిస్తారు. నీటి వర్ణాలైన జిగురు రంగులతో చిత్రించేటప్పుడు, రంగులను ఒకదానితో ఇంకొక దాన్ని మేళవించటానికి ఈ రేఖా వర్తనాన్ని ఉపయోగించవచ్చు.

**hawk or mortarboard** : *పిడి పలక.*



పిడి పలక

భిత్తి చిత్రాలపై మెత్తటానికి వాడే సున్నాన్ని ఉంచుకొనే పరికరం. నలుచదరపు రేకుతో ఇది తయారై, మధ్యన పిడితో ఉంటుంది.

**heavy** : *గురు; బరువైన; భారవత్; దండిగా.*

**heavy-bodied oil** : *అతిసాంద్ర తైలం.*

**heavy paper** : *దళసరి కాగితం.*

**heel** : *మడమ.*

చిత్రతలంపై చిత్రిస్తూ, కుంచెను కొద్దిగా నొక్కినప్పుడు కుంచె రోమాలు వంగే ప్రాంతం. శ్రేష్ఠమైన కుంచెలకు సులభంగా వంగే శక్తి, మళ్ళీ యథాస్థితికి చేరే శక్తి కూడా ఉంటాయి. సాధారణంగా ఇటువంటి మడమ రోమాల నిడివిలో, కుదురునుంచి నాల్గవ వంతు దూరంలో, ఉంటుంది.

**heighten** : *ఎక్కదిద్దు.*

చిత్రాన్ని పూర్తిచేసే సమయంలో, తెలుపు ఎక్కువగా కలిసిన వర్ణంతో, కొన్ని భాగాలను ముందుకు వచ్చేట్లు దిద్దటం.

**Helladic** : *హెల్లిక.*

గ్రీసుదేశం లోని కాంస్యయుగానికి వర్తించే విశేషణం. హెల్లిక నాగరికతను పూర్వ (క్రీ పూ. 2600-2000), మధ్య (2000-1580); ఉత్తర (1580-1100.) కాలాలుగా విభజిస్తారు

**Hellenic art** : *హెల్లెనీయ కళ.*

క్రీ పూ 1100 నుంచి 100 వరకు, గ్రీసు దేశంలోనూ, గ్రీకుల ప్రభావానికి లోనైన పరిసర ప్రాంతాలలోనూ వర్ధిల్లిన కళ. శైలిని ఆధారంగా చేసుకొని, హెల్లెనీయ కళను ఆరు

భాగాలుగా విభజించారు. అవి :- పూర్వ జ్యామితీయ యుగం (క్రీ పూ. 1100-900); జ్యామితీయ యుగం (క్రీ పూ. 900-700); ప్రాచ్య ప్రభావ యుగం (క్రీ.పూ. 700-600); ప్రాక్తన యుగం (క్రీ.పూ. 600-500); ప్రామాణిక యుగం (క్రీ పూ. 500-323); హెల్లెనిక యుగం (క్రీ పూ. 323-100) రోమనులు రాజకీయంగా బలవంతులైన తరవాత వారు హెల్లెనీయ కళను స్వీయం చేసుకొన్నారు.

**Hellenistic period** : *హెల్లెనిక యుగం*

హెలెనీయ కళలోని చివరి ఘట్టం [క్రీ పూ 323-100]. ఈ యుగం అలెగ్జాండరు మరణంతో ఆరంభమయింది అలెగ్జాండరు దండయాత్రలవల్ల, హెల్లెనీయ కళ, దూరామార దేశాలకు వ్యాపించింది. ఆయాదేశాలలో అది పెక్కుమార్పులు పొందింది. ఆ మార్పుల వల్ల గ్రీకుల ఆదర్శ సౌందర్య సిద్ధాంతం రూపపరివర్తన చెందడంవల్ల ప్రకృతి సహజ రూపాలను ఆశ్రయించేటట్లుగా పరిణమించింది. సహజరీతిలో ముఖ చిత్రాలను, మానవుల వివిధ దశల సహజ హావభావాలను, చిత్రించడం ఈ హెల్లెనిక యుగంలో అభివృద్ధి చెందింది అంతకు పూర్వం దేవతా విగ్రహాలను చెక్కిన గ్రీకు శిల్పులు, ఈ యుగంలో సమకాలిక చక్రవర్తుల, రాజుల, మూర్తి శిల్పాలను గింపరించారు ఈ శిల్పాలలో, పత్రాంకిత మడతల వివిధ విన్యాసాలను ఆ శిల్పులు చిత్రించారు రూప సంవిధానంలో వాస్తు విషయికములనూ, ప్రకృతి దృశ్యాలనూ కూడా వారు ఉతవరచేవారు. రాతిలోను లోహంలోను లఘుమూర్తుల రూపొందింపటను వారు తొలుతగా ప్రవేశ పెట్టారు.

**hematite** : *రాతిక్షోయి.*

**hemp** : *జనుము; శణం.*

తాళ్లకు, తాడుసామగ్రికి,తాటికా నిర్మాణానికి ఉపయోగపడే నార.

**hempseed oil** · *జనపనూనె.*

'కన్నాబిస్ సటైవా' అనే వృక్షశాస్త్ర పారిభాషిక నామంగల జాతికి చెందిన జనుపమొక్క యొక్క గింజలనుంచి తీసిన నూనె. దీన్ని భారతదేశంలో, ప్రాచీన కాలంలో, అవిసెనూనెకు బదులుగా వాడేవారు. ఇది తైలవర్ణాలలో అవిసెనూనె అంతగా ఉపయుక్తమైంది కాదు.

**herm or herma** : *శీర్షబింబం.*

శిరసు మాత్రం వివరంగా మలచి, కింది భాగమంతా నలుపలకల నిలువు దిమ్మెలాగా మలచిన శిల్పం. ఈ దిమ్మె కిందికి పోయినకొద్దీ, క్రమంగా లావు తగ్గుతుంది. హెర్మిస్ అనే గ్రీకు దేవత పేర ఇటువంటి విగ్రహానికి గ్రీకు భాషలో హెర్మా అనే పేరు వచ్చింది. ఇటువంటి దేవతా శిల్పాలను ఏథెన్స్ నగరపు రాజమార్గాల పక్కన ప్రతిష్ఠించేవారు.

**Hermitage** *హెర్మిటేజ్.*

లెనిన్‌గ్రాడ్ నగరంలో ఉన్న ఒక పౌర్వజనికమైన మ్యూజియమూ, కళాశేఖకా ఈ పేరుతో వ్యవహృతాలు. సోవియెట్ యూనియనులో అటువంటి సంస్థలలో కెల్లా ఇది విశాలతమం. ప్రపంచపు అతి ప్రముఖ కళాశేఖలలో ఒకటిగా ఇది పేరుపొందింది.

2. ఆశ్రమం; పర్ణశాల.

**heroic : నవతాలక.**

మూర్తి శిల్పంలో ఒక పారిభాషిక పదం తీన ప్రమాణంకన్నా. ఒక అడుగో, రెండు అడుగులో ఎత్తు ఉండి బృహదాకారపుదానిగా లెక్కించటానికి అవకాశంలేని మధ్యస్థమూర్తికి విశేషణంగా దీన్ని వాడతారు.

**heroism : వీరత.**

**hide glue : చర్మనిర్యాసం.**

**hiding power : ఆఛ్ఛాదన శక్తి; నిగూహన శక్తి**

ఒక వర్ణపు పైపూత యొక్క కాంత్యభేద్యతా శక్తి; అడుగునఉన్న దాన్ని కనబడనీయకుండా చేసే పై రంగు పూతలోని కాంత్యభేద్యతా శక్తి

**hieracosphinx : గరుడ సింహాక.**

**hieratic : పునీత.**

మూర్తి శిల్పంలో ఒక పారిభాషిక పదం. ప్రాచీన ఈజిప్టులోనూ, తరవాత కాలంలో బైజాంటైన్ సామ్రాజ్యంలోను, దివ్యమూర్తులను మలచిన శైలికి విశేషణంగా దీన్ని వాడతారు. ఈ శైలి కొన్ని నిబద్ధ సంప్రదాయాలకు కట్టుపడి నడిచింది.

**hieroglyph : చిత్రలిపి.**

ప్రాచీన ఈజిప్టులో వాడుకలోఉన్న ఒక లిపి విశేషం. చిత్రలేఖనం మానవ సంఘంలో, మొదట్లో సంఘటనలను, వాస్తవ్యాలను రూపించటానికి వినియుక్తమైంది. అటువంటి రూపాలే క్రమపరిణామం పొందగా, ఈ లిపి రూపొందింది; ఇందులో చిత్రప్రవక్తృత (principle of vebus) కొంత ప్రముఖ పాత్ర నిర్వహించింది.

**highlight : మేలితావు.**

చిత్రంలో, తక్కిన వాటికన్నా, ఎక్కువ కాంతివిలువ గలిగిన స్థానం.

**high quality : మేలిలక్షణం.**

**high relief; deep relief, alto- relievo : అధికోల్బణం; ఉల్బణ చిత్రం; ఉర్ బులంద్.**

**Hindu iconography : హైందవ ప్రతిలక్ష్యం.**

(చూ : *iconography*)

**Hispano-Moresque ware : స్పానీయ మూరిష్ సామగ్రి**

స్పెయినులో, మధ్యయుగాంలో, ముస్లిమ్ కళాకారులచే నిర్మితమైన శోభాయుత ఉపకరణ సామగ్రి.

**hobby : వ్యాసంగం.**

**Hogarth's line : హోగర్త్ రేఖ**

ప్రఖ్యాత ఆంగ్ల చిత్రకారుడు హోగార్త్ సిద్ధాంతీకరించిన సౌందర్య రేఖ. స్వరచితమైన 'యనాలిసిస్ ఆఫ్ బ్యూటీ' (1758) అనే గ్రంథంలో- విపులంగా ఉంది, ఆంగ్ల లిపిలోని 'S' అక్షరాన్ని పోలిన. వక్రరేఖే ఉయుద్ధమైన రూపనిర్మాణానికి ఆధారమని ఆయన సిద్ధాంతీకరించాడు.

**hold-down** : *తిరుగుడు పట్టుకారు.*

పనిబల్లమీద ఒక వస్తువును గట్టిగా అదిమించి



తిరుగుడు పట్టుకారు

ఉంచటానికే గాక, పని సాగేటప్పుడు ఆ వస్తువును అటూఇటూ తిప్పటానికి కూడా పనికి వచ్చే ఒక పరికరం.

**hollow** : *సుషిర; బోలు*

**hollow relief; sunk relief, concave relief, cavo relievo** : *నత శిల్పం.*

**hollow ware** : *బోలు సామగ్రి.*

లోహం, పింగాణి మొదలైన వాటితో చేసి వ్యూహాకారంగా లోపల బోలుగా ఉండే సామగ్రి.

**holly green** : *నిత్య హరితం.*

హరిత మృత్తికకు పర్యాయ నామం.

**hone** : *సానక్రియ.*

.వాడి అంచుగల పరికరాలను, సానరాయి వంటి వాటిపై రుద్ది, పదును పెట్టటం.

**honeysuckle** : *తేనె వట్టు.*

**honeysuckle ornament**: *మధులతాభూషణం*

(చూ *anthemion*)

**Hooker's green** : *హుకర్ హరితం.*

ఒక సంయోజిత వర్ణ ద్రవ్యం. ప్రష్యన్ నీలిమ మొదలైన వాటినుంచి దీన్ని తయారు చేస్తారు.

**Horace vernet green** : *హోరేస్ వెర్నెట్ హరితం.*

వెర్నెట్ హరితానికి పర్యాయనామం; బ్రెమెన్ హరితంలో, ఇది ఒక ప్రత్యేకపు కోవకు చెందింది.

**horizon line** : *చక్రవాళ రేఖ; క్షితిజ రేఖ.*

భూమ్యాకాశాలు కలిసినట్టుగా దృష్టికి కన్పించే ఊహారేఖ. ప్రకృతి-దృశ్య చిత్రణలో ఇటువంటి రేఖను చిత్రకారుడు చూపవచ్చు; లేదా ఆ రేఖను ఊహించటానికను వుగా కొన్ని వస్తువులు, చెట్లు, కొండలు అడ్డంగా ఉన్నట్లు చిత్రించవచ్చు ప్రకృతిలో ఇటువంటి భూమ్యాకాశ సంగమరేఖ చూపరి కంటె ఎత్తుననే కన్పిస్తుంది. చిత్రాలలో భూమిపై నిలిచి చిత్రించినట్టుగా, చిత్రకారుడు ఊహిస్తే, అటువంటి స్థానంలోనే ఈరేఖ చిత్రంలో ఉంటుంది. కాని దృశ్యాన్ని పైనుంచి చూసినట్లు ఊహిస్తే, ఈ రేఖ పైభాగానికి పోతుంది; లేదా ఒక్కొక్కప్పుడు చిత్రాన్ని దాటి కూడా పోవచ్చు. క్రిందనుంచి చూసినట్లు ఊహిస్తే ఈ రేఖ చిత్రంలో మధ్యభాగంలోకాక, క్రింది భాగంలో, ఒక్కొక్కసారి చిత్రం క్రింది భాగాన్ని దాటి కూడా ఉండటం సంభవిస్తుంది.

**hors concours** : *పోటీ వెలి; అనర్హత.*

కళా ప్రదర్శన పోటీలలో పాల్గొనటానికి అర్హత లేకపోవటం ఒక కళాకారుడు ఒక ప్రదర్శనలో పాల్గొని ఆ సంస్థ నుంచి బహుమతిని అదివరకే అందుకొని ఉండటం వల్ల గాని, బహుమతి నిర్దేశకలలో ఒకడుగా ఉండటం వల్లగాని ఇటువంటిది జరగవచ్చు. దీన్ని సంక్షిప్తరూపంలో ఆంగ్లంలో *HC* అనికూడా వాడతారు. ఈ నిషేధం, ప్రదర్శనను నిర్వహించే సంస్థయొక్క నియమావళిపై ఆధారపడి ఉంటుంది.

**hose** : *వస్త్రనాళిక.*

**hot table** *వేడిబల్ల.*

చిత్రాల పరిరక్షణకు ఉపయోగించే బల్ల. ఇది విద్యుత్ సహాయంతో వేడెక్కుతుంది. దీనిపై, పరిరక్షింపవలసిన కాటికను పరుస్తారు. కావలసిన విధంగా ఉష్ణాన్ని, దీనిలో క్రమబద్ధం చేసుకోవచ్చు. దీన్ని మ్యూజియం సాంకేతిక నిపుణులు 1950లో కనిపెట్టారు.

**humidity** : *తేమనం; తేమ.*

**Hudson River school** : *హడ్సన్ నదీ వర్గం.*

అమెరికాదేశపు ప్రకృతి సౌందర్యంవల్ల ప్రభావితులైన 19 వ శతాబ్దపు అమెరికన్ చిత్రకారులవర్గం. వీరిలో చాలామంది హడ్సన్ నదీలోయ, కేట్స్కిల్ పర్వతాల దృశ్యాలను చిత్రించారు. వీరిలో తొలి చిత్రకారులు: థామస్ కోల్ (1801-1848), ఆషర్ బి డురాండ్ (1796-1886), థామస్ డౌటి (1793-1856). తర్వాతివారు: ఫ్రెడెరిక్ ఎడ్విన్ చర్చ్ (1826-1900), జాన్ కెన్సెట్ [1818-1872], ఆల్బర్ట్ బీర్‌స్టాట్ [1830-1902].

**hue** : *వన్నె*

ఒక వస్తువు తాలూకు యథార్థ వర్ణం. ఇది కంటికి ఒకే వర్ణంలాగా కన్పించినా, అది నిజానికి రెండు, అంతకు మించిన వర్ణాంతరాల సమ్మేళనమే. ఉదాహరణకు నీలవర్ణం, ఆకుపచ్చవాకగా గాని, నీలలోహితపు వాకగా గాని ఉంటుంది. ఆకుపచ్చరంగు నీలివాకను గాని పసుపువాకను గాని కలిగి ఉంటుంది; నీలలోహితవర్ణం నీలివాకను గానీ, ఎరుపు వాకనుగానీ కలిగి ఉంటుంది. నారింజవర్ణం ఎరుపువాకనుగాని పసుపువాకనుగాని కలిగి ఉంటుంది. బూడిదరంగు కవోష్ణ వర్ణంగా ఎరుపువాక కలిగిగాని, శీతల వర్ణంగా నీలివాక కలిగిగానీ ఉంటుంది. బూడిద వర్ణాలను, గోధుమ వర్ణాలను తటస్థ వర్ణాలుగా లెక్కించవచ్చు. ఈ తటస్థ వర్ణాలు కూడా కవోష్ణ వర్ణాల కంటే కొంచెం అధికంగా, శీతలవర్ణాల వైపుకే మొగ్గి ఉంటాయి. రంగులలో వాడే తైలాలు, వార్నిషులు, ఇతర పారదర్శక ద్రవ పదార్థాలు, వన్నె విషయంలో లేత పసుపువాకనుంచి ముదురు గోధుమ వాక వరకు మారవచ్చు. కళాకారులు వర్ణాలకు సాధారణంగా, దాని రాసాయనిక సంవిధానాన్ని బట్టి గాక, ప్రకృతిలోని వన్నెలతో వాటికుండే సాదృశ్యాలనుబట్టి మాత్రమే పేర్లు నిర్ణయిస్తా

**Hungary blue** : *హంగరీ నీలిమ.*

కోబాల్ట్ నీలిమకే, అరుదుగా వాడే పర్యాయనామం.

**hydraulic :** *జలసంబంధిత.*

నీటివల్ల ద్యోతకమయ్యే చలనం లేదా క్రియకు విశేషణంగా ఇది వాడబడుతుంది. నీటిలో ఉంచినప్పుడు కాంక్రీటు మిశ్రమం గట్టి పడటం ఇందుకు ఒక ఉదాహరణం.

**hydria :** *యవన కలశం.*

పురాతన గ్రీకులనాటి జలపాత్ర. ఇది గుండ్రంగా ఉంటుంది. దీనికి రెండుపక్కల ఆద్దుపిడులుంటాయి. నీటిని పోసుకోవటానికి కంఠం దగ్గర మాత్రం ఒక నిలువు పిడి ఉంటుంది.

**hydromel :** *జలమధువు.*

నీరును తేనెను సమపాళ్లలో కలిగిన మిశ్రమం. నీటివర్ణాలు మృదువుగా ఉండటానికి దీన్ని వాడేవారు.

**hydrophile :** *జలాసక్తం.*

నీటిని ఆకర్షించుకొనగల, లేదా నీటిపై అసక్తిగల పదార్థం. సాధారణమైన నీటి-రంగు కాగితం ఇటువంటిదే. శిలాలేఖనానికి వాడే రాతిలో, ముద్రణ తగలని భాగం కూడా ఇటువంటిదే.

**hydrophobe :** *జలత్రస్తం.*

నీటిని నిరోధించే పదార్థం లేదా ఉపరితలం. శిలాలేఖనంలో శిలపై ఆలేఖనానికి ఉపయోగించే శాటిక జలత్రస్తంగా ఉండాలి.

# I

**Icon :** *విగ్రహం; ప్రతిమ: మూర్తి.*

1. హిందూ, బౌద్ధ, జైన మతాలలో శాస్త్రియుక్తంగా రూపొందించిన దేవతా రూపం పవిత్రత దీనిలోని ప్రధానగుణం.

2. క్రైస్తవ మతంలో తూర్పుదేశపు సంప్రదాయానికి చెందిన చర్చిలలోని క్రీస్తు, మేరీల రూపశిల్పాలు; బైజాంటీయ పద్ధతిలో రూపొందించిన క్రీస్తు మేరీల మొజాయిక్ చిత్రాలు, అల్పోల్బణ శిల్పాలు.

**Iconography[1] :** *ప్రతిమా లక్షణం.*

1. మత సంబంధమైన శిల్పాల నిర్మాణంలో ఆ యా మూర్తుల, వాటి వాహనాల, ఆయుధాదుల లక్షణాలను నిర్వచించే శాస్త్రం.

2. అటువంటి చిహ్నాలు మొదలైన వాటికి ఆపాదించే అర్థవిశేషాలు, పవిత్రత.

**Iconography2 :** *ప్రతిమా స్తోమం.*

పవిత్ర విగ్రహాల సమూహం.



ప్రతిమ: క్రీస్తు శీర్షం, దారువుపై కలం ప్రక్రియ; రచయిత, ఎమ్మన్యుయేల్ జానీన్ (1639-1669)



అవతరణ వార్త : రచయిత జాన్ వాన్ ఐక్ (1886-1441). సాంప్రదాయిక ప్రతీకాల మూలమున, క్రీస్తు అవతరణ, మేరీమాతకు గర్భవతిగ ఉన్నపుడే ద్యోతకమగుట ప్రతిమాత్రోమమునకు ఇది యొక లక్ష్యము.



పై అవతరణ వార్తలోని ఒక ప్రత్యేక భాగము. ఇందు ప్రతీనమూలచే క్రీస్తు మహిమ ప్రకటితము.

**ideoplastic** : *భావ కల్పిత.*

అచ్చంగా స్వతః పరిశీలనవల్లగానీ, స్మృతి పథంనుంచి సంగ్రహించటంవల్లగానీ రూపొందించక, రూపకారుడు తనకు తెలిసిన సమాచారాన్ని ఆధారంగా గ్రహించి, మానసికంగా కల్పించి, తననుసారంగా రూపొందించిన ప్రతికల్పనకు వాడబడే విశేషణం.

**idiom** : *నుడికారం; తీరు.*

ఒక వ్యక్తికి లేదా ఒక ప్రత్యేక యుగానికి చెందిన కళాసృష్టిలో విశిష్టంగా కనవడే శైలి లేదా సాంకేతిక రీతి.

**Illumination** : *పత్రరంజనం; పత్ర దీపనం*

గ్రంథాలలోని పుటలను సందర్భానుసారంగా చిత్రాలతోను, లిపి చిత్రాలతోను భూషింపచేయటం. ఇటువంటి ప్రక్రియలు మొదట ఈజిప్టులోని పపైరసు కాగితాలలో కనపడతాయి. ఈ అలంకరణ గ్రీకు, రోమన్

సంస్కృతులలోను ప్రచారం పొందినా, క్రీ.శ. 8-6 శతాబ్దాల మధ్యకాలానికి చెందిన అటువంటి అలంకరణలు కలిగిన గ్రంథాలు మాత్రమే స్వల్పంగా లభించాయి. బైజాంటెయిన్ క్రైస్తవ గ్రంథాలలో అలంకృతచిత్రాలు, ఇతర అలంకరణములు విరివిగా లభిస్తున్నవి. క్రీ.శ. 14 వ శతాబ్దినాటి కొన్ని కొరాన్ ప్రతులలో ఇటువంటి అలంకరణలు విరివిగా కనపడుతున్నాయి. యూరపులో మధ్యయుగంలో క్రైస్తవ సన్యాసులు ఇటువంటి చిత్రాలను అద్భుతంగా రూపొందించారు. పునరుజ్జీవనయుగంలో చరిత్రాత్మక విషయాలను ఈ రీతిగా గ్రంథాలలో చిత్రించటం విరివిగా జరిగింది.

మధ్యయుగంలోని తొలి గ్రంథాలలో ఇటువంటి చిత్రణకు ఎరుపురంగును వాడారు. దీనిలో తొలి అక్షరాలను లతాదులతో అలంకరించారు. తరవాత కాలంలో ఈ తొలి అక్షరాలలో చిత్రాలకు కూడా స్థానం లభించింది. ఈ చిత్రాలన్నింటిని నీటిరంగులతోనే తయారుచేసేవారు వీటిలో పలచగా పారదర్శకవర్ణాలను, కాంత్యభేద్యక వర్ణాలను, బంగారాన్ని, వెండినీ కూడా వాడారు. బంగారాన్ని వాడిన పద్ధతినే స్వర్ణలేఖనం (*chrysography*) అంటారు ఈ పత్రరంజన పద్ధతులు, 17 వ శతాబ్దంలో ముద్రణపద్ధతి అమలులోకి వచ్చిన తరవాత, క్రమంగా క్షీణించాయి. అయినా తొలికాలపు ముద్రణ పద్ధతులుకూడా, పత్రరంజన పద్ధతులనే అవలంబించాయి.



పత్రరంజనం లింబర్ సోదరులు 15వ శ॥ తొలి పాదమున రచించిన ఒక గ్రంథము నందలి.

**Illusion :** *భ్రాంతి.*

**Illusionary :** *భ్రాంతి మూలక.*

**Illusionism :** భ్రాంతి వాదం.

సహజంగా ఉండేట్లు భ్రమింప జేయటానికి చిత్రాలలో ఉపయోగించే దృష్టి ప్రక్రమ గతి మొదలైన పద్ధతులకు సమష్టి నామం. ఇటువంటి భ్రాంతివాదం, రోమనుల భిత్తి చిత్రాలకు, అల్పోల్బణ చిత్రాలకు ప్రధాన సూత్రమని చెప్పవచ్చు. పాంపే నగరంలోని భిత్తి చిత్రాలలో సహజతను, ఉల్బణతను సూచించటానికి వెలుగునీడల పద్ధతులను ఉపయోగించారు. దృష్టిప్రక్రమ గతిసూత్రాలు అప్పటికి ఏర్పడక పోవటంవల్ల, వారు దూరంలో ఉన్న వస్తువులను చిన్నవిగాను, దగ్గర ఉన్న వాటిని పెద్దవిగాను చూపి, ప్రక్రియలకు వాయుగత దృష్టి ప్రక్రమ గతినే వాడారు. పునరుజ్జీవన యుగం నాటికి, శాస్త్రీయమైన దృష్టి ప్రక్రమ పద్ధతులు అభివృద్ధి చెంది ఉపయోగానికి వచ్చాయి. ఈ భ్రాంతి వాదాన్నే ఇటాలియన్ భాషలో 'ట్రాంపే లోయిల్' (కంటిని మోసగించటం) అనేవారు.

**stration** : వ్యాఖ్యా చిత్రం; లక్ష్య చిత్రం.

ఒక గ్రంథంలోని వర్ణనాదులను వివరించటానికి ఉపయోగించే చిత్రం. ఒక్కొక్కసారి వేరుగా తయారైన చిత్రాలను కూడా, సందర్భానికి సరిపోతే, గ్రంథంలో ఆయా వర్ణనాదుల పక్కన, ముద్రించటం ఉంది. ఒక గ్రంథంలోని విషయంతో ఏ విధంగాను, కుదరని చిత్రాన్ని కూడా కేవలాలంకరణకై చేర్చటం ఉంది.

**illustration board** : వ్యాఖ్యాఫలకం; వ్యాఖ్యా స్తరిక.

చిత్రాన్ని గీయటానికి ఉపయోగించే కాగితాన్ని ఒక పక్కగాని, రెండు పక్కలలో గాని అతికించిన అట్ట. ఒక పక్కన కాగితాన్ని అతికించిన దానికన్నా, రెండు పక్కల అతికించినది ఎక్కువ దృఢంగా ఉంటుంది. సులభంగా వంగదు. ఈ అట్టలను, వ్యాఖ్యా చిత్రాలకు, రేఖాకల్పనలకు, ముద్రణకు ఉపయోగించే ఇతర విధాల రేఖారచనలకు వాడతారు. ఈ అట్టలు, శాశ్వతంగా మనిఉండవలసిన కళాఖండ రచనలకు పనికిరావు.

**ilmenite** : అయశ్శిల.

నల్లటి మెరుపు గలిగి, టిటేనియం ధాతువుతో మిశ్రమమైన ఇనుపరాయి; దీనినుంచే టిటేనియమ్ శ్వేతవర్ణ ద్రవ్యాలను తయారు చేస్తారు.

**image** : ప్రతిరూపం; ప్రతిచ్ఛందం.

**imagiers** : 'ఇమేజియర్స్'; ప్రతిమాశిల్పులు; ధార్మిక శిల్పులు.

క్రైస్తవ మతాధికారుల సూచనలను అనుసరించి, గోతిక చర్చిలలో శిల్పానికి అలంకరణలను చెక్కిన శిల్పులకు ఆ కాలంలో వాడుకలో ఉన్న వృత్తినామం.

**imagination** : భావగతి ఊహ.

**imagines a vestir** : వస్త్ర పాంచాలికలు.

ఇటలీదేశపు చర్చిలలో ప్రదర్శితములయ్యే క్రైస్తవ యోగుల ఒకరీతి ప్రతిమలు. వీటి శిరస్సు, చేతులను చివరలను, పాదాలను మాత్రం వివరంగా చెక్కి రంగులు వేసేవారు. తక్కిన శరీర భాగాలను మాత్రం మొరటుగా చెక్కి, ఆ మొరటుతనం కనబడకుండా దుస్తులతో, రత్నఖచిత ఆభరణాలతో, ఆభాగాలను అలంకరించేవారు.

**imbrication** : అర్ధ్యాలంకరణ.

పెంకులు ఒకదానిపై వేరొకటి కొంతవరకు



అర్ధ్యాలంకరణ

అమరిఉండే, ఒక అలంకరణ; అదే రకపు ఇంకొక అలంకరణను కొంతవరకు కప్పినట్లు సాగిన అలంకరణ.

**imitation** : *అనుకరణ.*

**imitation vermilion** : *అనుకారిత సిందూరిక.*

**immediately preceding** : *అవ్యవహిత పూర్వపు.*

**imp** : ముద్రా.

'ఇంప్' అనేది లాటిన్ భాషలోని 'ఇమ్ప్రెసిట్' (ముద్రించాడు) అనేపదానికి సంక్షిప్త రూపం. రేఖాశిల్పాలలో ముద్రాపకుడి పేరు తరవాత దీన్ని వ్రాసి ఉంచడం ఆచారం. ముద్రాపకుడు, ఫలకాన్ని తయారు చేసిన వ్యక్తి, వేరువేరుగా ఉన్నప్పుడు మాత్రమే ఇట్లా రాసేవారు

**impasto** : ఘన లేపనం.

ఒత్తుగా, దళసరిగా ఉండే పొరలతీరుగా పట్టించిన, లేదా తూలికా ప్రయోగాంచే పూసిన పూతరంగు. మందమై స్నిగ్ధంగా ఉండే పైపూతగల తలానికి ఇది విభిన్నంగా ఉంటుంది.

**Imperial green** ; *రాజహరితం.*

ఒక విధమైన తక్కువ రకపు మరకత హరితం.

**implement (n)** : *పరికరం.*

**impression** : *అంకనం; అనుభావన; అనుముద్రణం (అచ్చుపని.)*

**impressionism** : *అనుభావన వాదం; అనుభూతి వాదం.*

ఆధునిక కళకు సంబంధించి మొట్టమొదటి మహోద్యమం. సంప్రదాయానుగతంగా ఎంతో కాలంనుంచి సాగి వస్తున్న పద్ధతులనుంచి– అంటే నిరంతరానుస్యూతమైన తూలికా హతుల సాంకేతిక రీతులనుంచీ, స్పష్టంగా నిర్దిష్టంగా వస్తువులను తగిన బాహ్యరేఖలతో సూచించే పద్ధతి నుంచీ, ఆయా వస్తువులకు ప్రకృతి సిద్ధంగా అనుగుణమైన కొన్ని రంగులు ఉంటాయనే భావనల నుంచీ– ఒక్క పెట్టున విడివడి సరికొత్త మార్గాన్ని అవలంబించిన వారే ఈ అనుభావనావాదులు. సాంప్రదాయిక పద్ధతులను ఉల్లంఘించిన వీళ్ళు, కాంతిని, తదంతర్గత వివిధ భాగాల లోకి భగ్నం చేసి, వివిధ పరితలాలపై అది సాగించే క్షణభంగుర విలసనాలను ద్యోతకం చేయటానికి పూనుకొన్నారు. ఇటువంటి ఘటనా విలసనాలను సాధించటానికి విచ్ఛిన్న తూలికాహతుల పరంపరలను వీళ్ళు ఉపయోగించారు. వీటిని చూసే ద్రష్టకు, ఈ విచ్ఛిన్నత కనపడక అందులో నిరంతరత మాత్రమే కనపడుతుంది (చూ. *optical mixture*) వస్తువులు ఎట్లా రూపిందాలి అనే విషయంలో, సాంప్రదాయిక భావనలను అనుభావనావాదులు మన్నించకపోయినా ప్రకృతిని, వాస్తవ రీతిలో అది కుదురుకొన్న తీరులో, పరిశీలించి, దాన్ని కాటికపైకి తీసుకొనిరావటానికి యత్నించారన్నది మాత్రం యథార్థం. 'కీ' (కీలకము)లో ఉండే కాంతిమంత వర్ణపు, కుదిరిక అనుభావనావాదపు రచనలో కన్పించే విశిష్ట లక్షణం.

1874లో పారిస్ నగరంలో అనుభావనా వాద రచనల మొట్ట మొదటి ప్రదర్శన జరిగింది; అనంతరం 1876-1886 మధ్య కాలంలో ఇంకా ఏడు ప్రదర్శనలు ఏర్పాటయినాయి; అయితే ఆ అనుభావనావాద వర్గం విడిపడిపోయి, అందులోని ప్రతి ఒకరూ తన ప్రతిభను అనుసరించి స్వీయ కళావికసన గతిని అవలంబించిన తరవాత మాత్రమే, ఆ అనుభావనావాదులకు సుస్థిర పరిగణన లభించింది. ఈ ఉద్యమానికి నాయకత్వం వహించినవాడు క్లాడ్ మోనే (1840-1926). ఒక రోజులోనే వేర్వేరు కాలాలలో ఆయా వస్తువులు కనపడే తీరులను ప్రదర్శిస్తూ, గడ్డివాములు మొదలైన వాటిని ఆ చిత్రకారుడు రూపించిన తీరుతెన్నులు- కాంతివిలసనములనుగురించి అనుభావనావాదులు వహించే- శ్రద్ధానిరతిని వ్యక్తం చేయగలుగుతున్నాయి. ఈ వాదావలంబకులకు అందరికీ ఆమోదయోగ్యమైన సిద్ధాంత సరళి ఏదీ లేకపోవటం వాస్తవమే అయినా కెమిల్లీ పిస్సారో (1881-1903), అల్‌ఫ్రెడ్ సిసిలీ (1839-1899) అనేవాళ్ళు, కళావ్యవసాయంలోనే గాక, వ్యక్తిగతంగానూ మోనేకు అతిసన్నిహితులు. అనుభావనావాద కల్పనను ఆమోదించిన ఇతర ప్రముఖ చిత్రకారులు: 1. అగస్ట్ రెనాయిర్ (1841-1919); 2. ఎడ్గార్ డెగాస్ (1834-1917 ;3. పాల్ సిజానే. పైవాళ్ళలో చివరి చిత్రకారుడివల్ల తరవాత తరాల కళాకారులు ఎంతగానో ప్రభావితులైనారు. ఆ ఉద్యమంతో ముడివడి పనిచేసిన ఆనాటి యువకళాకారులలో గగూయెన్, వాంగో మొదలైనవారున్నారు; కాని యథార్థంగా వీరు, అనుభావనావాదపు ఉత్తర రూపమైన వరిభాషనావాదంలో మాత్రమే పనిచేశారు. (చూ:*pointillism* కూడ).

అనుభావనావాదానికి, 20వ శతాబ్దంలో, ఒక విస్తృతార్థంహూడా లభించింది. 'ఛిన్నభిన్నమైన తూలికా కృషి' అనే లక్షణాన్ని తెలియజేయటానికి లేదా గతకాలపు చిత్రాలలో కాంతి విషయంలో సాగిన విశ్లేషాత్మక నిరతిని తెలియజేయటానికి కూడా ఈ పదాన్ని వాడటం పరిపాటి అయింది. ఈ దృష్టితో ప్రాచీన రోమక అగ్నిన్న చిత్రాలకే కాక, తరవాత వాల్లైన హాల్స్, వెలాస్క్వెజ్, టర్నర్, కాన్‌స్టబుల్ మొదలైన వాళ్ళ రచనల సమీక్షలలో సైతం దీన్ని వాడుతున్నారు. అయితే మోనేతోపాటుగా అతడి బృందము అనుసరించిన అనుభావనావాదం, పైవిధమైన చారిత్రక ప్రభావాలకు ఏవిధంగా లోనుకాలేదనటం గమనించ వలసిన విషయం.

**imprimatura** : *నరళవటలం;అభిముద్ర.*

తైలవర్ణ చిత్రాలలో ముందుగా రచించిన రంగు చిత్రంపై పూసే పలచని పారదర్శకపు రంగుపూత ఆంగ్లేయులు దీన్నే 'వైల్' (ముసుగు) అంటారు.

**imprint** : *అనుముద్రణ.*

**imprint (v)** : *అనుముద్రించు.*

**improve** : *మెరుగుపరచు.*

**impulsive** : *వేగశీలమైన*

**impurity** : *మాలిన్యం.*

**inc :** *ఛేద.*

*'Incidit'* (ఛేదించాడు) అనే లాటిన్ పదానికి *'inc'* అనేది సంక్షిప్తరూపం. సాధారణంగా ఒక రేఖాశిల్పపు అచ్చులో, దిగువ భాగాలలో శిల్పకారుని పేరుతరవాత ఈ సంజ్ఞ ఉంటుంది.

**incise :** *గంటుపెట్టు; కర్తనించు; నికృత్తించు.*

**incised relief, intaglio rilievato :** *సుషిరోల్బణం; అంతస్థోల్బణం.*

(చూ : *relief*)

**incision** *కర్తనం; గంటు.*

**incunabula :** *శైశవికం*

*'Incunabula'* అనేది లాటిన్ భాషా పదం దీనికి ఊయల, జన్మస్థానం, ప్రారంభం అనే అర్థాలు ఉన్నాయి. ఒక కొత్తశైలి రూపొందినప్పుడు, దానికి చెందిన తొలి చిత్రాలకు, ఈ పదాన్ని వాడతారు. 1501 కి ముందు ముద్రించిన గ్రంథాలకు ఎక్కువగా ఈ పదం వాడుకలో ఉన్నది.

**India ink :** *ఇండియా సిరా.*

చిత్రలేఖనంలో వాడే నల్లని సిరాకు అమెరికాలో వాడుకలో ఉన్న పదం.

**Indian blue :** *భారత నీలిమ.*

నీలిమందుకు ప్రాచీన నామం.

**Indian ink :** *కరక్కాయ సిరా.*

**Indian lake :** *భారత రంజకం.*

లక్కరంగు నుంచి తయారయ్యే ఒక విధమైన ఎర్రటి రంజక వర్ణం.

**Indian madder :** *భారతీయ మంజిష్ఠ.*

సహజంగా లభించే ఒక రంగుపదార్థం. ఇది నారింజ-ఎరుపు రంగులో ఉంటుంది.

**Indian purple :** *భారత ధూమ్రం.*

నీలి, ఎరుపు వర్ణద్రవ్యాలు వివిధ పరిమాణాలలో కలపటంవల్ల రూపొందే రంగులకు సాధారణంగా వాడుకలో ఉన్న ఒక పేరు.

**Indian red :** *కావిరాయి ఎరుపు; ఇండియన్ ఎరుపు;*

పరిశుద్ధమైన ఎర్రగా ఉండే ఇనుప భస్మం. సాధారణంగా ఉక్కు పరిశ్రమలో వ్యర్థ పదార్థంగా ఇది ఉత్పత్తి అవుతుంది. కళాకారుల వర్ణాలలో ఇది ప్రముఖం. ఇది సాంద్రతను, కాంత్యభేద్యతను కలిగిన మన్నికఅయిన రంగు. దీని రంగు కొంచెం నీలిఛాయ కలిగిన ఇటుక ఎరుపు. మొదట్లో ఇది ఒక మట్టి రంగుగా లభించేది.

**Indian yellow :** *హరితాళం; హరిదళం*

భారతదేశంలో పూర్వం తయారవుతూ ఉన్న ఒక పసిమిరంగు. దీన్ని మామిడి ఆకులను మాత్రమే మేసిన ఆవుల మూత్రం నుంచి తయారు చేసేవారట. ఇటువంటి ఆహారం పశువుల ఆరోగ్యానికి హానికరమని 1908 నుంచి దీని ఉత్పత్తి నిషేధించారు. ప్రస్తుతం దీన్ని కృతకంగా తయారు చేస్తున్నారు.

**India paper :** *ఇండియా కాగితం.*

చాలా పలచగా ఉండి గట్టిగానూ, కాంత్యభేద్యంగాను ఉండి, ముద్రణకు ఉపయోగించే కాగితం, దీన్నే బైబిల్ కాగితం అనికూడా అంటారు.

**India rubber :** *ఇండియా రబ్బరు.*

పెన్సిలు రేఖలను తుడుచుకోవటానికి ఉపయోగించే రబ్బరు.

**indigo :** *నీలిమందు.*

నీలిమొక్క (ఇండిగో ఫెరా) నుంచి తయారుచేసే ముదురు నీలపు వర్ణద్రవ్యం. ప్రస్తుతం దీన్ని తారు నుంచి కృత్రిమంగా తయారుచేస్తున్నారు. రోమనుల కాలంనుంచి కూడా, అనేక యూరపీయ దేశాలకు దీన్ని భారతీయులు ఎగుమతి చేసేవారు.

**industrial art :** *పారిశ్రామిక కళ.*

ఆంగ్లభాషలో 'ఇండస్ట్రియల్ ఆర్ట్' (పారిశ్రామిక కళ) అనే దానికి ఒక ప్రత్యేకత ఉంది. పరిశ్రమలలో తయారుచేసే వస్తువులకు చెందిన అన్ని తీరుల రూపకల్పనలు. సీసా బిరడాలు మొదలుగా విమానాల వరకు అన్నీ దీని పరిధిలో చేరతాయి.

**inert .** *అప్రవర్తక; జడ*

**inert pigment** *జడ వర్ణద్రవ్యం.*

**inflammable :** *జ్వలనశీలం.*

**informative distortion :** *సంసూచక వికృతీకరణ.*

(చూ : *distortion*)

**infra red :** *అధశ్శోణం.*

**ingredient :** *అంశద్రవ్యం; సాధన ద్రవ్యం; సంఘటకం.*

**inherent vice :** *అంతర్గత దోషం.*

వాతావరణ ప్రభావాల వల్లగాక, చిత్రరచనలో వాడిన పదార్థాలలోని లోపాలవల్లనే చిత్రంలో కలిగే దోషం.

**inherently :** *నైసర్గికంగా.*

**initial :** *ఆద్యాక్షరి.*

**ink :** *సిరా.*

చిత్రరచనలో వాడే ద్రవ, సాంద్రతర, ఘనరూపాలు కల రంగు పదార్థం. దీన్ని కుంచెతోగాని, కలంతోగాని ఉపయోగించవచ్చు. ఇది టంకలంలో ఉపయోగించే రాతసిరా కన్నా వేరైనది. ఆలేఖనపు సిరా లేదా ఇండియా సిరా అనేది, కలంతో చిత్రించే ఆలేఖనాలకూ, శాకనాలేపనాలకూ ఉత్తమం. నీటివల్ల ఇది చెరగదు. చీనాసిరా కూడా ఇటువంటిదే. ఇది కణికల రూపంలోను, ద్రవరూపంలోను తయారవుతుంది. నలుపుగాక - తక్కిన వర్ణాలలో లభించే సిరాలు అంతగా మన్నిక గలవి కావు. ముద్రణ సిరాలు నీటివర్ణాలకన్నా. తైలవర్ణాలకు ఎక్కువ దగ్గరగా ఉంటాయి

**inlay :** *ఖచనం; పొదగటం*

చెక్కుడు పనిలో కొంచెం లోతుగా చెక్క, కొయ్య, లోహం, రంగు, పెంకు, రాయి, గవ్వవంటి వాటిని అతికి రూపాలను సృష్టించటం; అట్లా రూపొందించిన కళా విశేషం.

**inner garment :** *అంతరీయం; లోదుస్తు.*

**inpainting :** *అభిచిత్రణ; అంతశ్చిత్రణ.*

చిత్రాల పరిరక్షణలో, చెడిపోయిన భాగాలను శ్రద్ధగా దిద్ది బాగుచేయటం.

**inscribe :** *అభిలిఖించు*

**inscription :** *అభిలేఖనం*

**in situ :** *యథాస్థానం.*

1. ఒక కళాఖండాన్ని నిర్మించి వేరొక చోటినుంచి తేవటానికి బదులుగా, దాన్ని స్థాపించవలసిన స్థలంలో రూపొందించి స్థాపించటం.

2. ఒక పురావస్తువు అది ఉన్న స్థానంలోనే ఉంచి, ఏవైనా మరమ్మత్తులు కావలసి ఉంటే చేయటం.

3. ఒక పురారచితమును యథాస్థానంలోనే పరిశీలించటం.

**insoluble :** *అద్రావ్యం.*

**insulating board :** *నంబంగ్న ఫలకం.*

చిత్రలేఖనంలో ఆధుడగా ఉపకరించే ఒక పిడపు ఫలకం; ఇది చాలా బలహీనంగా ఉంటుంది. కాబట్టి కలకాలం మని ఉండాల్సిన చిత్రాలకు ఇది అంతగా పనికిరాదు.

**insulator :** *నంబంగ్నిక.*

**intaglio :** *అంతఃపాతి.*

1. శిల్పంలో కొంచెం లోతుగా చెక్కిన అక్షరాలు, లతలు మొదలైనవి

2. చేత్తో తీసే మూడు ప్రధాన ముద్రణ విధానాలలో ఒకటి. లోహఫలకాలపై రేఖాశిల్పం ఇందులోనిదే. అంతఃపాతి పద్ధతిలో లోహఫలకంపై ముద్రణసిరాను పూసి తుడిచి వేయాలి. దీనివల్ల లోతుగా ఉన్న భాగాలలో మాత్రం సిరా నిలిచి ఉండి, చిత్రం ముద్రితమవుతుంది.

**intaglio methods :** *అంతరేఖా పద్ధతులు*

**intaglio print; collagraph :** *రేఖోల్బణ ముద్రణ.*

**intarsia** *చెక్కపొదిగింపు.*

ఒక చెక్కలో గాడిచెక్కి, వేరేవేరే ఛాయలుగల చెక్కలను పొదిగించి చేసే అలంకరణ విధానం పునరుజ్జీవన యుగంలో, ఇటలీ దేశంలో, ఈ కళా ప్రక్రియ ఉచ్ఛస్థితిలో ఉండేది

**intense blue :** *సాంద్ర నీలిమ.*

నీలిమలో రంజకమైన ఒక గట్టిఛాయ రకం.

**intensity :** *సాంద్రత.*

**interior decoration .** *అంతరలంకరణ.*

**interlace :** *అంతర్వల్లిక; జడా వల్లిక.*

ఒకవిధమైన అల్లికలీరు ఇందులో కొన్ని రేఖలుగానీ, బద్దెలుగానీ ఒకదానితో ఇంకొకటి పెనవేసుకొని జటిలంగా రూపొందుతాయి. ఇందులో ఈ పెనవేసుకొనేవి, ఒక దానితో ఇంకొకటి పైకి, కిందకి విపర్యయ రీతిలో సాగుతాయి.

**intermediate colour :** *మధ్యస్థ వర్ణం.*

ప్రాథమిక, ద్వితీయ శ్రేణుల వర్ణాలకు మధ్యన, వర్ణమాలా వలయంలో కనపడే వర్ణాలు.

**intermediate varnish :** *నడిమి వార్నిషు.*

రెండు రంగుల పూతలకు మధ్యగా ఉపయోగించే వార్నిషు జిగురు వర్ణాలపై తైల వర్ణాలను ఉపయోగించేటప్పుడు ఈ వార్నిషును వాడతారు. దానివల జిగురు వర్ణాలు, తైలవర్ణాలను అధికముగా పీల్చుకోకుండా ఉంటాయి.

**International institute for the conservation of historic works :** చారిత్రక.

*కళావిషయక వస్తు పరిరక్షక అంతర్జాతీయ సంస్థ*

ప్రదర్శనశాలా నిపుణులతోను, పరిరక్షణ వేత్తలతోను కూడిన అంతర్జాతీయ సంఘం. పరిరక్షణకు అవసరాలైన శాస్త్రీయ పద్ధతులను రూపొందించటం, వాటిని ప్రచారంలోకి తేవటం ఈ సంఘం ఉద్దేశాలు.

**intimism :** *పరిచితవస్తు వాదం.*

వర్ణదర్శనావాదంలో ఒక విభాగం. ఈ వాదానికి అనుగుణంగా చిత్రితాలయ్యే వాటిలో తరచుగా ఇండ్లలోని సామాన్యదృశ్యాలు, ముంగిలి దృశ్యాలు కనపడతాయి. నబిస్ అనే కళాకార వర్గం ఈ రీతి చిత్రాలను రచించింది. ఈ వర్గంలో ముఖ్యులు: ఎడ్వర్డ్ విలార్డ్ (1868 - 1940); పియర్రే బోన్నార్డ్ (1867 - 1947)

**intonaco :** *తీర్పుపూత.*

భిత్తి చిత్రణకు తుదిపూత; దీనిలో అయిదు భాగాలు సున్నం, ఏడుభాగాల ఇసుక లేదా చలువరాతిపొడి కలిసి ఉంటాయి.

**intrinsic :** *అంతర్గతరూపం; అంతర్గతాకృతి.*

**introduction :** *అనయనం; ప్రవేశనం.*

ఒక కొత్తరంగును, లేదా పద్ధతిని ప్రవేశపెట్టటానికి వాడే పదం

**inv or invent :** *కల్పిత.*

*'Invenit'* అనే లాటిన్ పదానికి సంక్షిప్త రూపాలు *Inv* లేదా *Invent.* ఆ పదానికి రూపొందించాడు 'లేదా కల్పించాడు' అని అర్థం. ముద్రాంకపు కింది భాగంలో మూల చిత్రాన్ని చిత్రించిన కళాకారుడి పేరు పక్కన ఈ పదాన్ని వ్రాయటం ఉంది.

**invented :** *పరికల్పిత.*

**invention :** *పరికల్పన.*

**invest :** *పరిధానం.*

లోహపు పోతలో మూసకు రెండువైపులా పూసే పూతపని.

**investment :** *ఆలిప్తం.*

లోహపు పోతలో ఉపయోగించే మూస. మధూచ్ఛిష్ట విధానంలో లోహాన్ని పోతపోసేటప్పుడు, ఇసుక కలిసిన మట్టితోగాని, పారిస్ సుద్దతోగాని ఇటుకమట్టి, వ్రణం వంటి వాటిని కలిపి దీన్ని నిర్మించి వాడతారు.

**iridescence :** *కళత; చలద్వర్ణత.*

కాంతికిరణాల విదళనం వల్ల ఏర్పడే రంగులదృశ్యం. ఇది నిజానికి ద్రవ్యంవల్ల ఏర్పడదు. ఈవిధంగా ఏర్పడేవి ఇంద్రధనుస్సులోని కాంతివంతమైన వర్ణాలవంటివి. ఎండలో నీటిపై చమురు పడినప్పుడు కూడా ఇటువంటి కళత ఏర్పడుతుంది.

**iris green :** *కనీనికా హరితం.*

సాప హరితానికి పర్యాయనామం.

**iron blue :** *ఆయస నీలిమ.*

ప్రషియన్ నీలిమకు పర్యాయనామం.

**iron brown :** *ఆయస కపిశం.*

ప్రషియన్ కపిశానికి పర్యాయనామం.

**iron pigments** . ***అయస వర్ణద్రవ్యాలు.***

ఇనుము కలిగిఉండే వర్ణద్రవ్యాలకు సాధారణ నామం.

**irons** : ***అయశ్శకలాలు.***

శిల్పం పోతలో మూసలలోనూ, పోత పోసిన విగ్రహపు లోపలి భాగాలలోను ఉపయోగించే ఇనప ముక్కలు. వీటికి సాధారణంగా గోనెపట్టి పైన ప్లాస్టరు పూస్తారు.

**irregular** : ***అవక్రమ.***

**irregular curve** : ***అవక్రమ వక్రిక.***

( చూ : *french curve*)

**irregularity** : ***అవ్యవస్థ; అవక్రమత.***

**isabella** : ***లేత గోధుమరంగు.***

ఇది కాంతిహీనపు రంగు. సాధారణంగా తేజోరహితమైన వర్ణరచనలను నిందించే సందర్భంలో ఈ రంగు వాడికున్నట్లు వాడతారు ప్రత్యేకంగా ఇది ఒక వర్ణద్రవ్యపు పేరు మాత్రం కాదు.

**isocephaly** : ***సమశీర్ష రీతి.***

ఉల్బణ, పట్టబంధ శిల్పాలలో సిద్ధష్టత కోసం రూపాల సహజ ప్రమాణాన్ని మార్చే రీతి ఇటువంటిది పార్థినాన్ ఆలయంలో కనపడుతుంది.

**isolating** : ***పృథక్కరింపు; వివివరమ.***

**isolating varnish** : ***విభివార్నిషు.***

కర్పూరతైలంమొదలైన కొన్ని తైలాల, లోనూ, ఖనిజతైలాలలోనూ కరగని వార్నిషు. ఒక వర్ణంపై ఇంకొకవర్ణాన్ని వాడవలసినప్పుడు, వాటిమధ్య ఈ వార్నిషునుసి పూసిన యెడల ఆ వర్ణాలమధ్య రాసాయనిక క్రియ జరగకుండా ఇది నిరోధిస్తుంది.

**isomeric colours** : సమవిషమ వర్ణాలు.

చూడటానికి ఒకే వర్ణంగా కనిపించినా, యథార్థానికి వేర్వేరు రాసాయనిక భౌతిక ధర్మాలు గల వర్ణాలు.

**isometric** : **సమమాపక.**

**isometric projection** : **సమమాపక ప్రక్షేపణ.**

యాంత్రిక ఆలేఖనంలో రూపాల యథార్థపు కొలతలను ఉపయోగించే పద్ధతి. దగ్గరగాఉండే భాగాలు పెద్దవిగానూ, దూరంగా ఉండేవి చిన్నవిగా కనిపింపజేసే అవసరం ఇందులో ఉండదు. 120° కోణంలో నుంచి దృష్టి సారించినట్లు ఇందులో పొడవు, వెడల్పు, ఎత్తులు రచితమవుతాయి ఇటువంటి రూపాలు పెద్దవైనకొద్దీ రూపవిభ్రష్టతకూడా అధికమవుతుంది. కాని వస్తువుయొక్క నిజప్రమాణాలను తెలుసుకోవటంలో కళాకారులకూ, చేతి పనివాళ్ళకూ, శాస్త్రవేత్తలకూ ఈ ప్రక్రియ చాలా ఉపయోగిస్తుంది

**italian blue** : ***ఇటాలీయ నీలిమ***

బిగుస్త నీలిమకు పర్యాయనామం.

**italianizers** : ***ఇటాలీయకారులు.***

**italian pink** : ***ఇటాలీయ పాటలం.***

దచ్చి పాటలానికి పర్యాయనామం.

**italic 1** : ***వలపల; దక్షిణక.***

**italic 2** : ***ఇటాలిక.***

లిపి చిత్రణంలో ఒక విధమైన అచ్చు. ఇది రోమన్ యాంటిక్ అక్షరాలను పోలి ఉంటుంది. గోథిక్ అచ్చుకు ప్రత్యామ్నాయంగా 15 వ శతాబ్దంలో ఇది రూపొందింది.

ప్రస్తుతం చాలా ముద్రాక్షరాలలో రోమన్ అక్షరాలతోపాటుగా ఇటాలిక అక్షరాలుకూడా ఉంటాయి. ఒక పదం, లేదా వాక్యం యొక్క ప్రత్యేకతను తెలియజేయటానికి ఈ ఇత్తును వాడుతున్నారు.

**Ivory black** : *దంత కర్బనం.*

మొదట్లో దంతాన్ని కాల్చి చేసే ఒక కర్బన వర్ణద్రవ్యానికి ఈ పేరు ఉండేది. ప్రస్తుతం మేలిరకపు అస్థిభస్మ సంబంధి అయినదానికి కూడా ఈ పేరు వాడుతున్నారు.

## J

**jacaranta brown** : *జకరాంత కపిశం.*

తృణమణికి అపుడుగా వాడే నామం.

**jacket** : *కంచుకం.*

**Jacobean style** : *జాకోబీయ శైలి.*

క్రీ శ. 1603 మొదలుగా 1625 వరకు ఆంగ్లదేశంలో రూపొందింపబడిన కళారచనల విశిష్టతను తెలియజేయటానికి నిర్దిష్టరీతిలో కళా చారిత్రకులు ప్రయోగించే ఒక పారిభాషిక పదం. అయితే పూర్వార్ధంలో, ఆ తరవాత కొంతకాలపు వాస్తు ఆలంకారిక, గృహోపకరణ కళలకున్నూ దీన్ని వాడటం జరుగుతున్నది ఆ కాలంలో దీనితో చాలావరకు ఫ్లెమిష్ అధిలేఖనాలనుంచి సేకరించిన అతిమాత్రపు అలంకరణకూడా చోటుచేసుకొన్నది మొరటుగా ఉండే ఈ అంతర్వల్లిక అలంకరణలోను ప్రముఖత వహించింది.

**jade** : *వర్ణశిల*

అతి కఠినమైన వన్నెరాయి. తెలుపు నుంచి ముదురు ఆకుపచ్చరంగు వరకు విస్తరించిన వర్ణశ్రేణిలో ఈ తరగతి శిలలు లభిస్తాయి వీటిని చెక్కటం అతికష్టం. కాని ప్రాచ్యదేశాలలో చిలుగు పనికి దీన్ని వాడతారు.

**jamb** : *ద్వారశాఖ.*

**japan** : *జాపాను.*

1. రంగులలో మెరుగు రావడానికి కలిపే స్వచ్ఛమైన వార్నిషు దీన్ని కలపటంవల్ల తైల వర్ణాలు త్వరితంగా ఆరిపోతాయి. ఇటువంటి రంగులను ఉపకరణాలపై వాడవచ్చు. ఇటువంటి తైలవర్ణానికి పెళుసుదనం ఉండటంవల్ల అటువంటిదాన్ని చిత్రాలలో వాడటం మంచిది కాదు

2 తారు కలిసిన ఒక విధపు చౌక బారు నలుపు రంగు లోహపాత్రలపై పూర్వం దీన్ని ఉపయోగించేవారు.

3 నూనె కలియని వార్నిషుతో కలిపిన ఒక విధపు రంగు. ఇది త్వరితంగా ఆరిపోతుంది. ఈ రంగుపూతకు మెరుపు ఉండదు. అయినా అలంకరణ చిత్రణకై దీన్ని వాడతారు దానిపై భద్రతకోసం వార్నిషు పూత పూయాలి.

4. పేర్పలక (*sign board*) లను రాయటంలో ఉపయోగించే రంగు. చిత్రాలకు ఇది పనికిరాదు.

**Japan wax :** *జాపాన్లీ మైనం.*

ఇండియా, చీనా దేశాలలో మాయలక్క తయారీలో ఉపోత్పన్నంగానూ, సుమాక్ జాతి ఒకవిధపు చెట్టునుంచి సహజసిద్ధం గానూ లభించే మైనం. ఒధిపక్తిక గుణం కలిగి, మృదువుగా పసిమిగా ఇది ఉంటుంది. దీని ద్రవీభవన విస్తృతి 50-52° సెం.గ్రే.

**Japonism or Japanism :** *జాపానీయత.*

పాశ్చాత్యదేశాల కళలపై పడిన జాపనీయ కళాప్రభావం. 1854లో ఒ మోడోర్ పెర్రి, జపానుదేశపు కళలను పాశ్చాత్యదేశాలకు పరిచయం చేశాడు. ఆ కళల ప్రభావం పాశ్చాత్య దేశముల కళలపై 20 వ శతాబ్ది ప్రారంభం వరకూ ఉంటినది. అలంకారిక కళలలో చీనా ప్రభావం పోయి జపాను ప్రభావం ప్రబలింది. లలితకళలలో అనుభావనావాదం ప్రభావనా వాదం కూడా ఈ జాపనీయత నుంచి చాలా స్వీకరించాయి.

**jasper ware :** *సారశిలా సామగ్రి.*

1774 లో జోసయా వెడ్జ్వుడ్ తయారు చేసిన ఒకవిధపు పింగాణి సామగ్రి వాటిపై ఉన్న ఉబ్బెత్తురూపాలవల్ల అవి బహుళ ప్రచారాన్ని పొందగలిగాయి. నవ్య ప్రామాణిక శైలిలో రంగు భూమికపై తెల్లగా ఉబ్బెత్తు అలంకరణలు ఉండేవి. ఆ సామగ్రిని స్వచ్ఛ మైన తెలుపు రంగులో తయారుచేసేవారు. క్రీ శ. 1 వ శతాబ్దికి చెందిన రోమనుల కాలపు ఒక పాత్రను అనుకరిస్తూ వెడ్జ్వుడ్ తయారు చేసిన ఒక పాత్ర ప్రపంచ విఖ్యాతిని గాంచినది.

**jaune brillant :** *జానీ దీప్తికం.*

వివిధ వర్ణద్రవ్యాలకు వాడే ఒక సామాన్య నామవిశేషణం నేపిల్స్ పీతవర్ణం, కాడ్మియమ్ పసిమి ఈ కోవలోవే.

**jet :** *శిలానీలం.*

చిత్రరచనలో వాడే అతిగాఢపు నలుపు వర్ణం ఒక నల్లని శిల (*jet*) లాగా దీని రంగు ఉండటంవల్ల, దీనికి ఆంగ్లంలో జెట్ అనే పేరు వచ్చింది.

**jewel point :** *వజ్రముఖి*

అమూల్య శిలలలో ఏ ఒకదానికైనా చెందిన ఒక ముక్కను కొసలో బిగించిన వనిముట్టు సూచీ ప్రక్రియలో దీనికి వాడుక ఉంది గాజును కోయటంలో కూడా ఇది బాగా ఉపకరిస్తుంది

**jomon ware :** *జోమోన్ సామగ్రి.*

క్రీ పూ 700 నాటి జపానుదేశపు పింగాణి సామాను

**journeyman :** *కుశలుడు*

సుశిక్షితుడైన చేతివనివాడు. ఒక కళా ప్రవీణుడి, లేదా హస్తకళా ప్రవీణుడి చేరికింద పనిచేయటానికి అర్హత ఇతనికి ఉంటుంది.

**Judas hair :** *ఎర్రజుట్టు; రక్తకేశం.*

తేజోవంతమైన రంగులలోగాని, కేవలం ఎరుపురంగులలో గాని చిత్రించిన జుట్టు.

**jugendstil** : నవ్యకళ.

'నవ్యకళ'కు పర్యాయపదంగా ఫ్రెంచి భాషలో కనిపించే *'art nouveau'* అనే దానికి జర్మన్ భాషాపదమే *jugendstil* *jugend* అంటే యువత అని జర్మన్ భాషలో అర్థం.

**jute canvas** : జనప కాన్వాస్.

నారతో నేసిన ముతక గాజిక. దీని గరుకుతనాన్ని బట్టి దీన్ని కళాకారులు అభిమానిస్తారు; కాని కాలక్రమాన గాజిక పెళుసెక్కి, బలహీనమై, నలుపెక్కుతుంది. కాబట్టి మన్నిక నాశించే చిత్రాలకు ఇది పనికి రాదు.

**juxtaposition** : నైకట్యం.

(చూ : *optical mixture*)

# K

**kalsomine** : సుధాలేపం.

**kantharos** : (చూ : *cantharus*)

**kaolin¹** : కయోలిని.

చీనామృత్తికలలో - తెలుపువన్నెలో, స్వచ్ఛతలో-అత్యుచ్చ స్థాయికి చెందిన ఒక రకపు మట్టి.

**kaolin²** : నాగం.

**Kassler yellow** : కాస్లర్ పసిమి.

టర్నర్ పసిమికి పర్యాయ నామం.

**kauri** : కౌరి

ఆస్ట్రేలియాలో ఒక రకపు చెట్టునుంచి తయారయ్యే ఒక యక్షధూపం

**Keene cement or Keenes cement** : కీన్ సిమెంటు.

మన్నిక కలిగి కఠినమైన గచ్చు. రిచర్డ్ వట్సన్. కీన్ అనే అతడు ఇంగ్లండులో 19 వ శతాబ్దిలో దీన్ని తయారుచేశాడు. శిల్పాల పునరుద్ధరణలోను భిత్తిచిత్ర భూమిక తయారీలోను, శిల్పరచనలోను ఇది ఉపయోగపడుతుంది.

**kernel black** : అష్ఠి కాలిమ.

ద్రాక్ష కాలిమలోనే ఒక రకానికి చెందింది; పీచి ప్రుష్టపు కాయల కురుడీలను కాల్చి దీన్ని తయారుచేస్తారు.

**kettle** : కటాహం.

**key¹** : ప్రతివత్తి.

**key²** : కీలకం.

1. చిత్రాలలోని వర్ణ సమ్మేళనపు విలువలకు స్థాయీ విశిష్టతకు గల విస్తృతిని తెలిపే పారిభాషిక పదం. తేజోవంతంగానో, వివర్ణంగానో ఉండే మృదు వర్ణాలలో రచితమైన చిత్రం హెచ్చు కీలకం కలది; మందంగానో, దర్పరహితంగానో ఉండే వర్ణాలలో లిఖితమైన చిత్రం తక్కువ కీలకం కలది.

2. పాదికను దిగించే చట్రం కదలకుండా గట్టిగా ఉండటానికై మూలల్లో దిగించే కొయ్యమేకు.

3. శిల్పాలను పోతపోసే మూసలను రెండు, మూడు విడి భాగాలుగా తయారు చేసినప్పుడు, వాటిని తిరిగి కలపటానికి అనువుగా ఉండే గసిక లేదా బుడిపె పంటిది.

**key block; key plate; keystone :** *కీలక ఫలకం; మూల ఫలకం; కీలక శిల*

చేత్తో రంగు ముద్రణలను తీయటానికి ముందుగా, వివిధ వర్ణాలను వేరుచేయటానికి అనువుగా తయారుచేసే ఫలకం.

**kick wheel :** *తొక్కుడుసారె; తాపుసారె.*

కిందవైపు అమర్చిన ఒక పాదఫలకాన్ని తొక్కటం వల్ల తిరిగే కుమ్మరి సారె



తొక్కుడు సారె

**kidney :** *వృక్కకం.*

పింగాణీ పాత్ర తయారీలో నునుపు చేయటానికి ఉపయోగించే ఒక రబ్బరు పరికరం. ఇది చూడటానికి వృక్క (*kidney*-మూత్ర పిండం) లాగా ఉంటుంది కాబట్టి దీనికి ఆ పేరు వచ్చింది.

**kieselguhr :** *అగ్నిశిలా మృత్తిక.*

**killed plaster :** *పూత ముద్ద.*

ప్లాస్టరు శిల్పాలను పోతపోసిన తరవాత వాటిలో లోపాలను సరిచేయటానికీ, నునుపు చేయటానికీ ఉపయోగించే ముద్ద. దీన్ని చిక్కగా కలిపి, గట్టిపడటానికి కొంచెం ముందుగా శిల్పంపై మెత్తుతారు.

**kiln :** *బట్టీ; ఆవము.*

పింగాణీ సామానులను కాల్చటానికి ఉపయోగించే కొలిమి. దీనిలో చాలా రకాల ఇంధనాలను వాడతారు.

**kiln-dried wood :** *నెగడు కొయ్య.*

బట్టీలో వేసి పదును చేసిన కొయ్య. చెక్కడాలకు వాడే కర్ర పూర్తిగా ఆరి ఉండాలి అట్లా ఆరకపోతే చెక్కిన తరవాత శిల్పంలో ముడతలు ఏర్పడటం, కొన్ని భాగాలు కుంచించుకొని పోవటం జరుగుతాయి. సహజంగా కలప ఎండటానికి చాలాకాలం పడుతుంది. కాబట్టి శిల్పులు కర్రను ఇట్లా తయారు చేసుకోవటం జరుగుతున్నది కాని, సహజంగా ఆరిన కర్ర అంత శ్రేష్ఠమైంది ఇది కాదు.

**kinetic art :** *గతిశీలక కళ.*

1. శిల్పంలో కొన్ని భాగాలను కదిలేట్లు చేసిన కళావిశేషం.

2. చిత్రాన్ని చూసేటప్పుడు చూపరి తన కంటిని కదిపినప్పుడు చిత్రాలలోని ఆకారాలు కదులుతున్నట్లు కనిపించే విధంగా చిత్రించటం.

**king's blue :** *షాహీ నీలిమ.*

కాదికా వర్ణద్రవ్యానికి పూర్వం వాడుకలో ఉన్న పేరు. ఇది ఇప్పుడు కోబాల్ట్ నీలిమకు

వర్ణాయనామంగా వాడుకలో ఉన్నది.

**king's yellow** : *ధాతుపీతం.*

**kit cat** : *కిట్ కేట్.*

(చూ : *canvas sizes, portrait*)

**kitsch** : అధమం.

తక్కువ స్థాయి అభిరుచులకు అనుగుణంగా, యాంత్రికంగా అత్యధిక సంఖ్యలో తయారుచేసిన చౌకబారు కళాసృష్టి.

**knife-file** : *ఛురికా మార్జని; కత్తిరాయి.*

గసికలాగా రూపుదీరి ఉండే ఒక విధమైన సన్నని ఆకురాయి.

**knop** : *వర్ప్యకం.*

అందంగా, అలంకరణ యుక్తంగా, లోహం, గాజువంటి పదార్థాలతో తయారు చేసిన పిడి.

**krater or crater** : *ఘటగ్రీవం; యవన కలశం.*

ప్రాచీన గ్రీసుదేశంలో వాడుకలో ఉన్న పెద్ద పింగాణీ కూజా. దీని ముఖం వెడల్పుగా, గొంతు సన్నంగా ఉండేది. దీనిలో ద్రాక్షరసం ఉంచి నీరు కలిపేవారు. అనేకాకారాల్లో ఇది తయారయ్యేది.

**kylix or cylix** : *గోళిక.*

ప్రాచీన గ్రీసుదేశంలో వాడుకలో ఉన్న మృణ్మయ పానపాత్ర. శరావం (బూరెల మూకుడు) లాగా ఉన్న దీనికి రెండుపక్కలా పిడులు ఉండేవి. నేలపై చక్కగా నిలవటానికి అనువుగా దీనికి దిగువన కుదురు ఉండేవి. ఈ కుదురు గుండ్రంగా దిమ్మెలాగా గాని, కాడమాదిరిగా ఉండి దిగువన మట్టు కలిగి గాని ఉండేది.

# L

**laboratory** : *ప్రయోగశాల; పరిశోధనశాల; లేబరేటరీ.*

**lac** : *లక్క; లాక్.*

భారతదేశంలో, కొన్ని రకాల తుమ్మ (అకేషియా) జాతి చెట్లలో ఒక రకమైన క్రిములవల్ల రూపొందే వృక్షస్రావవిశేషం. లక్కక్రిములు, ఆ చెట్లపై నివసిస్తూ తమ శరీరానికి రక్షణగా లక్కను ఉత్పత్తి చేసుకొంటాయి. శుద్ధిచేయని లక్క, ఈ క్రిముల కళేబరాలతోను, చిన్న చిన్న పుల్లముక్కలతోను కలిసి ఉంటుంది. పరిశుద్ధం చేసిన తరవాత ఇది యక్షధూపంగా మారుతుంది. దీన్ని కరగించి కణికలుగా తయారుచేస్తారు. అత్యంత పరిశుద్ధమైన లక్క సన్నటి పొరరేకులుగా ఉంటుంది. దీన్ని వివర్ణం (*bleach*) చేసి, తెల్లలక్కను తయారు చేయవచ్చు. దీన్ని ఆల్కహాలులో కలిపి, వార్నిషు తయారు చేస్తారు. లక్కను పరి

శుద్ధి చేసేటప్పుడు ఉత్పత్తిఅయ్యే నెత్తురు వంటి రంగు పురాతన కాలంనుంచి కూడా చాలా ప్రాముఖ్యమైన వర్ణంగా పరిగణన పొందింది. యూరపీయులు లక్కకు పర్యాయపదంగా వాడే 'లాక్' అనే పదమూ, కొన్ని విధాలైన వర్ణాలకు వాడే 'లేక్' అనే పదమూ సంస్కృతోద్భవమైన 'లాక్షా'కు సన్నిహిత పదాలే. 'లాక్షా'కు ఉత్పత్తి స్థానమైన 'లాక్షా తరువు' యొక్క నామానికి వ్యుత్పత్త్యర్థం 'నూరువేల క్రిములకు ఆశ్రయమైంది' అని కొందరి అభిప్రాయం.

**lac dye** . అలక్తకరసం; లత్తుకరసం; క్రిమిరాగం.

**lacquer** : చీనాలక్క.

1. కొన్ని వృక్షాలనుంచి సహజంగా ఉత్పత్తి అయ్యే జిగురు. ఇది దూరప్రాచ్యంలో అధికంగా లభిస్తుంది.

2 పారిశ్రామికోత్పత్తులకు ఉపయోగించే ఒక విధపు లేపన ద్రవ్యం ఇది వర్ణయుక్తమై పారదర్శకంగా ఉంటుంది ఇది సెల్యులోజ్ ఉత్పన్నం ఇది త్వరగా ఆరిపోతుంది ఈపూత గట్టిగా మెరుస్తూ, చెమ్మను తుప్పును చేరనీయదు దీన్ని పిచికారీ సాధనంతో కూడా పూయవచ్చు మోటారు కార్లకు, ఇతర యంత్రాలకు ఈ పూతను అధికంగా వాడుతున్నారు. ఇటువంటి వాటిలో డూకో (*duco*) అనే వ్యాపార నామం కలవి ప్రసిద్ధమైనవి. అక్రిలీయ వర్ణాలు రాసాయనిక లాక్షా వర్ణాలు వచ్చిన తరవాత, మాయ లక్కను కాదని, వాటి మన్నికను గుర్తించి, వాటినే వాడుతున్నారు. అతినీలలోహిత కిరణాల తాకిడికి చీనాలక్క పూతలు 10, 15 సంవత్సరాలలో వివర్ణత పొందుతాయి.

**lacquer, oriental** : తొలి లక్క

కొన్ని రకాల వృక్షాల నుంచి లభించే లేపన ద్రవ్యం. ఇది చీనా, జపానుదేశాలలో క్రీస్తు శకం ఆరో శతాబ్ది నాటికే ప్రచారంలో ఉండినది. గృహోపకరణాలపైనా, పాత్రలపైనా పూతలుగా ఈ నాటికీ దీన్ని, ఆ దేశాలలో వాడుతున్నారు. ఈ ద్రవ్యాన్ని ఒక దానిపై చాలా పూతలుగా పూసి, తగినంత మందంగా తయారుచేసి, చెక్కుడుపనిని చేయటం కూడా ఉంది

**lacquers** : లాక్షా ద్రవ్యాలు.

**lacuna** : లుప్తం.

ఒక చిత్రంలో, లేదా చిత్రయుక్తమైన ఒక రాత గ్రంథంలో నష్టమైన భాగం.

**lagynos** : బకగ్రీవం.

కడుపు పెద్దదిగా ఉండి, సన్నని పొడుగాటి మెడ కలిగి, పట్టుకోవటానికి పెద్ద పిడి ఉన్న ఒక విధమైన కూజా ఇటువంటి దాన్ని ప్రాచీన గ్రీకులు వాడేవారు

**laid paper** : నిండుగుర్తు కాగితం

విస్తీర్ణాన్ని అంతటినీ ఆక్రమించిన ఒక విధమైన నీటి గుర్తుల కాగితం. కాగితపు తయారీలో అడుగుభాగంలో అడ్డంగానూ, నిలువుగానూ ఉన్న తీగెలవల్ల ఈ నీటిగుర్తు ఏర్పడుతుంది.

**laitance** : కుద్యావన

పోర్ట్లండ్ సిమెంటుతో నిర్మితమైన గోడపైకి, ఒక్కొక్కప్పుడు, ఉబికివచ్చే వసాసదృశ పదార్థం. గోడపై పైపూత పూయటానికి, లేదా రంగు వేయటానికి, ముందుగ దీనిని చెక్కివేయాలి.

**lake** . *రంజకం*

రాసాయనిక చర్యకు గురికాని వర్ణ ద్రవ్యంతో, రాసాయనిక చర్యకు పొందే ఇంకొక వర్ణ ద్రవ్యాన్ని కలిపి, సృష్టించే వర్ణ ద్రవ్యం ఇట్లా తయారైన దానిలో మొదటిది ప్రాతిపదికగా ఉంటుంది. పారదర్శక వర్ణాలన్నిటికీ ప్రాతిపదికగా ఉపయోగించే అల్యూమినియం హైడ్రేటు-పర్ణోపాధి అనే దాన్ని - కాంత్యభేద్య వర్ణాల తయారీకి ఉపయోగిస్తారు. మట్టిసుద్ద వంటి వాటిని ఉపయోగించటం కూడా ఉంది. ఇట్లా తయారుచేసిన వర్ణాల మన్నిక, ప్రాతిపదిక ద్రవ్యాలపై కాక, రాసాయనిక చర్య పొందని వర్ణద్రవ్యంపై ఆధారపడి ఉంటుంది

ఈ రంజక వర్ణద్రవ్యాలు అతి ప్రాచీన కాలంనుంచి కూడా వాడుకలో ఉన్నాయి. ఇటలీ దేశపు అద్దకం పనివారు, అద్దకంపని ముగించిన తరవాత మిగిలిపోయిన రంగుమడ్డిని చిత్రకారులకు అమ్మేవారు ఈవిధంగా చేయటంతో దాని పరిమాణం ఎక్కువ చేయటానికిగాను కొంత సుద్ద కూడా కలిపేవారు గ్రీసు దేశంలోను ఈజిప్టులోనూ ప్రాచీన కాలంలోనే ఈ రంజక వర్ణాలు తయారవుతూ ఉండేవి. నేటికీ రోమనుల కాలపు తయారీ పద్ధతులు లభ్యమవుతున్నాయి.

**lamb** : *అవికాబకం; గొర్రెపిల్ల.*

క్రైస్తవ ప్రతిమాలక్షణంలో గొర్రెపిల్ల యొక్క ప్రతీకకు, రెండు విధాలైన ప్రాముఖ్యం ఉంది: 1. క్రీస్తును పరిత్రాతగా అది తెలియజేస్తుంది 2. గొర్రెలకు (భక్తులకు) కాపరుల సమకూర్చే మేటి కాపరిగా క్రీస్తును అది తెలియజేస్తుంది.

**lamination** : *పత్రబంధనం.*

ఒక వస్తువుయొక్క మందం, శక్తి, అధికం కావటానికిగాను పొరమీద పొర చేర్చటం పొరచెక్క దీనికి సరియైన ఉదాహరణం ఇదిగాక ఆధునిక కాలంలో ఫార్మికా, మికార్టా వంటి వ్యాపారనామాలు కలవి వాడుకలోకి వచ్చాయి. ఫినిని ఫెనోలిక యక్షధూపంతో తయారు చేస్తారు. ఈ పద్ధతిలో గాజుతలుపులు కూడా తయారవుతున్నాయి.

**lamp black** : *దీపమసి.*

వత్తి ద్వారా నూనెను కాల్చి, దాని పొగ నుంచి తీసిన అతిమెత్తని మసి. ఇది చాలా తేలికగా ఉంటుంది. దీన్ని అన్నివిధాలైన చిత్రాల రచనకూ వాడవచ్చు. అతి ప్రాచీన కాలంనుంచి కూడా ఇది వాడుకలో ఉన్నది.

(చూ *carbon black*)

**land plaster** : *భూవిష్టం.*

'జిప్సమ్'కు పాతపేరు

(చూ : *gypsum*)

**landscape** : *భూదృశ్యం; ప్రాదేశికం.*

**landscape marble** : *భూదృశ్య రాళాశ్మం.*

**landscape painting** : *ప్రాదేశిక చిత్రణ; భూదృశ్య చిత్రణ.*

ప్రకృతి దృశ్యాలను రేఖలలోగాని రంగులలోగాని రూపొందించిన చిత్రణ. ఇటువంటి చిత్రాలలో మానవరూపాలను, మానవనిర్మితమైన వస్తువులను కూడా చూపవచ్చుగాని,

వాటికి ప్రాధాన్యం ఉండకూడదు. 17 వ శతాబ్దంలో ఇటువంటివి తరచుగా ఉండినట్లు కనపడదు. ఆ కాలంలోని ప్రకృతి దృశ్య చిత్రాలు, మానవ చిత్రాలకు అనుబంధాలుగానో భూమికలుగనో మాత్రమే కనపడుతున్నాయి. 17 వ శతాబ్దంలో మొదటిసారిగా డచ్చి చిత్రకారులు ప్రాదేశిక చిత్రాలను చిత్రించటం ప్రారంభించారు 18, 19 శతాబ్దాలలో ఇంగ్లండులో ఇటువంటి చిత్రణ ఉచ్చస్థాయిని అందుకొన్నది.

**lantern** : *కాంతిజాలిక*

వాస్తుశాస్త్రంలో ఒక పారిభాషిక పదం. ఒక నిర్మాణపు భవనంపైగానీ, గుంబాజు పైనగానీ తీర్చబడి, చిన్న చిన్న వాతాయనాలుండే పటిభి.

**lapidary** : *మణికారుక; రత్నశిల్పిక.*

**lapis lazuli** : *ఇంద్రనీల మణి.*

అమూల్యశిలలలో తక్కువ స్థాయికి చెందింది. దీన్ని ఆభరణాలలో వాడతారు. అలంకారిక నీలిమను తయారుచేయటానికి దీన్ని ఉపయోగిస్తారు ఈ ఇంద్రనీలాలలో అత్యుత్తమమైనవి ఆఫ్ఘనిస్తానులో లభిస్తాయి.

**latch** : *గడియ; పరిఘ.*

**Latin cross** *లాటిన్ సిలువ.*

నిలువు కడ్డీలో, నడుమకు పైగా, అడ్డు కడ్డీ అమరి ఉన్న శిలువ. ఇటువంటిదానిపైనే క్రీస్తును ఎక్కించినట్లు క్రైస్తవ భావన. రోమనులు, నేరంచేసినవారిని హింసించటానికి ఎన్నోరకాలైన సిలువలను ఉపయోగించేవారు.

**lavender (colour)** : *లవేండ్ర (వర్ణం).*

**lawn** : *వాలని.*

మార్దవ ద్యుతికాలకు జల్లించటానికై వాడే జల్లెడవంటి ఒక పరికరం.

**lay figure** : *కీలుబొమ్మ; మాణవకం.*

చిత్రాన్ని రచించేటప్పుడు నమూనాగా ఉపకరించే కొయ్యబొమ్మ. దీని అవయవాలు అన్నీ అటూ-ఇటూ కదల్చటానికి వీలుగా ఉంటాయి. ఇటువంటి బొమ్మలు, అడుగు మొదలుకొని ఆరడుగుల ప్రమాణం వరకు



కీలుబొమ్మ

లభిస్తాయి. దీనికి లక్క-ద్రావణంలో ముంచిన దుస్తులు తొడిగి, ఆ దుస్తుల మడతలను కావలసినట్లుగా అమరుస్తారు ఆరిన తరవాత ఆ దుస్తుల మడతలు చెదరకుండా ఎంతకాలమైనా అట్లానే ఉంటాయి. చిత్రపు నమూనాగా కూర్చుండేవానికి దీనివలన శ్రమ తగ్గుతుంది.

**layer** : పూత; పొర.

**lead** : సీసం.

**lead pencil** : సీసపు పెన్సిల్.

చిత్రరచనకు ఉపయోగించే పెన్సిల్. మొదట అచ్చపు సీసాన్నే రేఖారచనకు ఉపయోగించేవారు. 1795లో గ్రాఫైట్ యౌగికమైన పెన్సిలు వాడుకలోకి వచ్చిన తరవాత, సీసపు వాడుక అంతరించింది. అయినా గ్రాఫైట్ యౌగికపు పెన్సిలుకే సీసపు పెన్సిలు అనే పేరు- అపార్థజనకమే అయినా- వాడుతున్నారు. చిత్రరచనకు ఉపయోగించే ఈ పెన్సిళ్లు 17 శ్రేణులలో లభిస్తాయి.

ఇవి అతికఠినాలై అస్పష్టరేఖలను గీసే శ్రేణినుంచి, చాలా మెత్తగా స్ఫుటమైన నల్లని గీతలను గీసే శ్రేణివరకు ఉన్నాయి. కఠినంగా ఉండే వాటికి *H, HH, HHH* వగైరాలున్నూ, మెత్తనివానికి *B, BB BBB* వగైరాలున్నూ, మధ్యస్థపు వాటికి *HB* అనీ గుర్తులుంటాయి.

**lead sculpture** : సీసక శిల్పం.

సీసముతో రూపొందింపబడిన శిల్పం. సీసము నీలివాక బూడిదరంగు కలిగి మెఱుపుదల ఉండే ఒక లోహం. ఇది ఘనపత్రనీయం (*malleable*), సుప్రసేయం (*ductile*); ఒక కత్తితో పైన గీస్తే గీత పడేంత మెతకదనం కలది. ఏ రూపానికైనా ఒపగ జేయటానికి వీలుపడటం దీని గుణవిశేషం. ఈ గుణమే, శిల్పికి తన కృషిలో ఒక గొప్ప అవరోధంగా పరిణమించటం కూడా సంభవమే. సీసంతో చేసే విగ్రహం కాంతి మాసి, అపవర్ణితం కాకుండా చేయటానికి శిల్పి ఎంతో శ్రద్ధ వహించాలి. నేరుగా సీసం ముద్దపై సమ్మెట ప్రయోగించి, దాన్ని కావలసిన రూపానికి తీర్చవచ్చు. లేదా టాంకితో సీసాన్ని కలిపి కరిగించి కావలసిన రూపానికి పోతపోయవచ్చు. ఇంకొక పద్ధతి కూడా ఉంది; అందులో స్థూల రూపాన్ని పోతపల్ల తయారుచేసి, ఆయా తావులలో సమ్మెటతో చరచి, కావలసిన రూపాన్ని సవివరంగా తీర్చిదిద్దవచ్చు.

**lead white** : సీసపు తెలుపు; సీసశ్వేతం.

**leaf** : రేకు; దళం.

మెరుగుపని కలిగిన చిత్రంలో ఉపయోగించేందుకు తయారుచేసిన చాలా పలచని లోహపురేకు. దీన్ని బంగారు, వెండి, అల్యూమినియం, డచ్ లోహాలనుంచి తయారు చేస్తారు.

**leaf green** : పత్రహరితం.

క్రోమ్ ఆకుపచ్చలో మధ్యస్థ ఛాయాభేదాలకు ఉపయోగించే వర్ణం.

**lean** : తక్కువ; అల్పతైలక.

నూనెను అల్పంగా వినియోగించి తయారుచేసిన వర్ణానికి విశేషణం. ఇటువంటిది గట్టిగా ఉంటుంది.

**lean over fat** : తక్కువపై ఎక్కువ.

(చూ : *fat over lean*)

**leather-hard** : అజిన కర్కశ.

మార్దవంలో ఒక పారిభాషిక పదం. ఆరి, ఆరకుండాఉన్న స్థితిలో ఉన్న మృత్తికా స్థితిని ఇది తెలియజేస్తుంది.

**leather worker** : *చర్మకారుడు; చర్మపు పనివాడు.*

**leathery** : *చర్మసగుణ.*

**lecithin** : *అండమజ్జ*

గ్రుడ్డు సొనలోను, కొన్ని వనస్పతి ద్రవ్యాలలోనూ, కొవ్వులాగా కనపడే ఒక పదార్థం. దుగ్ధకములకు స్థిరత కల్పించటానికి ఇది ఎంతో తోడ్పడుతుంది.

**ledger paper** : *లెజ్జరు కాగితం.*

గట్టిగా ఉండి మన్నికగల కాగితం; రేఖా రచనలకు ఉపయోగిస్తుంది.

**leek green** : *పలాండు హరితం; ఉల్లాకు పసిమి.*

కొంతవరకు పసుపువాకగా కనపడే మధ్యస్థపు హరితాన్ని తెలియజేసే ఒక వన్నెకు పేరు, ఆ ఛాయ కలిగిన క్రోమ్ హరితానికి కూడా ఈ పేరే వాడుతున్నారు.

**legitimate construction** : *సమంజస నిర్మాణం; శాస్త్రబద్ధ రచన.*

రేఖీయ దృష్టి క్రమ గతి నియమాలను నిర్దిష్టంగా అనుసరించిన నిర్మాణం సహజంగా కన్పించేట్లుగాక, జ్యామితీయ సిద్ధాంతానుసారంగా రూపాల ప్రమాణాలను, ఆకారాలను, దూరతా సామీప్యాలను బట్టి చిత్రించటం. ఇది శాస్త్రానుసారంగా దృష్టి ప్రక్రమ గతిని సూచించటానికే ఉద్దిష్టమైనా, ఫలితం నిర్దుష్టమే అయినా అసహజంగా ఉంటుంది. పునరుజ్జీవన యుగానికీ బరోకి శైలి యుగానికీ మధ్యకాలంవాడైన రెంబ్రాంట్ రచించిన చిత్రాలలో ఇటువంటి దానిని చూడవచ్చు.

ఈ నిర్మాణరీతిని ఫిలిప్పో బ్రూనెల్లెస్కి (1377–1446), తన రచనలలోను ఫిలిప్పోకో బట్టిస్టా ఆల్బెర్టి తాను రచించిన 'డెల్లా పిట్టూరా' అనే గ్రంథంలోనూ వివరించారు.

**Leipzig yellow** . *లీప్‌జిగ్ పీతవర్ణం.*

క్రోమ్ పీతవర్ణానికి పర్యాయనామం.

**Leithner blue** : *లెత్నర్ నీలిమ.*

కోబాల్ట్ నీలిమలో ఒక పాతకాలపు రకానికి పేరు.

**lemon yellow**: *నిమ్మపండు రంగు; జంబీర పీతం.*

బేరియమ్ పసుపుకు పర్యాయనామం.

**lens** : *కటకం.*

**let-down pigments** : *క్షీణతేజో వర్ణద్రవ్యాలు.*

తేజస్సును కొంచెంగా తగ్గించిన వర్ణద్రవ్యాలు

**lettered proof, proof after letter** : *లిఖితపు రుజువు.*

**lettering** : *అక్షరరీతి.*

**lettering brush or show card brush** : *అక్షరతూలిక.*

అక్షరాలు రాయటానికి చక్కగా పనికివచ్చే తూలిక. ఇది పొడుగ్గా బద్దవాటుగా



అక్షరతూలిక

ఉంటుంది అటూఇటూ చెదరక, బద్దవాటుగా గీతలు గీయటానికి ఉపయోగపడుతుంది.

**lettering pen :** *చిత్రాక్షరి; రమ్యలేఖిని.*

అక్షరాలను వివిధ రీతులలో రాయటానికి ఉపయోగించే సాధనం. వివిధ ఆకారాల పాళీలను, సందర్భాన్ని అనుసరించి, దీనికి




చిత్రాక్షరి-వేర్వేరు రూపాల పాళీలను అమర్చిన తీరుతెన్నులు.

అవసరమైనప్పుడు జతపరుస్తారు. ఆ పాళీలలో బద్దవాటివి, సన్నటివి, గుండ్రటివి మొదలైనవి ఉంటాయి లిపి చిత్రణలో ఇవి చక్కగా ఉపకరిస్తాయి. ఈ సాధనంలో సిరా నింపటానికి వీలు ఉంటుంది.

(చూ : *calligraphy*)

**lettering quill :** *ఈక కుంచె.*

అద్దపు పలకలపై చిత్రించటానికీ, అక్షరాలు రాయటానికీ ఉపయోగించే పొడవైన కుంచె. దీన్ని ఒంటె రోమాలు కూర్చి తయారుచేస్తారు

**letter press :** *ఉబ్బెత్తు అక్షరి (ప 93 9య)*

**levelling :** *సమానీకరణం; చదును పని; సమస్థలీకరణం*

ద్రవరూపంలో ఉన్న రంగులు, కుంచెతో పూసినప్పుడు కుంచెగీతలు కనబడకుండా సమానంగా పాకి ఆరిపోవటం. కొన్ని చోట్ల ఇటువంటి చదునుతనం వాంఛనీయమే అయినా, చిత్రాలలో కుంచెగీతలు కనిపించటమే చిత్రకారుడు కోరుకుంటాడు.

**levigation :** *జలప్రక్షాళన.*

1 నీటి సహాయంతో ఒక పదార్థాన్ని నలిగేట్లుచేసి, మెత్తగా చేసి, వడపోతద్వారా మొరమునుంచి, మెత్తటి పదార్థాన్ని వేరు చేయటం.

2. ఒక ఉపరితలాన్ని నునుపుగా చేయటానికై నీటిని, గరుకు పదార్థాన్ని ఉపయోగించటం. ఇటువంటిది శిలాలేఖనంలో ఉపయుక్తం.

**levigator :** *పేషణి; తిరగలి.*

శిలాలేఖన ఫలకాన్ని నునుపు చేయటానికి ఉపయోగించే లోహపు తిరగలి. ఇది మామూలు తిరగలిలాగా ఉండదు. బరువైన గుండ్రని ఇనుప ఫలకం ఒక్కటి మాత్రమే



పేషణి

ఇందులో ఉంటుంది. దీనికి కొన్ని గుంటలు (కన్నులు) ఉంటి, అరగదీయటానికి ఉపయోగించే పదార్థాలనూ నీటినూ, అరగదీసే

ఫలకానికి చేర్చేట్లుచేసే ఏర్పాటు ఉంటుంది. మామూలు తిరగలికి ఉన్నట్లుగా, దీన్ని తిప్పటానికి ఒకపక్కన పిడి వుంటుంది.

**Leyden blue :** *లెయ్‌డెన్ నీలిమ.*

కోబాల్ట్ నీలిమకు మొదట్లో ఉన్న పేరు.

**liberal arts :** *ఉదాత్త కళలు.*

కళలలో ఒక వర్గం ఈ పేరుతో వ్యవహృతం. ప్రాచీనులు కళలను వర్గీకరించటంలో వాటిని అనుదాత్తాలూ ఉదాత్తాలూ అనే రెండు వర్గాలుగా విభజించారు. వారి దృష్టిలో అనుదాత్తములు, దాసజాతులకు, అన్యదేశీయులకు సంబంధించినవి ఉదాత్తములు, స్వతంత్ర జాతికి చెందినవి కాలక్రమాన 'ఉదాత్త కళలు' అనే దానికి విపులార్థం ఏర్పడి, విద్యావంతుడుగా పరిగణితుడయ్యే మానవుడు కుశలతను ఆర్జించవలసిన కళల మొత్తానికి అది వర్తితమవుతున్నది

**library paste .** *పొత్తపు జిగురు.*

ఉపయోగానికి సిద్ధంగా చేసిన తెల్లటి పదార్థం దీన్ని ఉపయోగించినచోట మరకలు పడవు సీసాలలో ఇది తయారీగా లభిస్తుంది.

**life drawing :** *సజీవాలేఖనం.*

ఎదురుగా వ్యక్తిని నిలవబెట్టి రేఖాచిత్రాన్ని గీసే పద్ధతి. శిక్షణకాలంలో విద్యార్థులు ఎక్కువగా అభ్యసించే ప్రక్రియ ఇది.

**lifeless . .** *జీవరహిత.*

**life mask or life cast :** *జీవోపముఖం.*

సజీవవ్యక్తి ముఖం ఆధారంగా రూపొందించిన అచ్చు ఈ ప్రక్రియ మధ్యయుగాలతో మొదలై, పునరుజ్జీవన యుగం వరకు ప్రవర్తిల్లింది. 15వ శతాబ్దిలో సెన్నినో సెన్నిని ఈ ప్రక్రియను పరిశీలిస్తూ, అచ్చుతీయవలసిన వ్యక్తికి జిడ్డు నూనెను (గ్రీజు) ఎట్లా పూయాలో, గాలి ఆడటానికి అతడి నాసికారంధ్రాలకు గొట్టాలను ఎట్లా అమర్చాలో, ప్లాస్టరును ఎట్లా పూయాలో వివరంగా తెలిపాడు. పూర్తిగా శరీరం అంతటికీ అచ్చు తీయటానికి చెక్కలను అమర్చాల్సిన పద్ధతిని కూడా ఆయన వివరించాడు. ప్రస్తుతం, ఇటువంటి అచ్చులు తీసే ప్రక్రియ విరివిగా వాడుకలో లేదు; కాని అక్కడక్కడ ప్లాస్టిక పదార్థాలను ఉపయోగించి అచ్చులు తీయటం వింటున్నాం.

**life-size :** *జీవప్రమాణం.*

శిల్పమూర్తులను మానవ సహజ ప్రమాణాలలో మలచినప్పుడు అటువంటి వాటికి వాడే విశేషణం.

**lifting :** *ఉన్నమనం.*

చిత్రరచనల్లో కుంచెను ఈడ్చినట్లుగా రంగులను కనిపింపజేసే ప్రక్రియ. చిత్రం పైఉన్న రంగుతడి ఆరకముందు ఒక పలచని గుడ్డనుగాని, కాగితాన్నిగాని దానిపై పరిచి ఎత్తివేయటంవల్ల దీన్ని సాధించవచ్చు.

**light :** *రోచిస్సు; కాంతి.*

చిత్రాలలో అధమ, మధ్యమ ఛాయలను అధిగమించి వెలుగును చూపే ప్రాంతం.

**light colour ·** *తేలిక రంగు.*

**lightfast :** *వెలుగు మన్నిక (రంగు).*

**lightfastness :** *కాంతి స్థిరత.*

వెలుగు తగలటంవల్ల వర్ణాలు మారిపోకుండా ఉండగలగటం.

**light green** : *లేతాకుపచ్చ*

**light red** : *లేత ఎరుపు; శ్వేతరక్త.*

99 శాతం లోహభస్మంగల రంగు. ఇది ఉక్కు తయారీలో లభిస్తుంది. తెలుపు వర్ణంతో కలిసినప్పుడు ఇది గులాబి రంగుగా మారదు. దీన్నే ఇటుక రంగు అనవచ్చు.

**light source** : *కాంతి ప్రభవం.*

**light weight** : *తేలికపాటి.*

**lignum vitae** : *జీవ దారువు.*

విపణి వీథిలో కొనటానికి లభించే కొయ్యలన్నిటిలో, బరువులో, గట్టితనంలో, సాంద్రతలో అత్యుత్తమంగా పేరొందిన ఒకవిధపు కొయ్య. యూరప్‌లో దీనికి 'గాయిక' అనే పేరుకూడా ఉంది. శిల్పానికి ఇది బాగా ఉపకరిస్తుందని శిల్పులలో చాలామంది అభిప్రాయం

**lilac** : *ఊదారంగు.*

**lime blue** : *చూర్ణ నీలిమ.*

బ్రెమెన్ నీలిమలో ఒక రకపు దానికి పేరు. బ్రెమెన్ నీలిమను తయారు చేయటంలో ఉప్పును వాడగా, చూర్ణ నీలిమను తయారు చేయటంలో దానికి బదులుగా సున్నపు నీటిని వాడతారు

**lime proof** : *క్షారక్షమ; ఘటి ప్రతిరోధి; చూర్ణ ప్రతిరోధి.*

**limeproof pigments** : *క్షారక్షమ వర్ణ ద్రవ్యాలు*

క్షారయుక్తమైన పదార్థాలపై (సున్నం వంటి వాటిపై) వాడినప్పుడు మార్పు చెందని వర్ణద్రవ్యాలు. ఇవి రంగుసిమెంటు పనిలోను, భిత్తిచిత్రణలోను ఉపయోగపడతాయి

**lime putty** : *గారసున్నం.*

నీటిలో తడిపి నిలవ చేసిన సున్నం. దీనికి, ఇటుకపొడినో, పాలరాతిపొడినో కలిపి, భిత్తిచిత్ర భూమికగా ఉపయోగిస్తారు. ఇందుకోసం సున్నాన్ని శుభ్రపరచి, కనీసం ఆరునెలలపాటు తడిగా ఉంచాలి. ఇట్లా ఎంత కాలం ఉంచితే, అంత బాగా దీని గుణం అభివృద్ధి చెందుతుంది. పునరుజ్జీవన యుగపు చిత్రకారులు, సున్నాన్ని నేలమాళిగపిపాలలో పోసి నిలవ ఉంచేవాళ్ళు. ఇటువంటివి కొన్ని తరాలవరకు కూడా నిలవ ఉండేవి.

**limestone** : *సున్నపురాయి; చూర్ణశిల.*

ముఖ్యంగా సున్నపు కర్బనితం కలిగి ఉండే శిలావశిష్టం.

**limewash painting** : *చూర్ణ ధావన చిత్రణ.*

**lime water** : *సున్నపు నీరు.*

వర్ణాలను పూయటానికి ముందుగా ప్లాస్టరును తుడవటానికి ఉపయోగించే సున్నపు నీరు.

**limited edition** : *పరిమిత సంప్రదాయం.*

ఒక కళాఖండానికి వీలైన ప్రతుల సంఖ్య. ఆ సంఖ్య దాటిన వెనక ఆ కళాఖండానికి సంబంధించిన అచ్చునుగాని, మూసనుగాని ధ్వంసం చేస్తారు ఇటువంటివి సూచీ చిత్రణంలో మొదలైంది. కొన్ని ప్రతులు తీసిన తరవాత, అచ్చుఫలకం నాణ్యతను కోల్పోవటం వల్ల, కళాకారులు ఈ పద్ధతిని అవలంబించారు

**limner** : కళావినోది.

1. 17–18 శతాబ్దాల మధ్యకాలంలో అంతిచిత్రాలను రచించిన వ్యక్తికి వ్యవహరించిన పేరు; నీటి రంగుల చిత్రకారుణ్ణి కూడా ఈ పేరుతోనే ఆ కాలంలో వ్యవహరించేవారు.

2. అమెరికాలో 19వ శతాబ్దంలో గురుశుశ్రూష లేకుండానే విద్యనభ్యసించిన చిత్రకారుడు. ముఖ్యంగా రూపచిత్రాలను చిత్రించిన వ్యక్తికే అది ఆ కాలంలో వర్తిస్తూ ఉండేది.

3. మధ్యయుగాలలో గ్రంథాలలో చిత్రరచన చేసినవాడు.

**Limoges enamel** . లిమోగే యనామెలు. లిమోగే అకానిక.

పింగాణీ పాత్రలపై సహజంగా కన్పించే చిత్రాలను రూపొందించటానికి ఉపయుక్తమయ్యే నాణెమైన యనామెలు ఈ పద్ధతిలో ఒక రంగుకు మధ్య ఎత్తుగా అంచు కట్టాలసిన పనిలేదు

**line** : రేఖ, గీత.

**line and halftone** . రేఖాయుత అర్ధస్థాయి

**linear** : రేఖాగత

శిల్ప, వాస్తు చిత్ర కళలలో రేఖకు ప్రాముఖ్యం కల్పించిన సందర్భంలో ప్రయుక్తమయ్యే విశేషణం. (వర్ణానికి ప్రాముఖ్యం కలది వర్ణాగతం)





పైవానిలో ఎగువది రేఖాగతము దిగువది వర్ణాగతము

**linear elements** . రేఖావయవాలు.

**linea style** ; రేఖాబద్ధ శైలి

**linear perspective** : రేఖికా దృష్టిప్రక్రమత.

జ్యామితీయ పరమైన దృష్టి ప్రక్రమత. చక్రవాళ రేఖపై తిరోభవత్ బిందువుల దగ్గర సంగమించే సమాంతరరేఖల సమలంబక జాలాన్ని పటతలంపై, సంభావించుకోవటం లేదా నిర్మించుకోవటంపై ఈ దృష్టిప్రక్రమత ఆధారపడి ఉంది. దీనిలో రూపాలు దృశ్యం నుంచి అదృశ్యదశకు క్రమబద్ధ రీతిలో క్షీణించిపోతాయి. ఈ పద్ధతిలో ఒక వస్తువు




రేఖికా దృష్టి ప్రక్రమత : (HL) చక్రవాళరేఖ, (VP) తిరోభవత్ బిందువులు, (A) సమనాంతర రీతిలో లేదా ఏక బిందు ప్రక్రమతలో నిర్దిష్టమగు దీర్ఘాపఘన పదార్థము, (B) కోణీయరీతిలో లేదా ద్విబిందుక ప్రక్రమతలో చూపబడిన ఘన పదార్థము, (C) తిర్యక్ ప్రక్రమతలో లేదా త్రిబిందుక ప్రక్రమతలోని ఘనపదార్థం ఇది విహంగ దృష్టి, దీనిని తలక్రిందుగా చేసిన కీటక దృష్టి లభించును

ను సమానాంతర దృష్టి ప్రక్రమత, కోణీయ దృష్టి ప్రక్రమత, తిర్యక్ దృష్టి ప్రక్రమత అనే మూడు విధాలుగా చూపవచ్చు 18 వ శతాబ్ది నుంచి కళావేత్తలు యాంత్రికంగా ఈ ప్రక్రమతను వాడటాన్ని నిరసిస్తున్నారు.

**linear work :** *రేఖీయ కృషి.*

**linecut :** *రేఖాఖండనం*

**line draling :** *రేఖా చిత్రం.*

రూపాన్ని పూర్తిగా రేఖలతో చిత్రించటం ఛాయాచ్ఛాయా సహాయం లేకుండా రేఖాచిత్రం సూచించే బ్లాకులను తయారు చేయటం దీని వలన వీలవుతుంది.

**line engraving :** *రేఖాధిరేఖనం*

ముద్రాంకాలను తీయటానికి పోగరతో సాగించే అధిరేఖనం.

**linen :** *నారగుడ్డ; శాణపటం; నారవస్త్రు; వల్కలం.*

కళాకారులు శాటికను తయారుచేయటానికి ఉపయోగించే వస్త్రవిశేషం. దీన్ని నారతో తయారుచేస్తారు. శాటికకోసం పలువిధాలైన వస్త్రాలను వాడుతున్నా, నారగుడ్డ అన్నిటిలో శ్రేష్ఠం. ఇది ఎక్కువగా బెల్జియం, ఐర్లండులలో తయారవుతుంది. పడుగు పేకల దారాలు ఒకే తీరుగా వుండే శాటిక ఉత్తమమైంది.

**line of vision :** *వీక్షణరేఖ.*

(చూ : ***central visual ray***)

**linenfold :** *పింజమడత.*

ముతకనారగుడ్డను మడిచినట్లుగా చిత్రించిన అలంకార విశేషం. ఇది గోతిక సంప్ర



పింజపదర

దారుంలో, కొయ్యచెక్కడములో ప్రసిద్ధి పొందింది.

**liner¹** : *రేఖిక.*

**liner ²** : *గీతకుంచె.*

**liners and stripers** *గీతకుంచెలు, చారకుంచెలు.*



గీతకుంచెలు, చారకుంచెలు : ఎడమ నుండి కుడివైపునకు కత్తికుంచె, నిడివికుంచె, బాకుకుంచె, మూలకుంచె,

గీతలకూ, చారలకూ వాడే కుంచెలు. గుర్రపు బండ్లకు రంగు వేయటానికి, బోర్డు లపై రాయటానికి, వీటిని మొదట్లో ఉపయోగించారు. కళాకారులు కూడా అవసరాన్ని బట్టి అక్కడక్కడ వీనిని ఉపయోగిస్తున్నారు. ఇవి అనేకాకారాలలో లభిస్తున్నవి.

**lining** : *బద్ధతుక.*

పురాతన చిత్రాల పరిరక్షణకై వాటి వెనక భాగంలో గుడ్డను అతికించే పద్ధతి.

**linocut or linoleum cut** : *లినో చెక్కుడు; లినోలియం చెక్కుడు; నమీనికా తక్షణం.*

దారుతక్షణం (*wood-cut*) వల్ల ముద్రణలు తీసినట్లుగానే, లినోలియమును చెక్కి ముద్రాంకాలను తీయడం. మందంగా ఉండే లినోలియం ముక్కను చెక్కపై అతికి, దానిపై కావలసిన ఆకారాలను చెక్కి ముద్రాంకాలు తీయవచ్చు. లినోలియం మెత్తనిది కావడంవల్ల చెక్కటం సులభం. దీనికి కావలసిన సాధనాలు తయారుగా లభిస్తాయి. దీనినుంచి ఎన్ని ముద్రాంకాలయినా తీయవచ్చు.

**linoleum** : *నమీనిక; లినోలియం.*

**linotype** : *రేఖార్థికా.*

**linseed oil** : *అవిసెనూనె.*

తైలవర్ణాలలో ఉపయోగించే ప్రధానమైన తైలం. పరిపక్వమైన అవిసె గింజల నుంచి ఈ నూనెను తీసి, పరిపక్వం చేసి వాడతారు.

**lintel** : *పతంగం, అడ్డుదూలం.*

**liquid drier** : *ద్రవ శోషణి.*

రంగులు త్వరగా ఆరిపోవటానికి వాడే ద్రవ విశేషం.

**literary** : *కథాత్మక.*

ఒక కథను వర్ణించే చిత్రాలు, శిల్పాలు మొదలైన వాటికి ఉపయుక్తమయ్యే విశేషణం సాహిత్య విషయాలకు ప్రాధాన్యమిచ్చి కళా మూల్యానికి ప్రాధాన్యం ఇవ్వని రచనలకు సందాత్మకంగా ఈ విశేషణాన్ని కళావిమర్శ కులు ఉపయోగిస్తారు. అట్లాకాకుండా కథను గాని సన్నివేశాన్నిగాని వర్ణిస్తూ కళావిశిష్టతను కోల్పోని చిత్రాన్ని వర్ణనాత్మకమని అనటం సముచితం.

**lithochromy** : *శిలాచిత్రణ.*

రాతిపై రంగులతో చిత్రించటం.

**lithocrayon** : *శిలాఖటిక.*

(చూ : *lithographic crayon*)

**lithographic crayon or lithocrayon** : *శిలాలేఖిక; శిలాఖటిక.*

శిలాలేఖన పలకాలపై చిత్రించటానికి ఉపయోగించే, చమురు కలిసిన రంగు కణిక. దీనిలో మైనం, సబ్బు, దీపమసి కలుపుతారు. ఈ కణికలపై కాగితాన్నిచుట్టి బజారులో విక్రయిస్తారు. ఇవి గుండ్రంగా గాని, పలకలుగా గాని ఉంటాయి. ఈ కణికలు

శ్రేణులలో,#00 (చాలా మెత్తనిది) నుంచి #5 (కఠినంగా ఉండేది) వరకు లభిస్తాయి. పెన్సిల్ ఆకారంలో ఉండే ఖటికలు అయిదు శ్రేణులలో లభిస్తాయి. అచ్చు సిరాను, శిలాలేఖన పలకానికి పూసినప్పుడు, ఈ కణికతో గీసిన గీతలపైనే సిరా అంటుతుంది. శిలాఖటికలోని పదార్థాలనే కలిగిన ద్రవ ఖటిక (*tusche*) ను కలంతోనో, తూలికతోనో శిలాలేఖన పలకం మీద పూయటం కూడా ఉంది. కాగితంమీద సాధారణ రేఖా చిత్రాలను రచించటానికి కూడా వీటిని వాడటం ఉంది.

**lithographic etch** : *ముద్రానిరోధకం.*

శిలాముద్రణకై పలకాన్ని తయారుచేసే సందర్భంలో, రేఖలు గీయని చోట్లలో సిరా అంటకుండా ఉండటానికి అవలంబించే ప్రక్రియ; ఈ ప్రక్రియలో ఉపయోగించే ద్రావణం. శిలాఖటికతో చిత్రాన్ని రచించిన తరవాత, పలకంపై తుమ్మజిగురు, నీరు, నత్రికామ్లాలు కలిసిన ద్రావణాన్ని కుంచెతో పూస్తారు. గీతలులేని చోట్ల మాత్రమే ఈ ద్రావణాన్ని పలకం పీల్చుకొంటుంది. దాన్ని బాగా ఆరనిచ్చి, నీటితో తుడిచివేస్తే, ఉపరితలంలోఉన్న జిగురు చెరిగిపోతుంది. అప్పుడు పలకం ముద్రణకు సిద్ధమవుతుంది.

**lithographic ink** : *శిలామసి.*

శిలాలేఖన ముద్రణలో ఉపయోగించే సిరా; ఇది అన్ని వర్ణాలలో లభిస్తుంది. ఇతర ముద్రణసిరాల కంటే గాఢంగా, కాంత్యభేద్యమై ఉంటుంది. పారదర్శకం చేయటానికి దీన్ని పలచన చేయాల్సి ఉంటుంది. శిలావార్నిషును కలపటంద్వారా దీన్ని అట్లా పలచన చేసే వీలుంది.

**lithographic points** : *రాతియచ్చు సూదులు; శిలాలేఖన సూచికలు.*

శిలాలేఖన ముద్రణలో తెల్లటిగీతలు ఏర్పడటానికై, శిలాలేఖన పలకంపై గీయటానికి ఉపయోగించే సూదిమొనగలిగిన పనిముట్లు.

**lithograph stone :** *శిలాలేఖన ఫలకం.*

గరుకుగా, మందంగా, చదరంగా ఉండి శిలాలేఖనకు పనికివచ్చే సున్నపురాయి. చిత్రించటానికి అనువుగా ఉండటానికి దీని ఉపరితలాన్ని గరుకుగా ఉండేట్లు చేస్తారు. దీనిపై ఒకసారి వేసి ముద్రించిన చిత్రాన్ని మార్చి, వేరొకదాన్ని వేసి ముద్రించవలసి ఉన్నప్పుడు, ఫలకపు ఉపరితలాన్ని మళ్ళీ గరుకుగా చేయాల్సి ఉంటుంది.

**lithography :** *శిలాలేఖన ముద్రణ; శిలా ముద్రణ; రాతి అచ్చుపని.*

శిలాలేఖన ముద్రణ ప్రక్రియకు సంబంధించిన అచ్చుపని. ఒక రాతి ఫలకంమీద ముద్రించవలసిన స్థానాలలో మాత్రమే అచ్చుసిరాను అంటి, తక్కిన భాగంలో అంటుకొనకుండా ఉండేట్లు కొన్ని రసాయన ద్రవ్యాల సాయంతో సాధించటంవల్ల ఇటువంటి అచ్చుపని సాధ్యమవుతున్నది. శిలాలేఖన ముద్రణను 1798లో, జర్మనీలో సోల్న్‌హాఫెన్‌కు చెందిన ఎలోయిస్ సెనెఫెల్‌డెర్ అనే అతడు కనిపెట్టాడు. మొదట్లో అతడు, కొంచెం ముతకగా ఉన్న సున్నపురాతి ఫలకంపై జిడ్డుగలిగిన సుద్దకణికతో చిత్రించి, ఆ చిత్రాన్ని నీటితో తడిపి, దానిపైన అచ్చుసిరాను పూసినప్పుడు, ఆ అచ్చుసిరా జిడ్డుగలిగిన ప్రాంతంలో మాత్రమే అతుక్కొంటుందనీ, ఇట్లా ముద్రించటం సాధ్యమవుతుందనీ గ్రహించాడు. ఆ తరవాత దానిపై చాలా మార్పులు వచ్చి, ఆ ప్రక్రియ ఎంతగానో అభివృద్ధి చెందింది. సాధారణ ముద్రణలోను, కళాకారుల ప్రక్రియలలోను ఇటువంటి అచ్చుపనికి చాలా ప్రాముఖ్యం లభించింది. రాతినేగాక అల్యూమినియమ్, తుత్తునాగ ఫలకాలను కూడా ఈ ప్రక్రియలో వాడవచ్చు. మొదట కాగితంపై శిలాఖటికతో చిత్రించి, దాన్ని రాతి ఫలకంపై దింపటాన్ని కూడ ఒకవిధమైన శిలాముద్రణలో అవలంబిస్తున్నారు; ఇదేగాక అఫ్-సెట్ పద్ధతిలో కూడ ఈ ప్రక్రియను ఉపయోగించవచ్చు; ఇటువంటిది ఫోటో-బ్లాకు పద్ధతిని పోలి ఉంటుంది. వర్ణముద్రణలోను, నలుపు-తెలుపు ముద్రణలోను ఈ ప్రక్రియ అత్యంతవైవిధ్యం కలది.

**litho press :** *శిలాముద్రాయంత్రం; రాతి అచ్చుకం.*

శిలాలేఖన ముద్రణ జరపటానికి ఉపయో



శిలాముద్రాయంత్రం

గించే యంత్రం. ఇది అఫ్-సెట్ ముద్రణ కన్న భిన్నమైనది

**litho-stones :** *శిలాఫలకాలు.*

**litho varnish :** *శిలా వార్నిషు; రాతి వార్నిషు.*

అచ్చు సిరాలలోను, శిలాముద్రణ సిరాల లోను కలిపే చిక్కటి ద్రవం. ఇది మూడు శ్రేణులలో లభిస్తుంది.

**little masters** : *అణు శిల్పులు.*

16 వ శతాబ్దిలో, చాలా చిన్న ఫలకాలపై స్పష్టములు, లలితములు అయిన ఆధిరేఖ ములను- బైబిలు గాథలు రైస్తవ పౌరాణిక గాథలు, నిత్యజీవన విషయాలు మొదలైన వాటిని వివరిస్తూ- వెలయించిన ప్రజ్ఞానిపు లైన అధిరేఖకులు.

**livering** : *ఘనీభవనం*

గొట్టాలలో లభించే రంగులు గట్టిపడటం. ఇట్లా గట్టిపడినవి వాడటానికి పనికిరావు ఇటువంటి లోపం, వర్ణద్రవ్యాలు శుద్ధములై నవి కాకపోవటంవల్ల సంభవిస్తుంది

**liver of sulphur** : *గంధకసారం*

పొటాసియమ్ సల్ఫైడ్‌కు సర్వసాధార ణంగా ఉపయుక్తమయ్యే నామం

**loaded** : *సాంద్రీకృత; మెండైన.*

వర్ణచిత్ర రచనలో లేతరంగులను ఎక్కు వగా మెత్తిన చోట్లను గూర్చి వర్ణించేటప్పుడు వాడే విశేషణం స్వల్పంగా రంగులను మెత్తిన తావులు, వీటి పక్కన ఉన్నప్పుడు అవి నీడలను సూచిస్తాయి కుంచెను పూర్తిగా వర్ణంలో ముంచి ప్రయోగించి నప్పుడు ఇట్లా ఎక్కువగా మెత్తటం సాధ్య మవుతుంది.

**local colour** : *నిజవర్ణం; స్థానిక వర్ణం.*

ఒక వస్తువుయొక్క సహజవర్ణం. ఇది పగటి వెలుతురులో చూచినప్పుడు కనిపి స్తుంది.

**lointains** ; *ఉపాక్షితిజం.*

ప్రాదేశిక చిత్రాలలో మిక్కిలి దూరంగా ఉన్నట్లు కన్పించే ప్రదేశం ఇది చక్రవాళ రేఖ (*horizon*) కు సమీపంలో ఉంటుంది.

**Lombard bands** : *లొంబార్డు పట్టబంధాలు*

వాస్తుకళకు సంబంధించిన ఒక పారి భాషిక పదం గోడయొక్క అతివిస్తృతిని రూఢీకరించటానికి అక్కడక్కడ నిలువుగ అమర్చిఉండే స్తంభకుడ్యాల బద్దెలు ఈ పేరున వ్యవహృతములు. వీటి అన్నింటినీ పై భాగంలో సంధిస్తూ ఒక తోరణావలి నిర్మితమవుతుంది.

**Lombard romanesque in the U. S. A** ; *యు.స్టే.లోని లొంబార్డ్ రోమనస్క శైలి.*

వాస్తువులో ఒక శైలివిశేషం యు.స్టే.లో దీనిని చూడవచ్చు. గుండ్రని కమానులు కలిగిఉండే ఈ కట్టుబడి ఇటుకలలో సాగేది క్రీ.శ. 1846 నుంచి 1870 వరకు ఈ శైలిని అక్కడ అవలంబించటం జరిగింది.

**London white** : *లండన్ శ్వేతం.*

తెల్లసీసానికి పర్యాయనామం.

**loose stroke** : *విశ్లథ ప్రహారం.; వదలు వినురు*

**lost pattern casting** . *మృతాధార విధానం*

పోతపోసే విధానాలలో అధునాతనం ఈ విధానంలో కావలసిన రూపాన్ని ముందుగా ప్లాస్టిక్‌తో తయారుచేసి, దాన్ని బట్టీ ఇసుక (*foundry sand*) పూతతో కప్పివేస్తారు తరవాత, కరగబెట్టిన లోహాన్ని లోపలికి

నింపినప్పుడు, ప్లాస్టిక్ రూపం కరిగిపోయి లోహం గట్టిపడి, ఆ ప్లాస్టిక్ రూపపు ఆకారాన్ని గ్రహిస్తుంది.

**lost-wax process** : *మధూచ్ఛిష్ట విధానము.*

లోహ శిల్పపు పోతలో ఒక విధానం. మొదట ప్లాస్టరు (సుధాపిష్టం)లో శిల్పాన్ని ఇందులో రూపొందిస్తారు. తరవాత దీని నుంచి ఒక మూసను తయారుచేస్తారు. దాని పైన మందంగా కరిగిన మైనాన్ని పూస్తారు. తరవాత దానికి బట్టి యిసుకను చుట్టూ మెత్తుతారు మూసలోపలి భాగాన్ని కూడా బట్టి ఇసుకతో నింపుతారు. ఈ మొత్తానికి పై భాగంలో బరద పట్టేసిగాని, ప్లాస్టరుతోగాని పూతగాపూసి, చెమ్మలేకుండా ఉండేంత వరకు కాలుస్తారు ఇట్లా కాల్చటంవల్ల లోపల ఉన్న మైనం కరిగిపోతుంది అప్పుడు ఈ మూసను ఒకచోటఉంచి, చుట్టూ ఇసుక కప్పి. మూసకున్న రంధ్రాలద్వారా, కరగించిన లోహాన్ని పోస్తారు ఆ లోహం గట్టిపడగా రూపొందిన విగ్రహం సుషిరంగా (లోపలి భాగం గుల్లగా) ఉండి. బరువు తక్కువగా ఉంటుంది. బాగా చల్లారిన తరవాత, లోపల వున్న ఇసుకను కూడా దులిపి వేస్తారు. ఇట్లా పోతపోసిన విగ్రహాన్ని శుభ్రంచేసి మెరుగు[illegible], ఉద్దాల సాధారణంగా విగ్రహాలపోత ఈ విధంగానే జరుగుతుంది లోహ శిల్పముల పోత విషయంలో దాదాపుగా దీన్ని పోలిన పద్ధతులే గ్రీసు, ఈజిప్టు, భారతదేశాలలో ప్రాచీనకాలం నుంచి కూడా అమలులో వున్నవి.

**lotus and palmette** ; *పద్మ తాళకం.*

పూర్వకాలీన వాస్తువులో, వ్రతపుష్పాలంకృతిని అనుకరిస్తూ వెలసిన ఒక అలంకృతి విశేషం. ఇందులో పద్మమూ, తాళజాతి వృక్షమూ ఏకాంతరీతిలో అమరి వుంటాయి. ఇందులోని పద్మాన్ని ప్రాచీన ఈజిప్టు నంచలి వాస్తువునుంచీ, తాళకమును మెసపొటేమియా వాస్తువునుంచీ గ్రహించటం జరిగి వుంటుంది.

**Louis xv style** : *లూయీ XV శైలి.*

ఫ్రాన్సుదేశంలో కర్కరిక (రోకోకో) ఉచ్ఛస్థాయినందుకొన్న యుగానికి వాడబడే పారిభాషిక పదం. ముఖ్యంగా లఘుకళల, అలంకారిక కళల ఉచ్ఛదశకు ఇది వర్తిస్తుంది

**Louis XVI style** : *లూయీ XVI శైలి.*

ఫ్రాన్సుదేశంలో కర్కరిక (రోకోకో) శైలి అమలున ఉన్నకాలపు తుదిఘట్టానికి- అంటే 1760 నుంచి ఫ్రెంచి విప్లవ కాలం వరకు- ఈ పదం ఉపయుక్తమైంది.

**loutrophoros** : *శృంగిక.*

గ్రీసుదేశంలో ప్రాచీనకాలంలో వాడుకలో ఉండిన ఒక విధపు పాత్ర. దీనికి రెండు వైపులా, పట్టుకోవటానికి అనువుగా కొమ్ములుండేవి మెడ చాలా పొడుగ్గా వుండేది. వివాహసమయాలలో వధువు స్నానం చేయటానికి కావలసిన పవిత్ర జలాన్ని ఈ పాత్రతో తీసుకొనిపోయే ఆచారం, ఆ కాలంలో, గ్రీసుదేశంలో వుండేది అవివాహితలుగా మరణించిన స్త్రీల సమాధులపై దీని రూపాన్ని లిఖించటం ఒక ఆచారంగా అప్పుడు పాటించేవాళ్ళు

**Louvain school** : లౌవెయిన్ సంఘం.

15 వ శతాబ్దికి చెందిన ఫ్లెమిష్ కళాకారుల సంఘం. 1425 లో అక్కడ విశ్వవిద్యాలయం స్థాపించిన తరవాత లౌవెయిన్ నగరం మానవతావాద సంస్కృతికి కేంద్రమైనది. ఈ సంఘపు కళాకారులది శైలీకృతమైన వాస్తవికతావాదం.

**Louvre** : లౌవ్రే.

ఫ్రాన్సు దేశంలోని, పారిస్ నగరంలో ఉన్న జాతీయ మ్యూజియానికీ, కళాశ్రేణికకూ సమష్టిగ ఈ పేరు వ్యవహృతం. ఫ్రెంచి జాతి యొక్క చరిత్రకూ సంస్కృతికీ ఒక సంగ్రహ రూపంగా ఇది సంభావితం

**low colour** : అపకృష్ట వర్ణం; తక్కువ రంగు

**low key** : తగ్గు కీలకం.

(చూ: *key*)

**low relief, bas-relief; basso relievo** అల్పోల్బణ

(చూ. *relief*)

**luci di sotto** ; (చూ *luminous* )

**luminism** : దీప్తి వాదం

వెలుగు నీడల విన్యాసానికి చిత్రంలో ప్రాముఖ్యం కల్పించటాన్ని సమర్థించే వాదం. కాంతిపాత ఫలితాలను విశదం చేసే ప్రక్రియకు ప్రాధాన్యం ఇచ్చే చిత్రణలో ఏ సాంప్రదాయాన్ని అయినా ఈ వాదానికి చెందినదిగా చెప్పటం కూడా ఉంది. 'అనుభూతివాదానికి ముందువాదానికి' చెందినవి ఈ కోవకు చెందినవే.

**luminosity** : దీప్తి.

**luminous** : దీప్త; కాంతిమంత.

లోపలనుంచి కాంతి వచ్చేట్లుగా చిత్రంలో కనిపించటానికి వాడబడే విశేషణం. జిగురు రంగు చిత్రాలపై స్వచ్ఛమైన వార్నిషును పూయటంవల్ల ఇటువంటి దాన్ని సాధించవచ్చు. దీనినే ఇటాలియనులు లూసీ డి సొట్టో (*luci di sotto* ) అంటారు.

**luminous paint** : దీప్త వర్ణం.

చీకటిలో ప్రకాశించే రంగు. ఈ రంగు సాధారణంగా భాస్వరి ( *phosphor* ) అనే వర్ణద్రవ్యంతో కలసి ఉంటుంది (జింకు సల్ఫైడ్, కాల్షియమ్ సల్ఫైడ్ లలో ఇది లభ్యం) ఇటువంటి వర్ణాలకు, కాంతిని జీర్ణించుకొని, దాన్ని చీకటిలో వెలువరించే శక్తి ఉంటుంది. ఇవి కాంతిసారక వర్ణాలకన్నా వేరైనవి కాంతిసారక వర్ణాలు, రాత్రుల్లో ప్రకాశించాలంటే, వాటిపై అతినీలలోహిత కిరణాలు పడాలి. దీప్త వర్ణాలను నాటక ప్రదర్శనల వంటి సందర్భాలలో ఉపయోగించవచ్చు. కాని వీటి కాంతి త్వరితంగా తగ్గిపోతుంది. స్వల్ప వ్యవధిలో వీటిపై కాంతి ప్రసారం అయ్యే అవకాశముంటే ఇవి బాగా కనిపిస్తాయి ఈ వర్ణాలను చిత్రకారులు ఉపయోగించవచ్చు కాని వీటివల్ల రేడియోధార్మిక శక్తి (రేడియో యాక్టివిటీ) ప్రసారితం అయ్యే అవకాశం ఉంది.

**lunette** : ద్వారేందురేఖ.

కిటికీలు, ద్వారాలపై ఉండే అర్థచంద్రాకారపు అలంకృతి విశేషం

**lustre :** *శోభ.*

చిత్రాలు, శిల్పాలు మొదలైన వాటి ఉపరి తలంలో కనిపించే పలుతీరుల మెరుగు.

**lustreware :** *మెరుగు పాత్రలు.*

లోహ పర్ణపు మెరుగుతో కన్పించే పింగాణి, మట్టి పాత్రలు.

**lustry pottery :** *శోభా కౌలాలకం.*

లోహజములైన శోభాయుత వర్ణద్రవ్యాలచే చిత్రితమయ్యే మట్టి సామగ్రి దృఢీకల్పితమలై ఆవంలో కాల్చబడి ఉండే పాత్రలకు రాగి భస్మాన్నో, వెండి భస్మాన్నో పట్టించి, తగ్గు వేడిలో మళ్ళీ కాల్పును సాగించటంవల్ల ఈ శోభను కల్పిస్తారు.

**lute :** *మాటువేయుట; నీరంధ్రీకరించు.*

ఒక పాత్రలోగాని, నాళికతో గాని చిల్లి పడినప్పుడు దాన్ని ఏదైనా పిష్టసదృశ పదార్థంతో మూసివేయుటం; మార్దవములలో, కొన్ని భాగాలను సరకమును అధికస్తంగా ఉపయోగించుచు, అతకటానికి కూడా ఇది వరిస్తుంది.

**Lutschism :** *వర్ణ వినరణ వాదం.*

వర్ణ విసరణ వాదానికి రష్యన్ భాషా నామం *Lutschism* (చూ: *rayonism*)

**Lysippian proportions :** *లిసిప్పియన్ తాలమానం.*

క్రీ. పూ నాలుగో శతాబ్దిలో, అలెగ్జాండరు చక్రవర్తి ఆస్థానంలో ఉన్న లిసిప్పస్ అనే ప్రఖ్యాత శిల్పి ప్రతిపాదించిన ప్రామాణిక సిద్ధాంతం. ఈ తాలమానాన్ని అనుసరించిన శిల్పంలో తక్కిన తాలమానాల శిల్పాల కన్నా, తల కొంచెం చిన్నదిగానూ, శరీరం సన్నదిగానూ ఉండేవి. లిసిప్పస్ రచించిన శిల్పాలను, ఏదృక్కోణంనుంచి చూచినా అవి సహజంగా ఉండేవి.

## M

**Macabre :** *శోకమయం.*

'మకాబర్' (*macabre*) అనే ఫ్రెంచి పదానికి 'మృత్యుభయ సంజనకం' అనే అర్థం ఉంది. అందువల్ల మొదట్లో మృత్యునాట్యం అనే దానికి దీనిని వర్తింపజేయడం జరిగింది. కాని ఆధునిక కాలంలో ఇది కళా విమర్శనలో విషాదాత్మకమై, మానవజీవితపు దుష్కృత ప్రాయతను తెలియజేసే వాటికి విశేషణంగా వ్యవహృత మవుతున్నది.

**macchia :** *మచ్చియా.*

" పాంసులేఖ్యం (స్కెచ్చి) లేదా బాహ్యరేఖకు సమానార్థకమైన ఇటాలియన్ భాషా పదం దీని మౌలికార్థం 'మచ్చ'. 19వ శతాబ్దిలో ఫ్లారెన్స్ నగరపు కళాకారులు,

రంగులతో మచ్చలపంటి వానిని పొందుపరచి ప్రకృతి దృశ్యాలను చిత్రించేవారు. ఈ ప్రక్రియవల్ల వెలుగునీడల విన్యాసం కన్పించేది. ఇటువంటి ప్రక్రియ నవలంబించిన వారిని 'మచ్చియాళి' (*macchiaioli*) అని వ్యవహరించారు. అనుభూతి వాదానికి సంబంధించిన రేఖా చిత్రాలకూ, వర్ణ చిత్రాలకూ ఈ పనం వాడటం అప్పుడప్పుడు కనపడుతుంది

**mace head matter, mattoir** : *ముండ్ల గుదియ.*

మంద్రచ్ఛవి (*mezzotint*), ఖడికారీతి (*crayon manner*) ముద్రణలలో వాడే సాధనం దీనికి ఒక పిడి, దానితో కలసి ఇనుపముళ్ళు అమరిఉండే భాగమూ



ముండ్ల గుదియ

ఉంటాయి. ఈ ముళ్ళ గుదియతో ముద్రణ ఫలకాలపై గీయటంవల ముద్రణలో చుక్కలేర్పడతాయి.

**machining** . *చిత్రికపని.*

**madder** · *మంజిష్ఠ; చిరువేరు.*

**madder lake** ; *మంజిష్ఠ రంజకం.*

మంజిష్ఠ (చిరువేరు) నుంచి తయారై పారదర్శకమై, పద్మరాగపు ఎరుపురంగు కలిగిన ఒక రంజక వర్ణద్రవ్యం.

**madder brown** : *మంజిష్ఠ కపిశం.*

**maesta** : *మంగళ చిత్రం.*

మధ్యయుగంలోను, పునరుజ్జీవనయుగం



మంగళ చిత్రం

లోను, శిశువుగా ఉన్న క్రీస్తును మేరీమాత ఎత్తుకొన్న రూపాలను, ఇతర సంత ప్రతీకములను చిత్రించిన చిత్రం.

**magenta** : *మెజెంటారంగు; కుంకుమ రంగు.*

మన్నికలేని ఒక కృత్రిమవర్ణం. ఉత్తర ఇటలీలో మెజెంటా యుద్ధం (1859) తరవాత కనుకొన్న ఒక విధమైన ఎరుపురంగు ఇది కుసుమ వర్ణాన్ని పోలిఉంటుంది.

**magic realism** : *విచిత్ర వాస్తవికతా వాదం; ఇంద్రజాలవాస్తవికతా వాదం.*

ఇరవయ్యో శతాబ్దంలోని ఒక కళా సంప్రదాయం. రూపాలను అతిసహజంగా చిత్రించి, వాటి పరస్పర సంబంధాన్ని విచిత్రంగా ప్రదర్శించటం ఇందులో జరుగుతుంది. స్థల, కాల భావనలలో మార్పులు తీసుకొనిరావటం వల్ల దీన్ని సాధించేవారు. ఉదాహరణ :



విచిత్ర వాస్తవికతావాదం-పవిత్ర మీనాలు

మధ్యాహ్నసమయాన్ని సూచించే చిత్రంలో, కాంతితో వెలుగుతున్న వీధి దీపాన్ని చిత్రించటం.

**magna** : *మాగ్నా.*

కళాకారులు ఉపయోగించే అక్రిలీయు వర్ణాలను, వాటికి సంబంధించిన వృథక్కారి వార్నిష్‌ను తయారుచేసే ఒక ఉత్పాదక సంస్థ వారు, వాడుకొనే వ్యాపారనామం.

**magnifying glass** : *భూతద్దం.*

**magnesia white** : *మెగ్నీషియా శ్వేతం.*

మెగ్నీషియం కార్బనేట్‌కు, మెగ్నీషియం ఆక్సైడ్‌కు, సహజసిద్ధంగా లభించే మెగ్నెసైట్‌కు వాడుకలో ఉన్న పేరు; ఇది ప్రామాణీకృతము మాత్రం కాలేదు.

**magnesium carbonate** : *మెగ్నీషియమ్ కార్బనేటు.*

అత్యుత్తమమైన తెలుపుకు పేరొందిన ఒక వర్ణద్రవ్యం. ఇది తేలికగా ఉండే చూర్ణంగాను, బరువుగాఉండే చూర్ణంగాను లభిస్తుంది. వీటిలో రెండోదాన్ని మాత్రమే కళాకారులు వాడతారు.

**mahlstick** : *చిత్రదండం.*

చిత్రాన్ని రచించేటప్పుడు చేతిని ఆనటానికి ఉపయోగించే కర్ర. దీని పైభాగంలో చర్మంతో తయారుచేసిన బంతి అమర్చబడి



చిత్ర దండం

ఉంటుంది. దీనివల్ల కర్రను చిత్రంపై ఆన్చినప్పుడు కాటికకు దెబ్బతగలదు దీన్ని సులభంగా వెంటదీసికొని పోవటానికి అనువుగా, మొదట రెండు మూడు ఖండాలలో నిర్మించి, మరతబందులతో కలుపుతారు.

**mahogany** : *మహాగనీ.*

దట్టపు రవపలుకు కలిగి, చాలా రకాలలో లభించే ఒక జాతి వృక్ష విశేషం; కాఠిన్యానికి పేరొందినా, చెక్కడువనికీ, చిత్రికకూ ఇది బాగా పనికివస్తుంది. దీని రంగు తేలిక గోధుమనుంచి, ముదురు లేదా ఎరుపువాక గోధుమ వరకు ఉండవచ్చు.

**mahogany lake** : *మహాగనీ రంజకం.*

తప్తమైన సీన మృత్తికపై చాలా రంగ ద్రవ్యాలను ఉపయోగించి, రూపొందించే ఒక రంజక ద్రవ్యం; ఇది ఎరుపుగానో, గోధుమ రంగు గానో ఉంటుంది.

**mahagony stain** : *మహాగనీ విలేపనం.*

అనిసెనూనెను, ఒక రంజక ద్రవ్యంతో చేరిన కాతకరులను- లేదా తప్త సీనమృత్తికతో చేరిన కాతకరులను- ఉపయోగించి రూపొందించిన దారువిలేపనం.

**majolica or maiolica** : *మజోలికా సామగ్రి.*

గోధుమ ఎరుపులో ఉండే మట్టి పాత్రలు. ఇవి బాగా మెరుగుకలిగి, బిలుగుపనితనంతో ఉంటాయి పునరుజ్జీవన యుగంలో, 15 వ శతాబ్దినుంచి 17 వ శ. వరకు ఈ సామగ్రి ఇటలీలో ఎక్కువ వ్యాప్తిపొందింది. 19 వ శతాబ్దంలో ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్సు, జర్మనీలలో రూపొందించిన ఇటువంటి సామగ్రి, కళాఖండ సంగ్రాహకులను చాలా ఆకర్షించేది. స్పెయిన్ దేశానికి చెందిన మజోర్కా- దీవిలో మొదట తయారుకావడం వల్ల ఈ సామగ్రికి ఈ పేరు వచ్చింది.

**major** : *వరిష్ఠ.*

**malachite** : *మైలతుత్థం.*

సహజసిద్ధముగ లభించు ఒక రాసాయనిక ద్రవ్యం; దీన్ని రాగి కార్బనేటుగా రాసాయనికులు పరిగణిస్తారు. ప్రాచీన కాలంనుంచీ దీని పొడి ఒక ముఖ్య వర్ణద్రవ్యంగా వాడుకలో ఉంది; కాని 19 వ శతాబ్దితో దీనికన్నా మన్నిక గలిగి, ఈ వర్ణమే కలిగిన ఎర్ర ద్రవ్యాలు కనుకొన్నతర్వాత దీని వాడుక నశించింది.

**malachite green** : *హరా.*

**malleable** : *ఘనవర్ధనీయం; ఉద్వర్తనీయం.*

చరచినా, సాగదీసినా విరగకుండా కావలసిన రూపాన్ని తీర్చిదిద్దటానికి వీలుగా ఒక లోహంలో కనిపించే గుణవిశేషం.

**malleability** : *ఉద్వర్తనీయత.*

**mallet** : *కొయ్యసుత్తి; ముద్గరం.*



కొయ్యసుత్తి

శిల్పులు కొయ్యచెక్కడంలో ఉపయోగించే సాధనం.

**mandala or mandara** : *మండలం.*

హిందూ, బౌద్ధ కళలలోని తాంత్రిక చిహ్నం.

**manganese black** : *మాంగనీజ్ నలుపు.*

కృత్రిమంగా తయారుచేసిన మాంగనీజ్ దయాక్సైడ్. తైలంలో సమర్థమైన శోషణిగా ఇది పేరొందింది.

**manganese blue** : *మాంగనీజ్ నీలిమ.*

రాసాయనికంగా బేరియం మాంగనేటు అనబడేదానికి పర్యాయనామం. ఉష్ణ్యంతకు, స్పష్టతకు, పారదర్శకతకు ఇది పేరొందింది.

**manganese green :** *మాంగనీజురి హరితం.*

మన్నిక గల ఒక వర్ణద్రవ్యం. బేరియమ్ మాంగనేట్‌లోనే ఆకుపసిమిరంగు గలది ఈ పేరుతో వ్యవహృతం; దీనికే కాసిల్ హరితం. రోజెన్‌షీల్ హరితం, బెరైటా హరితం అనే మారుపేర్లున్నాయి.

**manganese violet:** *మాంగనీజ్ రాజనీలం.*

రాసాయనికంగా మాంగనీజు అమ్మోనియం ఫాస్ఫేటుగా వరిగణితమయ్యే దానికి ఇది వ్యవహారనామం; నీలివాక రాజనీలపు ఈ వర్ణద్రవ్యం మన్నికకు పేరొందింది.

**manifestation :** (చూ : *happening*)

**manifesto :** *సిద్ధాంత పత్రం; వివరణ పత్రం.*

కళకు సంబంధించిన నూతనోద్యమాలను ప్రకటించే పత్రం.

**mannered :** *రీతిబద్ధం.*

'మేనర్డ్' అనేది ఆంగ్ల కళాసాహిత్యంలో విమర్శకులు, పారిభాషిక రీతిలో కాకుండా, ఉపయోగించే ఒక పదవిశేషం. 19 వ శతాబ్దిలో ఇది వాడుకలోకి వచ్చింది. ఒక ప్రత్యేక శైలికిగాని, కళాయుగానికిగాని చెందేది ఇది కాదు. కాని ఏదో ఒక శైలిపై అతిమాత్రపు అభిమానంతో వర్తిస్తూ, ఆ శైలిలోని పైపై మెరుగులను మాత్రమే అందిపెట్టుకొని పనిచేసే వ్యక్తిగత కృషికి విశేషణంగా దీనిని వాడతారు.

**mannerism :** *రీతివాదం.*

1525-1600 మధ్య ఇటలీలో వ్యాప్తి పొందిన కళోద్యమం. పునరుజ్జీవన యుగపు ఉచ్ఛదశలోని, క్రమబద్ధ లయగతులకు విరుద్ధంగా ఉద్భవించింది. ఈ వాదాన్ని అనుసరించిన చిత్రాలు అత్యాశ్చర్యముతో సుదీర్ఘ రూపాలతోగాని, ఇతర విధమైన విపరీత రూపాలతోగాని, అతిమాత్రపు దృష్టి ప్రక్రమ గతితోగాని వుండేవి. వర్ణాలు ముదురుగా, స్ఫుటంగా వుండేవి ఎల్ గ్రెకో, టిన్‌టోరెటూల చిత్రాలు ఈ రీతివాదానికి చెందినవి మెకెల్ ఏంజెలో చిత్రాలు కొన్ని ఈ శైలికి చెందినవని కొందరు అభిప్రాయపడుతున్నారు

**mannerist art :** *రీతిసంప్రదాయ కళ.*

**maple die board ;** *దారు ముద్రఫలకం.*

అయిదు పొరలతికిన ఒక విధపు పొర చెక్క. యంత్రకృషిలో ముద్రల వెనక వైపున దిండుగా ఇది ఉపయుక్తమవుతున్నది.

**maquette :** *అల్పవర్ణం.*

శిల్పకళలో, మట్టితోగాని మైనంతోగాని చేసిన చిన్న నమూనా శిల్పం. ఇటువంటి నమూనాలను శిల్పకారులు బహూమతులకై ప్రదర్శనలలో ఉంచటానికి, ఉపకారవేతనాలకై అధికారులకు చూపటానికి వినియోగిస్తారు.

**marble :** *చంద్రశిల; చలవరాయి; పాలరాయి; రాజాశ్మం.*

ప్రాచీన కాలంనుండీ కూడా శిల్పరచన విషయమై ఆదరణ పొందిన ఒక శిలావిశేషం. రాసాయనికంగా ఇది కాల్షియమ్ కార్బనేటుగా పరిగణితమవుతున్నది. దక్కని

ప్రవణకు కలిగి. సాంద్రతకు పేరొందిన రాయి ఇది. నున్నటి, మేలి మిసిమిని ఇందు సాధించే అవకాశం ఉంది. అయితే ఆమ్లాలు దీనిపై ప్రభావం నెరపగలవు కాబట్టి, వాయు గతామ్లాల వల్ల, ఈ రాతిశిల్పాలు కాల క్రమాన శిథిలత చెందగలవు; అందువల్ల ఇది మన్నిక గలది అని చెప్పటానికి వీలు లేదు

ఈ శిలలో వర్ణవిభేదాలు, తలద్రీతులలో విభేదాలను, అనుసరించి చాలా రకాలున్నాయి. గ్రీసు, ఇటలీ, ఫ్రాంసు, యునైటెడ్ స్టేట్స్, భారతదేశాలలో ఈ శిల వివిధ రీతులలో లభి స్తున్నది.

**marble dust :** *పాలరాతిపొడి; చంద్ర శిలా చూర్ణం.*

వర్ణాలలో జడతను కల్పించటానికి వాడే సన్నని పొడి. పలుకులలాగా ఉండే ఈ పోడిని భిత్తిచిత్రాల భూమికా నిర్మాణానికి వాడతారు.

**marbling :** *చంద్రశిలీకరణం.*

1. కొయ్య మొదలైన వాటిపై చలవ రాయి చారల వంటి వాటిని సృష్టించే ప్రక్రియ.

2. కాగితంపై రకరకాల అలంకరణ లను రంగుల సాయంతో రూపొందించటం. ఇది పుస్తకాల అట్టలకూ, లోపలిభాగాలకూ అతికింపునికి పనికివస్తుంది. ఒక పళ్ళెంలో చిక్కని జిగురును ఉంచి, దానిపై పలచని రంగులను పోస్తారు దానిపై దువ్వెన వంటి పళ్ళున్న ఇనుపసాధనంతో గీస్తారు. ఇట్లా గీసినదానిపై కాగితం పరచి, తీసివేసి ఆరబెడతారు. ఈ ప్రక్రియ 17, 18వ శతాబ్దాలలో యూరపులో అధికాదరణ పొందింది.

**margin :** *కతయంచు.*

**marine :** *సాగరికం; నౌసంబంధికం; సాగరదృశ్యం.*

1. సముద్ర దృశ్య చిత్రణ.

2. ఫ్రాన్సులోని చిత్రప్రమాణాలలో ఒకటి.

**Maroger medium :** *మారోజెర్ మాధ్యమం.*

యునైటెడ్‌స్టేట్స్ నివాసిఅయిన జేక్విస్ మారోజెర్ అనే అతడు 1940 లో ప్రవేశ పెట్టిన తైలవర్ణ మాధ్యమం. ఈ మాధ్య మాన్నే పునరుజ్జీవన యుగపు ప్రముఖ చిత్ర కారులు వాడుకొన్నారనీ, ఆ పద్ధతి విస్మృతి చెందగా దాన్ని తిరిగి తాను కనుక్కొన్నా ననీ మారోజెర్ వాదించాడు. అతడు కొందరిని అనుయాయులుగా చేర్చుకోగలి గినా, కళావేత్తలు ఈ మాధ్యమాన్ని పునరు జ్జీవన యుగపు మాధ్యమమని కానీ, దీనికి మన్నిక కలదనీ గానీ విశ్వసించటంలేదు. తాను రచించిన 'ది సీక్రెట్ మీడియమ్స్ అండ్ టెక్నిక్స్ ఆఫ్ ది మాస్టర్సు' అనే గ్రంథంలో పూర్వ చిత్రకారులు వాడిన రహస్యపు మాధ్యమాలు ఇంకా కొన్నిటిని సైతం మారోజెర్ పేర్కొన్నాడు. వాటిని గూడ కళావేత్తలు ప్రామాణికాలుగా స్వీక రించటం లేదు జె. పి ఎల్. మెరిమీ అనే అతడు రచించిన 'ఆర్ట్ ఆఫ్ ఆయిల్ పెయిం టింగు' (తైలవర్ణ చిత్రకళ) 19వ శతాబ్ది ప్రారంభంలో ప్రచురణ పొందింది. అందులో కనబడని సాంకేతిక ప్రక్రియా విశేషాలు ఏవీ మారోజెర్ రచించిన గ్రంథంలో కన బడవు.

**maroon** : *తాలారుణ.*

**marouflage** : *లగ్నీకరణం.*

చిత్రించిన కాటికను గోడపై అతికించే పద్ధతి. ఇట్లా అతకటానికి అనుయాయికంగా వాడే బంధకం, నూనెతో కలిపిన తెల్ల సీసం. దీన్ని కాటికకు వెనుకభాగంలోను, గోడపైనా, సమానంగా పూసి అంటించేవారు. తెల్ల సీసానికి డామరు వార్నిషును కూడా కలప వచ్చు. నీటిలో కరిగే జిగురులు, ఇతర కృత్రిమ బంధకాలు కూడా ప్రస్తుతం వాడుకలో ఉన్నాయి.

**marquetry** : *పొదివింపు; ఖచనం.*

చెక్కిన కొయ్యఫలకంలో, వివిధ ఛాయలు గల చిన్న చిన్న కర్ర ముక్కలు, లోహపు రేకుముక్కలు, దంతపుముక్కలు మొదలైన వాటిని, అలంకృతికై పొదగడం. పునరుజ్జీవన యుగంలో ఈ ప్రక్రియ అత్యధికాదరణను ఆర్జించింది.

**Mars black** : *కుజమసి.*

**Mars pigments** : *అంగారక వర్ణ ద్రవ్యాలు.*

ప్రత్యేక పద్ధతిలో బట్టీలో తయారుచేసిన లోహభస్మపు వర్ణాలు. మొదట్లో 'మార్స్ పిగ్మెంట్సు' అనేవి ఒక వ్యాపారనామమే అయినా తరవాత బట్టీలో తయారైన లోహ భస్మాలకు అన్నిటికీ ఇది సామాన్య నామంగా పరిణమించింది. ఈ అంగారక వర్ణ ద్రవ్యాలలో, వసువు, ముదురు గోధుమ, ఎరుపు, నీలలోహితం; నలుపు ముఖ్యమైనవి.

**Mars red** : *కుజలోహితము.*

**mascaron** : *చిత్రోపముఖం; వింత పొయిదల.*

వికృతరూపంలో రూపొందించిన ముఖకరాళం. దీన్ని ఒక అలంకరణంగా కొయ్య, లోహం, పింగాణి పనులలో వాడతారు.

**mask** : *పొయిదల; ముఖకరాళం; ఉపముఖం; ఛద్మముఖం.*

**mass** : *ముఖ్యాంశం; విషయం.*

చిత్రంలో తగినంత ప్రమాణంగాని, ప్రాముఖ్యంగాని కలిగి ఒకే విధంగా ఉన్న ప్రదేశం. ఒక భవనం లేదా ఆకాశానికి ఎదురుగా కన్పడే చెట్ల గుబురు.

**massicot** : *త్రపుగైరికం.*

ఒక విధమైన సీసభస్మం; ఎరుపుసన్నె కలది; 15 వ శ. మొదలుగా 18 వ శతాబ్ది వరకు వర్ణద్రవ్యంగా ఇది కళాకారుల వాడుకలో ఉండేది.

**massier** : మాసియరు

కళా శిక్షణాలయంలోని విద్యార్థి పెద్దకు సమానార్థకమైన ఫ్రెంచిభాషా పదం

**massiveness** : *పృథులత.*

**mass tone** : *బాహ్యస్థాయి; స్తోమస్థాయి.*

ఒక వర్ణానికి గల బయటి ప్రతిఫలనం

**mastaba** : *మస్తబా.*

ప్రాచీన ఈజిప్టువాసులచే నిర్మితమై ఈ రోజు కూడా కనిపించే సమాధివిశేషం శవాన్ని లోపల ఉంచి పైన ఇటుకలతో దీన్ని నిర్మించేవారు. ఇది చాలా చిన్న కట్టడం. 'మస్తబా' అంటే అరబ్బీ భాషలో, పొట్టి బెంచిబల్ల అని

అర్థం. తమ ఇంట్లముందు ఉండే అటు వంటి బల్లలను ఇది పోలి ఉండటంతో దీన్ని అరబ్బులు ఆ పేరుతో వ్యవహరించారు.

**master** : *ఆచార్యుడు; ప్రవృద్ధుడు; నిపుణుడు.*

ఒక కళాసంప్రదాయపు ప్రవర్తకుడు.

**masterpiece** : *ప్రకృష్ట రచన; ఉత్తమ రచన.*

ఒక కళాకారుడి అత్యుత్తమ కళాసృష్టి; ఒక ఉత్తమ కళాఖండం.

**mat[1]** : *కర్కశం; కటరీతి.*

1. మెరుపులేకుండా వెలవెల పోతూ మందంగా ఉండే ఉపరితలానికి విశేషం. ఇది అత్యల్పపు గరుకుతనంవల్ల కలుగుతుంది. ఇటువంటి గరుకుతనంవల్ల కాంతికిరణాలు చెదరి, అద్దంలాగా ఉండు మెరుపుదనాన్ని తగ్గిస్తాయి. సాధారణంగా నీటి వర్ణాలు, ఆరిన తరవాత, ఇదేవిధంగా కనిపిస్తాయి. తైలవర్ణాలు మాత్రం సాధారణంగా మెరుపు కలిగి, వార్నిషు పూతవల్ల, ఇంకా అధికంగా మెరుస్తాయి.

2. మధ్య భాగం కత్తిరించి, చిత్రానికీ చట్టానికీ మధ్యన అందుగా బిగించిన, అట్ట వంటి గట్టి పదార్థం.

**mat[2]** : *బ్రుని; ప్రతానకం.*

**mat board** : *కర్కశ ఫలకం.*

గట్టిగా ఉండి ఒకవైపున కాగితాన్ని అతికించిన అట్ట చిత్రానికి కర్కశత తయారుచేయటానికి దీన్ని వినియోగిస్తారు. దీని ఉపరితలం, మెరుపు గలిగిగానీ, మెరుపు లేక గానీ, ఎత్తుపల్లాలుగాగానీ ఉండవచ్చు. ఇది అనేక వర్ణాలలో లభిస్తుంది. దీని మధ్య భాగంలో అంచులలో కొంచెం ఏటవాలుగా కత్తిరిస్తే సన్నని తెలుపుకీర వస్తుంది. ఈ ఫలకాన్ని సాధారణంగా కొయ్యగుజ్జుతో తయారుచేస్తారు.

**mat cutter** : *ఫలకచ్ఛేదిని.*

అట్టను, ఏటవాలుగా గాని నిటారుగాగాని



ఫలకచ్ఛేదిని

కత్తిరించటానికి ఉపయోగించే పనిముట్టు.

**material** : *ద్రవ్యం.*

**mat finish** : *గరుకు నగిషీ; కటు వరివృత్తి.*

**mat glaze** : *కర్కశ ద్యుతికం.*

మార్దవములలో కనిపించే ఒక కాంతి నిరోధక ద్యుతికం. వెలవెలబోతూ, ప్రతిఫలన లేని ఉపరితలం ఇందులో కనపడుతుంది. బేరియం లేదా అల్యూమినా (మృత్తిక) ను వాడి దీన్ని సాధిస్తారు

**matting wheel** : *బిందు చక్రం.*

(చూ : *roulette*)

**mat knife** : అట్టకత్తి.



అట్టకత్తి

కొయ్యపిడి కలిగి, అట్టనుకోయటానికి ఉపకరించే పరికరం.

**matrix** : మాతృక.

1. స్ఫటికం, లోహం, శిలాజం మొదలైన వాటిని అంతరంగా ఇముడ్చుకొన్న సహజ పదార్థం.

2. శిల్పాలను అచ్చుతీసే మూస.

**maturation** : పరిపాకం.

మార్తవంలో ఒక పారిభాషిక పదం. ఆవంలో సరిగా కాల్చి, ఒక సామగ్రిని గట్టి పరచటం దీని అర్థం.

**mat varnish** : గరుకు వార్నిషు.

నిస్తేజమై, స్నిగ్ధత తగ్గి ఉండేట్లు ఉపరితలాన్ని రూపొందించటానికి పనికి వచ్చే ఏ వార్నిషైనా, ఈ పేరుతో వ్యవహృతం.

**mauve** : నీలలోహిమ.

**Maxwell triangle** : మేక్స్‌వెల్ త్రిభుజం.

**Mayan blue** : మయ నీలిమ.

అమెరికాలోని ప్రాచీన వాసులైన మాయా జాతి వారి చిత్ర విశేషాలలో కనవచ్చే ఒక వర్ణ ద్రవ్య విశేషం. ఆకుపసిమివాళ గల నీలిమ ఇందులో కనపడుతుంది.

**mechanical drawing** : యాంత్రికాలేఖనం.

ఒక రూపాన్ని రేఖాబద్ధరీతిలో స్పష్టంగా తెలుసుకోవటానికి వాస్తువిదులు తయారు చేసే ఆలేఖనం నిర్మాణానికి సౌలభ్యాన్ని కలగజేయటానికి ఇది ఉద్దిష్టం. దీన్నే రేఖా రచన లేదా నిర్దిష్టాలేఖనం అని కూడా వ్యవహరిస్తారు. ఇటువంటి యాంత్రికాలేఖనానికి గాను కొన్ని యంత్ర సాధనాలను వాడతారు. ఇన్ని సెం.మీటర్లు అంటే ఇన్ని మీటర్లు అనే నియతితో ఈ ఆలేఖనాలు తయారు చేస్తారు.

**medieval art** : మధ్యయుగ కళ.

యూరపులోని మధ్య యుగం (క్రీ.శ. 500-14వ శతాబ్ది) నాటి కళ. దీని తరవాతిదే పునరుజ్జీవనయుగ కళ.

**medium** : మాధ్యమం.

1. కళాకారుడు, కావలసినట్లుగా ఉపయోగించటానికి అనువుగా, రంగుకు కలిపే ద్రవ పదార్థం. దీన్ని కలపటం వల్ల రంగులోని జిగురుపదార్థపు బంధకశక్తి తగ్గిపోకూడదు. తైలవర్ణ మాధ్యమంలో విసర్జిత చెందని డామరు వంటివి కలిసి ఉంటాయి. సూర్యరశ్మితో శుద్ధి చేసిన అవిసె నూనెను దీనికి సరిపాలుగా కలుపుతారు. కర్పూర తైలాన్ని, కొద్దిగా కోబాల్టు శోషిణిని కలపటం ఇంతకన్నా ప్రశస్తం.

2. కళాకారుడు ఉపయోగించే సాధనములు, వర్ణద్రవ్యాలు.

3. కళాకారుడు తన భావాలను ప్రకటించే కళావిధానం; ఉదా: శిల్పం, చిత్రలేఖనం, వర్ణ చిత్రణం, ముద్రణ పద్ధతి.

**megilp or me guilp** : *మృదు మాధ్యమము.*

ముద్దగా ఉండే వర్ణమాధ్యమం తెల్ల సీసం వలన అధికసంతృప్త ద్రావణత చెందిన అవిసె నూనెతో వార్నిషును కలిపి దీన్ని తయారు చేస్తారు. దీన్ని 18, 19 శతాబ్దాలలో ఎక్కువగా వాడే వారు. కాని 1826న రసాయన శాస్త్రజ్ఞులు దీన్ని వాడటం మంచిది కాదని సూచించారు. చిత్రాలు పెళుసెక్కటం, పగుళ్లు చూపటం, వివర్ణత చెందటం దీనిలోని లోపాలు. పునరుజ్జీవన యుగంలో కూడ దీన్ని చిత్రకారులు వాడినట్లు కొందరంటారు, కాని అది సత్యదూరం.

**melting point** : *ద్రవీభవన బిందువు.*

**melting range** : *ద్రవీభవన విస్తృతి.*

**memento mori** : *మృత్యు ప్రతీక.*

మృత్యువును సూచించటానికి చిత్రకళలో వాడే చిహ్నం. 'మెమెంటో మోరై' అంటే 'చస్తావు, గుర్తుంచుకో' అని అర్థం. ఇటు



మృత్యు ప్రతీక.

వంటి మృత్యుప్రతీకంలో కపాలం ముఖ్యం. పునరుజ్జీవన యుగంలో, చిన్నదైన రూపంలో కపాల ప్రతీకను నిర్మించు కొని వెంటతీసుకొని పోవటం తరచుగా జరిగేది. ఇటువంటి ప్రతీకను మంచి పనితనంతో తయారుచేసి, విలువైన రాళ్లు కూడా దానిలో పొదిగేవారు.

**merge** : *మేళవించు.*

**mesh** : *జాలిక; జాలరంధ్రం.*

**metal cast** : *పాకజం.*

**metal cut** : *లోహ లేఖనం.*

దారు ఖండన రీతిలోనే, ఉబ్బు ముద్రణను సాగించటానికి అనువుగా, లోహ ఫలకంపై చేసిన అధిలేఖనం.

**metal leaf** : *లోహ పత్రం.*

(చూ: *dutch metal*)

**metal plate** : *లోహ ఫలకం.*

**metal point** : *లోహ కంటకం.*

ఆలేఖనంలో ఉపయోగించే ఒక పరికరం. ఒక చిన్న లోహదండాన్ని చివరన సన్నగా కొన దేల్చటంవల్ల ఇది రూపొందింపబడేది. ప్రాచీన కాలంనుంచి ఇటువంటిది గంటం వంటిది. ఆలేఖనంలో వాడుకలో ఉన్నది. మధ్యయుగంలోను, పునరుజ్జీవన యుగంలోను దీని వాడుక ఉంది.

**metal roller** : *లోహావర్తిని.*

**metal work** : *లోహపు పని.*

**metamerism** : *వర్ణాభాసత.*

రెండు విభిన్న వర్ణతలాలు ఒక విధమైన కాంతిలో, ఒకే వర్ణానికి చెందినట్లు కనిపించి, ఇంకొక విధమైన కాంతిలో విభిన్న వర్ణాలుగా కన్పించటం.

**metaphysical painting** : *అధిభౌతిక చిత్రణ.*

చిరికో అనే చిత్రలేఖకుడు, తన అనుయాయి అయిన కర్రాకో కలిసి 1915 నుంచి 1918 వరకు రచించిన కళా సామగ్రికీ, ఆ తరవాత మొరాండి అనే అతడు రచించిన వాటికీ ఈ పదం సాధారణంగా వ్యవహృతమవు తున్నది. స్వప్న జగత్తుకు, వాటుర మానసిక కల్పనకూ, ఇది దాదాపుగా సన్నిహితమై ఉంటుంది. అనాగత వాదానికి ప్రతిక్రియగా, కొంత వరకు, ఈ చిత్రణ రూపొందింది.

**metier** : *వైశిష్ట్యం.*

ఒక కళాకారుడు ప్రత్యేకంగా అనుసరించే విధానం, లేదా నేర్పు చూపించే విధానం

**mezzo fresco** : *అల్పార్ద్ర భిత్తిచిత్రణ; స్తోక నద్యశ్చిత్రం.*

పూర్తిగా ఆరిపోని భూమికపై భిత్తి చిత్రణ.

**mezzo-rilievo** : *మెజ్జో - రిలీవో.*

అర్ధోల్బణానికి ఇటాలియన్ భాషా నామం. (చూ: *relief*)

**mezzotint** : *మధ్యచ్ఛవి; మంద్రచ్ఛవి.*

ఉల్బణ ముద్రణ ప్రక్రియలలో ఒకటి. రాగి ఫలకాన్ని గాని, ఉక్కు ఫలకాన్ని గాని తీసుకొని దానిపై నాగవాసం (రాకరు)తో గట్టిగా గీయాలి. దీనివల్ల ఫలకంపై గొగ్గులు గొగ్గులు కల రేఖలు వస్తాయి. అప్పుడు అది అచ్చులోనమత్వం కలనల్లటి రూపం ఇస్తుంది. తెల్లగా ఉండవలసిన ప్రదేశంలో లోహాన్ని కొంత లోతు వరకు తీసివేయాలి. ఈ మధ్యచ్ఛవి పద్ధతిలో రేఖలలోగాక ఛాయలలో రూపాలు తయారవుతాయి కాబట్టి వర్ణముద్రణలకు ఇది మిక్కిలి అనువైంది. మూర్తి చిత్రాలను వర్ణ చిత్రాలను ముద్రించటానికి ఈ పద్ధతిని 18, 19 శతాబ్దాలలో అధికంగా వాడారు కాంతిరేఖా శిల్పం (ఫోటోఎన్‌గ్రేవింగ్), కాంతి పరివర్తన (ఫోటోగ్రేవియర్) పద్ధతుల వచ్చిన తరవాత దీని ప్రాముఖ్యం నశించింది. మధ్యచ్ఛవి ఫలకాల తయారీ చాలా శ్రమతో కూడినది.

**microcrystalline wax**: *మట్టిమైనం; పెట్రోలియం మైనం.*

పెట్రోలియాన్ని శుద్ధి చేయటంలో ఉత్పత్తి అయ్యే తెల్ల మైనం. రాసాయనికంగా ఇది జడం. కళారంగంలో తేనె మైనానికి ప్రత్యామ్నాయంగా దీన్ని ఈ కాలంలో అధికంగా వాడుతున్నారు. అనేక ఉష్ణ ప్రక్రమగతులలో కరిగేట్టుగా, ఎన్నో రకాలలో ఇది తయారవుతున్నది. ఇందులో మెత్తనిరకాలూ, గట్టి రకాలూ ఉన్నాయి. గట్టి రకపు వాటిలో 20% ఖనిజ తైలం కలిపి వానిని మెత్తగా చేయవచ్చు.

**middle distance** : *మధ్య మండలం.*

చిత్ర రచనలో పురో భూమీ, పశ్చాత్ భూమీ కలిసే చోటు; రేఖాగత దృష్టి ప్రక్రమగతిలోని మూడుస్థానాలలో ఇది మధ్యది.

**migration period art** : *ఉత్క్రమ యుగకళ.*

కళా చరిత్రలో ఒక ప్రత్యేక యుగపు కళకు నామం. ట్యూటానిక్ జాతి ప్రజలు-విసిగాతులు, ఆస్ట్రొ గాతులు, లాంబార్డులు,

వాండలులు, ప్రాంతులు-అవసన్న స్థితిలో ఉన్న-రోమక సామ్రాజ్యపు వివిధ ప్రాంతాలపై దండయాత్రలు జరిపి ఆక్రమించిన కాలంలో వారి ఆదరణ పొందిన కళకు ఇది వర్తిస్తుంది.

**mild** : *సౌమ్య.*

**milk of lime** : *సున్నపు తేట.*

**Milori blue** : *మిలోరీ నీలిమ.*

ప్రషియన్ నీలిమకు ఒక పర్యాయ నామం.

**mineral** : *ధాతువు; లోహం; ఖనిజం.*

**mineral blue** : *ఖనిజ నీలిమ.*

ఆంట్‌వెర్ప్ నీలిమకూ, అజూరైట్ నీలిమకూ సాధారణంగా వాడుకలో ఉన్న పేరు. ఇది ప్రామాణీకరణాన్ని మాత్రం పొందలేదు.

**mineral gray** : *ఖనిజ ధూసరం.*

అతిసాగరిక భస్మానికి ప్రాచీన నామం.

**mineral green** : *ఖనిజ హరితం.*

ప్రామాణీకరణం చెందని ఒక వర్ణ ద్రవ్య నామం మైలకుత్తాకి, బ్రెమెన్ నీలిమలో ఆకు పసిమి రకపు దానికి ఇది వర్తిస్తుంది.

**mineral lake** : *ఖనిజ రంజకం.*

ప్రస్తుతం వాడుకలోలేని ఒక పసుపు పచ్చని వర్ణద్రవ్యం. రాసాయనికంగా ఇది స్టానిక్ (తగరపు) క్రోమేట్‌గా వ్యవహృతం.

**mineral oil** . *ఖనిజ తైలం.*

ముడి పెట్రోలియంను శుద్ధిచేయటంలో లభించే వేరువేరు స్థాయీభేదాల తైలాలకు సామూహ్య వాచకంగా ఈ పేరు వర్తిస్తున్నది.

**mineral painting** : *ఖనిజ చిత్రణ.*

కుడ్య చిత్రణలో ఒక విధానం. పొటాసియం సిలికేటుతో కలిపి నూరిన వర్ణ ద్రవ్యాలతో ఇందులో చిత్రణ జరుగుతుంది. దీనికే ఏకీకృత వర్ణ చిత్రణ (*stereochromy*), జలకాచ చిత్రణ - అనే పేర్లుకూడా ఉన్నాయి. దీన్ని 1880లో అడాల్ఫ్ కీమ్ (మ్యూనిచ్ వాసి) ప్రమాణీకరించాడు. ఇది చాలా చిక్కులతో కూడిన ప్రక్రియ కావటం వల్ల దీన్ని ఎవరూ ఎక్కువగా అవలంబించలేదు.

**mineral pigments** : *ఖనిజ వర్ణ ద్రవ్యాలు*

(చూ: *earth colours*)

**mineral spirit** : *ఖనిజ సేధువు.*

ఒక విధపు రంగుపూతల విరళకరి; కర్పూరతైలానికి ప్రత్యామ్నాయంగా ఇది వాడుకలో ఉన్నది.

**minerel violet** : *ఖనిజ రాజనీలం.*

అతిసాగరిక రాజనీలిమకు పర్యాయ నామం.

**mineral white** : *ఖనిజ శ్వేతం.*

జిప్సానికి (ముగ్గు సున్నపు రంగుకు) పర్యాయనామం.

**mineral yellow** : *ఖనిజ పీతం.*

టర్నర్ పసిమికి పర్యాయనామం.

**minette** : *నేల పసిమి.*

పీత గైరికానికి ప్రాచీన నామం.

**miniature** : *అల్ప చిత్రం; లఘు చిత్రం.*

సాధారణంగా దంతంపైగాని, ఒక రకపు సన్నని తోలుపై గాని, అటువంటివే

అయిన ఇతర పదార్థాలపైగాని చిత్రితమయ్యే అల్ప మూర్తిచిత్రం. 'మీనియేచరు' అనే పాశ్చాత్య పదం, మీనియేర్ (*miniare*) అనే లాటిన్ క్రియాపదంనుంచి ఉత్పన్నం. ఈ క్రియకు, 'ఎర్రని ఖనిజ వర్ణంతో చిత్రించటం' అని అర్థం మొదట్లో గ్రంథాలలోని చిత్రణకు ఈ ప్రక్రియను అవలంబించారు. భారతదేశంలో ప్రాచీన జైన లిఖిత గ్రంథాలలో కనపడే అలంతి చిత్రాలను ఇటువంటి వాటిలో తొట్ట తొలుతటి వానినిగా ఎంచవచ్చు. తరవాత పారశీకులు దీన్ని చాలా అభివృద్ధి పరచి, ఆహ్లాదకరమైన వర్ణాలతో అటువంటి వాటిని చిత్రించారు. భారతీయ లఘు చిత్రాలు జగత్ ప్రసిద్ధి గాంచాయి. వీటిని మొగలులు, రాజపుత్రులు ఎన్నో విధాల అభివృద్ధి చేశారు. భారతీయ లఘు చిత్రాలలో ప్రముఖ శైలులు: జైన, రాజపుత్ర, మొగల్, పహాడీ, దక్కన్ శైలులు. వీటిలో సామాజిక జీవనం, రాజ వైభవం, వేటల చిత్రణ, ఆఖ్యాయికా చిత్రణ, పౌరాణిక గాథా చిత్రణ ఉన్నాయి.



అలంతి చిత్రం
దంతముతో నిర్మితమగు ఫలకముపై ఈ చిత్రణ సాగినది;
చిత్రకారుడు : రిచర్డ్ కాస్వే (1742-1821)

పాశ్చాత్య దేశాలలో చిన్న చిన్న ముఖ చిత్రాలను దంతం, అట్ట, కోడి పిల్లచర్మాలపై చిత్రించేవారు, ఇవి సాధారణంగా కోలంగానో గుండ్రం గానో, దీర్ఘ చతురస్రంగానో ఉండేవి. మొదట్లో వీటిని కూడా, భారత దేశంలో మాదిరిగానే, కాంత్యభేద్య జల వర్ణాలతో చిత్రించినా, 18వ శతాబ్దినుంచి పారదర్శకపు నీటి వర్ణాలతో చిత్రించటం జరిగింది. ప్రస్తుతం ఇటువంటి అలంతి చిత్రాల రచన చాలా స్వల్పంగా ఉన్నది.

**minimal art :** *మితకళ.*

1960-70ల మధ్య ప్రవర్తిల్లిన జ్యామితీయ కళోద్యమం. దీనినే ప్రాథమిక నిర్మాణ (*primary structure*) కళ అనీ, ఆరంభ కళ(*ABC art*) అనీ వ్యవహరిస్తారు. దీని ప్రధాన కేంద్రాలు న్యూయార్క్, లాస్ ఏంజెల్స్.

**minium :** *రసగంధక వర్ణం.*

మొదట యూరపులో అలంతి చిత్రాల రచనకై ఉపయుక్తమైన వర్ణద్రవ్యం. ఈ 'మినియం' అనే లాటిన్ భాషా నామాన్ని బట్టియే పాశ్చాత్య భాషలలో అలంతి చిత్రానికి 'మీనియేచరు' అనే పేరు వచ్చింది.

**Minoan :** *మినోవన్.*

క్రీటు దీవిలో ప్రాచీన కాలం (క్రీ పూ. 3400-1000)న విలసిల్లి, అత్యుచ్చ్రతను ఆర్జించిన ఒక కళారీతికి విశేషణం. అక్కడి వాస్తుకళ, కుంభకార కళ, భిత్తిచిత్రకళ చాల ప్రశస్తమైనవని పేరుపొందాయి. మినోవన్ రాజ్యానికి ముఖ్యనగరమైన నాసస్‌లోని తవ్వకాలవల్ల అక్కడి భిత్తిచిత్రాలను గురించిన



మినోవన్ కళాకృతి. భాగదేవతా విగ్రహము (క్రీ.పూ. 16వ శతాబ్ది); దంతమునకు పొదిగిన సువర్ణమున రూపొందింపబడినది.

విశేషాలు ఈనాడు అనేకము తెలియవచ్చాయి. అక్కడ రమారమి క్రీ.పూ 15వ శతాబ్దిలో పరిపాలన నెరపిన 'మినోస్' అనే రాజు పేరును బట్టి ఆ కళకు మినోవన్ కళ అనే పేరు వచ్చింది. 1912లో పురాతత్త్వవేత్తలు అక్కడ తవ్వకాలు జరిపి, అక్కడి శిథిలాలను కొంతవరకు పునరుద్ధరింపగలిగారు. సమకాలిక వస్తువులలోని భిత్తిచిత్రాల శైలినే అక్కడ అవలంబించినట్లు దీన్నిబట్టి స్పష్టమవుతున్నది. అక్కడి రాజభవనాల శిథిలాలవల్ల [illegible] భారతదేశపు సింధునాగరికతలో లాగానే. అక్కడి పట్టణ వాస్తువులో నీటి పారుదల వసతులకు ఎక్కువ ప్రాముఖ్యం కల్పించబడినట్లు విదితమైంది.

**minor arts :** *ఉపకళలు.*

వాస్తు, చిత్రలేఖన, శిల్ప ఆలేఖన, ముద్రణ కర్మలనే కళలు తప్ప తక్కిన కళారీతులకు వాడబడే సమష్టినామం. పైన పేర్కొన్న వాస్తు, చిత్రలేఖనాదులను లలిత కళలు (*fine arts*) అంటారు. ఏవి ఉపకళలు అనటం కొంతవరకు వివాదస్పదమే అయినా పై రీతి విభజన చాలావరకు ప్రయోజనకారిగా ఉన్నది.

**Miracle clay :** *అద్భుత మృత్తిక; వింత మన్ను.*

స్వయంఘనీభూత మృత్తికకు వ్యాపార నామం.

**mirror finish :** *ముకుర పరిష్కరణ.*

**Mitti's green :** *మిట్టీ హరితం.*

మరకత హరితాలలో, అంతగా స్పష్టంగా ఉండకపోయినా గాఢత కలిగిన, ఒకరకం రంగు.

**Mittler's green :** *మిట్లర్ హరితం.*

ఒకరకపు పాలాక్సిక వర్ణం; ఈ కాలంలో పాలాక్సిను తయారుచేసే పద్ధతిలో కాక పూర్వకాలమున ఇది వేరే పద్ధతిలో తయారయ్యేది. ఆ పద్ధతి ఇప్పుడు ఆదరణ కోల్పోయింది.

**mixed technique :** *సమ్మిశ్రిత ప్రక్రియ.*

నూనె, యుక్తరూపం కలిసిన మాధ్యమంలో జిగురు రంగులు, ఇతర విభిన్న రంగులను మిశ్రమించేసి సాగించే చిత్రణ ప్రక్రియ. [illegible]

వంటి చిత్రవు మన్నికకూడా అధికం అవుతుంది. మేర్స్ డోర్నరు అనే అతడు రచించి, 1984లో ప్రచురించిన 'ది మెటీరియల్స్ ఆఫ్ ది ఆర్టిస్ట్, అండ్ దైర్ యూజ్ ఇన్ పెయింటింగ్' (కళాకారుడు వాడే పదార్థాలు, చిత్రలేఖనంలో వాటి ప్రయోజనం) అనే గ్రంథం ఆధారంగా ఈ ప్రక్రియ యు. స్టే లోను, బ్రిటన్‌లోను మొదట రూపుగొన్నది.

**Mixed white** : *మిశ్రిత శ్వేతం.*

కళాకారులు వాడే సమ్మిశ్రిత శ్వేతం అనే తైలవర్ణానికి ఇది వ్యాపార నామం.

**mixing bowl** : *మిశ్రి పాత్రి.*

శిల్పంలో పనికివచ్చే ఒక పాత్ర విశేషం. రబ్బరుతోగాని, సన్నటి ఇత్తడి రేకుతోగాని ఇది తయారవుతుంది. తడి సుధాపిష్టాన్ని బాగా కలిపి, నిలువ ఉంచుకోవటానికి ఇది పనికివస్తుంది. ఆ సుధాపిష్టాన్ని వాడిన తర్వాత, అందులో నిలువ ఉండి గట్టిపడి అతుక్కొని ఉండే సుధాపిష్టమును, పాత్రను ఒత్తటంవల్ల సులభంగా తీసే వీలుంది.

**mobile** : *చలన శిల్పం.*

శిల్పంలో ఒకవిధమైన ఏర్పాటు. కమ్మీలు, గట్టి తీగెలు మొదలైన వాటితో వేలాడే రీతిగా శిల్పంలో ఈ ఏర్పాటు జరుగుతుంది. కొద్ది గాలికి సైతం అటుఇటూ అది కదులుతుంది. అలెగ్జాండరు కాల్డరు (జ. 1898) అనే ఒక అమెరికన్ శిల్పి, ఇటువంటి ఏర్పాటును మొట్టమొదట రూపొందించారు. వివిధ వర్ణాలలో, వక్రరేఖా రూపాలలో ఉండే ఇటువంటి ఏర్పాట్లు [illegible] అనుకరించిన ఇతరులు ఆ పద్ధతికి మెరుగులు దిద్ది ప్రకృతి సహజములైన వాటికే గాక వివిక్త కళారూపములకు కూడా అందులో స్థానం కల్పించారు.



చలన శిల్పం శిల్పి : అలెగ్జాండర్ కాల్డర్. శిల్పపు ఎత్తు: 72" వ్యాసము 68" అల్యూమినియపు రేకులను, ఉక్కును, ఉక్కు తీగలను కడ్డీలనువాడి రూపొందించినది ఈ శిల్పం దీని పేరు దానిమ్మ (1949).

నిశ్చలని (*Stabile*) అనే శిల్ప ప్రక్రియను కూడ కాల్డర్ రూపొందించారు. అది కొంత వరకు చలనశిల్పాన్నే పోలినా, దానిలో నమనీయత ఉండదు; చలనము ఉండదు.

**model** : *ప్రతిమానము; నమూనా.*

ఒక చిత్రంలోని రూప నిర్మాణంలో చిత్రకారుడికి స్ఫురింపచేయటానికి సజీవ రూపవిశేషంగా ఎదుటనిలిచి ఉండేది [illegible]



నిశ్చలని. శిల్పి : అలెగ్జాండర్ కాల్డర్ ఇనుమున ఇది నిర్మితం కొలతలు : 1191/4 × 146/4 × 98½ అం; దీనిపేరు : విదూషక మకుటం (1980).

**modeling 1 : రూపుదిద్దు; రూపీకరించు; రూపించు; మలచు.**

1. శిల్పంలో, ముద్దగా ఉండే మట్టి వంటి పదార్థాన్ని ఒక రూపవిశేషంగా చాతుర్యంతో తీర్చటం; ముద్దపై ముద్దగా చేర్చి రూపాన్ని సంధానించటానికి అంటే సంకలన ప్రక్రియ *(additive process)* కు మాత్రమే ఈ పదాన్ని వాడటం ఎక్కువగా కనపడు తున్నది. మలచటం *(carving)* అనేది దీనికన్నా విభిన్నం.

2 రెండాయతనాలలో ఉండే చిత్ర లేఖనం, ఆలేఖనంవంటి వాటిలో మూడాయత నాల ఆభాసతను రూపొందించటం.

**modeling 2 : వర్ణీకరించు.**

ఒక కళాకారుడు రూపరచన చేయటం కోసం నమూనాగా తగిన భంగిమతో సిద్ధమై ఉండటం.

**modeling board : తీర్పు ఫలకం**

తాను పనిచేసే బల్లపైగాని, తీర్పుమెట్టుపై గాని ఉంచుకొని, దానిపై మట్టి మొదలైన రూపీకరణ ద్రవ్యాలను ఉంచుకొనే పనిమట్టు

**modeling clay : శిల్ప మృత్తిక, బొమ్మ మట్టి.**

1 రూపీకరణకై శిల్పంలో వాడబడే ఒక కలగలుపు ముద్ద పదార్థం అది గట్టి పడదు; కాబట్టి శాశ్వతమైన కళాఖండ నిర్మాణానికి అది పనికిరాదు. కాని పోతపని చేసేటప్పుడు అచ్చుల నిర్మాణానికీ, విద్యార్థు లకు విగ్రహనిర్మాణం నేర్పటానికి దీన్ని వాడవచ్చు. పని ముగిసిన తరవాత, దీన్ని ముద్దగా కలిపి, ఇతరమైన పనికి కూడా ఉపయోగించవచ్చు స్వచ్ఛమైన ఇటువంటి మట్టి ఇటలీలో మొదట తయా రైంది అందులో కొవ్వు, గంధకం, మంచి రకపు బంకమట్టి చేరి ఉండేవి. దానికి చౌక బారు అనుకరణలు ఎన్నో ఉన్నాయి. అటు వంటి నకిలీ మృత్తికలలో బంకమట్టితో పాటుగా, ఏదో ఒక జడద్రవ్యాన్ని, పెట్రో లియం గ్రీజులను, నూనెలను మిశ్రమం చేస్తున్నారు. చివరకు అందులో ఒక రంగు పదార్థం చేర్చి, బూడిదవాక అతువసిమి రంగు దానికి కలిగేట్లు చేస్తారు. ప్లాస్టిసైన్, ప్లాస్టిలినా అనే వ్యాపారనామాలతో బొమ్మ మట్టిని బజారులో అమ్ముతున్నారు ఈ బొమ్మ మట్టికే బొమ్మ మైనం, ముద్దమట్టి అనే పేర్లు కూడా ఉన్నాయి.

2. శిల్పులు శిల్పాలను రూపొందించ టానికి వాడే సహజ మృత్తిక; బంకమట్టి.

**modeling paste : రూపవిష్టత.**

వివిధ పాలిమర్ రంగులతో కలిపి అమ్మ బడే ఒక విధమైన తెల్లటి పిండి పదార్థం. రూపీకరణలో దీన్ని వినియోగిస్తారు. పాలి మర్ చిత్రణలోను, శిల్పంతోనూ, సమపేశ చిత్రణలలోను వివిధ పరిణామాలను తీసుకొని రావటానికి ఇది సహకరిస్తుంది.

**modeling stand : తీర్పు మెట్టు.**

శిల్పి, బొమ్మమట్టిని శిల్పంగా రూపొం దించటానికి ఉంచుకొని పనిచేసే తిరుగుడు మెట్టు దీనికి మూడు లేదా నాలుగు కాళ్లుం టాయి. దీనికే తిరుగుడు బల్ల (*turn table*) అనీ పేరుంది. కొయ్యతోనో లేదా ఉక్కు-



తీర్పుమెట్టు

తోనో దీన్ని నిర్మిస్తారు; దీని ఎత్తు 3 అడు గులు. దానిపై తిరుగుడుబల్ల చతురస్రమై, భుజపునిడివి 1 అంగుళాంతో ఉంటుంది. ఆ బల్లను కావలసినప్పుడు క్రమంగా అదనంగా 20 అంగుళాల ఎత్తు వరకూ పెంచవచ్చు. ఇంకో విధమైన తీర్పుమెట్టున పైబల్ల గుండ్రంగా ఉంటుంది. ఈ తీర్పుమెట్లలో కొన్ని ఎక్కువ బరువుతో ఉండి, వాటి మధ్యన ఒక ఆధారదండంతో పాటుగా దిగువన గుండ్రని కుదురు కూడా ఉంటుంది.

**modeling tools : తీర్పు పనిముట్లు; రూపీ కరణ పరికరాలు.**

బొమ్మమట్టిని, శిల్పంగా రూపొందించ టానికి శిల్పి వాడే పరికరాలు. ఇవి మూడు రకాలు: 1. కొయ్య పనిముట్లు:- దీన్ని సాధారణంగా గట్టి కర్రతో (బాక్సుకర్రతో) చేస్తారు. ఇందులో కొనదేలినవీ, బద్దదేలినవీ, చీలికకొనలు గలవీ, గుండ్రని కొనలు గలవీ, మొదలైన చాలా రకాల పరికరాలుంటాయి. 2. తీగంచు పనిముట్లు:- దీనికి ఒక కొనలో ఏదో ఒక విధమైన కొయ్య పనిముట్టున్నా, ఇంకో కొనలో ఉచ్చులాగా రూపొందించిన ఉక్కు-తీగయో ఇత్తడి పిడితో అమరి ఉంటాయి. 3. రెండుచ్చుల పనిముట్లు: ఇందులో ఒక కొయ్యపిడికి రెండు వైపులా ఇనుప తీగె ఉచ్చులు అమరి ఉంటాయి. శిల్పాన్ని రూపొం దించేటప్పుడు అదనపు మట్టిని తీసివేయటా నికి ఉద్దిష్టాలైన ఈ ఉచ్చులు, గుండ్రం గానే గాక, కొన్ని సందర్భాలలో కోణాలు తీరి ఉండటం కూడా ఉంది. బాక్సు కర్ర పరికరాలు సాధారణంగా 6 మొదలు 8 అంగుళాల వరకూ పొడవు కలిగి ఉంటాయి. తక్కిన రెండు విధాలవి కూడా సాధారణంగా ఆ పొడవులలోనే ఉన్నా, వాటిలో చిన్న ప్రమాణములవి సైతం లభిస్తాయి ఇటువంటి చిన్న పరికరాలు, శిల్పపు ముఖం మొదలైన చోట్ల చిన్న చిన్న లోపాలు సవరించటానికి తోడ్పడతాయి. చిన్నవేకాక, సాధారణపు పొడవులను మించి దాదాపు 1 కో తర. పొడవు

గలవికూడ, చివరి రెండు తీరుల వరికరా లలో, లభిస్తాయి. వీటి ఉచ్చులు ఇత్తడితో నిర్మితములు. పిడులకు మేపిల్ చెక్కను వాడ తారు. వీటిని 'వృత్తి' పరికరాలు అని కూడా వ్యవహరించటం ఉంది.




తీర్పు పనిముట్లు. (A) గట్టి కర్ర పనిముట్లు, (B) తీగకొన పనిముట్లు, (C) జమిలి కొనతీగ పనిముట్లు

**modeling wax :** *బొమ్మ మైనం.*

**modello :** *వర్ణిక.*

నిర్మాణం చేయదలచిన కళాఖండపు చిన్న నమూనా. ఒక్కొకప్పుడు ఇది రేఖామాత్రంగా ఉండవచ్చు. కొన్ని సందర్భాలలో చక్కగా తీర్చబడి కూడా ఉండవచ్చు; తలపెట్టిన కళా ఖండపు ఇటువంటి వర్ణికను, సాధారణంగా ముందుగా తన ఉపాధ్యాయుడికో, తనను ఆ పనికై నియమించిన వారికో, చూపించి ఆమో దాన్ని పొందటానికై శిల్పి రూపొందిస్తాడు.

**model stand :** *వర్ణికా పీఠం.*

చిత్రకారుడి కర్మాగారంలోగాని, కళాధ్య యన శాలలోగాని, వర్ణికను ఉంచటానికి అమర్చి ఉండే, అంతగా ఎత్తు ఉండని, పీఠ విశేషం. సాధారణంగా బోర్లా వేసిన పెట్టె ఆకృతిలో దిగువన అధారాలతో ఇది నిర్మి తం. అందువల్ల అవసరములేనప్పుడు, దీన్ని వెల్లకిలగా తిప్పి ఒక మూలన పెట్టి అందలి డొల్లభాగంలో అవసరములేని సామగ్రిని ఉంచుకొనేందుకు వీలుంటుంది. అందువల్ల కర్మాగారపు జాగాను పొదుపుగా వాడుకునే సౌకర్యం లభిస్తుంది.

**modernist :** *అధునికతావాది; నవ్యతా వాది.*

**modular design :** *అంగిక రేఖాంకనం.*

వాస్తుశాస్త్రమున ఇది ఒక పారిభాషిక పదం. ఒక నిర్మాణంలో ఒక్కొక్క అంగా నికి ఒక నిర్ణీత రీతిలో సాగించే రేఖాంకన మిది. ఇటువంటిది అనిర్మాణపు సమష్టి రూప సంవత్తికి అనుపై అనురూపమైనదిగా ఉంటుంది. అధునిక వాస్తురీతిలో ప్రాముఖ్య నికి వచ్చిన పునాముడిక నిర్మాణ పద్ధతి (*prefabrication of building*) వల్లఇటు వంటి రేఖాంకనానికి అవశ్యకత లభించింది.

**moive effect :** *అభాస దృశ్యం.*

సమాంతర వక్రరేఖలు, క్రమ రేఖలు ఒక వర్గముపై ఇంకొక దానిని అనుసంధింప జేయటంవల్ల ఒక రూపదృశ్యం చిత్రించి అక్కడ అది లేకపోయినా ఉన్నట్లు భ్రమను కల్పించటం. దృక్కళ (అ ప్ ఆర్ట్) లో ఇటువంటిది కనవడుతుంది.

**moist water colours** : *చెమ్మరంగులు; సార్ద్రవర్ణాలు.*

**moisture trap** : *చెమ్మతోను; సంక్లేద వాగురం*

**Monastral blue** : *మోనాస్త్రర నీలిమ.*

థాలోసియానైన్ నీలిమకు బ్రిటన్‌లో వాడుకలో ఉన్న వ్యాపారనామం.

**Monastral green** : *మోనాస్త్రర హరితం.*

థాలోసియానైన్ హరితానికి, బ్రిటన్‌లో వాడుకలోఉన్న, వ్యాపార నామం.

**monochrome** : *ఏకవర్ణకం.*

ఒకే ఒక రంగును దాని వేర్వేరు ఛాయలలో, వాడి చిత్రించబడినది; తెలుపును దీనితో పక్కనే వాడినా అది రెండో రంగుగా లెక్కకురాదు.

**monogram** : *వంశ ప్తముద్ర.*

**monolith** : *ఏకాండ శిల్పం.*

ఒకే ఒక రాతిలో నిర్మితమైన శిల్పం; లేదా ఒకే ఒక దానిగా పోతపోసిన నిషిక్తం. (పోత విగ్రహం)

**monotype** : *ఏకార్ణిక.*

అచ్చు తీయటంలో ఒక విశిష్ట పద్ధతి. మొదట చిత్రాన్ని ఒక గాజు పలకపై చిత్రించి, తరవాత, తడిగా ఉన్నపుడే, ఒక తెల్ల కాగితంపైకి మారుస్తారు. ఇందుకోసం కాగితాన్ని చిత్రమున్న గాజు పలకపై బోరగిలవేసి, పైభాగంలో గట్టి కర్ర చంచా వంటి నున్నటి పరికరంతో దుద్దుతారు. చిత్రాన్ని రచించటానికి గాజు పలకకు బదులుగా లోహఫలకాన్ని వాడవచ్చు. అటువంటి పరిస్థితిలో కాగితాన్ని, లోహఫలకంపై ఉంచి, ఆ రెంటిని ఒక పెట్టున సూచీ చిత్రణా ముద్రణ యంత్రం ద్వారా పోనిచ్చినప్పుడు అచ్చు పడుతుంది. మొదటి చిత్రాన్ని చిత్రించటానికి త్వరగా ఆరిపోని ఏ రంగునైనా వాడవచ్చు. మూల చిత్రాన్ని మార్పిడి చేస్తే తరవాత కూడా ఫలకంపై కొంత రంగు మిగిలి ఉంటుంది. అప్పుడు ఆ రంగునో, ఇంకో రంగునో మళ్ళీ పూసి తిరిగి అచ్చులను తీయవచ్చు. ఇటువంటి సందర్భంలో తీయబడిన ఏ రెండు అచ్చులుకూడా ఒక తీరుగా ఉండవు. ఇందువల్ల బహుళ సంఖ్యలో ఒకే రకపు ప్రతులను తీయటానికి-సాధారణ ముద్రణలోలాగా - వీలుపడదు. ఏకరీతిక చెందిన అచ్చులు కాగితంపైన తయారయ్యేవి కాబట్టి, వీటిని సర్వ సాధారణంగా, గ్రాఫికులుగా లెక్కిస్తారు.

**montage** : *ప్రకీర్ణకం.*

ఫోటోగ్రావులు, అచ్చులు మొదలైన వాటినుంచి, వివిధ భాగాలు సేకరించి, తగిన రీతిలో కత్తిరించి అనుస్యూతంగా అమర్చగా రూపొందే చిత్రం.

**montan wax** : *కాష్ఠిక పిత్తం; బొగ్గు మైనం*

లిగ్నయిటు బొగ్గును శుద్ధిచేసి తీసే ఒక విధమైన మైనం. పారిశ్రామికపు పూత రంగులలో జలనిరోధకంగా, అధిసక్తకంగా చర్మపరికరాల తుది పరిష్కారకై, మధూచ్ఛిష్టానికి ప్రత్యామ్నాయంగా ఇది ఉపకరిస్తుంది. ఇది కఠినంగాను, పెళుసుగాను ఉంటుంది. సాధారణపు కాష్ఠికం రమారమి

80° సెం గ్రే దగ్గర ద్రవీభవనం చెందుతుంది

**Monthier blue** : *మాన్ తియర్ నీలిమ.*

ప్రష్యన్ నీలిమలో ఇది ఒక రకం.

**Montpellier green** : *మాన్ ట్ పెల్లి యర్ హరితం.*

తామ్రకిట్టానికి పర్యాయనామం.

**Montpellier yellow** : *మాన్టుపెల్లియర్ పీతం.*

టర్నర్ పసిమికి పర్యాయనామం

**monument** : *ఉదాత్త నిర్మాణం; సంస్మారిక.*

వ్యక్తి, సంఘటన, శాసనంలో దేన్ని గురించి అయినా స్మృతి చిహ్నంగా కట్టబడిన ఒక నిర్మాణం; విపులార్థంలో ఈ పదం గతకాలపు విషయాలలో దేనికైనా ఒక స్మృతిగా నిలబడగలిగిన అవశేషాలలో ప్రతిదానికీ వర్తిస్తుంది.

**monumental** : *స్మరణీయ; సముదాత్త*

పెద్ద ఎత్తున ఉండేది అని దీని మూలార్థం. కళా విమర్శనలో శాశ్వతి, మహద్రూప భావన, ఉదాత్తత, లేదా సరళత, వాస్తు సాంకేతిక లక్ష్యం, లేదా కలకాలం నిలవగలిగే విశిష్టత అనే వాటిని తెలియజేసే వర్ణనాత్మక విశేషణంగా ఇది ఉపయుక్తం. ఆకళాకారపు ప్రమాణం చాలా పెద్దదిగా ఉండవచ్చు; కాని ఉండవలసిన ఆవశ్యకత లేదు. పావిస్ డి. షావన్నేస్ (1824-1898) రచించిన కుడ్య చిత్రాలలోను, ఆగస్టు రోడిన్ నిర్మించిన బాల్జాక్ స్మారక చిహ్నం (1897) లోను ఇటువంటి విలక్షణతలు కనబడతాయి.

**mop** : *ఉప్పిపిక.*

ఒంటెరోమాలతో నిర్మితమైన పెద్ద కూలిక. వర్ణ సమ్మేళనానికీ, తదితర కార్యక్రమాలకూ నీటిరంగుల చిత్రణలో దీన్ని ఉపయోగిస్తారు.

**mordant** . *క్షయకరి; లాంఛకం.*

1. సూదీచిత్రణవంటి ముద్రణ ప్రక్రియలలో, ఫలకాన్ని ముంచటానికి ఉపయోగించే ఆమ్లం లేదా ఆమ్ల మిశ్రమం. నిరోధకంవల్ల రక్షితముగాని రేఖలను, బిందువులను, ప్రదేశములను ఈ ఆమ్లం కొరికి వేస్తుంది. నిరోధకాన్ని ఆమ్లం తినివేయటం వీలులేని రీతిలో ఆమ్లపు గాఢత కుదురుకొని ఉండాలి సాధారణంగా ఇటువంటి అమ్ల పనిలో వినియుక్తమయ్యే క్షయకరులు

1 నైట్రిక్ యాసిడ్ సజలామ్లం.

2 హైడ్రోక్లోరిక్ యాసిడ్.

(చూ : *dutch mordant, smillie's bath*)

మోర్డాంట్ అనే పదం ఫ్రెంచి భాషలోది; దీని మూలార్థం దంశనం (కొరికివేయటం) గాజుపై సూదిముద్రణ సాగించే విషయంలో క్షయకరిగా హైడ్రోఫ్లోరిక్ యాసిడ్‌ను వాడతారు.

2. అద్దకంపనిలో, అద్దకం వేసే నూలుగుడ్డలోని, దారాలకు రంగులు గట్టిగా, మన్నికగా అంటుకొని ఉండేందుకు వర్ణద్రవ్యంతో మేళవించబడే రాసాయనిక ద్రవ్యం.

**morelle salt :** అష్టి లవణం.

క్షారీయరీతిలో తయారయ్యే ఎర్రని ఇనుప భస్మం. శ్వేతరక్త వర్ణం, ప్రాచీన కాలంలో, ఈ పేరుతో వ్యవహృత మయ్యేది.

**morinda :** క్రముకవేతం.

ఆగ్నేయ ఆసియాలోని కొన్ని మల్బరీ జాతి చెట్లనుంచి సహజ సిద్ధంగా లభించే పసిమి రంగద్రవ్యం; తక్కిన సహజసిద్ధ రంగద్రవ్యాలతో పోల్చినప్పుడు ఇది చాలా మన్నికైనదిగా పేరుపొందింది.

**morphology :** రూపవిజ్ఞానం.

**mortar :** గానుగ సున్నం.

1. భిత్తిచిత్రానికై భూమికకోసం గిలాబా చేయటానికి ఉపయోగించే పదార్థం; పొడిసున్నం, ఇసుక, నీరులను కలిపి చక్కగా గానుగాడి మేళవించబేసిన ద్రవ్య విశేషమిది.

2. గోడ కట్టుబడికి, రాళ్ళ పరువుకు, మరమ్మతులకు వాడే సాధారణపు సున్నపు అడుసు.

3 (చూ : *mortar and pestle*)

**mortar and pestle :** రోలు, (ఖల్వం) రోకలి.

ఎండిన గట్టి ద్రవ్యాలను పొడి చేయటానికి వాడే పనిముట్లు. వీటిలో రోలు, గుంటదేలి ఉంటుంది. అది రాతితోగాని, లోహంతోగాని, గట్టి గాజుతోగాని నిర్మితం కావచ్చు. రోకలికూడా, రోలు చేయబడిన ద్రవ్యంతోనే చేయబడి పొట్టిగా దంతాకృతి గలిగి, చివరన గుండుదేలి ఉంటుంది. రోటిలో ఎండు ద్రవ్యాలనువేసి రోకటితో పదే పదే దంచగా అవి చూర్ణంగా మారుతాయి. కొన్ని సందర్భాలలో మెత్తని వస్తువులను నూరటానికి సైతం ఈ పరికరాలను వాడతారు గాని, ఈ విషయంలో ఇంతకన్నా ఎక్కువగా ఉపకరించేది పొత్రం (*muller*)

**mosaic :** చిత్రాస్తరం; మొజాయిక్.

వివిధాకృతులను, చిత్రాలను-చిన్న చిన్న మెరుగు బిళ్ళలను క్రమరీతిలో సంధానించి-రూపొందించటం. మెత్త సున్నం (*grout*) లో గాని మాస్టిక(*mastic*) మనే యక్షధూపంలో గాని చక్కగా కుదురుకొనే గాజురాళ్ళను బిగించి ఇటువంటి చిత్రాలను ఆకృతులను రూపొందించటం ఇందులో జరుగుతుంది. ఇటువంటి చిత్రణ చాలా కాలం మనగలిగింది. ఈ ప్రక్రియ చాలా సనాతనం చదును నేలపైనేగాక గోడలు, విగ్రహాలు, గృహోపకరణాలు మొదలైన వాటిలోను ఇటువంటి ప్రక్రియను అవలంబించారు. కుడ్యచిత్రాలలో ఇటువంటి ప్రక్రియకై కాంతిభేద్యమైన చిన్న చిన్న ఘన కాచములు ఉపయోగించేవాళ్ళు. పగల గొట్టబడిన భాగం పైకి, ఉండేట్లు వీటిని అమర్చటంవల్ల కాంతి ప్రతిఫలనం చెంది, ఆ ఉపరితలమంతా మెరమెర మెరసేది. చదునైన ముఖతలంగల గాజుముక్కలను కొద్దిగా కోణందీరి ఉండేట్లు అమర్చినా ఈ మెరుగు వచ్చేది.

గ్రీకు, రోమను నాగరికతల కాలంలోనే గాక, ఇతర ప్రాచీన నాగరికతలలో

కొన్నింటిలోనూ ఈ ప్రక్రియ ఆదరించబడింది. ఈ ప్రక్రియలో మొట్టమొదటివి సుమేరియన్ నగరాలలో కనిపించాయి వారు గాజు ముక్కలకు బదులుగా శంఖాకారపు మట్టి ముద్దలను వాడి; వాటి శీర్ష భాగాలకు కావలసిన రంగులను ఉపయోగించారు. రంగుభాగాలు పైకి కనబడేట్టు అటువంటి వాటిని తడిగోడయొక్క ఉపరితలంలో గుచ్చగా, చిత్రం రూపొందేది. అతి ప్రాచీన కాలంలో క్రీటులోను, ఆసియామైనరులోను



చిత్రాస్తరం : బైజాంటినమ్ నగరమందలి దానికి ప్రతిరూపం [క్రీ శ, 538-547); జస్టినియన్ చక్రవర్తియు అతని ఆస్థానోద్యోగులునూ ఇందు కనబడుదురు.

వాడుకలో ఉన్న ఒకవిధమైన ఇటువంటి ప్రక్రియ పారంపర్య రీతిలో క్రమపరిణామం చెంది గ్రీకులకు, తదనంతరపు కాలంలో రోమనులకు లభించింది క్రీ. పూ 5 వ శతాబ్దిలో కనపడే ఇటువంటి వానిలో రాతి ముక్కలను, ఆలిచిప్ప ముక్కలను వాడటం కనపడుతుంది. అయితే వీనిలో మూర్తి చిత్రణ జరిగేదికాదు. కాని క్రీ.పూ 4 వ శతాబ్ది నాటికి రంగు పలుకులను వాడటం ఈ ప్రక్రియలో ప్రాధాన్యం పొందింది. వీటి సాయంతో రూపొందించిన మూర్తి చిత్రాలు, పట్టబంధాలు మేసిడోనియాలోని ఒలిన్తస్, పెల్లాలలో లభించాయి. గాజు రాళ్ళను, పొడుగు నిలువెత్తులు సమంగా ఉన్న చిన్నముక్కలుగా వాడటం క్రీ.పూ. 1 వ శతాబ్దంలో మాత్రమే మొదలైంది.

హెల్లెనీయ యుగానికి చెందిన ఇటువంటి చిత్రాస్తరములలో, నేడు లభ్యమయ్యే వాటన్నిటిలో-శ్రేష్ఠతమమైనది పాంపే నగరంలో (క్రీ పూ. 100) కనబడింది. అది ఇప్పుడు నేపిల్స్ నగరపు జాతీయ మ్యూజియంలో ఉన్నది. అలెగ్జాండరు, దరయస్‌ల మధ్య

జరిగిన సమరాన్ని చిత్రించే చిత్రమది రోమన్ యుగానికి చెందిన వాటిలో ప్రశస్తతమం, తివోలీనగరంలో హాడ్రియన్ విల్లాలో కనపడుతున్నది. పూర్వం రచితమై, నేడు అనుపలబ్ధమైన ఒక గ్రీకు చిత్రాన్ని అనుసరించి దాని ప్రతిరూపముగా అది అక్కడ రూపొందించబడిందని పండితుల అభిప్రాయం. కిన్నరులకూ, వన్యమృగాలకూ మధ్య సాగిన ఒక పోరాటపు దృశ్యం అందులో చిత్రితం. అయితే అప్పటివరకు ఇటువంటి చిత్రణను నేలపైనా అరుగులపైనా జరపటంమాత్రమే పరిపాటిగా ఉండేది. క్రీ.శ. 1 వ శతాబ్దంలో కుడ్యచిత్రాలకై ఇటువంటి ప్రక్రియను వాడటం మొదలైంది.

బైజాంటెయిన్ పాలకుల ఆదరణవల్ల వారి కాలంలో గాజుముక్కలను ఈ ప్రక్రియలో వాడటం విరివిగా కొనసాగింది. ఇస్తాన్‌బుల్, రవెన్నా, వెనిస్, రోము నగరాలలోని చర్చీలలో అటువంటి చిత్రాస్తరములను ఈ నాడు కూడా చూడవచ్చు. ఆ యుగంలో తక్కిన కళాప్రక్రియలలో దేనికీ చిత్రాస్తరమునకు లభించినంత ఆదరణ లభించింది కాదు. వాస్తవుకు దీనిని సరిపడేట్లు జతపరచటంలో ఆనాటి కళాకారులు తమ ప్రజ్ఞను చక్కగ ప్రదర్శించారు.

మధ్య యుగాలలో కుడ్యచిత్రణకై దీన్ని వాడేటప్పుడు, తడిగచ్చు పూతలో కావలసిన రీతిలో గాజు ముక్కలను గుచ్చటం మొదట్లో అనుసరించారు. కాని కాలక్రమాన ఇందులో అనేకమైన మార్పులు వచ్చాయి. ఇటలీలో అనాడు ఎక్కువగా ఆదరింపబడినది పరివర్తిత చిత్రిక (మొజాయిక్ ఎ రివర్సురా) విధానం. ఒక సన్నటి వస్త్రంపై, తడిలేని ఇసుకలో చిత్రాస్తరమును తొలుత సంధించి, దానిపై ఒక కాగితాన్నిగాని, గుడ్డనుగాని, ఆ చిత్రాస్తర మందలి రాళ్ళు స్థానభ్రంశం చెందకుండా ఉండేట్లు గట్టిగా అతికిస్తారు. అంతట ఆ వస్త్రం మొత్తం ఎత్తి గోడపైని పరచిన గచ్చులో చక్కగా అమర్చి బిగిస్తారు. ఆ తరవాత ఆ కాగితాన్ని లేదా గుడ్డను తొలగిస్తారు. ఒక్కొక్కప్పుడు ఇంకొక పద్ధతిని అవలంబించటం కూడా జరిగింది. ఇందులో ఒక కాగితంపై చిత్రాస్తరపు రాళ్ళను బోరగిల అమర్చి, దాన్ని గోడగచ్చులోకి దిప్పి మార్చేవారు

పునరుజ్జీవన యుగంలో చిత్రాస్తర నిర్మాణంలో కుశలురైన పనివాళ్ళు విరివిగా ఉండేవాళ్ళు. కొన్ని కుటుంబాలలో సభ్యులంతా ఆ పనిలో నేర్పరులుగా పేరొందారు. పేరొందిన చిత్రలేఖకులు రచించిన చిత్రాలను నమూనాలుగా గ్రహించి అటువంటి వాటి చిత్రాస్తరములను తయారుచేయడం విస్తృతంగా వ్యాప్తి పొందింది. ఇందుకు ఉదాహరణంగా రోమునగరంలోని సెయింట్ మేరియా డెల్ పొపోలో ఆలయ ప్రాంగణంలో చిగి చేపెల్‌లోని గుంబాజులో భాగానకనిపించే చిత్రాస్తరమును గ్రహించవచ్చు. దీనికి మూలమైన చిత్రాన్ని రచించినవాడు రేఫేలు. ప్రసిద్ధ చిత్రకారుడగు టిటియన్ రచించిన చిత్రాలను ఆధారాలుగా గ్రహించిన చిత్రాస్తరములు అనేకములు 1535-1545 మధ్య కాలంలో వెనిస్ నగరంలో, సెయింట్‌మార్కు చర్చిలో రూపొందించబడ్డాయి. కాని ప్రసిద్ధ చిత్రకారుల రచనలను అనుకరిస్తూ చిత్రాస్తరములను నిర్మించటం ఎక్కువగా సాగ

టంవల్ల ఆ ప్రక్రియలోని మౌలికత అంతరించి, క్రమంగా అది క్షీణించటం మొదలైంది. గత నాలుగు శతాబ్దాలలో అది చాలావరకు లుప్తమైందిగానే ఉన్నా, ఈ 20 వ శతాబ్దపు మధ్యకాలంలో కొందరు అలంకరణకై ఈ ప్రక్రియను పునరుద్ధరించటం జరిగింది. మెక్సికోలోని యూనివర్సిటీ గ్రంథాలయంపై 1950లో ఈ ప్రక్రియలో సాగిన అలంకరణ ఇందుకు ప్రముఖ లక్ష్యం. ఈ అలంకరణకై మూలమును తయారుచేసినవాడు 'జువాన్ ఒ' గోర్మన్.

**mosaic gold** : *ముష్చ బంగారం.*

స్ఫుటమైన సువర్ణకాంతి కలిగి, మన్నిక గల ఒక వర్ణద్రవ్యం దీని రాసాయనిక నామం తగరపు బైసల్ఫైడు. స్వర్ణ చూర్ణానికి, స్వర్ణపత్రానికి ప్రత్యామ్నాయంగా, 18 వ శతాబ్ది నుంచి ఇది వాడుకలో ఉన్నది. కాని 19 వ శతాబ్ది మధ్యకాలంలో దీనికి బదులుగా కాంస్య చూర్ణం (*bronze powder*) ఎక్కువగా వాడుకలోకి వచ్చింది. మొజాయిక్ గోల్డ్ (ముష్చ బంగారం)కే ఆంగ్లంలో, అరం మస్సివమ్, కేట్స్ గోల్డ్, మాక్‌గోల్డు, పోర్పోరినో, వర్సరినో అనే పర్యాయనామాలున్నాయి.

**moss green** : *శైవల హరితం.*

క్రోమ్ హరితంలో ఒక రకానికి చెందింది.

**mother mould** : *బహిస్సంపుటం*

సంయోగానికి (డొల్లచ్చు లేదా సంస్థానం) పైన అమర్చే డిప్ప. లోపలి డొల్లచ్చు రబ్బరు, జెలాటిన్ లేదా వాటి మాదిరిగానే అంతగా గట్టిగా ఉండక నమనీయమైన ఒక పదార్థంతో నిర్మితమయినప్పుడు మాత్రమే ఇటువంటి బహిస్సంపుటానికి ఆవశ్యకత ఉంటుంది. ఈ బహిస్సంపుటం దృఢపదార్థంతోనిర్మితం

**mother-of-pearl** : *శుక్తి గర్భం.*

**motif** : *ప్రలక్షణం; లాంఛనం.*

లాక్షణికంగాగాని, దృశ్యరూపంగాగాని, ఒక కళాఖండంలోనే పదే పదే పునరావృత్తమయ్యే ఒక అంశం. రూపరచనలో ఇటువంటిది జ్యామితీయ రూపంగానో, సహజరీతినో, శైలీకృతరీతిలోనో పునరావృత్తమవుతుంది.

**motion** : *చేతన.*

**moulage** : *సిద్ధ నిష్క్రమం*

సహజ లభ్యం లేదా సిద్ధంగా లభించేది అయిన దానినుంచి ఒక నిష్క్రమము (పోత విగ్రహం)ను, లేదా అంకనము (*impression*)ను రూపొందించటానికి అవలంబించే ప్రక్రియ. ఇందుకు పనాసీ సుద్దమట్టిని తరచుగా వాడతారు. ఒక విధపు తయారీ సుద్దమట్టి కూడ, బజారులో దీనికోసం లభిస్తుంది కాని ఇటువంటి తయారీ సుద్దమట్టిని విలువ గల కళాఖండాలకును సజీవమానవుల అంకనములను గ్రహించవలసి నప్పుడును మాత్రమే వాడతారు.

**mould or mold (1)**: *సంయానం; డొల్లచ్చు; తయిప్పు.*

...ఆకృతిలో ఉంచబడిన ద్రవరూపకం, లేదా ప్లాస్టరూపకం అయిన పదార్థానికి

వ్యత్యస్త రీతిలో తన రూపాన్ని కల్పించే సుషిర ద్రోణి విశేషం; అట్లా ఉంచబడినదానినే గట్టిపడినప్పుడు, పోత వస్తువు, లేదా నిషిక్తం అని అంటారు

(చూ : *casting; lost wax process*)

**mould or mold (2)** : *బూజు.*

చిత్రపు ఉపరితలంపై కాలవశాన కన వడే సజీవమాలిన్యం మొదట ఇది తెలుపు రంగుతో మసక మసకగా బయలుదేరి- దాని జాతిని అనుసరించి - నలుపు, బూడిదరంగు, పసిమి, ఆకుపసిమి రంగులలో ఏదో ఒకటిగా పరిణమిస్తుంది.

తైల చిత్రాల పైని బూజును తొలగించటానికి సమర్థమైన పరిరక్షణ పద్ధతులున్నాయి ధూమవ్యాపనం (*fumigation*), విశద్ధీకరణం (*bleaching*) మొదలైనవి ఆ పద్ధతులలోనివి. కళాఖండాలను, చెమ్మ యెక్కువగా ఉండే చీకటి గదులలో నిలవ ఉంచటం వల్ల బూజు పట్టటానికి అవకాశం ఎక్కువవుతుంది. చిత్రంపై కనిపించే ప్రతి తెల్ల మచ్చను బూజని భ్రమపడకూడదు- సూక్ష్మదర్శినితో పరిశీలించినప్పుడు మాత్రమే అది బూజయిందీ కానిదీ తెల్లుస్తుంది. చిత్రానికి పూసిన వార్నీషు పారదర్శకతను కోల్పోయినప్పుడు, ఏదైనా అస్పృశ్యపదార్థం ధూళి రూపంగా అక్కడ చేరితేకూడా, ఇటువంటి తెల్లమచ్చ చిత్రంల్లో ఏర్పడవచ్చు.

**moulding (architecture)** : *[illegible]*

**moulding** : *పరిష్కరణం.*

గోడలకు, గృహోపకరణ సామగ్రికి, [illegible] నిర్మాణ విశేషాలకు, [illegible] రమ్య

తను కల్పించటానికిన్నీ, చిత్రపటాలకు చట్రాలను ఏర్పరచేందుకునూ వాడబడే క్రియ.

**mount** : *సమారోపం.*

బొమ్మ మొదలైన వాటిని బిగించే అట్ట ఫలకం.

**mountain green** : *గిరి హరితం.*

మధ్యయుగంలోను, పునరుజ్జీవన కాలంలోను మైలకుత్తానికి వాడుకలో ఉండిన పేరు.

**mounting** : *సమారోపణం*

**mouth blower** : *ముఖధమని*

(చూ : *sprayer*)

**movable type** : *చాలనీయ ముద్రిక; చలద్ముద్రిక*

**moyen-age** : *మధ్యయుగపు; మధ్యయుగ స్మారక.*

మధ్యయుగాలను స్మృతికి తెచ్చునది; లేదా మధ్య యుగాలకు సంబంధించింది.

**muller** . *పొత్రం.*

రంగులను, చేత్తో పొడిపొడిగా చేయటానికి వాడే ఒక పనిముట్టు. దాని అడుగు భాగం చదునుగా ఉంటుంది. ఒక చదునురాతి పై, లేదా మేజాబల్ల పైభాగంలో, రంగునుంచి పైన ఈ పాత్రాన్ని అటూ ఇటూ రుద్దితే పొడి [illegible] [illegible] [illegible] [illegible] [illegible] పనిముట్లు [illegible] నిర్మాణాలున్నాయి.



పాత్రం

అప్పుడు క్రింది చదును రాయియు, పాత్ర మును, ఈజిప్టు దేశపు పలుగురాతితోనో లేదా అటువంటిదే అయిన ఇంకొక కఠిన శిలతోనో తయారు చేసేవారు. ఆనాటి పాత్రం శంఖ్వాకారంగా ఉండి, తెలుగుదేశపు సన్ని కల్లు పాత్రాన్ని పోలి ఉండేది దాన్ని రెండు చేతులతో పట్టుకొని రంగులను నూరేవారు. క్రీ శ 19 వ శతాబ్దం నుంచీ ఈ పాత్రాన్ని గట్టి గాజుతో తయారు చేయడం పరిపాటి అయింది కింది చదును ఫలకానికి మాత్రం గాజుఫలకనో, చలువరాతి ఫలకనో వాడు తున్నారు.

**multi–layered** : *పలుపొరల.*

**multiliner tool** : *బహురేఖిక.*

చాలా రేఖలను ఒకే సమయాన గీయటానికి పనికివచ్చే పరికరం దీనికి ఒక కొయ్యపిడి చివరన బద్దదేలి, వెడల్పుగా ఉండి, చాలా చీలికలు కలిగిన ఇనుప భాగమూ ఉంటాయి.



బహురేఖిక

దీన్ని ఒక్కసారి పొందు ఫలకం (*Scratch board*) పై గీసినప్పుడు ఎన్నో రేఖలు ఒక్కసారిగా ఏర్పడతాయి. సూచీ చిత్రణ లోనూ, శిలాఫలకంపై ఖచికా ప్రయోగం లోనూ సైతం ఈ పరికరాన్ని వాడవచ్చు. పండ్లపోగర (*multiple graver*) కు ఇది ఒక చిన్నరూపం.

(చూ: *Scratch board*)

**multiple graver** : *పండ్లపోగర.*

సమానాంతరాలతో ఉండే రెండు, లేదా అంతకన్న ఎక్కువ కొనలుగా చీలిన బద్దంచు పోగర ఒక్కఎత్తున పలుసమానాంతర రేఖలను దీనితో గీయడం సాధ్యమవుతుంది. రేఖా శిల్పంలోను, కొయ్యపై రేఖాశిల్పంలోను, ఇది బహురేఖికకు బదులుగా వాడబడుతుంది.

**multiple tint tool** : పండ్ల పోగరకు గ్రేటు బ్రిటనులో వాడుకలో ఉన్న వేరొక పేరు.

**multi-purpose ground**: *బహుళార్థ భూమిక.*

పెక్కు మాధ్యమాలు-తైలం, పాలిమర్, నీటిరంగు మొదలైనవి-వాడటానికి అనువుగా సిద్ధపరచబడిన పాటిక లేదా ఫలకం. ఈ మాధ్యమాలలో ప్రతి ఒకదానికి, అది చక్కగా పనిచేయటానికి, ఒక్కొక్క ప్రత్యేక విధపు భూమిక అవశ్యకం కావటంవల్ల ఏ బహుళార్థ భూమికకూడా ఇన్ని మాధ్యమాలలో ఏ ఒకదానికి సంపూర్ణంగా సంతృప్తి నీయలేదనటం సువేద్యం. అయితే సాంప్రదాయికంగా వచ్చే తెల్లలప్పపు పూత గల భూమిక మాత్రం కళాకారులువాడే అన్ని విధాల మాధ్యమాలకు చాలా వరకు పనికి వస్తుంది.

**mummy : మమ్మీరంగు.**

ప్రాచీన ఈజిప్షన శవాలను చాలాకాలం పక్కపోకుండా భద్రపరచటానికి రాసాయనిక మందులతోపాటుగా వాడిన ఒక విధపు తారు రంగు. ఈనాటి సాధారణపు తారురంగుకన్నా ఇది శ్రేష్ఠతరమని సంభావితం అందువల్ల 19 వ శతాబ్దిలో కూడా శవాలనుంచి తీసిన్నది అనే అసహ్యం కూడా లేకుండా, కొందరు దీన్ని విస్తారంగా వాడారు

**Mummy portraits : మమ్మీ మూర్తి చిత్రాలు.**

రోమనుల పరిపాలన కాలంలో క్రీ.శ 2వ, 3వ శతాబ్దాలలో కొన్ని మమ్మీల (ప్రముఖుల శవముల) పేటికలపై రచితములై నేడు కూడా కనవచ్చే మూర్తి చిత్రాలు. ఇందులో అత్యధిక సంఖ్యాకాలు ఫయూమ్ నగర ప్రాంతంలో ఉన్నాయి. ఈజిప్షనే ఉన్నా, వీటిలో ఈజిప్టు జాతీయతా స్ఫూర్తి కనపడదు ఈ చిత్రాలు కొన్ని కలమున రచయితములు, కాని మైనంతో దాహచిత్రణ రీతిలో రచితములైనవే ఎక్కువగా కనబడతాయి.

**Munich lake : మ్యూనిచ్ రంజితం**

జతునవర్ణానికి పర్యాయనామం.

**munjeet : మంజీతం**

మంజిష్ఠకు అపభ్రంశ రూపం

**Munsell system : మన్సెల్ పద్ధతి.**

ఆల్బర్ట్ హెచ్ మన్సెల్ అనే పండితుడు, 1915 లో రూపొందించిన వర్ణ వివరణ పద్ధతి. వర్ణంలో లక్షణాలుగా ఛాయ, విలువ, స్ఫుటత అనే మూడింటిని అతడు గుర్తించి ఈ మూడు లక్షణాలలో ఒక్కొక్కదానిని ఏ తీరుగా ఒక్కొక రంగు కలిగి ఉంటుందో ఆ తీరును నిర్ణయించి. ఆ ప్రకారం రంగులను అతడు వింగడించగలిగాడు. ఇది చాల వరకు పండితలోకం చేత ఆమోదితమైంది. అయినా గడిచిన కొద్ది సంవత్సరాల క్రిందట కొన్ని వర్ణాల మధ్య అంతరాన్ని అతడు సరిగా సూచించక పొరపాట్లు చేసినట్లు బయటపడి అతడి పద్ధతిని చక్కచేస్తూ కొన్ని అభివృద్ధికరపు మార్పులు కలిగాయి. ఈ చక్కచేయబడిన పద్ధతి ది మన్సెల్ బుక్ ఆఫ్ కలర్ (1929), ఎ ప్రాక్టికల్ డెస్క్రిప్షన్ ఆఫ్ ది మన్సెల్ సిస్టమ్ (1937) అనే గ్రంథాలలో క్లెలాండ్ అనే రచయిత వివరించాడు.

**mural : అక్లిష్టము; కుడ్యచిత్రము.**

గోడపైనో, లోకప్పుననో నేరుగా గాని, చిత్రిత కాడికను ఆ గోడకో లోకప్పుకో అతికించడంవల్లగాని రూపొందించబడిన చిత్రం (చూ: సంధాన ప్రక్రియ) లేదా ఒక ఫలకాన్ని ముందే గోడలో బిగించి, ఆ ఫలకంపై చిత్రణను సాగించడం కూడా ఈ ప్రక్రియలో ఉంది. సారణిక చిత్రణతో దీనికి కొన్ని సాంకేతిక విషయములలో సామ్యం ఉన్నా, దీనికి వేరుగా కొన్ని లక్షణాలు కూడా అత్యావశ్యకం కావడంవల్ల ఈ కుడ్య చిత్రణకు చిత్రలేఖనంలో ఒక ప్రత్యేక స్థానం లభించింది. కుడ్యచిత్రమంటే, అది యొక్కడ నుంచో తెచ్చిపెట్టుకొన్న అతుకులబొంత అలంకరణగా ఉండక, ఆ గోడ నెళకొన్న

వాస్తు నిర్మాణ వ్యవస్థతో అవి చక్కగా సరిపడి రాణించాలి. అప్పుడే ఆ ప్రక్రియ విజయవంతమైందని భావించవచ్చు. సాధారణ చిత్రణలను చూసేవారి, తన కనుచూపు మట్టానికి దగ్గర నుండి, చూడటానికి సాధారణంగా వీలుంటుంది. కుడ్య చిత్రం అటువంటిదికాదు ఇందులో అంతయు గాని, అత్యధిక భాగంగాని కనుచూపు మట్టానికి ఎగువనే అమరి ఉండటమేగాక, దాని విస్తృతి కూడా అత్యధికం. అందువల్ల సృష్టి ప్రక్రమ గతికి సంబంధించిన సమస్యలను పెక్కింటిని ఇటువంటి చిత్రణలో ఎదుర్కొవలసి ఉంటుంది. కుడ్యచిత్రపు ఉపరితలం కర్కశమై, కాంతిపరావర్తనరహితమై ఉండటం మంచిది. అప్పుడు దాన్ని ఏవైపునుంచి చూచినా కండ్లు మిరుమిట్లు గొలిపే ఇబ్బంది ఉండదు కుడ్య చిత్రం, అది నెలకొన్న భవనం మనినంత కాలం, మనవలసి ఉండేది కాబట్టి అందులకై తగిన మన్నికగల వర్ణాలను వాడాలి. గృహాంతర్గతాలైన కుడ్యాలకు చేసే చిత్రణ, బయటనుండే గోడలకు చేసే చిత్రణ కన్న ప్రక్రియలో వేరు రీతిగ మొదటినుంచీ ఉన్నది. సాంప్రదాయికంగా అటువంటి చిత్రణను సద్యస్క చిత్రణ అని వ్యవహరించడం ఉంది కాని అది వస్త్రచిత్రణలో ఒకఅంతర్భాగంగా పరిగణనీయం ప్రస్తుతం అటువంటి సద్యస్క చిత్రణకు అంతగా ఆదరణలేదు. ఆధునిక కాలంలో అటువంటి సద్యస్క చిత్రణకు బదులుగా గృహాభ్యంతర కుడ్యాలకు, చాలా వరకు, తైలవర్ణాలను, వాడతారు; అప్పుడప్పుడు జిగురు రంగులను, దధిచూర్ణ వర్ణాలను, పాలిమర్ రంగులను, ఆరిన తలంపైవేసే రంగులనుకూడా వాడటం ఉంది.

ఇంటిలోపలి గోడలపైఉన్న చిత్రాలలో కన్న బయటి గోడలపై ఉన్న చిత్రాలు వాన, ఎండా, గాలి మొదలైన వాటికి ఎక్కువగా తట్టుకోవలసి ఉంటుంది. అందువల్ల ఆ కుడ్య చిత్రాలకై ఎక్కువ మన్నికగల పదార్థాలను-రాతిబిళ్ళలను, గాజు బిళ్ళలను, పింగాణి బిళ్ళలను, మెరుగుగల పెంకులను, రంగు సిమెంటును, ఇనుముపై పొందుపరచిన యనామెల్ మంచవర్ణములు పూయబడిన ఉబ్బుణ శిల్పాలను - వాడతారు. వీటిలో ఏదైనా రంగు మాసినప్పుడు దానిని మాత్రం తీసి ఇంకొక కొత్తదాన్ని దాని స్థానంలో అమర్చటానికి సౌకర్యం ఉండటం ఇందులో గమనింపదగిన విషయం. లలిత కళల దృష్టిలో "శాశ్వతంగా మనగలుగుతూ" బయటి గోడలకు వేయదగిన రంగు పదార్థం ఏదీ ఈ నాటికీ లభించలేదు. ఇప్పటికి తెలియవచ్చిన రంగులలో ఏదీ నిరంతరాయంగా సాగే అతినీలలోహిత కిరణాల దాడికీ, గాలిలో కొట్టుకొనివచ్చే ధూళికణాల దెబ్బకూ, రాసాయనిక కల్మషకారుల చర్యకూ వాయు-మంచువానల ఘాతలకూ, ఉష్ణోగ్రతల లోపు. గాలి చెమ్మలోను వచ్చే మార్పులకూ తట్టుకొని నిలువబడగలిగేది కనిపించదు.

కొన్ని ప్రదేశాలలో - ముఖ్యంగా దక్షిణ యూరపులోని బెట్ట ప్రాంతాలలో-ఇంటి వెలువల గోడలకు సైతం భిత్తి చిత్రణ ప్రక్రియ ఉపయోగించిన, సందర్భాలున్నాయి; పంచ గోడలు. నరపల గోడలు ఈ విధపు భిత్తి చిత్రణలకు అక్కడ లోనైనాయి. అక్కడి శీతోష్ణ పరిస్థితులవల్ల అని నిలదొక్కుకొని - చాలకాలంగా నిలిచి ఉన్న మాట నిజమే అయినా ఉష్ణత తక్కువై, వానలు బాగా

కురిసే వానలతో బయటి గోడలకు సంబం ధించినంతవరకు భిత్తిచిత్రణ ప్రక్రియ అన్ని చోట్లా విఫలమైంది. ఏదో కొంత వరకు మరుగు గలిగిన గోడలను చిత్రించటానికి సిలికాన్ ఈస్టరు రంగులు ఎక్కువగా పనికి వచ్చే అవకాశం ఉంది

**mural painting** : *కుడ్యచిత్రణ; అక్లిన్న చిత్రణ*

**murex purple** : *శుక్తి ధూమ్రం.*

తైరీయ ధూమ్రానికి పర్యాయనామం.

**muslin** : *సూక్ష్మవస్త్రం; దువ్వలువ*

**mutual solvent** : *బహుద్రావకం*

అనేక ద్రవపదార్థాలలో, ప్రతిదానిలోనూ కరిగిపోగల ఒక బాష్పశీల ద్రావకం

**Mycenean** : *మైసీనియక*

క్రీ. పూ. 1600 - 1100 మధ్యకాలంలో, మైసినీ నగరంలోనూ, దాని సమీపస్థమైన ఇతర నగరాలలోనూ వర్ధిల్లిన కళారీతికి వాడబడే విశేషణం. (ఈ మైసినీ పట్టణమూ లక్కానవీ గ్రీసుదేశపు ముఖ్య భూభాగంలో, అతి ప్రాచీన కాలంలో ఉండేవి. గ్రీకులు గ్రీసున అడుగుపెట్టటానికి పూర్వమే అక్కడి నాగరికత ఉచ్చస్థాయిని అందుకొని



మైసీనియన్ కళ . హెల్లెనిక్ ఉత్తర యుగమునందలి ఒక గిన్నెపైన కననగు అష్టపాది (పలాంఛనము (క్రీ. పూ 1400-1100)

అంతరించింది) మైసినీ వాసుల సమాధులు వృత్తుల పరిమాణానికి, ఈజిప్టు దేశపు సమాధుల వలెనే, పేరొందినవి. శవాలను వారు చివుకకుండ భద్రపరచటానికి జాగ్రత్తపడి, శవములపై బంగారు ఉపముఖాలను సంధించే వారు. ఆ సమాధులలో - మృతుడు బ్రతికి ఉన్న కాలంలో వాడిన - ఉపకరణములను, భోగవస్తువులను కూడ భద్రపరచేవారు ఆ సమాధులలో ఇప్పుడు ఉపలబ్ధమయ్యే నగలు, నగషీపనిగల గిన్నెలు, ఆయుధాలు, బంగారు పనిగల కత్తులు మొదలైన వాటివల్ల మినోవన్ కళయు, ఈజిప్టు కళయు తమ ప్రభావాన్ని మైసీనియాకు విస్తరింపజేసినట్లు అర్థమవుతున్నది. అమూల్యరత్న శిల్పాలు దంత శిల్పాలు కూడా అక్కడ లభించాయి.

**myrtle green** : *మూర్తహరితం.*

క్రోమ్‌హరితంలో కనపడే పలువన్నెల రకాలలో ఒకటి.

# N

**N A :** *నేషనల్ అకడమిషియన్‌కు పొడి అక్షరాల సంకేతం*

నేషనల్ అకాడమీ ఆఫ్ డిజైన్ (జాతీయ సూత్రపాత పరిషత్తు) లోని సభ్యుడికి తన పేరు చివర ఈ రెండు పొడి అక్షరాల సంకేతాన్ని అనుసంధించుకొనే అర్హత ఉంటుంది.

**Nabis :** ప్రవక్తృ వర్గం.

1892 లో వ్యవస్థితమైన, ఒక పరాసీయ కళాకార బృందం పాల్ సెరూసియెర్ (1863–1927)అనే అతడు వర్ణాన్ని, లయాన్విత రీతిని విభావనాత్మకంగా ఉపయోగిస్తూ గగూయెన్ ప్రవర్తిల్లజేసిన మార్గాన్ని పారిస్‌లోని అకాడమీ జూలియెన్‌లోని కొందరు సభ్యులు అవలంబించేట్లు చేసి అటువంటి వారిని ఈ బృందంగా వ్యవస్థీకరించాడు.

**nacarat carmine :** *నారంగ జతుసము*

ఉత్తమ స్థాయికి చెందిన ఒక రకపు జతుస వర్ణానికి, పూర్వం వాడుకలో ఉన్న పేరు.

**Naples yellow :** నేపిల్స్ పసిమి.

సీసపు ఆక్సయిడులను, యాంటిమనీ ఆక్సైడులను పుటంపెట్టడంవల్ల లభించే పాండురపు పసిమిరంగు నూనెతో చక్కగ మేళవించగల స్వభావం దీనికి ఉండటంవల్ల, ఈ రంగు కళాకారులకు ఎక్కువ అభిమాన పాత్రం కాగలిగింది. బేబిలోనియన్ నాగరికతకాలంలోనే ఈరంగు, పెంకుల పైపూతకు, పరుషపు బిళ్ళల పై పూతకు వాడబడినట్లు తెలుస్తున్నది. క్రీ శ. 14 వ శతాబ్దం నాటికే, యూరపులో దీనికి ప్రాచుర్యం ఉన్నది. ఇటాలియన్ చిత్రకారులలో ప్రముఖులైన సెన్నినో సిన్నినీ వంటి కొందరు, ఈ పసిమిరంగు, వెసూవియస్ పర్వతంలో సహజసిద్ధంగా లభిస్తుందని విశ్వసించారు. ఈ రంగును పొడిరూపంలో ఏదో కొద్ది ప్రమాణంలో, కొందరు తయారు చేస్తున్నారు కళాకారులు తమ చిత్రాలకై వాడటానికి మాత్రమే ఇది పనికి వస్తుంది. వేరేవిధంగా దీనివల్ల ఉపయోగం ఏదీ లేదు.

**narrative :** *వర్ణనాత్మక*

ఒక కథనో లేదా ఒక భావననో వివరించేది; వివరించే పద్ధతి

**natch :** నావి

పింగాణిపోతలో, దిగువ దొల్లచ్చుతో, పై దొల్లచ్చు సరిగా కుదురుకొని అతకటానికి గాను ఒక అచ్చుకు ఉండే బుడిపె ఇది రెండో అచ్చులో ఉన్న రంధ్రంలో చక్కగా ఇమిడినప్పుడు రెండచ్చులూ సరిగా అతుక్కొన్నట్లు స్పష్టం

**Natinal Academy of Design :** *జాతీయ సూత్రపాత పరిషత్తు.*

యునైటెడ్ స్టేట్సులోని ప్రధాన కళా పరిషత్తు. ఇది 1862 లో న్యూయార్కు నగరంలో వ్యవస్థితం దాని ప్రప్రథమాధ్యక్షుడు సామ్యూల్ ఫిన్‌లేబ్రీసే మోర్స్(1791–

1872) ఆధునిక కళోద్యమాలు 20 వ శతాబ్దిలో ప్రవర్తించేకాలందాకా ఈ పరిషత్తు, అమెరికన్ కళపై అత్యధిక ప్రభావం నెరపింది. ఆ తరవాత సైతం, సనాతన లేదా సాంప్రదాయిక కళామార్గాలను అనుసరించే చిత్రకారులకు, శిల్పులకు, వాస్తువిదులకు మార్గదర్శక కేంద్రంగా ఇది ఉపకరిస్తున్నది. ఈ పరిషత్తులోని సభ్యులు యన్. ఎ. అనే రోమన్‌లిపి సంకేతాక్షరాలను తమ పేరుకు చివర అనుసంధించుకోవటానికి అర్హులు.

**Nativity** : ***అవతరణ.***

క్రీస్తుదేవుని జననాన్ని తెలియజేసే చిత్రాలకు ఇది సాధారణ నామం. ఇందులో సర్వసాధారణంగా మేరీమాత, బాలక్రీస్తు, ఒక ఎద్దు, ఒక గాడిద, ఒకరో ఇద్దరో గొల్లకాపర్లు ఉంటారు. కొన్నిటిలో పీటస్నింటిని ఆవరించి ఒక దేవప్రవచనం ఉంటుంది. తరచు ఇటువంటి చిత్రాలలో 'మాగీ' అనిపించుకున్న ముగ్గురు ఋషి త్రయం సైతం చోటుచేసుకుంటారు. ఇటువంటి అవతరణ చిత్రాలలో తూర్పు, పడమర యూరపుల మధ్య కొన్ని విభేదాలు కనబడతాయి.

**natural** : ***ప్రాకృతిక; సహజ.***

**natural dyestuffs** : ***సహజ రంగద్రవ్యాలు.***

జంతువులనుంచి, వృక్షాలనుంచి తయారు చేసిన రంగు పదార్థాలు. ఆధునిక రాసాయనిక ప్రక్రియలవల్ల బొగ్గుతారు నుండి ఉత్పన్నములగు రంగుపదార్థాలకన్న ఇవి వేరైనవి. (చూ. ***synthetic organic pigments***). చిత్రలేఖనం కోసం రంగులను, గుడ్డల అద్దకం కోసం రంగులను తయారుచేయటానికి సహజ సిద్ధ వర్ణాలను వాడటం, అతి ప్రాచీన కాలం నుంచీ–ఆదిమ మానవుడు మొదలుగా – వ్యాప్తిలో ఉన్నది. ఇట్లా ప్రాచీన కాలంలో తయారైన ఇటువంటి రంగద్రవ్యాలే గాక, గ్రీసుకు, రోముకు, ప్రాచ్యదేశాలకు చెందిన పూర్వకాలపు కళాకారులు కూడ తమ ప్రజ్ఞలనుపయోగించి, వేరు వేరు తీరుల సహజ రంగ ద్రవ్యాలను వెలువరించారు. అయితే సర్జనాత్మకమైన కళారచనకు సంబంధించినంతవరకు, సహజ రంగద్రవ్యాల వాడుక ఈనాడు దాదాపుగా నామమాత్రావశిష్టమని చెప్పవచ్చు. అక్కడక్కడ కొందరు మాత్రం కొన్ని ప్రత్యేక లక్ష్యాల కోసమో, లేదా పొదుపు దృష్టితోనో ఈనాడు కూడా ఈ రంగులను వాడటం ఉంది. ఈ సహజరంగద్రవ్యాలు మన్నికలేనివి, కాంతిహీనాలున్నూ కావటం నిజమే అయినా చౌకబారు పనులకు – కాగితపు పెట్టెలపై అట్టల చిత్రణకు, ప్రకటనలపై బొమ్మలు వేయటం మొదలైన వాటికి బాగుగా సరిపడుదురగలవు.

సహజ రంగద్రవ్యాల నుంచి తయారయినవే రంజక వర్ణ ద్రవ్యాలు. ఆ రంజక వర్ణ ద్రవ్యాలు కూడా, 19 వ శతాబ్దంలో సంయోజిత వర్ణ ద్రవ్యాలు రూపొందటంతో, రంగంనుంచి చాల వరకు నిష్క్రమించాయి. ఆ తరవాత ఈ సంయోజిత వర్ణద్రవ్యాలను అధిగమించేవి కూడా వెలుగులోకి వచ్చాయి. సాంప్రదాయికంగా విపులవ్యాప్తిని ఆర్జించిన

కొన్ని సహజరంగ ద్రవ్యాల పట్టికను ఈ దిగువ పొందుపరచడం జరిగింది.

| | |
|---|---|
| అలక్నితి | (Alkanet) |
| అన్నాతం | (Annato) |
| శిలావల్కజ | (Archil) |
| శలాకదారువు | (barwood) |
| బ్రజిల్ దారువు | (Brazilwood) |
| బక్తార నీలిక | (Buckthorn berries) |
| చిరువేరు | (Chay) |
| చిటిఖ | (Cochineal) |
| కచ్ఛి | cutch) |
| ఫణిరుధిరం | (dragon's blood) |
| ప్లవిని | (flavine) |
| తింతూర | (fustic) |
| కిమ్మీరి | (Kermes) |
| భారతీ మంజిష్ఠ | (Indian madder) |
| నీలిచెట్టు | (Indigo) |
| లిత్మసం | (Litmus) |
| కఠినదారువు | (logwood) |
| లౌకపము | (lokao) |
| మంజిష్ఠ | (madder) |
| మరింద | (morinda) |
| కృష్ణపట | (quercetron) |
| సూర్యకుసుమం | (safflower) |
| కాషాయిక | (saffron) |
| పసుపుకొమ్ము | (turmeric) |
| వృథునీలిక | (turnsole) |
| తైరీయ ధూమ్రం | (tyrian purple) |
| పీతలక | (Ventilago) |
| పీతవర్త | (weld) |
| సునీలం | (woad) |

**Naturalism:** *సహజవాదం* (చూ; *realism*)

**naviform** : *నౌరూప*

పడవ ఆకారంలో ఉండేది.

**navy blue** : *నావిక నీలిమ*

**Nazarnes** : *నాజరీనులు*

కళాకారులు. కళాసాహిత్య రచయితలు చేరిఉండే 'లూకాస్ బ్రూదర్'అనే ఒక వర్గానికి ప్రతిస్పర్ధులు హేళనాత్మకంగా పెట్టిన ఒక పేరు. పై వర్గమును 1809 లో వియెన్నా నగరంలో జోహాన్ ఫ్రెడరిక్ ఓవర్‌బెక్ (1789-1869) అనే అతడు స్థాపించాడు. జర్మన్ కళను ఉన్నతస్థాయికి తీసుకొని పోవటం దాని లక్ష్యం. మధ్యయుగాలనాటి మతాసక్తిని పునరుద్ధరించి కళాభావనను. మత భావనకు ఒక పనిముట్టుగా చేయాలని అవర్గ మాసించింది ధ్యేయవస్తువును వీర రసాత్మకంగానో కనీసం కాల్పనిక రీతిలోనో చిత్రించటం తప్పని సరిఅని వారి అభిప్రాయం. అప్పుడే అది ద్రష్టకు స్ఫూర్తిని కల్పించగలదని వాళ్ళు భావించారు. ఆవర్గపు సభ్యులలో ప్రముఖులు. పీటర్‌వాన్ కార్నీలియస్ (1783-1867); కార్ల్‌బేగాస్ (1794-1854) ఫ్రాంజ్‌షోర్ 1788-1818), జూలియస్‌ష్నార్ (1795-1872). ఈ వర్గం చాలా కొద్ది కాలమే పనిచేయగలిగినా ఇంగ్లండు ఫ్రాన్సు లలోని కొందరిమీద తన ప్రభావాన్ని ప్రసరించ గలిగింది. అట్లా ప్రభావితులైన వాళ్ళ లో పురాతఫేలీయులు (*Pre-Raphaelites*) న్ను, ఇంగ్రెసూ ఉన్నారు. డసెల్‌డార్ఫ్ పాఠశాలకు కులపతిగా ఉండిన విల్‌హెల్మ్ వాన్‌షాడో పై వర్గపు భావనలను తన విద్యార్థులకు బోధించి, వారు ఆ విధంగా రచనలు

చేసేట్లు చేయగలిగారు.

**neck** : *గొంతుక; గ్రీవం.*

**needle or point** : *సూది ; సూచి.*

సూచీ ప్రక్రియలోను, సూచీ చిత్రణంలోను. ఫలకంపై రేఖలను గీయటానికి ఉపయోగించే వాడిమొన గలిగిన పరికరం. సూచీ ప్రక్రియలోని సూది లోహతలంపైనే గంటుపెట్టి సాగటం జరుగుతుంది. సూచీచిత్రణంలో అట్లాగాక దంతస భూమికలోకి మాత్రమే సూది ప్రవేశించి రేఖలను గీస్తుంది. సూచీ చిత్రణకు పనికివచ్చే సూది, చాలా రీతులలో స్వయంగా, తయారుచేసుకోవటానికి కూడా వీలయిందిగా ఉంటుంది. దీనికోసం ఉపయో



ఎంగవపు సూది

గింపబడుతూ వాడుకలో ఉండేది, రెండువైపులా సన్నటి మొనలుండే ఉక్కు కడ్డీ. దీని మధ్యభాగం మాత్రం లావుగా పిడితేలి ఉండి, దీనిపైన గరుకుగీతలుంటాయి అందువల్ల ఆ పిడిని చేతో బిగించి జారిపడిపోకుండా పట్టుకోవటానికి సౌలభ్యం ఏర్పడుతుంది. మొత్తం కడ్డీ పొడవు దాదాపు నాలుగు అంగుళాలుంటుంది కొన్ని సూదులలో మధ్యభాగం బదులుగా పెనవేసుకున్నట్లుగా కూడా ఉంటుంది. సాధారణంగా నిత్యవ్యవహారంలో సూచీచిత్రణకో వాడే సూదిని, ఒకక్కర పిడికో, లేదా బలుగు బెండుకో - సన్నటి సూది కొన పైకి ఉండేట్లు - అమర్చి రూపొందించవచ్చు. ఇటువంటి పిడులకు కొన్నింటికి మరచుట్లు ఏర్పాటు ఉంటుంది.దానిలోకి కావలసిన రకపు సూదిని అమర్చటానికీ పని ముగిసిన తరవాత దానిని సులభంగా తీసి ఇంకొకదాన్ని అమర్చటానికి వీలుంటుంది. వాడిమొన సూదిని వాడినప్పుడు, ఒక రకమైన రేఖలు ఏర్పడతాయి అట్లాగాక కొద్దిగా గుండుదేలిన మొనతోఉన్న-దానిని గ్రామోఫోను రికార్డుపై వాడే-సూదివంటిదాన్ని-వాడినప్పుడు ఇంకొకవిధమైన రేఖలు వస్తాయి ఈ రెండురకాలందాన్నే చాలా సందర్భాలలో వాడతారు. పనిచేసేటప్పుడు అకస్మాత్తుగా దీన్ని ఆపినా, భూమికకు ప్రమాదం ఉండదు. సన్నని మొనఉండేదాన్ని వాడుతూ అకస్మాత్తుగా ఆపితే లోతైన గుంటపడే ప్రమాదముంది. పోగరతో ముందుగా గీసిన గీతలను కొద్దిగా వెడల్పు చేయటానికి లేదా కొనదేలేట్లు చేయటానికి బద్దసూది (*Echoppe*) అనే పరికరం పనికొస్తుంది. సూదిమొన మొద్దుబారిపోతే దాన్ని సానరాతిపై రుద్ది మళ్ళీ వాడి చేయవచ్చు. ఎక్కువ వాడితనం ఉన్నప్పుడు ఆ మొనను గాజుపైనో, అట్టపైనో చాలాసార్లు గీసి వాడితనాన్ని తగ్గించవచ్చును. సూచీ ప్రక్రియలో రేఖలు గీయటానికి వజ్రమునిని వాడటం కూడా ఉంది

**needle-point pen** : *సూచ్యగ్రలేఖిని; సూదికొనకలం;* ( చూ : *Stylograph* )

**negative (adj)** : *వ్యస్త.*

**negative (noun)** : *వ్యస్తబింబం; వ్యస్తం.*

**negative mold** : చూ : *mould*

**neoclassical art** : *నవ్య ప్రామాణిక కళ.*

ప్రాచీన గ్రీసు, రోమన్ దేశాల కళలద్వారా ప్రభావితమైన కళా విశేషాన్ని ఈ పదంతో వ్యవహరిస్తారు.

**Neo-classicism**: ***నవ్య ప్రామాణిక వాదం.***

18వ శతాబ్ది ఉత్తరార్థంలోను, 19వ శతాబ్ది పూర్వభాగంలోను ఫ్రాన్సు దేశంలో వ్యాప్తిని పొందిన ఒక కళావాదం ఈ వాదానికి



నవ్య ప్రామాణిక వాదం
మేడమ్ డి సెర్‌వాన్ అనునామెయొక్క రూప చిత్రం; చిత్రకారుడు : జేక్విస్ లూయీ డేవిడ్ (1748-1825), కాటకపై తైలచిత్రము.

బలము చేకూర్చిన వాళ్ళలో ఒకడైన జేక్విస్ లూయీ డేవిడ్ (1748-1825) అనే చిత్రకారుడు గ్రీకుల రోమనుల నాటివైన ప్రామాణిక శైలీరీతులనేగాక, చిత్రాలకు వస్తువులను కూడ ఆ ప్రాచీనుల వాడినవే గ్రహించాడు. ఆవాదాన్ని అనుసరించిన తక్కిన చిత్రకారులు జోసెఫ్ వీన్(1716-1809), జె.ఎ.డి ఇన్‌గ్రెస్ (1780-1867) యాంటన్ రేఫేల్ మెంగ్స్ (1728-1779), శిల్పంలో ఈ వాదాన్ని అనుసరించినవాడు యాన్‌టోనియో కనోవా (1767-1822).

**neo-expressionist** ; ***నవ్యవిభావనావాది.***

ఏదో ఒక నిర్ణీత విధానానికి అనుగుణంగా ఉండే జ్యామితీయ వివిక్తతను కాదని ఉద్వేగ పూరితమైనవీ హఠాద్భావనా చోదితమైనవీ యాదృచ్ఛికమైనవీ అయిన మానసిక క్రియల వల్ల మాత్రమే నిశ్చితమయ్యే రూపాల వ్యక్తమయ్యే వివిక్త కళారీతులకు అన్నింటికీ ప్రయుక్తమయ్యే వర్ణనాత్మక విశేషణం. వివిక్త విభావనా వాదాన్ని, నవ్యవిభావనా వాదంలోనిదిగా భావించవచ్చు. కాండిన్‌స్కీ నుంచి ఈ నవ్యవిభావనా వాదం మొలకెత్తింది. దీని ప్రతికూల వాదానికి శ్రీకారం చుట్టినవాడు మాండ్రియన్.

**neo expressionism** ; ***నవ్య విభావనా వాదం.***

**neoplasticism or De stijl** : ***నవ్యశిల్పిత వాదము; నవశిల్పనా వాదము.***

వివిక్తత, సరళత ముఖ్య సూత్రాలుగా చేసుకొని వానినే అంటిపెట్టుకొన్న ఒక కళోద్యమం ఈ వాదానుయాయులు రూపాన్ని దీర్ఘచతురస్రానికీ, వర్ణాన్ని ప్రాథమికములైన ఎరుపు, నీలిమ పసుపులకూ కుదించి తమ చిత్రాలను రచించారు. ఈ ప్రక్రియ చేపట్టిన చిత్రకళాకారులు 'డి స్టిజిల్' అనే పేర ఒక ప్రఖ్యాత పత్రికను (మేగజీన్‌ను) 1917 నుంచి 1928 వరకు ప్రకటించారు. 1920లో ఈ వాదాన్ని సమర్థిస్తూ వెలువరించిన ఒక విసరణ పత్రపత్రిక 'నియోప్లాస్టిసిజమ్' దాన్నే ఈ వాదానికన్నీ పేరుగా పెట్టడం మంచిదనిపించి అందుకు దారిచూపినవాడు పీట్ మాండ్రియన్ (1872-1944). ఈ వర్గానికి చెందిన తదితర ప్రముఖ చిత్రకారులు. థియోఫాన్ దోస్‌బర్గ్

1883-1931). జార్జి వాన్‌టెన్‌గర్లూ (జ. 1886). ఈ వాదాన్నే అవలంబించిన ప్రముఖ వాస్తువిదులు జె.జె.పి. ఔడ్ (1890-1963), జెరిట్ థామస్ రీట్‌వెల్డ్ (జ. 1888) ఈ కళలో కనీసపు లక్షణాలపై



నవ్యశిల్పక వాదం
అండవృత్తాన సమతలాలు (1914), కాటికపై చిత్రణ; చిత్రకారుడు పీట్ మాండ్రియన్

అవాదావలంబకులు చూపించిన శ్రద్ధాశక్తులు గ్రాఫిక్కులపైన, పారిశ్రామిక సూత్రపాతంపైనా, సినిమాపైనేగాక చిత్ర వాస్తు విద్యలపైన కూడా ఎంతో ప్రభావం చూపినవి.

**nepheline syenite** : *మేఘ దూనరిక.*

ఒక శిలావిశేషం; మాత్రవముంతో ప్రసిద్ధంగా దీన్ని వాడతారు.

**nero antico** ; *నీరో చంద్రశిల.*

అక్కడక్కడ తెల్లమచ్చలు లేదా చార ఉండే ఒక విధమైన నల్లటి చలువరాయి. ప్రాచీన గ్రీకు, రోమక శిల్పులు ఈ శిలను తమ శిల్పాలకై ఎక్కువగా ఉపయోగించారు.

**nest saucers** : *పుటిక వర్గం.*

చిన్న పింగాణీ పళ్ళెంల సమూహం; ఈ పళ్ళేలు నీటిరంగులను, సిరాలను కలుపుకోవటానికి ఒక దానిలో ఇంకొకదాన్ని కలపటానికి కళాకారులకు పనికివస్తాయి

**Neue sachlichkeit or New Objectivity** :

*నవ్య స్వానుభవవాదం.*

విథాపనా కళయొక్క ఒక ప్రత్యేక రీతి. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం ఆటోడిక్స్ (జ. 1891), జార్జ్ గ్రోష్ (1893-1959) మొదలైన కొందరు ప్రముఖ కళాకారులు ఈ విధమైన కళను వ్యాప్తిలోనికి తెచ్చారు. సాధారణ దృశ్య పరిశీలనా స్థాయిని అతిక్రమించి స్పష్టమూ నిర్దుష్టమూ అయిన సాంకేతికరీతిని ప్రతిరూపచిత్రణలో ప్రవేశపెట్టాలని ఈ వాదావలంబకులు పట్టుదల వహించారు. తక్కిన రీతుల విథాపనా కళలలో కనబడని సాంఘిక,రాజకీయవిషయవిమర్శ, వ్యంగ్యంగా దీనిలో ఉండటమేకాక కళాకారుని భావోద్వేగానికి కూడా దీనిలో అవకాశం ఉంది.

**neutral colour** : *తటస్థ వర్ణం.*

కవోష్ణమూ, శీతలమూగాని వర్ణం. అంటే అందులో ఎరుపుకుగాని నీలిమకుగాని ఆధిపత్యం ఉండదు. మధ్యస్థాయికి చెందిన దూసర వర్ణములూ, గోధుమ వర్ణాలూ సాధారణంగా తటస్థ వర్ణాలు అనిపించుకుంటాయి.

(చిత్రం తర్వాత పేజీలో చూడుడు)



సర్వస్వానుభవవాదం వీధి దృశ్యం ఒక చిత్ర సంకలనం నుండి తీసిన శిలాముద్రణ;
చిత్రకారుడు . జార్జి గ్రోస్జ్.

**neutral tint** : **తటస్థవర్ణం.**

1. ఊదారంగు లేక నీలలోహితపు ఛాయ ఉండే విధంగా తయారు చేసిన నీటి రంగు

2. ఇండియా సిరా. తలోసియానిన్ నీలిమ. అలిజారిన్ శోణిమలను కలిపి తయారు చేసిన ఒక సమ్మిశ్రిత వర్ణద్రవ్యం.

**newsprint** : **వార్తాపత్రం; న్యూస్ ప్రింట్; వార్తాంశం.**

వార్తాపత్రికలు ముద్రించటానికి సాధారణంగా వాడే ఒక విధపు కాగితం ఇది చాలా తక్కువ ఖరీదుకు లభిస్తుంది. కొయ్య గుజ్జునుంచి దీన్ని తయారు చేస్తారు ఆ పత్రం విడివిడిగా 24 × 36 అంగుళాల విస్తృతిలోను, బొత్తుల రూపంగా 18 × 24 అంగుళాల విస్తృతిలోను, చుట్టల రూపంగా 48 అంగుళాల వెడల్పుగానూ లభిస్తుంది బొగ్గు, మెత్తని సీసపు పెన్సిల్, శిలాఖనిజాలలో దేనితోనైనా దీనిపై చక్కగా వ్రాయవచ్చు. అందువల్ల కళా విద్యాలయాలలో శిక్షణపొందే విద్యార్థులకు తోచినప్పుడల్లా గుర్తుగా పొందులేఖనాలు రచించుకోవటానికిన్నీ, ప్రాథమిక ఆలేఖనాలు గీయటానికిన్నీ ఇది ఉపకరిస్తుంది. కొద్దికాలంలోనే ఈ వార్తాపత్రం రంగు మాసి గోధుమరంగుగా పరిణమించుటయే గాక పెళుసెక్కుతుంది. కాబట్టి శాశ్వతంగా మనవలసిన రచనకు ఇది పనికిరాదు.

**Newyork school** : *న్యూయార్క్ కళా కార వర్గం; న్యూయార్క్ సంప్రదాయం.*

వివిక్త విభావనావాదాన్ని సృష్టించినదిగా ప్రపంచఖ్యాతిని ఆర్జించిన ఒక చిత్రకార బృందానికి పేరు. వారికి ముఖ్యకేంద్రం న్యూయార్క్ నగరం కావటంవల్ల దానికి ఆ పేరు వచ్చింది. ద్వితీయ ప్రపంచయుద్ధం ముగిసిన తరవాత, ఒక దశాబ్దంలోపున వీరు ఈవివిక్త విభావనా వాదాన్ని రూపొందించారు

**nib** : *పాళీ; మునికి.*

**niche** : *విగ్రహకోష్ఠం; విటంకం; గోడగూడు.*

**niello** : *కృష్ణగంధకం.*

ఒక నల్లని లోహయౌగికం: ఇందులో గంధకంతో పాటుగా వెండి, రాగి, సీసాల మిశ్రణం కూడా చేరి ఉంటుంది. బంగారం, వెండి, రాగి మొదలైన లోహాలలో పొగర వసివల్ల రూపొందించిన ఆకృతులను అలంకరించటానికి దీన్ని వాడతారు.

**niello prints** : *కృష్ణనీల ముద్రాంకాలు.*

ఒక ప్రత్యేక పద్ధతిలో రూపొందించే ముద్రాంకాలు. ఆలంకారిక ప్రయోజనాలకై వినియుక్తమయ్యే లోహమిశ్రమాలతో సంయోజితమైన ఒకనల్లనిపదార్థంచే అవృతాలైన అధిలేఖిత రేఖాంకనాలుగల ఫలకాల ముద్రణవల్ల రూపితములయ్యే ముద్రాంకాలివి.

**nigged** : *విరచితం*

రాతిని శిల్పంగా మలచటంలో ఉలికి బదులుగా వాడిసుత్తిని (*pick*) ని ఉపయోగించి చక్కబరచినది.

**nimbus or halo** : *దీప్తిమండలం; ప్రభావళి.*

ఒక దివ్యమూర్తియొక్క ప్రతిరూపంలో శిరస్సుచుట్టూ, ఆమూర్తి యొక్క తేజోవైభవాలను లేదా ఆ మూర్తిపట్ల ఉండే ఆదరణను సూచించటానికిగాను చిత్రించే కాంతిరాశి. క్రైస్తవ ఋషులు, పాత నిబంధనలో ప్రసక్తులైన పురాణ పురుషులు దేవదూతలు, ప్రాచీన గ్రీకులు, రోమనులూ అర్చించిన దేవతలు, బౌద్ధమతానికి చెందిన బుద్ధ, బోధిసత్వ మూర్తులు మొదలైనవారి ప్రతిరూపముల శిర్సాలచుట్టూ ఈ దీప్తి మండలాలు కనపడతాయి ఈ దీప్తి మండలాలు సాధారణంగా వృత్తరూపాలుగానే ఉంటాయి అయినా అక్కడక్కడ షట్కోణకాలు, అండాకృతి కములా కూడా కనపడుతుంటాయి. వీటినుంచి కిరణాలు వెలువడుతున్నట్లు కూడా కొన్నింటిలో కనపడుతుంది. జీవించివున్న ఒక మానవుడి రూపాన్ని చిత్రించినప్పుడు, ఆ చిత్రపు శీర్షం చుట్టున్నూ చతురస్రపు మండలమును గౌరవ సూచకంగా లిఖించటం కూడా ఉంది క్రీ.శ. 6వ శతాబ్దికి తరవాత రూపొందించిన క్రీస్తు ప్రతిరూపాలన్నింటిలో ఇటువంటి మండలంలో ఒక సిలువ చిహ్నాన్ని కూడా చేర్చటం సాధారణంగా చూస్తాం.

దీప్తి మండలానికే పరివేషం (*Aureole*) అనే పర్యాయనామం కూడా ఉంది. కాని యథార్థానికి ఒక పుణ్య పురుషుని రూపచిత్రంలో మొత్తం మూర్తినంతటినీ చుట్టిఉండే కాంతి మండలాన్నే పరివేషం అనటం సముచితం.

**nitrate green** : ***నత్రిత హరితం***

క్రోమ్ హరితంలో ఒక రకానికి చెందింది; సాధారణంగా శీతలంగానో లేదా నీలివారి గానో ఉండే అధస్థాయిని ఇది కలిగి ఉంటుంది.

**nobility** : ***ఉదాత్తత.***

**noir belge** : ***నల్ల బెల్జీ.***

బెల్జియన్ చంద్రశిలగా పిలువబడే చలవ రాయికి పర్యాయపదం.

**noncreep or non-crawl** : ***క్లేదకం.***

రంగు చక్కగా, సమస్థాయిలో కాగితంపై పాకటానికి సహకరించే ద్రవ విశేషం. దీన్నే ఇంగ్లీషులో 'వెట్టింగ్ ఏజంట్ (*wetting agent*) అంటారు. ఈ క్లేదకం బజారులో అమ్మకానికి దొరుకుతుంది.

**non-drying oil** : **చెమ్మనూనె; *క్లేదతైలం.***

ఒక విధమైన వనస్పతి తైలం. చాలా కాలము గాలిదెబ్బకు లోనైనప్పటికి గట్టిపొర యేర్పడకుండా ఉండటం దీనిలోని విశిష్టత. శోషణిని కలిపినప్పటికీ, ఈతైలం ఎండిపోదు. ఇట్టి చెమ్మనూనెగా పనికివచ్చే వానిలో ఒకటి ఆముదం.

**nongreasy** : ***వసారహిత.***

**non-objective** : ***విషయాతీత; విషయరహిత; వస్తురహిత.***

ఒక వస్తువు, ఒక రూపం, ప్రకృతి సిద్ధమైన ఒక ద్రవ్యం - వీటిలో దేనికీ ప్రతిరూపంగా కాకుండా – ప్రాతినిధ్యరహితంగా సాగిన కళారచనకు విశేషణం. *super–m•tism* (పారమ్యవాదమునకు) ఇంకో పేరే విషయాతీత వాదం (*nonobjectivism*) ఈ సూపర్‌మాటిజమ్ అనే పేరు మొదటి సారిగా ఉపయోగించిన వ్యక్తి అలెగ్జాండర్ రాడ్‌చెంకో.

**non-representational**: ***ప్రతికల్పనేతర.***

**nonvolatile** : ***అనుత్పత.***

**normal butanol** : ***సహజ ఉదకర్బని.***

ఒక బాష్పశీల కర్బనిక ద్రవపదార్థం. మాయిలక్క రంగులలో తరళకారిగానో లేదా విరళకారిగానో దీన్ని ఉపయోగిస్తారు.

**note** : ***ఉద్దేశ పత్రం; ఉద్దేశిక.***

తెలుపు - నలుపులలోగాని, వర్ణంలోగాని, జీవితాన్ని లేదా ప్రకృతిని అనుసరించి - రూపొందించే ఒక విధమైన పాండులేఖనం. తరవాత శిల్పకాలలో, రచనను రూపొందించేటప్పుడు క్రమంగా ఆయాచోట్ల కావలసిన వివరాలను తెలుసుకోవటానికి, ఈ ఉద్దేశ పత్రం సహకరిస్తుంది. ఇటువంటి ఉద్దేశ పత్రంలో ఆ రచనకు సంబంధించిన అన్ని వివరాలు ఉండటమే కాక, ఆ రచనా కార్యక్రమంలో చేర్చవలసినదిగా హఠాత్తుగా స్ఫురించిన విషయాలు కూడా చేర్చటం జరుగుతుంది వాడవలసిన రంగులు, చూపించవలసిన రేఖాకృతులు, వెలుగు నీడలు, గాలి కదలికల పరిణామాలు - మొదలైనవి కూడా ఇందులో నిర్దిష్టాలై ఉంటాయి. కాబట్టి, రచన చేస్తున్న సందర్భంలో ఆయా విషయాలు మరచిపోకుండా ఈ పత్రం చేస్తుంది.

**Nothingham white :** *నాటింగాం శ్వేతం.*

19 వ శతాబ్దిలో ఒక వర్ణద్రవ్యంగా ఇంగ్లండులో వాడుకలో ఉన్న తెల్ల సీసానికి ఒకనాటి పర్యాయపదం.

**nonvolatile :** *అబాష్పశీలం.*

**nouveau :** *నవ్యఛాత్రుడు.*

కళా శిక్షణకై కొత్తగా చేరిన అకుశలుడైన విద్యార్థి. *Nouveau* అనేది ఫ్రెంచి భాషా పదం.

**nouveau realism :** *నవ్యవాస్తవికతా వాదం.*

జనాదృత (పాప్) కళకు పర్యాయరూపంగా 1950 ల తొలిఘట్టంలో పారిస్ లో ఫ్రెంచి వారి చేత ప్రవర్తితమైన ఒక వాదం.

**nude :** *దిగంబర; నగ్న*

**Nu film :** (చూ. *fi'm-stencil method*)

**Nurenburg violet :** *నూరెంబర్గ్ రాజనీలం.*

మాంగనీజ్ రాజనీలానికి పర్యాయనామం

**nylon brush :** *నైలాన్ తూలిక.*

(చూడు, తూలిక, అక్రిలీయ - *bruskh, acrylic*)

# O

**Oak tag :** *ఓకు అట్ట*

ఒక విధమైన గట్టి, మందపు అట్ట. అరుగు తరుగులకు చక్కగా నిలిచి ఉండగలదు, తైజసములకూ తేలికపాటి సమారోపములకు దీన్ని వాడతారు. అయినా అతిదీర్ఘ కాలం మనవలసిన కళాఖండాలకు ఇది పనికి రాదు

**objective :** *విషయగత; వస్తుగత; విషయాశ్రయ.*

**object d' art :** *కళాభాజనం.*

వస్తువులోని సౌందర్యసంబంధగుణవిశేషాలను మించి అంతర్గతార్థ సంపత్తిని ప్రదర్శించగలిగే కళారచన. ఆబ్జెక్ట్ డి ఆర్ట్ అనేది ఫ్రెంచి భాషాపదం అమూల్యములూ, అలంకారికములూ అయిన కళావస్తువులను, అన్ని రకాల వాటిని ఈ పేరుతో తెలియజేయవచ్చు. అయినా మ్యూజియములలో ఉండే వాటికి ఈ పదాన్ని అంతగా వాడరు. వ్యక్తులు సేకరించి, భద్రపరచి ఉంచే, వనితసపు పింగాణీ వస్తువులు, చక్కటి లోహ రచనలు, చిత్రమండనాలు, అపురూప వస్తువులవంటి చిన్నకళావస్తువులనే ఈ పేరుతో ఎక్కువగా వ్యవహరిస్తారు.

**objective art :** *వస్తుకళ.*

గుర్తించ దగిన వస్తువును దేనినైనా విషయంగా గ్రహించి రూపొందించిన కళావిశే

షం. విషయాతీత కళ లేదా వివిక్తకళ ప్రాదుర్భావం చెందిన తరువాతనే ఈ "వస్తుకళ" అనేపేరు వ్యవహారంలోకి వచ్చింది. గుహాచిత్రాలు మొదలుగా నేటి విభావనా వాదుల రచనలవరకున్నూ గల వివిధ సంప్రదాయాలకూ, వివిధ కాలాలకూ చెందిన ప్రాతినిధ్య కళకే ఈ "వస్తుకళ" అనే పేరు వినియోగిస్తున్నారు

**objet trouve** :(చూ : *found object*)

**oblique** : *వామక; వాలు; కుటిల; తిర్యగ్గతిక*

ఎడమవైపుకు కొద్దిగా వాలిఉండే అక్షర ముద్రాశైలిని తెలిపే విశేషణం; పలవలి లేదా దక్షిణక (*Italic*) అనే దానికి ఇది వ్యతిరేకం.

**obliquely** *అసమకోణమున.*

**oblique perspective** : *వామకదృష్టి ప్రక్రమగతి; వామక దృగ్గతి; తిర్యక్ దృష్టి ప్రక్రమత.*

ఒక విధమైన రేఖాదృష్టి ప్రక్రమగతి. దీర్ఘచతురస్రక ఘన వస్తువును-చిత్రతలానికి సమాంతరంగావాటిలో ఏవీయూ ఉండనిరీతిలో- ఆ వస్తువు మూడు ముఖాలను ప్రదర్శించటానికి వీలయ్యేట్లు కుదిర్చినప్పుడు ఏర్పడే రేఖా దృష్టి ప్రక్రమగతి. అప్పుడు అట్లా ప్రదర్శితములయ్యే మూడు ముఖభాగాలూ చిత్రతలం నుంచి, కోణీయ గతులతో క్రమంగా తిరోగమిస్తున్నట్లు కనపడతాయి (చక్రవాళ రేఖతో పోల్చిచూచినప్పుడు ఆ ఘనవస్తువు ఉండే ఉనికిని బట్టీ, ఆ వస్తువు చిత్రతలంతో తిర్చిఉండే కోణాన్ని బట్టీ ఆ గతుల కోణాలు సమానాలుగా ఉండడం లేదా వేరువేరుగా ఉండటం అనేది సంభవిస్తుంది.) ఇటువంటి దృష్టి ప్రక్రమగతిలో ఆ మూడు ముఖతల భాగాల నిర్వాచక రేఖలున్నూ ప్రతిదానిలోని సమాంతరరేఖల బృందం, వరకూ ఒక్కొక్క తిరోహిత బిందువును ఏర్పరచుకోవటంవల్ల మొత్తంమీద మూడు తిరోహితబిందువులు ఏర్పడతాయి ఈ విధంగా ఇటువంటి బిందువులు మూడు ఉండటంవల్లనే దీన్ని త్రిబిందుక దృష్టి ప్రక్రమగతి అనికూడా అందురు. (చూ : *parallel perspective; angular perspective linear persqective* వాని దగ్గర చిత్రాలు.)

**oblique projection** : *వామక ప్రక్షేపకం.*

యాంత్రికాలేఖనంలో వాడుకలో ఉండే ఒక విధమైన ప్రక్షేపకం. వస్తువులోని అక్షాలలో రెండుమాత్రం చిత్రతలానికి సమాంతరంగా ఉన్నట్లు ఇందులో ప్రదర్శితాలవుతాయి ఇందువల్ల వస్తువు రూపభ్రంశం చెందకుండా ఉండేట్లు ఆలేఖనాన్ని ప్రదర్శించటానికి సౌలభ్యం ఉంటుంది అంటే దీర్ఘచతురస్రక ఘనవస్తువే అయినా దానిముఖం నాలుగు సమకోణాల (90°)ను కలిగిఉన్నట్లుగానే ఇందులో చూపే వీలుంటుంది అయితే మూడో అక్షాన్ని ఇట్లా చూపటానికి వీలుండదు. కాబట్టి దాన్ని కోరిన కోణంలో అమరి ఉండేట్లుగీసి. దానిలోని క్షయవృద్ధిని, కావలసినరీతిగా, అమర్చడం జరుగుతుంది.

కాని ఈ మూడో అక్షాన్ని కోరుకున్న రీతిలో గాకుండా 45° లలో అమర్చి తక్కిన రెండు అక్షాలను గీచిన నియతి (*scale*)

లోనే గీసినప్పుడు అటువంటి దానిని ప్లవ ప్రక్షేపం (*cavalier projection*) అంటారు. (చూ : *projection* అనేపదం వద్ద ఉన్న పటం).

**obliterated** : *వివర్ణ.*

**observation** : *పరిశీలన.*

**obsolete** : *అప్రచుర.*

**obverse**[1] : *పురస్తలం.*

1. రెండు తలాలు కలిగి-నాణెం, పతకం, రాజముద్ర, రెండు వైపుల చిత్రాలు కలిగిన ఫలకంవలె - ఉండే వస్తువులో ముఖ్యాంకనాన్ని కలిగి ఉండే తలం. దీనికి వెనుక ఉండే తలాన్ని తిరస్తలం (*Reverse*) అని వ్యవహరిస్తారు

**obverse2** : *విపర్యయ.*

భూమిభాగం కన్నా కొనభాగం ఎక్కువగా లావుదేలి ఉండే - ఇల్లు వంటి - దాని రూప విశేషణంగావాడే పదం.

**Oceanic art** : *సాగరిక కళ.*

సాగరఖండంలో - అంటే న్యూగినీ, న్యూజిలాండ్‌లతో సహా ఉత్తరాన హవాయీ, సాండ్‌విచ్ ద్వీపాలకూ, తూర్పున ఈస్టర్ దీవులకూ వ్యాపించిన దక్షిణ పసిఫిక్ ద్వీప సముదాయంలో వర్ధిల్లే కళావిశేషం.

**ochre** : *గైరికం; ధాతురాగం.*

మట్టిరంగులను - పచ్చగైరికం, ఎరుపు గైరికాలను - తయారు చేయటానికి ఉపయోగించే మృత్తికలకు సాధారణ నామం. పింగాణి పనులలో అలివేణిమన్ను (**slip**) గాను, మెరుగు మన్ను (**glaze**) గాను, దీన్ని వాడవచ్చు. వర్ణద్రవ్య పరిభాషలో 'గైరికం' అనే దానిని వన్యగైరికానికి పర్యాయపదంగా తరచు ఉపయోగిస్తారు.

**odalique** : *రాజగణిక.*

ప్రాచ్య, ముస్లిం రాజ్యాలలో, ముఖ్యంగా టర్కీదేశంలో పాలకుడి భోగాసక్తై, అంతఃపురంలో ఉండే క్రీతదాసి.

19 వ శతాబ్ది కళాకారులలో, చాలా మంది ఆలేఖ్య వస్తువుగా ఈ విషయాన్ని ఎక్కువగా అభిమానించారు. ఈ రాజగణిక నగ్నావస్థలోనో లేదా, అర్ధనగ్నంగానో ఒరిగి పడుకొన్నట్లు చిత్రించటం జరిగేది. ఇటువంటి రాజగణికా చిత్రాలను ఎక్కువగా జీన్ ఇంగ్రెస్, మాటిస్సే రచించారు.



రాజగణిక. చిత్రలేఖకుడు - జీన్ అగస్టి డామినిక్ ఇంగ్రెస్ (1780-1867)

**odorant** : *గంధిక.*

సువాసనాభరితమైన ఒక తైలవిశేషం. నీటి వర్ణాలను, ఇతర సమ్మిశ్రిత వర్ణాలను, రూపొందించేటప్పుడు వాటిలోని కొన్ని ద్రవ్యాలవల్ల కలిగే దుర్వాసనలు లేకుండా చేయటానికి దీన్ని వాడతారు. అటువంటి

రంగులను ఖారీ ఎత్తున తయారు చేసేటప్పుడు సువాసన ఏకరీతిగా ఉండేట్లు చేయటానికి కూడా దీన్ని వాడతారు పుష్పాలనుంచి తయారయ్యే మృదుమధుర వాసనగల నూనెకన్నా కూడా 'స్వచ్ఛములు సరళములు' అని సాంప్రదాయికంగా పేరొందిన సస్సాఫ్రాస్ (ఒక రకపు అమెరికన్ వృక్షపు బెరడు), దేవదారువు, నిమ్మవంటివే ఇటువంటి గంధికలుగా ఎక్కువ అర్హమైనవి

**oenochoe or oinochoe** : *సుగ్రీవకం*

మెడవద్ద పిడిఉండే ఒక విధమైన యవన మధుకలశం. దాదాపుగా ఈ విధంగానే ఉండి, అడుగుభాగం మాత్రం అంతగా కొనదేలక కుదిమట్టంగా ఉండేవి. స్థాలిక (*olpe*) పురాగ్రీసులో ద్రాక్షసారాయాల సమ్మిశ్రణాన్ని తయారు చేయటానికి ఆయా సారాయాలను పోయటానికి పైరెండు పాత్రలూ ఉపయోగించేవారు

**offscape; offskip** : *ఉపక్షితిజం.*

ప్రకృతి దృశ్యంలో అతిదూరంలో కనపడే ప్రదేశం ఆఫ్‌స్కేప్, ఆఫ్‌స్కిప్ అనే పదాలు ప్రస్తుతం అంతగా వాడుకలో లేవు. (చూ : *lointains*)

**offset** : *అధ్యాస్తం; ఆఫ్ సెట్.*

ఒక విధపు ముద్రణరీతి ఒక గ్లాసు లేదా ఫలకం లేదా రాతిపైన సిరాపూసి ఏర్పరచిన అంకనాన్ని ఇంకొక ఉపరితలానికి మార్చి, ఆ ఉపరితలాన్నే ఆధారంగా గ్రహించి యథాతథమైన రుజుప్రతులను అందుకోంచి తీయటం ఈ ప్రక్రియలో జరుగుతుంది. శిలాలేఖనపు పరివర్తనలో జరిగేదాన్ని ఇందుకు ఉదాహరణంగా వరిగణించవచ్చు. అందులో సిరాపూసిన రాతిపై, పెద్ద వ్యాసం గల రబ్బరు రోలరును తిప్పినపుడు అది అంకనాన్ని గ్రహించి, తరవాత కాగితంపైకి దానిని పరివర్తన చేస్తుంది. రాతిపై లేఖనాన్ని తిరస్తం రీతిలో (అంటే త్రిప్పివేయబడిన రీతిలో) వ్రాసే అసౌకర్యం ఈ పరివర్తన పద్ధతిలో ఉండదు. ఈ పద్ధతిలో శిలపై యథారీతిలో వ్రాసినది, పరివర్తనకై వాడే రోలరుమీద వ్యత్యస్తమై మళ్ళా కాగితంపై పరివర్తన చెందేటప్పుడు యథారీతిగా పరిణమిస్తుంది. వాణిజ్య ప్రకటనలకు ఉపయుక్తమయ్యే శిలాలేఖనాలకై ఈ పరివర్తన ప్రక్రియను ఎక్కువగా వాడతారు. ఈ ప్రక్రియకు తగిన సాధనాలను కలిగిన కళాకారుడు తాను తొలుత శిలపై లిఖించిన దానికి అచ్చంగా అన్ని విధాల సరిపడే రుజుప్రతులను పొందటం సాధ్యమవుతుంది.

**ogee** : *అవగ్రహకం*

వాస్తుశిల్ప విషయకమైన ఒక పారిభాషిక పదం. దేవనాగరిలిపి లాలూకు అవగ్రహం లేదా రోమన్ లిపి సంబంధి '*s*' లాగా తీర్చిదిద్దే రూప విశేషం. దీనికే ఆంగ్లంలో సైమా (*cyma*) అనే పేరుకూడ ఉంది. అయితే అది సామాన్యంగా స్తంభ మకుటాలపై కనపడుతుంది.

**ogive** . *కోణకం.*

వాస్తుశాస్త్రంలోని ఒక పారిభాషిక పదం కమాను, తోరణం లేదా కిటికీ అనే వాటిలో దేనినైన పైకి కొనదేలినట్లు చేసినప్పుడు ఈ రూపం సిద్ధిస్తుంది.

**oil:** (చూ ***boiled linseed oil, cold pressed oil, drying oil, non-drying oil***)

**oil black ;** తైలమషి

దీపమషికి పర్యాయనామం; అయినా దీనికి వాడుక అంతగా లేదు.

**oil colours :** తైలవర్ణాలు; నూనెరంగులు.

అవిసెనూనెలోనో, లేదా వేరొక శోషక వనస్పతి తైలంలోనో, వర్ణద్రవ్యాలను కరిగించి, మెత్తని పిండిలాగ తయారుచేసి, కళాకారులు ఉపయోగించే రంగులు. ఇందులో చేర్చే వర్ణద్రవ్యం తైలంలోని శోషకశక్తిని తగ్గించే స్వభావాన్ని కలిగి ఉన్నప్పుడు, అటువంటి రంగులో అదనంగా ఒక శోషణిని చేర్చటంకూడా ఉంది. అట్లా తయారయ్యే రంగులు అన్నిటికీ ఒకే తీరున నవనీత సుస్థిరతను చేకూర్చటాని కోసం ఈ రంగులలో ఏదైనా ఒక స్థిరీకర ణిని, కల్పనికను- అల్యూమినియం స్టీరేటు లాగా మైనంలాగా ఉండేదాన్నిగాని, అచ్చమైన మైనాన్ని గాని కలపటం జరుగుతుంది. ఏదైనా ఒక మాధ్యమాన్ని కూడా వాడి, ఆ రంగుల వాడకంలో కావలసిన అదుపుకోసం కూడా చిత్రకారుడు దీనిలో కృషి చేయవచ్చు. ఏదిఏట్లా ఉన్నా దాదాపుగా సర్వ సాధారణంగా ఇటువంటి రంగులలో కర్పూరతైలం వంటి పలచని (*thinner*) ని వాడటం మాత్రం జరుగుతుంది. కుంచెతోగాని, రంగు కత్తిగాని ఈ రంగులను పాటికపై వర్తించ టానికి తరచుగా వాడతారు. అవిసెగింజ లను వేయించకుండా గానుగలో ఆడించి తీసిన నూనెను ఈ తైలవర్ణాల తయారీలో పూర్వకాలంలో వాడేవాళ్ళు కాని ఇప్పుడటు వంటి వాటిని వాడడం లేదు. అయినా నేటి వర్ణద్రవ్య ప్రమాణాలను బట్టి తయారుచేసే ఆధునిక తైలాలు, పూర్వపు వాటికన్నా చాలా శ్రేష్ఠమైనవి. కళాకారులు, ఇప్పటి రోజుల్లో కూడా, పాత్రాన్ని, చదునురాయిని ఉపయోగించి తమకు కావలసిన నూనె రంగు లను తాము తయారుచేసుకోవచ్చునుగాని, నేటి ఆధునిక యంత్రాలవల్ల తయారయ్యేవి వాటికన్నా శ్రేష్ఠతరంగా ఉంటాయి. ఈ కాలంలో బజారులలో, కళాకారులకోసం తైలవర్ణాలను సంకోచ్య నాళికలలో విక్రయి స్తున్నారు.

అయిదు శతాబ్దాలనుంచి కూడా పాశ్చాత్య చిత్రణ ప్రక్రియలో తైలవర్ణ చిత్రణమే ప్రామాణికంగా ప్రముఖంగా పరిగణన పొం దింది. తైలవర్ణాలు ఈ విధంగా ఎక్కువ మన్ననను సముపార్జించటానికి ఆ సాంకేతిక రీతిలో ఉండే వైవిధ్యం, రంగు ఆరిపోయిన తరవాత కూడా ఎటువంటి రంగుమార్పు లేకపోవటం, వివిధ వర్ణాలను వివిధస్థాయీభేదా లలో చిత్రించటానికి ఇందులో గల సౌలభ్యం, ఒకే చిత్రంలో కాంతి భేద్యతతో పాటుగా పారదర్శకతను, రేఖాగతములతో పాటుగా స్థాయీగత ప్రదేశాలను ప్రదర్శించటంలో ఇందులో ఉండే స్వేచ్ఛ, విస్తృతవు ఎత్తున చిత్రణ సాగటానికి అనువుగా కాలిక బరువు లేకుండా ఉండటం, కావలసిన ద్రవ్యాలు అన్ని చోట్లా లభించేవి కావటం-ముఖ్య కార ణాలు. నీటి వర్ణాలనువేసి ఆరనిస్తే అవి రంగు మార్పును పొందుతాయనేది ఇక్కడ గుర్తుంచు కోవాల్సిన విషయం. తైలవర్ణ చిత్రణలో కూడా నెరియవిచ్చటం, వివర్ణత ఏర్పడటం,

నల్లబడటం అనే దోషాలు ఉంటాయనటం నిజమే అయినా కావలసిన ద్రవ్య విశేషాలను జాగ్రత్తగా సేకరించుకొని రంగును కుశలతతో వాడే పక్షంలో ఈ దోషాలు లేకుండా చేయవచ్చు (చూ. *Oil painting, development of; process oil colours*)

**oil green** : *తైలహరితం.*

క్రోమ్ హరితానికిన్నీ, బ్రెమెన్ నీలిమలో ఆకుపచ్చని రకాలకున్నూ ఉపయోగించే ఒక అప్రామాణిక పదం.

**oiling out** : *వితైలీకరణం.*

వార్నిషును పైన వాడటంవల్ల చిత్రోపరితలంలో వచ్చే మిలమిలలాడే తీరుకు బదులుగా అవిసెనూనెనే వాడి పైన బాగా రుద్దటంవల్ల చిత్రంలో రమణీయమైన మంద శోభను ప్రదర్శింపచేయటానికై జరిగే కృషి. పైన ఇట్లా వాడిన నూనెను తుడిచివేసిన తరువాత, అదనంగా ఉన్నదని అనిపించే దాన్ని కూడా తొలగించి, మెత్తని పీల్చుగుడ్డ (ఒత్తాయి) తో ఉపరితలానికి మిసిమి (*polish*) తెస్తారు. కాని ఈ కాలంవాళ్ళు వార్నిషు పట్టించటానికి బదులుగా ఈ వితైలీకరణను అవలంబించటం సమంజసం కాదంటున్నారు. ఇట్లా వితైలీకరణకు లోనైన చిత్రాలలో కాలక్రమేణ పసుపువాళ్ళ గోధుమ రేఖలు, చిత్రంలో తక్కువ వర్ణతకల ప్రాంతాలలో, ఏర్పడటం జరుగుతున్నది. రోజులు గడిచేకొద్ది తైలం వివర్ణత చెందటంవల్లనే ఇటువంటిది సంభవిస్తుంది.

**oil in water emulsion** : *జలస్థ తైల దుగ్ధకం.*

**oil length** : *తైల నిష్పత్తి.*

ఒక నూనెవార్నిషులో యిష్టధూపంతో దానిలోని తైలానికి ఉండే నిష్పత్తి.

**oil of cloves** : *లవంగ తైలం.*

ఇది ఒక విధమైన ఆమోదతైలం; తైలం వర్ణాల శోషణను త్వరితంగా కాకుండా, మెల్లగ జరిగేట్లు చేసే ప్రామాణిక రోధకం. నీటి రంగులలో రంగులు విడిపోకుండా ఉండటానికి, వాటి దుర్వాసన పోయి సువాసన కలగటానికి దీన్ని వాడుతున్నారు. ఆధునిక కాలపు సముపచిత గోపకము (*Concentrated preservative*) ల మాదిరిగా సమర్థం కాకపోయినా, ఈ లవంగ తైలం సౌమ్యమైన నిస్సంసర్గికయే అని చెప్పవచ్చు; కొన్ని నీటి బంధకాల దుర్వాసనను మరుగుపరచేందుకు ఇది ఉపయోగపడుతున్నది.

**oil of lavender** : *లావేంద్ర తైలం.*

సువాసనా తైలాలలో వాడుకలో ఉండే ఒక రకమైన ఆమోద తైలం. తైల చిత్రణలో రోధకంగా దీన్ని కొందరు ఉపయోగిస్తారు.

**oil of turpentine** : *కర్పూర తైలసారం.*

కర్పూర తైలానికి కర్పూర శీధువుకూ పూర్వపు పేరు; ఇది ఇప్పుడు అంతగా వాడుకలో లేదు.

**oil paint** : తైలవర్ణలేపం; నూనెపూత రంగు.

**oil painting, development of** : తైలవర్ణ చిత్రణ, వికాసం

తైలవర్ణ చిత్రణ అనేది, ఆకస్మికంగా ఒకనాడు రూపొందిన ఆవిష్కరణ కాదు; 15, 16 వ శతాబ్దాలలో, దాదాపు 100 సంవత్సరాలకు పైబడిన కాలంలో ఒక క్రమ రీతిలో అభివృద్ధి సాధించిన ప్రక్రియ ఇది. ఈ కృషిలో చాలామంది కళాకారులు పాల్గొన్నారు నానాటికీ మారుతున్న కాలగతి వల్ల, కాలంవల్ల ఉత్పన్నమైన సమస్యలను పరిష్కరించటానికి అనువుగా ఒక ప్రక్రియను రూపొందించటానికి ఆ కళాకారులు క్రమంగా సాగించిన సమష్టి కృషికి ఫలితంగా తైలవర్ణ చిత్రణ అభివృద్ధి చెందింది. 14వ శతాబ్దిలో యూరపులో వాడుకలో ఉండిన సారణిచిత్రణకు, అప్పటిలో గుడ్డు - జిగురు రంగులు సరిపోయినవి. కాని ఆ తరువాత పరిస్థితులు మారిపోయినాయి. కొత్త భావాలు, కొత్త ఆశయాలు బయలుదేరటమేగాక, కళా రూపాలను వృథులతలో చిత్రించే ఆవశ్యకత కూడా కలిగింది. భక్తిసంబంధములైన ప్రలంబణాలు ఆనాటి అవసరాలకు సరిపోక పోవటం కూడా తటస్థించింది. చిత్రరచనను, వ్యాపారవృత్తులకై వినియోగించే కొందరు కళాకారులు అంతకు పూర్వంలోనే రెండువందల సంవత్సరాలుగా, తైలవర్ణాలను వాడుతుండేవారు. కాని సౌందర్య స్ఫోరకాలైన ఉత్తమ కళాఖండాల సృజనకు మాత్రం - తైలవర్ణాలు పనికిరావని ఆనాటి అభిప్రాయం. అయితే, ఛాయా సమ్మిశ్రణతో, ప్రసృత, తరంగిత రూపాలను ధారాళంగా రూపించగలటానికి అనువుగా ఉండే కొత్త ద్రవ్యాలకై అన్వేషించే 15 వ శతాబ్ది కళాకారులను ఈ తైలవర్ణాలు ఆకర్షించాయి. తైలవర్ణాలలో అప్పటికి వాళ్ళు కొన్ని యక్షధూపాలను కలిపి వాడటానికి ప్రారంభించారు. జిగురు రంగులతోనే, ఈ తైల పదార్థాలను మేళవించి చిత్రణను మొదట కొందరు సాగించారు. ఇటువంటి వాళ్ళు పియెరోదెల్లా ఫ్రాన్సిస్కా (ర. 1420-1498); ఫిలిప్పో లిప్పి (ర 1406-1469), విట్టోరె కర్పాచ్చియో (ర. 1470-1528). అప్పటి కోడిగ్రుడ్డు - జిగురు వర్ణాల వల్ల సాధించలేని ఫలితాలను వీళ్ళు ఈ నూనె కలిపిన వర్ణాలవల్ల సాధించగలిగారు. వేరుగా కొందరు- యాన్‌టొనెల్లో డా మెస్సినా (1480-1479), 15 వ శతాబ్ది ఫ్లెమిష్ చిత్రకళాకోవిదులైన జాన్ వాన్ ఐక్ (1885-1441) మొదలైనవాళ్ళు జిగురు వర్ణాలతో రచించిన చిత్రాలపై నూనెను వార్నిషుల మెరుగులను వాడారు. వీటిలో తైలవర్ణ చిత్రాల లక్షణాలు చాలవరకు ఉన్నాయని చెప్పటానికి వీలున్నా, అవి ఆధునిక పరిభాషలో, జిగురు వర్ణాల చిత్రాలుగా మాత్రమే పరిగణించ దగినవి. వాసరి అనే కళాకారుడు చెప్పిన ఒక గాథను బట్టి తైలవర్ణ చిత్రాలను వాన్ ఐక్ స్వీయ ప్రతిభతో ఇతరుల సహాయం లేకుండా కనుక్కొన్నాడని అంటున్నా, ఈ గాథలో ఏమాత్రం నిజంలేదని 1781లోనే రుజువైంది. తైలవర్ణాల వాడుకలో ముందుగా మొదటి అడుగు వేసినవాళ్ళు వెనిస్ నగరపు చిత్రకారులు. టిషియన్, టిన్‌టొ

రెట్టోం కాలానికి ఈ విధంగా తైలవర్ణాలు ముందుకు వచ్చినా, జిగురు వర్ణాల చిత్రణలో అనుసరించిన పద్ధతులే, తైలచిత్రణలో అవలంబించడం జరిగింది. ఇక తైలవర్ణాలకు ఒక విశిష్ట ప్రక్రియను ఏర్పరచిన ప్రప్రథమ కళాచార్యుడు వెలాస్క్వెజ్. అతడు వాడిన తైలవర్ణాల రీతినే దాదాపుగా ఎటువంటి మార్పు లేకుండా ఈనాడు కూడా వ్యాప్తిలో ఉన్నది. ఈ తైలవర్ణ చిత్రణ ప్రక్రియకు సంపూర్ణ వికాసాన్ని జియొవాన్ని బెల్లినీ (1480-1516) తన సుదీర్ఘ జీవితకాలంలో సాధించగలిగాడు. జిగురువర్ణాల చిత్రణనుంచి తైలవర్ణ చిత్రణకు మార్పు జరిగిన రీతిని కాలానుగతంగా, తేదీల వారీగా నిర్దిష్టంగా తెలియజేయటం అశక్యం. ఆ కాలంలో అనేక ప్రక్రియలు అటు నీటి వర్ణాలలోను, ఇటు తైవర్ణాలలోను, సమ్మిశ్ర పద్ధతిలోను కొనసాగాయి. కొందరు చిత్రకారులు పూర్వపు జిగురువర్ణాలే అనువైనవని తలచి, వాటివైపే తిరిగిన నిదర్శనాలుకూడా లేక పోలేదు. అటువంటి వాళ్ళలో ప్రముఖుడు సాంద్రోబొట్టిసెల్లి (ర 1446-1510). అతడు గ్రుడ్డు జిగురు రంగులను వాడటం వదిలి పెట్టలేదు తైలవర్ణాలను కొన్ని చిత్రాలకూ, జిగురు వర్ణాలను వేరుగా కొన్ని చిత్రాలకూ వాడిని ప్రముఖులు కూడా లేక పోలేదు.

**oil primed** : తైలలిప్త.

**oil-soluble dyes** : తైలద్రావ్య రంగ ద్రవ్యాలు.

తైలంలో మాత్రమే కరుగుతూ, నీటిలో కరగని ఒక వర్గపు సంయోజిత కార్బనిక రంగ ద్రవ్యాలు. వార్నిషులు, మాయలక రంగులు, పెట్రోలియమ్ ఉత్పత్తులు మొదలైన వాటికి రంగు వేయడంలో ఈ ద్రవ్యాలను వాడుతారు.

**oil stain** : తైల విలేపనం.

**oilstone** : మెరుగురాయి; తైలశిల.

ఒక విధపు సానరాయి; లోహపరికరాల వాదరలను పదును పెట్టటానికి ఉపయోగిస్తారు. యు.సే. లోని అర్కాన్సస్ రాష్ట్రంలో ఇటువంటి మేలిరకపురాళ్ళు లభిస్తాయి. వీటిపై కొద్దిగా యంత్రతైలాన్ని వేసి, తర్వాత వానిపై పరికరాలను పదును పెడతారు.

**oil tempera** : తైలకలలం; నూనె జిగురు రంగు.

సాధారణంగా వాడుకచేసే జలసక్తతైలదుగ్ధకానికి బదులుగా తైలసక్తజల దుగ్ధకాన్ని వాహకంగా వాడగా రూపొందే రంగు. అటువంటి వాహకానికి శాతకరిగ. నీటికి బదులుగా కర్పూరద్రావకాన్ని వాడతారు. ఇందువల్ల దీన్ని నిజానికి జిగురురంగుగా భావించటానికి ఆధారం లేదు. అయినా చాలమంది అట్లా భావిస్తున్నారు. దీన్ని ప్రయోగాత్మకంగా వాడిన వాళ్ళు కొందరున్నారు. కాని సాధారణంగా కళాకారుల రంగులకోకి ఇది లెక్కలోకి రాదు.

**oil varnish**: తైలవార్నిషు; నూనెవార్నిషు.

అవిసెనూనెనుగాని లేదా వేరే ఇంకొక శోషక తైలాన్నిగాని యక్షధూపాలతో, శోషకాలతో కలిపి పాకం చేయటంవల్ల రూపొందించే

వార్నిష్‌ను కొందరు ఈ పదంతో పిలుస్తారు ఇది సరళద్రావత్మ వార్నిషు కన్న వేరైనది.

**oily ingredient** : *తైలాంశద్రవ్యం.*

జిగురు వర్ణంలో, నీటితో కలిపి దుర్గకంగా రూపొందించటానికి, వనికివచ్చే అంశద్రవ్యం. అది నూనె, మైనము, యక్షధూపాలలో ఏదైనాకావచ్చు. శిలాలేఖన ప్రక్రియలో శిలాలేఖన ఖడికలోని, లేదా ఖడికాద్రవం లోని అంశద్రవ్యం, రాతి ఉపరితలంలో సిరాను గ్రహించగల జిగటతావును రూపొందిస్తుంది ఈ అంశద్రవ్యం కలిగిన ఖడిక స్పృశించని ప్రదేశాలు, సిరాను రాతిపై పూసినప్పుడు, సిరాను గ్రహించలేవు కాబట్టి అవి ఖాళీగా ఉంటాయి.

**old Duch process** : *పురాతన డచ్చి ప్రక్రియ.*

సీసలోహాన్ని అసెటిక్ ఆమ్లంతోగాని, శుక్తరసంతోగాని క్షయింపజేసి తెల్లసీసాన్ని తయారుచేసే ప్రక్రియ ప్రాచీన గ్రీకుల కాలంలోనే ఇది వాడుకలో ఉండేది మధ్య యుగాలలో యూరపులో దీనికి వ్యాప్తి కలిగించినవారు డచ్చివారయినందువల్ల దీనికి ఈ పేరు వచ్చింది

**old master** : *ప్రాచార్యుడు.*

పునరుజ్జీవన యుగపు – అందునా ముఖ్యంగా ఆ కాలంలో ఇటలీ, హాలండు, బెల్జియం దేశాలలో వసించిన – సుప్రసిద్ధ కళాచార్యులైన వారికి వ్యవహృతమైన విశిష్ట గౌరవవాచకం.

**oleograph** : *తైలలేఖనం.*

ఇది ఒక విధపు వర్ణశిలాలేఖన పద్ధతి. ఒక వస్త్రముపైగాని, లేదా కాంతవతను నెల కొల్పిన ఒక అట్టపైగాని తైలవర్ణపు సిరాను వాడి ఇందులో ముద్రణ నిర్వహిస్తారు. తైల వర్ణంతో రూపొందించబడే చిత్రానికి ఇది అనుకరణగా ఉండి తక్కువ ఖర్చుతో జరప టానికి సౌకర్యం లభిస్తుంది 19 వ శతాబ్ది ఉత్తరార్ధంలో ఈ తైలలేఖనం విస్తృత వ్యాప్తిలోకి వచ్చి ప్రజల ఆదరణను సముపా ర్జించింది.

**oleoresins** : *తైల యక్షధూపం.*

**olive green** : *ఆలివ్ హరితం.*

మాదపు, కపోతవర్ణపు హరితాలలో దేనికైన ఉపయుక్తమయ్యే సన్నె పేరు, ఇది వర్ణద్రవ్య నామం మాత్రం కాదు.

**olpe** : *స్థాలిక*

ప్రాచీన గ్రీకుల మృణ్మయపాత్ర విశేషం. దీని మెడ పొడవు తక్కువగా ఉండి, క్రింద భాగము కుదిమట్టంగా ఉంటుంది. మెడవద్దనే పిడి ఉంటుంది. నీరు తీసుకొని పోవటానికి ఆ కాలంలో ఉపయోగిస్తూ వచ్చిన ఒక తోలు పాత్రకు కూడా ఈ పేరు వర్తించేది. (చూ : *vase shapes* దగ్గర ఇచ్చిన పటాలు; చూ : *oenochoe*).

**oltremontani** : *కొండల ఆవలివారు; తైలవర్ణ్యాద్యావరకులు.*

పునరుజ్జీవన యుగంలో, వెనిస్ చిత్ర కారులు, ఫ్లెమిష్ చిత్రకారులకు, వాడిన ఒక

విశేషణం. ఈ ఇటాలియన్ పదానికి 'కొండలకు అవతలివైపున ఉన్నవారు' అని అర్థం.

**oneiric** : ***స్వాప్నిక.***

చిత్రలేఖనంలో, కలవంటి భావనను కలిగించే ఒక లక్షణానికి వాడే విశేషణం. అది వాస్తవిక వాదానుసారులైన చిత్రాలలో ఇటువంటి లక్షణం గల రూపాలు, లేదా దృశ్యాలు చాలా వాటిలో కనపడతాయి.

**one man's show** : ***వ్యష్టి ప్రదర్శన; అనన్య ప్రదర్శన.***

**onyx marble** : ***గోమేదక వంక శిల.***

స్వచ్ఛంగా, తెల్లగా ఉండే ఒక విధపు చంద్రశిల. శిల్పాలకు ప్రాచీన కాలంలోనే గాకుండా ఇప్పుడు కూడా దీన్ని ఉపయోగిస్తున్నారు.

**opacifier** : ***కాంతిరోధక.***

మార్దవములలో ద్యుతికములకు కాంతి నిరోధకాలుగా చేయటానికిగాను వాడే అనుబద్ధం. వ్యాపారసరళిలో లభించే ఇటువంటి వాటిలో జిరోక్సపాక్స్, ఒపాక్స్ చాలా ముఖ్యమైనవి.

**opacity; transparency** : ***కాంత్యభేద్యత; పారదర్శకత.***

కాంతిని ప్రసరింపచేయడంలో ఒక పదార్థానికి గల సామర్థ్యానికి సంబంధించినవి ఈ రెండు పదాలు. కాంతిని తన నుంచి ప్రసరించనీయకుండా నిరోధించగలిగేది కాంత్యభేద్య వర్ణం; ఇవి తన దిగువ ఉన్న దానిని మాటుపెట్టటానికి, లేదా మూసి ఉంచటానికి, సమర్థంగా ఉంటుంది. అర్థాభేద్యవర్ణం, కాంతిని కొద్దిగ మాత్రమే తన నుంచి పోనిస్తుంది. అయితే తన దిగువ ఉన్న నల్లరంగులను దానిలోగల గురుతులను దాచివేయటానికి దానికి శక్తి ఉండదు. అయితే ఆ అర్థకాంత్యభేద్య వర్ణాన్ని దట్టంగా పట్టించినప్పుడు మాత్రం, దిగువ వాటిని మరుగుపరచే శక్తి దానికి లభిస్తుంది. ఇక, పారదర్శక వర్ణం, తన నుంచి కాంతిని ఏ రకమైన అడ్డంకిలేకుండా, ధారాళంగా పోనిస్తుంది. ఒక తైలవర్ణంలోని పారదర్శకపు మెరుపుతలాన్ని, ఇంకొక రంగుపై ఉంచినప్పుడు, ఆ రెండు ఛాయల స్వచ్ఛ మిశ్రమం, స్పష్టత అంతగా కోల్పోకుండా, ఉత్పన్నమవుతుంది. అర్థపారదర్శకపు వర్ణం కాంతిని ఎక్కువగా తన నుంచి పోనిస్తుంది కాని దానిలో స్పష్టత ఉండదు. ఒక అర్థపారదర్శకపు మెరుగుతలాన్ని, ఇంకొక వర్ణంపైన ఉంచినప్పుడు, వెల వెల పోవటం, లేదా మబ్బు మసకగా ఉండడం కనపడుతుంది. ఉపరితలం నుంచి కాంతి ప్రతిఫలించడంవల్ల ఇటువంటిది ఉత్పన్నమవుతుంది. అర్థకాంత్యభేద్యత, అర్థ పారదర్శకత - అనే ఈ రెండింటిని, వ్యతిగత కాంతిమయత (*trans - lucency*) అనే సామాన్య పదంతో వ్యవహరించడం ఉంది. పదార్థ ద్రవ్యాలను కాంత్యభేద్యాలు, అర్థకాంత్యభేద్యాలు, పారదర్శకాలు, అనే మూడు వర్గాలుగా వింగడిస్తారు.

చిత్రణ ప్రక్రియలలో కాంత్యభేద్య, పారదర్శక వర్ణాలు రెండు విభిన్న మార్గాలను

అనుసరించి. వర్ణఫలితాలను సాధిస్తున్నాయి. నీటి రంగుల ప్రక్రియలో, పారదర్శక వర్ణాలే ఉపయోగిస్తారు. తెలుపులను, పాండు వర్ణాలను, ఈ పద్ధతిలో రంగులు వేసే కాంతివంతపు తెల్లని కాగితమే రూపొందిస్తుంది దధిమార్గగహనవర్ణాలు, పిష్టవర్ణాలూ కాంత్యభేద్యపు కోసకు చెందినవి. ఈ రంగులతో చిత్రించడంలో తెలుపులను, పాండు వర్ణాలను పొందటానికి తెలుపు వర్ణద్రవ్యం వాడతారు జిగురు వర్ణం. అర్ధకాంత్యభేద్యపు రంగు, దీనిలో పైరెండింటి ఫలితాలూ సమ్మిశ్రణం పొందుతాయి, ఇది తైలవర్ణ చిత్రణ సర్వసమర్థం. ఇది కాంత్యభేద్య, వ్యతిగత కాంతిమయ, పారదర్శక వర్ణాల ద్వారా కలిగే ఫలితాలను వేరే వేరేగా గాని, ఒకే చిత్రంతోగాని ప్రదర్శించ గలదు.

**opalescence : శివధాతువర్ణవృత్తి.**

శివధాతు శిలలోని వర్ణాల గజిబిజిని మసక మసకగా వ్యక్తం చేసే శబలత.

**opaline paper : శబలపత్రం.**

మిలమిలమెరసే ఒక రకపు చర్మపత్రం

**opaque black : కాంతి నిరోధక కాలిమ.**

గొప్ప ఆచ్ఛాదన శక్తి కలిగిన ఒక జల సవర్ణం ఛాయా చిత్రాలను ఆలేఖ్యాలను పరిస్పర్శించటానికి పరిష్కరించటానికి ఇది చక్కగా పనికి వస్తుంది.

**opaque projector : కాంత్యభేద్య ప్రక్షేపకం.**

ఒక రిక్తతలంపైన, ఒక చిన్న ఆలేఖనం చిత్రణ, అచ్చు, లేదా ఛాయాచిత్రం పెద్దదిగా పడేటట్లు చేయటానికి ఉపకరించే ఒక లాంతర. అట్లా ఆ రిక్తతలంపైబడే చిత్రాన్ని తక్షణమే అనులిఖించటానికి వీలవుతుంది. ఒక చిన్న కళారచనను విపులీకరించటానికిన్నీ ఒక ఆలేఖనాన్ని ఒక కాగితంపైకి, ఫలకంపైకి, గోడపైకి పరివర్తన చేయటానికిన్నీ కళాకారులు ఈ సాధనాన్ని వాడతారు. వివరణ సహితమైన వర్ణికలను మొదట గోడ వంటి ఉన్నత ప్రదేశంలో ఉంచి దాని ప్రతిబింబాన్ని ఒక రాతబల్లపైకి ప్రసరింప చేయటానికి కూడా ఇది ఉపయోగిస్తుంది. వాణిజ్య కళాకారులలో వాడుకలో ఉండే ఇటువంటి సాధనంలో, అందులోనే రాతబల్లా గదిలో వెలుతురువల్ల లోపలి ప్రక్షేపణం దెబ్బతినకుండా నిరోధించే ఒక తెర లేదా అడ్డుగుడ్డ అమరి ఉంటాయి.

**opaque white : కాంతి నిరోధక శ్వేతం.**

గొప్ప ఆచ్ఛాదన శక్తి కలిగిన ఒక జల సవర్ణం. ఛాయాచిత్రాలను. ఆలేఖ్యాలను పరిస్పర్శించటానికి పరిష్కరించటానికి ఇది పనికివస్తుంది.

**op art or optical illusion art : దృక్భ్రాంతిక లేక దృగాభాసకళ, ఆప్ ఆర్ట్.**

అప్పట్లో కొత్తగా రూపుగొన్న ఒక కళాశైలికి, న్యూయార్క్‌లో 1965లో పెట్టిన పేరు. తీవ్రాంచలములైన వివిక్తరీతులు కంటిపాపపై పడి, దుర్నిరీక్షత లేదా సంచలనత అందులో ఉన్నదనే భ్రమను కలుగజేయటం ఈ శైలి లక్ష్యం. నలుపూ, తెలుపూగాక తక్కిన రంగులను వాడినప్పుడు, ఒక రంగు పక్కనే దాని పరిపూరక వర్ణాన్ని వాడినప్పుడు ఈ



దృశ్యకళ.. పరిశ్లేష (1964) చిత్రకారుడు: బెంజమిన్ ఫ్రేజియర్ కన్నింగ్‌హామ్. క్యానవ ఫలకముపై సంయోజిత పాలిమర్ వర్ణచిత్రణ.

దుర్నిరీక్షత అతిశయిస్తుంది. (చూ : *moire effect*) ఈ దృక్కళాశైలిలో పనిచేసిన వారిలో విక్టర్ డి వాసర్లి (జ. 1908) యాకోబ్ జిన్‌స్టిన్ అగమ్ (జ 1928) ఉన్నారు ఈ కళలోని ప్రలక్షణాల గుడ్డల అద్దకంలోను ఇతర అలంకరణ కళావిధానాలలోను వాడుకలో ఉన్నాయి

**opax** : *ఓపాక్స్*.

ఒక విధమైన కాంతిరోధకికి వ్యాపార నామం.

**open** : *వివరించు*

మార్తపములలో, పింగాణీమట్టికి ఇర్క్రశకను కలపటం ద్వారా దాన్ని సరంధ్రంగా చేయుటం.

**opening** : *ఉపక్రమము; ప్రాగ్దర్శనం.*

కళాఖండాల ప్రదర్శనాన్ని ప్రారంభించటానికి ముందుగా, సాధారణంగా ఒక రోజు ముందే, అందరికీ కాకుండా, కొందరు అంతరంగికులకు మాత్రమే, చూపబడే ప్రదర్శనం. *preview* దీనికి ఆంగ్లంలో ఇతఃపూర్వం, వార్నిషింగ్‌డే అనే పేరు ఉండేది.

**ophite** : *సర్పశిల.*

మచ్చలు కలిగిన కొన్ని రకాల శిలలకు సామాన్య నామం. సర్పశిల ఈ కోవకు చెందిందే.

**optical** : *చాక్షుష.*

**optical illusion art** : *దృగ్భ్రాంతికళ.* (చూ : *op art*)

**optical mixture** : *దృష్టిమిశ్రమం; చాక్షుషమిశ్రమం.*

చిత్రలేఖనంలో ఒక విధమైన ప్రక్రియ. ఇందులో చిన్న చిన్న గీతలను, లేదా బిందువులను వేరే వేరే వర్ణాలలో చాలా సన్నిహితంగా చిత్రతలం మీద ఉంచటం చేస్తారు ఇటువంటి దాన్ని, ఒకనిర్దిష్ట దూరానికి అవల నుంచి చూచినప్పుడు, ఆ మచ్చలూ, రేఖలూ కనపడక, ఒక విధపు మిశ్రమ వర్ణం, తేజోభరితమై ఆ ప్రాంతాన్ని అలముకొన్నట్లుగా కనిపిస్తుంది ఇందుకు ఉదాహరణం, నీలపు, ఎరుపు బిందువులను పక్క పక్కన గాఢ సన్నిహితాలుగా ఉంచి, దూరం నుంచి చూసినప్పుడు, ఆ మచ్చలున్న ప్రదేశం

నీలలో పీతవర్ణంతో కనపడుతుంది అను భూతివాది. బిందువాదాలనూ అవలంబించిన చిత్రకారులు ఈ ప్రక్రియను అమూలాగ్రంగా ఆశ్రయించారు

**optics** : చాక్షుషం.

**opulent** . సమృద్ధ

**opus sectile** : *అంతఃఖచన.*

చంద్రశిలను లోపలపొదగటానికి రోమనులు ఈ పదాన్ని వాడారు. ఏ రూపానికి చంద్రశిలను పొదగాలి, ఉంటుందో ఆ రూపంలోని ఆయా భాగాలకు అనుగుణమైన ప్రమాణాలలో చంద్రశిలను ఖండించి వాడటం ఇందులో జరుగుతుంది.

**orange** : *నారంగ; నారింజరంగు; నారగి.*

**orange mineral** *నారంగ ఖనిజం.*

ఎర్రసీసాన్ని దాదాపుగా పోలి ఉండి కూడా దాని కన్నా తక్కువ సిగాఢత కలిగి ఉండే ఒక విధమైన సీసభస్మం

**orange-peel effect** : *నారంగ త్వగ్రీతి.*

ఒక రకమైన ఉపరితల లాంతనం కొన్ని పై పూతలలో ఆరబెట్టిన తరవాత కనపడే ఒక విపరిణామం. దాని ఫలితంగా ఆ పైపొర నారింజపండు తొక్కలాగా ఎగుడు దిగుడుగా ఉంటుంది.

**orange pigments** : *నారంగ వర్ణ ద్రవ్యాలు.*

ఈ కోవకు చెందిన వాటిలో కాడ్మియమ్ నారంగవర్ణం మాత్రమే తైలవర్ణాలలో వాడుకలో వర్ణక ప్రమాణ విషయమై అంగీకృతం.

**orange vermilion** : *నారంగ సిందూరం*

సిందూరంలో పసుపువాలు ఎక్కువగా ఉండే వాడే పదం

**orant** : *ప్రార్థనాశిల్పం*

ప్రాచీన గ్రీకు కళలో కనపడే ప్రార్థనా భంగిమలో ఉండే ఒక మూర్తి విశేషం. క్రైస్తవ సాంప్రదాయిక కళలో, నిలుచొని చేతులను పైకెత్తి ప్రార్థిస్తున్న భంగిమలో ఉండే మూర్తి విశేషానికి ఈ పదాన్ని ఉపయోగించారు

**orders of Architecture** : *వాస్తు సంప్రదాయాలు.*

పాశ్చాత్య వాస్తువులో, ఆయా నిర్మాణాలలో వాడే స్తంభాల రూపవైవిధ్యాన్ని బట్టి ఏర్పడ్డ సంప్రదాయాలు. ఆ స్తంభపు అంగాలైన కాండం పీఠం, ఛేదకలేనాల ప్రస్తరం, స్తంభమకుటం కూడా ఇందులో వైవిధ్య నిర్ణయం నిమిత్తం లెక్కలోకి తీసుకోవటం జరుగుతుంది. ఈ సంప్రదాయాలలో ముఖ్యమైనవి డోరిక్, అయోనిక్ సంప్రదాయాలు. వీటి రెండింటి నుంచి రూపుగొన్నది కొరింథియన్ సంప్రదాయం. గ్రీకులు రూపొందిం

చిన ఈ మూడింటికీ టాస్కనో, కాంపోజిటో అనే రెండు వేరే సంప్రదాయాలు కలిపితే మొత్తం అయిదు సంప్రదాయాలైనవి.

**ore** : *ముడిఖనిజం.*

**organic** : *కార్బనిక; సావయవ.*

**Organic architecture** : *సావయవ వాస్తు శిల్ప*

ఆధునిక వాస్తువులో ప్రసిద్ధికి రాగలిగిన రెండు విభిన్న, పరస్పర వ్యతిరేక రీతులలో ఒకటి. నిర్మాణానికీ, తత్పరిసర ప్రకృతి దృశ్యాలకూగల సంబంధానికి ఈ రీతి ఎక్కువ ప్రాముఖ్యాన్ని కల్పిస్తుంది అందువల్ల నిర్మాణానికి చాలవరకు సహజసిద్ధ ద్రవ్యాలను కలప, గారసున్నమువని వంటి వాటిని వాడటం జరుగుతుంది ఇందులో.

**organic pigments** : *కార్బనిక వర్ణ ద్రవ్యాలు.*

మొదట్లో ఖనిజాలైన కర్బనేతర వర్ణ ద్రవ్యాలకన్నా వేరై, వృక్ష, జంతుకోటి నుంచి మాత్రమే సంపాదించటానికి వీలైన వర్ణ ద్రవ్యాలకు ఈ పేరు వినియుక్తమైంది. కాని ఆ తరవాత ఆయా మూల ద్రవ్యాలలో కర్బనం కూడా చేరిఉన్న వర్ణద్రవ్యాలకు అన్నింటికీ ఈ పేరు వాడటం జరిగింది. ఆధునిక యుగంలో బొగ్గు-తారు ఉత్పన్నాల నుంచి సంయోజక రీతిలో తయారు చేసిన వర్ణద్రవ్యాలకు థాలోసియానైన్ సిరం, ఆలిజోరిన్ కోజవర్ణం సంయోజిత వర్ణాల నుంచి తయారైన రంజక వర్ణాలు మొదలైన వాటికి ఈ పేరు వాడుతున్నారు.

**Orientalizing period** : *ప్రాచ్య ప్రభావ యుగం.*

హెల్లెనీయ కళాచరిత్రలో, జ్యామితీయ యుగానికీ, ప్రాక్తన యుగానికీ మధ్య వచ్చిన ఒక సంధియుగం (క్రీ.పూ. 700-600). ఆ సంధియుగంలో సిరియా, ఈజిప్టు, ఫొనీషియా మొదలైన ప్రాచ్యదేశాల ప్రభావానికి గ్రీసుదేశం లోనైంది. తత్ఫలితంగా గ్రీసు దేశపు కళాంశాలలోనే గొప్ప మార్పువచ్చి ఆ కళయొక్క పరిధి విస్తరించ గలిగింది. పానపాత్రాలంకరణ ఆ కాలంలో కళాకృషిలో అతి ప్రముఖస్థానాన్ని ఆర్జించ గలిగింది. ప్రాచ్య కళాప్రభావంవల్ల, అటువంటి అలంకరణ వర్ణనాత్మకంగా మార్పొందగా పూర్వపు జ్యామితీయ నిర్దుష్టాలంకృతి వెనుకంజ వేసింది. అట్టి వర్ణనాత్మక చిత్రణలో మానవ జంతు రూపములకు అధిక ప్రాముఖ్యము చేకూరింది. కొత్త కొత్త ప్రలక్షణాలు, యుద్ధ దృశ్యాలు, పోరాడే జంతువులు, రెక్కలుండే భూతాలు వంటివి, ఆ కళలో తావు కల్పించుకొన్నవి. అయితే వీటన్నింటినీ మించి, ఆ ప్రాచ్య ప్రభావంవల్ల ఆ యుగంలో రూపొందిన నూత్న విషయం: శాశ్వతంగా మనవలసిన శిల్పాలకున్నూ, వాస్తు రచనలకున్నూ రాతిని ఉపయోగంలోకి తేవటం; ఇట్లా రాతిని ఉపయోగంలోకి తేవటం గ్రీకులు తలపెట్టడంవల్ల, హెల్లెనిక కళను గురించి మనకు ఈనాడు తెలియవచ్చే వాటిలో ఎన్నో తెలియటానికి అవకాశం కలిగింది.

**orientation** : ***కుదిరిక తీరు.***

**orient yellow** : ***ప్రాచ్యపీతం.***

ఒక రకపు గాఢపు కాడ్మియం పసిమి

**original** : ***మౌలికము.***

1. ఒక కళాకారుని స్వతంత్ర సృష్టి

2. ఒక మూలరూపంగా భావించబడే కళా రచన దీనినుంచే నకళ్ళున్నూ, ప్రత్యుత్పన్నాలున్నూ తయారు చేయడం జరుగుతుంది.

3. ఒక కళారచనలో ప్రదర్శితమయ్యే వస్తువు లేదా వ్యక్తి.

**original print** : ***తొలి అచ్చుముద్ర.***

***తొలి ముద్రాంకనం; తొలి ముద్రాకం; ఆద్య ముద్రాంకం.***

పరిగణితములయ్యే గ్రాఫిక కళా ప్రక్రియలలో కళాకారుడిచేత తయారైన ముద్రాకనం. ఫలకం. దిమ్మె, రాయి, జవనిక, పరిష్కరన వస్త్రాలలో దేనినైనా వాడి, దానిపైన కళాకారుడు తన ఉత్తమ రచనా ప్రతిబింబాన్ని సృష్టించి, తానే స్వయంగా ముద్రించినప్పుడు ఈ తొలి ముద్రాంకనం రూపొందుతుంది. శిలాలేఖనం లాగా, సాంకేతిక ప్రజ్ఞ, ఆవశ్యకమైన దానిలో, ఒక అచ్చువనవృత్తి వ్యక్తిని కళాకారుడు తనకు సాయంగా ఉంచుకోవచ్చు. అమెరికాలోని ప్రింట్‌కౌన్సిల్‌వల్ల ఒరిజినల్ ప్రింట్ అనే పదం గ్రహీతమైంది. అట్లా గ్రహించడంలో, కళాకారుని పర్యవేక్షణలో గాని, కళాకారునిచేత స్వయంగాగాని రూపొందించబడక ఛాయాచిత్ర ప్రక్రియలవల్ల గాని, యాంత్రిక ప్రక్రియలవల్లగాని పునరుత్పన్నాలైన వాటికీ ఈ విధంగా తొలి ముద్రాంకానికీ కూడా మధ్య భేదం ఉన్న విషయం ఆ కౌన్సిల్‌వారు గుర్తించారు ఇరవయ్యో శతాబ్దపు ఆరంభంనుంచి కూడా తొలి ముద్రాంకనములపై కుడివైపు దిగువ మార్జినలో పెన్సిలుతో కళాకారుడు సంతకం చేయటం సంప్రదాయమైంది. కొద్ది ప్రతులను మాత్రమే ఆ ప్రచురణలో వెలువరించేట్లుంటే ఆ తొలి ముద్రాంకన మార్జినలో ఆ ప్రతుల సంఖ్యను ఆ ఋజుపత్రపు వరుససంఖ్యను కళాకారుడు వ్రాసి పెడతాడు.

ప్రింటు కౌన్సిల్‌వారు గ్రాఫిక కళలకై నిర్ణయించిన మౌలికతా ప్రమాణాలకు అనుగుణంగా ప్రతి కళాకారుడున్నూ తన రెండో ప్రకాశనాన్ని *(edition)* ను విస్పష్టంగా గుర్తించే ఏర్పాట్లు చేయాలి దీనికోసం మొగటిదాని రంగును మార్చినా మార్చవచ్చు దీనికి తోడుగా ఈ ప్రకాశనంపై '2వ ప్ర' అనే గుర్తును ఉంచాలి ఈ రెండో ప్రకాశనం కోసం మొదటి ముద్రణలో ఉపరితలంలో ఏదైనా నిర్దిష్టమైన మార్పునుచేస్తే ఈ కొత్త ఉపరితలపు ఋజుపత్రాలపైన '2వ స' (రెండవ పరిస్థితి) అని గుర్తు పెట్టాలి. తన తొలి ప్రకాశనంతోనే తాను సంతృప్తిపడి, ఇక ముద్రాంకనములు వీటిని అదనంగా తయారు చేయటం తనకు ఇష్టం లేనప్పుడు తాను తొలి ముద్రాంకనంకోసం తయారు చేసిన ప్రతిబింబాన్ని తుడిచివేయాలి. శిలాలేఖనపు రాతిని బాగా కడిగి తుడిస్తే ఇది

సాధ్యమవుతుంది. లేదా ముద్రణపు ఉపరితలాన్ని కొట్టివేయాలి ఈ కొట్టివేయటంకోసం ఆ ఉపరితలాన్ని కోనంలో గుండ్రంగా చెక్కివేయటమో, ఆ ఉపరితలంపై వాడిమొన పరికరాలతో గీతలు గీయటమో చేయవచ్చు. ఇందువల్ల ఆ ఉపరితలాన్ని వాడుకొని ఏవైనా రుజువ్రతాలను తీసినా అవి తొలుతటి ముద్రాంకనంలాగా ఉండబోవు.

**ormolu** : *నగిషీ లోహము.*

1. అలంకరణవస్తువులను చేయటానికిగాని, వస్తువులపై అలంకరణలను చేయటానికి వాడే పత్తిరంజన కాంస్యం; లేదా ఇత్తడి గృహోపకరణాలపై అలంకరణలకు, అనుకులకు, ఇది ముఖ్యంగా వాడుక చేస్తారు 19వ శతాబ్దంలో ఫ్రాన్సుదేశంలో ఇటువంటి నగిషీ లోహపు అలంకరణ రాజాదరణను సైతం పొందింది. ఈ నాటికిన్నీ ఫ్రాన్సులో ఇది ఎక్కువగా తయారవుతున్నది.

**ornament** : *నగ.*

**Orphism** : *గూఢవాదం.*

శోభావంతములు, వ్యత్యస్తతారతమ్యములు అయిన రంగులుగల తలములు ఒక దానిపై వేరొకటి పొదిగేట్లు చిత్రణను సాగించే ఒక విధపు శైలికి అలంకారమయిన నామం. ఘనతావాదానికి ఇది సన్నిహితం; ఎక్కువ వివిక్తము; వర్ణంతో ఎక్కువగా ముడిపడినది. ఈ పదాన్ని మొదటిసారిగా 1918 లో అపోలినైర్ అనే ఫ్రెంచి కవి ఉపయోగించాడు. ఈ శైలికి బలం చేకూర్చినవాడు రాబర్ట్ డెలానే (1885–1941). అతడు ఈ వాదాన్ని యుగపత్ వాదము (*simultaneism*) అని అనటం సమంజసమని భావించాడు. ఈ శైలినే అవలంబించి, తమ చిత్రాలతో ఒక ప్రదర్శనను 1918 లో నిర్వహించిన, శాన్‌టన్ మేక్‌డొనాల్డ్ రైటు [1890–], మోర్గన్ రస్సెల్ [1886–1958] అనే అమెరికనులు ఈ వాదాన్నే సమవర్ణవాదం (*synchromism*) అని వ్యవహరించారు. జెక్ కళాకారుడు ఫ్రాంక్ కప్కా [1871–1957] కు కూడా ఈ శైలితో సన్నిహిత సంబంధం ఉంది.

**orpiment** : *హరితాళం; అరదళం.*

సహజంగా లభించే ఒక రాసాయనిక యౌగికం. రాసాయనికంగా ఇది ఆర్సెనిక్ త్రయిసల్ఫైడ్ అని కూడా వ్యవహృతం. బంగారు, పసిమినుంచి నారంగవర్ణం వరకూ వివిధ వర్ణాలలో ఇది లభిస్తుంది. ప్రాచీన కాలంనుంచి కూడా వాడుకలో ఉన్న వర్ణద్రవ్యమిది.

**ostracon** : *కర్పరశకలం.*

ప్రాచీనకాలపు ఈజిప్టనులు సాధారణంగా 'పపైరసు' అనే తుంగ కాగితంపై వ్రాసేవారు. అది లభ్యం కానప్పుడు సున్నపురాతి పలకపైన, కుండ పెంకు బిళ్ళపైన, వ్రాయటమే కాక, ఆలేఖనాన్ని కూడా కొనసాగించేవారు. ఇటువంటి పలకలకూ, బిళ్ళలకూ సామాన్యనామం ఆస్ట్రికాన్ (కర్పరశకలం.)

**ostrum** : *ఓస్ట్రం.*

తైరీయ ధూమ్రవర్ణానికి లాటిన్ భాషా నామం.

**Ostwald system : ఆస్ట్వాల్డ్ విధానం.**

జర్మనీ దేశపు విజ్ఞాన శాస్త్రవేత్త. విల్ హెల్మ్ ఆస్ట్వాల్డ్ 1931 లో ప్రవేశపెట్టిన ఒక విధపు వర్ణ వివరణ పద్ధతి. వర్ణంలో ఛాయాగతమైన మార్పులన్నింటిని ఈ విధానం వివరించగలుగుతున్నది. ఆస్ట్వాల్డ్ తన పద్ధతిలో, వర్ణాలను ఒక వర్ణ ఘనరాశి (*colour solid*) గా అమర్చి, దానిలో 24 పునాది ఛాయలను ఒక క్రమపద్ధతిలో ఏర్పరచాడు. తెలుపును, నలుపును గూడ ఈ లెక్కలోనే చేర్చబడ్డాయి. ఈ పద్ధతికి ముఖ్యంగా కళారంగంలో విస్తృతమైన ఆమోదం లభించింది. కాని యునైటెడ్ స్టేట్స్‌లో మాత్రం మన్సెల్ విధానాన్ని ఇది త్రోసిరాజనలేక వెనకబడ్డది. కాని, కొద్ది కాలం క్రిందట ఈ విధానంపై అభిరుచి యు. స్టేట్స్‌లో మొదలై అభివృద్ధి పొందుతున్నది. ఈ విధానపు సమగ్ర వివరణ, కార్ల్ ఈ. హెన్, ఎగ్‌బర్ట్ జేకబ్‌సన్ రచించిన 'కలర్ హార్మొనీ మేన్యుయల్' (1948) అనే ఆంగ్ల గ్రంథంలో లభిస్తుంది.

**Ottonian art : ఒటోనీయ కళ.**



ఒటోనీయ కళ, పదవ శతాబ్ది ఉత్తరార్ధమున దంతమున శిల్పితం, మహిమోపేతుడగు క్రీస్తునకు, ఒటో I చక్రవర్తి, మేగ్‌డెబర్గ్ ఆలయపు నమూనాను సమర్పించుట ఇందు రూపితము.

క్రీ. శ. 10వ శతాబ్ది ఆరంభ కాలంనుంచీ 11వ శతాబ్దిలోని తొలినాళ్ళ వరకు జర్మనీ దేశంలో వికసనమందిన ఒక కళారీతి. ఆ కాలంలో జర్మనీ దేశంలో శాక్సనీ రాష్ట్రాన్ని పాలించి 'మహనీయుడు' అని బిరుదుపొందిన ఒటో పేరుగల విజ్ఞ ప్రభువు పేరిట ఆ కాలపు కళకు ఈ పేరు వచ్చింది. కరోలిన్‌జియన్, రోమన్, బైజాంటియం శైలులు చక్కగా మేళవించి ఒక విరమైన జర్మన్ శైలిగా రూపొందడం ఆ కాలంలో జరిగింది. ఆ శైలి గాఢమైన భావవైశద్యానికి పేరొందింది. అప్పుడు కొయ్యను, దంతాన్ని, బంగారాన్ని, వెండిని తీసుకొని శిల్పాన్ని ఆ ప్రాంతంలో, అందునా ముఖ్యంగా రీచ్‌నావ్ ద్వీప నగరంలో, అభివృద్ధిని సాధించింది. వ్రాతగ్రంథాల పత్రదీపనం ఆ కాలంలో రీచ్‌నావ్ నగరంలోనే కాక హిల్‌డేషీమ్, రీజెన్స్‌బర్గ్ కోలోన్ నగరాలలో ఉచ్చస్థాయిని అందుకోగలిగింది.

**outdoor painting . ఆరుబయటు చిత్రణ.**

**outline drawing : బాహ్యాలేఖనం.**

వస్తువును లేదా వ్యక్తిని దాని బాహ్యరేఖ వల్ల మాత్రమే సూచిస్తూ, జరిపిన ఆలేఖనం.

అటువంటి ఆలేఖనంలో రేఖలు అంతటా ఒకే విపులతను, బలిమిని కలిగి ఉంటాయి. ఇందులో ఏ విధమైన వర్తన కూడా జరప డానికి అవకాశం లేదు ఆ వస్తువు లేదా వ్యక్తి యొక్క అంతర్గత లక్షణాలుకూడా చూపబడవు (పరిధి లేఖనం ఇటువంటిది కాదు దానిలో కొన్ని అంతర్గత లక్షణాలు చేర్చవచ్చు). (చూ : *silhouette* ; చూ : *contour drawing* వద్దర పటం).

**oval** : ***వృత్తాయతం.***

**over-biting** : ***అతిదంశనం*** (చూ· *Creve*)

**overglaze** : ***పై మెరుపు రంగు; అధిద్యుతి.***

పింగాణిపాత్ర పై తలం మీద పట్టించే రంగు. ఇందులోని వర్ణకారి ద్రవ్యానికి తోడుగా, తూలికా కర్మను,నియంత్రించటానికి ద్రవరూపమై ప్రవాహిశీలమైన ఒక బంధ కాన్ని కూడ చేరుస్తారు. ఇటువంటి పై మెరుపులను, అల్ప ఉష్ణోగ్రతలో వేడి చేస్తారు. పింగాణిని ఎక్కువగా ఉష్ణోగ్రతలో కాల్చినప్పుడు, కొన్ని రంగులే పోతాయి కాబట్టి, అల్పోష్ణోగ్రతనే వాడ వలసి ఉంది.

**overmantel** : ***అంగారధానిక; నివ్వుగూడు.***

అడ్డుకొలత ఎక్కువగా ఉండి, పొడవు దీరిన ఒక చిత్రం లేదా చెక్కుడు పని దీనిని పొయిదగ్గ ఉండే అలమారిని కప్పి ఉంచటాని కోసం వాడతారు; లేదా ఆ స్థానంలో ఉండే ఏదైనా ఒక అలంకరణ.

**overpainting** : ***అధిచిత్రణ.***

ప్రాథమిక స్తరవు చిత్రణ లేదా అధశ్చిత్రణ (*under painting*) పూర్తియై ఆరిన తరవాత ఇచ్చే తీర్పుపూత (*finishing coat*) జిగురువర్ణాలు, తైలవర్ణాలు మాత్రమే గాక ఇంకా చాలా మాధ్యమాలలోసాగే చిత్రణలతో అన్నిటా, ఈ రీతిగానే రెండు ఘట్టాలలో రంగును పట్టించటం జరుగుతుంది. రూపమూ, సూత్రపాతమూ తెలియజేయటానికి అధశ్చిత్రణ వినియుక్తం కావటం మంచిది. అప్పుడు సాంకేతిక వివరాలపట్ల ఎక్కువ శ్రద్ధ వహించటానికి కళాకారుడికి సౌకర్యం ఉంటుంది. ఒక పూతతో మాత్రమే సాధించటానికి అవకాశంలేని కాంతన పరిణామాన్ని, వర్ణరీతని కావలసిన మేరకు సాధించటానికి, ఒకటికన్న ఎక్కువగా చేసిన ఇటువంటి పూతలవల్ల సాధ్యమవుతుంది కోరిన క్లిష్ట పరిణతినిసాధించటానికికొన్ని తూలికాప్రవాహాలూ కొద్ది సవరణలో అవశ్యకములైన సందర్భంలోను పూత మందంగా ఉండటం సరిఅని తోచినప్పుడూ అధిచిత్రణ చాలా ఉపయోగ కరం. పలుచని, పారదర్శక, వ్యతిగత కాంతిమయ అధిచిత్రణనే దాని స్వభావాన్ని అనుసరించి కాచీకరణం(*glaze*) మందీకరణం (*scumble*) అని అంటారు అధిచిత్రణలో నెరియలేర్పడి దిగువన ఉన్న అధశ్చిత్రణం బయటికి కనబడితే అటువంటి అధిచిత్రణను కుంచి కాకర్షణం (*dragging stroke* )అని వ్యవహరిస్తారు.

**over pigmentation** : ***వర్ణాధిక్యత.***

వాడుకొనే వర్ణద్రవ్యాన్ని అనువైన రీతిలో ఉపయోగించటానికి సముచితమైన మృదు

లా స్థిరతను సమకూర్చటానికి కావలసినంత తైలాన్ని సమకూర్చకాలని నాళికా వర్ణపు పరిస్థితిని తెలియజేసేవరం. తైలం ఎక్కువగా చేరుతుందని వర్ణనాళికా నిర్మాత వహించే అతిమాత్రపు జాగరూకతకు ఇది ఫలితం కావచ్చు. ఎక్కువగా తైల భరితము లైన రంగులను వాడేటి, కొందరు కళాకారులు కొన్ని మంచి నాళికా వర్ణాలను సైతం తైలపు నివృత్తికి మించిన వర్ణ ద్రవ్యాన్ని కలిగి ఉన్నాయని అనటం కూడా ఉంది. తైలం గాలా తక్కువై రంగు రబ్బరువలె ఉంది, కరగకపోయే పరిస్థితి యేర్పడినప్పుడు దాన్ని మసీభవసం (*livering*) అంటారు.

**ovolo : కుంభరీతి.**

కుంభాకారంతో ముందుకు పాదన్నత్తాకారంతో పొదుచుకొని వచ్చిన చెక్కడం. అందులో ఎగువన, దిగువన అడ్డుపట్టీలు ఉంటాయి. కుంభాకార పక్కరేఖలో దిగువ భాగాన్ని దిగువపట్టీ వెనక్కు లోతుకుపోయి ఉంటుంది. ఇట్లా కాకుండా ఆ వృత్తాకారం, గుహాకృతిలో లోపలకు ఉన్నప్పుడు దానిని పుటరీతి (*cavetto*) చెక్కడం అంటారు.



కుంభరీతి స్తంభశీర్షం (ఎడమ)
పుటరీతి స్తంభశీర్షం (కుడి)

**Oxford ochre : ఆక్స్‌ఫర్డ్ గైరికం.**

పీత గైరికంతో ఉచ్ఛస్థాయికి చెందింది; ఇది ఇంగ్లాండులో తయారవుతున్నది. కళాకారుల వర్ణాలతో ఒకటిగా దీనికి అక్కడ మన్నన ఉన్నది.

**oxgall : ఉక్షపిత్తం.**

పశువుల పిత్తకోశంనుంచి తీసే పిత్తరసం వల్ల తయారయ్యే ఒక చూర్ణం. నీటి రంగుల చిత్రణలో క్లైదకంగా దీనికి వాడుక ఉండేది. కాని ఆధునిక సంయోజిత ఉత్పన్నములు దీనికి ప్రత్యామ్నాయాలుగా ఇప్పుడు వాడుకలోకి వచ్చాయి.

**ox hair : గోరోమం**

గోజాతి జంతువుల చెవులనుంచి సేకరించే రోమా కళాకారులు తూలికలకు ఈ రోమాలు చక్కగా పనికివస్తాయి. సేబిల్ జంతువు యొక్క రోమాలకన్నా ఇవి గట్టివి ప్రతిఘాత శక్తి కలవి. అందువల్ల ఉత్తమమైన నీటిరంగు కుంచెలకు ఇవి అంతగా పనికి రావు. ద్వితీయ శ్రేణికి చెందిన నీటిరంగు కుంచెలకు ఈ రోమాలతో పాటుగా సేబిల్ రోమాలను కలిపి వాడతారు. అయితే గోరోమాలలోని గుణవిశేషాలను బట్టి, వాస్తుశిల్పి వాడే కర్మతూలిక (*Rendering brush*) వంటి పెద్ద కుంచెలకే దానిని వాడటం సముచితం. అయినా కొందరు చిత్రకారులు, రెండవ శ్రేణికి చెందిన ఒంటి విసురు కుంచె (*single stroke brush*) ను ఎక్కువగా అభిమానిస్తారు. దానిలో గోరోమాలతో పాటుగా సేబిల్ రోమాలు కూడా కలసి ఉంటాయి.

**oxidation** : *ఆక్సీకరణ.*

**oxide** : *ఆక్సైడం; భస్మం.*

1. ఆక్సిజనితో ఒక మౌలికం కలిసినందువల్ల ఏర్పడే యౌగికం. ఇనుపతుప్పు, రాగి కిట్టం మొదలైనవి ఇటువంటివే

2. మార్తవములలో, పర్ణపదార్థాలు ఎటువంటివైనా, వాటిని అన్నిటిని సామాన్య రీతిలో ఆక్సైడములనే వ్యవహరిస్తారు

**oxidizing fire** : *ఆక్సైడాగ్ని; ఆక్సీకరణ తాపనం.*

మార్తవములలో, వాడుకలో ఉన్న ఆవపు కాల్పు; ఆ కాల్పు సాగేటప్పుడు, ఆవపు వాతావరణంలో తగినంతగా (ఆక్సిజని ప్రాణ వాయువు), ఉండటానికి శ్రద్ధ తీసుకొంటారు. అందువల్ల దీనికి ఈ పేరు వచ్చింది.

**oxyacetylene welding** : *ఆక్సి అసితలీన; సంధాన క్రియ.*

ఆక్సిజనితో కలిసిన అసితలీనమే ఇంధనంగా ఉన్న ఒక దండదీపం (*torch*) దీనితో లోహశకటాలను అతకడం. లోహశిల్పంలో ఈ ప్రక్రియ వ్యాప్తి చెందింది

**oxychloride cement** : *ఆక్సిక్లోరిద సిమెంట్.*

మేగ్నసైట్ శిలను, భస్మీకరించి, దానితో తయారు చేసిన రాతి వంటి ఘనపదార్థం. గట్టిగా ఉండి ఎక్కువ మన్నిక కలది ఇది.

**oyster white** : *శుక్తి శ్వేతం.*

ఒక తటస్థపు ఛాయలో ధూసరపువాకతో కనపడే తెలుపు వన్నెకు వాడుకలో ఉన్న పేరు.

## P

**Paddle** : *తాపు*

మార్తవంలో ఒక పని తీరు. తడి మట్టిని ఒక సుషిర స్తూపంగా తీర్చటానికి గాను, ఈ పని ఉపయోగిస్తుంది గుండ్రంగా, స్తూపాకారంగా ఉండే కొయ్యదిమ్మె చుట్టూ తడిమట్టి వంకను అంటపెట్టడంవల్లనో, బల్ల పరుపుగా ఉండే తాపుచెక్కతో ఆ మట్టిని చక్కగా కొట్టటంవల్లన ఈ పని జరుగుతుంది.

**padouk** : *పాదౌకము.*

అండమాను ద్వీపాలలోనూ, ఆఫ్రికా పశ్చిమ, తీరంలోనూ ఒక విధపు వృక్షజాతి నుంచి లభించే దారు విశేషం. గాఢపు ఎరుపు

రంగున ఉండే ఈ కొయ్య గట్టితనానికి పేరు పొందింది.

**pagoda stone :** *సురవేశ్మిక.*

ఒక విధపు చీనీయ చంద్రశిల; ఈ జాతిని నిలువుకోత, కోసినప్పుడు, అందులోని ధారలు దాదాపుగా ఒక దేవాలయ (సుర వేశ్మికా) రీతిలో కనబడతాయి.

**paint .** *పూతరంగు; ప్రలేపం, వర్ణలేపం; రంజకలేపం, వర్ణకం విలేపం.*

ఒక ద్రవంలో ఒక వర్ణం కలిపి వర్ణపదార్థాన్ని చక్కగా నూరి అందులో కణాలు చక్కగా విడివిడిగా ద్రవంలో వ్యాపించేట్లు చేయగా, గరిటె జారుడు రీతిగానో, ముద్దరీతిగానో తయారై, పూతకు పనికివచ్చే ద్రవ్యం పూతపూసిన వస్తువుకు గట్టిగా అంటి పెట్టుకొని, ఆ వస్తువును, ఒక రంగును రక్షణను కల్పించటానికి ఇది పనికి వస్తుంది. ఇటువంటి పూతరంగు తయారీలో ద్రవంతో కలిపిన వర్ణపదార్థాన్ని గట్టిగా నూరటం అత్యావశ్యకం. ఇందువల్ల వర్ణపదార్థకణాలువిడివిడిగా చెదరిద్రవంగా వ్యాపించటానికి అంటే ద్రవంలో అంతటా ఒకే తీరుగా వ్యాపించిఉండటానికి వీలుకలుగుతుంది. అప్పుడు కరకుగాని, సుద్దలుగానీ అందులో ఉండవు ఈ పూతరంగుల తయారీలో ఒక విధమైన మిల్లులు (తిరగలి యంత్రములు) వాడుకలో ఉన్నాయి. ఈ మిల్లులు వర్ణాలను నూరటంలో వర్ణద్రవ్యపు మూల కణాలపరిమాణానికి ఎటువంటి భంగమూరాదు కణాలను ఆ మిల్లులు ధ్వంసం చేయవు. తగిన ఒత్తిడిని కలిగించటం మాత్రమే ఆ మిల్లులలక్ష్యం వాడేకళాకారులుతైలవర్ణాలవంటి ముడివాటవు పూతరంగులు రోలరు మిల్లుపల్లనే తయారవుతుంది. దానికన్నా ఎక్కువ జారుడుగా ఉండే పూత రంగులను బాలు మిల్లులో తయారుచేయవచ్చు. అయినా ఈ పూత రంగులను ఏ కొద్ది ప్రమాణంలోనో తయారు చేయదలచినప్పుడు పాత్రాన్ని వలకరాతిని ఉపయోగించి, చేతో తయారు చేసుకోవచ్చు.

**paint box :** *ప్రలేప పేటిక*

**painter :** *చిత్రకారుడు; చిత్రలేఖకుడు; రంగాజీవుడు; రంగాజీవి; చిత్రజ్ఞుడు; చిత్రజనుడు*

**painterly :** *వర్ణప్రశస్త.*

1. తూలికా భంగమున రాటుదేరిన పనితనాన్ని, తూలికపైనా వర్ణమాధ్యమంపైనా తగిన అదుపుదలను కలిగి ఉండటాన్ని సూచించే సాంకేతికకౌశల్యతను, వర్ణాల పొందికను సంతరించడంలో రూపొందే మనోరంజకతను కలిగిన కళా రచనగూర్చి చెప్పేటప్పుడు వాడే విశేషణం అత్యుత్తమ స్థాయికి చెందిన సాంకేతిక, సౌందర్య భావనా ప్రమాణాలకు అనుగుణంగా చిత్రంలోని ప్రతి అంశాన్ని అంతస్సారంతోసహా రూపించే కళారచనకు కూడా విశ్లేషణంగా ఈ పదాన్ని వాడవచ్చు.

2. చిత్రలేఖనంలో, శిల్పంలో, వాస్తువులో రూపాన్ని నిరూపించటంలో సాధనంగా రేఖకన్నా స్థాయి రాశులకు ఎక్కువ

ప్రాముఖ్యాన్ని కల్పించటాన్ని తెలియజేసే పదవిశేషం. తాను రచించిన 'కళాచరిత్రలో ముఖ్య సూత్రాలు' (*principles of art history*-1905) అనే అర్థమిచ్చే పేరుగల గ్రంథంలో ఈ పదాన్ని-అంటే దీనికి మూలమైన మేలేరిష్ అనే జర్మన్ భాషాపదాన్ని-హెన్రిక్ వుల్ఫ్లిన్ మొట్టమొదట ఉపయోగించాడు ఇటువంటి చిత్రం,ఆ రచయిత అభిప్రాయంలో రూపీకరణను తెలియజేసే రేఖాకారుడి పనితనం మీద కన్నను రంగుతావుల లేదా కాంతి వెలుగుల వైశిట్యంపైనే ఎక్కువ ఆధారపడి ఉంటుంది. ఇందులో బాహ్యరేఖా రీతి స్పష్టంగా అంతగా లేకపోవడంవల్ల ద్రష్ట యొక్క దృష్టి చిత్రణయందు అంతటా విచ్చలవిడిగా చరించగలుగుతుంది అందుచేత చిత్రంలో ఒక విధమైన గతిశీలతాభ్రమ స్ఫురిస్తుంది. రెంబ్రాన్ట్ రచనలలో ఈ గుణవిశేషం సారభూతంగా కనపడుతున్నదని వుల్ఫ్లిన్ భావించాడు. 15, 16వ శతాబ్దాలలో అభివృద్ధిని పొందిన తైలచిత్రణ ఈ విధమైన శైలికి చాలా అనుకూలంగా ఉండేది. జిగురు రంగుల మాధ్యమంవల్ల సాధ్యంకాని పద్ధతిలో లేతఅంచుల రూపాలను తైల వర్ణాలతో రూపించ గలగటం ఇందుకు ముఖ్యకారణం

**painter's etching** : *చిత్రక మాపిక్రియ.*

తొలి అచ్చు ముద్రకు పర్యాయ నామం; కాని ఇది ఇప్పుడు వాడుకలోలేదు.

**paint film** : *లేపపటలం; చిత్రపటలం.*

**painting** : *వర్ణచిత్రణ; చిత్రణ; రంగుపూత; చిత్రలేఖనం; వమాలంభనం*

ఒక ఉపరితలానికి, లేదా భూమికకు పూత రంగును కుంచెలతో పట్టించి, తద్వార సౌందర్య స్ఫోరకమైన ఒక రచనను సృష్టించే ప్రక్రియ. చిరస్థాయి పొరతి చిత్రలనుగానీ, కుడ్య చిత్రాలనుగానీ రచించటాని ఆమోదితములైన ప్రముఖ సాంకేతిక ప్రక్రియలు ఈ రీతిగా ఉన్నాయి: 1. తైలవర్ణం 2. జిగురు రంగు; 3. నీటిరంగు; 4. గవా[illegible] వర్ణం; 5. పిండి రంగు 6. పాలిమార్ రంగ 7. భిత్తి చిత్రణ 8 దాహ చిత్రణ. పైవా[illegible] నుంచి తన అభిరుచిని అనుసరించి, త[illegible] చేతిలో ఉన్న పనికి తగి ఉండటం గమనించి తాను పొందదలచిన ఫలితాలను దృష్టిలో పెట్టు కొని, చిత్రకారుడు తనకు తగిన ప్రక్రియను సామగ్రిని, పనిచేసే పద్ధతులను నిర్ణయించు కొని చేపడతాడు.

**painting knife** : *పూతకత్తి.*

పలచగా ఉండి, అటూఇటూ వంచటాని వీలుగా ఉండే పదునుకు్క జద్ద. దీని అగ్ర[illegible] కొన్నింట గుండుదీరి ఉండటం ఉండిగా[illegible] తరచుగా అది పొడవుసాగి, చివరన త్రిభు[illegible]



పూతకత్తులు

కారంగా ఉండి, గుండుగా కొనదే ఉంటుంది. రంగుతా పీ చిత్రణ అనే ప్ర[illegible]

యలో ఇది పనికి వస్తుంది. సాధారణపు రంగు తాపీతో రంగు పదార్థాన్ని అచ్చంగా నిర్దిష్టరీతిలో కావలసిన అల్ప ప్రదేశంలో చేర్చ టానికి వీలుండదు ఇటువంటి సందర్భంలో పూతకత్తి బాగా ఉపయోగిస్తుంది 19 వ శతాబ్ది ఉత్తరార్థంనుంచి ఇది వాడుకలో ఉన్నది.

**painting medium :** ప్రలేప మాధ్యమం.

**paint quality :** ప్రలేప లక్షణం.

ఒక తైల చిత్రంలో ఉపరితలపు చక్కదనాన్ని వర్ణించేటప్పుడు వాడే పదం. మాధ్యమాన్ని చక్కగా గుర్తెరిగి ఉపయోగించే కుశలతను ఈ పదం తెలియచేస్తుంది ఏ రకపు రంగుకైనా ఈ పదాన్ని వాడే వీలున్నా సాధారణంగా అది తైలచిత్రణకే వాడబడుతున్నది. ప్రలేప లక్షణం అనే ఈ పదం కళాకారుడి ప్రజ్ఞా పటిమకు సంబంధించినదేగాని, వర్ణ సామగ్రికి చెందింది కాదు.

**paint remover :** వర్ణహారి.

గోడలపైనుంచి, గృహోపకరణ సామగ్రిపై నుంచి, లేదా ఇటువంటివే అయిన తదితర రకముల నుంచి,పాతబడిపోయి గట్టిపడిన రంగుపూతను తొలగించటానికై వాడే ఒక ద్రవ విశేషం, లేదా పిష్ట యౌగికం. ఇది సాధారణంగా రంగులమ్మే దుకాణాలలో లభిస్తుంది. అటువంటి పాత రంగుపూతలపై ఈ వర్ణహారిని మొదట పైపూతగా పట్టిస్తారు. తర్వాత ఆ పూతను కొంతకాలం ఆరనిస్తారు. ఆ మధ్యకాలంలో వర్ణహారిలోని పదార్థం చర్యవల్ల పాతపూత కరగిపోతుంది. అప్పుడు పలచని బద్దరేకుతో ఆ పైపూతను గీరివేస్తారు. చాలా వర్ణహారులలోని అంతర్గత ద్రవ్యాలు చర్మరోగాలు సంక్రమింపజేసేవి కావటంవల్ల వాటిని తగిన జాగ్రత్తతో వాడవలసి ఉంది ఆ అంతర్గత ద్రవ్యాలనుంచి విషభరిత వాయువులు వెలువడే అవకాశం కూడా ఉంది. కాబట్టి గాలి వెలుతురులు బాగా తగిలే అవకాశమున్న ఉపరితలాలకు-అంటే ముఖ్యంగా ఇంటి బయటి తలాలకు-మాత్రమే ఈ వర్ణహారులను ఉపయోగించ వచ్చు. వీటిని చిత్రకారులు, తమ చిత్రాల రంగుల తుడిచివేతకు ఏనాడూ ఉపయోగించరు.

**paint standard :** వర్ణక ప్రమాణం.

కళాకారుల తైలవర్ణాలకు వాణిజ్యప్రమాణ నిర్ణయం (*commercial standard for artists oil paints* CS 98-62) అనే దానికి ప్రజాసామాన్యంలో వాడుకలో ఉండే సంక్షిప్తనామం కళాకారులు వాడదగిన తైల వర్ణాలు ఉత్తమస్థాయిలో ఉండటానికి కావలసిన కనీసమైన గుణవిశిష్టతలను నిర్ణయిస్తూ, ప్రామాణికములగు నిర్దేశాలను ఇందులో పొందుపరచడం జరిగింది. యు స్టేట్స్ ప్రభుత్వపు వాణిజ్యశాఖ ఈ ప్రమాణ నిర్ణయాన్ని చేసింది. రంగుల తయారీదారులూ, కళా వ్యవస్థల ప్రతినిధులూ. ప్రమాణ నిర్ణాయక జాతీయ మండలి (*National Bureau of Standards*) తమకు తామే ముందుకువచ్చి ఈ ప్రమాణాలను అంగీకరించి, అమలుకు తెచ్చారు. కాలానుగుణంగా ఇది మార్పులు కూడా పొందింది. తెలియవచ్చినంతవరకూ అటువంటివాటిలో చివరది 1962లో జరిగింది. దీనికి కాలానుగుణంగా మార్పులు చేయటానికి, ఒక స్థాయీసంఘం ప్రభుత్వ ప్రోత్సాహంతో

పనిచేస్తున్నది ఈ ప్రమాణాలను అంగీకరించే వ్యక్తి తాను తయారుచేసే వర్ణనాళికలపై తామనుసరించిన నిర్దేశపు సంఖ్యను అందుకై తాను సూచించదలచిన విషయాన్ని తెలియ చేయాల్సి ఉంటుంది ఈ ప్రమాణ నిర్ణయం వల్ల వర్ణ ద్రవ్యాల నామకరణలో హేతుబద్ధమైన ఒక విధానం అమలులోకి వచ్చింది

**paint vehicle** ప్రలేప వాహిక

**palatial building** ప్రాసాదం

**pale** పాండుర

**palette** వర్ణ ఫలకం, రంగు పలక; రంగు పత్రం; వర్ణపత్రం

1 అండరేఖాకృతిలోనో లేదా బద్ద వాటంగానో నిడివిమీరి ఉండే ఒక ఫలకం దీనికి బొటనవేలు దూర్చి పట్టుకొని ఉండటానికై, దీనికి ఒకవైపున అమరిక ఉంటుంది ఈ ఫలకంపై చిత్రకారుడు తన రంగులు అమర్చి ఉంచుకొంటాడు ఈ పలకను తేలిక చెక్కతో సాధారణంగా తయారుచేస్తారు, అల్యూమినియంతోనో ప్లాస్టిక్‌తోనో ఈ కాలంలో కొందరు తయారు చేస్తున్నారు కొయ్య పలకలలో సైతం ల్ల రతో చేసి వాటిని కొందరు అభిమానిస్తారు కొందరు లక్కవార్నిష్ వేసిన తెల్ల పలకలు, లేదా అపారదర్శకపు పలకలను వాడతారు ఒక్కొక్కప్పుడు ఇటువంటి పలకకు బదులుగా కొందరు చిత్రకారులు పై భాగంలో గాజు లేదా చలువరాయి పరుపుడు కలిగిన మేజాలనే తమ రంగులను అమర్చటానికి వాడుకొంటున్నారు (చూ : *arm palette, dispo sable palette*)

2 వర్ణచిత్రణకు సంబంధించిన ప్రక్రియలో, లేదా పద్ధతిలో, లేదా మాధ్యమాలలో వాడదగిన లేదా వాడటానికి లభ్యమయ్యే రంగులన్నిటికీ సమాహారనామం

3 ఒకానొక ప్రత్యేక చిత్రాన్ని రచించటానికై తాను వాడాలని నిర్ణయించుకొన్న రంగులన్నిటికీ కళాకారుడు వాడే సామూహిక నామం

4 చూ *potter's palette*

**palette cup** ఫలక స్థాలి

ఒక చిన్న గుండ్రటి గిన్నె దీన్ని సాధారణంగా అల్యూమినియంతో చేస్తారు ఇటువంటిది ఒక గిన్నెగాని రెండు గిన్నెలు గాని ఉంచబడిన ఒక సన్నని లోహపు బద్దకు అతుకబడి ఉంటాయి ఈ గిన్నెలతో అతుకబడిన బద్దను వర్ణ ఫలకపు అంచుకు బిగించి ఉంచే ఏర్పాటు ఉంటుంది వర్ణఫలకాన్ని వాడుకొనే చిత్రకారుడికి పని చేసేటప్పుడు అవసరమైన ప్రతి సమయంలోనూ, తూలికను ముంచుకొని తీయటానికి అనువుగా కర్పూరతైలమును, లేదా వేరొక మాధ్యమమును ఈ గిన్నెలలో ఉంచుతారు



జమిలి ఫలకస్థాలి

ఇటువంటి ఫలక స్థాలికే బ్రిటనుదేశంలో డిప్పర్ (*dipper*) లేదా డిప్పర్‌కప్ (*dipper cup*) అనే పేరుంది

**palette knife** : *రంగుతాపీ; ఫలకచ్ఛురిక*

పదును తక్కువతో చేసి, బద్దలేని, చివరన గుండ్రంగా కొనదేరి ఉండే తాపీ వంటి ఒక పరికరం. గట్టి కొయ్యపిడిలో ఇది బిగించబడి ఉంటుంది. దీనిలో సూటిబద్ద రీతిలోను, చివర కొనసాగి ఉండే రీతిలోను రెండు రకాలున్నాయి. వీటిలో ప్రతి రకంలోనూ ప్రమాణభేదాలు అనేకమున్నాయి. సాధారణంగా వాడే వాటి బద్దలు 3 మొదలు 4 అంగుళాల నిడివిలో ఉంటాయి. పిడితో పిడిలో సూటిగా అమరేవి కొన్ని ఉంటాయి. అట్లాకాక కొన్ని, పిడిలో దూర్చే చోట, కోణంగా పైకిలేచి ఉంటాయి. ఈ రెండో రకపు వాటిని వాడేటప్పుడు పిడిని పట్టుకొన్న పిడికిలి వేళ్ళకు రంగు తగలకుండా ఉంటుంది. వర్ణఫలకం నుంచి రంగును అందుకోవటానికి, ఎక్కువగా వర్ణ రంగును గీకివేయటానికి, తైలంతోనో ఇతర వాహకాలతోనో రంగులు కలపటానికి, కాడికపై రంగు పూతను సమపాళంగా నెరపటానికి ఈ రంగుతాపీ పనికి వస్తుంది. అయితే పైన చెప్పిన పనుల్లో చివరదానికి రంగుకత్తి (*painting knife*) బాగా పనికి వస్తుంది. దీర్ఘకాలం ఒక రంగుతాపీని వాడినప్పుడు దాని బద్ద అంచులు అపాయకరంగా వాడిదేరే ప్రమాదం ఉంది. కాబట్టి అప్పుడు అటువంటిదాన్ని పారేయాలి



రంగు తాపీలు

**palette-knife painting** : *రంగుతాపీ చిత్రణ.*

తూలికతో గాకుండా బద్దపాటు పరికరంతో తైలవర్ణాలను చిత్రరచనలో వాడే ప్రక్రియ. ఈ ప్రక్రియకు ఎక్కువగా పనికివచ్చేది రంగుకత్తి; ప్రత్యేకంగా ఇటువంటి ప్రక్రియ కొరకై అది రూపొందించబడింది. వర్ణ ఫలకంపైన రంగులను కాడీ యెత్తున కలపటానికి వాడదగిన రంగుతాపీ ఇటువంటి చిత్రణకు అంతగా పనికిరాదు. ఈ విధంగా బద్దవాటు పరికరం సాయంతో రంగును పట్టించడం లేదా పరిచిన రంగును సరిచేయటం అనేవి 17వ శతాబ్దం నాటికే అమలులో ఉన్నట్లు తెలుస్తున్నది. కాని రంగుతాపీ చిత్రణ అనేది ఒక ప్రత్యేక ప్రక్రియగా పరిగణనం పొందటం 19వ శతాబ్ది మధ్యభాగం నుంచి. అంటే వాణిజ్య దృష్టితో రంగులను ప్రమాణీకరణను చేసి, అటువంటి వాటిని నాళికం రూపాలలో విక్రయించడం మొదలైనప్పటి నుంచి మాత్రమే మొదలైంది.

**palette, limited or palette, restricted** చూ : ***restricted palette***

**palimpsest** : *పునర్మార్జితం.*

ఒకసారికన్నా ఎక్కువసార్లు తిరిగి తిరిగి వ్రాయటానికి ఉపయోగించే చర్మ పత్రానికి ఈ పేరు మొదట వినియుక్తమైంది. ఒక చర్మపత్రంపైన వ్రాసిన వ్రాతను కడగటం, రుద్దివేయటం, విసర్జీకరించడం లేదా వీటి అన్నిటి, కొన్నిటి కలయికవల్ల తొలగించవచ్చు. అప్పుడు ఆ చర్మంపై తిరిగి దేన్నైనా

వ్రాయబడ్డ చర్మపత్రాలు కాలక్రమాన, కావలసిన మొత్తంలో లభించక వాటికి కరవేర్పడినప్పుడు, ఇటువంటి పునర్మార్జిత పద్ధతి గ్రీకుల కాలంలోనే అమలులోకివచ్చి రోమన్ యుగంలోనూ, తరవాత మధ్య యుగాలలో కూడా ఆదరణ పొందింది. ఈ పద్ధతివల్ల పాతకాలపు కొన్ని విలువైన పత్రాలు లుప్తమవుతాయని భయమేర్పడి, పునరుజ్జీవన యుగంలో ఆ పద్ధతిని చట్టరీత్యా నిషేధించినా ఆ చట్టం బాగా అమలులోనికి వచ్చే వరకు చాటుమాటుగా ఈ పద్ధతి కొనసాగింది. ముద్రణ వచ్చిన తరవాత చర్మపత్రాలకు సంబంధించిన ఈ ప్రక్రియ అంతమొందినా, 'పునర్మార్జితము' అనే పదానికి విస్తృతార్థం కలగజేసి-తిరిగి వాడిన కాగితానికీ, ఫలకానికీ లేదా పత్రానికీ-కళారంగంలో ఇది వాడటం జరిగింది. ఇందువల్ల ఒకసారి చిత్రం గీసిన కాగితంపైన, ఆ చిత్రాన్ని మరుగుపరస్తూ వేరొక చిత్రాన్ని రచించినా లేదా ఒకవైపు చిత్రాన్ని రచించిన తరవాత, దానిని బోరగిలా తిప్పి రెండో వైపున ఇంకొక చిత్రాన్ని రచించినా అటువంటి కాగితను 'పునర్మార్జితం అనటం పరిపాటి అయింది. స్మారక చిహ్నంగా ఒక ఇత్తడి రేకుపై ఒక లేఖనాన్ని రచించి, ఆ తరవాతి కాలంలో ఆ రేకును తిప్పివైచి వేరొకరి స్మారకంగా అందు వేరొక లేఖనాన్ని వెలయించినప్పుడున్ను అటువంటి ఇత్తడి ఫలకాన్ని 'పునర్మార్జితం' అంటారు.

**palladium leaf** : *పల్లేడియం పత్రం.*

పత్రరంజన ప్రక్రియలో వెండిలాగా మెరుపు కలిగించటానికి వాడే, సన్నని లోహపత్రం. ఇందుకు ఉపయోగించేది పల్లేడియం (నక్షత్రకం) అనే ఒక ప్రత్యేక లోహం. ఇది రసాయనిక శాస్త్రరీత్యా ప్లాటినమ్ వర్గానికి చెందింది. వెండికి గల మిలమిల మెరుపుకన్నా దీని మెరుపు తక్కువ అవటం నిజమే. అదీగాక దీనిలో సీసపు రంగువాక కూడా కనపడుతుంది. అయినా, సాధారణపు ఉష్ణోగ్రతా పరిస్థితులలో వెండిలాగా ఇది రంగు మాసిపోదు. కాబట్టి చిరస్థాయిగా ఉండాలని ఆశించే చోట సందర్భంగా, వెండికి బదులుగా దీన్ని తరచుగ వాడుతున్నారు.

**palmette** : *తాళవృంతాలంకృతి.*

ఒక సాంప్రదాయిక అలంకృతి విశేషం: తాటియాకును పోలి, దిగువన ఒక నిర్దిష్ట బిందువు నుంచి నాలుగు పక్కలకు దీనిలో రేకులు చిమ్మినట్లుంటాయి సాంప్రదాయిక వాస్తువులో ఇటువంటి అలంకృతికి ఎక్కువ



తాళవృంతాలంకృతి

ఆదరణ ఉండేది గ్రీకులు తమ శిల్పాలలో చూపించిన పత్రపుష్పాలంకృతులలో ఈ తాళవృంతాలంకృతి తరచుగా కనపడుతుంది.

**panel** : *ఫలకం.*

చిత్రాల రచనకు అనువుగా ఒక భూమికను సంతరించుకొని చదునుగా, గట్టిగా ఉండి చిత్రణకు ఆధారంగా ఉండేది. ఇది కొయ్య ఫలకగా ఉండవచ్చు; లేదా కుడ్యతలమై ఉండవచ్చు. తెల్లటప్పం వట్టించిన ఫలకాలను సాధారణంగా జిగురు వర్ణాల చిత్రణకు వినియోగిస్తారు: అయినా పీటిపైన. తైలచిత్రణ కూడా చేయవచ్చు. ఈ విధంగా తైలచిత్రణను చేయదలచేటప్పుడు ఆ ఫలకం పైన మొదట తైలభూమికను ఏర్పరచేదరు ఫలకాల భూమికలో శాంతవతను నెలకొల్పటానికి వీలున్నా, కాటికను కాదని దీన్ని అభిమానించే పలువురు చిత్రకారులు ఫలకం నునుపుగా, గట్టిగా ఉండాలనే కోరుతారు. కాటిక కన్నా కొయ్యఫలకం గట్టితనంలో మిన్నకావటం వల్ల కాటిక కన్నా ఎక్కువ కాలం మని ఉండగలదని కొందరి అభిప్రాయం; కాని, మ్యూజియాంలోని కళాఖండాల పరిరక్షకులు - కాలగతిలో వచ్చే మార్పులవల్ల - కాటికారచన అయినా, ఫలకరచన అయినా ఒకే తీరుగా దెబ్బతింటాయని అంటారు.

**panel painting** : *ఫలక చిత్రణ*

**Pannetier's green**: *పన్నేషియర్ హరితం*

పాలాశికకు ప్రాచీననామం, దీన్ని మొదట కనుక్కొన్న వ్యక్తి పేరిట ఈ వ్యవహరణ ఏర్పడ్డది. కాని ఇప్పుడు ఇది వాడుకలో లేదు.

**panorama** : *నకలదృశ్యం; పరిదృశ్యం*

1. ఒక విశాల భూతలాన్ని, దాంట్లో ఏదీ తప్పిపోకుండా చూసేటప్పటి దృశ్యం.

2. 18, 19. శతాబ్దాంలో ప్రదర్శన చిత్రాలకై అవలంబించిన ఒక ప్రక్రియ. విద్యాబోధనకేగాక వినోదానికి కూడా అది ఆ కాలంలో ఉపకరించి, ప్రజాపీకపు మన్ననను ఆర్జించింది. ఇందులో నిరంతర రీతిలో ఒక ప్రదేశపు చిత్రణ, అతి విస్తృతంగా సాగేది. ఒక్కొక్కప్పుడు ఇది ఒక ప్రయాణంతో ముడివడ్డట్లు చిత్రితమయ్యేది దీన్ని అతిదీర్ఘమైన కాటికపై చిత్రించి, ఆ కాటికను చుట్టగా చుట్టిఉంచి, ప్రదర్శించవలసి వచ్చినపుడు ఆ కాటికను గది గోడలకు మూడి పరచి పరచేవారు. ఇటువంటి కాటికా ప్రదర్శనంతో, అందులోని విషయాలను వివరించే ఉపన్యాసకులూ, సందర్భోచితంగా పాటలు పాడేవారూ ఉండేవారు. ఒక విధంగా ఇవి ఆ తరవాతి కాలపు చలనచిత్రాలకు మార్గదర్శకాలైనట్లు భావించవచ్చు.

**pantheon** : *దేవస్తోమం; సర్వదేవాలయం.*

గ్రీకుల ప్రాచీన వాస్తువుగో దేవతల కంద రికి అంకితమైన ఒక ఆలయం ఒక మతానికి చెందిన దేవతలందరినీ, లేదా కొందరిని ఒకే ఒకచోట రూపొందించటానికి కూడా ఈపదం వాడతారు

**pantograph** : *ప్రతిలేఖిని; రూపవివర్ధిని.*

ఒక కళారచనకు ప్రతిప్రతిని తీర్చటానికి, ఆ రచనను విపులీకరించటానికి లేదా తగ్గించి చూపటానికి పనికివచ్చే పరికరం. కొయ్య లేదా అనువైన ఇంకొక ద్రవ్యంతో తయారైన నాలుగుబద్దలు, ఒక చదరంగా రూపొందేట్లు మరతబందులవల్ల సంధించబడినప్పుడు

ఇది రూపొందుతుంది. అట్లా చదరంగా



ప్రతిలేఖిని

రూపొందేటప్పుడు ఒక బద్దపై ఇంకొకబద్ద నిడివిసాగి పైన ఉండటం సంభవించి, ఆ చదరాన్ని కావలసిన ప్రమాణానికి సర్దుకొనే వీలు ఉంటుంది. ఇది దారా ప్రమాణాలలో లభిస్తుంది.

**Papal cross :** *పోపు సిలువ.*

లాటిన్ సిలువలలో ఒకటి. ఈ సిలువలోని అడ్డుకడ్డీకి పైన దానికి సమాంతరాలుగా అదనంగా రెండు అడ్డుకడ్డీలు ఉంటాయి. అయితే ఇందులో పైన ఉండేది క్రిందిదాని కన్నా పొడుగు తగ్గి ఉండగా, ఈ రెంటిలో ఏదీ మొదటి అడ్డుకడ్డీని మించిన నిడివిలో ఉండదు. పోపును ఊరేగించేటప్పుడు ఇటువంటి సిలువను ఆయన ముందుంచి తీసుకొని పోతారు.

**paper :** *తంతువస్త్రం.*

వివిధములైన చెట్ల పీచులను కల్రదొక్కి- విశ్నగా, చదునుగా, సన్నగా తీర్చిదిద్దగా ఏర్పడే ఒక విధపు కాగితం. ఆలేఖనంలో, నీటిరంగుల చిత్రణ, లోపిష్టక చిత్రణలో, గ్రావిక కళా సాంకేతిక రీతులలో సమాహార భూమికగాను, ఆలంబనంగాను ఇది పనికి వస్తుంది.

**paper dimensions :** *కాగితాల పరిమాణాలు.*

నీటివర్ణపు కాగితాలూ, ఆలేఖ్యపు కాగితాలూ అనేక ప్రామాణిక పరిమాణాలలో విభిన్న నామాలతో, లభిస్తున్నాయి. ఇటువంటి వాటిలో ఉత్తమమైనవి చేతిపనివల్ల తయారవుతూ ఉండటంవల్ల వాటి కొలతలలో కొన్ని హెచ్చుతగ్గులు తప్పక ఉంటాయి అందువల్ల ఈ దిగువ ఇచ్చిన పరిమాణాలను అందాజు కొలతలుగా మాత్రమే గ్రహించాలి. ఈ కొలతలు అంగుళాలలో ఇవ్వడం జరిగింది. పేర్లు సాంప్రదాయిక రీతిని అనుసరించాయి: డెమీ 15 × 20; మీడియమ్ 17 × 22; రాయల్ 19 × 24; సూపర్‌రాయల్ 19 × 27 ఇంపీరియల్ 22 × 30: ఎలెఫెంట్ 28×2[illegible] డబల్ ఎలెఫెంట్ 27 × 40; యాంటిక్వే[illegible] యన్ 31 × 53 (చూ : *water colour paper.*)

**paper - stencil method :** *వస్త్ర - తైజస ప్రక్రియ.*

కాగితపు ముక్కల నుంచి, తైజస రేఖాంకనమును (*stencil design*) తయారు చేసి, అటువంటి దానిని ఉపయోగించి కౌ[illegible] సాగించే కౌశేయ యవనికా ప్రక్రియ. మూ[illegible] రేఖాంకనంపై ఒక ప్రత్యేకపు కోవకు చెంది[illegible] పారదర్శిక, తైజస వస్త్రం మొదట ఉంచి రేఖాంకనంలో ముద్రణకు ఉద్దిష్టాలై[illegible] ప్రదేశాలను, ఆ పత్రంపై ఒక తైజసఛ్ఛేది[illegible] సాయంతో అనులేఖనం చేస్తూ ఛేదిస్తారు అప్పుడు కౌశేయ యవనికను తైజసం పై[illegible] దించి, ఒక ప్రత్యేక పరికరం ద్వారా [illegible] యవనికపై మందపు రంగుపూతను గట్టిగ

పూస్తారు పిపివల్ల రేఖాంకనం కలిగిన తైజసం, యవనిక దిగువ భాగానికి గట్టిగా అంటుకొని నిలిచి ఉంటుంది. అప్పుడు ముద్రించవలసిన ప్రదేశాల రేఖాంకనాన్ని తైజసం నుంచి తొలగించగా, దానిలోనుంచి లోనికి రంగు చొరబారటానికి వీలేర్పడుతుంది. వేర్వేరు రంగులు కలసిన అచ్చు కావలసినప్పుడు ప్రతి రంగుకు ఒక్కొక్క తైజసాన్ని, చేదించవలసి ఉంటుంది.

పై ప్రక్రియలో ప్రత్యేకపు పారదర్శకపు తైజసపత్రానికి బదులుగా తెల్లటి సన్నని బాండు కాగితాన్ని కూడా వాడవచ్చు. అయితే సాధారణపు అనులేఖన పత్రాన్ని (*tracing paper*) వాడకూడదు. అవసరమైతే, తగినంతగా పారదర్శకంగా చేయటానికి తైజస వస్త్రంపైనా లేదా బాండు కాగితంపైనా కావలసినంతగా కర్పూరతైలాన్నో, కిరోసిను నూనెనో రుద్ది దాన్ని ఎక్కువ పారదర్శకంగా చేయవచ్చు.

ఈ ప్రక్రియలో నీటి రంగులు అంతగా ఉపయోగపడవు

**papier mache** : *పత్రపిష్టం: కాగితపుగుజ్జు; పతాపిస్తర పపికపియ*

రూపీకరణకు పనికివచ్చే ఒక పదార్థం. కాగితాన్ని చిన్న చిన్న ముక్కలుగా చింపి, తొక్కి ముద్దచేసి, ఒక బంధకంలో తగిన రీతిలో కలపగా ఇది తయారవుతుంది. ఆ బంధకం-గంజి, పిండి, లేదా గోధుమ బంక (*dextrin*) లలో ఏదైనా-కావచ్చు. ఆకారికముగా ఉండి, సాధారణపు వాడుకలో ఉండే కొన్ని వస్తువుల తయారీకి దీన్ని ఉపగిస్తారు. దీనితో తయారైన అటువంటి వస్తువులకు, సాధారణంగా రంగులు వేయటమూ వార్నిషు పూయటమూ జరుగుతుంది 'పేపియర్ మాచీ' అనేది ఫ్రెంచిభాషా పదం; దాని అర్థం నమిలిన కాగితం.

**papiers colles** : *అతుకుపత్ర ప్రక్రియ.* (చూ : ***collage***)

**papyrus** : *పపైరం; నలపత్రం; తుంగకాగితం.*

క్రీ పూ. 3000 మొదలుగా క్రీ శ. 4వ శతాబ్ది వరకు ప్రాచీన ఈజిప్టులోనూ, దాన్ని అనుసరించిన కొన్ని తత్సమీప పాశ్చాత్య దేశాలలోనూ వ్రాతవనికై ఉపయుక్తమైన ఒక విధమైన కాగితం. తుంగవంటి ఒక నీటిమొక్క కాడల పైపొరలను తీసి, నిలువుగానూ, అడ్డంగానూ, వాటిని అమర్చి, ఒత్తి ఒక దళసరి కాగితంలాగా రూపొందించి, దానిపై ఆ ప్రాచీనులు వ్రాసేవారు. ప్రస్తుతం ఈ జాతి తుంగిమొక్కలు సూడాన్ దేశంలో మాత్రమే ఉన్నాయి. క్రీ. శ. 4వ శతాబ్దంలో చర్మపత్రం (*parchment*) వాడుకకు రావడంతో పపైరపు వాడుక అంతరించింది

**paraffin** : *మెరుగు మైనం.*

అర్ధపారదర్శకమైన ఒక విధపు తెల్ల మైనం పెట్రోలియంను శుద్ధిచేసే సందర్భంలో లభించే ఉపోత్పన్నాలలో ఇది ఒకటి ఇగి ఎటువంటి రాసాయనికపు క్రియకూ సులభంగా లొంగదు. వనస్పతితైలాల,

జంతుతైలాల లక్షణాలకన్నా ఖనిజతైలాల లేదా పెట్రోలియం లక్షణాలే ఎక్కువగా ఇందులో కనవస్తాయి. బజారులలో ఇది పలురకాలలో లభిస్తుంది. వాటి ద్రవీభవన బిందువులు– వాటి వాటి గుణభేదాలను అనుసరించి–50° సెం గ్రే నుంచి 60° సెం గ్రే. వరకు ఉంటాయి. సాధారణపు మెరుగు మైనానికి లలిత కళలలో ఎటువంటి స్థానమూ లేదు. కాని శుద్ధిచేసిన రకాలు – మైక్రోక్రిస్టలైన్ వేక్స్, సెరేసిన్ వంటివి–మాత్రం మైనపు యౌగికాలలోను, అధిసత్తకములలోను, వాసుకలో ఉన్నాయి.

**parallel** : ***సమాంతర; సమానాంతర.***

**parallel perspective** : ***సమాంతర దృష్టిప్రక్రమగతి, సమాంతర దృష్టిప్రక్రమత; సమాంతర దృష్టిక్రమత; సమాంతర దృగ్గతి.***

చిత్రతలానికి సమాంతరంగా, ఒక ముఖోపరితలం కుదుపుకొని ఉండేట్లు ఉన్న ఒక దీర్ఘచతురస్ర ఘనరూపాన్ని పరిశీలించేటప్పటి రేఖాగత దృష్టిప్రక్రమ గతి. ఆ విధంగా ఆ ఘనరూపం ఉన్నప్పుడు ఆ ఒక్క ముఖమూ సంపూర్ణంగా ద్రష్టకు కనపడుతుంది. అటువంటి సందర్భంలో, ఆ వస్తువు యొక్క ఆయతనాలలో రెండిటిని నిరూపించే రేఖలు చిత్రతలానికి సమాంతరంగా ఉండి, ఆ కారణంవల్ల పరస్పరం సమాంతరంగానో, లంబంగానో అమరుతాయి. ఈ రేఖలు తిరోగతి, తిరోహిత బిందువులో పర్యవసించవు; కాని వస్తువులో కొంత వరకు దృశ్యమయ్యే ముఖాలు లేదా ముఖాలకూ, దృశ్యాలు కాని ముఖాలకూ చెందిన నిరూపకరేఖలు తిరోగమన క్రమంలో, చక్రవాళ రేఖ దగ్గర ఒక తిరోహిత బిందువులో సంగమిస్తాయి. ఇట్లా తిరోగమించే రేఖలు, చిత్రతలంతో ఒక నిర్దిష్ట కోణాన్ని చేస్తూ పోతాయి. అటువంటి కోణం-చక్రవాళ రేఖతో అనుసంధించి చూచినపుడు- ఆ వస్తువు యొక్క ఉనికి ఉండే తీరుపై ఆధారపడి ఉంటుంది. ఇటువంటి దృష్టిప్రక్రమ గతిలో తిరోహిత బిందువు ఒక్కటే ఉంటుంది. కాబట్టి దీన్ని ఏక బిందు దృష్టిప్రక్రమ గతి అని కూడా అంటారు.

**parallel rule** : ***సమాంతర రేఖిణి.***

యాంత్రికాలేఖనంలో, పెక్కు సమాంతర రేఖలను త్వరగా గీయటానికి ఉపకరించే ఒక పరికరం. రెండు కొలబద్దలను, వాటి అంచులు- రెండు లోహపు బద్దల మధ్య- ఇమిడి ఉండేట్లు చేయటంవల్ల ఇది రూపొందుతుంది. ఒకే కొలబద్దను, ఒక ఇనుప చట్టంలో దిగజారటానికనువుగా తీర్చటంవల్ల రూపొందే ఇంకో రకపు సమాంతర రేఖిణి కూడా ఉంది.

**para red** : ***పారారుణం.***

ఉజ్జ్వలం, కాంతి నిరోధకం అయిన ఆస్థి గర్భ ఫలసర్దపు ఎరుపురంగు కలిగి, నీలి వాక అర్థస్థాయి కలిగిన ఒక రంజకపర్ణం

**parcel-gilt** : ***పాక్షిక రంజితం.***

ఒకవైపు మాత్రమే రంజనం పొందిన వస్తువును-ముఖ్యంగా వెండి వస్తువును-వర్ణించే సందర్భంలో వాడే-ఒక విశేషణం.

**parchment : చర్మపత్రము.**

వ్రాతపనికి, చిత్రలేఖనానికి అనువుగా పదును చేసిన జంతుచర్మం. తరచుగా గొర్రె లేదా మేకచర్మమే ఇందుకు వినియుక్తం. అప్పుడూడ చర్మాన్ని వినియోగించి చేసే చర్మ వత్రానికి వాల్సుకం (*vellum*) అనే ప్రత్యేకనామం ఉంది. అయితే వ్రస్తుతానికి వెల్లమ్ (వాల్సుకం) అనే పదం-మంచి వలుకు గలిగిన-అజినపత్రానికి వాడుతున్నారు. క్రీ. పూ. రెండవ శతాబ్దిలో మొట్టమొదటి సారిగా రోములోనూ, పశ్చిమ ఆసియా, ఉత్తర ఆఫ్రికాలలోనూ చర్మపత్రం వాడుక లోకి వచ్చింది. ఆసియా మైనరులో పెర్గమమ్ అనే రాజ్యానికి పాలకుడుగా ఉన్న యూమినెస్ II (క్రీ.పూ. 197-158) దీనిని మొదట వ్రాతకై ప్రవేశపెట్టాడని ప్లినీ అనే పండితుడి వ్రాతవల్ల తెలుస్తున్నది. ఆ రాజు తన నగరంలో ఒక గొప్ప గ్రంథ భాండాగారాన్ని నెలకొల్పాడు. ఈజిప్టు దేశ ప్రభువులైన తోలెమీ వంశీయులు అందుకు అసూయాగ్రస్తులై ఆ కాలంలో వ్రాతలకు ఉపయోగిస్తున్న పపైరసు (రెల్లు కాగితం) తమ దేశంనుంచి ఎగుమతి కాకుండా కట్టు దిట్టం చేశారు. అటువంటి కాగితం ఆకాలంలో ఈజిప్టులో మాత్రమే లభ్యమై ఇతర ప్రాంతాలకు ఎగుమతి అవుతుండేది ఈజిప్టు ప్రభువుల అటువంటి నిషేధాజ్ఞవల్ల తమ గ్రంథ భాండాగారంలో సాగే రచనా కృషి ఆగిపోకుండా ఉండటానికి యూమెనెస్ II చర్మపత్రాలను ప్రవేశపెట్టాడని ప్లినీ వ్రాశాడు. మధ్యయుగాలలో చర్మపత్రాలకు విరివిగా ఆదరణ పాశ్చాత్యలోకమందంతటా లభించింది. కాగితం వాడుకలోకి వచ్చిన తర వాతసైతం రూపచిత్ర రచన మొదలైన కొన్నిటికి చర్మపత్రాన్నే 17 వ శతాబ్దివరకు కళాకారులు ఉపయోగించారు.

**parchment paper : అజినాభ పత్రం.**

చర్మపత్రాన్ని పోలిఉండేట్లు తయారు చేసిన పలు రకాల కాగితాలలో దేనికైనా ఈ పదం వర్తిస్తుంది.

**parergon : ఉపరచన.**

1. తన జీవనోపాధి అయిన ఒక వృత్తికి అనుబంధంగాగాని, దానితో సంబంధం లేకుండాగాని ఒకరు చేసే కళారచన.

2 ఒక కళాఖండంలో ఒక అప్రధానాంగంగా గాని, దానితో ఏదో ఒక తీరుగా ముడిపడిగాని ఉండే రచన. ఒక రూపచిత్రంలోని పశ్చాద్భూమి, లేదా అందులో రూపించిన ఒక గదియొక్క అమరిక ఇటువంటివే. వెర్మీర్ అనే ప్రముఖ చిత్రకారుడి చిత్రాలలో పురోభూమిలో చూపినటువంటి స్తబ్ధజీవన విశేషాలు కూడా ఈ కోవకు చెందినవే.

**Parian ware : పారేయ సామగ్రి.**

అచ్చపు తెలుపువర్ణం కలిగి, మిలమిలలాడే కాంతివంతంతో ఉండి- ఒక విధమైన పలువరాతితో నిర్మితమైనట్లు ఉండే ఉపరితలంతో కనపడే- ద్యుతిక రహితమైన రమ్యపు పింగాణీ సామగ్రి.

**Paris black : పారిస్ కాలిమ.**

దంతమషితో తక్కువ రకపుది.

**Paris blue : పారిస్ నీలిమ.**

ప్రసియన్ నీలిమకు పర్యాయనామం.

**Paris green : పారిస్ హరితం.**

ఒక విధపు మరకత హరితం క్రిమిహారిగా ఇది వాడుకలో ఉన్నది

**Paris white : పారిస్ శ్వేతం**

ధవళకంలో అత్యుత్తమస్థాయికి చెందింది.

**Paris yellow : పారిస్ పసిమి.**

క్రోమ్ పసుపుకు పర్యాయనామం

**parmazo marble : తంతుకీ చంద్రశిల.**

ఇటలీ దేశంలో లభించే ఒక విధపు చలువరాయి. తెల్లని, లేదా ధూసరపు భూమికపై నల్లని లేదా నీలపు నాడీరేఖలు దీనిలో కనబడతాయి.

**parquetage : అతుకు కూర్పు**

సన్నని కొయ్యపలక ముక్కలను, ఒక కొయ్య ఫలకానికి వెనుక అతుకటం. కొయ్య ఫలకంపై రచించిన చిత్రాన్ని పరిరక్షించటానికి, నెరియలను కనపడకుండా చేయటానికి, చెక్కలో వచ్చే వక్రతలను సరిదిద్దటానికి, ఫలకం త్వరగా శిథిలం గాకుండా కాపాడటానికి – ఈ అతుకుకూర్పు పూర్వం జరిగేది ఇప్పుడు ఇది అమలులో లేదు; ఇటువంటి అతుకుకూర్పు ఫలకానికి కొంత కీడు గలిగించగలదని ఆధునికుల అభిప్రాయం.

**parsley : అజామోద.**

**parting compound : వేర్పాటు మిశ్రమం; విశ్లేషక మిశ్రమం.**

పోతపనిలో మూసకు లోపల పూసే ఒక పదార్థం; ఇది ముద్ద పిండిగానో ద్రవరూపంగానో ఉంటుంది. మూసలో పోసే పోత, మూసకు అంటుకోకుండా ఇది చేస్తుంది. ఒక విధపు సబ్బును, లేదా ఒక తీరుసబ్బుతో తయారైన అసవాన్ని (*tincture*) ఇందుకు తరచుగా వాడతారు.

**parting tool : పాటుని.**

దారుశిల్పంలో వాడే పోగరవంటి పరికరం. దీని వాదర, చీలిక కలిగి, ఆంగ్లలిపి లోని 'V' ఆకారంలో ఉంటుంది.

**passage way : అలిందం; వర్ధిదేశ పథం.**

**passe - partout : బద్దె కట్టుడు.**

ఒక చిత్రానికి చట్టాన్ని ఏర్పరచడంలో అవలంబించే ఒక పద్ధతి. చిత్రానికి అనుదుగా వెనక వైపున కాగితాన్నో, చదరనో, అట్టనో సంధించిన తరవాత అది చిత్రం నుంచి ఎప్పటికీ విడిపోకుండా ఉండటానికి నాలుగు ప్రక్కలను, అంచులతో కలిసి కట్టుగా మడిచి పైన ఒక బద్దీని అతికించటం. కాగితాన్నో, గుడ్డనో, ప్లాస్టిక్ గుడ్డనో, తగిన రీతిలో ఇటువంటి బద్దీకై ఉపయోగించవచ్చు.

**paste : జలలేపనం; పిండిజిగురు; పిండిముద్ద.**

1. అతికించడంలో పనికివచ్చే జంకవంటి వస్తు విశేషం. గోధుమపిండినో, మొక్కజొన్న పిండినో నీటితో ఉడికించి దీన్ని తయారుచేస్తారు. కళాకారులు తమ చిత్రాలను ఆరోపకాలపై అతికించటానికి, పునరాస్తరణకై చిత్రాలను సంసిద్ధం చేయటానికి దీన్ని వాడతారు.

2. మార్త్రవ ప్రక్రియంలో, కుంభకారుడి వాడుక నిమిత్తం తయారుచేసే వృత్తికకున్ను ఈ పేరే ఉంది.

**paste blue : పేస్ట్ నీలిమ.**

ప్రసియన్ నీలిమకు పర్యాయనామం

**pastel : పిష్టకం**

ఒక విధమైన వర్ణఖటిక; ఇందులో ఒక వర్ణద్రవ్యాన్ని తగినంత బంధకంతో- త్రగా కాంతంవంటి జిగురుతో-విడిపడకుండా గట్టిగా ఒకేదిగా ఉండేట్లు కలుపుతారు. అటువంటి ఖటికతో నిర్మితమయ్యే రచనకు కూడా ఈ పదం వర్తిస్తున్నది; అటువంటి ప్రక్రియకున్నూ ఈ పదమే వాడటం ఉంది. అందులో కలిపే సిమెసున్నపు పాలునుబట్టి వివిధ రకాలు ఈ పిష్టకాలలో ఉన్నాయి గాఢతమమైన వర్ణస్థాయి కల్గినవాటిలో అన్యంగా వర్ణద్రవ్యం మాత్రమే ఉంటుంది. చిత్రణ వద్ధతులలో కెల్లా స్వచ్ఛతకూ, సరళతకూ, పేరొందినది పిష్టకం స్వచ్ఛమైన వర్ణాన్ని ఎటువంటి ద్రవమాధ్యమంతో నిమిత్తం లేకుండా ఇందులో వాడటంవల్లనే దానికి అంతటి ప్రఖ్యాతి కల్గింది. పిష్టకపత్రం (*pastel paper*) పైన నేరుగా పిష్టకంతో చిత్రరచన సాగటం ఇందులోని విశిష్టత. పిష్టక రచనలను 'ఆలేఖ్యాలు' అని అనడం కన్నా 'చిత్రాలు' అని వ్యవహరించడమే ఎక్కువగా జరుగుతున్నది. ఇందులో పూతరంగును దేన్నీ వాడకపోయినా, వర్ణాలు రేఖలుగా ఉండక రాసులుగా ఉండటమే ఇందులకు ముఖ్యకారణం. ఇట్లా చిత్రాలను రచించటానికి మృదు పిష్టకాలనే వాడుతున్నారు. ఒకసారి రంగును వర్తించిన తరవాత దానిని ఒకసారి అయినా తాకకుండానే వర్ణాల కుదిరికను చిత్రకారుడు సాధించవచ్చు. ఆ రంగులను ఒకదానితో ఒకటి మేళవింపజేయాలంటే స్టాంపు (*stump*) ను వాడటం ద్వారాకాని లేదా తన చేతివ్రేళ్ళతోనే కాని చిత్రకారుడు ఆ రంగులను రుద్దవచ్చు. ఈ పిష్టక రచనా ప్రక్రియలో మృదు పిష్టకాలే ప్రాతిపదిక పరికరాలుగా లెక్కించబడుతున్నా, కొందరు కళాకారులు ఈ పిష్టకాలలో కఠిన ముల్లై, సన్నటి మొనగల వాటిని వాడి, ఆలేఖనములాగా తమ రచనలు కనపడేట్లు చేయగలుగుతున్నారు. అల్పకాలపు మన్నిక కలవాటిలో చేరినవిగా లెక్కించదగినవి పిష్టక రచనలు. ఉపరితలంలో వర్ణం పొడిరూపంలోనే ఇటువంటి రచనలో కుదురుకొనడం వల్ల దాని మన్నిక చాలా కొద్దికాలం మాత్రమే అయితే తగిన జాగ్రత్త వహించి, శ్రద్ధతో పరిరక్షించినప్పుడు ఈ రచనసైతం నిర్దిష్ట రీతిలో దీర్ఘకాలం మనగలదు. ఇందుకోసం ఆ రచనకు వెనక చెక్కటి ఆసరానూ, చుట్టూ తగిన చట్టాన్నీ, పైన ఒక గాజు పలకనూ బిగించి, అట్లా బిగించటంలో గాజుపలక పిష్టక రచనకు తగలకుండా ఉండేట్లు శ్రద్ధ వహించాలి. అట్టి పిష్టక రచనపై, ఎక్కువ కాలం మనటానికి ఒక సన్నని పొరగా స్థిరకారిని (*Fixative*) శీకరించాలి (*spray*). ఆ శీకరించటం ఒత్తుగా జరిగితే అది వర్ణాను పృత్తాన్ని, వర్ణ సమన్వయాన్నీ, పిష్టకపు సహజ లక్షణమైన మార్దవాన్ని పోగొట్టుతుంది.

ప్రాచీన కాలంనుంచి మెత్తని సిమెసున్నపు ఖటికలను, ఇతర విధాలైన రంగు పదా

ర్ణాల ఎండిన గట్టి ముద్దలను, కళాకారులు చిత్రరచనకై వినియోగిస్తూనే ఉన్నారు. ప్రాగైతిహాసయుగపు గుహావాసుల కాలంలో సైతం ఈ పద్ధతి వ్యాప్తిలో ఉన్నట్లు తెల్పటానికి ఆధారాలున్నాయి. కాని మనకు ఈనాడు సుపరిచితమైన రీతిలో పిష్టక రచన మాత్రం 18 వ శతాబ్దపు ఆరవైలలో వెనిసు నగరంలో వసించిన కెర్రియెరా (1675-1757) అనే చిత్రకారుడిచేత పారిస్ నగరంలో ప్రవేశపెట్టబడి ప్రజల మెప్పును పొందగలిగింది. 18 వ శతాబ్దిలో పిష్టక రచనా ధురంధరులుగా పేరొందిన వారిలో మారిస్ క్వెన్ టిన్ డి లాటూర్(1704-1768) జె. బి యస్. షార్‌డిన్ 1699-1779), జీన్ ఎటియెన్నె లియోటార్డ్ (1702-1789) ఉన్నారు. 19 వ శతాబ్దిలో ఎడ్గార్ (1684-1917) పిష్టక రచనలో సుప్రసిద్ధుడు.

**pastel paper** : *పిష్టక పత్రం.*

1. పిష్టక వర్ణాలను గ్రహించి నిలిపి ఉంచకోవటానికై తంతుమయ నిర్మాణరీతి కలిగిన ఒక విధమైన కాగితం ఈ పిష్టక పత్రాంలో ధూసరవర్ణాలవి, నీలవర్ణపువి, లేదా వేరే విధమైన చిరస్థాయి వర్ణపువి ఉన్నాయి. పిష్టక రచన యొక్క గుణాన్ని అతిశయింపజేయటానికి పత్రపువర్ణం తోడ్పడుతుంది. అయినా తెల్లని పిష్టకపత్రాన్ని కూడా కొందరు చిత్రకారులు వాడతారు.

2. పిష్టక చిత్రణకు తగిఉండటానికి ప్రత్యేక రీతిలో తయారుచేసే ఒక విధపు కాగితం. అందులో ఒక రకపు దానిపై లావా స్పాంజి (*pumice*) పొడిసంది మర్దనతో పైపూత వేయబడి ఉంటుంది. నిశ్చితమూ, వాస్తవికమూ అయిన రచనకూ, అందులోని వర్ణమేళనానికీ ఈ రకపుది సముచితమని సాధారణంగా అభిప్రాయం ఉంది. ఈ పిష్టక పత్రంలో ఇంకొక రకపు దానిపై చాలా మృదువుగా పైపూత తీర్చబడి ఉంటుంది. గట్టి వలకపై మల్లుగుడ్డను అతికించి పిష్టక రచనకు వాడటం కూడా ఉంది. రచన అతి విస్తృత రీతిలో, విస్తార భూమికపై జరపవలసివస్తే, ఈ మల్లుగుడ్డ పద్ధతి సాధారణంగా వినియుక్తం. మొత్తంమీద విశాలమూ స్వచ్ఛందమూ అయిన రచనకు తంతుమయమైన ఆలేఖపత్రమూ, గరుకు వలుకు కలిగిన పిష్టక పత్రమూ తగినవి; చక్కగా రంగుల మేళవింపును సాధించవలసిన రచనకు రవవలుకుగల పిష్టకపత్రాలు అనుకూలంగా ఉంటుంది.

**pastels** : *పాతీరంగులు; ముద్దరంగులు; ముద్దకతీలు.*

**pastel shades** : *పిష్టకచ్ఛాయలు.*

హెచ్చు కిలతం కలిగిన, పాండుర లలిత వర్ణాలను తెలియజేయటానికి సాధారణంగా వాడే పదం. ఈ పేరు ఇట్లా ఉన్నమా, సర్వసాధారణంగా పిష్టక చిత్రాలు పూర్ణ స్థాయిగల గాఢవర్ణాలలో రచింపబడినవే తరచుగా వాటిని అట్లానే రచిస్తున్నారు.

**pastiche or pasticcio** : *వంకీ ర్ణకం.*

వేర్వేరు కళాఖండాలనుంచి అరువు తెచ్చుకొన్న విభిన్న శైలులను మేళవించి రూపొందించిన కళారచన.

**pastiglia** : *ఘ్యానక ప్రక్రియ*

నశోల్పాణ, తక్షణ, లోహాలంకరణ శిల్పాలను పోలిన దాన్ని ఒక ఘనరూపపు ఉపరితలంపై కృత్రిమ రీతిలో తేవటానికి ఉపయోగించే ప్రక్రియ. ఇందుకు ఆ ఉపరితలంపై



ఘ్యానక ప్రక్రియ

తెల్లలప్పాన్ని చాలా మందంగా పట్టించి, గట్టిగా ఆరనిస్తారు. ఆ లప్పపు భాగాన్ని కావలసిన రీతిలో మలచి, చెక్కి, రూపాలను సృష్టించి, వాటిపై రంగులను పూసిగానీ, పత్రరంజన ప్రక్రియవల్లగానీ శోభను సమకూర్చటం జరుగుతుంది. 'ధనపేటికల పైతలాలకూ, చెక్కడాలకూ, ఇతర విధమైన దారు తలాలకూ శోభను, అలంకారాలను, సమకూర్చటానికై, మధ్యయుగంలోనూ పునరుజ్జీవన యుగంలోనూ కళాకారులు ఈ ప్రక్రియను సమర్థతతో ఉపయోగించారు. శిల్పాలపైన ఆభూషణ సంపత్తిని, శీర్షం చుట్టూ ప్రభామండలాన్ని నిర్మించడంలో కూడా ఈ ప్రక్రియను కళాకారులు ఆ కాలంలో వినియోగించారు; తమ రచనలకు శోభను సమకూర్చటానికి రంగులను, పత్రరంజనాన్ని వాడారు. ఒక్కొక్కప్పుడు మొత్తపు ఉల్బణ శిల్పాన్నే ఇట్లా తయారుచేసి రంగులు వేసేవారు. ఆధునిక కాలంలో చిత్రకారులు తమ రంగు చిత్రానికి ఉపాధిగా తెల్లలప్పాన్ని వాడి, మందపు లాంతపములను సాధిస్తున్నారు. అయితే ఈ ఘ్యానక ప్రక్రియ మొత్తం మీద గట్టి ఆధారాలపైనే జరపదగింది. వంచి మడచి చుట్టవలసి ఉండే కాటికవంటి వాటిపై ఇది పనికిరాదు.

**pastose** : *నిబిడలిప్తం* (చూ : ***impasto***)

**pasty** : *ముద్దవాటువు; పిండివాటువు.*

**pate or patte** : *పేషణిక.*

మూర్తిప ప్రక్రియలోని ఒక పారిభాషిక పదం. మూర్తిప సామగ్రి నిర్మాణానికి ఉపయోగించే జలపేషణిక, లేదా మృత్తికా మిశ్రమానికి ఈ పదాన్ని వాడతారు.

**patent** : *లేఖ్యప్రకాశనం*

**patera** : వృత్తలం.

వృత్తాకారంగానో, అండ వృత్తాకారంగానో ఉండే ఒక అలంకరణ విశేషం. ఇందులో మధ్యనుంచి నాలుగు మూలలకు విరజిమ్మిన పత్రాల, లేదా జ్యామితీయ రూపాల రీతులు కనబడతాయి. గృహోపకరణాల అలంకృతికి, కుడ్యాలంకరణకు



వృత్తలం

ఇటువంటివి వినియుక్తములు- రోమనుల కాలంలో ఇండ్లలో లోతు తక్కువగా ఉండే ఒక పళ్లెం లేదా గిన్నె-పతేరా అనబడేది- వాడుకలో ఉండేది దాని పేరిటే దీనికి ఈ నామం వచ్చింది

**pate sur pate** : *పేషణిపై పేషణి.*

మార్తవ ప్రక్రియలో ఉపరితలంపై జరిపే ఒక రీతి అలంకరణ. సతోల్బణరీతిలో సాగే ఈ అలంకరణకై సరకమును పొరలు పొరలుగా తూలికతో పట్టించటం జరుగుతుంది.

**patina** : *తామ్రమలం; చిలుం; కిలుం; పైలుత్త్రం.*

రాగిమీదగాని ఇత్తడిమీదగాని వట్టే ఒక విధమైన పొరవంటి పదార్థం గాలి, నీరు విరివిగా తగలటంవల్ల ఇటువంటి పొర ఏర్పడుతుంది. ఇది సాధారణంగా ఆకుపచ్చ వర్ణంలో ఉంటుంది. దీనికే ఆంగ్లభాషలో ఏరుగో (*Aerugo*), వెర్డిగ్రిస్ (*verdigris*) ఏస్ ఉస్తుం (*Aes ustum*) అనే పర్యాయ నామాలున్నాయి ప్రాక్తన కాంస్య శిల్పాలకు ఇటువంటి తామ్రమలం తగిన లలిత రీతిలో ఉన్నప్పుడు శోభను సమకూర్చి, సౌందర్య పటిమను ఎక్కువ చేసేది. అందువల్ల అటువంటిది లేని సందర్భాలలో కూడా కొన్ని రాసాయనిక పద్ధతులవల్ల దీన్ని సృష్టించటమూ జరుగుతుంది. ఒక విధంగా ఈ తామ్రమలం ఆ శిల్పభాగంపై రక్షణకు తోడ్పడుతున్నదనవచ్చు. అది ఒకసారి ఏర్పడ్డ తరవాత, దాని దిగువనున్న లోహానికి ఆ తరవాత ఎటువంటి వికృతీ, మార్పు ఉండవు. ఇది ఒక కవచంగా ఉపకరించి పరిరక్షిస్తుంది. అయితే ఒక్కొక్కప్పుడు ఇటువంటిది శిల్పానికి నష్టకారిఅయి దాన్ని తినేసేదిగా కూడా మారటం ఉంది. ముఖ్యంగా కాంస్య శిల్పాలలో ఇది అక్కడక్కడ కనిపిస్తుంది. అటువంటి దానిని కాంస్యరోగం (*Bronze disease*) అని కూడా అంటారు. తామ్రమలం స్వతస్సిద్ధంగా ఏర్పడ్డా లేదా కృత్రిమంగా కల్పించబడ్డా దాన్ని మలినీకరణం (*patination*) అంటారు. ఇదిగాక ఇంకొకటి కాంస్యీకరణము (*bronzing*) అనేది కూడా ఉంది. సుధాపిష్టం (*plaster*)తో గాని కాంస్యం (బ్రాంజి)తో గాని, ఇంకొక దానితోగాని పోత పోసి దానిపైన అచ్చువు కాంస్యంపై ఉండే రీతిగా తామ్రమలపు లలిత రేఖల వంటి వాటిని సృష్టించే విధానమిది

2. దీనికి కాలక్రమేణ వేరొక విస్తృతార్థమేర్పడి చిత్రలేఖనంలో, అచ్చుఫలకాలలో, శిల్పాలలో, గృహోపకరణ సామగ్రిలో, తదితరమైన కొయ్య వస్తువులలో కాలవశాన నిరంతరోపయోగ కారణంవల్ల వర్ణస్థాయిలోను కాంతపంలోనూ కనపడే తగ్గుదలకున్నూ ఇది వాడబడుతున్నది.

**patination** : *మలినీకరణ*

**patriarchal cross** : *మతాచార్య క్రూశం.*

ఒక విధపు లాటిన్ సిలువ. సాధారణపు లాటిన్ సిలువలోని అడ్డుకడ్డీకి ఎగువగా దానికన్నా చిన్నదిగా ఉండి, నిలువు కడ్డీపై కుదురుకొనే ఇంకొక అడ్డుకడ్డీ ఇందు ఉం-

టుంది.'టౌ' క్రూశంపై గ్రీసు సిలువను సంధించిన రీతిగా ఇది కనపడుతుంది. ఈ సిలువ ఆకృతిలోనే దిగువఉండే అడ్డుకడ్డీ, నిలువుకడ్డీని మధ్య బిందువుకు దగువన ఉత్తరించినప్పుడు అటువంటి క్రూశాన్ని లొరైన్ క్రూశం అంటారు. ఫ్రాన్స్ దేశంలో లొరైన్ రాష్ట్రపు మాండలిక ప్రభువులు దీన్ని మొదట వాడటంవల్ల ఆ పేరు దీనికి కలిగింది.

**pattern** : ***వ్యూహానం; రీతి.***

1. ఒక కళారచనలోని మొత్తపు అమరిక, తీరు, లేదా కుదిరిక తీరు.

2. ఒక విధమైన అలంకారిక లేఖాంకనం. సాధారణంగా ఇందులో ఒక రూపవేషమో, ప్రతీకమో, పునరావృత్తమవుతుంటుంది

3. ఒక నకలును తయారు చేయటానికి, లేదా రచించటానికి ఉపయోగించే తొలిరూపం తొల్లచ్చుకు ఆకారమిచ్చే రూపానికే. సాధారణంగా సుధాపిష్టంతో తయారు చేసిన దానికే. ఈ పదాన్ని వాడతారు. ఇటువంటి వ్యూహానం నుంచే కొలిమి యిసుకను (*foundry sand*), లేదా జంతులేపాన్ని (*gelatin*) వాడి, కంచుపోత (*bronze casting*) కై తొల్లచ్చును తయారు చేస్తారు. ఒకవేళ పోతలో రూపొందించవలసిన వస్తువు, అతిక్లిష్ట రూపం కలదై, వ్యూహపమును వెలికి దీసేటప్పుడు అది విరిగిపోయే ప్రమాదముంటే, ఆ వ్యూహనమును రెండుగానో, అంతకన్నా ఎక్కువగానో, ముక్కలుగా. సౌలభ్యాన్ని అనుసరించి, చేసి, వాడవచ్చు.

**pavonazzetto or pavonazzo:** ***ధమనిశిల.***

ప్రాచీన కాలపు రోమనులు, భవన నిర్మాణంలో ఉపయోగించిన ఒక విధపు చలువ రాయి. తెలుపు మొదలుగా, పసిమి వరకు ఈ రాతి రంగు మార్పుచెందేది. దాని ఉపరితలంలో ధూమ్ర వర్ణపు ధమనికలు కనవస్తాయి.

**Payne's gray** : ***పెయినే ధూసరం.***

నీలిమ, ఎరుపు, నలుపు, ఏదైనా చిరస్థాయి అయిన తెలుపురంగు - అనే వర్ణద్రవ్యాలను మేళవించగా ఏర్పడే ఒక సంకీర్ణ వర్ణద్రవ్యం. నీటి రంగుల చిత్రణలో దీనికి ఎక్కువ వాడుక ఉంది. కళాకారుని వర్ణఫలకంలో ఉండే రంగులతో, అప్పటికప్పుడు తయారు చేసుకొనే రంగులకు అంతగా ఆదరం లేకపోయినా, పెయినే ధూసరం మాత్రము, ఇందుకు అపవాదంగా అత్యాదరణను ఆర్జించి మన్నిక పొందుతున్నది.

**paysage** : ***పేసేజ్.***

1. ప్రకృతి దృశ్యమునకు సమానార్థకమైన ఫ్రెంచి భాషా పదం

2. ప్రకృతి దృశ్య చిత్రణకు అనువైనవిగా ఒకప్పుడు సంభావితములైన ఫ్రెంచి కాటికల పరంపర. (చూ : *convas sizes, french*అనే అరోపం దగ్గర ఇచ్చిన పట్టిక.)

**peach black** : ***పీచి నలుపు.***

బొగ్గు నలుపులో ఒక తరగతికి చెందింది. పీచి వృక్షాలను కాల్చినప్పుడు ఇది లభిస్తుంది.

**peach bloom** : *పీచి కుసుంభం.*

మాత్రవ ప్రక్రియలో కొన్నిట కనపడే ఒక విధపు చీనీయ ద్యుతికం. ఇది లేత గులాబీ వన్నెలో, పీచి పూవు రంగులో కనపడుతుంది దీనికే పీచి బ్లో అని ఆంగ్లంలో వ్యవహారం ఉంది.

**peachblow** :చూ. **peach bloom**

**peacock blue** : *మయూర నీలిమ.*

శోభాయుతమైన ఆకుపచ్చపాక నీలపు రంగుగల ఒక రంజక వర్ణద్రవ్యం కొన్ని సంయోజిత కార్బనిక రంగద్రవ్యాలలో దేనినుంచి అయినా దీన్ని తయారు చేయవచ్చును.

**pearl white** : *మౌక్తిక శ్వేతం.*

బిస్మత్ శ్వేతానికీ, శుక్తిగర్భపు వ్యర్థభాగపు పొడికీ పూర్వం ఈ పదం వ్యవహారంలో ఉండేది. ఇప్పుడిది వాడకలో లేదు

**pediment** : *త్రిపరిధి; ద్వార శీర్షం.*

ప్రాచీన వాస్తువులో ఒక పారిభాషిక పదం. గుర్రపు చోపదాలాగా నిర్మితమైన భవనంలో వాలుకప్పుల రెండింటి అంచులకూ కపోతపాళికిన్నీ మధ్య త్రిభుజరీతిలో అమరి ఉండే ప్రదేశం.

**peepshow box** : *మయపేటిక.*

లోతట్టులో వివిధ దృశ్యాలు చిత్రీకరించబడి, ఒక నిర్దిష్టరీతిలో ఆ లోనికి చూసేవానికి మూడాయతనాల చిత్రాలుగా వాటిలో భ్రాంతి కల్పించగలిగే పేటిక. ఈ పెట్టెకు ఒక తట్టున అమర్చబడి ఉండే చిన్న రంధ్రం, లేదా చిన్న అద్దం గుండా ద్రష్ట ఆ చిత్రాలను చూసినప్పుడు ఇటువంటి భ్రాంతి, అతడికి కలుగుతుంది. లియోన్ బాప్టిస్టా ఆల్బెర్టి(1404-72) మొదట్లో ఇటువంటి పేటికను తయారుచేశాడని తెలుస్తున్నది.

**pen** : *కలం; లేఖిని.*

సిరాతోగాని, అటు వంటిదే అయిన ఇంకొక ద్రవపదార్థంతోగాని, వ్రాయటానికి. లేదా ఆలిఖించటానికి ఉపయోగపడే పరికరం. 19 వ శతాబ్ది వరకు పపైరసు మీదగాని, చర్మపత్రంపైగాని, కాగితం మీదగాని వ్రాయటానికి లేదా ఆలిఖించటానికి రెల్లు (కాకి వెదురు) కాడల కలాలను, లేదా, (ముఖ్యంగా పాశ్చాత్య దేశాలలో,) పక్షులకు చెందిన రెక్కయీకలను, లేదా తోకయీకలను కలాలుగా వాడేవారు. లోహపు కలం కూడా ప్రాచీనకాలం నుంచే వాడుకలో ఉన్నది అంతకు పూర్వపు విషయమెట్లున్నా రోమనుల కాలంలో ఇటువంటి లోహపు కలాలు వాడుకలో ఉన్నట్లు మాత్రం గట్టిగా తెలుస్తున్నది. అయితే లోహపు కలాల వాడుక, ఏ కొద్దిమందికో పరిమితమై ఉండేది. 19 వ శతాబ్దిలో ఇంగ్లాండులో ఉక్కుపాళీల ఉత్పత్తి భారీ ఎత్తున ఆరంభమైంది. అంతట ఈక కలాలూ, రెల్లుకలాలూ రంగంనుంచి నిష్క్రమించాయి; కాని ఈనాడు సైతం చీనీయ జపానీయ కళాకారులు తరచుగా వెదురు కలాలనే వాడుతున్నారు. లిపిచిత్రణకై అప్పుడప్పుడు బాతురెక్కల ఈకలను కలాలుగా వాడే వారున్నారు. ఆలేఖనానికి ఉపయోగించేదాలచిన్నని ఉక్కుపాళీకి ఈనాడు

వ్యవహారంలో ఉన్న కాకిఈక (*Crow quill*) అనేపేరు ఆ ప్రాచీనపు సంప్రదాయం వల్ల ఏర్పడిందే. కలాలన్నీ సాధారణంగా ఒకేరకపు నిర్మాణవిధానం కలవి. అది ఏవిధం కలమైనా- రెల్లు, ఈక, లోహంలో దేనికి చెందినదైనా- ఒక గొట్టం చివర చక్కగా చివ్వి మొనదేల్చినప్పుడు అది రూపొందుతుంది. ఆమొననే పాళీ అంటారు. ఆ పాళీని మధ్యభాగం నుంచి దిగువన నిలువుగా రెండుగా చీలుస్తారు. అందువల్ల ఆకొనను, వ్రాయటానికి వాడటంలో కొంత సౌలభ్యం కలుగుతుంది ఈ కొనకుపై భాగంలో ఉండే డొల్లలోకి S - ఆకారంగల లోహపుముక్కను బిగించి, సిరాను నిలుపచేసే వీలు ఏర్పరుస్తారు. ఈ విధంగా కలపు పిడితో పాళీ, చిరస్థాయిగా ముడివడి ఉండేయేర్పాటే గాక, కలాన్ని పిడినుంచి ఊడతీసే వీలుకూడా కొన్నింటిలో ఉంటుంది. అప్పుడు వేరు వేరు రకాల పాళీలను, ఒక దాన్ని తొలగించి ఇంకో దాన్ని, ఆవశ్యకతను అనుసరించి బిగించటం జరుగుతుంది. ఇటువంటి ఆలేఖనపు కలాలు, దాదాపుగా సాధారణపు వ్రాతకలాలనే పోలి ఉంటాయి. పైన ఇదివరలో చెప్పబడిన కలం గాక శైలీలేఖిని (*stylo graph*), మదత మొన కలం (*Felt tip pen*), రేఖా లేఖిని (*Ruling pen*) మొదలైన పలురకాల కలాలు ఉన్నాయి. ఆలేఖనంలో ఒక్కొక్క ప్రత్యేక రీతికి, ఇందు ఒక్కొక్కటి తగి ఉంటుంది. వీటికి పాళీలు ఉండవు.

**pen-and-wash drawing :** *కలమ ధావన లేఖనం.* (**చూ : wash drawing**)

**pencil :** *పెన్సిల్; ఈషిక; చిత్రవర్తిక; సీసపుపుల్ల.*

19వ శతాబ్ది ఆరంభంలో సాధారణపు వ్రాత పనికి ఉపయోగించే సీసపు పుల్ల (*Lead pencil*) ను కనుక్కోవడం జరిగింది. అంతకు పూర్వం పెన్సిల్ అనే పాశ్చాత్య భాషాపదం, సన్నగా కొనదేల్చబడిన తూలిక (ఈషిక) కే ఉపయుక్తం. ఇటువంటి ఈషికను, నీటి రంగులతో, చిత్రరచనను చేయటానికి ఉపయోగించేవారు. ఆ తూలికలోని కొనకై సాధారణంగా ఉడుత రోమాలు, లేదా సేబిల్ జంతువు యొక్క రోమాలను వాడేవారు చిత్రకారుడు సాగించేరేఖాకర్మకే ఈషికాకర్మ (*pencilling*) అనేపేరు కూడా ఉండేది. ఈనాడు పెన్సిల్ లేదా ఈషిక అనే పేరు ఘనీభూతమైన వర్ణద్రవ్యంతో తయారైన పుల్లకు ప్రయుక్తం. దీన్ని ఒకపిడికి బిగిస్తారు. ఇటువంటి పెన్సిల్ కొనను అవసరమైనప్పుడు సన్నగా చేసి వాడుకోవచ్చును. సీసపు పెన్సిల్ ఈనాడు అత్యధికంగా వాడుకలో ఉన్నది. కాని వ్రాతకుగాని, ఆలేఖనానికి గాని అనేక రీతుల పెన్సిళ్ల-రంగు పెన్సిళ్లు (*coloured pencils*), కర్బనపు పెన్సిళ్లు (*carbon pencils*) మంద్రాలేఖనపు పెన్సిళ్లు (*Flat sketching pencils*) బొగ్గుపెన్సిళ్లు గ్రాఫైట్ పెన్సిళ్ళు మొదలైనవి, ఎక్కువ మెత్తదనం మందం కలవి-ఈనాడు వాడుకలో ఉన్నాయి. సీసపు పెన్సిళ్లవలెనే కొయ్యపలకల మధ్య బిగించిఉండే అన్ని విధాల సీసమున్నవు పెన్సిళ్ళు, రంగుఖడికలు, శిలాఖడికలు-పుల్లలలాగా సాధారణంగా తయారు చేయబడేవి వ్యాప్తిలో ఉన్నాయి.

**pencil sketch** : పెన్సిల్ స్కెచ్చి; పెన్సిల్ లేఖ్యం.

**pendant** : *పతకం*

**pentacle** : *పంచకోణిక.*

అయిదు కోణాలలో మొనలుదేరిన నక్షత్రాకృతి. ఇందే పంచభుజాకృతి ఇమిడిఉంటుంది. దీనికి చాలా ప్రాచీన చరిత్రఉంది. ఒకవిధపు ఇంద్రజాలిక చిహ్నంగానూ, ఆపదలనుంచి రక్షించటానికోసం ఉపయోగించే ఒక తాయెత్తుగాను దీన్ని మొదట్లో భావించేవారు, మొదలుపెట్టినదగ్గర నుంచి లేఖినిని ఆపకుండ, ఒకేవిసురున దీన్ని రూపొందించటానికి వీలుండటమే దీనికి మహత్త్వం ఆపాదించి ఉండటానికి ముఖ్య కారణమై ఉంటుందని కొందరి అభిప్రాయం ఇటువంటిదే సాలమన్ ముద్ర (*Solomon's seal*).

**Pentelic marble** : *పంచేళికా చంద్రశిల*

గ్రీసుదేశంలో పంచేళికా పర్వతప్రాంతంలో పూర్వం లభిస్తూవచ్చిన ఒక విధపు చంద్రశిల తెలుపునుంచి ధూసరవర్ణం వరకూ ఇందులో రంగుభేదాలు ఉండేవి. క్రీ.పూ. 6 వ శతాబ్దిలో వాస్తువులో, శిల్పంలో దీనికి గ్రీసు దేశంలో ఆదరణ అధికంగా ఉండేది. ఏథెన్స్ నగరంలోని పార్తెనాన్ దేవళం ఈ చంద్రశిలతోనే నిర్మితం

**pentimento** : *పునరుదయం.*

చిత్రకారుడు, ఒక తైలవర్ణ చిత్రాన్ని రచించి తుది రంగుపూతను పట్టించినప్పుడు, మరుగు పరచిన మొదటి ఆలేఖనం లేదా ఉపాధి వర్ణం వంటివి, కాలంపోగా, మళ్ళీపైకి కనపడటం.

ఒక తైలవర్ణ చిత్రం చాలాకాలం ఉన్నప్పుడు దాని ఉపరితలపు పారదర్శకత క్రమేణ అధికంకావటం వల్ల ఇటువంటి పునరుదయం సంభవం. దీనికిలక్ష్యాలను పెక్కింటిని మ్యూజియాలలో చూడవచ్చును. 17 వ శతాబ్దికి చెందిన డచ్చి చిత్రకారులు–డి హూక్ మొదలైన వాళ్ళు రచించిన చిత్రఫలకాలలో ఇటువంటి పునరుదయం చాలాస్పష్టంగా కనబడుతుంది. ఆ చిత్రకారులు తమ చిత్రాలకు మొదట భూమికగా చలువరాళ్ళు పరచిన నేల వంటి దాన్ని ఏర్పరచి దానిపై చిత్రాలను రూపొందించారు. ఇప్పుడా చిత్రాలలోని ఉపరితలములలో పారదర్శకత ఎక్కువకాగా, ఆయువారి దుస్తుల నుంచీ, గృహోపకరణాల నుంచీ నల్లని చలువరాళ్ళ రూపరేఖలు దృష్టిగతములవుతున్నాయి. ఆకాలపు డచ్చి చిత్రాలలో మాత్రమేకాదు; తరువాతి ఆధునిక చిత్రాలలోను అనుకోకుండా ఇటువంటి లోపం చోటు చేసుకోవటం ఉంది. అవుడు అటువంటి వాటిని మరుగు పరచటానికి మొదటి చిత్రంలో కుంచెను వాడిన దిక్కుకు వ్యతిరేకంగా, కుంచెతో రంగు పట్టించడం జరుగుతున్నది. అయితే ఇందుకు సముచితమైన ఇంకొక మార్గం కూడా ఉంది. తక్కిన ఉపరితలం కంటే నల్లగా కనబడే రేఖలను లేదా రంగులను కళాకారుడు ముందుగా కత్తితోగాని, ఇద్దరేకుతోగాని తొలగించి ఒత్తురంగును చక్కబరచి, దానిపై అధిచిత్రణను సాగించటం మంచిది.

**peperino** : *మరీచికా శిల*

ఇటలీలో రోమ్‌నగర ప్రాంతంలో కనపడే ఒక విధమైన అగ్నిశిల. దానిపై మిరియపు గింజలవలె కనపడే మచ్చలవల్లఈ పేరుకలిగింది.

ప్రాచీన కాలంనుంచీ వాస్తులో దీనికి ఆదరణ ఉంది.

**perforating wheel** : వేధక చక్రము.

పరిధి అంతటా రంపపు పళ్ల అంచు ఉండే చక్రాన్ని, ఒక చేతిపిడికి అనుకూలరీతిలో సంధించగా ఏర్పడే పరికరం. ఒక కాగితంపై గీసిన ఆలేఖనపు రేఖలను అనుసరించి సన్నటి బెజ్జాలను ఏర్పరచటానికి ఇది పనికివస్తుంది. ఒక ఆలేఖనాన్ని ఒక తలం నుంచి వేరొకతలానికి మార్చటానికి అపతన (*pouncing*) ప్రక్రియలో ఇది సహకరిస్తుంది. వేధక చక్రానికే అనులేఖన చక్రం (*tracing wheel*) అనే వ్యవహారం కూడా ఉంది. ఇటువంటి చక్రాలలో ఒకే సరళరేఖలో నడిచేట్లు కొన్ని రకాలవి, వృత్త, వక్ర రేఖలలోకూడా స్వేచ్ఛగా తిరగటానికి అనువుగా మరికొన్ని ఉంటాయి. సరళరేఖలో నడకకై రూపొందించిన వాటిని కూడా తగిన కుశలతతో, వంకరేఖలను అనుసరించేట్లు చేసే వీలుంది.



వేధక చక్రం

**Pergamene school** : పెర్గమం సంప్రదాయం

క్రీ.పూ. మూడో శతాబ్దంలో గ్రీసుదేశంలో ప్రవర్తిల్లిన హెలెనీయ శిల్పకళా సంప్రదాయాలలో ఒకటి. ఆసియామైనరులో ప్రాచీన కాలంలో నెలకొన్న పెర్గమమ్ నగరం ఈ సంప్రదాయానికినెలవుకావటంవల్ల దీనికిఈ పేరు వచ్చింది. ఈ సంప్రదాయనికిచెందిన శిల్పాలు ఓజస్సు(*Vigour*) నకు, ఊర్జత (*power*)కు పేరుపొందాయి. కండరాలను బిగించి నీటుగా దీరి ఉన్నట్లుండే మానవమూర్తి ని రూపు దీర్చ డాన్ని సాధారణంగా ఈ సంప్రదాయంలో చూడవచ్చు. పెర్గమం సంప్రదాయపు సుప్రసిద్ధ కళాఖండాలలో ఒకటిగా పరిగణించదగింది పెర్గమం నగరంలోని 'జ్యూస్' దేవాలయపు వేదికాకుడ్యాలంకరణం.

**perilla oil** : పరాళ తైలం.

ఒక విధమైన శోషక తైలం ఆగ్నేయ ఆసియాలో పెరిగే ఒకవిధపు వృక్షపు విత్తనాల నుంచి దీన్ని తయారుచేస్తారు. దీనికి గల పటల నిర్మాణ దక్షత ఉచ్చస్థాయికి చెందింది; అందువల్ల ఇంటీపూతలకు పనికివచ్చేదిగా ఎక్కువ పేరు ప్రఖ్యాతులు ఆర్జించింది. కాని కాలం గడచిన కొద్దీ దీనిలో కలసిన రంగు పసుపురంగుగా మారి ముక్కలుపడే గుణం ఉండటం వల్ల కళాకారులకు ఇది ఉపయోగ పడటంలేదు.

**perimetre** : నాహము.

**peristyle** : పరిస్తంభిని.

ప్రాచీన పాశ్చాత్య వాస్తుశాస్త్రపు ఒక పారిభాషికపదం ఒక ఆలయాన్నిగాని ప్రాంగణాన్నిగాని పరివేష్టించి ఉండే ఆచ్ఛాదితమైన స్తంభావళిని, ఈ పేరుతో వ్యవహరించారు.

**permanence** : చిరస్థాయిత

**permanent** : చిరస్థాయి

**permanent blue** : *చిరస్థాయి నీలిమ.*

అతి పొగరిక నీలిమకు, 19వ శతాబ్ది మధ్య కాలంలో వాడబడిన ఒక పర్యాయనామం. అప్పటినుంచీ, ఈ పేరు మరియెన్నో ఉత్పన్నాలకు - సంయోజిత కార్బనికవర్ణద్రవ్యాలతో సహా కొన్నిటికి-ఉపయుక్తమైంది. అందువల్ల ఒక వర్ణద్రవ్యపు పేరుగా ఇది నిర్దిష్టతను కోల్పోయింది. ప్రస్తుతం ఈపేరుగలదానికి-తయారీదారు పేరుతో పాటుగా-అందులోని వర్ణద్రవ్యాల వివరాలు ప్రకటించినప్పుడు మాత్రమే నమ్మికగా దాన్ని వాడటానికి వీలు కలుగుతున్నది.

**permeability**: *ప్రవేశ్యత.*

**permeation** : *ప్రవేశనం; ఛేదనం.*

**perpendicular** : *లంబరేఖ.*

**persian gulf oxide** : *పారసీక సైంధవ భస్మం.*

సహజసిద్ధంగా లభించే ఒక విధమైన సిందూర భస్మం.

**persian orange** : *పారసీక నారంగం.*

ఒక కాంతినిరోధకపు రంజకం. ముగ్గు సున్నపు రాతితో కలిపిన వివిధ రంగద్రవ్యలను అవక్షిప్తం చేసి దీన్ని సాధించవచ్చు.

**Persian red** : *పారసీక శోణిమ.*

పారసీక సైంధవభస్మం మొదలైన కొన్ని శోణవర్ణాలకు ఉపయుక్తమవుతూ ప్రామాణికతను ఆర్జించని వర్ణనామం.

**personification** : *మూర్తిభవనము.*

భావనలకు, ఉద్దేశాలకు రూపాలను కల్పించి వ్యవహరించడం మానవుని మానసిక ప్రవృత్తిలో గాఢంగా నెలకొన్న విషయం. ఆదిమకాలం నుంచి కూడా మానవులు ఆరాధించిన, లేదా గౌరవించిన వివిధ దేవతలు, తదితర రూపాలు మొదలైన వాటిలో ప్రతి ఒక్కదాన్ని పరిశీలించినప్పుడు, అది ఒక భావనకో, ఉద్దేశానికో మూర్తిభవనం కాదని చెప్పటం చాలా అసాధ్యం. ప్రేమ, విధి, కోపం, మృత్యువు మొదలైనవి ప్రాచీనలు మూర్తీకరించి పూజించడం ఈవిషయానికి ఒక ఉదాహరణగా పేర్కొనవచ్చును. ఇటువంటి మూర్తిభవనాన్ని ఆశ్రయించే శిల్ప, చిత్రలేఖనాదులు ఆయాకాలాలలో వర్ధిల్లాయి

**perspective** : *దృష్టిప్రక్రమ గతి; దృష్టి ప్రక్రమత; దృగ్గతి.*

రెండాయతనాల ఉపరితలంపైన, మూడాయతనాల వస్తువులను రూపీకరించటానికి అవలంబించే విధానం రూపించవలసిన మూడా



దృష్టి ప్రక్రమగతి; (HL) దృక్ క్షితిజ రేఖ; (VP) తిరోహిత బిందువు, (PP) చిత్రతలం; ( ) దృక్ శంకువు; (B) కేంద్రక వీక్షణ, కిరణం (C) స్థితి బిందువు

యతనాల దృశ్యాన్ని ఒక దత్త బిందువు దగ్గర నిల్చి చూసినప్పుడు, దృష్టి పైకి ముందుకు పోయేకొద్దీ, క్షీణిస్తున్న ప్రాదేశిక సాన్ని

హిత్యాలకు భంగం కలగని రీతిగా, వెనకతూ లోనికి పయనించటం ఇందులో కనబడుతుంది. పాశ్చాత్య కళా ప్రపంచంలో ప్రాతికాల్పనికకళలో ఒక ప్రాతిపదికాంగంగా ఈ దృష్టిప్రక్రమగతి, స్థానాన్ని పొందింది. ఒక చిత్రపు ప్రాశస్త్య నిర్ణయానికి తోడ్పడే ముఖ్యలక్షణాలలో ఇది ఒకటిగా పేరు పొందింది ఒక వ్యక్తిని, లేదా ప్రత్యేక వస్తువును మాత్రమే రూపించేటప్పుడు వాడే దృష్టి ప్రక్రమగతియే, క్షయవృద్ధి (*Fore-shortening*) అని రూఢత పొందింది. అందువల్ల విస్తార దృశ్యాలను నిర్మాణాలను రూపీకరించే సందర్భానికి మాత్రమే దృష్టి ప్రక్రమగతి అనేది ఈ కాలంలో ప్రత్యేకించబడింది.

ఇటువంటి దృష్టి ప్రక్రమగతిలో చాలా పద్ధతులున్నాయి స్థూలంగా వీనిని జ్యామితీయములు, అశీకములు అనే రెండు కోవలకు చెందినవానిగా భావించవచ్చు. ఒక కళాకారుడు, తన చిత్రంలో ఒక దృశ్యాన్ని రూపొందించేటప్పుడు, ఏ ఒక్క పద్ధతికి చెందిన దృష్టి ప్రక్రమగతికో కట్టుబడి ఉండక ఆయా సందర్భాలను అనుసరించి ఉచితమైన దృష్టిప్రక్రమ గతులను ఎన్నిటినో వాడుకొంటాడు. ఎటువంటి వాటిని ఎట్లా వాడినా తన లక్ష్యమైన ప్రాదేశిక సువ్యవస్థను, గభీరతను సాధించవీలవుతుందో అటువంటి పద్ధతులకు చెందినవాటిని అన్నింటినీ అతడు ఉపయోగిస్తాడు.

జ్యామితీయ పద్ధతులలో కళాకారుడు ప్రధానంగా వాడేది రేఖాగతదృష్టిప్రక్రమగతి. దృశ్యమానాలైన వస్తువులు దూరం పెరిగేకొద్దీ చిన్నవి కావటం ఇందులో రూపించబడి అటువంటి వస్తువుల మధ్యఉండే దూరంసైతం చక్రవాళ రేఖవైపుకు పోయే కొద్ది క్రమంగా తగ్గటం కనబడచేయటం ఇందులోని ప్రముఖ లక్షణం. ఇట్లా చిత్రించడంలో ఆ వస్తువుల చిత్రములపై కొన్ని మార్గదర్శక రేఖల సాయంతో ప్రక్షేపితములై చివరకు ఆ చక్రవాళ రేఖపైన ఒక బిందువువైపుకు, లేదా బిందువుల వైపుకుపయనిస్తున్నట్లు కనపడేట్లు చేయటంజరుగుతుంది. అటువంటి బిందువులను తిరోహిత బిందువులు' అని వ్యవహరిస్తారు.

భవనములను కోడ్లను, వివిధ రీతుల ప్రదేశాలను, దృష్టిప్రక్రమగతిలో చూపెట్టే విషయంలో సమానాంతరమైన వాటి ఊర్ధ్వాధర (*vertical*) రేఖలను, ఊహారేఖతో పొడిగించినప్పుడు, ఏదో ఒక బిందువు దగ్గరో చాలా బిందువుల దగ్గరో సమాగమించడం వేద్యమయ్యేట్లు నిర్వహిస్తారు రూపించవలసిన వస్తువుయొక్క కుదిరిక తీరు (*Orientation*) ను అనుసరించి, రూపీకరణంలో కలిగే తిరోహితబిందువు ఒకటిఉంటుందా, లేదా పెక్కు తిరోహిత బిందువులు ఉంటాయా అనేది నిర్ధారితమవుతుంది. ఆ బిందువుల సంఖ్యను అనుసరించే ఒక చిత్రం సమాంతర దృష్టి ప్రక్రమగతి (ఒక బిందువు గల దృష్టిప్రక్రమగతి)లో ఉన్నదీ, కోణీయ దృష్టిప్రక్రమగతి [రెండు బిందువులు గల దృష్టిప్రక్రమగతి] లో ఉన్నదీ, లేదా కుటిల దృష్టి ప్రక్రమగతి (మూడు బిందువులు గల దృష్టి ప్రక్రమగతి) లో ఉన్నదీ-అనే ప్రసక్తులు ఏర్పడతాయి. దృశ్యాన్ని రూపించడంలో ఎటువంటి క్లిష్టతనైనా దృష్టిప్రక్రమగతిలో సాధించటానికి ఒక సునిశ్చిత పద్ధతి ఉన్నదనటం

నిజమే అయినా, సర్జనశీలమైన చిత్రరచనలో, జ్యామితీయంగా నిర్దోషమని చెప్పదగినరీతిలో రేఖాగత దృష్టి ప్రక్రమగతికి అంటిపెట్టుకొని ఉండటం వాంఛనీయం ఏనాటికీ కాదు. (జ్యామితీయంగా నిర్దోషమైన ఇటువంటిదాన్నే శాస్త్రీయ పరిభాషలో శాస్త్రబద్ధ రచన అని వ్యవహరిస్తారు ) ఇటువంటి శాస్త్రీయ నిర్దోషతకు పైదొలగి ఏ కొద్దిగనో స్వతంత్రంగా వర్తించటం చైతన్యశీలమైన చిత్రరచనల్లో తప్పనిసరి. అట్లా పైదొలగక, అచ్చంగా శాస్త్రబద్ధతకే పూనుకొంటే చిత్రంలో యాంత్రికం లేదా అసహజం అయిన ఫలితము కలగవచ్చు. అందువల్లనే 20 వ శతాబ్దిలోని ప్రాతికాల్పనిక రచనలలో శాస్త్రబద్ధరచనలోని బిగువు చాలావరకు సడలించబడింది. ఒక రచనలో తిరోగామి మండలత్రయము (*Three zones of Recession*)ల విషయంలో పాటించవలసిన నిష్పత్తులలో ఈ సడలింపు ముఖ్యంగా కనబడుతుంది. రేఖాగత దృష్టి ప్రక్రమగతితో పాటుగా వాయుగత దృష్టి ప్రక్రమగతి కూడా ఎక్కువ వాడుకలో ఉన్నది. దీనికో-ఆశిక సంక్రమణములనదగు- పురోగామి తిరోగామి వర్ణాల పద్ధతివంటి వాటిని ప్రాదేశికంగా దృశ్యమయ్యే తిరోగతిని రూపించటానికి వినియోగించడం జరుగుతుంది.

విట్రూవియస్ (1వ శతాబ్దికి చెందిన ప్రముఖ శిల్పశాస్త్ర రచయిత) తెల్పిన అభిప్రాయాన్ని బట్టి, దృష్టిప్రక్రమగతిని మొదటిసారి పేర్కొన్నవాడు ఏథెన్స్ నగరనివాసి అయిన అగథార్కస్ అనే చిత్రకారుడు. క్రీ.పూ. 5 వ శతాబ్ది నాటి తనరచనలో, ఈస్కిలస్ రచించిన ఒక దుఃఖాంత నాటకపు రంగభూమిని రూపొందించే సందర్భంలో ఇటువంటి దాన్ని అతడు ప్రస్తావించాడు. కాని దాన్ని ఆధారంగా గ్రహించి, తరవాతివారైన అనగ్జగోరస్, డెమోక్రిటస్ అనేవాళ్ళు పురోగామి తిరోగామి వస్తువులు సమతలంపై కనపడే రీతిని గురించీ, దృక్శంకువును గురించీ, స్థితిబిందువు నుంచి చిత్రతలానికి ద్రష్టయొక్క కంటినుంచి పయనించే దృగ్రేఖల వ్యూహంగురించీ వివరించారు. రోమనుల కాలపు కుడ్యచిత్రణములు, అప్పటి చిత్రకారులకు ఈ సిద్ధాంతాలు తెలిసిఉన్నట్లు తెలియజేస్తాయి. ఆ చిత్రాలలో సమాంతర దృష్టి ప్రక్రమగతి సువ్యవస్థితమైంది. 15వ శతాబ్దికి చెందిన చిత్రకారులును, వాస్తువిదులును రేఖాగత దృష్టిప్రక్రమగతికి ఎక్కువ శాస్త్రీయతను సమకూర్చారు, లియోనీ బట్టిస్టా ఆల్బెర్టి (1404-1472), పియెరో డెల్లా ఫ్రాన్సెస్కా (ర. 1420-1492), పావలో ఉచ్చెల్లో (1396/7-1475), ఆల్బ్రెక్ట్ డ్యూరర్ (1471-1528), లియోనార్డోడావించి (1452-1519) మొదలైన ప్రముఖ కళాకారులు ఈ దృష్టి ప్రక్రమగతిని గూర్చి పెక్కు అనుశీలనలు జరిపారు.

చూ : *projection; Sotto in su*

**pervading colour** : *అలముకొన్న రంగు.*

**pervasive** : *అభివ్యాప్త.*

**petard** : *అతివర్ణకం; అగ్నిక్రీడ.*

ఇతరుల దృష్టిని తటాలున ఆకర్షించటానికి అనువుగా పరవు గొలిపేట్లు విచ్చలవిడిగా రంగు పూసిన చిత్రం. (పెటార్డ్ అనేది ఫ్రెంచి

భాషా పదం—దీనికి బూజాసంద్రా కాల్చుడు అని అర్థం.) ఇరవయ్యో శతాబ్దంలో చిత్రకళా ప్రపంచంలో వచ్చిన సత్వరిణామాలవల్ల ఈ పదమే నేడు వాడుకనుంచి అంతరించింది.

**petite nature** : *మధ్య ప్రమాణకం.*

అటు జీవప్రమాణంలో గాని, అందులో సగం ప్రమాణంలో గాని ఉండక వాటి రెంటి మధ్య ప్రమాణంలో ఉండే చిత్రం.

**petrolatum** : *శిలాతైలజం.*

పెట్రోలియం నుంచి తయారయ్యే ఒక విధపు ఘనరసం. దీనికి 'వేస్‌లైన్' అనే వ్యాపారనామం ఉంది.

**Pettenkofer process** : *పెట్టెన్ కోఫర్ ప్రక్రియ.*

ఒక చిత్రలేఖనంపైని వార్నిష్ కాలగతిలో తెల్లబడటం, లేదా మసకబారటం జరిగినప్పుడు దానికి మళ్ళీ మిలమిలను, కలిగించటానికి అనుసరించే ఒక విధానం.

**petuntze or petuntse** : *చీనా నల్లరాయి.*

చీనాలో లభించే ఒక విధమైన నల్లరాయి. దీని పొడిని మృత్తికతో కలిపి పింగాణిని తయారు చేస్తారు.

**pewter** : *నాగమిశ్రం; త్రపునం.*

తగరాన్ని వేరేవేరే నిష్పత్తులతో ఇతర లోహంతో కలవడంవల్ల తయారయ్యే ఒక మిశ్రలోహం. మేజాబల్లలు మొదలైన వాటి అలంకరణకు ఇది ఉపకరిస్తుంది.

**phenol** : *ఫెనాల్; అదూషిక.*

కార్బాలిక్ ఆమ్లం. బూజుపట్టకుండా నిరోధించటానికి, క్రిమిసంక్రమణ నివారణకూ దీన్ని వాడతారు.

**phenolic resin** : *అదూషికా యక్షధూపం*

ఉష్ణనమనీయ యక్షధూపాల ఒక వర్గం. ఈ వర్గపువాటిలో ప్రముఖమైనవి బేకలైట్, కటాలిన్ అనే వ్యాపార నామాలతో ఉన్నాయి.

**phenomenon** : *పరిదృశ్యం; దృగ్విషయం.*

**phoenician art** : *ఫినీషియా కళ.*

ప్రస్తుతం లెబనాన్ అని వ్యవహృతమవుతున్న ప్రదేశంలో ప్రాచీన కాలంలో క్రీ.పూ. 5000 మొదలు దాదాపు 2000వరకు వసించిన ఒక సెమిటిక్‌జాతిలో ఒక శాఖకు చెంది, అత్యంత మేధావులుగా గణనను ఆర్జించిన ఫినీషియులలో, ఆ కాలంలో ప్రవర్తిల్లిన కళావిశేషం.

**phosphotungstic pigments** : *ఫాస్ఫోటంగ్స్టిక్ వర్ణద్రవ్యాలు.*

ఉజ్జ్వలత కలిగి, శక్తిమంతములై రకరకాల వన్నెలలో లభించే కొన్ని వర్ణద్రవ్యాలు. సంయోజితరంగద్రవ్యాలనుంచి వీటిని తయారు చేస్తారు. శంకాలం మనవలసిన చిత్రాలకు ఇవి పనికిరావు.

**photochemical** : *కాంతిరాసాయనిక.*

**photochemical embrittlement** : *కాంతి రాసాయనిక భిదురత.*

పగటిపూట అతినీలలోహిత కాంతి తగి

లేట్లు ఎక్కువ కాలం ఉంచటంవల్ల ఒక చిత్రపు లేదా వార్నిష్ పటలపు నమనీయతయో స్థితి స్థాపకశక్తియో తగ్గిపోవడం.

**photoelectric cell** : *కాంతి విద్యుత్ ఘటం.*

**photo-engraving** : *కాంతిరేఖా శిల్పం; కాంత్యధిరేఖనం.*

వాణిజ్యరంగంలో ప్రకటనలకొరకై జరిపే ఒక విధపు ఉల్బణముద్రణ ప్రక్రియ. ఇందు మొదటి ప్రతియొక్క కాంతిలేఖనపు వ్యత్యస్త బింబాన్ని (*Negative*) రేఖాఖండనం (*Line-cut*) వల్లగాని అర్ధస్థాయీ ప్రక్రియవల్లగాని ఒక లోహఫలకంపై ముద్రింపజేస్తారు. అట్లా ముద్రించటానికి ముందుగా ఒక బైక్రోమేట్‌తో పైపూత జరిపి, ఆ లోహఫలకానికి గ్రహణశీలతను కల్పిస్తారు. అంతట లోహఫలకాన్ని సంస్కరించి దానిపైన హింతాళ నిర్యాసపు పొడిని పైపొరగా పట్టిస్తారు. ఈ పొడి కాంతిలేఖనపు బింబానికి మాత్రమే గట్టిగా అంటిపట్టుకొంటుంది. అంతట లోహఫలకాన్ని వేడి చేయగా, హింతాళ నిర్యాసపు పొడి ద్రవించి ఫలకంలోని రేఖాంకిత ప్రదేశాలపైన ఒక నిరోధక ద్రావకంగా పరిణమిస్తుంది. అంతట లోహఫలకంపై సూచీచిత్రణ (చూ: *Etching*) జరుపబడుతుంది. ఈ చిత్రణ అంతా అంతఃపాతి (*Intaglio*) ప్రక్రియను అనుసరించి జరుగుతుంది. కాని రేఖాంకిత ప్రదేశాలు ఉబ్బెత్తుగా ఉండటంవల్ల, ఫలకానికి సిరాపూసి ముద్రించటం-ఉల్బణఫలకానికి జరిపినట్లే-జరుపుతారు. ఈ విషయంలో ఇది కాంతిఘటిత ముద్రణ (*photo gravure*) కన్నా భిన్నం. కాంతిఘటిత ముద్రణ, అంతా అంతఃపాతి ప్రక్రియను అనుసరించే జరుగుతుంది.

**photo engravure** : *కాంతిపరివర్తన ప్రక్రియ.*

**photographic**: *కాంతిలేఖక; ఛాయాచిత్రక.*

**photographic stencil method**: *కాంతిలేఖక తైజన ప్రక్రియ.*

ఒక విధపు కౌశేయ యవనికా ప్రక్రియ. ఒక ప్రత్యేకమైనరీతిలో గ్రహణశీలం చేయబడ్డ కాంతిపటలం (*Photo film*) నుంచి దీనికి కావలసిన తైజసం తయారు చేయబడుతుంది. కౌశేయ యవనికా తైజసాలను తయారు చేయటంలో-వ్యాప్తిలో ఉన్న తక్కినవద్ధతులకన్నా-ఇది చాలక్లిష్టతరమే అయినా, దీన్ని అచ్చమైన పునరుత్పాదక ప్రక్రియగా భావించవచ్చు. ఎందుకంటే ఈ ప్రక్రియలో యవనికపై రచన ఏదీ జరగదు. ఏ ఉపరితలంపైన అయినా, ఎటువంటి మాధ్యమాన్ని అయినా రూపొందించిన కళారచనను, కాంతిలేఖన (*Photographic*) ప్రక్రియారీతిని ఒక పటలం (*film*) పైకి మార్చి, దానినుంచి తైజసం పొందవచ్చు. ఇట్లా చేయటంలో, లలితమైన అర్ధస్థాయీ విశేషాలతో పాటుగా, తొలిప్రతిలోని అన్ని వివరాలను పునరుత్పాదనం చెందుతాయి, వాణిజ్యకృషిలో ఈ ప్రక్రియను ఎక్కువగా ఉపయోగిస్తారు.

**photographic paper** : *కాంతిలేఖక పత్రం.*

**photographic realism** : *ఛాయాచిత్రక వాస్తవికత.*

**photography:** *కాంతిలేఖనం; ఛాయాచిత్ర లేఖనం.*

**photo gravure :** *కాంతిఘటిత ముద్రణ; కాంతచిత్రణ.*

వాణిజ్యరంగంలో మన్నన ఆర్జించిన అంతః పాతిముద్రణ ప్రక్రియలలో అత్యంత ప్రాముఖ్యం ఆర్జించిన ప్రక్రియ. అర్ధస్థాయీ విశేషాలను, వర్ణచిత్రణ ప్రాశస్త్యమును ఉన్న దానిని ఉన్నట్లుగా పునరుత్పాదనం చేయగలిగే అతివిశిష్టప్రక్రియగా ఇది పేరొందింది. ముద్రణ తలము, ఈ ప్రక్రియలో బల్లపరుపుగా ఒక రాగిఫలకంవల్ల రూపుగొన్నది (ఫలకాధారం) కావచ్చు; లేదా చుట్టునూ రాగిరేకును గట్టిగా అమర్చిన స్థూణం (భ్రామకాధారం) కావచ్చు. గ్రహణశీలం చేయబడ్డ రాగిఫలకం మీదికి జల్లెడలాగా ఉండే యవనిక ద్వారా ముద్రణ పొందవలసిన దాని తొలిరూపాన్ని కాంతిలిఖితం (*photographed)* చేయడం ఇందులో మొదట జరుగుతుంది. అప్పుడు కాంతిలేఖనపు బింబాన్ని సరిచేసి, చక్కనిరీతిలో ఉండే భాగాలుగా విభజిస్తారు. ఫలకంలో ముద్రణగాకుండా ఉండవలసిన భాగాలను, కదఅంచు(*Margin*)లను, ఒక నిరోధక ద్రావకంచే మరుగుపరచటం అప్పుడు జరుగుతుంది. ఈ పనిఅంతా ముగిసిన తరవాత, ఫలకంపై సూచీచిత్రణం (*Etching*) జరపగా, తత్ఫలితంగా ఫలకపు ఉపరితలంలో గుంటలు ఏర్పడతాయి. ఈ గుంటలనే సిరాగిన్నె (*inkcup*)లు అని వ్యవహరిస్తారు. ఇవి అన్నీ ముఖతల పరిమాణంలో ఒకేతీరుగా ఉన్నా, లోతులుమాత్రం వేరువేరుగా ఉంటాయి. అందువల్ల ఫలకానికి సిరా పూసినపుడు తక్కువ లోతుగల గుంటలోని సిరా, ముద్రణపడ వలసిన కాగితంపై సరిగా అంటుకోక, ముద్రిత ప్రదేశాలు వెలవెల బోతున్నట్లుంటాయి; లోతు ఎక్కువగా ఉన్న గుంటలలోని సిరా ఎక్కువగా అంటుకొని స్థాయీభేదం–తన లోతును అనుసరించి – రూపొందిస్తుంది. కాంతిరేఖాశిల్పం కన్నా ఈ పద్ధతి విభిన్నం (చూ : *photoengraving*).

**photo mural :** *కాంత్యుత్కీర్ణం; కాంతి కుడ్యకం*

మొదట ఒక కాంతిలేఖన ప్రతిని తీసి, దాన్ని గోడయొక్క పరిమాణానికి తగినరీతిగా విపులీకరింపజేసి, ఆవిపుల రూపాన్ని గోడకు గోడజిగురుతోనో వేరే విధమైన అధిసక్తకంతోనో గట్టిగా అతకగా రూపొందే చిత్ర విశేషం.

**phthalocyanine blue :** *థాలోసియానిక నీలిమ.*

రాసాయనికంగా దీన్ని తామ్రపు థాలోసియానైన్ అని వ్యవహరిస్తారు. గాఢమూ, సాంద్రమూ అయిన సియానైన్ నీల వర్ణద్రవ్యమిది; ఇందులో ఆకుపసిమివాక అధస్థాయి ఎక్కువగా ద్యోతకమవుతుంది. ఛవిపటిమ ఇందులో ఎక్కువగా ఉంది.

**phthalocyanine green :** *థాలోసియానిక హరితము.*

తామ్రపు థాలోసియానైనును క్లోరిన్‌తో యోగింపజేసినప్పుడు రాసాయనికంగా ఇది

లభిస్తుంది; ఉజ్జ్వలత, శీతలత, పారదర్శకత కలిగిన మరకత హరితపు పర్ణద్రవ్యమిది.

**phyllomorphic** : *పత్రరూపక.*

ఆకును పోలిఉండే అలంకృతికి వాడే విశేషణం ఆ అలంకృతి చిత్రలేఖన, ఆలేఖన, రేఖాశిల్ప తత్ప్రక్రియలలో దేనికి చెందింది అయినా కావచ్చు.

**physionotrace** : *బాహ్యరేఖిక; రూపాను లేఖిని.*

ఉపవిష్టుని, రూపబాహ్యరేఖను అను లిఖింపటానికి పనికివచ్చే ఒక పరికరం. 18వ శతాబ్ది ఉత్తరార్థంలోనూ 19వ శతాబ్ది పూర్వార్థంలోనూ స్పష్టాస్పష్ట చిత్రణ (*Silhoutte*) కు ఎక్కువ ఆదరం ఉన్న కాలంలో ఈ పరికరం చాలా వాడుకలో ఉండేది.

**picture frame** : *పటపు చట్రం: చిత్రావరణం.*

ఒక సౌరణిక చిత్రణ, లేదా అచ్చు చిత్రం లేదా ఆలేఖనానికి చుట్టూ - సాధారణంగా కొయ్యతో నిర్మితమై, బిగించిన అంచుపట్ట. ఇటువంటి కట్టుబడి వల్ల పటపు సౌందర్యం అతిశయించడమే గాక, గోడను చిత్రం అనకుండా వేరుపరచటానికి, ఒక అలంకార సామగ్రితో ముడిపెట్టటానికి, పటానికి అండగ ఉండి దాన్ని పరిరక్షించడానికి ఈచట్రం పనికివచ్చును. అచ్చుచిత్రాలకు, నీటిరంగు చిత్రాలకు, పిష్టకములకు వెనకవైపున దిండును ఒకదానిని సంధించిన తరవాత పైన గాజు పలక నుంచి చట్రాన్ని బిగించాలి. ప్రసారిక పైపరచిన సాధారణపు కాటికపై చిత్రాన్ని రచించినపుడు, తగుపాటి బలం గల చట్రం బిగించిన తరువాతనే గోడపై వేలాడదీయాలి. ప్రసారిక లేకపోతే కాటిక మడతలుపడే ప్రమాదం ఉంది. 20వ శతాబ్ది మధ్యభాగంలో చట్రములు లేకుండానే కాటికా చిత్రాలను గోడలకు వేలాడదీయడం అమలుకు వచ్చింది. ఈ పద్ధతిలో ప్రసారిక చాలాదిట్టమైనదిగా ఉండాలి. 20వ శతాబ్ది రెండో పాదంవరకు పటాలలో పెక్కింటి చట్రాలను పత్రరంజనం చేసే అలవాటు ఉండేది; కాని ఆ తరవాత రంగువేసిన ముడికొయ్య చట్రాలను వాడటం ఎక్కువగా వ్యాప్తిలోకి వచ్చింది.

**picture frames, American stock sizes** : *పటపు చట్రాలు, అమెరికాలోని ఆమోదిత పరిమాణాలు.*

చాలా శైలులలోనూ, వివిధమైన వెడల్పుల లోనూ అమెరికాలో, బజార్లలో లభించే చట్రాలు ఈ కింది పరిమాణాలలో ఉన్నాయి. వీనికొలతలు అంగుళాలలో ఇవ్వడం జరిగింది. కొంత ఎక్కువ వెడల్పుగా ఉండి, అక్కడక్కడ చక్కగా అలంకరణలను సైతం పొంది చిత్రలేఖనాలకు అనువుగా ఉండేవి ఈ దిగువ ఇచ్చిన పరిమాణాలవి:

| | |
|---|---|
| 8 × 10 | 18×24 |
| 11 × 14 | 20×24 |
| 12 × 16 | 24×30 |
| 16 × 20 | 24×36 |

అచ్చు చిత్రాలకూ, ఆలేఖనాలకూ, పైన గాజుఫలకను జతపరచిన తరవాత, బిగించటానికి అనువుగా ఉండేవి ఈ దిగువ పరిమాణాలు కలవి:

| | |
|---|---|
| 5×7 | 11×14 |
| 8×10 | 12×16 |
| 8½×11 | 14×18 |
| 9×12 | 16×20 |

**picture plane** : చిత్రతలం.

దృష్టి ప్రక్రమగతిలో లెక్కకు వచ్చే చిత్రోపరి భూమి. ద్రష్టయొక్క కంటికీ చిత్రంలో రూపించబడే వస్తువుల వ్యక్తస్థితులకూ మధ్య ఏర్పడి ఉండే దృగ్రేఖలు అన్నీ చొచ్చుకొని పోగలిగే అంతటి పారదర్శకంగా ఈ తలం ఉంటుందని అర్థాపత్తిగా సంభావితం. ఒక దృశ్యం ఎదుట వట్టి ఉంచిన ఒక కాచపలకమే అది అనే తలంపుతో వ్యవహరిస్తున్నాడా అనేట్లు కళాకారుడు కాటికపై చిత్రాన్ని రూపొందిస్తాడు; చిత్రతలం నుంచి, ఆయా వస్తువులు ఉంటాయని భావితములయే దూరాలను, వస్తుపరిమాణంలో తెలియజేసే మార్పులవల్లనూ, ఇతర పద్ధతుల వల్లనూ, దృష్టిప్రక్రమగతి నియమాలకులోబడి, చిత్రకారుడు రూపిస్తాడు. కేంద్రవీక్షణకిరణము (*central visual ray*) నకు, చిత్రతలం లంబంగా తీరి ఉంటుందని సంభావితం. ఈ కేంద్రవీక్షణ కిరణమే ద్రష్టకు సంబంధించినంత వరకు అత్యంత ఋజుదృగ్రేఖ

**picture putty** : బొమ్మలప్పం.

చిత్రలేఖనాలలో ఏర్పడ్డ చిన్న రంధ్రాలను పూడ్చటానికి పరిరక్షకులు వాడే ఒక గచ్చు పదార్థం. స్థిరతైలంతో సీసునూన్నాన్నింగాని, వేరొక అప్రవర్తక (*inert*) పదార్థాన్నిగాని కలిపి, దానితో కోబాల్టు శోషణిస, కావల్సివస్తే ఛాయకలిగించే వర్ణద్రవ్యాన్ని మేళవింపగా ఈ బొమ్మలప్పం రూపొందుతుంది.

**picture varnish** : బొమ్మ వార్నిషు; పటువు వార్నిషు.

ఒక చిత్రలేఖనాన్ని కాపాడి భద్రపరచటానికై దాన్ని బాగా ఆరనిచ్చిన తరవాత, తుది పూతగా దానిపై ఉపయోగించే వార్నిషు. ఇందువల్ల చిత్రం చాలాకాలం భద్రంగా మనగలగటమే గాక, చిత్రంలో అంతట ఏకరీతిలో, పై మెరుగు కలుగుతుంది. దధిచూర్ణ వర్ణాలతో చిత్రించిన రచనలకు కొన్ని సందర్భాలలో ఇటువంటి పూతవల్ల తైలవర్ణచిత్రంలో కనపడే వర్ణగభీరత లభిస్తుంది ప్రస్తుతం ఇటువంటి వార్నిషులలో డాంబరు, ఆక్రిలీయ వార్నిషు అనేవి ప్రశస్తములు. ఇందులో మొదటిది చిత్రానికి పై మెరుగును చక్కగా కల్పిస్తుంది. రెండో దానివల్ల మందంగా ఉండి ఆకర్షకంగా ఉండే శోభ కలుగుతుంది.

**piece mould** : ఆంశిక సంయానం; భాగసంయానం.

ఒక ఆకృతిని అనుసరించి నిషిక్తమును, ఏకాండంగా తయారుచేయటానికి అనువుండని సందర్భంలో అందుకోసం కొన్ని ఖండాలుగా మూర్తికను తయారుచేసినప్పుడు ఏర్పడే వాటిలోని ఒక ఖండం. ఇటువంటి ఖండాలలో ప్రతిదానికీ రెండో అంతకన్న ఎక్కువగానో బొడుపులుంటాయి. ఆబొడుపులు ఇమడటానికి అనువుగా, దానితో సంధింపవలసిన ఖండానికి, సరియైన తావులలో రంధ్రాలుంటాయి. ఇట్టి ఏర్పాటువల్ల ఖండాలన్నీ సంధింపబడగా, నిండైన మూర్తికం రూపొందుతుంది. లోని నిషిక్తాన్ని తీయటానికి ఆంశిక సంయాన పద్ధతిలో చేసిన డొల్లచిప్పను పగులగొట్టవలసిన అవసరం ఉండదు.

**pier** : అర్ధస్తంభం.

**piercing** : ఛిద్రణం

లోహపుపనిలో అవలంబించే ఒక అలంకరణ ప్రక్రియ. ఇందులో లోహఫలకంపై కొన్ని ప్రదేశాలను ఛిద్రణం చేయడంవల్ల కొన్ని ఆకృతిరేఖలు ఏర్పడతాయి తట్టపలక(*Tray*) మొదలైనవాటి పిడులపైఇటువంటి అలంకరణ జరుగుతుంది. సన్న అంపాన్ని ఇందులకై ముఖ్యంగా వెండిపలకపై ఛిద్రణము చేయటానికి వాడతారు.

**pieta** : కరుణామూర్తి.

క్రీస్తుదేవుని శవమును ఒడిలోఉంచుకొన్న మేరీమాతను రూపొందించిన శిల్పం లేదా చిత్రలేఖనం ఆరాధనకళలో ఇది ఒక విశిష్టతను ఆర్జించింది.

**pietra dura** : దృఢప్రస్తరం.

ఒక విధమైన చిత్రకపు పని. ఇంద్రనీల, వర్ణశిల, చంద్రశిల మొదలైన రంగుల రాతి బిళ్లలు ఇందులో ఉపయుక్తములై చిత్రంలోని రంగులా అనేట్లుగా భ్రాంతిని కలగజేస్తాయి

**pigment** : వర్ణద్రవ్యం.

పూతరంగును, అచ్చుసిరాను, ఇంకాపెక్కు పారిశ్రామికోత్పత్తులను తయారుచేయటానికి ఉపకరిస్తూ మెత్తటి పొడిరూపంలో ఉండే రంజకద్రవ్యం ఇటువంటి ద్రవ్యాన్ని, తనకు వాహకంగా ఉండే ద్రవంలో కలిపేటప్పుడు అందులో అది కరిగిపోక, ఆ ద్రవ్యపు ఉపరితలంపై చక్కగావ్యాపించి, తన రంజకతను దానికి అందజేస్తుంది. ఇట్లాకాకుండా వాహకంగా ఉండే ద్రవంలో చక్కగా కలిసిపోయి, అవినాభావంగా వర్ణతను కల్పించే వాటికి రంగద్రవ్యములు (*Dyes*) అనే పేరు ఉంది. విపర్ణం లేదా అప్రవర్తకమైన వర్ణోపాధిపైఒకరంగద్రవ్యాన్ని అధక్షిప్తంచేయగా రూపొందే వర్ణద్రవ్యాన్ని రంజకం (*Lake*) అంటారు. ఇటువంటి దానిలో రంగద్రవ్యం అద్రావ్యం(*insoluble*)గా ఉంటుంది. అద్రావ్యంగా ఉండికూడా నేరుగా వర్ణద్రవ్యం వలెనే వాడబడే సంయోజిత కార్బనిక యౌగికాన్ని స్థాయీకారి (*Toner*) అంటారు. కళాకారులు ఉపయోగించటానికి అనువుగా స్థాయీకారులను రూపొందించాల్సివస్తే, వాటికి అప్రవర్తక వర్ణద్రవ్యాలను కలిపి, వాటి పటిమను తగ్గించాలి.

వర్ణద్రవ్యాల వింగడింపు-వాటివాటి ఉత్పత్తిరీతులను బట్టి-జరుగుతున్నది. రంగు మృత్తికలను సంస్కరించగా లభించేవాటిని మృద్వర్ణాలు (*Earth colours*) అంటారు. తమకు తాముగా ఎటువంటి రంజకలక్షణాన్ని కలిగిఉండని,కర్బనేతరములైనముడిపదార్థాల నుంచి రాసాయనిక పద్ధతులద్వారా రూపొందించేవాటిని కృత్రిమ కర్బనేతరవర్ణద్రవ్యాలు అంటారు మృద్వర్ణాలను నేలనుంచి త్రవ్వి సంస్కరించటం ప్రపంచమంతటా అమలులో ఉన్నది; కాని అటువంటి వర్ణాలలో ప్రశస్తములైనవి, నిర్దిష్టములైన కొన్ని తావులందు మాత్రమే లభిస్తున్నాయి. ఉదాహరణకు మేలిరకానికి చెందిన పచ్చగైరికం ఫ్రాన్సు దేశంలోనూ, ముదిగాఉన్న లేదా కాల్చిన సీన మృత్తిక, స్వచ్ఛమైనది ఇటలీదేశంలోనూ, నాణెపుతృణమణ(*Umber*)సైప్రస్‌దీవిలోనూ దొరకుతున్నాయి. అతిప్రాచీన కాలంలో కళా

రంగంలో వాడబడిన వర్ణద్రవ్యాలలో కాకి రాయి, పచ్చగైరికం వంటి మృద్వర్ణాలూ, శోణరంజకం (*Crimson luke*), దీపమషి, తెల్లసీసము వంటి తయారీ వర్ణద్రవ్యాలూ ఉండేవి. కళాకారులు వాడటానికి మాత్రమే అనువుగా ఉండే - చిరస్థాయి కర్పనే తర- కృత్రిమ వర్ణద్రవ్యాలు, కొద్దిమొత్తాలలోనే తయారవుతున్నాయి. అయితే పారిశ్రామిక ప్రయోజనాలకు పనికివచ్చే వర్ణద్రవ్యాలు మాత్రం భారీఎత్తున తయారవుతున్నాయి.

కళాకారులు వాడటానికి ఒక వర్ణద్రవ్యం సముచితమగునెడల, చదరపు అంగుళమున 325 జాలరంధ్రములు ఉన్న ఒక యవనిక ద్వారా అది చొచ్చుకొని పోగలిగి ఉండాలి. అంతేగాక దాని ఉజ్వలతా స్వచ్ఛతా ఛవీ పటిమా ప్రమాణాలు ఉన్నత స్థాయిలో ఉండాలి. దాని కోవకు ఉండదగిన రీతిలో సాధారణ వర్ణధర్మాలను, పారదర్శకతను లేదా కాంత్యభేద్యతను అది కలిగిఉండాలి. అంతే గాక వర్ణద్రవ్యం ఎప్పుడునూ అప్రవర్తకమై ఉండటం తప్పనిసరి. అందువల్ల దాన్ని ఇతర వర్ణద్రవ్యాలతోగాని ద్రవాలతోగాని కలిపి నప్పుడు, ఎటువంటి దుష్పరిమాణాలు కూడా సంభవించవు. సాధారణ గృహాభ్యంతర పరిస్థితులతాకిడికి-అంటేపరోక్షకిరణలో వచ్చిపడే వెలుతురు, సాధారణ సాంద్రత కలిగిన కృత్రి మపు వెలుతురు, నియంత్రిత ఉష్ణోగ్రతాగతి, గాలిదెమ్మలోనిమార్పులు వంటివాటి దెబ్బకు- తట్టుకొని, కాంతితగ్గకుండా నలుపెక్క- కుండా ఉండేది కావాలి. కళాకారులు వాడ దగినవి అని నిర్దేశించబడిన అన్ని వర్ణద్రవ్యా లో పైన చెప్పబడిన పరిస్థితులలో, నిలదొ క్కుకొని శాశ్వతంగా మని ఉండేవిగానే ఉన్నాయి. అయితే అందులో కొన్నిమాత్రం నేరుగా సూర్యకాంతి పడ్డప్పుడే పరిస్థితులలో వివర్ణతను పొందవచ్చు. ఇంటివెలుపలి కుడ్య చిత్రాలను రచించడంలో, చిత్రకారుడు తనవర్ణ ఫలకంలో ఎటువంటి పరిస్థితిలోనైనా నిలచి ఉండి చిరస్థాయిగా మనగలిగే వర్ణద్రవ్యాలకు- కోబాల్టు నీలిమ, మాంగనీజునీలిమ, ఇండియా ఎరుపు, తేలిక ఎరుపు, అంగారక శోణిమ, మరకతవర్ణం, క్రోమియమ్ భస్మహరితం, పచ్చగైరికం వంటి వాటికి - మాత్రమే తావు కల్పించాలి. భిత్తిచిత్రణ సందర్భంలో ఈ వర్ణద్రవ్య సంఖ్య ఇంకా చాలా తక్కువగా ఉంటుంది. అటువంటి చిత్రణలో వాడే వర్ణ ద్రవ్యం సున్నపుదెబ్బకు తట్టుకొని వాయు మండలంలోని ఆమ్లదోషాలను నిరోధించటానికి సమర్థమై ఉండాలి. ఇంటిపూతలు, అచ్చు సిరాలు మొదలైన వాటికై వాడబడే మిల మిలని రంగులు చిరస్థాయిగా ఉండేవి అని ప్రకటించబడటం నిజమే అయినా వాణిజ్య పరి భాషలో 'చిరస్థాయి' అనేమాటకు పరిమితార్థం మాత్రమే ఉంది. ఉద్దిష్టమయ్యే ఒక నియ మితకాలం వరకు మనగలిగి ఉండేది అనడమే అందలి 'చిరస్థాయి' అనేదాని భావం. ఆ నియమిత కాలంలోనే అది రంగుమాస్తే దాన్ని 'అకాల క్షీణత' (*Premature failure*) అంటారు.

**pigment nomenclature** : వర్ణద్రవ్య నామ్నీకరణం.

కళాకారులు వాడదగిన వర్ణద్రవ్యాల నామ్నీకరణం. పలుశతాబ్దాల కాలం చాలా అస్తవ్యస్త పరిస్థితిలో ఉండినది. 1942లో

యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వం 'వర్ణక ప్రమాణం' (*Paint standard*) అమలులోకి తెచ్చిన తరవాత చిరస్థాయి వర్ణద్రవ్యాల పేర్లు ప్రామాణిక రూపాలనుపాయి. స్టే. కు సంబంధించినంతవరకు- ఉద్దరించినవి. ఈ విధంగా గ్రేట్బ్రిటనులో 1957 వ సంవత్సరంలో ఆంగ్లదేశీయ వర్ణక ప్రమాణం (*British paint standard*) అమలులోకి వచ్చింది. ఏవో కొద్ది అపవాదాలు అట్లా ఉంచితే మొత్తంమీద, అమెరికా, బ్రిటన్, యూరప్లలోని ఉత్తమ కళాకార వర్ణద్రవ్యములు సాధికారంగా ఆమోదితమైన పేర్లతే అంటిపెట్టుకొని ఉన్నాయి. అటువంటి ప్రామాణికనామాలుగాక వేరువిధమైన పేర్లు కలవానిని న్యూనప్రమాణ (*Substandard*) ద్రవ్యాలుగా పరిగణించవచ్చును.

**pigment properties** : *వర్ణద్రవ్య లక్షణములు.*

ఒక వర్ణద్రవ్యపు విలువను మదింపు వేయటంలో ప్రసక్తమయ్యే ఒక విశేషం; ఆ ద్రవ్యపు వర్ణలక్షణాలు గాక తక్కిన అన్ని లక్షణాలూ-పైపూతల ప్రవర్తన, రాసాయనిక స్థైర్యం, పైపలుకులోని నాజూకుతనం మొదలైనవి - ఇటువంటి మదింపులో లెక్కకు వస్తాయి.

**pilaster** : *కుడ్య స్తంభం; స్తంభకుడ్యం; వర్గ యోగం.*

ఒక గోడయొక్క ఉపరితలానికి అనుకొని, లోపలికి బాగా దిగిఉన్నట్లు, నిలువుగా ఒక స్తంభపు రూపాన్ని ఉబ్బెత్తులో పొందు పరచగా ఏర్పడే అలంకృతి విశేషం.

**pine oil** : *శరళ తైలం*

దేవదారువు కొయ్యముక్కలను బాష్పీభవనం చేయగా లభించే వివిధోత్పన్నాలలో ఇది ఒకటి. తైలచిత్రాలకు విలంబినిగా దీన్ని కొందరు వాడతారు.

**pinesoot black** : *శరళ కజ్జల కాలిమ*

దీపమసికి చీనీయులు వాడే పర్యాయనామం. ఒక విధపు దేవదారు కొయ్యను కాల్చి దీన్ని తయారు చేస్తారు.

**pink colour** : *లేతగులాబిరంగు; శ్వేత రక్తిమ.*

క్రోమియమ్ భస్మాన్ని, తుత్తునాగ భస్మాన్ని కొలిమిలో బాగా కాల్చగా వచ్చే ఎరుపువాక,పాండురపు వర్ణద్రవ్యం. పింగాణి పనిలో రంగుకై ఇటువంటి లేతగులాబి రంగు పనికి వచ్చేదేఅయినా దానికి గల అల్పద్రవసంతృప్తతయు విపరీతపు ఖరీదును చిత్రలేఖనాలలో పూతరంగుగా అది వినియోగం కావటానికి ఆటంకంగా పరిణమించినవి. 1886లోనే ఈరంగును జర్మనీలో తయారు చేయటం జరిగింది.

**pink mauve**: *మృదు నీలలోహిమ.*

నీలలోహిమలో ఎరుపువాక గలది.

**pins : శలాకలు**

లోహం పోతలో దొల్లిమ్పునకూ అంత స్థమునకూ మధ్య సందును యథాస్థితిలో ఉంచటానికి తగిన పద్ధతిలో అడ్డుగా ఉంచే మేకులు. వీనిని సాధారణంగా ఇనుముతో తయారుచేస్తారు కాని కాంస్యపు (బ్రాంజి) పోతలో ఆ కాంస్యపు శలాకలనే వాడతారు. అందువల్ల రూపొందే పోతలో, అన్య లోహపు సంసర్గంవల్ల మచ్చలు మొదలైనవి ఏర్పడే ప్రమాదం ఉండదు.

**pinx : చిత్రితము.**

లాటిన్ భాషలోని 'పిన్క్సిత్' అనే దాని సంక్షిప్తరూపమే(*pinx*) అనే పదం. పిన్క్సిత్ అంటే 'అతడు రచించెను' అని అర్థం. తాను రచించిన చిత్రలేఖనంపై ఒక మూలన కళాకారుడు సంతకం చేసిన తరువాత ఈపదాన్ని ఇదివరలో చేర్చేవారు. ప్రస్తుతకాలంలో కొన్ని చోట్ల కొంతమార్పుతో ఈ ఆచారం సాగుతున్నది. ఇప్పుడు చిత్రపు అద్దంమలో దిగువ భాగంలో ఈ పదాన్ని ఉంచుతున్నారు. అయితే ఇటువంటి సందర్భంలో ఆ సంక్షిప్త పదానికి 'రచయిత' అనటానికి బదులుగా ఈ చిత్రమునకై సూత్రపాత్ర మొదర్పినవాడు అనే అర్థంలో వాడుతున్నారు.

**pioneer : వైతాళికుడు.**

**pipe clay : చీనా మట్టి**

ఆంగ్లంలో 'చీనా క్లే' అనే పేరేగాక, పైప్ క్లే అనే పేరుకూడా చీనామట్టికి ఉంది.

**pitchers : కకలకలు**

మార్దవ ప్రక్రియలో ఒక పారిభాషిక పదం. కర్కాశికను తయారుచేయటంలో వాడే ద్వ్యటకరహిత ఖండకశకలాలు.

**pitching chisel : అంచువని ఉలి**

పొట్టిగా, దొడ్డగా ఉండి ఒకే ఒక ఉక్కు-ముక్కతో చేయబడిన, ఒకవిధమైన ఉలి. రాతికి సన్నటి కదఅంచును రూపొందించటానికి దీన్ని వాడతారు. (చూ : *Chisel* అనేపదము దగ్గర ఇచ్చిన చిత్రం )

**placement : సంస్థితి, ఉనికి**

**plafond painting : లోకప్పు చిత్రము**

భవనపు కప్పున లోపలిభాగంలో రచించిన వర్ణచిత్రం. సాధారణంగా ఇది అలంకరణ భరితంగానో, లేదా విపుల రేఖా విన్యాసం కలదిగానో ఉంటుంది.

**plan : విన్యాసం.**

**planimeter : వైశాల్య మాపని**

ఒక నియతిని అనుసరించి తయారుచేసిన దేశపటాలలో విన్యాసాలలో, లేఖికలలో, ఒక ప్రత్యేక ప్రదేశపు వైశాల్యాన్ని కచ్చితంగా కనుక్కోటానికి రేఖాకారుడు వాడే పరికరం. ఈ పరికరపు సూచికను, ఆ ప్రత్యేక ప్రదేశపు పరిధిరేఖపై క్రమంగా అనులిఖించినప్పుడు. అది ఆ ప్రదేశపు వైశాల్యాన్ని వెనువెంటనే తెలియజేస్తుంది. గణితశాస్త్ర పద్ధతులకు సులభంగా లొంగే క్రమబద్ధజ్యామితీయ రూపాలలో దేన్నిపోలకుండా ఉండే ప్రదేశపు వైశాల్యాన్ని ఇందువల్ల లెక్కగట్టవచ్చు.

**planographic printing:** తలలేఖనముద్రణ.

గ్రాఫిక కళలో ప్రముఖ ముద్రణ ప్రక్రియలుగా పేరుపొందిన మూడిటిలో ఒకటి. (తక్కినవి అంతఃపాతి ముద్రణ, ఉల్బణ ముద్రణ). శిలాలేఖనమనకు గ్రాఫిక కళలో ఒక ప్రత్యేక వర్గానికి చెందిన దానినిగా పరిగణనను కల్పించటానికే ఈ పదం రూపొందించబడింది. ఇక్కడ ముద్రణ, ఏ ఉబ్బెత్తు స్థలాలనో, లేదా రంధ్రితమగు స్థలాన్నో ఆశ్రయించి జరగక, ఒకే ఒక తలాన్ని అనుసరించి జరుగుతుంది అనటం ఇందలి ప్రధానలక్ష్యం. శిలాలేఖనంలో ముద్రణ పొందవలసినచోట్లూ, ముద్రణ పొందకుండా ఉండే తావులూ ఒకే ఒక ఉపరితలంలో భాగాలుగా ఉంటాయి అయితే అచ్చుసిరాను ఇందులో తొలుతటివి గ్రహించగా, తక్కినవి అట్లా గ్రహించకుండా ఉండిపోతాయి. అందువల్ల కావలసిన భాగాలు మాత్రమే ముద్రితమవుతాయి.

**plaquettes :** భూషికలు.

లోహంలో –ముఖ్యంగా బ్రాంజిలోగానీ, సీసంలోగానీ - ఉల్బణరీతిలో తయారుచేసే చిన్నవైన అలంకృతి సాధన విశేషాలు. ఇటువంటివి సర్వసాధారణంగా మధూచ్ఛిష్ట విధానంలో పోతపోయబడుతాయి. తయారైన ఒక భూషికకు లక్క అనుకృతిని తయారుచేసి దానినుంచి వేరొక భూషికను రూపొందించవచ్చు. ఆ అనుకృతిలో ఒక చిన్న మార్పునుచేసి, తరవాత దాన్నిపోతకై వినియోగించినప్పుడు వేరొక క్రొత్తరకపు భూషిక తయారవుతుంది.

**plasteline – చూ : modeling clay**

**plaster :** సుధావిష్టం

కళారంగమున వాడబడు ఒకతెల్లని, మెత్తని చూర్ణం. దీన్ని తగుమాత్రపు నీటితో కలిపితే బాగా ముద్దదేరి, బిగిసి, తరువాత కొంతకాలానికి గట్టిదేలి, రాయిలాగా అవుతుంది. ఇందులో మూడురకాలవి సాధారణపు వాడుకలో ఉన్నాయి: 1. గాజుగసున్నము; భిత్తిచిత్రణకు, గోడలకు గచ్చువేయటానికి, అలంకారయుతమైన పనిని గోడపై సాగించటానికి, చూర్ణలేపపు (*Stucco*) పనిని సాగించటానికి ఇది ఉపయోగపడుతుంది. 2. ముగ్గుసున్నం; దీనిని గోడగచ్చుకు కొందరువాడతారు. 3 పరాసీ సుధాపిష్టం.

**plaster casts :** సుధావిష్ట నిషిక్తములు.

రాతిని మలచే శిల్పికి మార్గదర్శకంగా ఉండటానికి ఉన్న శిల్పాలకు ప్రతికృతులుగనో, మృత్ప్రతిమానములను అనుకరిస్తూనో, సహజస్థితిలో ఉండే ఒక వస్తువును పోలిఉండే రీతిలోనో సుధాపిష్ట నిషిక్తములను తయారు చేయవచ్చు. మట్టితో చేసిన ఆకృతి విశేషమును తడి ఆరని స్థితిలోగాని, ఆవంలో కాల్చిగాని ఉంచకపోతే అది శీఘ్రంగా ఛిన్నభిన్నమై పొడి అవుతుంది. అందువల్ల ఆ ఆకృతిని ఎక్కువకాలం నిలిపి ఉంచే దృష్టితో అటువంటి దాన్ని సుధాపిష్టంతో నిషిక్తంగా తయారు చేయడం పరిపాటి.

**plaster of Paris :** పరాసీ సుధావిష్టము.

ముగ్గుసున్నంనుంచి తయారయ్యే మెత్తటి తెల్లని చూర్ణం. ముగ్గుసున్నాన్ని బట్టీలో బాగా కాల్చి దానిలోని ద్రవపదార్థంలో ముప్పాతిక

భాగాన్ని ఆవిరిగా తొలగించగా, చివరకు ఈ సుధాపిష్టం మిగులుతుంది. ముద్దపాకంగా దీన్ని నీటితో కలిపితే, ఆ ముద్ద అచిరకాలంలో ఆయతనంలో ఎటువంటి తగ్గుదలగానీ, కుంగుదలగానీ లేకుండా, గట్టిదేలి రాటుదేరుతుంది. అయితే, కావలసిన దాని కన్నా ఎక్కువ వేగంతో అది గట్టిపడకుండా ఉండటానికి బంక నీటిని కలపవచ్చు. అటూకాక ఎక్కువ త్వరితంగా గట్టిపడటం ఆవశ్యకమైనప్పుడు కొంత పటికను కలిపి దానిని సాధించవచ్చును. నిష్యంద సుధాపిష్టం (*Casting Plaster*) గా ఈ పరాసీ సుధాపిష్టం విరివిగా వాడుకలో ఉన్నది. ఆ వాడుకలో, అనురచనకు, మలచటానికి, శిల్పంలోను, పింగాణీ పనిలోను, దొల్లప్పల తయారీకి, ప్రత్యేకరీతిలో కొన్ని నిర్దిష్టోద్దేశాల సాధనకై వాడే సిమెంటుల, సుధాపిష్టాల తయారీకి ఇది పనికి వస్తున్నది

**plaster primer : సుధాపిష్ట ప్రాథమికం**

పారిశ్రామిక రీతిలో తయారయ్యే ఒకవిధపు తెల్లటి పూతరంగు. సుధాపిష్టం పట్టించవలసిన ఉపరితలానికి తొలిపూతగా దీన్ని వేస్తారు. దీనికి వాహకంగా ఒక నూనెను, లేదా యక్షధూపంతో కలిసిన నూనెను వాడతారు. ఇది లోపలికి బాగా చొచ్చుకొనిపోయి, తరువాత బాగా అతి గట్టిగా తేలుతుంది. ఇంటి రంగుల తయారీలో పేరు ప్రసిద్ధులను ఆర్జించిన పారిశ్రామిక సంస్థ తయారీచేసే ఇటువంటిది తైలవర్ణాలతో సాగే కుడ్యచిత్రణలో, మంచి ఉపాధిగా, లేదా ప్రాథమికంగా పనికి వస్తుంది. ఈ సుధాపిష్ట ప్రాథమికములనే తరచుగా సరళరీతితో కుడ్య ప్రాథమికములు అనికూడా వ్యవహరిస్తారు.

**plaster prints: సుధాపిష్ట ముద్రాంకములు.**

అంతఃపాతి ముద్రణలో ఇరవయ్యో శతాబ్దంలో వచ్చిన ఒక పరిణత రూపం. రేఖాధిరేఖితమో, లేదా దంశితమో అయ్యే ఒక ఫలకంపై సాధారణరీతిలో సిరా పట్టించి, ఆ ఫలకపు అంచులలో ఒక చట్టాన్ని అమర్చి పరాసీయ సుధాపిష్టాన్ని ఫలకంపై చట్టపు ఎత్తుకు పోసి, ఒక సుధాపిష్ట ముద్రాంకమును అంతఃపాతి ఫలకానికై, సాధిస్తారు. అప్పుడు అటువంటి ముద్రాంకంలో ఫలకం లోని గీతలు ఉల్బణరీతిలో కనపడతాయి.

**plaster tools : సుధాపిష్ట పరికరాలు.**

సుధాపిష్టం గట్టిపడి రాటుదేలిన తరువాత, దానిని కావలసిన రీతిలో కోయటానికి, మలచటానికి, రంధ్రాలువేయటానికి శిల్పులువాడేవలు రితుల పరికరాలు. వీటిని కాకదేలిన ఉక్కుతో తయారు చేస్తారు వీనిలో కొన్ని కొనదేలి



సుధాపిష్ట పరికరాలు

ఉంటాయి; కొన్ని చదునుకొన కలిగిఉంటాయి; కొన్నిటి మొన గుండుతేలుతుంది; కొన్నిటి కొన వంగి ఉంటుంది; కొన్నింటి కొనఅంచు బద్దదేలగా, కొన్నింటిలో వంగదేలి ఉంటుంది. కొన్నిటి అంచు అంపపు - వాదరలాగా ఉంటుంది.

**plastic** : *కల్పకం; ప్లాస్టికం.*

1. సులువుగా కావలసిన రీతిగా రూపీకరించటానికి అనువైన ఒక ద్రవ్యం. సాధారణపు లప్పం, బంకమట్టి, ఇటువంటి కల్పక ద్రవ్యాలకు ఉదాహరణలు.

2. సంయోజితములయ్యే కార్బనికపాలిమరులలో దేనికైనా ఈపదం వర్తిస్తుంది. కావలసిన రూపాన్ని, దాని సాయంతో కల్పించటానికి వీలవుతుంది. అట్లా సాధించబడిన రూపం చెక్కుచెదరక నిలిచి ఉండగలదు సంయోజిత యక్షధూపాలనుంచి పారిశ్రామిక కల్పకాలను, రూపీకరణవల్లనూ, పోతపనివల్లనూ తయారు చేస్తున్నారు. కల్పకశిల్పం (*plastic scu'lpture*) లో, సాధారణపు శిల్పాలు తమవనిముట్లసాయంతో సాధించలేని పనితనపురచనలను సాధించటానికివీలున్నది. ఇటువంటి కల్పక శిల్పాలను, అచ్చు తయారీ ప్రక్రియలకై, అవలంబించటంకూడా ఉంది.

చూ: *vinil resin, acrylic resin, polyester resin*

**plastic art** : *కల్పక కళ*

1. శిల్పం రీతిగా, మూడు ఆయతనాలకు వర్తించే కళావిశేషం. ఆలేఖనం, చిత్రణం వంటి రెండాయతనాల కళారీతులకన్నా ఇది వేరైనది. అంతేకాదు; రెండాయతనాలలోనే మూడాయతనాలను స్ఫురింపజేసే వాస్తవిక చిత్రణవంటి వాటికికూడా ఇది విభిన్నం.

2. శిల్పం, వాస్తువిద్య, చిత్రలేఖనం, ఆలేఖనం, గ్రాఫిక కళలవంటి వన్నియు చేరిఉన్న సర్జన శీలక దృశ్యకళలలో దేనినైనా, ఈ పేరుతో వ్యవహరించవచ్చు. కవిత, సంగీతము, నాటకరచన, సారస్వతసృష్టి వంటి కళలకు ఈ కల్పకకళ విభిన్నం. తరచుగా బహువచన రూపంతోనే ఈ పదం వాడబడుతున్నది.

**plastic gesso** : సుద్ద లప్పము.

గట్టిగాఉండే ఒకవిధపు తెల్లలప్పం. రూపీకరణకూ వెలుతులను పూడ్చటానికి దీన్నిఉపయోగిస్తారు. అట్లా ఉపయోగించటానికి ముందుగా దీనికి తగినంత నీటిని కలుపుతారు. అయితే ఎక్కువ నీటిని కలిపితే ఇది గట్టిపడేటప్పుడు, కుంగుదల చూపే అవకాశం ఉంది. ఒట్టి ముద్దపాకంగా దాన్ని చేయటానికి అనువైనంత మాత్రమే నీటిని కలపాలి.

**plasticine** : సుధావిష్టక

**plasticity** : *కల్పకత*

రూపీకరించటానికి అనువై, రూపీకరించబడిన తరవాత, ఆ రూపాన్ని నిలిపి ఉంచుకోగలగటానికి, ఒక ఘనపదార్థం వ్యక్తమయ్యే లక్షణం. కుమ్మరి మట్టిని ఇందుకు లక్ష్యంగా గ్రహించవచ్చు. దీనికి మంచి కల్పకత ఉంది. అటువంటివే కళాకారులు వాడే తైలవర్ణాలు; వీటిని తూలికతో ఒక ప్రదేశంలో పట్టించిన తరవాతకూడ అవి కదలకుండా నిలిచి, ఇవతలికి ప్రవహించకుండా ఉంటాయి. ఈ విధంగా తైలవర్ణాలలో కన్పించే కల్పకత, తక్కిన కొన్ని వర్ణాలలో కన్పించే ద్రవతకును, సముష్ఠీకరణ వైఖరికి అచ్చంగా వ్యతిరేకం. ఒక

నిర్దిష్ట బలమును (అది తూలిక, రంగు కత్తి, రూపీకరణ పరికరం–అనే వాటిలో దేనివల్ల కలిగేది అయినా) ప్రయోగించినప్పుడు. రూపీకృతవస్తువు, రూపభ్రంశాన్ని నిరోధించటానికి గల శక్తిస్థాయిని అనుసరించి, ఒక ద్రవ్యపు కల్పకతను మదింపువేయటం జరుగుతుంది. కొన్ని వస్తువులు తప్తములైనప్పుడు మాత్రమే కల్పకతను ప్రదర్శించగలుగుతున్నాయి; అటువంటి వాటిని మళ్ళీ చల్లబరచగా, అవి మొద్దుబారిపోతాయి. ఇటువంటి వాటికి లక్ష్యాలుగా గాజును, ఉష్ణకల్పక (*Thermoplastic*) వర్గానికిచెందిన సంయోజిత యక్షధూప ఉత్పన్నములను పేర్కొనవచ్చు. వీటిని చక్కగా వేడిచేసి, వేడిగా ఉన్నప్పుడే రూపాలుగా మలచినప్పుడు ఆ రూపాలను అవి స్థిరంగా ఉంచుకొంటాయి.

**plasticizer** : *కల్పనికము*

ఒక పూతరంగుకు, మాయలక్కకు లేదా వార్నిషుకు, ఆవశ్యకమైన ఒక ప్రత్యేక లక్షణాన్ని సమకూర్చటానికి, లేదా అవాంఛనీయమైన ఒక లక్షణాన్ని తొలగించటానికి కలిపే ఒక ఘటకం సాధారణంగా, ఒక వర్ణద్రవ్యంలో లేదా వాహకంలో ఉండే పెళుసుదనాన్ని అణచివేసి దానికి నమనీయతను సమకూర్చటానికో లేదా తూలికాకర్మను మెరుగుపరచి, ఆయా వర్ణాల మధ్య సామరస్యాన్ని చక్కగా కూర్చటానికో ఇటువంటి కల్పనికను ఉపయోగిస్తారు. తైలవర్ణాలకు సంబంధించినంతవరకు తేనెమైనాన్నే కల్పనికంగా వాడతారు. ఇక నీటి రంగులకు చక్కెరను; మేలిలక్కకును, మాయలక్కకును ఆముదపు నూనెను కల్పనికంగా వాడతారు.

**plastic sculpture** : *కల్పక శిల్పం*

**plastic substance** : *కల్పక ద్రవ్యం*

**plate-finished paper** : *నునుపు కాగితం*

మచ్చలేమీలేకుండా చక్కగా నునుపుదేలి, కొద్ది మందంగా ఉండే కాగితం లేదా సన్న అట్ట ఇండియా సిరాతో ఆలేఖనాలను ఇటువంటి దానిపై రచిస్తారు.

**plate mark** : *ఫలక ముద్ర*

కాంస్యరేఖా శిల్పంలో కాక, తక్కిన అన్ని విధాల అంతఃపాతి ప్రక్రియల రుజువులలోను కాగితంపై అంచుచుట్టూ కనిపించే ఒక విధమైన ముద్ర సూచీముద్రాయంత్రంలో ఉండే ఉచ్ఛేదక చర్యవల్ల ఇటువంటిది ఏర్పడుతుంది. ఆ యంత్రంలో ఉంచే ఫలకపు చుట్టూ ఉండే అంచుమడతను అనుసరించి, ఈ ముద్ర కాగితంపై ఏర్పడుతుంది. ముద్రాయంత్రంలో ఉంచిన కాగితాన్ని, ఫలకపు అంచులు కోసివేయకుండా ఉండటానికి ఆ అంచులను మడచివేయడం జరుగుతుంది. మౌలికపు అంతఃపాతి అచ్చుప్రతికి, ఈ ఫలక ముద్ర ఒక విశిష్టలక్షణం. అచ్చుకాగితం అంచున చట్రమును ఉంచినట్లు ఈ ముద్ర ఏర్పడుతుంది అయితే అంతఃపాతి అచ్చుప్రతులవలెనే, తయారుచేసే నకిలీ ప్రతులలో ఛాయాలేఖన ప్రతులలో కూడా ఇటువంటి ఫలక ముద్రలను కృత్రిమంగా ఏర్పాటు చేయటంకూడా కొన్నిచోట్ల జరుగుతున్నది.

ఒక సూచీచిత్రణంలో, లేదా రేఖాశిల్పంలో ఇటువంటి పలకముద్ర లేనప్పుడు, దాని అంచులు కోశపడి ఉంటాయి. అటువంటిదాన్ని కళాఖండ సంగ్రాహకులు ఆశించరు.

**plate oil : శిలావార్నీషు.**

లిథోవార్నిషుకు బ్రిటన్‌లో వ్యాప్తిలో ఉన్న నామం.

**plein air : ఆరుబయలు**

'ప్లేన్ ఏర్'అనేది ఫ్రెంచిభాషాపదం. 'బాగా గాలి ఆడే ప్రదేశం' అని దీని అర్థం ఆరుబయట చిత్రణను సాగించి రూపొందించే చిత్రాలకు విశేషణంగా ఈ పదం మొదట్లో 19వ శతాబ్ది మధ్యన ప్రచారంలోకి వచ్చింది. అంతకు పూర్వం ప్రకృతిదృశ్య చిత్రణకూడా చిత్రాగారములలోనే జరిగేది. కాని, ఆరుబయటన ఇటువంటి చిత్రణ సాగడం మొదలైన తరవాత, గాలి, వెలుతురుల కదలికలను పరిశీలించటానికి కళాకారులకు చక్కని అవకాశం లభించింది. తత్ఫలితంగా, తమ చిత్రాలలో నూత్న పరిణామాలను తీసుకొని రావటానికి ఉపకరించే క్రొత్త సాంకేతిక ప్రక్రియలను పెక్కింటిని వారు రూపొందింపజేశారు. ఈ క్రొత్త అలవాటు క్రమంగా వాస్తవిక భావన వైపుకు కళాకారులను తీసుకొనిపోయింది. అప్పటివరకు విశేష వ్యాప్తిలో ఉన్న కాల్పనిక వాదాన్ని, ఈ క్రొత్తభావన అవతలకు నెట్టి, తర్వాత కాలంలో సరిక్రొత్త కళావాదాలు పొడసూపటానికి తగిన ప్రోత్సాహం కల్పించింది ఆ 19వ శతాబ్ది మధ్య కాలంలోనే బయలుదేరిన బార్బిజాన్ సంప్రదాయం-అవ్వంగా ఆరుబయటనే చిత్రరచనను సాగించటాన్ని అభిమానించిన సంప్రదాయాలలో మొట్టమొదటిది. అయితే ఆరుబయట చిత్రలేఖకులు (*pleinairistes*)అని వ్యవహరించబడే ఒక వర్గంవారు (అనుభూతి వాదావలంబకులలోని ఒక కోవకు చెందినవారు) ఈ విషయంలో ముఖ్యంగా పేర్కొనదగినవారు. వారిలో ప్రముఖులు: కేమిల్లీ పిస్సారో (1830-1903), క్లాడీ మోనే (1840-1926), అల్‌ఫ్రెడ్ సిస్లీ (1839-99), పియెరి ఆగస్టీ రేనాయిర్ (1841-1919).

చూ: *impressionism.*

**pleinairistes : ఆరుబయట చిత్రలేఖకులు**

**Plessy's green : ప్లెస్సీ హరితం**

క్రోమియమ్ భస్మహరితంలో తయారైన మొదటి రకపు హరితము; ఒక ప్రత్యేక ప్రక్రియను అనుసరించి దీన్ని తయారుచేస్తారు.

**plexiform : జటిలము**

జడల్లిన, లేదా గుడ్డనేతలాగా ఉండేది.

**plexiglas : చూ : acrylic resin**

**pliers : గ్రావణం; పిమట**

**plinth : ఆధారవేదిక**

1. ఒక రూపశిల్పానికి, దిగువ ఉండే పీఠానికి మధ్య కొన్ని సందర్భాలలో ఉంచే రాతి దిమ్మె. 2. వాస్తునిర్మాణంలో ఒక స్తంభానికి దిగువ ఆధారంగా ఉండే రాతి దిమ్మె.

**plique-a-jour** : *మణిపూరక ప్రక్రియ*

ఒకవిధమైన యెనామెల్ ప్రక్రియ. సన్నని తీగెతో అల్లిన ఒక చట్రంలో లోహాఖచనము (*Filgree*) న, వ్యత్యస్త రేఖనము (*Fret work*)న, ఖాళీలు ఉన్న ప్రదేశాలలో పారదర్శకపు, లేదా దాదాపు పారదర్శకంగా ఉండే యనామెల్ బిళ్ళలను మెలకువతో నింపి, ఒక ఆభూషణ వస్తువులాగానో లేదా రంగు గాజులముక్కలు తాపిన దానివలెనో అది కనిపించేట్లు చేయటం ఇందులో జరుగుతుంది.

**plumb line** : *లింగసూత్రం; వడంబం; వడమానం*

**plumbate ware** : *సీస సామగ్రి*

మధ్య మెరికాలో ప్రాచీనకాలంలో వ్యాప్తిలో ఉండిన ఒక జాతి ప్రజానీకం వాడిన పింగాణి సామగ్రి. ఇటువంటి సామగ్రిలో పై మెరుపుకై ఇనుమూ, అల్యూమినమూ, చేరివుండే ఒక ద్రవవిశేషమును వాడి, తగ్గుపాటి వేడిలో కాల్చేవారు. సాంకేతిక రీతిలోగాని, ఆకృతివైఖరిలోగాని ఈసీస సామగ్రి, ఇటలీదేశంలో ప్రాచీన కాలంలో నివసించి ఉన్న ఎట్రుస్కనుల ఐచెరో సామగ్రిని పోలి ఉంటుంది.

**plywood** : *పొరచెక్క*

పొరపై పొరగాఅమర్చగా రూపొందిన ఒకవిధపు చెక్క. ఈ పొరలలో ప్రతి దానిని దిగువదానికి ఒకవిధపు బంకతో అతుకుతారు. ఈ అతకటాన్ని పెద్ద ఒత్తిడిని ప్రయోగించి నిర్వహిస్తారు. 6 పొరల మేపిల్, లేదా బర్చ్ (భూర్జం) ను, కళాకారులు చిత్రణకై వాడే ఫలకాలను తయారుచేయటానికి వాడుతారు. చిరస్థాయిగా ఉండవలసిన చిత్రానికి ఉపాధులుగా, చౌకబారి చెట్లవలె, మెత్తని చెక్కలవి పనికిరావు.

**pochade** : *ద్రుతచిత్రం.*

అ౽ త్వరితగతిలో, తైలాలను ఉపయోగించి, రూపొందించిన వర్ణ రేఖాచిత్రం. ఆరుబయటన, ప్రకృతి దృశ్యాన్ని రేఖామాత్రంగా చిన్న రీతితో గీసిన దానికి ఈ పదాన్ని తరచుగా వాడతారు. దీన్ని సంప్రతింపు కోసం దగ్గరనుంచుకొని, ఆతరవాత దానిఆధారంతో ఒక పరిష్కృత చిత్రపటాన్ని చిత్రాగారంలో తయారు చేస్తారు.

**pochade box** : *ద్రుతచిత్ర పేటిక*

(చూ : ***sketch box***)

**pochoir** : *కటలినీ ప్రక్రియ*

బహువర్ణపు అచ్చుప్రతులను తయారు చేయటానికి నలుపు-తెలుపు అచ్చుప్రతులకు వలు చాయలను కల్పించటానికి, నకళ్ళకూ గ్రంథ చిత్రాలకూ రంగులు వేయటానికి తైజసమును, తైజసతూలికను ఉపయోగించి సాగించే ప్రక్రియ. తైజసము (*Stencil*) నకే, ఫ్రెంచి భాషలో *Pochoir* అనే పేరుంది. సాధారణపు తైజసపు పనికన్నా ఈ కటలినీ ప్రక్రియ చాలా పరిణతినందింది. ప్రత్యేకపు కర్మాగారాలలో, ప్రత్యేక కుశలత కలిగిన పనివాళ్ళచేత ఈ ప్రక్రియ నిర్వహించబడుతుంది.

**podium** : *జగతి*

ముందుకు సాగిఉండే ఉన్నత వేదిక; ముఖ్యంగా రోమనుల కాలంలోగానీ, పునరుజ్జీవన యుగంలోగాని ఉన్నత భవనాలకు ఆధారంగా దిగువ ఏర్పర్చబడ్డ వేదికా విశేషం.

**point** : *శిఖావలి* (సూదిమొనగల పరికరం)

1. రాతిని మలచటానికి ఉపయోగించే ఒక పరికరం షట్కోణాకృతిలో సాధారణంగా ఉండి గట్టి ఉక్కుతో చేయబడే ఈ పనిముట్లు సాధారణంగా 4 నుంచి 8 అంగుళాలవరకు పొడవు కలిగి, చివరన కొనదేలి ఉంటాయి.

2. సూచీ చిత్రణలోను సూచీ ప్రక్రియలోను వాడే సూదికికూడా ఈ పేరు వాడవచ్చు.

**pointed** : *సూదిమొన కలిగిన; కోనుగా ఉన్న*

**pointillism, pointillisme, divisionism** : *బిందువాదం*

ఫ్రాన్సు దేశంలో ప్రచలితమైన అనుభూతివాదంలో ఒక శాఖగా వ్యాప్తి పొందిన కళావాదం చాక్షుష ప్రకీర్ణ సూత్రాన్ని (*Principle of optical mixture*) లేదా భగ్న వర్ణతను చివరివరకు తీసుకొనిపోవడమే లక్ష్యంగా ఈ ప్రక్రియ ఉద్దేశించింది. రంగులను పూతకై ఉపయోగించక, పక్కపక్కన నెలకొన్న బిందువులుగానో, చిన్న రేఖలుగానో పుంచినప్పుడు ఒక మంచి పరిణామాన్ని సాధించటానికి వీలు పడుతుందని ఈ వాదావలంబకుల అభిప్రాయం. అయితే ఇట్లా రచించిన చిత్రాలను, దూరంనుంచి చూసినప్పుడు మాత్రమే ఈ వివిధ వర్ణ బిందువులు, లేదా అల్పరేఖలు చక్కగా సమ్మిళితములై క్రొత్త వర్ణభాగములను, రూపురేఖలను, వ్యక్తం చేస్తాయి

ఈ విధానాన్ని మొదట రూపొందించి, విస్తార ప్రచారాన్ని కల్పించి సమర్థించిన వాడు జార్జి స్యూరత్ (1859-1891). ఆ వాదానికి విపులవ్యాప్తిని కల్పించిన ఇంకొక ప్రముఖుడు పాల్ సిగ్నాక్ (1863-1935).

**pointing** : *నిర్దేశనం*

1. శిల్పంలోను, రాతిని మలచటంలోనూ, అమలులో ఉన్న ఒక ప్రక్రియ. ఒక తయారైన రచనకు నకలు తయారు చేయటానికి, మట్టితోగాని సుధాపిష్టంతోగాని ఒక అనురూపానికి నకలును తయారు చేయటానికి ఈ ప్రక్రియ పనికివస్తుంది. అనురూపాన్ని పరివేష్టించి ఉండే వివిధ తలాలమీదనున్న, పలు బిందువులనుంచి, అనురూపపు ఆకృతిని తాకే పలులోతులను కచ్చితంగా ఇందులో మొదట కొలుస్తారు. శిల్పాన్ని మలచవలసిన రాతిమీద లేదా గ్రహించబడిన వేరొక మాధ్యమం మీద, పై బిందువులకు సరిపడేట్లు అందుండే బిందువులనుంచి, సరిఅయిన లోతుకు రంధ్రాలను తొలుస్తారు. ఇక ఆ వేరే వేరే రంధ్రాలమధ్య ఉండే, భాగం కొట్టివేస్తారు. కొలతలను అన్నిటినీ ఒక పర్యాయం తీసుకోవటం మంచిదే అయినా, అట్లాకాక ఏకొన్ని ముఖ్యపు కొలతలనో ముందుగా తీసుకొని,

వాటి కనుగుణంగా రంధ్రాలను తొలిచి, మధ్య రాతిని కొట్టివేసి, కావలసిన నకలుకు స్థూల రూపాన్ని మొదట కల్పించి, తరవాత ఎక్కువ కొలతలతో ఆ రూపానికి నిర్దిష్టతను కలగజేయవచ్చు. ఇట్లా వివిధ ఘట్టాలలో పనిని సాగించేటప్పుడు, ముందు తీసుకొన్న వాటికన్నా, ఎక్కువ కొలతలను తరవాత తీసుకోవటం జరుగుతుంది. ఘట్టాలు పెరిగే కొద్దీ రూప నిర్దిష్టతకూడా అతిశయిస్తుంది. ప్రాచీన గ్రీకులలో ఇటువంటి ప్రక్రియ వ్యాప్తిలో ఉన్నా, వారి పరికరాలు చాలా మొరటుగా ఉండేవి. 19వ శతాబ్దిలో సంసాధనీయ నిర్దేశక యంత్రము (*Adjustable pointing machine*) ను మెరుగు పరచిన తరవాత, కొలతలను, నిక్కచ్చిగా ఒకచోట ఉన్నట్లు వేరొకచోట, నెలకొల్పటం సుసాధ్యమైంది.

ఇప్పుడు ఈ ప్రక్రియను కళకు చెంది నదిగా భావించడంకన్నా, కౌశలంగా భావించడమే సముచితమని గాలామంది అభిప్రాయం. ఆధునిక శిల్పకారులు ఈ ప్రక్రియ కన్నా బుజుశిల్పాన్నే ఎక్కువగా అభిమానిస్తారు.

2. కట్టుబడి పనిలో, రాళ్ళమధ్యగాని, ఇటికలమధ్యగాని ఉండే జాగాలను గారసున్నంతోగాని సిమెంటుతోగాని పూరించం.

**pointing trowel** : *నింపు తాపీ.*

**పూతపనివారూ, తాపీపనివారూ వాడే ఒక** విధమైన పరికరం. ఇది బద్దగా కొనదేలి ఉంటుంది. కట్టుబడి పనిలో, రాళ్ళ మధ్యనూ, ఇటుకలమధ్యనూ సిమెంటును, గారసున్నాన్ని పూరించి, వద్దించటానికి ఇది పనికివస్తుంది. అంతేగాక, కట్టుబడి జరిగిన తరవాత, అక్కడక్కడ చిన్న లోపాలు ఉన్నప్పుడు వాటిని సరిచేయటానికి, కట్టుబడిలో పెద్ద తాపీలతో పని జరపటానికి వలనుపడని కోణాలు మొదలైన క్లిష్టపు తావుల్లో పనిచేయటానికికూడా దీన్ని ఉపయోగిస్తారు. భిత్తిచిత్రమునకై జరిపే పూత పనిలో, అదనంగా ఉన్న పూతను తీర్పు పూతనుంచి తొలగించి, అతుకులు లేకుండా సరిచేయటానికికూడా ఇది పనికి వస్తుంది.

**point of station** : *స్థితి బిందువు.*

దృష్టి ప్రక్రమగతిని వివరించేటప్పుడు వాడే ఒక పారిభాషిక పదం. ద్రష్టయొక్క కంటి స్థానంగా అంతరాళంలో సంభావితమయ్యే బిందువుకు ఈ పేరు వాడతారు. దృష్టిప్రక్రమగతిని అనుసరించే దృశ్యంలో ద్రష్టకు ఒకే ఒక కన్ను ఉంటుందనీ, చిత్రతలంమీద రూపించబడిన, లేదా సంసూచితమయ్యే చక్రవాళ రేఖకు సమమట్టంగా ఆ కన్ను ఉంటుందనీ ఇందులో సంభావితం. అయితే విహంగ దృష్టిగతిలో చక్రవాళరేఖ చిత్రతలానికి ఎగువగా ఉంటుంది, అట్లాగే కీటకదృష్టిగతిలో ఆ రేఖ చిత్రతలానికి దిగువ ఉంటుంది.

**point of the brush** : *తూలికాగ్రం; కుంచెకొన.*

**polish** : *మినిమి.*

**polishing rouge :** *మినిమి రాగిక.*

**polychrome or polychromatic :**

*బహువర్ణక.*

చాలా రంగులతో అలంకృతమైన-అని దీని అర్థం. కొయ్యపనిపై లేదా రాతిపనిపై; రంగులను బంగారాన్ని ఉపయోగించి చేసే అలంకరణకు విశేషణంగా, కళారంగంలో ఈ పదాన్ని వాడతారు. ఈజిప్టు, గ్రీసుదేశాలకుచెందిన ప్రాచీనశిల్పాలలోనూ, పార్తెనాన్ వంటి ప్రాచీన భవనాలలోనూ ఇటువంటి బహువర్ణ శిల్పాలంకృ కనబడుతున్నది.

**Polyclitian school :** *పాలిక్లీత సంప్రదాయం.*

గ్రీసులో ప్రాచీన కాలంలో వ్యాప్తిలో ఉన్న ఒక శిల్పసంప్రదాయం. పాలిక్లీతస్ అనే అతడు ఆ సంప్రదాయపు ప్రవర్తకుడు అతడి జన్మస్థలం సిసియన్ నగరం క్రీ.పూ. 450 నుంచి 420 వరకు అతడు శిల్పవృత్తిని కొనసాగించాడని తెలుస్తున్నది. శిల్ప రంగంలో ఖ్యాతిని ఆర్జించిన ప్రాచీన గ్రీకులలో ఫిడియస్ తరవాత లెక్కింపదగిన ఏకైక వ్యక్తి పాలిక్లీతస్. మానవరూపాన్ని శిల్పంలో రూపించేటప్పుడు ఆ మూర్తిలోని వివిధావయవాల నిష్పత్తిని (ఒక విధపు తాలమాన పద్ధతిని) అతడు నిర్ధారించాడు. తాను సూచించిన ఈ పద్ధతికి లక్ష్యంగా ఒక దృఢగాత్రుని మూర్తిని శిలలో రూపించాడు. ఆ శిల్పం పేరు 'డొరీఫోరస్'. అతడు ప్రవర్తింపజేసిన పద్ధతికి లక్ష్యమై తక్కినవారికి ఇది మార్గదర్శకం కావటంవల్ల, ప్రామాణికం, (*canon*) అనే పేరుతో అది వ్యవహృతమైంది. అయినా పాలిక్లీతస్ నిర్మించిన ఆ శిల్పమూర్తి మాత్రం నేడు లభించటంలేదు. దాన్ని అనుకరిస్తూ, రోమను శిల్పులు తయారు చేసిన అనుకరణ శిల్పాలు మాత్రం కొన్ని ఉన్నాయి.

**polyester resin :** *పాలీయస్తర యక్షధూపం.*

రాసాయనిక శాస్త్రంలో ఒక ప్రత్యేక వర్గంగా పేరుగొన్న గ్లిసెరిస్ తాలేట్ వర్గంలోని సంయోజిత యక్షధూపాల శ్రేణికి చెందినదిది. సంయోజితరీతిలో నూలుదారాన్ని (డాక్రను), రంగులను తయారుచేయటానికి ఈ యక్షధూపాన్ని వాడుతున్నారు. శిల్పంలో పోతపనికి దొల్లచ్చును తయారుచేయటానికి ఇది చాలా చక్కగా ఉపకరిస్తుంది. ఇది ఉష్ణనమనీయం (*Thermo setting*); కాని వేడిచేయటానికి పూర్వం, ఈ యక్షధూపాన్ని కొన్ని రాసాయనిక సంకలనీయాలతోను, ఒక ఉత్ప్రేరకంతోను, ఒక సంచోదకంతోను కలపాలి. ఇందులో వాడబడే కల్పకపు పారదర్శకతను, కాంతిసారకతను తగ్గించటానికి జడవర్ణద్రవ్యాలు, లేదా లోహచూర్ణాలవంటి పూరకాలనుకూడా అందులో కలుపుతారు. ఇక లభించే ద్రవ్యానికి తగిన రంగు కలగటానికి, చిరస్థాయి వర్ణద్రవ్యాలను ఇందులో చేరుస్తారు. తక్కిన విధాల సంయోజిత యక్షధూపాలవలెనేపాలీయస్తరయక్షధూపాన్ని కూడా పారిశ్రామిక రంగంలో వినియుక్తం కావటానికి ఒక ముడిద్రవ్యంగా ఉత్పత్తి

చేస్తున్నారు. ఈ యక్షధూపాన్ని సొంతంగా తయారుచేసుకొని, దాన్ని ఉపయోగించి అచ్చుపోతను తీయటం సాధ్యమే అయినా, ఈ పనికి శిల్పి తానే పూనుకోక, తాను తయారుచేసిన తొలి అనురూపమునకు అనుగుణంగా అచ్చుపోతను తయారుచేసే బాధ్యతను, సాధారణంగా ఒక పారిశ్రామిక కర్మాగారానికి అప్పగిస్తాడు. అటువంటి కర్మాగారంలో, ఇటువంటి యక్షధూపపు ద్రావణుల (ముఖ్యంగా మెథిల్ ఎథిల్ కిటోను) వల్లనూ తిక్కన ఘటకాలవల్లనూ కలిగే విషప్రభావం నుంచి తప్పించుకోవటానికి తగిన ఏర్పాటులు అమరి ఉంటాయి. పాలియస్టర యక్షధూపాలను, అనాలోచితంగా కళాకారులు వాడటం వల్ల, కొన్ని దుర్ఘటనలు జరిగాయి. అయితే పనిచేసే స్థలంలో గాలి ధారాళంగా వీచటానికి తగిన వసతులు కట్టుదిట్టంగా కల్పించి, గాలి ముసుగులను తగిన రీతిలో తలకు తగిలించుకొని, శరీర రక్షణకు అనువుగా చేతులకు తొడుగులను, తగిన దుస్తులను ధరించి, కళాకారుడు ఈ యక్షధూపాన్ని ఉపయోగించే పక్షంలో ఎటువంటి ప్రమాదానికి లోనుగాకుండా పనిచేయవచ్చు. ఆల్కిడ్ యక్షధూపాలూ, పాలియస్టర యక్షధూపాలూ, ఒకే వర్గానికి చెందినవి. అయినా పాలియస్టర యక్షధూపాలలాగాకాక, తైలమిశ్రితమైన ఆల్కిడ్ యక్షధూపాలు, కళాకారులకు ఏ అపాయం కలిగించని ద్రావణాలలో బాగా కరిగేవై, తగిన ద్రావ్యతతో పైపూతకు పనికి వస్తాయి.

**polymer** : పాలిమరు.

అభేదరూపపు అణువులు కొన్ని శృంఖలా బద్ధములై ఉండే నిర్మాణ రీతిగలిగిన ఒక సంయోజిత పదార్థం లేదా సహజసిద్ధమైన పదార్థము. ఒక పాలిమరు రూపంలో అణువులు కుదురుకొని ఏర్పడ్డ ద్రవ్యం, అదే అణువు ఏకరేఖలో (మోనోమరు రూపంలో) కుదురుకొన్నపుడు ఏర్పడే ద్రవ్యంకన్నా ఎక్కువ అణుభారం కలిగి ఉండటమేగాక, భౌతిక ధర్మాలలోను విభేదిస్తుంది. పాలిమరుకు లక్ష్యంగా పాలివినల్ యసిటేటును గ్రహించవచ్చు. ఏకాణురీతిలో ఉండే వినిల్ యసిటేట్‌ను పాలిమరీకరించడంవల్ల దీన్ని తయారుచేయవచ్చు. పాలిమరుకు ఇంకొక లక్ష్యం అవిసె నూనె; ఇందులో గ్లిసిరైడు త్రయం చేరి ఉన్నది. అంటే లినోలెనిక్ ఆమ్లపు గ్లిసిరైడ్ అణువులు మూడుమూడుగా, ఇందులో ముడిపడి ఉంటాయి. పటలంగా రూపుగానే ప్రతి ద్రవ్యమూ యథార్థంగా పాలిమరే అయిఉంటుంది.

**polymer colours** : *పాలిమరు రంగులు.*

నీటిలో బాగా కలిసే ఒక విధమైన రంగులు. కళాకారులువాడేరంగుల కోవలోనివి ఇవి. నీటిలో కలిపేటప్పుడు ఈ రంగులకు వాహకంగా ఒక ఆక్రిలీయ పాలిమర్ యక్షధూపాన్నో లేదా ఆక్రిలీయ వినిల్‌కోపాలిమర్‌నో వాడతారు. దాంతోపాటుగా వర్ణద్రవ్యం నీటిలో విస్తరిస్తుంది. ఆసమయంలో యక్షధూపం, వేలకొద్ది అల్పగోళాల ఆకృతిలో

నీటిలో వ్యాపించి పాలలాగా తెల్లగాఉండి, నురుగు దేలుతుంది. ఇటువంటి రంగును వాడినప్పుడు అది త్వరితంగా ఆరుతుంది. అంతట యక్షరూపరేణువులు పరస్పరం అతిసన్నిహితములై, ఒక విధమైన నిరంతర పటలాన్ని ఏర్పరుస్తాయి. దానివల్ల రంగు, నీటితాకుడుకు ఆగేవిధంగా పరిణమిస్తుంది. అటువంటి రంగును తొలగించాలంటే, అందుకై పటిష్టమైన ఒక ద్రావణాన్ని వాడి అందుకు ఉపయోగించే తూలికలను నీటిలో ముంచుతూ ఉండాలి. తైలవర్ణాలకన్నా పాలిమరు వర్ణాలు ఎక్కువ పటిమ(*Toughness*) కలవి; ఎక్కువ మన్నిక కలవి, అధికమైన వర్ణోజ్జ్వలత (*Brilliance*) కలవి; ఎక్కువ ఒదుగుతనం (*Flexibility*) కలవి; ఇవి బహుళ ప్రయోజనాలు కలవి. దాదాపుగా నీటి రంగులవలె వ్యవహరించటం దగ్గరనుంచి ఒత్తు రంగు పద్ధతిన సాగిన తైలవర్ణ చిత్రంవలె కనపడేవరకు దీని వాడుకలో పరిణామాలు తీసుకొని రావడానికి వీలుంది. ఇట్లున్నా మంద్రదర్శానికి విపుల తైలికన్నీ ఇవి ఎక్కువగా ఉపయోగించటానికి అర్హమైనవి. నియంత్రణ లాలిత్యాన్ని, మేళనాన్ని కోరినచోట ఇవి అంతగా పనికిరావు. తైలలిప్తమైన కాటక మీదగాని, తైలవర్ణ చిత్రానికి అధశ్చిత్రణం (*Under Painting*)గా గాని వీనిని వాడకూడదు. ఎందుకంటే తైలవర్ణాలకన్నా, ఎక్కువ కాలంవరకూ తమలోని స్థితిస్థాపక శక్తిని పాలిమరు రంగులు నిలుపుకోగలవు; అందువల్ల రెండూ ఒకదాన్ని అంటికొని ఇంకొకటి దీర్ఘకాలం ఉండగలగటం సందేహాస్పదం. ప్రత్యేకంగా అందుకోసం మొదట పూతవేయబడిన అక్రిలియ కాటకపైన మాత్రమే పాలిమరు రంగులతో సారవతిక చిత్రణ జరపాలి. దాదాపు వంద్రెండురకాల పాలిమరు రంగులు ఇప్పుడు బజారులో లభిస్తున్నవి. వాటిని వాడే పద్ధతి, వాటి ప్రాతిపదిక యక్షరూపాలూ ఒకే తీరుకు చెందినవే అయినా, ఇవి వేర్వేరు ఫలితాలను కలగచేసేవి కావటంవల్ల తమ తమ అభిరుచులను అనుసరించి కళాకారులు తమకు కావలసినవాటిని తీసుకొని వాడతారు. ఆయా పాలిమరులను తయారు చేసేవారు, అందుకై ఉపయోగించే కల్పకి, ఆర్ద్రికం (*Wetting agent*). సాంద్రకారి (*Thickener*), వీటిని కలిపేతీరు అనే వాటిని అనుసరించి, ఆయా రకాల మధ్య విభిన్నత ఏర్పడుతున్నది. అందువల్ల ఇష్టం వచ్చినట్లు ఒక రకపు దానితో వేరొక రకాన్ని కలవటం తగదు. అవిధంగా వివక్షత లేకుండా కలిపినప్పుడు, కొన్ని సమయాలలో రంగు ముద్దలుకట్టే ప్రమాదం ఉంది. అందువల్లనే ప్రతి పాలిమరు రంగుతోపాటుగా వాటి కనుకూలించే అనుబద్ధ ఉత్పన్నాలు (*adjunct products*) - అంటే పాలిమర్ లప్పం (*polymer primer*), రూపకర పిష్టం (*modelling paste*), పాలిమర్ మాధ్యమం, నిరోధక మాధ్యమంవంటివి-కూడా తయారు చేయబడి లభిస్తున్నాయి. వీటిలో నిరోధక మాధ్యమం (*retarding medium*) అనేది, పాలిమర్ రంగులను ఆరుబయట ఉపయోగించినపుడు, అ పూత అతిత్వరిత గతితో ఆరిపోకుండా నిరోధించే శక్తి కలది.

పారిశ్రామిక వర్ణలేపనములలో పాలిమరు వర్ణాలవల్ల లభించిన సత్ఫలితాలను గమనించిన యు. స్టే. దేశపు కళాకారులు మొట్టమొదట

20వ శతాబ్ది మధ్యకాలంలో, ఆ కాలంలో ప్రచలితమవుతున్న కళోద్యమాలకు, కళా వైఖరుల (*Art trends*)కు ఇది అనుగుణమని భావించారు. ఆ కళోద్యమాలకూ, వైఖరులకూ కావలసినవి: అత్యంత వర్ణోజ్జ్వలత, కాంతివతంలో అనేకమైన వాటికి పూరరంగు అనువుగా ఉండటం-అందునా, ముఖ్యంగా వర్ణధర్మం చక్కగా ప్రదర్శితమయ్యే రీతిలో చిత్రణ జరిగి, అతిత్వరిత కాలంలో ముగియటం. పై లక్షణాలు, తైలవర్ణాలలోకంటే పాలిమరు రంగులలో ఎక్కువగా కనపడతాయి. తైలవర్ణాల వాడుకలో కనపడేటంత సౌలభ్యం ఇందులో లేకపోయినా, పై లక్షణాలు అన్నీ ఉండటంవల్ల ఈ ఒక్కలోపాన్ని అవి అధిగమించగలవని ఆ కళాకారుల భావన. పాలిమరు రంగులు ఎంతకాలం మనగలుగుతాయనేది ఇంకా నిశ్చితంగా తెలియపడలేదు. దీర్ఘ కాలపు మన్నికకోసం ఆ రంగులను ఏ విధంగా వాడాల్సి ఉంటుంది అనే విషయంపై తగిన పరిశోధన జరిపి వివరాలను సేకరించటంకూడా ఇప్పటివరకూ జరగలేదు; కాని ఆ రంగులలో ఏవైనా దోషాలున్నాయని ఎవరూ ఇప్పటికి అనలేదు. అందువల్ల ప్రయోగాత్మక దృక్పథంతో పనిచేసే చిత్రకారులకి ఈ పాలిమరు రంగులు ఎంతో అవకాశం ఇస్తున్నాయని మాత్రం చెప్పవచ్చు. ఈ రంగులకై ప్రత్యేక రీతిలో ఉండే కూలి కలంకూడా రూపొందించటం జరిగింది.

(చూ : *brush, acrylic*)

**polymerisation** : *పాలిమరీకరణ.*

**polymer medium** : *పాలిమరు మాధ్యమం.*

పాలపొంగులాగా, నురుగుదేలిఉండే తెల్లని ద్రవపదార్థం పాలిమరు రంగులతో పాటుగా ఇదికూడా కొనుగోలుకు లభిస్తుంది. దీనిని సాధారణంగా తరళకారిగా (అంటే ఒక ద్రావణాన్ని పలచన చేసేదానిగా) వాడతారు. పాలిమరు రంగుయొక్క వాహకాన్ని తయారు చేసే ద్రవ్యాన్ని ఉపయోగించే దీన్నికూడా తయారు చేస్తారు; దిండుగాఉండే మాధ్యమానికి ఉపయోగించే రీతిలోకూడా అక్రిలీయ పాలిమర్ ఉత్పన్నాలు కొన్ని లభిస్తున్నాయి. సమవేత ప్రక్రియలలో అధిసక్తకములుగా సైతం పాలిమరు మాధ్యమాలను వాడుతున్నారు

**polymer primer** : *పాలిమరు లప్పం.*

టిటానియమ్ తెలుపును, తక్కిన తెలుపు లేదా జడవర్ణద్రవ్యాలను, పాలిమర్ మాధ్యమంతో కలిపి నూరినప్పుడు రూపొందే తెల్లని పిష్టపదార్థం. పాలిమర్ రంగులతో చిత్రణను సాగించేటప్పుడు భూమికను తయారు చేయటానికి దీన్ని వాడతారు. దీన్ని సాధారణంగా ఒక విధమైన లప్పంగానే భావించటం జరుగుతున్నా, యథార్థానికి అచ్చపుటప్పంతో సామ్యంగల ధర్మాలు ఏవీ దీనికి లేవు; అచ్చపు అప్పానికి బదులుగా దీన్ని ఎప్పుడూ వాడకూడదు.

**polymer tempera** : *పాలిమర్ జిగురు రంగు; పాలిమర్ టెంపెరా; పాలిమర్ కలలం*

కళాకారులకు పనికివచ్చే అచ్చుపాలిమరు రంగులకు, వ్యాపార నామంగా ఇది వాడుకలో ఉన్నది ఇట్లా వ్యవహృతములయ్యే రంగులను, ఈ శతాబ్దపు నలభైలలో, బాస్టన్ నగరవాసి అయిన ఆల్‌ఫ్రెడ్ డూకా రూపొందించి వ్యాప్తిలోకి తెచ్చారు ఈ రంగుల లోని ప్రాతిపదిక ద్రవ్యం పాలీవినిల్ యసిటేటు. కానీ తరవాత ఏభైలలో అక్రిలీయ యక్షధూప వ రిసురులమీదా, అక్రిలీయ వినిల్ కోపాలిమరుల మీదా ఆధారపడి తయారైన-మేలిరకపు పూతరంగులు అధిక వ్యాప్తిలోకి రావడంవల్ల ఈ పాలిమరు జిగురు రంగులు రంగంయుండి నిష్క్రమించాయి

**Polynesian art** : *పొలినీసియన్ కళ.*

ఉత్తరాన హవాయినుంచి దక్షిణాన న్యూజిలాండుకు, తూర్పున ఈస్టర్ దీవికి వ్యాపించి, ఒక త్రిభుజపు ఆకారాన్ని పోలిన విశాల ప్రదేశం పొలినీసియా అని వ్యవహృతం అక్కడివారి కృషిఫలితమైన కళావిశేషమే పొలినీసియన్ కళ

**polyptych** : *మడత చిత్రాలు; బహుఫలకము; వల్ప్రలక; ప్రతిమా పరిపాటి.*

మడత బందులచేత సంఘితమై, మడతగా అమర్చబడ్డ వివిధ చిత్రాలు ఇవి చిత్రలేఖనాలైనా, లేదా ఉల్బణ శిల్పాలైనా కావచ్చు. ఇందులో కనీసం మూడుచిత్రఫలకాలుంటాయి అయిదు ఫలకాలుండటం పరిపాటి.

చూ . *tryptych predella,*

**polyvinyl acetate** : *బహువినీలికా అసితేతం*

ఒక వినీలికా యక్షధూపం, ఘర్మకల్పిక సంయోజిత యక్షధూపాలలోని విస్పష్ట సుశ్వేత వర్గంలో ఒకటి. పారిశ్రామిక రంగంలో పై పూతలకు దీన్ని వాడతారు.

**polyvinyl chloride** : *బహువినీలికా క్లోరిదం.*

ఎర్రరహితమైన ఒక వినీలికా యక్షధూపం పారిశ్రామిక రంగపు పూతరంగుల తయారీలో ముఖ్యాంగమిది

**Pompeian blue** *పాంపేయ నీలిమ.*

ఐగుప్త నీలిమకు పర్యాయ నామం, ఆ నీలిమకు నకిలీగా తయారయ్యే కొన్ని తక్కువ స్థాయి రంగులకుకూడా ఇది నిందాసూచకంగా వాడబడుతున్నది

**Pompeian painting** : *పాంపేయ చిత్రాలు.*

ఇటలీదేశంలో, వెసూవియస్ పర్వత నికటభూవిలో, మరుగున పడిఉన్న ఒక ప్రాచీన నగరాన్ని వెలికి తీసినప్పుడు, బయట పడిన చిత్రాలు ఆ నగరానికి సమీపంలో ఉన్న అగ్నిపర్వతం క్రి. శ. 79 లో స్ఫోటనం చెందటంవల్ల, ఆ నగరం, భూ

స్థాపితమైపోయింది. గ్రీకులు అవలంబించిన రెండాయతనాల చిత్రీకరణనుంచి-అంటే వస్తు ద్యుతి ఏమీలేకుండా చిత్రాన్ని రూపొందించే పద్ధతినుండి-ఈ నగర చిత్రకారులు విడిపడి, మూడాయతనాల భ్రాంతిని, వాతావరణపరిణా మాలను చిత్రంలో తెలియజేయటానికి యత్నిం చారు. అయినా గ్రీకులచిత్రణలోనిసాంకేతికపద్ధ తులను అర్థం చేసుకోవటానికి ఈ పాంపేయి చిత్రాలే బాగా ఉపకరిస్తున్నది. రోమనులు చిత్రలేఖనంలోని సాంకేతికవిషయాలను ఎన్ని టినో యథాతథంగా గ్రీకులనుంచి గ్రహిం చారు. గ్రీకులవని చెప్పదగిన చిత్రాలు ఏవీ నేడు లభించకపోయినా, అందులోని సాంకేతిక ప్రజ్ఞను, తెలుసుకొనేందుకు ఈ పాంపేయి చిత్రాలవంటివి సాయపడుతున్నాయి.

**Pompeian red** : *పాంపేయ శోణిమ.*

భారతీయహరుడిమలో ఒక రకపు; ఎర్రని రంజకానికి ఈ పేరునే వాడతారు; ఇది ప్రామాణికతను ఆర్జించని వర్ణద్రవ్యం.

**pompier** ; *దంభ*; *దంభ*

సహజత లేకుండా తెచ్చిపెట్టుకొన్న రమ్య తతో ఉండే లేదా దాంభికపు శైలిలో రచిత మయిన చిత్రానికి, అందరెరిగిన దాన్నే చెప్పిందే చెప్పినట్లుగా సాగే సాధారణ రచ నకూ విశేషణంగా ఈ పదాన్ని వాడతారు.

**Pompey's pillar** : *పాంపే స్తంభం.*

అలెగ్జాండ్రియాలో ఉన్న ఒకశిల్పస్తంభం. క్రీస్తు పూర్వం 1860 లో ఇది నిర్మితమైన టుల తెలుస్తున్నది. తర్వాత దీన్ని రోమనులు గుండ్రంగా చెక్కారట. దీనిపై డయోక్లిటి యన్ అనే రోమను చక్రవర్తి పేరు ఉంది.

**poncif** : *అపతితం.*

ఆపతనంవల్ల రూపొందించబడిన ఆలేఖ నం. క్రమశః దీనికి విస్తృతార్థం కలిగి, నైతన్యరహితమై, జడంగా కనపడే ప్రతి రచనకూ వాడే పదంగా ఇది పరిణమించింది.

**popping** : *ఛిద్రదోషం.*

గోడపై పూతగచ్చులో అక్కడక్కడ సన్నని రంధ్రాలు కనబడడం. ఇవి శంకువు ఆకారంలో ఉంటాయి. సున్నం సరిగాను వేయక, అందులో నిలిచిపోయిన గట్టి కణాలు గచ్చునుండి ఊడిపోవడంవల్ల ఈ దోషం ఏర్ప డుతుంది. సాధారణంగా పూతవేసిన నాటి నుంచి మూడునెలలు మొదలుగా ఒక సంవత్స రం లోపున ఇటువంటిది జరగవచ్చు.

**poppy oil or poppyseed oil** : *గసగస తైలము.*

గసగస విత్తులనుంచి తయారుచేసే నూనె. శోషక తైలాలలో ఇది మేలి తరగతికి చెంది నదిగా చాలామందికి ఆమోదయోగ్యమైనది. అందువల్ల తైలవర్ణ చిత్రణలో మాధ్యమంగా దీన్ని వాడుతున్నారు. అవిసెనూనె కన్నా, అక్షోట తైలం (అక్రోట్ తైలం) కన్నా దీనిలో శ్యానత తక్కువ. ఇది సులభంగా దుర్వాసనకు లోనుగాదు.

19 వ శతాబ్దపు చిత్రకారులు, ఈ నూనెతో రూపొందిన తైలవర్ణాంలో కనపడే నవనీత

సుస్థిరతకు, మృదుత్వతకు వశులై, దీన్ని ఎక్కువగా అభిమానించారు. ఇది ఎట్లున్నా, తక్కిన అన్ని లక్షణాలలో, అవిసెనూనెకన్నా ఈ గసగసాలనూనె తక్కువ రకపు దానిగా లెక్కకు వస్తుంది. గసగసాల నూనెతో తయారైన తైలవర్ణాలతో రచించిన చిత్రాలలో విశర్ణత చెందటం, లేదా నల్లబడటం అనేవి, అవిసెనూనెతోటి రంగుల కన్నా ఎక్కువగా చోటు చేసుకుంటాయి అంతేగాదు; ఆ గసగసాల నూనెరంగుతో ఏర్పడే పటలంలో విరళత ఎక్కువ, పటిమ తక్కువ అందువలన గసగసాల నూనెరంగులను తగిన జాగ్రత్తతో వాడాలి. అటువంటి జాగ్రత్త లేనిపోతే చిత్రం నెరియలిప్పటం జరగవచ్చు సద్యఃపూర్ణ చిత్రణ (*alla prima*) కు ఈ తైలవర్ణం చాలా బాగా పనికివస్తుంది. క్లిష్టమైన పూతలు కలిగిన చిత్రణకు ఇది అంతగా పనికిరాదు. ఆధునిక యుగంలో, కళాకారులకు తగినవిగ సంభావితమై లెక్కకు వచ్చే వాటిలో ఈ తైలవర్ణాలను, చేర్చడంలేదు అయితే అవిసెనూనె వర్ణాల సుస్థిరతను అధికం చేయటానికి సంకలయితగా మాత్రం గసగసాల నూనెను వాడుతున్నారు. ఈ నూనెకు ఎటువంటి వాసన ఉండదు. అవిసెనూనె రంగులలోని ఘాటు వాసన, గసగసాల నూనెరంగులలో కనపడదు కాబట్టి దీన్ని గుర్తించడం చాలా సులభం.

**porcelain : *మేలిపింగాణీ.***

పింగాణీలో మేలిరకపుది. బంకమన్ను, ఒక విధపు కాకిరాయి, అగ్నిశిలలను కలిపి అత్యుచ్చపు ఉష్ణోగ్రతకు కాల్చినపుడు, ఇది రూపొందుతుంది. అచ్చమైన మేలిపింగాణీ, మొట్టమొదట చీనాదేశంలో, టాంగ్‌రాజ వంశపు పరిపాలనాకాలంలో, తయారు చేయబడినది. దాన్ని వారు 'షింగ్‌యావ్' అని వ్యవహరించారు. తెలుపు లేదా లేత బూడిదరంగును ఇది కలిగి, కాంతిగమ్యంగా ఉంటూ పైభాగమున చిన్న దెబ్బవేసినా, కంగుమని మ్రోగుతుంది యూరపులో ఇది 18 వ శతాబ్ది ఆరంభంలో తయారు చేయబడినది. ఇది ఎక్కువ మన్నిక గలిగి, దెబ్బలకు తట్టుకొని నిలవగలదు. కాబట్టి ఎక్కువ పనిభారంగల పరికరాలకు-అంటే ప్రయోగశాలలోని పరికరాలకొరకు, వైద్యుతిక పరిరక్షకాల కోసం, తలుపు పిడుల తయారీకి-వాడుతున్నారు. ఈనాడు సాధారణపు మట్టిపాత్రలనుంచీ, రాతిపాత్రలనుంచీ వేరుగా ఉండి కాంతిగమ్యాలుగా ఉండే మృత్‌శిలా పాత్రలు అన్నీ మేలిపింగాణీ కోవకు చెందినవిగానే లెక్కింపబడుచున్నవి.

ప్రాచ్యదేశాలలో రూపొందిన తొలిరోజుల మేలిపింగాణీలోని విశిష్ట గుణాలకు ఆ పింగాణీ తయారీకై వాడబడిన కయోలిన్, పెటూంజీ అనేవి ముఖ్య కారణములు. ఇటువంటి పింగాణీనే తయారుచేయటానికి కృషిచేసిన యూరపీయ కులాలురు, కొంతవరకు ఫలితం సాధించినా వారు నిర్మించిన మేలిపింగాణీ, చీనీయులదానికన్నా గట్టితనంలో తక్కువగా ఉన్నది ఇటువంటి మేలిపింగాణీని తయారు చేయటానికి బంకమట్టిని, గాజుపొడి మొదలైన వాటిని వాడారు దీని తయారీకి, తగ్గుస్థాయి ఉష్ణోగ్రతలను వారు వినియోగించారు. అటువంటిదాన్ని ఈ కాలంలో 'మృదుపిష్టము'

(*soft paste*) అనే పారిభాషిక నామంతో వ్యవహరిస్తున్నారు. దానికే మాయ పింగాణీ, మెత్తని మేల్పింగాణీ అనే పర్యాయనామాలు కూడా ఉన్నాయి. స్వచ్ఛమైన రూపంలో ఈ కాలంలో తయారయ్యే మేలిపింగాణీకి, కఠిన పిష్టమూ, గట్టి మేల్పింగాణీ అనే పర్యాయ నామాలున్నాయి. మేలిపింగాణీ తయారీలో ఎక్కువగా యూరపులో కృషి చేసి, అందులో ఉన్న రహస్య ప్రక్రియలను వెలయించినవాడు జోహాన్ ఫ్రీడ్రిక్ బోట్‌జెర్ (1709).

**porcelain enamel or vitreous enamel :** *గాజు యెనామెల్, పింగాణీ యెనామెల్, పింగాణీ ఆభాసిక.*

కాంతిభేద్యంగానో గాజులాగా ఉండేట్లుగానో, ఒక లోహఫలకంపై పైపూత జపి, బాగా వేడిచేసి, ఫలకానికి దాన్ని గట్టిగా సంధించగా ఏర్పడే ఛాదక విశేషం. సాధారణంగా ఇటువంటిదానికి ప్రాతిపదిక ఫలకాన్ని ఇనుముతోనో, ఉక్కుతోనో నిర్మిస్తారు. అయినా కొన్ని సమయాలలో దీనికి అల్యూమినియాన్ని గాని, రాగినిగాని, తదితర లోహాన్నిగాని వాడవచ్చు. పైపూతను ఫలకంతో చక్కగా సంధించటానికి వినియుక్తమయ్యే ఉష్ణోగ్రత 1500°F వరకు ఉంటుంది. పారిశ్రామిక ప్రక్రియలలో వాడుకలో ఉన్న ఈ విధపు యెనామెల్ పద్ధతిని, కళాకారులుకూడా స్వీకరించి, ముఖ్యంగా కుడ్యచిత్ర రచనలోను, ఆరుబయట తాకిడికి తట్టుకోవలసిన చిత్రాల రచనలోనూ వినియోగించారు. గాజు యెనామెల్ పైన చిత్రణను చక్కగ యు. స్టే లోని కళాకారులు సాగించటం నేర్చారు. అందుకై వారు తెల్లని యెనామెల్ కలిగి ఇనుప ఫలకాలను తీసుకొని వాటిపై పింగా రంగులతో చిత్రణను సాగించారు. వాటి వాడటానికి ముందుగా ఈ రంగులను తగి వాహకంతో చక్కగా నూరేవారు. చిత్ర పూర్తి అయిన తరవాత ఫలకాన్ని, అందుక అనువైన ఒక కార్ఖానాకిచ్చి, తగిన ఉష్ణోగ్రతకు దాన్ని గురిచేసేవారు. న్యూయార్కు నగరంలోని భూగర్భ వ్యవస్థలో కొం భాగాన్ని కుడ్యచిత్రాలతో అలంకరించడంలో ఈ గాజు యెనామెల్ ఫలకాలను వాడాలని 1937 లో_30 మంది సభ్యులు క గిన-ఒక కళాకారవర్గం పూనుకొన్నది. అప్పుడు వారు ఈ మాధ్యమాన్ని గూర్చి సమగ్ర పరిశీలన సాగించి, ఒక అవలంబనీయ పద్ధతిని రూపొందించి, ఆ పద్ధతితో సాధించిన చిత్రణముల ప్రదర్శనను ఒక దాన్ని 1938, ఫిబ్రవరిలో మ్యూజియమ్ ఆఫ్ మోడరన్ ఆర్టు'న ఏర్పాటు చేశారు. కాని ఆ తరువాత కొన్ని సంఘటనలవల్ల, వారు తలపెట్టిన భూగర్భ మార్గాలంకరణ, కార్యరూపం పొందకనే, ఆగిపోయింది.

**porch :** *దేహళి.*

వాస్తు విషయికమైన పారిభాషిక పదం. ఒక భవనపు ద్వారపు చేరికకు ఆచ్ఛాదనంగా, ద్వారానికి ముందు నిర్మితమయ్యే ఒక కట్టడం.

**porous :** *సరంధ్ర.*

**portland cement** : *పోర్టులాండ్ సిమెంటు.*

భవన నిర్మాణంలో విస్తృతోపయోగం కలిగిన ఒక ద్రవ్యం. ఆంగ్లదేశంలోని పోర్టులాండు రాతిని ఇది పోలి ఉండటంవల్ల దీనికి ఈ పేరు కలిగింది.

**portrait** : *ప్రతిమూర్తి; మూర్తిచిత్రం, విద్ధచిత్రం.*

సజీవుడు లేదా మృతుడైన ఒక వాస్తవిక వ్యక్తియొక్క ప్రతిరూపపు – ముఖ్యంగా ముఖపు ప్రతిరూపపు - చిత్రణ, శిల్పం, ఆలేఖనం, ఛాయాచిత్రం, లేదా తక్కిన విధముల ప్రతి కల్పన; లేదా ప్రతిబింబం. ఇటువంటి ప్రతిమూర్తుల రచనకై వినియుక్తమయ్యే కళాప్రక్రియను ప్రతిరూపణం (*portraiture*) అంటారు. కళాభ్యసన కాలంలో విద్యార్థులకిచ్చే శిక్షణలో సాధారణంగా ఇది ఒక ప్రముఖ భాగం. చాలామంది కళాకారులు, ఈ ప్రక్రియలో సిద్ధహస్తతను ఆర్జించటానికై అభ్యాస చర్యగా, తమ స్వీయ ప్రతికృతులను, లేదా తమ కుటుంబములకు చెందినవారి, లేదా మిత్రుల ప్రతిమూర్తులను రచించడం పరిపాటిగా ఉండేది. ఈ ప్రతిమూర్తి మొత్తపు రూపానికంతకూ లేదా శిరం మొదలు కటివరకుగాని, లేదా శీర్షమాత్రానికి చెందినదిగాని కావచ్చు. ఒక ఉపవిష్టుని ప్రతిమూర్తిని అభిముఖ భంగిమలో ఆలేఖించడమో, లేదా చిత్రించడమో జరపవచ్చు. (చూ : ***Frontal depiction***). అయితే సాధారణంగా సామిపార్శ్వ భంగిమలోను, అంతటంతట నిండు పార్శ్వ భంగిమలోను, అరుదుగా వక్షాద్భంగిమలోను ఈ రచన సాగుతున్నది. స్పష్టాస్పష్ట రచన కూడా ఒక విధమైన ప్రతిరూప చిత్రణమే. శిల్పంలో ఇటువంటి రచన ఉరస్కం, లేదా శీర్షబింబకం, లేదా (ఈజిప్టు దేశపు ప్రాచీన శిల్పంలో చక్రవర్తుల, దేవతల మూర్తుల వలె) ఆసీనమూర్తి, లేదా ఆశ్వికమూర్తి, లేదా స్థానకమూర్తి, లేదా పాశ్చాత్యదేశాలలోని సమాధులందుంచే శయానక మూర్తిగా రూపొందుతుంది. కొన్ని ప్రతిమూర్తులను ఉల్బణ రీతిలోను, అంతఃపాతి రీతిలోను రూపొందించవచ్చు. నాణెంమీదను, పతకాలమీదను ఉరస్కములూ, నిండు మూర్తులూ, ఇత్తడిలో రూపొందించిన స్మారక రూపాలూ ఈ కోవలోనివే శిల్పంలో రచితములయ్యే ప్రతిమూర్తులు అనేకములు జీవప్రమాణంలోనో, లేదా అతిక్రమించిన ప్రమాణంలోనో ఉంటాయి. ఇక చిత్రితములయ్యే ప్రతిమూర్తులు జీవ ప్రమాణంకన్నా మిన్నగా ఉండేవి మొదలుకొని చిన్నవి అయిన అలతిచిత్రాల వరకు వివిధ ప్రమాణాలలో ఉన్నాయి. వీటిలో అలతి చిత్రాలకు, 17; 18 శతాబ్దాలలో ఎంతగానో ప్రజాదరణ ఉండేది

ప్రతిరూపకులు (*Portraitists*) అవలంబించే సాంకేతిక విధానాలు అనేకం ఉన్నాయి. ఒక ప్రతిరూపకుడు రచనావస్తువుపట్లను, కళాలక్ష్యంపట్లను (అంటే అతడు ఎక్కువ రూపించదలచినది వస్తుగత సౌందర్యమా, లేదా వస్తుతత్త్వమా అనే దానిపట్లను) వహించే వైఖరిపై ఈ సాంకేతిక విధానం చాలావరకు ఆధారపడి ఉంటుంది. ప్రతి

రూపణ ప్రక్రియయొక్క ఐతిహాసికగతిని పరిశీలించే అతడికి ప్రతిరూపకులలో ప్రతి ఒక్కరూ తమ పేరు ప్రతిష్ఠలు, రూపవిశేషాలు శాశ్వతంగా మానవుల స్మృతిపథంలో ఉండాలని, ఒకపోషకుని ఆశయపూర్తికై కృషి చేశారని స్పష్టమవుతున్నది. మొదట్లో ప్రభువుల,సర్దారులరూపముల ప్రతిమూర్తులు,వాస్తవికతకు దూరములై, ఆదర్శాల ప్రతీకలుగా మాత్రమే ఉండేవి. ప్రాచీన గ్రీకుల శిల్పంలో ఇది స్పష్టంగా కనవడుతుంది. వారి శిల్పాలు వారి సౌందర్య భావనకు ప్రతీకములు మాత్రమే; వివిధ వ్యక్తులలో కనబడే లక్షణ వైవిధ్యానికి అందులో చోటు ఉండేవి కాదు. ఇక ప్రాచీన ఈజిప్టులో సైతం శిల్పం, ప్రతిమూర్తి రచనలో, దాదాపుగా ఇటువంటి మార్గాన్నే అవలంబించింది వారు రచించిన రాజుల ప్రతిమూర్తులలో ఆయా రాజుల శారీరక లక్షణ వైవిధ్యం ఏమీ కనపడదు. ఉద్దిష్టుడగు రాజుయొక్క ఘనతను, మహనీయతను ప్రస్ఫుటం చేయడమే అటువంటి ప్రతి రచనలోని లక్ష్యం: ఇక వీటితో పోల్చినప్పుడు, ఎట్రుస్కన్ల, గణతంత్ర రాజ్యకాలపు రోమనుల ప్రతిమూర్తి రచనలో వాస్తవికత చాలా ఎక్కువగా కనపడుతుంది. ఉపవిష్టుని ముఖలక్షణాలు, రూపలక్షణాలు, సౌందర్య, కురూపతలు అందులో చక్కగా, రూపించబడ్డాయి. వీటిలో అనేకములు మృతోపముఖముల సాయంతో నిర్మితాలు. మధ్యయుగాలలో ఈ ప్రతిరూపణ ప్రక్రియ నశించింది. ఆ యుగాల కళాకారులు, తమ రచనావస్తువులుగా మానవులను గ్రహించటానికి ఇష్టపడక, దేవతలను గ్రహించారు. పునరుజ్జీవన యుగంలో ఈ ప్రక్రియ పునరుద్ధరణ చెందింది. కళలో రచనా వస్తువుగా మానవుడు అగ్రస్థానం ఆక్రమించాడు. మతరంగంలోకూడా ఈ ప్రక్రియ, ఆ కాలంలో కాలు నిలదొక్కుకోగలిగింది. పూజావేదికలవద్ద కనబడే దాతల ప్రతిమూర్తులను, ధ్యానసిద్ధిలో ఉన్నట్లు మలచిన కొంతమంది చారిత్రక పురుషుల ప్రతిమూర్తులను ఈ విషయాన్నే రుజువు చేస్తున్నవి. 17 వ, 18 వ శతాబ్దాలలో ఈ ప్రక్రియ ఒక వింత మార్గం అనుసరించింది. రచనావస్తువులుగా తాము గ్రహించిన వాస్తవిక వ్యక్తులను, పౌరాణిక మూర్తులవలె రూపొందించియో, లేదా వ్యంగ్యార్థ భావనకు దానిలో ఆస్కారము కల్పించియో వాటికి లేని ఘనతను ఆపాదించే సంప్రదాయాన్ని కళాకారులు ఆనాడు చేపట్టారు. లక్సెంబర్గ నగరంలో రాజభవనంలో రూబెన్స్, చిత్రాలలో రూపొందించిన మేరీ డి మెడిసీ అనే ఆమెయొక్క జీవితగాథ, వ్యంగ్య చిత్రణచే పరిపోషితం తనకు ఆదరణ కల్పించి, పరిపోషించిన మేడమ్ డి పోంపడోర్ అనే సంపన్న స్త్రీని, పౌరాణిక పరివేషంతో ప్రాకోయిస్ బౌచర్ రూపీకరించాడు. పాలైన్ బోర్గిస్ అనే ఆమెను ఆమె పోషణలో ఉన్న యాన్‌టోనియా కనోవా అనే శిల్పి, గ్రీకుల పౌరాణిక దేవి అయిన వీనస్ (హిందూ పురాణములలో రతీదేవి వంటిది)గా శిల్పంలో మలచాడు. ప్రసిద్ధ చిత్రకారుడైన వాన్‌డైక్, తాను ఉపవిష్టగా నిలుపుకొన్న ప్రతి స్త్రీకిని వాస్తవిక రీతిలోనే ప్రతిమూర్తిని కల్పిస్తూ, లేని మెరుగులను కొన్నిటిని కలిపి, శోభను

ఎక్కువ చేశాడు. చార్లెస్ I యొక్క ప్రతి రూపాలను రచించడంలో అతనవలంబించిన పద్ధతి విశేషంగా గమనించదగ్గది. ఆ రాజు అంతగా పొడగరి కాడు. తాను పొట్టివాడుగా, ప్రతిమూర్తిలో కనపడటం అతడికి కోపం తెప్పించేది. అందువల్ల ఆ రాజును అశ్వారోహిగానో, లేదా, చక్రవాళరేఖ చాలా దిగువకు ఉన్న ప్రకృతి పరిసరాలలో అతడు ఉన్నట్లో ప్రతిమూర్తి రచనను రూబెన్స్ సాగించాడు.

కొన్ని ప్రతిమూర్తి చిత్రణలు దాదాపుగా నిత్యజీవన దృశ్య చిత్రాలలాగా కనపడతాయి. ఫ్రాన్స్ హాల్ రచించిన 'యువజనులు', షార్డిన్ రచించిన 'నాగరక స్త్రీలు' ఈ కోవకు చెందినవే. గోయా రచించినవి కూడా ఇటువంటివే. కాని అందులో కొన్ని హాస్య చిత్రాల మాదిరిగా కనపడతాయి. కాల్పనిక వాదులలో కొందరూ అనుభూతి వాదులలో అత్యధిక సంఖ్యాకులూ, విభావనా వాదులందరూ తాము సాగించిన ప్రతిమూర్తి రచనలలో, ఉపవిష్టుల రూపలక్షణాలను వెల్లడించడంకన్నా, వారి గుణ స్వభావ సంపత్తిని ప్రదర్శించడంలోనే ఎక్కువ శ్రద్ధ వహించారు. డెలక్రాయిచే రచితమైన, చోపిన్ ప్రతిమూర్తి చిత్రణ, రోడిన్ రచితమై ఉదాత్తతకు పేరొందిన బాల్జాక్ ప్రతిమూర్తిశిల్పం ఇందుకు ప్రముఖ లక్ష్యాలు.

2 ప్రతిమూర్తి రచనకు, మూర్తిచిత్రణకు సముచితములుగా ఒక కాలమున సంభావితములై, వివిధ ప్రమాణాలలో లభించిన నాటికా పరంపర. చూ · *Canvas sizes, French; Canvas sizes, protrait.*

**portrait head** : శిరశ్శిల్పం

**portraiture** : ప్రతిరూపణం.

**Portugese colonial art** : పోర్చుగీసు వలనరాజ్య కళ.

పోర్చుగీసుల వలసలలో – ఆఫ్రికా, ఆసియా, దక్షిణఅమెరికాలలో ఉన్నవాటిలో– పోర్చుగీసు సామ్రాజ్యం ఉచ్ఛస్థితిలో ఉన్న కాలంలో అంటే 16వ, 18వ శతాబ్దాలలో ప్రదర్శించిన కళావిశేషం. ఆయా కాలాలలో పోర్చుగల్‌లో వెలసిన కళారీతులే ఈ వలస రాజ్యకళకు కూడా మూల స్రోతస్సులుగా ఉపకరించాయి. దక్షిణ అమెరికాలోని బ్రెజిలులో ఈ వలసరాజ్య కళ ఎక్కువ పరిణతిని సముపార్జించ గలిగింది. భారత దేశంలో గోవాలోని(ప్రాత నగరంలోని)చర్చిలలో ఈ కళావిశిష్టత కనపడుతున్నది. అయితే వీటిలో అక్కడక్కడ హిందూ, ముస్లిమ్ వాస్తుశిల్ప లక్షణాల ప్రభావం కూడా చూడవచ్చు.

**positive (adj)** : ప్రాస్త.

**positive (n)** : ప్రాస్తం

**positive cast** : ప్రాస్త నిషిక్తం.

**poster** : ప్రవపత్త్రం; పోస్టరు.

ప్రపత్త్రములు ప్రాచీన కాలంలో ఏదో ఒక రూపంలో వాడుకలో ఉన్నవి అని చెప్పవచ్చును. అయితే పూర్వం అవి సార్వజనిక

విషయాలను గురించి ప్రభువు, లేదా ప్రభుత్వం వెలువరించే ప్రకటనలుగా మాత్రమే ఉండేవి. అయితే ఒక కళా ప్రక్రియగా దాని చరిత్ర 19 వ శతాబ్ది ఉత్తరార్ధం నుంచి మాత్రమే మొదలైంది. గ్రాఫిక ప్రక్రియలు – అయినా ముఖ్యంగా శిలాలేఖనం– బాగా అభివృద్ధి పొంది ఈ ప్రపత్తి కళా వికసనానికి దోహదకారులు అయినవి. ఇది ముఖ్యంగా సాధారణ ప్రజానీకపు కళే అయినా, దీనిలో రూపరేఖా రచనను కొన్ని సందర్భాలలో ప్రముఖ కళాకారులు సైతం కొనసాగించడం జరుగుతున్నది. రాజకీయ వాదులకు తగిన ప్రచార సాధనంగాను, వ్యాపారులకు లాభసాధకంగాను ఈకళ రాణిస్తున్నది.

**poster colours** : *ప్రపత్తి వర్ణాలు; భంగుర వర్ణాలు.*

చౌకగా లభించే కాంత్యభేద్యక వర్ణాలు. వీటిలో సులభంగా కరిగే ఒక బంధకాన్ని-బంక, వజ్రలేపం వంటి దానిని-ఉపయోగించి వీటిని తయారు చేస్తారు; వీటిని చిన్న జాడీలలో ఉంచి విక్రయిస్తారు. అతి లలిత పరిణామాలా, క్లిష్ట తూలికా భంగిమలూ అవసరంలేని పనులలో-అంటే ప్రకటన పత్రాలు గోడరాతలు, పిల్లల చిత్రాలు మొదలైన వాటిలో-వీటిని ఉపయోగించవచ్చు. వీటికే ప్రదర్శకపత్ర వర్ణాలు (*Showcard colours*) అనే వేరొక పేరుకూడా ఉంది. చిరస్థాయిగా మనవలసిన చిత్రాలకు కావలసిన రంగులకు వర్తించే ప్రమాణాలతో నిమిత్తం ఏమీ లేకుండా ఈరంగులను తయారుచేయటం జరుగుతున్నది.

**postiche** : *కూటకం.*

కల్పితమై, కృత్రిమంగా కూర్చబడ్డచిత్రం.

**post-impressionism** : *పరిభావనావాదం.*

**post-impressionist painting** : *పరిభావనావాద చిత్రణ.*

పందొమ్మిదో శతాబ్దపు ఎనభైలలో మధ్యకాలం మొదలుకొని 20వ శతాబ్దపు మొదటి సంవత్సరాల వరకు ఆధునిక కళారంగంలో ప్రశస్తి కెక్కిన కళావైఖరులకు సామాన్య



పరిభావనావాద చిత్రం :- 'సెయింట్ రేమీలోని ఆసుపత్రియందలి కక్ష్యాంతరము'. విన్సెంట్ వాన్ గో-గహనవర్ణాలను, వీటిరంగులను ఉపయోగించి రూపొందించిన చిత్రం (1889-1890).

రీతిలో వాడబడే పదం. అనుభావనా వాదానికి ప్రతిక్రియగా ఇది మొదట్లో రూపొందింది. కాంతిపాతాన్ని ముఖ్యంగా గ్రహించి, వస్తువును ఆశ్రయించి, విశ్లేషణరీతిలో ప్రకృతిని రూపొం

కించటాన్నే అనుభావనావాదం ధ్యేయంగా అనుసరించగా, ఈ పరిభావనావాదులు-పాల్ గగూయిన్ (1848-1903) విన్‌సెంట్ వాన్ గో (1653-1890) - తాము గ్రహించగలిగిన రీతిలో తమకు గలిగిన భావోద్వేగాన్ని, లేదా ఆత్మీయతను ఆశ్రయించి, అందుకు తోడుగా వస్తువులోని లాంఛనపు లక్షణాలనుకూడా గ్రహించి చిత్రణను సాగించారు. అనుభావనా వాదులతో కలిసిమెలిసి పనిచేసిన పాల్‌సిజానే (1889-1906), రూపాన్ని ప్రదేశాన్ని తగిన రీతిలో అదుపున ఉంచుకోవటానికి సరికొత్త మార్గాలను కొన్నిటిని చేపట్టారు. ప్రసిద్ధ కళాకారుడైన సూరాత్ (చూ : *pointellism*) అనుభావనావాదులు చేపట్టిన కాంతి విభజనకు, కొన్ని మెరుగులు దిద్దటమే కాక, ఔపచారిక రీతిలో అతి నిశితంగా కొన్ని సంవిధానాలను రూపొందించాడు. కాని పరిభావనావాద చిత్రణములపట్ల, సమకాలీనపు సాధారణ ప్రజానీకమూ, పత్రికాలోకమూ నిరసననే ప్రదర్శించి, దుయ్యబట్టాయి

**potboiler** : *కుక్షింభర రచన*

ధనలాభాన్నే ముఖ్యంగా దృష్టిలో ఉంచుకొని- శోధాతత ఉందన్నట్లు పైపై మెరుగులు మాత్రమే చూపుతూ-ఒక కళాకారుడు సాగించిన రచన. అంతకన్నా పేరెన్నిక పొందగల చక్కటి చిత్రాలను రచించటానికి కళాకారుడు సమర్థుడై ఉండికూడా, ఈ స్థాయికిదిగజారినప్పుడు ఈ కుక్షింభరరచనలో నిజహీనత స్పష్టంగా ప్రకటితమవుతుంది.

**potent cross** : *గట్టి సిలువ.*

సిలువ, అడ్డు కడీలు రెండూ ఒన్నవిగానే ఉంచి, అవి ఉత్తరింపుకొనగా ఏర్పడిన నాలుగు కొమ్ములూ సమాన ప్రమాణంలో ఉండే సిలువ. దీనికే జెరుసెలెమ్ సిలువ అనే పర్యాయనామం ఉంది.

**potter** : *కుంభకారుడు; కుమ్మరి; కులాలుడు.*

**potter's clay** : *కుమ్మరి మట్టి.*

మృణ్మయ పాత్రల నిర్మాణానికి తగిన ఒక విధమైన మట్టి. కల్పకత, చూషణత, మొదలైన గుణవిశేషాలు ఇందులో ఉండటంవల్ల ఇది అటువంటి నిర్మాణ కృషికి తగి ఉంది. దీనిని కొన్ని ఖనిజాలతోను, రసాయనికాలతోను కలిపి కావలసిన రీతిలో నిర్మాణాలు కుదురుకునేట్లు చేస్తారు. ఇటువంటి కుమ్మరి మట్టిలో ఎన్నో రకాలున్నాయి. వాటిలో ముఖ్యమైనవి: స్వచ్ఛమృత్తిక, కుండమట్టి, ముద్దమట్టి, బూడిదమట్టి, రవ్వమట్టి, రాతిమట్టి. (చూ: *Clay body*)

**potter's knife** : *కుమ్మరిబాకు.*

బద్దగా పిడిదగ్గరనుంచి సన్నబడుతూ వచ్చే ఒక విధమైన పరికరం.

**potter's palette** : *కుమ్మరి పలక.*

మృణ్మయ రూపాలను, సుధాపిష్ట రూపాలను తయారు చేసేటప్పుడు వాటిని నునుపు చేయటానికి, తీర్చటానికి, అలంకరించటానికి పైన ఎక్కువగా ఉండే ద్రవ్య భాగాన్ని గీకి వేయటానికి ఉపయోగించే వివిధ రీతుల పరికరాలలో దేనికైనా ఈ పేరును వాడవచ్చు.

(చిత్రం తర్వాత పేజీలో)



పలురకాల కుమ్మరిపలకలు

ఇటువంటి పలక అంచరేఖాకృతిలోగాని, దీర్ఘచతురస్ర రూపంలోగాని, ఒకపక్క అణగిఉండే పరావలయ (*Parabola*) రీతిలో గానీ ఉండవచ్చు. దీని పొడవు వెడల్పులు 4 × 2 అంగుళాలుగా ఉంటాయి. దీని అంచులు కత్తి వాదరలాగానో, లేదా ఉంపపు వాదర మాదిరిగానో అమరి ఉంటాయి.

**potter's pink** : *కులాల శ్వేతారుణం.*

స్వచ్ఛమయికూడా, సాంద్ర శ్వేతారుణత లేని ఒక వర్ణద్రవ్యం; మాత్రవాలలో దీనికి వినియోగం ఉంది.

**potter's wheel** : *కుమ్మరి సారె.*

మట్టితో చేసే కుండలు మొదలైన వాటి నిర్మాణానికి వాడే ఒక విధపు చక్రం. దీనిపై మట్టిని ఉంచి, దానిని తిప్పుతూ, అది తిరిగే కాలంలో కౌశలంతో, మట్టినికావలసిన రూపానికి. కుమ్మరి తీర్చిదిద్దుతాడు ఇటువంటి సాధనాలలో ఎక్కువ సరళంగా ఉండేది కాలుసారె (*kickwheel*) దీన్ని తిప్పటానికి కులాలుడు ఆ చక్రపు దిగువన అమర్చబడి ముందునకు సాగిఉండే ఒక పళ్ళెంవంటిదాన్నో, లేదా మసత క్రరనో కాలితో తంతాడు ఇందువల్ల చక్రం సమాన వేగంతో తిరుగుతుంది. అయితే ప్రస్తుతం యంత్రశక్తితో ఇటువంటి వాటిని నడపే సౌలభ్యాలు ఏర్పడ్డాయి. వీటి వేగాన్ని కావలసిన రీతిలో, కులాలుడు మార్చుకోవటానికికూడా ఇందులో ఏర్పాట్లు ఉంటాయి. ప్రాచీన నాగరికతల కాలంనుంచి కూడా కుమ్మరిసారె వాడుకలో ఉన్నట్లు గట్టి నిదర్శనాలున్నాయి. ఈనాడుకూడా ఆ ప్రాచీన రూపంలోనే అది చాలాచోట్ల వాడుకలో ఉన్నది. అయితే భారీఎత్తున వ్యాపార దృష్టితో సాగే ఉత్పత్తిలో దానికి ఇప్పుడు స్థానం లేదు. కాని పెద్ద ప్రమాణంలో రాతి మట్టి జాడీలను నిర్మించటానికి మాత్రం పాత కాలపు సారెలే వాడుకలో ఉన్నాయి. ఇది ఎట్లున్నా, కళాకారుడు సాగించే మృత్పాత్రల నిర్మాణ కృషిలో సారెకు స్థానం ఇప్పటికీ ఉంది.

**pottery** : *కౌలాలకము.*

1. మార్తిక సామగ్రి. తక్కువ ఉష్ణోగ్రతగల అవంలో కాల్చిన ముతకరకపు కుండలు మొదలైన మట్టిపాత్రలకే ఈ పదం తరచుగా వాడుకలో ఉంది. పింగాణి పాత్రలకు దీనిని వాడటం అరుదు.

2 మార్తిక సామగ్రి నిర్మితమై, అమ్మబడే అంగడి

**pounce** : *అవతనమార్గము; అవతనిక.*

1. బొగ్గు, సీమసున్నం, చీనామట్టి-అనే వాటిలో దేనైనా మెత్తగా నూరిన పృదు అభించే మార్గం. ఒక ఆలేఖనాన్ని ఒక ఉపరి

**Pozzolana** : *పోజ్జొలానా*

అగ్నిపర్వతం నుంచి వెలువడి చల్లబడిన ఒక మృత్తికా విశేషం. సుధామృత్తికను తయారుచేయడంలో దీన్ని సున్నంతో కలుపుతారు.

**Pozzuoli blue** : *పోజ్జొలీ నీలిమ.*

ఐగుప్త నీలిమకు పర్యాయనామం

**Pozzuoli red** : *పోజ్జొలీ శోణిమ.*

ఇటలీదేశంలో పోజ్జొలీ నగరప్రాంతంలో సహజసిద్ధంగా లభించే ఎర్రని మట్టి వర్ణద్రవ్యం పురుష్టీన కాలంనుంచి కూడా సద్యశ్చిత్రాలకు దీనివాడుక కనపడుతున్నది. కాంతిమంతమైన గులాబీ వన్నెగల ఈ వర్ణద్రవ్యం సిమెంటులాగా త్వరలోనే గట్టిపడుతుంది

**precieux** : *అతివ్యక్తీకరణ.*

మొత్తపు రచనలోని గుణవిశిష్టత దెబ్బతినకుండా సహించి, రచనలోని అభివ్యక్తీకరణను అతిమాత్రంగా సాగించడం.

**precipitate (v)** : *అవక్షేపించు.*

**precipitate (N)** : *అవక్షిప్తం.*

**precipitated chalk** : *అవక్షిప్త ఖటిని.*

కృత్రిమంగా, రాసాయనిక రీతిలో తయారుచేసే స్వచ్ఛమైన కాల్షియమ్ కార్బొనేట్. తెల్లదనానికి పేరొందిన ఒక చూర్ణమిది. ఒక వర్ణద్రవ్యంగా దీనికి పారిశ్రామిక రంగంలో వాడుక ఉంది.

**precision drawing** : *నిర్దిష్టాలేఖనం.*

(చూ. ***Machanical Drawing***)

**predella** : *పీఠిక.*

పూజావేదిక ఉండే అరుగు; లేదా పూజావేదిక వెనక సోపానంతో అమరి, పైభాగంలో దీపయష్టికలను, పూవులను, వేదికా చిత్రాన్ని ఉంచటానికి అనువుగా ఉండే అరుగు; పై రెండిలో దేనికైనా అలంకరణగా వాడే చిత్రం, లేదా ఉల్బణ శిల్పం వేదికాలంకరణంలో దిగువ అంచు పొడవునా, సన్నగా, అడ్డంగా అమరి ఉండే ఫలకం, ఇటలీలో చిట్టచివరది పునరుజ్జీవన యుగంలో ఎక్కువ మన్నన అర్జించింది ఆ కాలంలో మూమ్మరత లేదా పలు మడతలలో అమరిన వేదికాలంకరణలతో దిగువ అంచులోని ఇటువంటి ఫలకాలలో చిన్న చిన్న రమ్యచిత్రాలో, ఉల్బణ శిల్పాలో ఉండేవి. ఈ చిన్న చిత్రాలు లేదా శిల్పాలు, వేదికాలంకరణలో రూపితమైనదానికి సన్నిహితత్వం కలిగి ఉండేవి. కాని ఆకాలపు ఇటువంటి అలంకరణలను విడదీసి, ఆయా భాగాలను చాలా మారుమూల ప్రాంతాలకు తరలించడం జరిగింది. ప్రస్తుతం, ఆ పునరుజ్జీవన యుగపు వేదికాలంకరణలలో ఈ దిగువవి మాత్రమే చెక్కుచెదరక ఉన్నవి : 1. ఫ్రా ఏన్‌జెలికో రూపొందించినది (కార్టోనా నగరం). 2. జెన్‌టైల్ డా ఫ్యాబ్రియానో రచించింది (ఉఫీజి గేలరీ).

**prefabrication** : *పూర్వఘటన.*

**prehistoric art** : *ప్రాగైతిహాసిక కళ.*

లిఖితాధారాలవల్ల లభ్యమయ్యే చరిత్రకు పూర్వకాలీనమైనకళారీతి. దానికిసంబంధించిన ప్రముఖ లక్ష్యాలు : స్పెయిన్ దేశంలోని అల్టమీరా దగ్గర గుహలలో కనపడే చిత్రాలు; దక్షిణ ఫ్రాన్సులో లస్కాదగ్గర కనపడే గుహాచిత్రాలు.

**pre-historic period** : *ప్రాగైతిహాసిక యుగం.*

**preliminary drawing** : *ఆరంభాలేఖనం.*

**preliminary sketch** : *హస్తలేఖ.*

**premature failure** : *అకాల క్షతి.*

**preservation** : *అభిరక్షణం.*

**preservative** : *క్షుద్రంకరి; గోపకం.*

నీటి బంధకముల సాయంతో తయారయ్యే పూతరంగులకు-పూతలను కలకాలం, చెడకుండా ఉంచటానికై-కలపబడే ఎటువంటి ద్రవ్యానికైనా ఈ పేరు వర్తిస్తుంది. పూత రంగులో కిణ్వక్రియను నిరోధించటానికి, బూజు పట్టకుండా ఆవటానికి ఈ క్షుద్రంకరి సాయపడుతుంది. ఒక క్రిమిహర క్షుద్రంకరిని (ఫెనాల్ వంటి దానిని), లేదా బూజును ఆపే క్షుద్రంకరిని (సోడియం ఆర్థోఫినైల్ ఫినేట్‌ను) పూతరంగును తయారుచేసే సమయంలోనే వాహకానికి కలుపుతారు. అయినా క్షుద్రం కరులైన ఇటువంటి రసాయనికములను చాలా కొద్ది ప్రమాణాంలో మాత్రమే కలపాలి. అప్పుడవి హానికరములుగాఉండవు. బాష్పశీల ములుగాని బూజు నిరోధకములు, చిరస్థాయి అయిన రక్షణను కల్పించగలవు; కాని బాష్పశీలముకాని క్షుద్రంకరులు, వస్తువు తడిస్థితిలో ఉన్నప్పుడు మాత్రమే పనిచేస్తాయి.

**preservator** : *అభిరక్షకం (పశు).*

**pressure-sensitive tape** : *హస్తదుకు పట్టీ.*

కల్పకంతోగాని, గుడ్డతోగాని, కాగితంతోగా తయారై - ఒక వైపున ఒక అధిసక్తకం పూసి ఉండే - బద్ద వంటి పట్టీ. ఇటువంటి వాటిలో ఒకటి అయిన సెల్లోఫేన్ పట్టీకే స్కాచ్‌పట్టీ అనే వ్యాపార నామం ఉంది. ఇది పారదర్శకమైన కల్ప కంతో తయారు చేయబడుతుంది. దానికి ఒక వైపున హస్తదుకు పట్టి, రెండవ వైపున తళతళలాడే ఉపరితలమూ ఉంటాయి. చిరస్థాయిగా అతికి ఉండవలసిన వాటికి ఈ పట్టీ పనికిరాదు. చిరస్థాయిగా అతికి ఉంచవలసిన వాటికి ఆసిటేట్ రకపు పట్టీగాని, దాని కన్నా మిన్నగా మాస్కింగుటేప్ అనబడేది కాని బాగా పనికి వస్తాయి.

చట్టం లేకుండా ఒకచోట తాత్కాలికంగా అతికి ఉంచవలసిన వాటికకు, గుడ్డతో చేసిన హస్తదుకు పట్టీనే వాడటం సముచితం; ఈ హస్తదుకు పట్టీలు ఏ రకానివైనా, కళారంగంలో రచనలలో ఉపాంగాలుగా-చట్టములు, దిండులు మొదలైన వాటికి-శాశ్వతంగా జత పరచటానికి తగినవి కావు.

**press view** : *పత్రికాలోకనం*

ఒక కళాప్రదర్శనకు, సాధారణ ద్రష్టలను అనుమతించటానికి ముందుగా, పత్రికా ప్రతినిధులను, విమర్శకులను చూడటానికి వేసిన ముందేర్పాటు.

**pricking** : *వేధనము.*

1. అవతరణ ప్రక్రియలో రేఖాచిత్రమును, లేదా అనులేఖనమును సూదితో పొడవటం. వేధన చక్రం వాడటానికి మాత్రం ఈ పేరు వర్తించదు.

2 ఒక పాత చిత్రపు వయసును నిర్ణయించటానికి జరిపే ఒక పరీక్ష. ఒక పాత చిత్రంలో కనపడే సాంద్రపు పూతను సూదితో పొడిచినప్పుడు, అది నిజంగా పాతదే అయితే, సూదిని చొరనీయక నిరోధిస్తుంది. అలాగాక, ఒక పాత చిత్రానికి అది ఒక కొత్త నకలే అయితే, సూది ఆ సాంద్రపు పూతలో, త్వరితంగా చొచ్చుకొని పోతుంది. అయితే ఈ ఒక్క శోధనద్వారానే ఒక చిత్రపు పాత, కొత్తలను నిర్ణయించటం సముచితంకాదు. కూటకులు కొందరు తాము, పాత చిత్రాలలాగా రూపొందించిన కొత్త నకళ్ళకు ఆ నకళ్ళను తగిన రీతిలో వేడిచేసి పూతను గట్టిపరచటంకూడా ఉంది. అంతేకాదు; ఒక్కొక్కసారి వారే చిత్రంపై నెరియలు వచ్చేట్లు చేసి దాన్ని పాతదిగా చెప్పి మోసగించటంకూడా ఉంది. ఇది ఎట్లున్నా ఒక చిత్రంయొక్క పాతదనాన్ని నిర్ణయించటానికి ఒక పరీక్షగా వేధనం ఈనాటికీ విపుల వ్యాప్తిలో ఉంది.

**primary** : *ప్రాథమిక.*

**primary colour** : *ప్రాథమిక వర్ణము.*

ఛాయాభిన్న వర్ణాల కోవకు చెందిన మూడు వర్ణాలలో-ఎరుపు, పసుపు, నీలిమలలో-ప్రతిఒకదానికి ఈ పేరు వర్తిస్తుంది. నలుపు, తెలుపుల సాయంతో చాలాతీరులుగా వీటిని కలిపి, సిద్ధాంతరీత్యా, తక్కిన అన్ని విధాల ఛవులను, స్థాయిలను, ఛాయలను పొందవచ్చు. (ఈ ప్రాథమిక వర్ణాన్నే సంక్షిప్తంగా ప్రాథమికం అంటారు.) అయితే, ఆచరణలో, ఈ విధంగా వివిధ వర్ణాంతరాలను పొందటానికి ద్వితీయ శ్రేణి వర్ణాలను, మధ్యస్థ వర్ణాలను-అంటే ఆకుపసిమి, నీలలోహితములవంటి - వాటిని మాత్రమేగాక-ఎరుపు, పసుపు నీలిమలలో - విభిన్న ఛాయాంతరాల 'వర్ణద్రవ్యాలను ఉపయోగించినప్పుడు మాత్రమే, కావలసిన ఛాయలను పొందవచ్చు. కళాకారుడు ఎప్పుడూ 'స్వచ్ఛ వర్ణం'పై మాత్రమే ఆధారపడడు; కాబట్టి ఇది అత్యవసరం. ఒక ముఖ్యవర్ణంలో కొన్ని ఉపవర్ణాలను కలిపినప్పుడు ముఖ్య వర్ణపు తరంగ దైర్ఘ్యం లాగా ఉప వర్ణాల తరంగ దైర్ఘ్యాలు ఉండవు కాబట్టి, పరిణమించే వర్ణంలోనూ నూతనత్వం ఉంటుంది. ఈ కారణంవల్లనే, మూడు ప్రాథమిక వర్ణాలను కలగలుపు చేసినప్పుడు, నలుపు ఏర్పడక నలుపువాకల స్థాయిలు మాత్రమే ఏర్పడతాయి. ఎరుపు, నీలిమ, ఆకుపసిమి-అనేవి కాంతిపుంజపు ప్రాథమికములు. సంకలన విధానాన్ని అనుసరించి వానిని కలిపిన (అంటే ఒక తెల్లని తెరమీద పై మూడు

విధాల పారదర్శకాలను, ఒకే ఒక స్థానంలో ప్రక్షేపించే వక్షంలో) అవి తెల్లని వెలుతురుగా పరిణమిస్తాయి. చూ : *Colour.*

**primary structure :** *ప్రాథమిక నిర్మాణం.* (చూ : *minimal art*)

**primer (i) :** *మౌలికం; ప్రాథమికం.*

**primer (ii) :** *ఆద్యలేపము.*

చిత్రణకు తొలిచర్యగా జిగురు పూతపై అదిపే ఒక తెల్లని పూత లేదా భూమిక. దీనివలన చిత్రితం కాబోతున్న దానికి తగినంత శోభాయమానంగా తెల్లగా ఉండే ఒక ఆధారం ఏర్పడటమేకాక కాంతవతలో ఏకరీతి చూపణత, నిర్మాణస్థిరతకూడా కుదురుకొంటాయి. ఇటువంటి ఆద్యలేపానికిగాను తైలంలో తెల్లసీసాన్ని కలిపిగాని, నాగశ్వేతం టిటానియం తెలుపులను నూనెలో కలిపిగాని, సాధారణంగా తైలచిత్రణలలో వాడతారు ఇటువంటి ఆద్యలేపాన్ని ఒక పూతగానో లేదా జమిలిపూతగానో ముందే పట్టించి ఉంచిన కాటికలు, బజారులో దొరుకుతాయి. ఒంటిపూత కాటిక కొంత మెతకగా ఉంటుంది; జమిలిపూత కాటిక కొంతగా కొయ్యబారి ఉంటుంది. పైన తెలిపిన మార్గాలలో ఏ విధంగా ఆద్యలేపం వేయబడిననప్పటికీ ఆద్యలేపంగా వేయబడే దాన్ని సర్వసాధారణంగా భూమిక అనే వ్యవహరిస్తారు. లోహపు రేకుపై ఆద్యలేపం కావలసినపుడు, ఆరేకును మర్దన సాయంతో గరుకుగా చేసి; అటువంటి ఉపరితలంపై తైలంలో కలిపిన తెల్లసీసంతో రెండు పూతలు వేస్తారు. గచ్చుగోడలకు రంగు వేయవలసి ఉన్నప్పుడు వాటిపై తొలిపూతగా గచ్చునే వేస్తారు. అది ఆరినతరవాత దిండుతీరుగా పరిణమించి, తుదిరంగుపూతను గ్రహించటానికి అనువుగా ఉంటుంది.

**priming ($^1$) :** *అధిభూమిక.*

అధిభూమిక అనేది భూమికకన్నా విభిన్నం కొందరు దీనికీ భూమికకూ మధ్య ఉన్న విభేదాన్ని గుర్తించలేక తికమకపడటంకూడా ఉంది. కాని యథార్థానికి భూమికపైన వేయబడే ఒక ప్రత్యేకపు పూత పొరను మాత్రమే అధిభూమిక అంటారు. చిత్రపు రంగుపనిని సాగించటానికి ఎక్కువ అనువైన పరిస్థితి ఇందువల్ల కలుగుతుంది. భూమిక ఎక్కువ గ్రసనశీలం కలది అయితే అధిభూమిక ఆ గ్రసన శీలతను తగ్గించగలుగుతుంది. ఒక్కొక్కప్పుడు ఒక ప్రత్యేకపు ఛవినికూడా అధిభూమిక కల్పించగలదు. లప్పపు భూమికపై వేయవగినదిగా ఇటాలియన్ కళావండితుడు వాసరీ పేర్కొన్న తరళ పటలం ఇటువంటిదే అని, దాన్ని దీనికి పర్యాయ పదంగా వాడటం ఉంది.

**priming ( ) :** *ధావళ్య కరణం.*

**primitive :** *ఆదిమం.*

1. స్వయంకృషిపై మాత్రమే ఆధారపడి, అతి సరళ రీతిలో ఒక కళాకారుడు రూపించిన రచన. అంటే తత్పూర్వపు రచనల నుంచిగాని, సమకాలీనపు రచనలనుంచిగాని అతడు ఏమీ గ్రహించక రూపొందించేదు

అర్థం. ఇటువంటి ఆదిమరీతి కళాకారుడుగా ఎక్కువ ప్రసిద్ధిని ఆర్జించినవాడు ఫ్రెంచి చిత్రకారుడగు హెన్రీ రూసో(1844-1910). అమెరికాలో ఈ కోవకుచెంది ప్రముఖతను ఆర్జించినవారు : ఎడ్వర్డు హిక్స్ (1780-1849); గ్రాండ్‌మా మోసెస్ (1860-1961).

(చిత్రం తర్వాత పేజీలో)

2. శతాబ్దాలుగా, ఏవిధమైన సాంఘిక ప్రగతిని సాధించక సంప్రదాయాగతమైన ఒకే విధపు రీతికి అంటిపెట్టుకొని ఉండే ప్రజలలో వ్యాప్తిలో ఉండే కళకు చెందింది. కొయ్య, రాయి, లోహం, లేదా మృత్తికలలో కనపడే ఆదిమ కళలో అత్యధిక భాగం మతపరంగానో, లేదా ఒక నిర్దిష్ట ఐహిక ప్రయోజనాత్మకంగానో ఉంటుంది. ఇటువంటి కళారీతిలో ఆఫ్రికావాసులు రూపొందించిన ఉపకరణాలూ, మూర్తిశిల్పాలూ, ఇరవయ్యో శతాబ్దపు యూరపీయ కళాకారులలో కొంద రిపై-దేరైన్, పికాసోవంటి వారిపై-గణనీయ ప్రభావాన్ని నెరపాయి సాగరఖండం (*Oceania*) లోని న్యూగినీ మొదలైన కొన్ని దీవులలోనూ అలాస్కాలోనూ, యు స్టేట్స్‌లోని, ఆగ్నేయప్రాంతంలోనూ, నవాహో మొదలైన కొన్ని జాతుల ప్రజలలోనూ ఈఆదిమకళారీతికి చెందిన రమ్యరచనలు కొన్ని కనిపించాయి.

**primitives, Italian** : ఇటలీయ ఆదిమలు.

ఇటలీదేశంలో 13వ, 14వ శతాబ్దాలలో జిగురురంగులతో చిత్రరచనను సాగించిన చిత్రకారులకు, ఒకప్పుడు వ్యాప్తిలో ఉండి, నేడు పాతపడిపోయిన ఒక సామాన్య నామ విశేషం. పునరుజ్జీవన యుగపు కళాకారుల కన్నా, వారు భిన్నులని తెలపటమే ఈపదపు వాడుకలోని ముఖ్యోద్దేశం. బైజాంటియన్ కళనుంచి ఈ ఆదిమలు విడివడి, కొత్త మార్గాలను తొక్కి, పునరుజ్జీవన యుగానికి వైతాళికులుగా వ్యవహరించారు వీరిలో పేరెన్నికగన్నవారు : సిమాబో [1240-1801]. ఫ్లారెన్స్ వాసి అయిన జియొట్టో [1267 - 1337], సీనా నగరవాసులైన డూచ్చియో లారెంజెట్టి సోదరులు(చూ *Sienese school*). ఈ జిగురురంగులవాడకం లోనూ సాంకేతికప్రక్రియలోనూ మేలిమార్పులు వచ్చి, దాన్ని తగినఆదరువుతో, విభావనాశీలపు మాధ్యమంగా ఉపయోగించటానికి సౌకర్యం ఏర్పడ్డ కాలంలో దాన్ని ఉపయోగించిన చిత్రకారులను-పాల్‌లో ఉచ్చెల్లో [ర. 1396-1475], పియెత్రో డెల్లా ఫ్రాన్‌సెస్కా [ర. 1420-1492], సాంద్రో బొట్టిసెల్లి [ర. 1445-1518] వంటి వారినికూడా ఆదిమలుగానే, విక్టోరియాయుగపు కళాకారులు భావించారు.







ఆదిమ కళ :- దానికి ప్రముఖ లక్ష్యంగా పేర్కొదగిన ఈ చిత్రము-'సింహ విశ్రాంతి'(C. 1907) అనబడేదానిని రచించినవాడు హెన్రీ రూసో. కాదికపై జరిపిన తైల చిత్రణ ఇది. (అన్నింటి పైనదిది). క్రింద ఎడమవైపున నున్నది దారు నిర్మితమగు ఒక ఉపముఖం. ఆఫ్రికాలోని ఐతు-బా ప్రాంతాన దొరికినదిది. క్రింద కుడివైపున ఉన్నది, పికాసో కాదికపై తైలముతో 1907న రచించిన 'అవిగ్నాన అందకత్తె' అనే చిత్రములోని ఒక భాగం; ఈ రచనలో పికాసోపై ఆఫ్రికన్ కళారీతి నెరపిన ప్రభావము కననగును.

**primrose yellow** : వసంత పీతం.

క్రోమ్ పసిమికి, పారిశ్రామిక రంగంలో వాడుకలో ఉండే పర్యాయనామం; కాని ఈ పదం అప్రామాణికం.

**principle** : మూలసూత్రం; సూత్రం.

**principle of rebus** : చిత్రప్రవహ్లిక.

కొన్ని చిత్రాలను రచించి వాటి పేరుల ఆద్యక్షరాల సంయోగంచే కొత్త పదాన్ని సాధించటం.

**print** : అచ్చు; ముద్రాంకం

ఒకేఒక ఫలకంనుంచో, దిమ్మెనుంచో రాతినుంచో, జవనికనుంచో, పరివర్తన పత్రం నుంచోలేదా ఫిలింనెగెటివ్ నుంచో.కాగితాలమీద తీసిన పలు ముద్రణలలో ప్రతిదానికి ఈ పదం వర్తిస్తుంది. లలితకళా రంగానికి సంబంధించినంతవరకు, ముద్రాంకాలకు మౌలికాంశములను రూపొందించే వివిధ ప్రక్రియలు 'గ్రాఫిక కళలు' అని వ్యవహృతాలు. దాని నుంచి తీసే వేర్వేరు ముద్రాంకాలను 'రుజువులు' అంటున్నారు.

**printing ink** : అచ్చుసిరా.

అచ్చుపనిలో వాడే సిరాలలో దేనికైనా ఈ పదం వర్తిస్తుంది. శోషణ ధర్మంగల ఒక తైలవాహకంలో తిరుగుడు మర (*Roller mill*) సాయంతో, వర్ణద్రవ్యాన్ని విక్షేపణం చేయటంవల్ల అచ్చుసిరాలను తయారుచేస్తారు. అందువల్ల ఇవి, వ్రాతసిరాలను, ఆలేఖ్య సిరాలను పోలివుండక, కళాకారులు వాడే రంగులనే పోలివుంటాయి. ఏ ప్రక్రియకు చెందిన ముద్రణను సాగించవలసి ఉన్నదో ఆ ప్రక్రియకు అనుగుణంగా ఈ సిరాలోని పదార్థాలు మార్పు పొందుతాయి. శిలాలేఖన ప్రక్రియలోనూ, రిడుల్పణాక్షర ప్రక్రియలోనూ నల్లని అచ్చుసిరాలకై దీపమసిని వర్ణద్రవ్యంగా వాడతారు. ఈ రెండు ప్రక్రియలకునూ రంగుసిరాలనూ పలచని పూతగా పట్టిస్తారు. అందువల్ల పారదర్శకత వాటినుంచి పరిణమిస్తుంది. ఈ చక్కని పరిణామంకొరకై ఇందుకు తగిన వర్ణద్రవ్యాలను ఏరుకోవటంలో స్పష్టతకు, ఉజ్జ్వలతకు ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇస్తారు. ఒక్కొక్కప్పుడు అల్యూమినియమ్ హైడ్రేటువంటి వ్యాపకాన్ని కలిపి దాని పారదర్శకతను అధికం చేయటం జరుగుతుంది ఛాయవంతములు, లేదా కాంత్యభేద్యకములైన వర్ణద్రవ్యాల సిరాలు, కొన్ని నిర్దిష్ట ప్రయోజనాల కోసం- అందునా ముఖ్యంగా నల్లరంగు కాగితంపైన ముద్రణకు-వాడబడుతున్నాయి. ఇక అధిలేఖన ప్రక్రియలో గుంటలు గుంటలుగా ఉన్న ఒక ఫలకంపై గుంటలలో మాత్రమే నిలిచేట్లు సిరాపూయటం జరుగుతుంది. ఆ గుంటల లోతులు వివిధ రీతులలో ఉండటంవల్ల, వివిధ ఛాయాంతరాలను సాధించటానికి వీలు పడుతుంది. దీపమసికి ప్రత్యామ్నాయంగా దంతపుమసిని, లేదా ఫ్రాంకుఫర్టు నలుపును ఉపయోగించటంకూడా ఉంది సూచీ చిత్రణలో నల్లసిరాకు, కాల్చిన అంబరును కలపటం వల్ల ఆ సిరాయొక్క స్థాయిని పెంపొందించటం జరుగుతున్నది. అచ్చుసిరాకు వాహ

కంగా సాధారణంగా ఒక ప్రత్యేకరీతిలో తయారుచేసిన అవిసెనూనను (రాతివార్నిషు అనేదానిని) వాడతారు.

**printing medium** : *ముద్రక మాధ్యమం.*

**printing surface** : *ముద్రాతలం.*

**prism** : *పట్టకం.*

**prismatic colour** : *పట్టకవర్ణం.*

విదళనవర్ణానికి ఇంకో పేరు.

**private** : *అంతరంగిక.*

**problem picture** : *విగూఢ చిత్రం.*

భావం అంతుపట్టని ఒక చిత్రరచన. ఏదో అలౌకికపు, అసంబద్ధపు సంఘటనలో లేదా పరిస్థితిలో చిక్కుకొన్న వ్యక్తులను రూపించటం ఇందులో కనపడుతుంది.

**process oil colours; process tempera colours** : *సంస్కారిత తైలవర్ణాలు; సంస్కారిత నిర్యాస (కలల) వర్ణాలు*

వ్యాపార దృష్టిలో తయారైన కౌశేయ యవనికా వర్ణాలివి సరిఅయిన ధృతిని, ఒదుగుబాటును, శోషణ వ్యవధిని పూత రంగుకు-కౌశేయ యవనికపై ఉపయోగించటానికి తగినట్టు-ఇవ్వగలిగే సాధన ద్రవ్యాలను ఆరంగులకు చేర్చిన విషయం స్పష్టం చేసే ఉద్దేశంతోనే 'సంస్కారిత' అనే పదం ఉపయుక్తమయింది. ఈ రంగులకు వాహకాలను గురించి తెలియరావటంలేదు. అందులో కొన్ని వర్ణాలకు మాత్రం కళాకారుల చిరస్థాయి వర్ణాలపేరులే వాడుతున్నారు కౌశేయ లేఖకులే విస్తారంగా ఈ రంగులను వాడుతున్నారు ఇక ముద్రాంకముల తయారీదారులు – తమ పని కలకాలం నిలిచిఉండాలని ఆశించినప్పుడు – ప్రామాణికమైన కళాకారుల రంగులను వాడుతున్నారు. అవి సంస్కారిత వర్ణాలైతేనే స్వచ్ఛమైన పారదర్శక ప్రాతిపదికతో కలపటానికి వీలయ్యేదే.

**product** : *ఉత్పన్నం; ఉత్పత్తి.*

**production art** : *ఉత్పాదన కళ.*

**profile (1)** : *పార్శ్వభంగిమ.*

ఒక విధపు బాహ్యరేఖా రీతి ఒకపక్కనుంచి చూసినప్పుడు కనపడే ముఖాకృతి యొక్క పరిధిరేఖ (చూ : *profile perdu; silhouette*).

**profile (2)** : *కుమ్మరిరేకు*

మార్తవ సామగ్రి తయారీలో ఉపయోగించే ఒక పరికరం. కుమ్మరిసారెపై తిరిగే మృత్తికా పిండంనుంచి కావలసిన రూపాన్ని సాధించటానికి ఇదిసాయపడుతుంది. ఇది ఒక రేకుపలక. దీని పనివాటపు అంచు. వ్యవస్త రూపొందించే వస్తువుయొక్క బాహ్యపరిధికి రీతిలో ఉంటుంది

**profilm** : చూ *Film-stencil method*

**profil perdu** : *పరాఙ్ముఖ భంగిమ.*

ఇది ఒక విధమైన పార్శ్వభంగిమే. అయితే ఇందు చూడవలసిన వ్యక్తిని అటు

పక్కన ఉండి చూసక, కొంతవరకు వెనుక నుండి చూపటం జరుగుతుంది. ఇట్లా దాదా పుగా వెనకనుంచి చూడటంవల్ల దెంపకు, దవడకు సంబంధించిన పరిధిరేఖను రూపొం దించే అవకాశం ఉంది. ఇటువంటి భంగిమను అనుభావనావాదులు ఎక్కువగా వినియోగించారు. పురోభాగం కనపడకుండా వుండేట్లు తిరిగి వుండే వస్తువును చూసే దృష్టికి ఈ పదం వాడుతున్నారు.

**porphyry** : *సితాదుబ శిల.*

**progressive proofs; successive proofs** : *అంచె రుజువులు; వరస రుజువులు*

ఒక వర్ణ ముద్రాంకనమును తయారుచేసే టప్పుడు, వివిధ ఘట్టాలలో తీసే రుజువుల కూటం. దీన్ని తన కృషియొక్క సంలేఖనంగా వుండటానికి కళాకారుడు సంకలితం చేసి వుంచుకొంటాడు; లేదా తన కళాకుశలతను ప్రదర్శించుకొనే సామగ్రిగా వుంచుకొంటాడు. ఇందులో అంచెరుజువులలో, ఒక్కొక్క రంగును ముద్రించేటప్పుడు అప్పటి అంచెవరకు తయారైన ముద్రాంకనములు చేరివుంటాయి. వరస రుజువులలో, ఆయారంగులతో ప్రతిఒకదానికి చెందిన ముద్రాంకనములు మాత్రమే వుంటాయి.

**projection** : *ప్రక్షేపణం*

యాంత్రిక ఆలేఖనంలో వాడుకలో ఉన్న ఒక నిర్మాణరీతి; రేఖేతరము (అంటే రేఖో పాత బిందువులు లేనటువంటిది) అయిన దృష్టి ప్రక్రమగతి విధానం అయినా రేఖాగత దృష్టి ప్రక్రమ గతిపరేసే, ప్రక్షేపణములను -ద్విరాయతన మయ్యేదానిలో-మూడాయతనాలను స్ఫురింపజేయటానికే వాడబడుతున్నవి. చిత్రంలో ఆభాసరీతిలో వస్తువు ఉనికిని సూచించటమే రేఖాగత దృష్టి ప్రక్రమ గతిలో ముఖ్యోద్దేశం; కాని ప్రక్షేపణ విధానాలలో-అందునా ముఖ్యంగా యాంత్రిక ఆలేఖనాలలో-ఆభాసరీతిలో గాకుండా, ఒకనిర్దిష్ట తర రీతిలో ఆయతనాలను గురించీ, జ్యామితీయ సమాచారం గురించీ తెలియజేయడం జరుగుతుంది. ఇటువంటి ఫలితాన్ని సాధించటానికై, ఒక వస్తువుయొక్క ప్రక్షేపణను రూపించటంలో, వస్తురూపంలో భ్రంశత కొంత కలగవచ్చు ఇటువంటి ప్రక్షేపణము లలో ముఖ్యంగా పేర్కొనదగినవి రెండు : 1. అక్షమాత్రికం. 2. తిర్యగ్గతికం ఇందులో





ప్రక్షేపణ : పైనున్నవి ఎడమనుండి కుడివైపునకు, అక్షమాత్రికా ప్రక్షేపణములు : ఏకమాత్రికా, ద్విమాత్రికా, త్రిమాత్రికా. దిగువవి తిర్యగతిక ప్రక్షేపణాలు. ఎడమనున్నది గురుతిర్యగ్గతిక, కుడిది సంక్షిప్త తిర్యగ్గతిక

మొదటిదానిలో ఏకమాత్రికాప్రక్షేపణ, ద్విమాత్రికా ప్రక్షేపణ, త్రిమాత్రికాప్రక్షేపణ అనేవి అక్ష మాత్రికములుగ పరిగణితములు ఒక వస్తువు యొక్క ఉనికిని నిర్దేశించటానికి ఆవశ్యకమైన మూడు అక్షాలతో ఒకదానితో ఇంకొకటి

అమరిఉండే కోణాల విభేదాలవల్లనే-అంటే ముఖ్యంగా తదనుగుణరీతిలో సాగే క్షయవృద్ధి పరిమాణాన్ని అనుసరించియే-పై మూడురకాల ప్రక్షేపణలు, అక్షమాత్రికంతో ఏర్పడ్డాయి. ఇక తిర్యగ్గతిక ప్రక్షేపణలో, వస్తువుయొక్క రెండు పక్షాలు, పటతలానికి సమానాంతర రీతిలో ఉన్నప్పుడు కనపడేట్లు ఆ వస్తువు రూపితమవుతుంది ఉదాహరణకు ఈ ప్రక్షేపణల్లో ఒక ఘనాన్ని (అంటే పొడుగు, వెడల్పు, ఎత్తు సమానంగా ఉన్న వస్తువును) రూపించటం తీసుకొందాం. ఈ రీతిలో అందులో ముఖాన్ని ఉన్నదాన్ని ఉన్నట్లు, అంటే నాలుగు సమకోణా [90 డిగ్రీ]లతో అమరినట్లు, చూపించే వీలుంది. అయితే మూడో అక్షంగా-గీసే కోణదిశపైనా తదనుగుణమైన క్షయవృద్ధి పరిమాణంపైనా ఆధారపడి-ఆ ప్రక్షేపణ సాధారణ గురుతిర్యగ్గతిక ప్రక్షేపణా లేదా సంక్షిప్తతిర్యగ్గతిక ప్రక్షేపణా అనేది నిశ్చితమవుతుంది.

**proletcult : శ్రామిక సంస్కృతి.**

రష్యాదేశంలో 1906లో సంస్థాపితమై, శ్రామిక సంస్కృతి వ్యవస్థ అనే అర్థమిచ్చే పేరుతో వ్యవహృతమైన సంస్థ [ఆ పేరుకు ప్రోలెట్‌కల్ట్ అనేది సంక్షిప్త రూపం] 1917లో రష్యాలో విప్లవ ప్రభుత్వం అధికారం చేపట్టిన తరవాత మాత్రమే అది ప్రాముఖ్యం పొందింది. పారిశ్రామిక కృషితో కలిసిమెలిసి పనిచేస్తూ పరిశ్రమకూ కళకూ మధ్య ఏకతను పెంపొందించే తలంపుతో శ్రామిక ప్రజకు సముచితమైన కళను, సంస్కృతిని పెంపొందించటం ఆ సంస్థ యొక్క ధ్యేయం. కమ్యూనిస్ట్ పార్టీతో గాని ప్రభుత్వంతోగాని ముడిపడిన ఒక భాగంగా ఉండకుండా స్వయంవ్యక్తిత్వంతో ఆ సంస్థ పెంపొందాలని దాని నాయకులు విశ్వసించారు. 1922లో రష్యాదేశంలో నూతన ఆర్థిక విధానాన్ని, లెనిన్ ప్రవేశపెట్టిన ఫలితంగా, అంతవరకు కళలను పోషించటం, తన బాధ్యత మాత్రమే అని విశ్వసించిన ప్రభుత్వం ఆ బాధ్యతను వదులుకొన్నది. అంతవరకు ఆదేశంలో కళారంగంలో మార్గదర్శులుగా వ్యవహరించిన నిర్మాణకళావాదులూ పౌరమ్యవాదులూ, ఈ శ్రామిక సంస్కృతి [ప్రోలెట్ కల్ట్]లో చేరి, ఆ సంస్థ ఇచ్చే ఆర్థిక సహాయంతో తమ మనుగడ సాగించారు. అట్లా చేరటానికి ఇష్టపడనివాళ్ళు దేశం వదలి, పారిస్ మ్యూనిచ్, లేదా బెర్లిన్ నగరాలకు వెళ్ళి తలదాచుకొన్నారు. ఈ శ్రామిక సంస్కృతిని అనుసరించిన కళాకారులు – కళాకార ఇంజనీర్లుగా తయారైనారు 1932లో మళ్ళీ కమ్యూనిస్ట్ పార్టీ, సోవియెట్ కళపై పర్యవేక్షణాధికారం వహించింది

**proof : రుజువు; మచ్చుప్రతి; చిత్తుప్రతి, రుజువప్రతి.**

గ్రాఫిక కళలలో తీయబడిన ప్రతి ముద్రాంకనానికికూడా వర్తించేపదం అయితే వ్యాపారరీతిలో ముద్రణాలయాలు నిర్వహించేవారు తమ ముద్రణ ప్రక్రియలో ఒక నిర్ణీత ఘట్టంలో అచ్చు ప్రతి నిర్దుష్టంగా

వస్తుందో రాదో అని పరిశీలించటానికి తీసే మచ్చు ప్రతి. ఆప్రతి సరిగా లేకపోతే అందులకుగాను తగిన సవరణలను ముద్రణ ఫలకంలో చేయటం ఇందువల్ల వీలవుతుంది. గ్రాఫిక ప్రక్రియలలోకూడా ఇటువంటి మచ్చు రుజువులను తీస్తారు. అందువల్ల ఆ రుజువులకు ఆధారమైన ముద్రాతలాన్ని చక్కగా శోధించి, తగిన సవరణలను చేయవచ్చు. ఫలకాన్ని సంపూర్తిగా తయారుచేయని స్థితిలోనైనా లేదా దానికి సిరా పట్టించే రీతిని కట్టుదిట్టం చేయక పూర్వమే అయినా, తీయబడు చ్చుప్రతికే పరిస్థితి (*State*) లేదా ఘట్టము (*Stage*) అనే పేర్లున్నాయి. [అంచెరుజువులు; వరస రుజువులు అనే పేరుతో వ్యవహరించబడుతూ తీయబడే రంగుముద్రాంకనముల రుజువులు-ఒక విధంగా చూసినప్పుడు-అక్కడక్కడ ఒక్కొక్క పరిస్థితిలో తీసిన నలుపు-తెలుపు రుజువుల పంక్తి అనే చెప్పవచ్చు]. రేఖాశిల్పంలో, తుది పరిస్థితిలో తీసిన రుజువుపై కళాకారుడి సంతకం, శిల్పపు పేరు, ప్రచురణకర్తయొక్క సంకేతం మొదలైనవి ఉండవు కాబట్టి దాన్ని అలిఖితపు రుజువు (*Unlettered proof or a proof before letter*) అంటారు. దానికి పైవాటిని చేర్చినపుడు దాన్ని లిఖితపు రుజువు (*lettered proof, or proof after letter*) అంటారు. ఈ విధంగా తన సంతకాన్ని, శిల్పపు పేరును ఫలకంలో చేర్చిన తరవాత, కళాకారుడు సరిఅయిన రుజువులను తీయటం ప్రారంభిస్తాడు. అట్లా తీసే రుజువులలో ప్రతిదానికి దిగువ ఎడమ మూల కడఅంచున ఒకభిన్నం కళాకారుడు వేస్తాడు. ఈ భిన్నంలో లవము, తీయబడిన రుజువుయొక్క వరస సంఖ్యను తెలియజేస్తుంది. హారం, ఆముద్రణలో తీసే రుజువుల మొత్తపు సంఖ్యను తెలియజేస్తుంది. ఇందువల్ల 25 మొత్తపు రుజువులుతీసినపుడు ముద్రణలో మూడో రుజువు 3/25 అనే భిన్నమును దిగువ మూలన కలిగి ఉంటుంది. ఈ విధంగా రుజువులకు సంఖ్యాక్రమం ఏర్పడడం అనేది ఆధునిక కాలంలో మాత్రమే వాడుకలోకి వచ్చింది. దీనికొక కారణం ఉంది. సూచీ చిత్రణలోగాని, సూచీ ప్రక్రియలోగాని వాడబడే రాగిఫలకం క్రమక్రమేణా శైథిల్యం చెందుతుంది. కాబట్టి దానిపై మొదట తీసిన రుజువులు, తరవాత తీసిన వాటికన్నా ఎక్కువ మెరుగ్గా ఉంటాయి అందువల్ల తక్కువ లవసంఖ్య కలిగిఉన్న భిన్నాంకం ఉండే రుజువు, ఎక్కువ లవసంఖ్య కలిగిన భిన్నాంకమున్న రుజువుకన్నా నాణ్యతలో మిన్న అని స్పష్టమవుతుంది. అందువల్లనే సూచీ చిత్రణలోగాని, సూచీప్రక్రియలోగాని ఒక ఫలకంనుంచి తీసే రుజువుల సంఖ్య నియమితమై ఉంటుంది. తక్కిన విధాల ముద్రాంకన ప్రక్రియలలో తీసే రుజువుల సంఖ్య ఒక సహేతుక ప్రమాణంలో ఉన్నంత వరకు, రుజువుల నాణ్యతలో హెచ్చుతగ్గులు అంతగా కనపడవు.

**proof after letter; proof before letter :** (చూ. proof)

**proportion** . తాలమానం; నిష్పత్తి.

ఒక రచనా సంవిధానంలో, వివిధాంగాలు పరస్పరంగాను, ఒక్కొక్క మొత్తపు రచన

తోను కలిగిఉండే గణితశాస్త్రీయ సంబంధం. (చూ॰ *Asymmetry, Dynamic symmetry*). గణితశాస్త్రీయంగా, జ్యామితీయంగా మానవశరీరపు వివిధావయవాల మధ్యవున్న సంబంధాలనూ ఆ ఒక్కొక్క అవయవం లేదా శరీరభాగం మొత్తపు శరీరంతో కలిగి ఉండే అనుపాతాన్ని ఈ పదం, ముఖ్యంగా తెలియజేస్తుంది. తలయొక్క నిడివిపొడవును కొలబద్దగా తీసుకొంటే మానవశరీరపు పొడవు ఆకొలబద్దతో 7 లేదా 7 1/2 కొలతలు ఉంటుంది. చేతులను బారచాచినప్పుడు ఆ బార ఆ వ్యక్తియొక్క ఎత్తుకు దాదాపుగా సమానంగా ఉంటుంది. ఒక మానవ శరీరపు ఆదర్శచిత్రాన్ని గీయటానికి సాధారణంగా తయారుచేసే సూత్రలేఖనంలో శరీరాన్ని సరిసంఖ్యగాఉండే భాగాలుగా విభజించటం పరిపాటి (ఉదాహరణకు అటువంటిది 8 తలనిడువుల పొడుగు ఉండేట్లు చేయటం). ఇటువంటి తాలమానాలలో, ప్రాచీన గ్రీకుల కాలంనుంచికూడా ప్రసిద్ధి చెందినది రమ్యతా నిష్పత్తి (*Golden mean*) అనేది ఇది పాశ్చాత్య ప్రపంచంలో ఎక్కువగా ఆదరణ పొందింది శరీరపు నిండు కొలతను తీసుకొని దాన్ని సగం మళ్ళీ అందులో సగం ఈ రీతిగా చిన్నచిన్న భాగాలు చేస్తూపోగా, అందులో ఒక్కొక్క కొలత ఒక్కొక్క శరీరభాగపు కొలతకు సరిపోతుందనటం దీని ముఖ్య ప్రాతిపదిక.

మానవ శరీరాంగాలు, ఏఏ నిష్పత్తిని అనుసరించి పరస్పరం కుదురుకొన్నాయి? ఏ ఏ తీరున కుదురుకొన్నప్పుడు రమ్యత సిద్ధిస్తుంది. అనే ఈ ప్రశ్నల విషయమై చర్చ కళేతిహాసంలో ప్రతి యుగంలోను సాగుతూనే ఉన్నది. దీన్ని గురించి మొట్టమొదటి గ్రంథాన్ని ఆర్కిటెక్చురా (వాస్తుశిల్పం) అనేపేరుతో లాటిన్ భాషలో విట్రూవియస్ [క్రీ.పూ. 1 వ శతాబ్ది] అనే అతడు రచించాడు తర్వాత పునరుజ్జీవన యుగంలోనూ ఈ విషయమై అనుశీలన జరిగింది. ఆ అనుశీలనను సాగించిన వారిలో ప్రముఖులు లియోనార్డో డా వించి [1452-1519]; ఆల్‌బ్రెక్ట్ డ్యూరర్ [1471-1528].

**propensity** : *ప్రవణత.*

**proportional calipers** : *నైష్పత్తిక మాపకము.*

శిల్పాలు, కొలతలను తీసుకోవటానికి వాడే ఒక విధమైన పనిముట్టు. ఇది సందంశ మాపకం కన్నా చాలా పెద్దది. దీనికి రెండు వైపులా పట్టకారులు-అందొక వైపు పెద్ద పట్టుకారు, రెండవవైపు చిన్నపట్టుకారు-అమరి ఉంటాయి. ఈ రెంటిమధ్య ఒక మర బిగింపు ఉండి, దాన్ని ఒక క్రమంగా ముందుకు తీసుకుపోయే ఏర్పాటు ఉంటుంది. అందువల్ల పెద్ద పట్టుకారు కోరలతో పట్టుకో గలిగే దూరానికి అనుగుణ నిష్పత్తిలో చిన్న పట్టుకారుద్వారా ఒక రేఖను ఏర్పరిచే వీలుంది. ఈ విధంగానే చిన్న దూరానికి, అనుగుణమైన పెద్ద దూరాన్ని కూడా రూపొందించవచ్చు. అందువల్ల ఒక రచనను పెద్దది చేయటానికి, లేదా చిన్నది చేయటానికి తగిన నిష్పత్తిలో కొలతలను ఈ పరికరంవల్ల పొందవచ్చు.

**protective coating** : *పరిరక్షక ప్రలేపం.*

**protogeometric period** : *ఆదిమ జ్యామితీయ యుగం; పురాజ్యామితీయ యుగం.*

హెల్లెనీయ కళలో తొలికాలపు యుగం (క్రీ. పూ. 1100-900). ఈ యుగంలో కళాభావన, కులాల సామగ్రిపై (కుండలు మొదలైన మృణ్మయసామగ్రిపై) జరిగే అలంకరణను ఆశ్రయించింది. ఆ సామగ్రిపై జ్యామితీయ రేఖాచిత్రాలు ఆకాలంలో అలంకరణార్థమై రచింపబడేవి. ఆ హెల్లెనీయ కళలో, ఈ యుగం తరవాత వచ్చింది జ్యామితీయ యుగం.

**proto-porcelain** : *తొలి పింగాణీ.*

పింగాణీ ప్రక్రియ చక్కటి పరిపుష్టతను ఆర్జించని కాలంలో చీనా దేశంలో తయారైన తక్కువరకపు పింగాణీ.

**prototype** : *మూల రచన.*

మొట్టమొదటి పరిపుష్ట రచనకు కళా రంగంలో వాడే నామం. దీన్ని అనుకరించి గాని, లేదా దీనినుంచి ముద్రణాదులవల్లగాని సాధించే రూపాలకుంచి ఇది వేరైనది. ఒక మూలరూపంనుంచి ఏ విధంగానైనా తయారు చేసిన నకళును, లేదా ప్రతిరూపాన్ని ప్రతిరచన (*Ectype*) అని వ్యవహరిస్తారు

**protractor** : *కోణమాపకం.*

**Prussian blue** : *ప్రష్యన్ నీలిమ.*

ఒక విధమైన ముదురు నీలపు వర్ణద్రవ్యం. దీని రాసాయనిక నామం ఫెర్రిక్ ఫెర్రో సయనైడ్. ఇది ముదురు నీలపు రంగుగా ఉన్నా దీనిలో ఆకుపచ్చిమివాళ, మెరమెరలాడే గట్టి ఛాయ నలుపుకూడా కనపడతాయి. ఛవిపటిమ (*Tinting strength*) లో దీనికి సాటి వచ్చే వర్ణాలు చాలా కొద్దిగా మాత్రమే ఉన్నాయి 1704లో దీన్ని కనుక్కొన్నారు. చారిత్రక రీతిలో, మొట్టమొదటగా రూపొందించిన సంయోజిత వర్ణ ద్రవ్యమిదే అని నిశ్చితంగా చెప్పవచ్చు. ఒక కాకతాళీయ సంఘటనవల్ల, దీనిని డీస్ బార్ అనే రంగు పని వాడు కనుక్కొన్నాడు (అతడు బెర్లిన్ నగరవాసి). ఎరుపురంగులో తనకు కావలసిన ఒక ఛాయను రూపొందించటానికి అతని కొక ద్రవ్యం కావలసిఉండగా, పొరపాటున వేరొక ద్రవ్యాన్ని అతడందులో కలిపాడు. తత్ఫలితంగా ఈ కొత్త వర్ణద్రవ్యం రూపొందింది (దాదాపుగా ఇటువంటి కాకతాళీయ సంఘటనలవల్లనే తరవాత కాలంలో అతి సాగరిక నీలిమను, థాలోసియానిన్ నీలి ను కనుక్కోవడం జరిగింది) తాను తన అదృష్టవశాన కనుక్కొన్న ఈ పద్ధతిని, ఇతరులకు ఎవ్వరికీ తెలియనివ్వక డీస్ బార్ 1724 వరకు ఉంచి, తన లాభానికి మాత్రమే వాడుకొంటూ వచ్చాడు కాని 1720లో ఇంగ్లాండులో జాన్ వుడ్‌వర్డ్ అనే వ్యక్తి ఈ రంగు యొక్క నిర్మాణ రహస్యం ప్రచురించాడు. 1770 నుంచి కళాకారుల వర్ణంగా ఇది వాడుకలోకి వచ్చింది. అప్పటినుంచీ 185

సంవత్సరాలు కళారంగంలో ఇది రాణించగలిగింది ఈ రంగు ఎంతగా శోభావంతమైనా తైలవర్ణంగాగాని, నీటివర్ణంగాగాని దీన్ని ఉపయోగించటంలో కొన్నిచోట్ల కొన్ని వైపరీత్యాలు సంభవించాయి అందువల్ల 1936 మొదలుగా దీనికి బదులుగా చిరస్థాయి చిత్రాల కోసం థాలోసియానైన్ నీలిమను వాడటం ఎక్కువైంది

ప్రష్యన్ నీలిమకు ఎన్నో పర్యాయనామాలు వాడుకలో ఉన్నాయి ఉత్తమ స్థాయికిచెందిన ప్రష్యన్ నీలిమకు చీనీయనీలిమ, మిలోరి నీలిమ, స్టీల్ నీలిమ - అనే పేర్లు వ్యాప్తిలో ఉన్నాయి.

**Prussian brown** : *ప్రష్యన్ కపిశం.*

అపక్షిప్తమైన ఇనుప భస్మం; తైలవార్నీషుల తయారీలో శోషకంగా వాడుకలో ఉన్నది.

**Prussian green** . *ప్రష్యన్ హరితం.*

**psychedelic art** . *మనోదర్శిత కళ; భ్రాంతకళ.*

వర్ణ రూపాలచేతను వర్ణాల చేతను ఉత్తేజితమైన, మనస్సువల్ల స్ఫూర్తిని గ్రహించి రూపొందే అలంకారిక వివిక్త కళ. యల్. యస్ డి. వంటి చిత్తవిభ్రమాత్మకమైన మాదక ద్రవ్యాలను పుచ్చుకొన్న వాళ్ళు ఈ దృశ్యాలను దర్శించగలుగుతారని అంటారు 1966 లో ఈ నూత్న కళాశైలి యు స్టే లో రూపొందించబడింది. నవ్యకళాశైలిలో కనపడే వాటిని దాదాపుగా పోలిఉండి, సుడులు తిరుగుతూ, అక్కడక్కడ పైకి ఉబుకుతూ కరుకుటంచులతో తీరిఉండే వక్రరేఖల్లో మంద్ర వర్ణంలో రూపితములయ్యే ప్రదేశాలు. నీటిపై తైలపటలంలో కనపడే కలలతను స్మృతికి తెచ్చే రేఖారీతులు. దీర్ఘచతురస్రకములు, శాఖాగ్రములు అయిన వివిధ రూపాలు కలగలుపుగా చేరిన రీతులు, కొన్ని సందర్భాలలో వర్ణాడంబరతను వెల్లిగక్కు ముద్దపూతలూ - ఈ మనోదర్శిత కళాసామగ్రి అయిన చిత్రంలో కనపడతాయి ఇందులోని వర్ణాలు స్పష్టమైన మృదుతనకలిగి స్థాయీగుణంగా ఉచ్చతను ప్రవర్తిస్తూ, ఆకుపసిమి, నీలలోహితాలను, తెలుపువాక ఆకుపసిమి రంగులనూ ఎక్కువగా కలిగి ఉంటాయి. అయినా ఒక్కొక్కప్పుడు అత్యుజ్జ్వలములైన రంగులను సాంద్రరీతిలో ఇందులో వాడటమూ జరుగుతుంటుంది.

**psychiatric art** : *మనోవిక్షేప కళ*

ఉన్మత్తతతో బాధపడుతూ, ఉన్మాదవైద్యశాలలో చేర్చవలసినవాళ్ళేగాక తక్కిన విధమైన మానసిక బలహీనులుకూడా మనోవిక్షేపానికి లోనైన వాళ్ళుగా పరిగణనీయులే. ఈ రెండు విధాల వారిలోనూ కొందరిలో అక్కడక్కడ కళాప్రతిభ ప్రకటితం కావటం అనుభవ వేద్యం. అయితే ఇటువంటి వాళ్ళ రచనలు, సాధారణ కళాకారుల రచనలకన్నా ఒక విధమైన విలక్షణత కలిగి ఉంటాయని తగిన ప్రయోగాలవల్ల విస్పష్టమైంది. అంతేగాదు; కొన్నిచోట్ల ఇటువంటి రచనలు ఆయా రచయితల రోగనిదానానికికూడా సాయపడుతున్నాయి.

**psykter : ????కం.**

ప్రాచీన గ్రీకులలో వాడుకలో ఉన్న ఒక విధమైన కూజా. దీనిలో దిగువ భాగమూ పైభాగమూ సన్నగా ఉంది, పొట్ట మాత్రం చాలా లావుగా ఉంటుంది. లోనున్న ద్రవాలను చల్లగా ఉంచటానికి, ఇటువంటి ఆకృతి అభిలషితం. చూ. *Vase shapes*

**puddle : లోహనళని.**

అనుసంధాన ప్రక్రియలో వాడుకలోఉన్న ఒక పారిభాషిక పదం. సుసంధానపు దండ దీపికను ఉపయోగించినప్పుడు లోహం కరిగి, ఏర్పడే చిన్న మడుగుకు ఈ పదాన్ని వాడతారు.

**pulling : లాగివేత.**

అచ్చువని వృత్తిలోను, గ్రాఫికకళలోను, ముద్రాంకనములను తీయటంలో వాడే ఒక పదం. ఒక రుజువును అచ్చువేశారు లేదా తయారుచేశారు అనటం కన్నా, ఒక రుజువును లాగేశారు అనే సాధారణంగా అంటారు

**pulling pliers : లాగుడు గ్రావణం.**

*Streching pliers* అనే పదానికే ఆంగ్ల దేశంలో వాడుకలో ఉన్న రూపం.

**pumice or pumice stone: లావా స్పాంజి**

ఒక తేలికపాటి లేత దూసర పదార్థం. ఇది అగ్నిపర్వతంనుండి ఉత్పత్తి అవుతుంది. చిత్రలేఖనంలో భూమికను కొంత గరుకుగా చేయటానికి దీని పొడిని వాడతారు.

**pumping : చూ : wipin .**

**punch : చిత్రకరి; ఛిద్రకం.**

స్వర్ణరంజితములైన లప్పపు ఫలకాలపైగాని, తోలు వస్తువులపైగాని ఏవో ఆకృతులను, లేదా ఆకృతి భాగాలను ముద్రించటానికి అలంకరణ ప్రక్రియలో వాడే పరికరం. సాధారణపు చిత్రకరి దాదాపు 8 అంగుళాల పొడవుగల ఇత్తడి లేదా ఉక్కుదండం, ఇది మూలంలో లావుగా ఉంది, క్రమంగా చివరకు కొంత లావు తగ్గుతుంది. లావు తగ్గగా ఉన్నవైపున ఉపరితలంలో ఒక రేఖాకృతి అమర్చి వుంటుంది. అలంకరించవలసిన ఉపరితలంపై గట్టిగా ఆకృతి అంటి వుండేట్లు చిత్రకరిని నిలిపివుంచి పైన చిన్న సుత్తెతో తట్టినప్పుడు ఆకృతి ముద్రితమవుతుంది.

**punch'ong : పున్ చోంగ్ .**

మార్తవములను అలంకరించటంలో కొరియాదేశపు కళాకారులు అవలంబించే ఒక విధమైన ప్రక్రియ ఈ ప్రక్రియలో మొదట మార్తవసామగ్రిపై 'యెంగోబి' అనే ఒక విధమైన బంకనీటిని బాగా పట్టిస్తారు. ఈ బంకనీటి రంగు మార్తవపు రంగుకు విలక్షణవర్ణం కలిగి వుంటుంది. ఇటువంటి యెంగోబీ పూతపై ఛిద్రణ ప్రక్రియ (*sgraffito*) వల్లగాని, లేదా ఇనవథస్మానో్, రాగిథస్మానో్ గాని పైపైన పట్టించడంవల్లగాని అలంకరణ సాగిస్తారు.

**punic wax : పూనిక మైనం.**

ప్రాచీనకాలపు దాహచిత్రణలో వాడబడిన, సుసంస్కారితమైన ఒక విధపు తేనెమైనానికి, ప్లినీ అనే ప్రాచీన రోమన్ రచయితా, తదితర రచయితలూ వాడిన పేరు. గ్రీకు రచయితలు కానీ, రోమక రచయితలుకానీ ఎవరూ ఈ మైన మెటువంటిదో వివరించలేదు దీనిలో చేర్చిన పదార్థాలేవి అనే విషయంలో పండితులలో ఏకాభిప్రాయం లేదు ఈ పూనిక మైనమనేది ఈనాటి మేలిరకపు తెల్ల తేనెమైనం తప్ప వేరేదీకాదని ఆధునికుల అభిప్రాయం.

**pure clay : స్వచ్ఛ మృత్తిక.**

**pure colour : స్వచ్ఛ వర్ణం.**

ఒక వర్ణం, లేదా ఇతరమైన ఎటువంటి ఛాయలలో మిశ్రితంకాని ఛాయ. కాంతిపుంజం లేదా వర్ణమాలలోని వర్ణాలే స్వచ్ఛవర్ణాలు. ఇక తక్కిన ఏపూతరంగుగాని. వర్ణద్రవ్యపు రంగుగాని ఏదో ఒకరకపు ఛాయతో మిశ్రణం కాకుండా ఉండనేలేదు. చిత్రణంలో స్వచ్ఛ వర్ణమని పిలిచేదానికి. నాళికనుంచి నేరుగా, వేరుగా దేనితోనూ కలవకుండా, తీయబడి, పలచన చేయటానికి మాత్రం అవసరమైనప్పుడు తెలుపు కలుపుతూ, చిక్కబరచవలసినప్పుడు ఆ నాళికలోని రంగునే మరింతగా కలుపుతూ ఉపయోగించేది అని అర్థం. వర్ణ స్వచ్ఛత అనేది స్వచ్ఛవర్ణంకన్న వేరైనది. వర్ణస్వచ్ఛత అనేది స్పష్టతను తెలుపుతూ వర్ణపు తరగతినిబట్టి మారుతుంటుంది. అధ స్థాయిలో మంజిష్ఠ వర్ణపు స్వచ్ఛత, అది పలచగా ఉన్నప్పుడు మాత్రమే కనపడుతూంది. ఆస్థాయిలోనే జేగురురంగు(*Indian red*)లో స్పష్టత, చిక్కగా ఉన్నప్పుడు మాత్రమే తెలియవస్తుంది. వర్ణద్రవ్య స్వచ్ఛత అనేది, ఆ వర్ణద్రవ్యంలో ఎటువంటి సంకరతకూడా లేదనీ, మలినాలు ఏమీ లేవనీ తెలియజేస్తుంది.

**Purism : స్వచ్ఛతావాదం.**

ఒక కళోద్యమం చిత్రకారుడైన అమేదీ ఓజాన్‌ఫాంట్ (జ 1886) న్నూ వాస్తువిదుడు లే కోర్బుజియెర్ (గార్లెస్ ఎడ్వర్డ్, జీనిరేట్; 1888-1962) న్నూ సంయుక్తంగా రచించి ప్రచురించిన 'స్థూలతావాదం తరవాత' అని అర్థమిచ్చే వివరణ పత్రంలో ఈ వాదం విశదీకరింపబడింది. స్థూలతావాదంలో అతిమాత్రంగా ఆలంకారికతా, ఊహాసౌధకల్పనా చోటుచేసుకున్నవనీ అందువల్ల ఆ పై మెరుగులకు స్వస్తి చెప్పి, స్థూలతావాదపు మూలభావనలలో కొన్నిటిని మాత్రం నిలిపి ఉంచుకొని, సరళతకును, అచ్ఛపు వ్యవహార సరళికిని అందులో చోటు కల్పించాలని స్వచ్ఛతావాదుల సంకల్పం. తమ ఈ ఆకాంక్షలకు సంకేతంగా యంత్రాన్ని కొన్ని సందర్భాలలో వారు వాడారు. స్తబ్ధజీవన విషయాలను తరచుగా రచనావస్తువులుగా వారు గ్రహించారు; స్వచ్ఛవర్ణాలను వాడుతూ, జ్యామితీయంగా సరళతను ప్రాపించిన రూపరేఖలను నిశితములుగ రచించారు. శిల్పిగా ప్రసిద్ధి చెందిన కాన్‌స్టాన్‌టిన్ బ్రాంకుసి (1876-1957) కూడా ఈ స్వచ్ఛతావాదంతో సన్నిహిత సంబంధం పెట్టుకున్నారు.

**purity of colour** : *వర్ణ స్వాచ్ఛత.*

**purity of pigment** : *వర్ణ ద్రవ్య స్వాచ్ఛత.*

**purple** : *ధూమ్ర; కృష్ణలోహిత.*

**purple of Cassius** : *కేసియస్ ధూమ్రవర్ణం.*

బంగారాన్ని, తగరపు క్లోరైడులను అవక్షేపం చేయడంవల్ల లభించే ఒక వర్ణద్రవ్యం. ఇది చాలా మన్నిక గలది మార్తపు ప్రక్రియలలోను, అద్దానికి రంగుపూత వేయటంలోను దీన్ని వాడతారు.

**purple of the ancients** : *ప్రాచీన ధూమ్రం.*

తైరియ ధూమ్రానికి పర్యాయనామం.

**purpurin** : *మంజిష్ఠసారం.*

మంజిష్ఠవు వేరున గర్భితమై ఉండే ఒక వర్ణం సంయోజిత రీతిలోకూడా 1920 ప్రాంతంలో మంజిష్ఠసార రంజకాన్ని రూపొందించారు. కాని దీనికి మన్నిక తక్కువ.

**putto** : *డింభకుడు.*

బొద్దుగా, దిగంబరంగా ఉండే పసివాడు; ఇటువంటివాడి చిత్రం 15 వ శతాబ్దిలోని, పాశ్చాత్య దేశాలలో-అందునా ముఖ్యంగా ఇటలీదేశంలో-కళాకారులచే తరచు చిత్రించబడేది. దేవతాగణానికి చెందిన ఇటువంటి అర్భకుడు చిత్రించబడినప్పుడు, వానిని దివ్యార్భకుడు జ్ఞాన శిశువు (*cherub*) అని వ్యవహరిస్తారు. పాశ్చాత్య చిత్రాలలో మన్మథుని మూర్తికూడా ఇటువంటిఅర్భమూర్తియే, దివ్యార్భకమూర్తిగా కొద్దిమార్పులతో చిత్రితమై కామదేవుడు (క్యూపిడ్) అని వ్యవహృతం.

**putty** : *గారసున్నం.*

**Puzzolan cement** : *పుజ్జోలాన్ సిమెంటు.*

పోర్టులాండ్ సిమెంటుతో పుజ్జోలానాను కలపటంవల్ల ఇది రూపొందుతుంది.

**pyramid** : *పిరమిడు; రాజసమాధి.*

ప్రాచీన ఈజిప్టు దేశంలో రాజుల, రాణుల, సర్దారుల శవాలను భద్రపరుస్తూ నిర్మించిన అత్యున్నతపు సమాధులు పిరమిడులని వ్యవహృతాలు. పృథులమలైన శిలలతోగాని, లేదా ఇటుకలతోగాని ఒక చదరపు భూమిపై క్రమంగా శంక్వాకృతిలో కొనదేలేట్లు పిరమిడు నిర్మాణం జరిగేది. ఈ సమాధిలో కొన్ని ఆచ్ఛాదితాలైన మార్గాలద్వారా చేరటానికి వీలైన గదికూడా ఉంటుంది. ఆ గదిలోనే శవపేటిక భద్రపరచి ఉంటుంది. ఈ పిరమిడుయొక్క తొలిరూపం మస్తబా(చూ.). మధ్య అమెరికాలోని కొన్ని ప్రాచీనపు కట్టడాలుకూడా ఈజిప్టులోని పిరమిడులను పోలిఉన్నవి. కాని అవి సమాధులుకావు. వాటి శిఖరభాగాలలో ఆలయాలు ఉండేవి.

**pyrometer** : *పావకమాపని.*

సాధారణపు పాదరసపు ఉష్ణమాపకపు పరిధికి మించిన ఉష్ణతలను-అంటే కొలిమి, ఆవం, బట్టీవంటి వాటిలోని ఉష్ణతలను-కొలవడానికి ఉపయోగించే ఒక పరికరం. ప్రామాణికమైన పావకమాపని, ఒక ఉష్ణ యుగళంలో ఉండే విద్యున్నిరోధాన్ని కొలిచే పద్ధతిలో, పనిచేస్తుంది చాక్షుష పావకమాపని, ఇంకో రకానికి చెందింది. సరిఅయిన దూరంనుంచి సరిఅయిన కోణంలో, దీన్ని వేడి తగిలిన చోట ప్రసరింపజేసినప్పుడు, నిర్గతమైన కాంతియొక్క సాంద్రతను అది కొలవగలుగుతుంది. ఇక మూడో రకానికి చెందినది వికిరణ పావకమాపని. ఇదికూడా దాదాపుగా రెండోదానిలాగానే పనిచేస్తుంది. ఇదిగాకుండా విద్యుత్‌చే పనిచేయు ఒక బట్టీకి లేదా ఆవానికి సంబంధించినంతవరకు, లోపలనే ఇమిడిఉండి ఉష్ణోగ్రతలోని మార్పులను తెలియజేసే పావకమాపనులూ ఉన్నాయి. ఇవికూడా విద్యున్నిరోధపు మార్పులద్వారానే ఉష్ణతలోని హెచ్చుతగ్గులను కొలపగలుగుతున్నవి.

**pyrometric cone** : *పావకమాపనీ శంకువు.*

బట్టీల, లేదా కొలుములలోని అత్యుచ్చ తాపక్రమాలను కొలవటానికి తగిన పావకమాపని లభ్యం కానప్పుడు వాడే ఒక విధపు మట్టి శంకువు. ఒక్కొక్క శంకువుకు ఒక్కొక్క తీరున వరస సంఖ్య గుర్తించడం జరుగుతుంది. వాటిలో ప్రతిదాని ద్రవీభవన బిందువు అదివరకే గుర్తించబడి ఉంటుంది. ఆ



పావకమాపనీ శంకువులు. ఎడమనుండి కుడికి. నిప్పు రగుల్చకముందు రీతి, ప్రమాణస్థాయి తాపక్రమాన్ని నిప్పు అందుకొన్నపుడు, ప్రమాణస్థాయిని మించినపుడు.

స్థాయిని కొలిమిలోని ఉష్ణత అందుకోగానే శంకువు మెత్తబడి వంగుతుంది. కాబట్టి అంతకంతకు పెరిగిపోయే వరసలో ద్రవీభవన బిందువులున్న శంకువులు ఎన్నో ఒకేసారి అమర్చటంవల్ల వాటిలో ఒక్కొక్కటి వంగినప్పుడల్లా ఆ స్థాయిని ఉష్ణోగ్రత అందుకొన్నదని అర్థం.

# Q

**Quadra** : *చతురస్రకం.*

1. ఒక ఉబ్బెత్తు శిల్పాన్ని చుట్టిఉండేది. ఇది చతురస్రపుకేలిలో ఒక చట్టంలాగా లేదా అంచులాగా ఉంటుంది.

2. శిల్పపట్టిక.

**quadrille paper** : *గళ్ళకాగితం.*

చిన్న చిన్న చతురస్రాలు పక్కపక్కం అంతటా కుదురికొని ఉన్నట్లు మసకగా కనపడుతూ ఉండే కాగితం.

**quadrate** : *వేదికా ప్రాకారం.*

ప్రాకారంలోని భుజాలు ఉత్తరించుకొనే చోట పైన ఒక చతురస్రాన్ని ఆధ్యారోపించటంవల్ల ఏర్పడే రూపం.

**quality** : *నాణ్యత.*

**quartz** : *పలుగురాయి.*

**quarry water** : *శిలాజలం.*

కొన్ని రకాల సున్నపురాలలోను, సికతా శిలలలోను వాటిని మొదట గనినుండి తీసినప్పుడు గర్భితమై ఉండే జలవిశేషం కాలక్రమేణా చెమ్మదనం అంతరించి ఇవి గట్టి పడతాయి.

**quarter round** : *పాదవృత్తిక.*

కుంభాకార వస్తువులో ఒక ఖండం. దీని పార్శ్వభంగిమ పాదవృత్తంలాగా కనపడుతుంది.

**quartz inversion** : *స్ఫటిక విపర్యయం.*

మార్దవములను ఆవంలో కాల్చినప్పుడు, మార్దవపు స్ఫటికాల నిర్మాణకీలో, ఉష్ణప్రభావంవల్ల అక్కడక్కడ కనిపించే మార్పు దానివల్ల కాల్పును ఎంతవరకు, ఏరేటున కొనసాగించాలి, ఎప్పుడు చల్లబరచాలి అనే విషయాలు తెలుసుకొనే వీలుంది

**quattro cento** : *పదునైదవ శతాబ్ది.*

15వ శతాబ్దికోని ఇటాలియన్ కళను తెలియజేయటానికి ఈ పదాన్ని సామాన్యంగా వాడతారు.

**Queen's beasts** : *రాజ్ఞీ మృగాలు.*

ఆంగ్లప్రభుత్వపు రాజలాంఛనంలో రాజ శస్త్ర ప్రతిరూప ధారిణి అయిన ఖేటకాన్ని [డాలును] మోస్తున్నట్లు అలంకారరీతిలో రూపొందించిన పది విధాల జంతురూపాలు.

**queensware** : *భట్టినీ సామగ్రి.*

మీగడఛాయలో ఉండే మృణ్మయ సామగ్రి దీన్ని మొట్టమొదట్లో 1793లో జోసయ వెడ్జ్‌వుడ్ రూపొందించి, ఆనాటి బ్రిటిష్ రాజయిన జార్జి III యొక్క భార్యయు, రాణియునైన షార్లొట్టికి అంకితము చేసి, క్వీన్స్ వేర్ [భట్టినీ సామగ్రి] అని దానికి పేరిడెను. ప్రస్తుతకాలంలో అన్నివిధాల మీగడఛాయ మృణ్మయ సామగ్రికి ఈ పేరే వాడుకలో వుంది.

**quenching** : *దాహోపశమనం.*

మండుతున్న ఒకలోహాన్ని ఒక ద్రవంలో-అయినా ముఖ్యంగా నీటిలో-పడవేసే ప్రక్రియ. ఇది తాపన (*annealing*) ప్రక్రియలోగాని, శామన (*tempering*) ప్రక్రియలోగాని ఒక భాగం కావచ్చు.

**quercitron lake** : *త్వక్‌పీత రంజకం.*

పాతబడిపోయి నేడు వాడుకలో లేని, ఒక పసిమి రంజక వర్ణద్రవ్యం. ఒక విధమైన ఓకుచెట్టుయొక్క బెరడునుంచి దీన్ని తయారు చేసేవారు

**quinarcridone red** · *వంపాన్లూరుజం; పాటలిక.*

ఉజ్జ్వలమై, నీలివాకగానో, గులాబీపెరుపుగానో ఉండే ఒక సంయోజిత కాల్పనిక వర్ణద్రవ్యం దీనికే 'అక్రారెడ్', 'తాలోరెడ్ రోజ్' అనే వ్యాపార నామాలున్నాయి.

# R

**R-A** : *రాయల్ అకడమీషియన్.*

గ్రేట్ బ్రిటన్‌లోని రాయల్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్‌లోని సభ్యుడు. ఆ సభ్యులకు *R A* అనే సంకేతాక్షరాలను తమ పేరుల చివర ఉంచుకొనే అర్హత ఉంటుంది.

**rack** : *కొయ్యకుదురు*

**radiant energy** : *వికీర్ణక శక్తి.*

**radiation** : *వికిరణం.*

**raffia** : *రఫియానార; రంగుతుంగ*

మడగాస్కర్ దీవిలో సహజరీతిలో పెరిగి 'రఫియా' అనే పేరుతో పిలువబడే ఒకవిధమైన తాటిజాతి వృక్షపు ఆకులనుంచి తయారుచేసే నార. దీనిలో ఎక్కువ గట్టితనం ఉంటుంది. దీనికి రకరకాలైన రంగులువేసి, అటువంటి రంగు నారలను కొద్ది ప్రమాణపు కండెలలో బజారులో విక్రయిస్తారు. ఒక్కొక్క కండె ఒక పౌను బరువు వుంటుంది. చాపలను, బుట్టలను, ఇతర విధాలైన కొన్ని అల్లిక వస్తువులను తయారు చేయటానికి దీనిని తరచుగా వాడతారు.

**railway architecture** : *రైల్వే వాస్తుకళ.*

రైలుమార్గముల ఉద్దేశానికి ఉపకరమైనది గాకుండా ప్రోత్సాహజనకంగా ఉండే రీతిలో దానికి సంబంధించిన నిర్మాణాలలో ప్రకటితమయ్యే వాస్తుకళా విశేషం. ఇది బ్రిటనులో ఆరంభమై 1840లో పరాకాష్ఠను అందుకొన్నది. ఇంజనీరింగు (వాస్తు నిర్మాణ) విద్యలో ప్రాయోగానుశీలనమును ఇది ఈ విధంగా అనుగమించింది.

**raku ware** : *రాకూ సామగ్రి.*

16వ శతాబ్దిలో జపనీయ కులాలకులు కొత్తగా రూపొందించిన ఒక విధమైన మృణ్మయ సామగ్రి. ఇది వేడిదెబ్బకు తట్టుకొని నిలువ గలుగుతుంది. అయితే రంగులో, ఆకారంలో క్రమబద్ధత ఉండదు జపాను దేశంలో సంప్రదాయ సిద్ధంగా ప్రతి ఇంటా జరిగే తేనీటివిందుల సందర్భంలో ఇటువంటి సామగ్రిని తరచుగా వాడతారు.

**ramiform** : *శాఖావసరకం.*

కొమ్మనుంచి చిరుకొమ్మలు, లేదా రెమ్మలు పక్కపక్కన అమరినట్లు ఉండే రేఖాకృతి.

**rapid** : తీవ్ర.

**rapidograph** : రేపిడో గ్రాఫ్.

శైలికాలేఖిని (*stylograph*)కి, పర్యాయ పదంగా సుప్రసిద్ధతను ఆర్జించిన ఒక వ్యాపార నామం. (చూ : *stylograph*)

**rasp** : కంటకి.

ఆకురాయివలె ఉండియు, దానివలె చిన్న చిన్న గరుకులనుగాక, వాటిపైన కొద్దిగా యెత్తుగా ఉండే ఇనుప ముండ్లున్న ఉపరితలం కలిగిన ఒక విధమైన పనిముట్టు.




కంటకులు ; A. సుధాపిష్ట కంటకి, B. సర్వసాధక కంటకి, C. విచలిని, D. కాష్ఠ కంటకి E. కాష్ఠ యుగళ కంటకి.

శిల్పంలోను, మార్దవంలోనూ, ముడిరూపాన్ని తయారుచేయటానికి, ఎత్తులను గోకివేయటానికి ఇది వాడబడుతున్నది. అంతేగాక రాయి, సుధాపిష్టం, మట్టి అనే వాటిలో దేనిపైనైనా గీరలు గీయటానికికూడా దీనిని వుపయోగిస్తారు. రెండువైపుల కంటకాలతో రకరకాల పొడవులతో, పదును భేదాలతో వుండే అనేక విధాల కంటకాలు బజారులలో లభిస్తాయి. సుధాపిష్టంపైన మాత్రమే చక్కగా పనిచేసే ఒక ప్రత్యేక కంటకికూడా వుంది. దీనిని గ్రేటరు (ఆఘట్టకము) అంటారు. దీనికికూడా రెండువైపులా కంటకాలు వుండే ఏర్పాటు వుంటుంది. ఒకవైపుననే కంటకాలుండేది కొయ్యను మలచేపనిలో బాగా వుపకరిస్తుంది. ఒకవైపున ఎక్కువ వాడిగల కంటకాలును, ఇంకొకవైపున అంతగా వాడిలేనివీ అమరిన కంటకులూ వుంటాయి.

**aw glaze** : ముడిమెరుగు; అనుద్యుతి.

ప్రస్రావికద్యుతిక ద్రవ్యాలు ఎటువంటివీ చేరని ఒక విధమైన మెరుగు.

**raw sienna** : ముడి స్వీన్నం.

గోధుమవాక పసిమిరంగుగల ఒకవిధమైన మట్టిరంగు ఇనుమూ, మాంగనీజూ చేరి భూమిలో లభించే ఒక తీరు మట్టినుంచి దీనిని తయారుచేస్తారు కళాకారుల రంగులలో ప్రాతిపదిక చిత్రాయులలో ఇది ఒకటి. ముడి స్విన్నం సామికాంత్యభేద్యకమయి తెలుపుతో కలసిన ఛవులలో పసుపు గైరికంకన్నా వర్ణంలో ఎక్కువ సున్నితమైంది కావటంవల్ల శరీరచ్ఛాయలను రూపొందించటంలో ఎక్కువగా పనికి వస్తున్నది. కుంచెపనికి చక్కగా అనుకూలించే తక్కువ ధృతి ఇందులో నెలకొనటంవల్ల దీన్ని తైల

వర్ణంగా వాడేటప్పుడు ఆ వర్ణపు తయారీలో ఒక స్థిరంకారినివాడవలసిన అవశ్యకతఉండదు ముడిస్వీన్నం ఇటలీదేశంలోని టస్కనీ రాష్ట్రంలో, సీనా అనేచోట మొదట్లో దొరికింది. అందువల్ల దీనికి ఇటాలియన్ భాషలో 'సీనా మృత్తిక' అని అర్థమిచ్చే పేరుంది. తప్త స్వీన్నంనుంచి ఇది వేరైనది అని స్పష్టం చేయటానికి ముడిస్వీన్నం అని ఇది వ్యవహృతం. తప్త స్వీన్నమూ, ముడి స్వీన్నమూకూడా ఇటలీయ మృత్తిక (*Italian earth*) అనే సాధారణ నామంతోనే పూర్వకాలంలో వ్యవహారంలో ఉండేవి.

**raw umber** : ***ఆమ తృణమణి; ముడి అంబరు.***

**Rayonnism** : ***రాయవాదం; కిరణవాదం; రశ్మివాదం.***

రష్యన్ చిత్రకారుడు మైకేల్ లారియనోవ్ (1881-1964) ప్రవేశపెట్టిన ఒక చిత్రణ ప్రక్రియ; తత్సంబంధమైన సిద్ధాంతం. నటేలియా గోన్ చరోవా (1881-1962) అనే ఇంకో చిత్రకారుడుకూడా ఈ వాదానికి, తన చిత్రాలద్వారా బలిమి చేకూర్చాడు ఈ వాదపు మూలసూత్రాలను తెలుపుతూ లారియనోవ్ 1913లో ప్రచురించిన వివరణ పత్రంలో, వర్ణవిసరణము అనేది వస్తువునుంచి నిర్గమించే కాంతికిరణాల తీరే అవటం స్పష్టం చేయడం జరిగింది. ఈ విషయాన్నే తన చిత్రాలద్వారా అతడు విశదం చేస్తూ కాంతి పుంజాలు సమానాంతర రీతిలోనో, పరస్పరం ఉత్తరించుకొనే రీతిలోనో ఉన్నట్లు నిరూపించాడు ఈ రాయవాదమే రష్యాలో లట్షిజమ్ అనీ వ్యవహృతం ఈ వాదం అనుభావనావాదపు ఆశయాలపైనే ఆధారపడి, సమకాలీనమైన స్ఫూంతావాద, అనాగతవాదోద్యమాలవల్ల ప్రభావితమైంది 1911, 1914 ల మధ్య లారియనోవున్నూ గోన్ చరోవాయున్నూ ప్రామాణిక రీతిలో అవలంబించిన పెక్కు శైలులలో ఇదికూడా ఒకటి. వారి తక్కిన రచనలు. విషయేతర చిత్రణకు ఆద్యలక్ష్యాలుగా భావించదగునని కొందరి అభిప్రాయం.

**reaction** : ***ప్రత్యాఘాతం; ప్రతివర్తి***

**ready-made** : ***సిద్ధవస్తువు.***

కళాత్మకంగా ఉండాలి అనే దృష్టితో గాకుండా, సాధారణంగా భారీయెత్తున మానవులచే నిర్మితమై, ప్రదర్శితమయ్యేప్పుడు మాత్రం కళాసమ్మత ఒలికేట్లు రూపొందింపజేసే వస్తువు; ఇది ప్రాప్తవస్తువుల కోవకు చెందినది. ఇటువంటి సిద్ధవస్తువులలో మొట్టమొదటిది పింగాణి మూత్రపాత్ర; దానిని నిర్మించినవాడు, దాదా వాదాన్ని రూపొందించిన మార్సెల్ డూచాంప్ 1917లో మూత్రపాత్ర న్యూయార్క్ నగరంలో ప్రదర్శితం.

**realism** : ***వాస్తవికతావాదం.***

1. ప్రకృతిలో సహజసిద్ధంగా కనపడే తీరులో మానవ మూర్తులను, వస్తువులను, దృశ్యాలను, ఏ విధమైన రూపభ్రంశంగాని, శైలీకరణగాని లేకుండా రూపించటం అనేది ఈ వాదపు లక్ష్యం. అయితే, కొన్ని సంద

ర్యాలలో వివిక్తవాద చిత్రణ గాకుండాఉండే ప్రాతికాల్పనిక, లేదా విషయగత చిత్రణకు ఈ పదం ఉపయోగిస్తున్నారు. అయితే పైన పేర్కొన్న వాటిలో రెండవదానిని వాస్తవికతా వాదానికి చెందిందని అనటం కన్నా వాస్తవికతకు చెందింది అనటం ఎక్కువ సమంజసం. విచిత్ర వాస్తవికతావాదపు నేత్ర ప్రతారణపు (*trampe L' oeil*) చిత్రణలో ఈ వాస్తవికావాదంలో ఇతరములుకూడా మేళనం చెందుతాయి. 'సహజతావాదం' అనే పదాన్ని వాస్తవికతా వాదానికి పర్యాయ పదంగా కొన్ని సమయాలలో వాడతారు.

2. క్రీ.శ. 1850 మొదలు 1875 వరకు ఫ్రాన్సుదేశంలో ప్రచలితమైన ఒక కళావాదం. ఈ వాదావలంబకుల చిత్రాల ప్రథమ ప్రదర్శనం 1855లో ఏర్పాటైంది. దానిని ఏర్పాటు చేసినవాడు గస్టేవ్ కోర్బెట్(1819-1877). తాను రచించిన చిత్రాలను ఫ్రాన్సు దేశపు అకాడమీ ప్రదర్శించటానికి నిరాకరించి త్రిప్పివంపగా, అందుకు కుపితుడై, తన చిత్రాలప్రదర్శనను ఆయన ఆవిధంగాఏర్పాటు చేశాడు. 19వ శతాబ్దపు వాస్తవికతావాదం. కాల్పనికవాదులూ నవ్య ప్రామాణికవాదులూ, చిత్రవస్తువును ఆదర్శీకరించటాన్ని నిరసించి- దైనందిన జీవనపు విస్పష్టచిత్రణ చేపట్టి, కొన్నియెడల ఆ వాస్తవిక చిత్రణను తెర మరుగులేని రీతిలో, కొనసాగించింది.

3 చూ· సామ్యవాద వాస్తవికతావాదము. (*socialist realism*)

**realization** : చూ : happening

**recent resins** : అర్వాచీన యక్షధూపాలు.

**recipe** : యోగవిధి.

**reception** : సమాదరణ.

**recession** : అపక్రమణం; రావృతి.

**record** : సంలేఖనం.

**rectangle** : దీర్ఘ చతురస్రం;
ఆయతాస్రం.

**rectilinear** : ఋజురేఖాబద్ధం;
సరళరేఖాబద్ధం.

**red-figured pottery** : శోణమూర్తి కౌలాలం; ఎర్రబొమ్మల మట్టిసామగ్రి.

నల్లని భూమికపై ఎర్రరంగులో రచితమైన చిత్రాలు కలిగి, ప్రాచీన గ్రీసుదేశంలో వాడుకలో ఉండిన మృణ్మయ సామగ్రి. ఏథెన్సు నగరంలో క్రీ పూ. 6 వ శతాబ్ది చివర పాదంలోనే వాటి తయారీ బాగుగా జరుగుతూఉండినట్లుతెలియవస్తున్నది. అంతకు పూర్వం అటువంటి సామగ్రిపై నల్లటి రంగుతో చిత్రాలు[అసితమూర్తిక కౌలాలకం]- అంతగా పరిణతి చెందని శైలిలో-రచించబడుతూ ఉండేవి. క్రీ.పూ 5వ శతాబ్ది మధ్య కాలానికి పీటని అవతల నెట్టి శోణమూర్తిక మైన సామగ్రి ముందుకు రాగలిగింది ఆ అయిదవ శతాబ్ది చరమ భాగంలోనూ, నాలుగో శతాబ్దిలోనూ తెల్ల భూమికపై, ఎర్రటి రంగు

లకు తోడుగా ఇతర సాహాయ్యక వర్ణాలను కూడా క్రమక్రమంగా వాడటం కొంతవరకు అమలులోకి వచ్చింది.

**red indigo :** ***అరుణనీలిక.***

శిలాపఙ్క-జానికి పర్యాయనామం.

**red iron oxides :** ***సిందూర భస్మాలు.***

సహజంగా ప్రకృతిలో లభించే ఎర్రని మట్టిరంగులు. వాటిలో వివిధ పరిమాణ భేదాలతో ఇనుపభస్మం చేరిఉంటుంది, మొత్తం మీద ప్రపంచపు నాలుగు దిశలలో అక్కడక్కడ ఇవి లభిస్తున్నవి. ఇవి అన్నీ దాదాపుగా ఒకే కోవకు చెందినవే. అయినా ఇవి లభించే వేర్వేరు తావులను బట్టి వివిధ నామాలు వాటికి వచ్చాయి. ఉదా: పారశీక సింధుశాఖా సిందూరం, వెనిషియన్ సిందూరం, స్పానిష్ సిందూరం. ప్రాగైతిహాసిక యుగపు గుహాచిత్రాలను వెలయించిన కళాకారులు మొదలుగా 19 వ శతాబ్ది మధ్యకాలం వరకు వర్ణఫలకంలో ప్రాతిపదిక వర్ణాలుగా ఈ సిందూర భస్మాలు రాణించాయి. కాని కాలక్రమాన మెల్లగా వాటిని అవతలకు నెట్టివేసి వాటిలాగానే ఉండే కృత్రిమ వర్ణాలు (ఇండియన్ ఎరుపు, తేలిక ఎరుపు, కుజ శోణిమ) - అంటే అచ్చపు ఇనుప భస్మాలు వాటి స్థానాన్ని ఆక్రమించాయి. ఇట్లా తయారైన అచ్చపు భస్మాలు—ఏకరూపత కల కాంతపతను, ఎక్కువగా ఛాయాపటిమను కలిగి ఉన్నాయి. 1942లో, ప్రామాణిక వర్ణపట్టి నుంచి, ఈ మట్టి ఎరుపు రంగులు-అంటే సిందూర భస్మాలు-తీసివేయబడ్డాయి. ఈ వర్ణద్రవ్యానికి పాతలాటిన్ భాషలో సినోపియా అనేపేరు ఉండేది.

**red lead :** ***సిందూరం; రక్తసీసం.***

సీసపు మోనాక్సైడ్, సీసపు పెరాక్సైడ్ చేరిఉండి, భారవంతమై, కాంత్యభేద్యత కలిగి నారింజ ఎరుపు రంగులో ఉండే ఒక వర్ణద్రవ్యం. తూలికాకర్మకు సరిపడే గుణాలు చాలా తక్కువగా, ఉండి కాంతి తగలగానే నల్లనయ్యే గుణం అధికంగా దీనిలో ఉంటటంవల్ల దీన్ని కళాకారుల వర్గంగా పరిగణించటంలేదు. మానవ నిర్మితాలైన, లేదా కృత్రిమ రీతిలో రూపొందినవైన, వర్ణద్రవ్యాలలో చారిత్రకరీత్యా మొట్టమొదటివాటి కోవకు చెందింది ఈ వర్ణద్రవ్యం. ప్రాచీనులైన గ్రీకులు, రోమనులు ఈ వర్ణద్రవ్యాన్ని వాడారు, ప్లినీ అనే ప్రాచీన రోమన్ రచయిత దీన్ని 'సెకండేరియమ్ మినియమ్' అని పేర్కొన్నాడు. మినియమ్ అనే దాన్ని వాడటంవల్ల దీన్ని అతడూ, అతడి అనుయాయులూ రససిందూరం (పాదరసం, గంధకం చేరిన యౌగికం) అని భావించినట్లు స్పష్టమవుతున్నది. కాని మధ్యయుగాల నాటికి 'మినియమ్' అనేపేరు సిందూరానికే రూఢతను పొందింది గ్రంథాలలో చిత్రణకై ఇది ఆకాలంలో విరివిగా వాడబడింది. వారట్లా 'మినియేర్' అనే పేరున దీన్ని వాడటంవల్లనే, ఆ గ్రంథచిత్రణకు 'మినియేచర్స్' అనే పేరు వచ్చింది. ఈ కాలంలో ఇనుప నిర్మాణాలకు మొదటి పూతగా మాత్రమే సిందూరం పారిశ్రామిక రంగంలో వ్యాప్తిలో వున్నది. దీనికే పాశ్చాత్యలోకంలో వాడు

కలో ఉన్న మరొక నామం. శనిసిందూరం (*Saturnine red*). ఆ పదం ఈ కాలాన వాడుకనుంచి లుప్తమైంది.

**red ocher :** *అరుణ గైరికం.*

ఎర్రని మట్టినుంచి తయారయ్యే ఒక మృద్వర్ణం

**red pigments :** *శోణ వర్ణ ద్రవ్యాలు; ఎర్ర వర్ణ ద్రవ్యాలు.*

శోణ వర్ణ ద్రవ్యాలలో, తైలవర్ణాలకు వాడటానికి పనికివచ్చేవైనట్లు ఆమోదితములై పూతరంగుల ప్రామాణిక పట్టికలో చేర్చబడి, తక్కిన సారణికా చిత్రణలకును సముచితాలుగ భావించబడే : ఇండియన్ ఎరుపు; కాడ్మియమ్ ఎరుపు రంగులు (తేలికవి, మాధ్యమపువి, కపిశవువి). శోణపాటలిక ఎరుపు, మాంజిష్ఠ శోణిమ. సాధారణంగా గోధుమ రంగుల కోవకు చెందినదిగా భావితమయ్యే తప్తస్విన్నాన్నికూడా కొన్ని సందర్భాలలో శోణవర్ణద్రవ్యంగా పేర్కొనటం ఉంది.

**red sable :** చూ : Brush, red sable.

**reducing glass :** *న్యూనక కాచం.*

ఇమిలి పుటాకార కటకపు అమరికతో రూపొందే ఒక చిన్న చేతి కాచం. (భూతద్దానికి ఇది వరావర్తిత రూపం). ఉన్న రూపంకన్నా బాగా చిన్న ప్రమాణంలో ఒక రచనను వెలయించ దలచినప్పుడు, ఆ చిన్న ప్రమాణంలో తన రచన ఎట్లా ఉంటుందో అనే విషయం ముమ్ముందుగనే కళాకారుడు తెలుసుకోవటానికి ఈ కాచం ఉపకరిస్తుంది

**reduction fire :** *న్యూన తాపనం.*

ప్రాణవాయువు బట్టీలోకి వచ్చే అవకాశాన్ని తక్కువచేసి, తద్వారా ఆ వాతావరణంలో ప్రాణవాయువు దాదాపుగా శూన్యమయ్యేట్లు జేసి, ఆ పరిస్థితిలో సాగించిన బట్టీకాలుపు. ఇటువంటి తాపనంవల్ల మార్తవంలో తాను కోరుకున్న వర్ణపరిణామాలను-ఇనుప మెరుగు నుంచి ఆకుపచ్చరంగు వాకలను ధూమ్ర వర్ణాలను, రాగి మెరుగుల నుంచి రుధిర రక్త వర్ణాలను-పొందటానికి మార్తవకారుడికి అవకాశం లభిస్తుంది. అయితే ఈ న్యూనతాపనంవల్ల ఒకే తీరు ఫలితాలు పొందటం సాధ్యపడదు; కాబట్టి వ్యాపారదృష్టితో, భారీ ఉత్పత్తిని సాగించే కులాలకులు, ఆక్సీకరణ తాపనాన్నే ఎక్కువగా అభిమానిస్తారు. ఇది ఎట్లున్నా, కళాదృష్టితో సాగే మట్టిపనిలో, న్యూనతాపనమే ఎక్కువ ప్రయోజనకారి.

**red-yellow half :** *రక్త-పీతార్థం, ఎరుపు-పసిమి సగం.*

(చూ : warm colours)

**reeding :** *నలాలంకృతి.*

ఒక ఉపరితలంమీద రమ్యత పెంపొందించటానికిగాను దగ్గర దగ్గరగా అమరిఉండే రీతిలో, సమాంతరంగా, లేదా దాదాపు సమాంతరంగా, తీర్చిన ఉత్తలపు సన్నటి కమ్మీపని. కార్నీలు మొదలైనట్టి గృహోపకరణాల కాళ్ళను, పాత్ర సామగ్రి యొక్క కుదురును, పై అంచులను అలంకరించటానికి ఈ పద్ధతి వాడుకలో ఉన్నది. (చూ ; *gadroom*) సీతారేఖ అన్నా ఇది వేరైనది.

అక్కడ ఉబ్బెత్తు భాగాలకూ, లోతుగా ఉండే భాగాలకూ సమాన ప్రాముఖ్యం ఉంటుంది.

**refine** : తెరవ వరము; ఆధునవీకరించు.

**reflect** : ప్రతిఫలించు.

**reflected colour** : ప్రతిఫలిత వర్ణం.

ఒక వర్ణంతో ఉన్న ఉపరితలంనుంచి ప్రతిఫలితమై, ఆ వర్ణాన్నే లేతవాటగా కలిగి ఉండే కాంతి; అటువంటిది ఒక వస్తువుపై వడ్డప్పుడు వస్తువుయొక్క వర్ణాన్ని మార్చివేస్తుంది. ఇందువల్లనే తమకై ఒక చిత్రాగారాన్ని నిర్మయించుకొనే సమయంలో అటువంటి దాని నిర్మాణానికై విన్యాసం తయారుచేసేటప్పుడు సమీపస్థమైన చెట్లు, ఇటుక రాతి భవనాలు, ఇటువంటివే అయిన వర్ణరంజిత ప్రదేశాలనుంచి ప్రతిఫలితమయ్యే కాంతి, ఆ చిత్రాగారపు కిటికీలనుంచి పడకుండా చిత్రకారులు జాగ్రత వహిస్తారు.

**reflected light** : ప్రతిఫలిత కాంతి.

ఒక ఉపరితలంనుంచి విపథనం పొందిన కాంతిభాగం. గ్రసితం లేదా ప్రసారితం అయ్యే కాంతికన్నా ఇదివేరైనది. వర్ణరంజితమైన ఉపరితలంనుంచి తెల్లటి కాంతి ప్రతిఫలితమైనప్పుడు, ఆ ఉపరితలపు రంగు లేతవాకగా తెల్లని కాంతికి అంటిఉంటుంది.

**reflective power** : ప్రతిఫలన శక్తి.

**reflectance** : కాంతిపరావర్తనం.

**refraction; refractive index**
వక్రీభవనం, వక్రీభవన గుణకం.

ఒక మాధ్యమంనుంచి ఇంకొక మాధ్యమానికి (ఉదాహరణకు గాలినుంచి పారదర్శకమైన ఒక వర్ణద్రవ్యంలోకి) అసమకోణంలో పయనించే కాంతికిరణం, ఆ మాధ్యమాలు వరస్పరం కలుసుకొనే తలపు ఋజురేఖనుంచి వంగిపోవటం, లేదా విపథనం చెందటం. ఇటువంటి విపథనపు పరిమాణం, ఆ రెండు మాధ్యమాలలో కాంతి కిరణానికి ఉండే వేగాలపై ఆధారపడి ఉంటుంది అందువల్ల సరళరీతిలో చెప్పాలంటే, గాలిలోని కాంతివేగానికీ, నిర్దిష్టమైన పదార్థంలోని కాంతివేగానికీ మధ్య ఉండే నిష్పత్తినే వక్రీభవన గుణకం అంటారు ఒక పూతరంగుయొక్క రంగు విలువను, నిగూహన శక్తిని నిశ్చయించటంలో అందులోని వర్ణ ద్రవ్యానికి, దాని వాహకానికి ఉండే వక్రీభవన గుణకాలు ముఖ్య పాత్ర వహిస్తున్నాయి ఒక వస్తువుయొక్క వక్రీభవన గుణకానికి (వ.గు) దాని వరిసరపు మాధ్యమంతాలూకు అటువంటి గుణకానికి మధ్య ఉండే విభేదం ఎంతఎక్కువగా ఉంటే అంత ఎక్కువగా కాంతి ప్రతిఫలితం కావడమూ, అంత తక్కువగా అది గ్రసితం కావడమూ జరుగుతుంది. అట్లానే విభేదం ఎంత చిన్నది అయితే అంత తక్కువగా కాంతి ప్రతిఫలితం కావడం, అంత ఎక్కువగా అది గ్రసితం కావడం సంభవిస్తుంది. అందువల్ల నిరార్ద్రమైన కోబాల్టు నీలిమ (వ.గు. 1.75) చుట్టూ గాలి (వ.గు. 1.00) చేరి ఉన్నప్పుడు ఎక్కువ కాంతి ప్రతిఫలితం కావటంవల్ల ఆ నిరార్ద్ర వర్ణద్రవ్యం ఒక విధపు పాండురపు

ఛాయనుపొందుతుంది. అవర్ణద్రవ్యాన్నే, అవిసె నూనె (వ.గు. 1.484) తో నూరినప్పుడు, కాంతి తక్కువగా ప్రతిఫలితమై, ఎక్కువగా గ్రసితమవుతుంది. తత్ఫలితంగా ఆ వర్ణ ద్రవ్యం గాఢపు నావిక నీలిమగా కనపడు తుంది. ఒక నిరూఢకితో కలిసిన పిష్టక ములను పిచికారీ చేసినపుడు ఆయా పిష్టకాల పర్ణాలలో వచ్చే మార్పులూ, వార్నిషు చేసిన చిత్రానికి చేయనిదానికిమధ్యకన్పడే విభేదాలూ ఇట్టి వక్రీభవన గుణక వ్యత్యాసాలవల్లనే కలుగుతున్నవని చెప్పవచ్చును.

**refractory** . విప్రతీపం.

మార్తవ ప్రక్రియలోని ఒక పారిభాషిక పదము. కులాల సామగ్రిని ఆవంలో కాల్చే ఉష్ణం, ఆ తావక్రమం కన్నా ఎక్కువ ద్రవీభవన బిందువు కలిగిన ద్రవ్య విశేషానికి ఈ పదాన్ని వాడతారు

**Regence style** : రీజెన్స్ శైలి.

ఫ్రాన్స్‌దేశంలో 1705–1730 వరకు ప్రవర్తిల్లిన కళాశైలి అలంకరణ చిత్రణ దీని లక్ష్యం ఆ కాలంలో రాజు పసి వాడుగ ఉన్నప్పుడు ప్రాతినిధ్య పాలన (రీజెన్సీ సాగింది. దాన్నిబట్టి దీనికి ఈ పేరు వచ్చింది. అయితే ఆంగ్లదేశంలో ఒక కాలంలో రీజెన్సీ శైలి అనేది సాగింది. దానికి దీనితో ఎటువంటి సంబంధమూ లేదు సరికదా, పేరులో అంత్యాక్షరపు ఉచ్చా రణలో విభేదంకూడా ఉంది.

**regency style** : రీజెన్సీశైలి.

ఆంగ్లదేశంలో 1811 మొదలుగా 1830 వరకు ప్రవర్తిల్లిన కళారీతి. ఆకాలంలో 1811–20 వరకు ప్రాతినిధ్య పాలకుడు (రీజెంట్) గాను, ఆ తరవాత యథార్థపు పాలకుడుగాను జార్జి IV ఉన్నాడు. అందు వం ఆపేరు దీనికి కలిగింది. ఫ్రాన్సుదేశంలో 18 వ శతాబ్దిలో ప్రవర్తిల్లిన రీజెన్సీ శైలికి దీనితో ఎటువంటి సంబంధమూ లేదు. (చూ: *(regence style)*.

**register** : రిజిస్టరు, అమరకము.

ఒకరకాల ముద్రాంకాల తయారీలో, ఉప యోగించవలసి ఉండే దిమ్మెలను, శిలాతలాల ఫలకాలను లేదా కౌశేయ తైజసాలనుఏరా పాటులేకుండా ఆయా సమయాలలో సరియైన రీతిలో సరిఅయిన రంగుకు చెందిన దాన్ని వాడటానికి మార్గం సుగమం చేయటానికై (సాధారణంగా కొన్ని గుర్తుల ద్వారా) ఏర్ప రచిన కుదిరిక. ఈ విధంగా వలురంగువేత *(colour run)*ల తర్వాతనే పలువర్ణాం ముద్రాంకనం తయారవుతుంది. (ప్రతి ప్రముఖ వర్ణానికి ప్రత్యేకమైన ఒక ఉపరి తలం ఆవశ్యకం కావటం ఇక్కడ గమనించ వలసిన విషయం) ఈ విభిన్నపు రంగు వేతలు ఒకే కాగితంపై క్రమపద్ధతిలో జరుగు తాయి కాబట్టి ఇవి అన్నీ చక్కగా సమన్వ యం చెంది తుదకు పలువర్ణాల ముద్రాంకనం రూపొందుతుంది. (చూ : *colour prints*). ఈవిధంగా అటువంటి తుది ముద్రాంకనానికి ఆయా ఘట్టాలలో తోడువడ్డ ముద్రణ

తలాలూ, వాటి ముద్రలూ ఒకే రీతిలో వ్యవస్థితములైనప్పుడు వాటిని 'అమరకం' చెందినవి అని అనవచ్చు. ఇటువంటి ముద్రణలో ముద్రాంకం రూపొందవలసిన కాగితాన్ని అన్ని ఘట్టాలలోను ఒకే ఒక స్థానంలో ఉంచి, రంగువేతలను సాగించినప్పుడు మాత్రమే సమగ్రమైన వలురంగుల ముద్రాంకనం ఏర్పడుతుంది. ఇటువంటి పనికి అమరకపు సూచికలు (*guides*) చక్కగా తోడ్పడతాయి.

**register mark; register guide :** *అమరకపు గురుతు అమరకపు సూచిక.*

వలువర్ణాల ముద్రాంకనాల తయారీలో ఉపయుక్తమయ్యే అమరకపు గుర్తులు చిన్న చుక్కలు, వృత్తాలు, సిలువలు, ఈరకమైన ఇతరాలు. కీలకపు దిమ్మె, కీలకఫలకం, లేదా కీలక శిలయొక్క అంచున, లేదా అంచు ఐద్దపై ఈ గుర్తులుంచి మళ్ళీ ఆయా ఫలకాలకు సంబంధించిన వాటిని వాటిపై అటువంటి స్థలంలో ఉంచుతారు. ఈ గుర్తుల సాయంతో ముద్రాపకుడు, తక్కిన రంగువేతలకు ప్రతిబాధకంకాని రీతిలో, ఒక రంగువేతకు సంబంధించిన ఉపరితలాన్ని కుదురుగా అమర్చటానికి సౌలభ్యం కలుగుతుంది. వలువర్ణాల ముద్రాంకనాలకై ఉపయోగించే కౌశేయతైజసములపైకూడా ఇటువంటి గుర్తులను పెట్టటం తరచు జరుగుతుంది. ఇక అమరకపు సూచికలు అనేవి ముద్రాయంత్రంలో అచ్చుదిండులోనే అమర్చిఉండే చిన్న సాధనాలు. ఘట్టముల వరసలో సాగే రంగువేతలలో, అన్నింటా ఒకే ఒక కాగితం నిలకడగా ఉంటుంది కాబట్టి దాన్ని కుదురుగా ఒకే తీరున ఉంచటానికి ఈ సాధనాలు ఉపకరిస్తాయి. శిలాలేఖనంలో, రంగు అమరకానికి కాగితంపైనా, ఆయా ఘట్టాలలో వాడదగిన వేర్వేరు శిలంపైనా, లేదా ఫలకాలపైనా అనుగుణ రీతిలో సిలువ గురుతులు అమరుస్తారు. ఒక ఘట్టపు ముద్రణ తీయవలసినప్పుడు, కొన్ని సూదులను తీసుకొని, ఒక్కొక్క సిలువ గుర్తులోని కేంద్రంలో ఒక్కొక్క దాన్ని గుచ్చి, రాతి తలంలో ఇందుకు అనుగుణమైన రీతిలో అమరిఉండే సిలువల కేంద్రాల రంధ్రాలలో అవి దిగబడేట్లు చేస్తారు.

**regular edition :** *క్రమాగత సంప్రదానం.*

**release agent :** చూ : **parting compound**

**relic :** *అవశేషం.*

**relief :** *ఉబ్బుశిల్పం; నతోన్నత శిల్పం; గండరింపు*

ఒక భూమికను ఆధారంగా గ్రహించి, దానిపైన రూపములు పైకి ఉబ్బుగా వచ్చి ఉండేట్లు సాగిన శిల్పరచనా రీతి. ఆటువంటి రూపములుపైకి ఉబికి ఉండే పరిమాణాలను బట్టి వాటిని వర్గీకరించడం జరిగింది. అధికోబ్బం (*high relief, deep relief, alto relievo*)లో రూపములు, భూమికపై తమ సహజ వృత్తతతో అర్ధభాగం ఎరకైనా,

పైకి ఉబికి ఉంటాయి. అల్పోల్బణ (*low-relief; bas-relief, basso relievo*) లో రూపములు భూమికను గట్టిగా అంటి పెట్టుకొని ఉన్నట్లు కొద్దిగా మాత్రమే ఉబ్బు దేలి ఉంటాయి. (వతకాలలో, నాణెంలో ఇటువంటిది చూడవచ్చు). వీటిలో రూప నిర్దేశంలో వెలుగునీడల మార్పులు ఎక్కువగా చోటు చేసుకుంటాయి. పైన పేర్కొన్న రెండు తీరులకూ మధ్యస్థమైంది. మధ్యమోల్బణం (*demi-relief; half-relief; mezzo relievo*). ఉల్బణం అత్యల్పమై, దాదాపుగా కాగితపు మందాన్ని మించని రీతిలో ఉన్నప్పుడు దానిని నిరుద్ధోల్బణం (*crushed relief; relievo stiacciato,* లేదా *rilievo schiacciato*) అంటారు. ఒక విధమైన వ్యత్యస్తోల్బణంకూడా ఉంది. దానిని నతశిల్పము (*hollow relief*) అంటారు. అందులో రూపాన్ని మలచే రేఖలన్నీ భూమికకు దిగువన లోనిపల్లంలో అమరిఉంటాయి. లోతును వర్తులతయు చేరి కల్గించే ఒక మానసిక వికృతివల్ల అవికూడా పైకుబికిన రూపాల మాదిరిగానే కనపడతాయి. ఈ నత శిల్పానికే గర్భితోల్బణం (*sunk relief*), గుహోల్బణం (*concave relief; cavo-relievo*). అంకిస్తోల్బణం (*incised relief; intaglio relievato*) అనే పర్యాయ పదాలు వాడుకలో ఉన్నాయి. వర్తుల శిల్పమూ (*sculpture in round*) ఉల్బణ శిల్పమూ వేర్వేరు ప్రక్రియలని విధిగా గుర్తుంచుకోవలసిన విషయం.

**relief block printing** : *గండరింపు దిమ్మెముద్రణ; ఉల్బణస్థూణముద్రణ; ఉల్బణ దారుకముద్రణ.*

ఉల్బణ ముద్రాంకనాలను తయారీచేయు పద్ధతులలో దేనికైనా సామాన్య వాచకంగా ఉపయుక్తమయ్యే పదం. (చూ : *relief printing*). ఇటువంటి పద్ధతిలో నేతనేసిన, లేదా రూపొందించిన యే వస్తువునైనా-అది సహజమైనా, చేతయారీదైనా, కట్టబడి అయినా, మలచబడినదైనా-ఒక పలకవంటి దానికి అంటి ఉండేట్లు చేసి, సిరాపూసి, దానిపై దారుఖండ (*wood cut*) పద్ధతిలో చేతితో అద్దకం చేస్తారు. ఒక్కొక్కప్పుడు అద్దకం చేయవలసిఉన్న ఉపరితలంపై కల్పక తుషారపమును పై పూతగా చల్లుతారు. ఇందువల్ల ఆ అద్దకం వేయాల్సినది-గుడ్డ, అట్టా లేదా లప్పం పట్టించిన ఉపరితలాలలో-ఏదైనా అద్దకపు ద్రవపు ప్రభావానికి లోనుగాకుండా ఉండగలుగుతుంది. అంతేకాదు; ముద్రణ పూర్తి అయిన తరవాత దిమ్మెను కడగటం కూడా సులభంగా ఉంటుంది.

సన్నటి తీగలజాలిక సంధింపబడిఉన్న దిమ్మె నుంచిగాని, వాతాతపములకులోనైన కొయ్య దిమ్మెనుంచిగాని నేరుగా అద్దకాన్ని రూపొందించే ప్రక్రియకుకూడా ఈఉల్బణ స్థూణముద్రణ అనే పదం వాడుకలో ఉంది. ఇటువంటి అద్దకపు పద్ధతులు-ఎంత పనితనం కలవేఅయినా-సాంప్రదాయికపు ప్రమాణాల దృష్టిలో అంతగా గొప్పవిగ పరిగణితం కావు. అది ఏమైనా, స్థాయీ తలములను కాంతపములను రమణీయంగా చేయటానికి ఈ పద్ధతి చక్కగా పనికివస్తుంది.

**relief etching** : *నతోన్నత దంశనం.*

ఉల్బణ ముద్రణ నిమిత్తం ఫలకములపై దంశనం సాగించే పద్ధతి (సాధారణపు దంశనం అంతఃపాతిలో సాగుతుంది). కావలసిన రేఖాంకనాన్ని ఒక ఫలకంపై ఆమ్లనిరోధి అయిన వార్నిషులో అలిఖిస్తారు. అప్పుడిక ఆ ఫలకాన్ని ఆమ్లంలో ముంచినప్పుడు వార్నిషు తగలని భాగమంతా దంశితమై వార్నిషు ఉన్నది ఉబ్బెత్తుగా మిగిలి ఉంటుంది. ఈ పాత పద్ధతిని ఈ నడుమ పునరుద్ధరించి యస్ డబ్ల్యు హేటర్, జోన్ స్పైరో అనేవాళ్ళు అంతఃపాతి ముద్రణతో మేళవించి, సరికొత్త ప్రక్రియగ వెలయించారు.

**relief printing** : *ఉల్బణముద్రణ; గండరింపు అచ్చుపని.*

గ్రాఫిక కళలో, ముద్రాంకాల తయారీకి ఉపకరించే మూడు విధాల ప్రముఖ ప్రక్రియలలో ఒకటి. (అంతఃపాతి ముద్రణ, తలలేఖితా ముద్రణ అనేవి తక్కిన రెండు). అచ్చులో పడవలసిన అవసరంలేని భాగాలను ఆ దిమ్మెనుంచిగాని, లేదా ఫలకంనుంచి గాని-మలచిగాని, రేఖాంకనం చేసిగాని, సూచీ ప్రక్రియ అనుసరించిగాని - మరుగుపరచి, అచ్చులో రావలసిన రేఖలూ, తలములూ మాత్రమే ఉపరితలంలో ఉండేట్లు చేసే ప్రక్రియలన్నీ ఈ ఉల్బణ ముద్రణలోకే వస్తాయి. ఒక గండరింపు దిమ్మెకు, లేదా ఫలకానికి సంపర్తినితోగాని, స్పాంజితోగాని సిరాపూసి చేతితోగాని అచ్చుయంత్రపు పొయ్యతోగాని కాగితంపైన దాన్ని ముద్రిస్తారు. దారుఖండ ప్రక్రియ, దారురేఖనం, విలోమముద్రణ, రేఖాయుత అర్ధస్థాయి, కాంతిరేఖా శిల్పం. మధ్యచ్ఛవి, బిందురేఖనం, లినోచెక్కుడు-అనేవి తరచు వినియుక్తములయ్యే ఉల్బణముద్రణ ప్రక్రియలు సూచీ చిత్రణ ప్రక్రియలోను, రేఖాశిల్ప ప్రక్రియలోనూ వాడుకచేసే అంతఃపాతి ఫలకాలకు కూడ, ఒకానొకప్పుడు, సిరా పట్టించి ఉల్బణ ఫలకాలుగ వాడి ముద్రణ సాగించటం కద్దు. అటువంటి సందర్భంలో రేఖాంకితాలు, లేదా సూదికోతకు లోనైన భాగాలు, ముద్రాంకంలో తెల్లటి రేఖలుగానో, తెల్లటి భాగాలుగానో, సిరాముద్ర మధ్యన వస్తాయి.

**religious** : *ధార్మిక; మతవిషయిక.*

**relining** : *పునరాస్తరణ.*

చిత్రాలను పరిరక్షించి భద్రపరచటంలో, చెడిపోయిన లేదా పటిమ కోల్పోయిన కాటకకు అండగా దిగువన, నారగుడ్డనొకదానిని గట్టిగ జతపరచటం. అయితే ఈ ప్రక్రియను పునరాస్తరణ(*relining*) అనటంకన్నా అంతరాస్తరణ (*lining*) అనటమే సముచితం.

**reliquary** : *అవశిష్టిక.*

పవిత్రావశేషములను-ముఖ్యంగా క్రైస్తవాలయాలలో-భద్రపరచటానికి, లేదా ప్రదర్శించటానికి. వినియుక్తమయ్యే కరండకం, మందసం, మందిరం లేదా వేరే విధమైన కోష్ఠకం. మధ్యయుగాలలో ఈ అవశేషాల పట్ల అత్యంత భక్తిభావన ఉండేది. అందువ్ల

వాటినుంచే ఆ శిష్టికలను శిల్ప చాతుర్యం ఉట్టి పడేట్లు కుశలతతో నిర్మించేవారు. వాటిపై అలంకరణకు బంగారాన్ని, అమూల్య రత్నా



అవశిష్టిక : ఫ్రాన్సుదేశమునందలిది (16 వ శ.); కొయ్యపలకపై వెండిరేకునతికి తయారు చేసినది.

లను వాడి, చక్కగా చిత్రించడమో, మలచటమో మణికాచీకరించటమో జరిపేవారు. ఇటువంటి అవశిష్టికలలో అనేకాలు అల్ప ప్రమాణపు భవనాలనుకూడా పోలిఉండేవి. కొన్నిటిని అందులో ఉంచే అవశేషపు రూపంలోనే నిర్మించేవారు. (ఈ అవశేషం ఒక క్రైస్తవ ఋషికి, లేదా త్యాగజీవనునికి చెందిన ముంజేయో, వ్రేలో అయి తరచుగా ఉండేది).

**remarque; remarque proof** : సూచకం; సూచకపు రుజువు

సూచీ చిత్రణ ప్రక్రియలో రుజువుయొక్క కడఅంచులో గీసివుండే ఒక పాండులేఖనం. ఒక రుజువున ఇది వున్నప్పుడు దానిని సూచకపు రుజువు అని వ్యవహరిస్తారు. పెద్ద ఆలేఖనాన్ని ఫలకంపై గీసేటప్పుడే, ఈ సూచకాన్నికూడా ముందుగా కళాకారుడు పలకపు కడఅంచులో లిఖిస్తాడు; పెద్ద ఆలేఖనంలో ఒక మెట్టునుంచి ఇంకొక మెట్టానికి సాగుతున్నప్పుడు, దానికి అవసరమైన సవరణలనుచేయుటాకిన్నీ, ఆమ్లపాత్రలో మొత్తం ఫలకాన్ని ముంచటానికి ముందుగా క్షయకరిపజ్ఞ కలిగిన ద్రావణపు పరిమితిని అర్థం చేసుకోవ



సూచకం : ఫెలిక్స్ బువోట్ [1847-1898] తీసిన రుజువు కడయంచునందలి పాండులేఖనం కుడివైపున కననగును.

టానికిన్నీ, ఈ సూచకం సహాయపడుతుంది. పలకపు తుది పరిష్కారపు సమయంలో, రుజువును తీయటానికి ముందుగా ఇటువంటి సూచకాన్ని తేజకంతోగాని లేదా నిర్ఘర్షిణితో గాని గోకివేయవచ్చు. అయినా అటువంటి పరిష్కరణకు పూర్వం తీసే పూర్తి రుజువులలో దీని ముద్ర కనబడుతూనే ఉంటుంది. కొందరు తుదిపరిష్కరణ కాలంలో సైతం దీనిని గోకివేయకుండా వుంచుతారు. 19వ శతాబ్దంలో, ఇటువంటి సూచకాలను గోకివేయకుండా పలకపు ముద్రాంకంలో వదలిపెట్టటం తరచుగా పరిపాటి అయింది. అందునా ముఖ్యంగా ప్రాదేశిక చిత్రాలకు, సాగరికచిత్రాలకు పలకంలో ఇటువంటి సూచకాన్ని ఉంచటం దాదాపుగా తప్పనిసరి అయింది.

**Rembrandt blue** : రెంబ్రా నీలిమ.

తాలోసియానైన్ నీలిమకు పర్యాయ నామం.

**Rembrandt green** : రెంబ్రా హరితం.

తాలోసియానైన్ హరితానికి పర్యాయ నామం.

**Rembrandt's ground** : రెంబ్రా భూమిక.

సూచీ చిత్రణ ప్రక్రియలో ఏర్పరచే ఒక భూమిక. ఈ భూమిక తయారీలో తేనెమైనాన్నీ, కొన్ని విధాలైన యష్టభూపాలను ఉపయోగిస్తున్నారు. ఆయా ద్రవ్యాలను ఏయే నిష్పత్తులలో కలపాలి అనే విషయంలో అభిప్రాయ భేదాలు ఎన్నో వున్నాయి దీన్ని మొదట కనిపెట్టినవాడుగా భావించే రెంబ్రాంట్ ఈ విషయమై ఏమీ చెప్పలేదు, దాన్ని అతడే కనుగొన్నాడా అనే విషయంకూడా వివాదాస్పదమే యథార్థానికి రెంబ్రాయొక్క పేరుతో వ్యవహారంలో ఉన్న ఈ భూమిక 18వ శతాబ్దానికి పూర్వమున వాడుకలో వున్నట్లు కనపడదు. ఈ భూమిక తయారుచేయటానికి ఈనాడు సైతం ప్రతి కళాకారుడూ తనకు నచ్చిన నిష్పత్తిలో తేనెమైనాన్ని, యష్టభూపాన్ని మేళవిస్తున్నాడు.

**Renaissance** : పునరుజ్జీవనం.

పశ్చిమ యూరపీయ చారిత్రక, సాంస్కృతిక యుగాలలో, తక్కిన వాటిలో దేనితో పోల్చినా, కాలవిస్తృతిలో తక్కువదే అయినా వస్తుతః అసామాన్య ప్రాముఖ్యాన్ని గడించిన ఒక యుగం ఈ పేరిట వ్యవహృతం. మధ్యయుగం ముగియగానే ఆరంభమైన ఈ యుగం, ఆధునిక యుగ భావనలకు నాంది పలికిందని భావించవచ్చు. ఫ్రెంచి భాషలో 'రినైజాన్స్' అనే పదానికి 'పునర్జన్మ' అని అర్థం. అట్లా అనటంవల్ల అంతకు పూర్వపు యుగంలోని కళ రూపుమాసిందని అర్థంకాదు. పునరుజ్జీవనమంటే, ప్రాచీన గ్రీకుల, రోమనుల కళారీతులు, ఈ పునరుజ్జీవన యుగంలో పునరుద్ధరితాలైనవి అని మాత్రమే ఈ పదానికి అర్థం. ఆ ప్రాచీనుల మానవుజ్ఞ తమ అనుశీలనకు ధ్యేయంగా గ్రహించారు. పునరుజ్జీవన యుగానికి సన్నిహిత పూర్వకాలంలో

ఆ ప్రాచీనుల లక్ష్యమే - 'మానవతావాద' మని చెప్పబడే-తాత్త్విక చింతనలో రూపు గొన్నది. ఇక అప్పటినుంచి లౌకిక జీవనంలో వ్యక్తికి ఉండే ప్రాముఖ్యం వెలుగులోకి వచ్చింది.

పండితులు-అంటే కళేతిహాసికులతో సహా అందరూ విద్వాంసులూ-పునరుజ్జీవన యుగం ఎప్పుడు మొదలైంది అనే నిర్దిష్టపు తేదీని గురించి విభిన్నాభిప్రాయాలు వెల్లడించినా, ఫ్లారెన్సు నగరంలో క్రీ శ. 1400 లో ఈ యుగం ప్రారంభమై, మైకేలేంజెలో(1475-1564) మరణం వరకూ-లేదా వెనిస్ నగరానికి సంబంధించినంతవరకు టిన్‌టోరెట్టో (1518-1594) మరణం వరకూ-కొనసాగిందని స్థూలంగా చెప్పవచ్చు. కొందరు ఈ యుగము జియాట్టో బోండేన్(1267?-1337) అనే కళాకారుని రచనలతో ఆరంభమయిందని భావిస్తారు. ఈ యుగంలో చిత్రకళ సాంకేతికంగాను, సౌందర్య స్ఫోరకంగాను పరాకాష్ఠను పొందిన ప్రత్యేక కాలాన్ని (1500 మొదలుగా ఇంచుమించుగా 1580 వరకు) అత్యుచ్ఛ పునరుజ్జీవనం (***High Renaissance***) అని తరచుగా వ్యవహరిస్తారు.

ఈ యుగం ఉత్తర యూరపులో కొంత ఆలస్యంగా మొదలైంది. అక్కడ మధ్యయుగపు చిత్రలేఖనసంప్రదాయాలు మరికొంత కాలం నిలుపదొక్కుకొని ఉండగలిగాయి. అయినా ఫ్లాండర్స్‌లో జాన్ సోదరుల(1385-1441) కృషివల్లనూ, హాలండులో హూబర్ట్ ఫాన్ ఐక్ (1370-1426) వల్లనూ పునరుజ్జీవన సంప్రదాయం ఆ రెండు దేశాలలోను చోటు చేసుకోగలిగింది. ఆ సంప్రదాయంలో అందరికన్నా చివరివారుగా చెప్పదగినవాడు పీటర్ బ్రూగెల్ [పెద్ద] [1525-1569]. అయితే కొందరు ఆ రెండుదేశాలలోను 15వ శతాబ్దిలో వ్యాప్తి పొందిన చిత్రణరీతిని 'మధ్యయుగ భావనల పరిపూర్ణ వికాసం' మాత్రమే అని అంటారు. ఇక జర్మనీ దేశంలో పునరుజ్జీవనం అల్బ్రెర్ట్ డ్యూరర్[1471-1528]తో మొదలైంది. అప్పటినుంచీ ఆ సంప్రదాయం ముఖ్యంగా వాస్తువులో, 17వ శతాబ్ది మధ్యవరకు అక్కడ వర్ధిల్లింది. ఇంగ్లండుకు పునరుజ్జీవన సంప్రదాయాన్ని తీసుకొని వచ్చినవాడు హాన్స్ హోల్‌బీన్ [కనిష్ఠుడు] [1498-1543] అనే జర్మన్ చిత్రకారుడు. అయినా ఆ దేశంలో వాస్తువులో మాత్రం 1600 వరకు పునరుజ్జీవన సంప్రదాయం ప్రవేశించలేకపోయింది. ఆ తరవాత అక్కడనుంచి 18వ శతాబ్ది మధ్యభాగంవరకూ వాస్తువులో సైతం ఆ సంప్రదాయం మిక్కిలి వికాస దశకు చేరింది.

మొత్తంమీద పునరుజ్జీవన ఫలితంగా చిత్రలేఖనంలో సాంకేతికంగా ఎక్కువ పురోగతి చేకూరింది. అందుతో పాటుగా తక్కిన కళలలోను సరికొత్త విధానాలు రూపొందాయి. యాంత్రిక కళలలోను, నిర్మాణ కృషిలోను, అంతర్జాతీయ వ్యాపారంలోను రాకపోకల సంబంధాల విషయంలోనూ ఎక్కువ అభివృద్ధి కలిగింది; రాకపోకల సౌకర్యం బాగా వృద్ధి చెందినందువల్ల రక

రకాల వస్తువులను సంపాదించటం సులభమై, నిర్మాణప్రక్రియలలో కొత్తవానినిరూపొందించటానికి అవకాశం కలిగింది. ఇటలీదేశంలో ఈ కాలంలోనే రేఖాగత దృష్టి ప్రక్రమగతి ఆవిష్కృతమైంది. అప్పటినుంచి దానిని ఎన్నో రీతుల అభివృద్ధి చేయటంలో చిత్రకారులేగాక వాస్తువిదులుకూడా పాల్గొన్నారు. ఇటువంటి కృషికి శ్రీకారం చుట్టినవాడు ఫిలిప్పో బ్రూనెలెస్కి [ర, 1377-1446] ఆ తరవాత ఆ కృషిని ముందుకు తీసుకొనిపోయినవాళ్లు; లియోనీ బట్టిస్టా ఆల్‌బెర్టి [1404-1472], పావ్‌లో ఉచ్చెల్లో ['396/7-1475], పియెరోడెల్లా ఫ్రాన్‌సెస్కా [ర 1420-1492]. 15వ శతాబ్దిలో వెనిస్ నగరపు చిత్రకారులు తైలవర్ణ చిత్రణకు పరిపుష్టతను చేకూర్చడంతో చిత్రలేఖన సాంకేతిక రీతి చరిత్రలో ఒక నూత్నాధ్యాయం మొదలైంది (చూ: *oil painting, development of*). లియొనార్డో డా వించి [1455-1519], చిత్రలేఖనంలో వెలుగునీడలచిత్రణను మొట్టమొదటిసారిగా ప్రవేశపెట్టాడు. ఈ యుగంలో పేరు ప్రఖ్యాతులు ఆర్జించిన ప్రముఖ చిత్రకారుల కోవకు చెందినవారే, సాండ్రో బొత్తిసెల్లి [ర. 1445-1510], రేఫేల్ సాంజియో [1483-1520) చిత్రలేఖన ప్రక్రియలో ఆ యుగంలో సాధితమైన వాటిలో-లౌకిక రూపచిత్రణ, ప్రాదేశిక చిత్రణ ప్రముఖమైనవి. ఇందులో మొదటిదానిని ఇటలీదేశం, రోమనుల కాలంమొదలుగ కనీవినీఎరగదు. ఈ యుగంలో 15 వ శతాబ్దపు ప్రథమ పాదంనుండీ కాగితపు ఉత్పత్తి విరివిగా సాగటంవల్ల-దారుఖండనాలు, రేఖాశిల్పం, సూచీచిత్రణ వంటి పద్ధతుల సాయంతో-ముద్రాంకాల తయారీ ఒక ప్రముఖ కళాకృషిగ లెక్కలోకి రాగలిగింది.

మానవరూపపు బాహ్య సౌందర్యాన్ని రూపించే విషయంలో ప్రాచీనకాలపు గ్రీకులు వహించిన వైఖరి, ఈ యుగంలో శిల్పంలో పునరుద్ధరణ పొంది, గణనీయ విజయాలను సాధించింది. ఇటువంటి శిల్పానికి వైతాళికుడు డొనాటెల్లో [ర. 1386-1466]. అతడి శిల్పం ప్రభావానికి అతని సమకాలికులుకూడా ఎంతగానో గురి అయినారు. ఇటువంటి శిల్పకృషి మైకేల్ ఏంజెలో నిర్మించిన మహనీయ చంద్రశిలా రూపశిల్పాలలో పరాకాష్ఠ అందుకొన్నది.

**rendering** : *వర్ణాలేఖనం.*

వాస్తువిదుడు తయారుచేసి ఉంచే, సవివరము, దోషరహితము అయిన ఆలేఖనం. ఒక భవనం లేదా వేరొక రచనావస్తువును గురించి తనకున్న యోజనలను, అధ్యయత్తులకు (*clients*) తెలియజేయటానికి దీన్ని వాస్తువిదుడు తయారుచేస్తాడు. చూసినంతటిలోనే ప్రేక్షకుడి మనస్సును లోగొనేంత రమ్యరీతిలో దీన్ని తయారుచేయటం అతని లక్ష్యం. ఇందుకోసం నీటిరంగు ఛాళకాలను అతడు వాడతాడు అటువంటి వర్ణాలేఖనంలోచూపే భవనపు ఆలేఖనంలో సైతము చక్కటి ప్రాదేశిక రీతి కుదురుకొనేట్లుగా అతడు చూపిస్తాడు.

**repaint** : పునశ్చిత్రితం.

పూర్వపు రంగుపూత దెబ్బతిన్నప్పుడు, దానిని అంతశ్చిత్రణతో పునరుద్ధరణ చేయగా కనపడే రూపుకు వాడే పేరు

**repeat glass** : బహుముఖ కాచం.

ఇది ఒక పరికరం. ఒక చతురస్రపు చట్టంలో నాలుగు దీర్ఘ చతురస్రాకారపు కటకాలను అతి సన్నిహిత రీతిలో అమర్చగా ఇది రూపొందుతుంది. ఒక రూపరేఖని దీనితో చూచినప్పుడు దాని ప్రతిబింబం నాలుగు రీపులుగా ఇందులో కనపడుతుంది. జవుళి సరకులను, అటువంటివే అయిన ఇతరమైనటువంటి వానియందలి నేతలోని ఆమ్రేడిత వ్యూహనములను రీతికారకులు, పరిశీలించటానికివి తోడ్పడుతుంది. సాధారణంగా దీని విస్తృతి 7 × 7 అంగుళాలుంటుంది.

**replica** : అనుకృతి.

లలిత కళలలో, ఒక తొలిరచనకు చేసే అచ్చపు ప్రతికృతి లేదా నకలీపని ఇది ప్రమాణంలో, మాధ్యమంలో, తొలిరచనయొక్క అడుగుజాడలనే అనుసరిస్తుంది. ఆ రచనను రూపొందించిన కళాకారుడివల్లనే రచితమవుతుంది. (ఒక్కొక్కప్పుడు ఆ కళాకారుడి పర్యవేక్షణక్రింద వేరొక కళాకారుడు ఆ అనుకృతిని రచించటంకూడా ఉంది). ఇటువంటి అనుకృతి, తొలిరచనతో సమానమైన ప్రతిపత్తి కలదిగా సంభావితం; అయితే కొన్ని సమయాల్లో, తొలిరచనకు ఆరచన చేసిన కళాకారుడుగాక వేరొక కళాకారుడు స్వయంగా అటువంటి మాధ్యమంలోనే రచించే ప్రతికృతికికూడ, అర్థరహితంగా, అనుకృతి అనే పదాన్ని వాడటం ఉంది. (చూ : *Copy; Original; Reproduction.*

**repository** : కోష్ఠకం.

**repoussage** : ప్రణోదనం.

సూచీ చిత్రణంలో, రేఖాశిల్పంలో, ఉపయోగించే రాగిపలకపు ఉపరితలంలో అనవసరంగా మిగిలిన గుంటలవంటి వాటిని చక్క చేయటానికి ఉపయోగించే ప్రక్రియ. (ఒక పలకాన్ని చక్కదిద్దటానికి, లేదా సంస్కరించటానికి తేజకాన్ని వాడినప్పుడు చిన్న గుంటలు ఏర్పడి, ముద్రణలో అవి సిరామచ్చలుగా రూపొందే ప్రమాదం ఉంది). ప్రణోదనంలో, రాగిపలకాన్ని బోర్లగిల ఉంచి, గుంటయొక్క వెనుక భాగాన్ని చిన్న సుత్తెతో తట్టి, రేకును చదునుచేయటం జరుగుతుంది. రిపౌశేజ్ అనేది ఫ్రెంచిపదం; వెనకకు తోయటం, లేదా నెట్టటం అని దాని అర్థం.

**repousse** : శిరోఘట్టన ప్రక్రియ

లోహాలంకరణ శిల్పంలో వాడుకలోఉన్న ఒక ప్రక్రియ. రేకును బోరగిలవేసి, తిరస్తలంలో తగిన రీతిలో సుత్తెతో తట్టి అలంకృతులను ఉబ్బుగా రూపిస్తారు. కొన్ని సందర్భాలలో, అదివరకే కావలసిన అలంకృతులను ఒక కొయ్యపై అంతఃగాత రీతిలో మలచి ఉంచి, అటువంటి కొయ్యమీద రాగి

రేకును బోరగిల ఉండేట్లు వేసి తిర స్తలాన్ని తట్టినప్పుడు ఆ ఆకృతులు, ఉబ్బెణరీతిలో రాగిరేకుమీద వచ్చేట్లు కూడా చేస్తారు. అట్లా తయారైన అలంకృతులకు, ఉపరితలంలో అనుధావనం పొగించి నగిషీ చెకుతారు. లోహ నిర్మితమైన సామగ్రిని-అందునా ముఖ్యంగా వెండి సామగ్రిని-సమలంకరించటానికి దీన్ని తరచుగా వాడతారు. శిల్పులు లోహపు రేకులనుంచి - అందునా రాగిరేకులనుంచి-ఉబ్బెణ శిల్ప ఫలకాలను రూపొందించటానికి దీని వాడతారు

**representattional** : *ప్రాతికాల్పనిక.*

**representational art** : *ప్రాతికాల్పనిక కళ; ప్రాతినిధ్యకళ.*

దృశ్యములైన వస్తువులను, ఆకృతులను లేదా ప్రకృతి విశేషాలను సాదృశ్యం ఉట్టి పడేట్లుగా రూపించే కళావిశేషం; అవస్తుగత, కళ లేదా వివిక్త కళలకు ఇది వేరైనది.

**reproduction** : *పునరుత్పాదనం; ప్రత్యుత్పాదనం; పునఃకల్పన.*

కళాకృషికి ఫలితమైన ఒక మౌలికరచనకు లేదా ఛాయాచిత్రానికి ప్రతికృతి, సాదృశ్యం, అనురూపం; తొలుత రచించిన మాధ్యమంలోనే ఇది రచితం కావాలి అనే నియమం లేదు; వేరే మాధ్యమంలో సైతం రచించవచ్చు; కాని మొదటిసారి ఈ రచనను రూపొందించిన కళాకారుడుగాక, ఇంకొకరు దీనిని రూపొందిస్తారు. (చూ : *Copy; Original; Original print; Replica*)

**repugnant** : *హేయం.*

**reserve** : *అలిప్తం.*

1. అలంకరణ కళలలో, అలంకృతమయ్యే వస్తువులో, అలంకృతికి లోనుగాక, ఉపరితలపు తొలుతటి రంగును, లేదా భూమిక యొక్క రంగును మాత్రమే ప్రదర్శించే ప్రదేశం. ఒక మృత్పాత్రకు మెరుగు పూతను పట్టించినప్పుడు, ఆ పూతను పట్టించకుండా వదలిన భాగాలను ఇందుకు ఉదాహరణలుగా పేర్కొనచ్చు. ఇటువంటి ప్రదేశాలలో మృద్విశేషపు తొలుతటి రంగే స్పష్టంగా కనపడుతుంటుంది. ఇటువంటిదే అలిప్తం.

2. సంక్షిప్తముద్ర, బీజాక్షరి, లేదా అద్యక్షరి అనే వాటిలో ప్రతిదానికి చుట్టు పరిధిగా గీయబడే రేఖ.

**residue** : *అవశేషం.*

**resilient** : *ప్రతిఘాతక.*

**resin** : *యక్షధూపం.*

అస్ఫటిక రీతిలో, నిర్దిష్ట రూపరీతి లేకుండా కుదురుకొని, పారదర్శకంగానో, కాంత్యభేద్యంగాగానో ఉండే కర్బనీయ ఘన పదార్థం. చల్లని బాష్పశీలక ద్రావణంలో వేసి ఉంచినప్పుడైనా, లేదా వేడివల్ల ద్రవీభూతం అయినప్పుడైనా ఇది కరగుతుంది. అట్లా

లభించే ద్రవాన్ని వార్నిషులోను, ఇతర పై పూత ద్రవ్యాలలోను వాడతారు. కొన్ని ఘనయోగికాలలో యక్షధూపాలను కలిపి, కాచి, ఒకే ఒక పదార్థంగాకూడా చేసే వీలున్నది. యక్షధూపాలు చాలా రకాలు. రంగు, వాసన, ద్రావణీయత, కఠినత మొదలైన లక్షణాలు ఒకదానిలో ఉన్నట్లు ఇంకోదానిలో ఉండవు వాటి ఉత్పత్తి స్థానాలను బట్టి యక్షధూపాలను ప్రాకృతికములు (*natural*), సంయోజితములు లేదా కృత్రిమములు (*synthetic; or artificial*) అని విభజించవచ్చు.

కొన్ని జాతుల వృక్షాలనుంచి వచ్చే నిర్యాసాలను ఘనీభూతములుగా చేసినప్పుడు ప్రాకృతిక యక్షధూపాలు లభిస్తున్నాయి. వీటిలో సజీవంగా ఉన్న చెట్లనుంచి సేకరించిన వాటిని అర్వాచీన యక్షధూపాలు అంటారు. ఇట్లాకాక ఏనాడో చెట్లనుంచి వెలువడి ఘనీభవించి, ఆ చెట్లు అంతరించినా అవి అంతరించిపోక, నదీప్రవాహాలలో చేరి, ఇదివరకు నదీశయ్యలలో మరుగుపడి ఉండి, తరవాత త్రవ్వకాలవల్ల ఆచోట్లలో లభించే వాటిని శిలీభూత యక్షధూపాలు అంటారు ప్రాకృతిక యక్షధూపాలలో చాలామందికి సుపరిచితంగా ఉండేవి. తృణమణి (*accroides*), అంబరు (*amber*; కోపలం (*copal*); డంబరు (*dambar*); యెలేమీ (*eleme*); యస్టరు గంత (*ester gum*); కౌరీ (*kauri*); మనీలా కోపలం మాస్టికం (*mastic*); రోచని (*rosin*); సందారకం (*sandarac*); లక్క (*shellac*). వీటిలో చివరది కొన్ని కీటకాల వల్ల తయారవుతుంది.

సంయోజిత యక్షధూపాలనబడేవి ఆధునిక రసాయనశాస్త్ర కృషివల్ల రూపొందినవి. యక్షధూపపు ధర్మాలు కలిగిన సంయోజిత కార్బనిక యౌగికాలే ఇవి. అంటే రూప విశేషంలోనేగాక, క్రియానిర్వహణ రీతిలో సైతం యక్షధూపాలుగానే ఇవి వర్తిస్తాయి. అయితే ఇవి ప్రాకృతిక యక్షధూపాల కన్నా ఎక్కువగా ఏకరూపత కలిగి, స్వచ్ఛతను, మన్నికను, ఒదుగుపాటును, రసాయన ప్రతిఘటనను ఎదుర్కొనే శక్తిని అత్యధికంగా ప్రదర్శిస్తాయి పారిశ్రామిక రంగానికి సంబంధించినంతవరకు, వాటి ఉత్పత్తులలో, ప్రాకృతిక యక్షధూపాలకు బదులుగా సంయోజితమైన సర్వసాధారణంగా నేడు వాడుతున్నారు. కాని కళారంగంలో మాత్రం కళాకారుని రంగులలో, సంయోజిత యక్షధూపాల వాడుక చాలా తక్కువ. కళాకారులు వాడే మృదు ద్రావణాలలో ఈ సంయోజిత యక్షధూపాలు కరగవు. వాటిని కరిగించటానికి పటిష్ఠ ద్రావణాలు కావాలి. అటువంటివి త్వరగా ఇగిరిపోవుటయేగాక విషపూరితాలు లేదా దుర్గంధ సహితాలూ అయిన వాయువులను వెలువరిస్తాయి. ఈ సంయోజిత యక్షధూపాలుకూడా ఎన్నో కుటుంబాలుగా వాటి ఉత్పత్తులనుబట్టి, విభాగం పొందాయి. ఆ కుటుంబాలలో, చిత్రణకూ, శిల్పానికి ఉపకరించే పూతరంగుల తయారీలో ఈ కింది కుటుంబాలున్నాయి: అక్రిలేయ (మెథాక్రిలేట్) యక్షధూపం; ఆల్కిడ్ యక్షధూపం; పాలియస్టరు యక్షధూపం; వినైల్ యక్షధూపం; మెలామైన్ యక్షధూపం; ఫెనోలిక యక్షధూపం; పాలీస్టయిలేను; యూరియా-

ఫార్మాల్డిహైడ్ యక్షదూపం. ఒక సంయోజిత యక్షదూపాన్ని దాని ఘనస్థితిలో, ఏదైనా వస్తునిర్మాణానికిగానీ, లేదా రచనకుగానీ వాడినప్పుడు దానినే కల్పకం(*Plastic*) అనీ వ్యవహరిస్తారు. ఒత్తిడికి, ఉష్ణతకు లోనైనప్పుడు ఆయా యక్షదూపాలు వ్యవహరించే తీరునుబట్టి వాటిని అన్నిటిని స్థూలంగా తాపకల్పకాలు (*Thrmoplastic*) తాప ఘనాలు (*Thermo-setting*). అనే రెండు వర్గాలుగా విభజించారు. సెల్యులోజ్ పాలిమర్లు, సెల్యులోజ్ యసిటేట్, సెల్యులోజ్ నైట్రేట్,ఎథిల్ సెల్యులోజ్ అనేవి ఒకసహజ సిద్ధమైన ద్రవ్యంనుంచి రూపొందింపబడేవే కావడంవల్ల వాటికి సంయోజిత యక్షదూపాలనేపేరు లాక్షణికంగా ఏరీతిగను అనువర్తించకపోయినా వానినికూడాసంయోజితాలుగానే పరిగణించటం, పరిశీలించడం జరుగుతున్నది. ఒక కృత్రిమ యక్షదూపంలో, స్వతస్సిద్ధంగా ఉండే గుణవిశిష్టత ఏమీ లేదు. ఇంకో యక్షదూపపు లక్షణాలను అది సంతరించుకోవాలంటే, దానితో వివిధ ఇతర ద్రవ్యాలను కలపవలసి ఉంటుంది. అట్లా కలిపే వాటిలో కొన్ని ప్రాకృతిక యక్షదూపాలు ఉండవచ్చును; లేదా సంయోజిత యక్షదూపాలుకూడా ఉండవచ్చు. దీనికి ఉదాహరణం: మనిలా కోవలానికి, బ్రజిల్ మైనాన్ని, ఆముదపు నూనెను కలిపి ఈ మొత్తాన్ని మద్యసారంతో కరిగిస్తే వచ్చే చౌకరకపు వార్నీషు, లక్కకు బదులుగా వాడటానికి అనువైంది.

వార్నిష్ పరిశ్రమలో ఉపయోగించేది నిజానికి యక్షదూపమే అయినా దాన్ని ఆ పారిశ్రామికులు బంక (*gum*) అని వ్యవహరిస్తారు. యక్షదూపం బంకకన్న భిన్నమైనది. స్వచ్ఛమైన బంక, నీటిలో చాలా చక్కగా కరుగుతుంది. బంకముద్దను కాల్చినప్పుడు-చక్కెరను కాల్చినప్పుడు లభించే నల్లటి పదార్థమే లభిస్తుంది. యక్షదూపం అటువంటిదికాదు. అది నీటిలో కరగదు: కాల్చినప్పుడు, పొగలు గక్కుటూ మండుతుంది.

**resist** : *నిరోధి*.

ఒక ఉపరితలంలో కొంత భాగాన్ని, తాత్కాలికంగా మరుగుపరచటానికి లేదా మూసివేయటానికి ఉపయోగించే ద్రవ్య విశేషం. ఆవిధంగా మరుగుపడిన భాగం ఒక చర్య (రసాయనిక చర్య)కు లోనై దెబ్బతినకుండా రక్షించటానికి ఇందువల్ల వీలుకలుగుతుంది. రేఖలు, లేదా ఉపరితలాలు కొన్ని ఆమ్లప్రయోగంవల్ల నిక్కృత్తము (*incise*) పొందవలసి ఉన్నట్లయితే ఏ ప్రక్రియతోనైనా-అంటే కాచ సూచీ చిత్రణం, లోహఫలక ముద్రణవంటి ప్రక్రియా రీతులు, జలచ్ఛవి, కాంతిరేఖాశిల్పం, అభిలేఖనం మొ. వాటిలో-ఒక ఆమ్ల నిరోధిని వాడి, క్షయంకరి వల్ల దంశితములు కానక్కరలేని తావులను మరుగుపరచటమేకాక, ఫలకపు వెనకవైపును, అంచులను పరిరక్షించటం జరుగుతుంది. గ్రాఫిక కళాప్రక్రియలలోని సూచీ చిత్రణకు, జలచ్ఛవులలో స్తంభన ప్రక్రియకును స్తంభనపు వార్నీషను ఉపయోగించటం జరుగుతుంది. ఆ ప్రక్రియలలో సూచీచిత్రణ భూమి

కయే ఒకవిధపు నిరోధిగా పనిచేస్తుంది. మార్త వస్తువులలో, మార్తవ సామగ్రిని అలంకరించే కాలంలో అందులో కొన్ని భాగాలు మెరుగుకు, రంగిసుకకు, రంగుకస్మానికి లోను గాకుండా ఉండటానికిగాను ఒక నిరోధిని ఉపయోగిస్తారు. ఇటువంటిది అప్పటికప్పుడే తయారుచేసే ఒక విధమైన మైనపు మధ్గకం కావచ్చు. దీనిని మార్తవపు ఉపరితలంలో, చల్లగా ఉన్న రీతిలోనే పూయవచ్చు; లేదా ఒక యష్టిధూపాన్ని, కరగిన తేనె మైనాన్ని కలిపి, కావలసినప్పుడు తయారు చేసుకొని నిరోధిగా వాడవచ్చు. అడుగుతుడుపు కాల్పు లోనూ, అలంకరణ చేయదలచినప్పుడుకూడా నిరోధిని వాడతారు. విద్యుల్లేపనం (*electro plating*) లో, ఒక నిర్దిష్ట ప్రదేశంలో లోహపు పూత తగలకుండా ఉండాల్సి ఉన్నప్పుడు అక్కడ నిరోధిని వాడతారు అయితే అటువంటి ప్రక్రియలో ఆ నిరోధి విద్యుద్వాహకం కాకుండా ఉండాలి. ఇవుకీ అద్దకంలో ఉపయోగించే నిరోధులు యాంత్రిక కవచము లైనా కావచ్చు; లేదా రంగు తాకకుండా ఆవగల రాసాయనిక నిరోధులైనా కావచ్చు. పారిశ్రామికంగా, బారీయెత్తున సాగించే అద్దకం పనిలో పిండిపాటుగా ఉండే నిరోధినిని ఒక దాన్ని, రేఖాంకితములైన లోహావర్తినులతో, గుడ్డపై, అద్దకంవేయటానికి ముందుగా పట్టిస్తారు. బటిక్ అద్దకపు పనిలో, కరగిన తేనెమైనాన్నే నిరోధిగా వాడతారు.

**resonance** : ***అనునదవం.***

**restoration** : ***పునరుద్ధరణ.***

పాతదై పోయి కొంత శిథిలత పొందిన ఒక కళాఖండాన్ని మరమ్మత్తుచేసి చక్కబరచటం. లుప్తములైన భాగాలను మళ్ళీ జోడించి, ఆయాభాగాలలో వర్ణం పోయినచోట పూత నింపి, ఈ పనిని నిర్వహిస్తారు.

(చూ : *Conservation* )

**restorer** . చూ : **conservator.**

**restrainer** : ***నిగ్రహిత.***

ఒక తైల చిత్రాన్ని శుభ్రంచేయటానికి ఉపయోగించే ద్రావణంతో కలిపివాడే ఒక ద్రవపదార్థం. ద్రావణంలోని పటిష్ఠతవల చిత్రపు పైపొర వలిచివేసినట్లుగా ఊడిరాకుండా ఈ నిగ్రహిత అడ్డుకొంటుంది.

**restricted palette or limited palette :**
***నిరుద్ధవర్ణ ఫలకం;నియమిత వర్ణ ఫలకం.***

కళాకారులు వాడే రంగులనుంచి, నచ్చిన రీతిలో, ఏరుకొన్న స్వల్ప సంఖ్యాకములైన రంగులు; ఇట్లా తీసుకొన్న వాటిలో ఒక్కొక్కప్పుడు ప్రాథమిక వర్ణాలూ, ఒక్కొక్క సందర్భంలో వర్ణమాలలోని రంగులూ చేరటం జరుగుతుంది. ఏదో ఒక నిర్దిష్ట చిత్రానికే ఈ విధంగా నిరుద్ధ వర్ణఫలకాన్ని ఒక కళాకారుడు వాడవచ్చు; లేదా ఒక అలవాటుగా దాన్ని గ్రహించి తాను చిత్రించే ప్రతి దానికీ అటువంటి వర్ణఫలకాన్నే వాడవచ్చు. ఈవిధంగా వర్ణాలను నియమితం చేసుకోవటానికి కిందపేర్కొనేవిఏవైనాకారణాలుకావచ్చు.

1. దూరప్రదేశాలలో ఆరుబయట చిత్రణకు నియత సంఖ్యలో వర్ణాలను తీసుకొనిపోవటంలో ఉండే సౌకర్యం. 2. ఒక క్రమశిక్షణకు లోబడి ఉండటం (ఇది విద్యార్థి విషయంలో వర్తిస్తుంది] 3 సౌందర్య భావనను గురించి కళాకారుడికిగల ఒక ప్రత్యేకాభిప్రాయానికి నియత సంఖ్యగల కొన్నిరంగులే సరిపోవటం (చూ : *Brown sauce*). లేదా 4. రంగులు ఎక్కువ సంఖ్యలో ఉండటం. 12 వర్ణద్రవ్యాలకు తక్కువగా ఉండే దాన్ని నిరుద్ధ వర్ణఫలకమనీ, 12 నుంచీ 15 వరకు ఉండే దాన్ని పూర్ణఫలకమనీ; 15 కు మించి ఉండే విపుల ఫలకమనీ వ్యవహరించటం సమంజసం.

**restrike** : *పునర్ముద్రణ.*

మొదటి ముద్రణలో ప్రచురించిన ముద్రాంకాలు అమ్ముడుపోయిన తర్వాత అందుకు సంబంధించి - బహు అనురూప ప్రక్రియకు చెందిన - ఫలకం, దిమ్మె, శిలాలేఖనం, కౌశేయ యవనికా తైజసం, దొల్లచ్చు, అచ్చు దిమ్మెలలో-దేనినైనా ఆధారంగా గ్రహించి రూపొందించిన ఒక ముద్రణం. మొదటి ప్రచురణకు చెందిన ముద్రాంకాలు, అలభ్యమై చాలా కాలమున్న తరవాత వెలువడే ముద్రణకు ఈ 'పునర్ముద్రణ' అనేపదం ముఖ్యంగా వర్తిస్తుంది. [చూ : *Original print*]

**rest-stick** : చూ : mahlstick.

**retable** : చూ altarpiece.

**retardant** : *విలంబిని; రోధకం.*

ఒక చిత్రంపైన పూతరంగులు పూసిన వెంటనే, గట్టిపడడంగానీ లేదా ఎండిపోవటంగానీ కొంత కాలంవరకూ ఆపటానికి ఆ పూతరంగులకు మొదట్లో కలిపే ఒక విధమైన అవరోధక ద్రవపదార్థం. మూర్తిచిత్రకారులూ, ఇతర రీతుల చిత్రకారులూ తమ రచనలను, తైలవర్ణాలలో వరసగా రెండు మూడు రోజులు సాగించవలసిన అవశ్యకత ఉన్నప్పుడు ఇటువంటి విలంబినిని, పూతరంగులలో, ముందుగానే కలుపుతారు. ఇటువంటి విలంబినులలో, ఎక్కువ ప్రయోజనకారిగా అత్యధిక సంఖ్యాకులు భావించేది లవంగతైలం. ఈ తైలపు కొద్ది చుక్కలను పూతరంగులకు కలిపితే చాలు, అది ఎంతో పనిచేస్తుంది. తక్కిన విలంబినులలో పేర్కొనదగినవి : దవనపునూనె, లవెందరునూనె, దేవదారు తైలం. పారిశ్రామిక రంగంలో, మాయలక్క-పూతలు త్వరితంగా ఆరిపోకుండా ఉండటానికి ఆ లక్క-రంగులలో బ్యుటైల్ యసిటేట్ అనే రాసాయనిక ద్రవ్యాన్ని కలుపుతారు. ఈ ద్రవ్యం చాలా అలస్యంగా ఇగిరిపోయే స్వభావం కలది.

**retarding medium** : *నిరోధక మాధ్యమం; విలంబక మాధ్యమం.*

**retention of colour** : *వర్ణ ధారణ.*

**reticulation** : *ఛిద్రజాలం.*

చిన్న చిన్న నెరియలు అల్లికగా ఉండటం వల్ల వలలాగా కనపడేది.[చూ : *Crackle; Crazing*].

**retouch or retouch varnish :** *పరిస్పర్శని; పరిస్పర్శనీ వార్నిషు.*

డాంబరు లేదా విపర్ణనిరోధకమైన ఏదైనా ఇంకొకయక్షదూవపు పలచటి ద్రావణం అసంపూర్తిగా నిలిచిపోయి ఎండబారిన తైలవర్ణ చిత్రంపై, తిరిగి పనిని సాగించదలచి, కొత్త రంగుపూతలను వేయటానికి ముందుగా ఆ చిత్రంపైన కళాకారుడు ఈ ద్రావణం చిలుకరిస్తాడు: లేదా ఒకతూలికతో దానిని చిత్రంపై పూస్తాడు. ఈ పరిస్పర్శనివల్ల అదివరకే ఎండియున్న, లేదా క్రుంగియున్నచోట్లు తడి రంగుల గంభీరతను, సాంద్రతను పొందగలుగుతాయి. అందువల్ల కొత్తరంగుపూతతో వాటిని సరిదిద్దవచ్చు. ఈ పరిస్పర్శనిని తరచుగా వాడకుండా అత్యవసరమైనప్పుడే-అదికూడా చాలా పలచగా - వాడటం గమనార్హం దీన్ని తరచుగా వాడితే అదనంగా వార్నిష్ పటలం చిత్రంపై చేరుకొని, చిత్రంలో పైపూతల కుదిరికరీతినే క్లిష్టం చేసే ప్రమాదం ఉంది.

**retreating colour :** *తిరోగామి వర్ణం; పశ్చాద్గామి వర్ణం.*

**retrospective exhibition :** *పునరాలోకన ప్రదర్శనం.*

**retroussage :** *పునరాపిర్యాప్తి.*

**reveal :** *వెలువరించు.*

**reverse :** *తిరస్తలం.*

ఒక నాణెం, పతకం, మొహరు, లేదా రెండుపక్కలా వివిధరచనలు కలిగిన ఒక ఫలకంవంటి రెండు వైపులుండే వస్తువులలో, తక్కువ ప్రాముఖ్యంగల వైపుకు వాడేపదం. ఎక్కువ ప్రాముఖ్యంగల వైపును పురస్తలం అని వ్యవహరిస్తారు.

**reversed :** *విపర్యయ.*

**revive :** *పునర్జీవీకరించు*

**Rhenish school:** *రేనీయ కూటమి.*

రోమనస్కయుగపు ఉత్తర భాగంలో, కోలోన్ నగరంలోనూ దాని పరిసరాలలోనూ కృషి సాగించిన కళాకార వర్గం. ఈవర్గంలో ప్రముఖుడు వెర్డూన్ నగరవాసి అయిన నికోలస్ ఆతడి బంగారు పనితనం, ఆయుగపు శిల్పకృషిలో రూపొందిన పెక్కురచనలకన్నా ఉదాత్తతలోను, విభావనలోను మిన్నగా పేరొందింది. అతడి రచనలో ఎక్కువ రమణీయమైనది, ముగ్గురు రాజుల మందిరం (1200) అనేది. ఈనాడది కోలోన్ నగరంలోని చర్చిలో ఉంది. రేనీయ కూటమికి చెందిన వేరొక కళాఖండం విజేత్పమందిరం (1129). ఇది కాచమణి పనితనంతో నిర్మితం. ప్రస్తుతమిది క్సాంటెన్ నగరంలో ఉన్నది.

**rhythmically :** *లయబద్ధంగా.*

**rhyton** : *జన్మిని.*

ప్రాచీన గ్రీసుదేశంలో వాడుకలో ఉండిన చిత్రిత కలశ విశేషం. పానీయాలను సేవించటానికి దీన్ని వాడేవారు. బహుశః అతిప్రాచీన జాతులు నీటిని తాగటానికి వాడే బోలుకొమ్ము నుంచే, ఇది రూపపరిణతి చెంది ఉంటుందని చెప్పవచ్చు. పొట్టేలు, గాడిద, మేక, గరుడసింహం వంటివాటి తలలలో ఒకదాన్ని అనుకరించేట్లుగా ఈ కలశం రూపొందింపబడేది. దాని అలంకరణలో తరచుగా పచ్చి శృంగారపు చిత్రాలకు ప్రాముఖ్యం ఉండేది. క్రీ పూ. 6వ శతాబ్దిలో ప్రాగ్దేశాలనుంచి ఇటువంటి కలశరచన ప్రక్రియ గ్రీసుకు చేరుకొన్నది.

**ribbed groined vault** : *స్వస్తికా భోదకం.*

**rice paper** : *తండుల పత్రం.*

రకరకాల చెట్లనుంచి లభించే నారలను, లేదా జిగురులను ముడిపదార్థాలుగా గ్రహించి ప్రాచ్య ఆసియాలో తయారుచేయబడిన-కళాకారులకు పనికివచ్చే-కాగితాలలో దేనికైనా ఈ పేరు వర్తిస్తుంది. ఈ పత్రం మృదువుగా చాలా పలచగా ఉంటుంది.

**rich** : *సునంపన్న; మేలి.*

**rich lime** : *మేలిసున్నం.*

జిప్సం [కాల్షియమ్ సల్ఫేట్ అనే రాసాయనిక ద్రవ్యం] ఏ మాత్రమూ లేకుండా, కర్బన పదార్థాలు చాలా తక్కువగా ఉండే, మంచి రకపు సున్నం. సద్యస్క చిత్రణలో గచ్చు పూతకు ఇది మాత్రమే ఉపకరిస్తుంది.

**ridge** : *నంపరం.*

గొగ్గురు (*Burr*) అనేదానికి పర్యాయపదం. సూచీరేఖనం (*Dry point*)లో ఫలకపు అంచులలో ఇది కనపడుతుంది.

**rigger** : *నజ్జకం.*

ఒక విధమైన అక్షరతూలిక. ప్రామాణికపు అక్షరతూలికయొక్క వెడల్పులో సగం వెడల్పు కలిగిన దీనికి పొడుగుపాటివి, మధ్యరకపువి, పొట్టివి అయిన రోమాలు ఉంటాయి.

**rilievo schiacciato** : చూ : Relief.

**rilievo stiacciato** : చూ : Relief.

**Ripolin** : *రిపోలిన్.*

ఇంటిలో నిత్యమూ ఉపయోగించే కాచ మణి సామగ్రికి యూరపులో వాడుకలో ఉన్న వ్యాపార నామం ఇటువంటి వ్యాపారనామం గల సామగ్రిని ప్రసిద్ధ చిత్రకారుడు పికాసో వాడటంవల్ల, ఈ వ్యాపార నామానికి పేరు ప్రతిష్ఠలు లభించినవి.

**ritoccata** : *పరిస్పర్శితం.*

చిత్రంలో పరిస్పర్శన జరిపిన చోటు.

**roasting** : *భర్జనం.*

**Roberson's medium** : *రోబెర్‌సన్ మాధ్యమం.*

'రోబెర్‌సన్' అనే పేరుగల ఒక వాణిజ్య సంస్థచేత 19వ శతాబ్దిలో తయారుచేయబడి, ఆ సంస్థకే దాని స్వామ్య స్వత్వములు ఏర్పడి ఉన్న ఒక పూతరంగు మాధ్యమం. దీనిలో కోపల వార్నిషు, గసగసాల నూనె, తెల్ల మైనం చేరి ఉంటాయేమోనని తెలుస్తున్నారు.

**rocaille** : *శుక్తికం.*

ఆలిచిప్పలను, నీటిదెబ్బతిన్న శిథిల శిలల రూపాలను ప్రాతిపదికలుగ గ్రహించి సాగించిన అలంకారిక శైలి; రమ్యతను పెంపొందించటానికి ఇటువంటిది చాలానిడివిగా సాగేది. ఫ్రాన్సుదేశంలో, అందునా ముఖ్యంగా లూయీ XV పరిపాలన కాలంలో, ఈ శైలి ప్రజల ఆదరణను సిరిగా ఆర్జించింది. 'రోకోకో' అనే పదం బహుశః 'రొకైలీ' అనే పదంనుంచే రూపొంది ఉంటుందని అనుకోవటానికి అవకాశం ఉంది.

**rock-crystal** : *పలుగురాయి; శిలాస్ఫటికం.*

ప్రాచ్య, పాశ్చాత్య దేశాలలో, చాలా కాలంనుంచీ, మలచటానికి అధిరేఖనానికి వాడుకలో ఉన్న ఒక శిలా విశేషం. రాసాయనికంగా దీని సంకేతం సిలికాన్ డయాక్సైడు; వాస్తవానికి ఇందులో మలచటం జరగదు. ఒక లోహచక్రాన్నో, ఖరమానో ఉపయోగించి, ఘర్షక చూర్ణాన్ని తగినచోట్ల వర్తించి అరగదీయటం మాత్రమే ఇందులో జరుగుతుంది.

**rocker** : *ఆందోళని.*

మధ్యచ్ఛవి ప్రక్రియలో వాడే ఒక పరికరం. ఒక ప్రత్యేక రీతికి చెందిన ఉక్కుతో దీన్ని తయారుచేస్తారు. దీని ముందంచు కొద్దిగా వంగి, రంపపు వాదర కలిగి ఉంటుంది మధ్యచ్ఛవిలో, పలకం ఉపరితలం సన్నద్ధం చేయటానికి దీన్ని వాడతారు. ఈ పరికరానికే డోలిక (*Cradle*) అనే



ఆందోళని

పర్యాయ నామం ఉంది. ఫలకంపైన అటు ఇటు కదిలిస్తూ దీని పోనివ్వటంవల్ల, దీనికి ఆ విధమైన పేర్లు వచ్చాయి. పలకంపై ఒక చోట దీన్ని ఉంచి ఆరు విధాలుగా (పైకి కిందికి; ఒక పక్కనుంచి ఇంకో పక్కకు, ఏటవాలు రీతులలో) కదలించటంవల్ల ఈ పరికరపు ఒక ప్రేటు (*stroke*) పూర్తి అవుతుంది. మధ్యచ్ఛవిలోని ఫలకపు ఉపరితలాన్ని చక్కగా గోకివేయటానికి ఇటువంటి ప్రేటులు ఎన్నో కావాలి.

**rock soap** : *రాతిసబ్బు.*

**rococo : *కర్కరిక.***

18 వ శతాబ్దంలో యూరపులో-అందునా ముఖ్యంగా ఫ్రాన్సు దేశంలో లూయీ XV పరిపాలనాకాలంలో-ఆదరణ పొందిన ఒక కళాశైలి. గృహాభ్యంతరపు అలంకరణకు కూడా ఇది ఆ కాలంలో వినియుక్తం ఇటలీ దేశంలో వ్యాప్తినొందిన బరోక్ చిత్రణలో కనపడే వక్రరేఖా బద్ధములూ విపులములూ



కర్కరికా శైలి : రతీదేవి స్నానము, కాటకపై తైలచిత్రణ; రచయిత : ఫ్రాంకాయిస్ బొచర [1703- 770]

ఆయిన రూపాలకు లాలిత్యాన్ని, మిసిమిని, రంజకతను కల్గించి, సంక్షిప్తం చేయగా ఇది రూపొందింది లూయీ XIV కాలంలో ఆదరణ పొంది, వెర్సెయిల్స్ రాజ ప్రాసాదంలో లక్షితం అయిన గురుతర, అలంకృతిమయ సౌంద్రవదాయక కళాశైలికి ప్రతిక్రియగా ఈ కర్కరికాశైలి రూపొందింది. రాజాస్థానపు విలాసమయ జీవనం తాలూకు రసమయ సుపరిచిత దృశ్యాలను చిత్రించటానికి ఈ శైలి వినియుక్తం. ఒక్కొక్కప్పుడు పశుపాలక జీవన పరిసరాలను భూమికగా గ్రహించి, ఇటువంటి దృశ్యాలనే చిత్రించటం కూడా జరిగేది. కృత్రిమత, శోభ దీనిలోని ప్రముఖ లక్షణాలు. ఈ శైలిని సమర్థించి వాడుకలోకి తెచ్చిన ప్రముఖులలోని కొందరు: 1. జీన్ ఆన్‌టోయిన్ వాటో [1684-1721], 2. ఫ్రాంకోయిస్ బొచర [1703-1770], 3 జీన్ ఆనోరి ఫ్రాగొనార్డ్ [1732-1806]. ఈ శైలివల్ల ఆనాటి శిల్పం లాలిత్యాన్ని అర్జించటమేగాక ప్రమాణంలో సైతం సూక్ష్మతను పొందింది. ఇటువంటి వనితనానికి క్లోడియన్ [1738-1814] యొక్క శిల్పకృతిని లక్ష్యంగా పేర్కోవచ్చును.

ఇటలీదేశంలో కర్కరికాశైలి సాధించిన ఉత్కృష్టతకు జియోవాన్ని బట్టిస్టా టియెపోలో (1696-1770) సాగించిన రచన ఒక మేలి లక్ష్యం.

**roller : ఆవర్తిని**

ఉల్బణముద్రణ ప్రక్రియలో వాడే సంవర్తినికి పర్యాయనామం.

2 శిలాలేఖన ప్రక్రియలో వాడే ఒక పరికరం ఇది అప్పడాల కర్రలాగా స్తూపాకారంలో ఉండి, రెండు పక్కల పట్టుకోవటా

నికి అనువుగా చేవట్టుల అమరిక కలిగి ఉంటుంది. ఆ చేవట్టుల సాయంతో శిలాలేఖన ఫలకంపై అవర్తలేపనం జరుపుతారు. గట్టిజాతి కర్రతో దీన్ని తయారు చేస్తారు. స్థూపభాగం చుట్టూ ఒక ఉన్ని గుడ్డను గట్టిగ కప్పి బిగించి, అందుపైన మృదువైన దూడ చర్మాన్ని, కడతారు. కొత్తగా తెచ్చిన అవర్తినిని వాడవలసి వచ్చినప్పుడు దాన్ని శిలావార్నీషులో బాగుగా ముంచి, నానబెట్టి చక్కజరచి తప్పనిసరిగా సన్నద్ధం చేయాలి. (చూ : *Rolling up*)

**roller mill** : *తిరుగలిమర;*

*తిరుగుడు మర.*

కళాకారులు వాడే తైలవర్ణాలకుగాను, ఒక వాహకంలో వర్ణద్రవ్యాలను చక్కగా కలపటానికి ఉపయోగించే యంత్రవిశేషం. అత్యాధునికమైన ఇటువంటి మరలో అయిదు ఉక్కు అవర్తినులు (రోలర్లు) ఉండును. ఇవి అన్నియు నిలువుగ అమర్చి ఉంటాయి. ఈ మరలోని ప్రతి అవర్తినిద్వారా నీరు ప్రవహించే వసతి ఇందులో ఉంటుంది. అందువల్ల ఆ అవర్తిని వేడి యెక్కదు. ఈ అవర్తినులలో మొదటిది చాలా మెల్లగా తిరుగుతుంది. ఆ తరవాత వానిలో ప్రతి ఒక్కటీ తనకు ముందున్న దానికన్నా ఎక్కువ వేగంతో తిరుగుతుంది. వర్ణద్రవ్యాన్ని, తైలంతో కలిపి, పిండివాటంగా తయారుచేసిన తరవాత మొదటి రెండు అవర్తినుల మధ్య దాన్ని ఉంచి రుబ్బి, రెండు-మూడు రోలర్లమధ్యకు తీసుకుని వస్తారు. ఆ విధంగా అన్ని రోలర్ల మధ్య రుబ్బిన తరవాత అయిదో రోలరునుంచి దాన్ని ఒక ఐద్దపంటి పరికరంతోగాని, వైద్యుల కత్తివాదరతోగాని గోకివేస్తారు. అయితే సాధారణంగా వాడే తిరుగలి మరలో అవర్తినులు నిలువుగాకాక, అడ్డంగాఉంటాయి వాటి సంఖ్యకూడా 5 గాక మూడుగానే ఉంటుంది. ద్రవరూపంలో ఉన్న వర్ణద్రవ్యాలను రుబ్బి కలపటానికి వాడేది బంతిమర (*Ball mill*).

**rolling up** : *అవర్త లేపనము.*

శిలాలేఖన ప్రక్రియలో శిలపై సిరాను పట్టించటానికి అవలంబించే ఒక విధమైన ప్రక్రియ. శిలాలేఖనానికి అవశ్యకమైన సూచీలేఖనం, అలికింపు, అదనపు బంకను కడిగివేయటం ముగిసిన తరవాత, రాతిపైని ఆలేఖనాన్ని కర్పూర ద్రావకంతో కడుగుతారు. దీనివల్ల ఆ ఆలేఖనమే మాయమయినట్లు కన్పడ్డా, రాతికి బాగాపట్టి దానిచే గ్రసితమైన మేదోయుతవు ఆమ్లవుపొర, శిలోపరితలంలో అంటుకొనే ఉంటుంది. అప్పుడు శిలపై స్పంజిని ఉపయోగించి చెమ్మగిలజేసి, అచ్చు సిరాను అవర్తినితో పట్టిస్తారు. ఈ విధంగా అవర్తినిని [రోలరును] వాడటంవల్లనే ఈ ప్రక్రియకు అవర్తలేపనం (*Rolling up*) అనే పేరువచ్చింది. చెమ్మగిలి గ్రహణాక్షమమూలైన తావులు సిరాను గ్రహించక అవలికి నెట్టగా, ఆలేఖనం ఉన్న తావు సిరాను గ్రహిస్తుంది. అవర్తిని యొక్క ఒత్తిడివల్ల సిరాలోని కొవ్వుఆమ్లాలను రాయి చక్కగ గ్రసిస్తుంది. [ఒక ఉపరితలం తనపై ఉన్న ఒక వస్తువును బాగా గ్రసించాలి అంటే

అందుకు ఓత్తిడి, ప్రేరేపకంగా, ఉపక రిస్తుంది].

**roman : *రోమన్; ఋజుశ.***

పాశ్చాత్యలిపిలో అక్షరాలు వ్రాసేవిధంలో 15 వ శతాబ్దిలో తీసికొనివచ్చిన ఒక విధమైన ఖత్తు లేదా వ్రాతరీతి. మధ్యయుగాలలో సర్వత్రా వ్యాప్తిచెందిన గోథిక లేఖనరీతిని అవతలకు నెట్టేసి ఈ రోమనీ ఖత్తు ముందుకు రావటంలో, ఆ కాలపు మానవతావాదం (*Humanism*) ముఖ్యపాత్ర నిర్వహించింది. మొదట్లో ఈ రోమన్ ఖత్తుకు ప్రాక్తనం (*Antiqua*) అనేపేరుండేది. అతిప్రాచీనవు లాటిన్ లిపిలోని గొలుసుకట్టు వ్రాతపద్ధతినుంచి, క్రీ. శ. 9 వ శతాబ్దిలో, రూపొందిన కరోలింజియన్ జిలుగురాత పద్ధతే రోమన్ పద్ధతి వ్రాతగా పరిణమించటంవల ఈ 'ప్రాక్తనం' నే పేరు రోమనీ ఖత్తుకు కలిగింది. ఈ వ్రాతలో అక్షరాలు చక్కగ విశదరీతిలో ఉండటమేగాక, అవి గుండ్రంగాను ఉండేవి; అందువల్ల గ్రంథాలు రాయడానికి ఇవి బాగా ఉపకరించాయి. 15 వ శతాబ్ది అంతంలో 'ముద్రణ' యూరపులో విస్తరించటంతో, ఈ రోమన్ ఖత్తుకు చెందిన అక్షరాలను ఒక 'ముద్రారీతి'గా గ్రహించటం జరిగింది. అందువల్లనే నేడుకూడా ముద్రారీతులలో ఈ రీతికే వ్యాప్తి ఎక్కువ. ఈ అక్షరాలకు వరవడి దిద్దినవి, ప్రాచీన రోమన్ లిపిలోని అక్షరాలు—అందునా ముఖ్యంగా రోము నగరంలో కనపడే ఒకానొక స్తంభశాసనంలో ఉన్న అక్షరాలు; ఆ స్తంభ శాసనాన్ని వెలయించిన వాడు ట్రోజన్ అనే పాలకుడు (క్రీ. శ. 105-118).

కాని 'రోమన్' అనే పదం నేడు అచ్చు పని రంగంలో వేరే తీరుగాకూడా వాడబడు తున్నది. ఏ ముద్రారీతి (*Type*) కి చెందిన అక్షరాలైనా అవి నిట్టనిలువుగా కుదిరి ఉన్నప్పుడు వాటిని రోమన్ రీతి అనీ, పక్కకు వాలి ఉన్నప్పుడు 'ఇటాలిక్' రీతి అనీ వ్యవహరించటం పరిపాటిగా ఉన్నది.

**Roman art : రోమక కళ.**

రోము నగర రాజ్యంలోనూ, ఆ రాజ్యపు వలసలలోనూ క్రీ పూ. రెండో శతాబ్ది ఉత్తరార్ధం మొదలుగా క్రీ. శ. 4 వ శతాబ్ది అంతం వరకూ వర్ధిల్లిన కళావిశేషం. రోమన్



రోమక కళ : కాంస్యమున రూపితమగు ఒక యువకుని ఉరస్కము; క్రీ. శ. మొదటి శతాబ్దపు పూర్వార్ధమునకు చెందినది.

నాగరికత, విభిన్న మూల స్రోతస్సులనుంచి రూపుగొన్న రీతిగానే, రోమన్ రీతియు విభిన్న ప్రాంతాలనుంచి మూల భావనలను, సాంకేతిక రీతులను గ్రహించింది. అందునా గ్రీకులకున్నూ, ఎట్రుస్కనులకున్నూ, ఈజిప్టువాసులకున్నూ ఆ కళ ఎంతో ఋణపడింది. వీరిలో తక్కిన వాటికన్నా రోమన్ కళపై, గ్రీకుల ప్రభావం చాలాఎక్కువ. ఇట్లా ఎన్నో ప్రాచీన రీతులచే ప్రభావితమయికూడా రోమన్ కళ, తనదైన రోమన్ శైలిని సైతం సృజించుకోగలిగింది; ముఖ్యంగా తనదైన ఇటువంటి శైలిని, మూర్తి చిత్రణలోను, ఉల్బణ శిల్పంలోను, రోమన్‌కళ ప్రదర్శించింది. ఉరస్క శిల్పాలున్ను వ్యక్తిత్వ విశిష్టతలను, వాస్తవికతను ప్రదర్శిస్తూ, భావగర్భితాలుగా ఉండటం ఇందులో కనవచుతుంది. కాని క్రీ. పూ. ఒకటో శతాబ్ది అంతమయ్యేనాటికి, గణతంత్ర భావన సన్నగిల్లి, రోమన్ సామ్రాజ్యం రూపుగొన్నది. ఇక అప్పటినుంచి చక్రవర్తికి దైవత్వం ఆపాదించటం పరిపాటి అయింది. అందువల్ల, అటువంటి చక్రవర్తుల మూర్తులను మలచటంలో ఒక విధమైన ఆదర్శరూప భావన, శైలీకరణ చోటు చేసుకొన్నాయి: ఇక ఉల్బణ శిల్పం ఆ కాలంలో ఒక నవీన ప్రవృత్తిని అర్జించి, ప్రముఖ చారిత్రక విషయ కథనానికి సాధనంగా ఉపకరించింది. విజయతోరణాలపైనా, జయస్తంభాలపైనా, విభ్రమంగొల్పుతూ, కళ్ళకు మిరుమిట్లుగొలిపే పూజావేదికలపైనా, ఇటువంటి విషయ కథనం ఉల్బణరీతిలో, శిల్పంలో రమ్యంగా సాగింది. ఈ ఉల్బణ శిల్పాలలో కొన్నిట వివిధ మూర్తుల అమరికలో ప్రాదేశికమైన వ్యత్యస్తత పాటించబడింది. అట్లా కాక కొన్నిటిలో భూమికను, ప్రకృతి దృశ్యమయంగా చేయటం కనవడుతున్నది; భూమికకు ఏ విధంగానూ తీసిపోనిరీతిలో శిల్పంలో పురోభూమికూడా సమలంకృతం. ఇటువంటి పరిసరాలలో రూపితమయ్యే ఉల్బణ శిల్పం వాస్తవికతను ఒలుకబోసేది. రోమన్ కళలోని కుడ్యచిత్రణ మొదట రెండాయతనాలు స్ఫురింపజేసేదిగానే ఉండేది. కాని కాలక్రమాన వాస్తు నిర్మాణాదులను అందులో తెలియజేయటానికోసం, అందుకు తగిన దృష్టి ప్రక్రమగతులను, తదనుకూల రూపాలను సృష్టించటం మొదలై తత్ఫలితంగా గంభీరతను, లేదా లోతును భ్రాంతిగా కల్పించటం జరిగింది. చిత్రంలో అలీకతను కనపడచేయటానికి కాంతిని ఉపయోగించుకొన్న ఘట్టాలుకూడా ఉన్నాయి. అయినా కాంతిపాత పరిణామాలను సరిగా అనుశీలనం జరపటంగానీ, సువ్యవస్థితరీతిలో వెలుగు నీడలను ఉపయోగించటంగానీ జరిగిందిగాదు. పలక చిత్రణలుకూడా ఆనాడు ఉండేవి. కాని మొత్తంమీద రోమన్ కళాకారులు రచించిన చిత్రాలు దాదాపుగా అన్నీ కూడా గ్రీకుల రచనలకు ప్రతికృతులే అని చెప్పవచ్చును.

**Romanesque** : రోమనస్క.

యూరపీయ కళలో గోథిక శైలి రూపొందటానికి సన్నిహిత పూర్వకాలంలో, వర్ధిల్లిన కళారీతికి చెందిన విశేషణం. రచ

యితలలో కొందరు క్రీ. శ. 7వ శతాబ్దికి చెందిన వాటిని సైతం రోమనస్క్ములని అనే వారు. కాని కొందరు 11వ శతాబ్దినుంచి మాత్రమే ఈ కళారీతి బయలుదేరిందని భ్రమి స్తారు. క్రీ. శ. 1200 తో గోథికశైలి రూపొంది రోమనస్క్ రీతిని దూరంగా నెట్టి వేసింది. ఈ రోమనస్క్ శైలి క్రైస్తవా లయాలకొరకై, వాటిచే ప్రోత్సహించబడింది. అయితే ప్రాంతభేదాలను అనుసరించి వైవిధ్యం అందులో ఎక్కువగా చోటు చేసుకొన్నది.

ఆ కళారీతికి చెందిన చిత్రలేఖనం, ఆనాటి వ్రాతప్రతులలోని గ్రంథచిత్రణలో కనపడు తున్నది. సమలంకృత రేఖాలక్షణం ఇందులో కనపడుతుంది. బైజాంటైన్ (తూర్పు రోమన్ రాజ్యపు) ప్రభావం ఇందులో కొంత ఉంది. భిత్తిచిత్రణా, చిత్రాస్తరాలు ఈ కాలంలో ప్రజా దరణను ఆర్జించాయి.

పృథుల శిల్పరచన పునరుద్ధరణ పొంద టం ఈ కాలపు ఒక ముఖ్యలక్షణం వాస్తు వుకు సైదోడుగా, అలంకరణకోసం, ఉబ్బెణ శిల్పముఖకూ, శిల్పం ఆనాడు వినియుక్తం. కాని కుడ్యకోష్టాలకు వెలుపల పెద్ద శిలా మూర్తులు ఏవీ ఆనాటివి కానరావు. స్థానక మూర్తులు వర్తుల శిల్పంలో ఏవైనా ఉన్నా అవి అన్నీ లోహసిక్తి కాలే.

రోమనస్క్ కళకు ఆలంబనాలైన చర్చీ లలో వలయితములైన తోరణాలు, ఖోర కాలు, స్తంభాల కన్నా ఎక్కువగా అర్ధ స్తంభాలూ, విరివిగా వృత్తాచ్ఛాదనలూ ఉండేవి.

ఈ కాలంలోనే స్వస్తికా ఖోదకము రూపొందించబడింది. అదే ఆ తరవాత గోథిక వాస్తువులో ప్రముఖాంగంగా మన్నన పొందింది.

**Romanists** : రోమనీయులు.

ఇటలీదేశవాసులు కాకపోయినా, రోమునగ రపు ప్రాచీన కళావైభవంవల్లనూ, అక్కడి ప్రాక్తన కళాఖండాలవల్లనూ ఆకర్షితులైన వారలకు ఈ పదం పూర్వం వ్యవహృతం. ఇటాలీయకారులు (*Italianizers*) అనే పదం కూడా ఇటువంటి అర్థంలో ప్రయుక్తమైంది. 16 వ శతాబ్దంలో రోమునగరాన్ని దర్శించి, అక్కడి పునరుజ్జీవన కళను గ్రహించి, తమ దేశీయ కళను దానివల్ల ప్రభావితం చేసిన ఫ్లెమిష్ కళాకారులను, ఈ పేరులను ఆ కాలంలో ముఖ్యంగా వాడటం జరిగింది. ఇటువంటి రోమనీయులలో ప్రముఖులుగా లెక్కించదగినవారు : 1. జాన్ గోసార్ట్ (ఇతడికి మబూసే అనే మరొక పేరు ఉన్నది). 2. ఫ్రాన్స్ ఫ్లోరిస్ డి ఫ్రీంట్, 3. బార్తులోమ్యూస్ స్ప్రేన్గర్.

'రోమనీయ' అనే పదం-అందుకు చక్కగ సరిపడకపోయినా-రోమునగరం చేత ముగ్ధులై, తమకు ఆ నగరంపైగల గౌరవాదరణలను తెలపటానికి ఆ నగరపు దృశ్యాలను-అందునా ముఖ్యంగా అక్కడి ప్రాచీన కాలపు మహనీయ కళాఖండా వశిష్టా లను-తమ చిత్రరచనలలో రూపించిన వారికి కూడా చెల్లుబడి అవుతున్నది.

**Roman linen** : రోమనీయ వల్కలం.

ఇటలీదేశంలో 17, 18 వ శతాబ్దాలలో చేమగ్గాలమీద నేసిన నారగుడ్డకు, కొన్ని సందర్భాలలో వాడే నామవిశేషం.

**Roman ochre** : రోమన్ గైరికం.

పీతగైరికంలో ఒక కోవకు చెందింది; కవోష్ణస్థాయి కలది; ప్రాచీనకాలపు రోములో వాడుకలో ఉండిన గైరికంకూడా ఈ పేరుతోనే వ్యవహృతం.

**Roman sepia** : రోమనీయ మీనశం.

తప్త స్వేన్నంతోగానీ, మాంజిష్ఠ శోణంతో గానీ మీనకాన్ని కలిపి, కవోష్ణతను ఎరుపుదనాన్ని కలిగింవగా ఏర్పడే వర్ణ విశేషం.

**romantic** : కాల్పనిక.

**romanticism** : కాల్పనిక వాదం.

ఒక కళావాద విశేషం వ్యక్తిగతమూ, ఉద్వేగాత్మకమూ, నాటకీయత ఉట్టిపడేదీ అయిన మార్గానికి ఎక్కువ ప్రాముఖ్యం ఈ వాదావలంబకులు ఇస్తారు. పాతబడిపోయిన సారస్వత విషయాన్నో, చారిత్రకోదంతాన్నో, అపూర్వ సంఘటననో తమ రచనకు ఇటువంటివారు వస్తువుగా గ్రహిస్తారు. అప్పటి వరకు వ్యాప్తిలో ఉండిన నవ్య సాంప్రదాయి కళా వాదపు నియమ నిష్ఠలతో విసుగెత్తి, సమకాలీన యుగపు విప్లవ భావనలను తగిన రీతిగా వెల్లడించటానికి కళాకారులు చేపట్టిన సాధనంగా 19 వ శతాబ్దిలో ఈ వాదం మొదలైంది. చిత్రలేఖనంలో కాల్పనిక



కాల్పనికవాదం : సింహముల వేటాడుట [1888], రచయిత . యూజీనీ డెలక్రాయ్.

వాదానికి రూఢతను కల్పించిన వారిలో ఫ్రాన్స్‌దేశీయులు యూజీన్ డెలక్‌రాయ్ (1798-1863), థియోడోర్ జెరీకాల్ట్ (1791-1824) అనే వారూ, ఆంగ్లదేశీయుడైన జె. యం. డబ్ల్యు. టర్నరూ ప్రముఖులు. శిల్పంలో అటువంటి దానికి ఆదరణ కల్పించినవారిలో ఫ్రాంకోయిస్ రూడ్ (1784-1855) ఆంటోయిన్-లూయీబార్యే [1795-1875] గణనీయులు. ప్రామాణికతావాదాన్ని, కాల్పనికవాదాన్ని-కళా, వాస్తు రంగాలకు సంబంధించి నంతవరకు - పరస్పర వ్యతిరేకాలని కళేతిహాసకులు, భావించటం పరిపాటి అయింది. అయితే ఒకే ఒక కళాకారుడి రచనలోగాని, ఒక సంప్రదాయంలోగాని ఈ రెండు వాదాల ప్రభావములునూ కనపడటం ఉన్నది.

**Roman white** : *రోమన్ శ్వేతం.*

తెల్లసీసానికి పర్యాయనామంగా పూర్వ కాలంలో వాడుకలో ఉన్న పదం.

**rondel or rondelle** : *మండలిక.*

1. వృత్తాకారంలో ఉండే ఒక కళాఖండం, వస్తువు, ఒక కళాఖండంలో వృత్తాకారంలో తీరి ఉండే ఒక భాగం.

2. కాచచిత్రణలోని వృత్తాకార కాచానికి ఇది నిర్దిష్టరీతిలో ప్రయుక్తమవుతున్నది.

**rose famille** : *పాటలికా వర్గము.*

చీనీయ పింగాణీ పాత్రంలో ఒక ప్రత్యేకపు తరగతికి చెందినవి. బహువర్ణాలను ఉపయోగించి ఇటువంటి పాత్రలపై పుష్పాకృతులను చిత్రించేవారు. ఆ వర్ణాలలో ఎరుపులను, పాటలములనూ ఎక్కువగా ఉండేవి.

**rose madder** : *పాటలీ మంజిష్ఠ.*

మంజిష్ఠ రంజకానికి కళాకారులు వాడే వ్యవహారనామం.

**rosemary, oil of** : *దవనపు నూనె.*

**rosenstiehl's green** : *రోజెన్‌స్టీల్ హరితం.*

మాంగనీజ్ హరితానికి పర్యాయనామం.

**rose pink** : *పాటలీశ్వేతం.*

బ్రజిల్‌వుడ్ రంజకాన్ని న్యూనపరచటం వల్ల లభించే ఒక బలహీన, చలవర్ణం.

**rosewood** : *పాటలీదారువు.*

రంపపుకోత పడినప్పుడు గులాబీవాసన విరజిమ్మే ఒకానొక వృక్షవిశేషం ఇది పేటికా నిర్మాణానికిన్నీ, గృహోపకరణ రచనకున్నూ పనికివస్తుంది.

**rotogravure** : *భ్రామకాధార ముద్రణ.*

**rosin** : *రోవని.*

ఒక విధమైన యక్షధూపం, దేవదారుజాతి వృక్షాలలో కొన్నిరకాల వాటినుంచి ఇది లభిస్తున్నది. యు.స్టే.లో నైరుతి ప్రాంతంలో ఇటువంటి వృక్షాలు విస్తారంగా పెరుగు

తున్నాయి. అంత విరివిగా కాకపోయినా ప్రపంచంలో తక్కిన ప్రాంతాలలోనూ ఇటు వంటివి ఉన్నాయి. ఆ చెట్ల బోదెలదగ్గర గంట్లు పెట్టగా, వెలికి నిర్యాసమొకటి స్రవిస్తుంది. దీనినీ తూసి బంక (*gum thus*) అంటారు. దీన్ని మరగకాచినప్పుడు ఆవిరిగా వచ్చే దానిని శీతలీకరిస్తే కర్పూరద్రావకం లభిస్తుంది బాగా మరిగిన బంకలో చివరకు ఘనరూపంగా రోచని మిగిలి ఉంటుంది. ఇట్లాకాక ఆ చెట్ల మొద్దులను, పట్టలను సన్నటి ముక్కలుగా చేసి ఆభిధవనం (*Distillation*) చేసినప్పుడుకూడా రోచని లభిస్తుంది. వార్నీషులలోగాని, పూత రంగులలోగాని రోచనిని కలిపినప్పుడు కొన్ని అవాంఛనీయ పరిణామాలు కలుగుతున్నాయి. అయితే లభించే ముడిపదార్థాలన్నింటిలో కారు చౌకగా లభించేవి ఇదే కావడంవల్ల దీన్నే పై వాటిలో కలపడం పరిపాటి అయింది. కొన్ని దోషాలుండటం యథార్థమే అయినా వివిధ అధిసక్తముల కొరకున్నూ అధిముద్రలకున్నూ ఇతర యాంత్రిక ప్రయోజనాలకున్నూ రోచని చాలా ఉపకరిస్తున్నది.

**Ross board** : *రాస్ బోర్డు*;

*రాస్ ఆస్తరము.*

ఉల్లేఖన ఫలకాలుగా వినియుక్తములయ్యే కొన్ని సిద్ధఫలకాలకు-విభిన్నవు పరిమాణాలలో లభించే వాటికి-ఉపయోగించే వ్యాపార నామం.

**rouge** : *రాగిక.*

ఎర్రని ఇనుప భస్మాన్ని పొడి చేసినప్పుడు లభించే బాలా తరగతుల మృదు చూర్ణాలలో దేనికైనా ఈ పదం వర్తిస్తుంది. లోహాలకు మిసిమి కల్గించటానికి దీన్ని వాడతారు. అందువల్లనే దీనిని మిసిమి రాగిక (*polishing rouge*) అనికూడా వ్యవహరిస్తారు. స్త్రీల ప్రసాధనసామగ్రిలో వాడే రాగికను పైచూర్ణాలకన్నా ఎక్కువ ఉజ్జ్వలత కలిగిన వివిధ రంగద్రవ్యాలనుంచి తయారు చేస్తారు. రాగికలాగానే మిసిమి కలిగించటానికి వాడే హరిత రాగిక (*green rouge*) కు రాసాయనిక నామం క్రోమియం ఆక్సైడు.

**rouge flambe** : *ఉల్కా రాగిక.*

1 నీలివాక ఛాయ కలిగి, ఎర్రమచ్చలు గాఢంగా కలిగిన ఒక విధపు వన్నెకు పేర్లు.

2. ఆ రంగులోనే ఉండే ఒక ప్రాచీన చీనీయ పింగాణి.

**roughcast** : *స్థూలేరితం; గరుకుపట్టు.*

1. మొరటుగా కర్కరిత సుధామృత్తికతోగాని సుధాపిష్టంతోగాని రూపొందించబడింది; చక్కజేయబడక అశ్రద్ధగా అపతలం ఉంచే సుధాపిష్టక రచన.

2. మూర్తవ ప్రక్రియంలో, ఆసంలో పడవేయటానికి ముందే, మొరటుగా ఉండే ఉపరితలాలతో రూపొందించిఉంచే మృణ్మయ సామగ్రి.

3. శిల్పంలో, తీర్పుఏమనంటిదిలేకుండా, పరిష్కరణ ఏదీ చేయకుండా మొరటుగా రూపొందించిన స్థూలాకృతి.

**roughhew** : స్థూలచ్ఛేదనం.

శిల్పంలో ఒక విధమైన మలచేపని. రూపానికి నిర్దిష్టతను చేకూర్చటంతో తొలిమెట్టుగా గాని, ఒక విధపు సాంకేతిక ప్రక్రియారీతిగా గాని స్థూలరీతిలో, వివరాలకు పోటీయక మలచటం.

**roughness** : *గరుకుదనం; కర్కశత; కరుకుదనం.*

**roulette** : *చక్రిక.*

ముద్రాంకనాం తయారీ అంతఃపాతి ప్రక్రియలో జరిగేటప్పుడు ఒక ఘట్టంలో ఉపయుక్తమయ్యే ఒక విధపు పరికరం. దీని పిడికి కొనయందుంచిన పరిభ్రమించగల ఒక చక్రం వంటిది అమర్చి ఉంటుంది. ఈ చక్రపు



చక్రిక : పైనుండి దిగువకు–చక్రిక; ఖటిన్యావర్తిని; జటాచక్రం.

అంచు రంపపువాదరలో ఉంటుంది. దీని సాయంతో రాగిఫలకంపై బిందురేఖలను, బిందుమయ ప్రదేశాలను ఏర్పరచటానికి వీలుంది. అర్ధస్థాయులు వాంఛనీయాలు కావటంవల్ల దానికోసం మూర్తిచిత్రాలకూ ఇతర విధ చిత్రాలకూ ప్రత్యుత్పాదనలు తయారు చేయటంలో–మధ్యచ్ఛవి రేఖాశిల్ప ప్రక్రియలు ఆదరణ పొందినకాలంలో–ఈ చక్రికను తరచుగా వాడుతుండేవారు. సూచీ లేఖనం, జలచ్ఛవి మొదలైన ప్రక్రియలలోనూ ఇది వాడబడుతున్నది. కొందరు గ్రాఫిక కళాకారులు దీన్ని ఉపయోగించి, గణనీయ ఫలితాలు సాధించగలిగినా, చాలా మంది ఈ పరికరాలను వాడటానికి ఇష్టపడరు. ఈ చక్రిక వల్ల రూపొందే బిందు వ్యవస్థలలో ఏ రెండు బిందువుల మధ్యనైనా దూరం ఏకరీతిలోనే ఉండటంవల్ల, వైవిధ్యానికి, అందులో చోటు లేదని వారు దాన్ని నిరసిస్తారు.

ఈ చక్రికను, దీని రూపాంతరాలే అనదగిన మరి రెండింటిని, ఖచికారీతి ప్రక్రియలో, అతిసాంద్రంగా బిందురేఖలను, బిందుమయ ప్రదేశాలను రూపొందించటానికి–వాడతారు. ఆ రూపాంతర పరికరాలే ఖటిన్యావర్తిని (*chalk roll*), జటాచక్రం (*matting wheel*) అనేవి. ఖటిన్యావర్తినిలోని చక్రాన్ని, జటాచక్రపు చక్రాన్ని చక్రికలోని చక్రం కన్నా ఎక్కువ బొద్దుగా రూపొందిస్తారు. వాటి వాదరలలోని గొగ్గుల సంఖ్య కూడా ఎక్కువే.

**Royal Academy of Arts** : *రాయల్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్.*

లలిత కళలను పెంపొందించటానికై 1768లో ఇంగ్లండులో సంస్థాపితమయిన

ఒక సంఘం. ఒక శతాబ్దికాలం, బ్రిటన్‌లోని ఏకైక కళా శిక్షణ కేంద్రంగా అది రాణించింది. దీనిలోని సభ్యులలో ప్రతిఒక్కనికీ తన నామం చివర *R. A.* (ఆర్. ఏ.) అనే సంకేతాక్షరాలను అనుసంధించుకొనే అధికారం ఉంది.

**royal blue :** *ముదురు నీలిమ.*

దీనిని ఒక ప్రత్యేక వర్ణద్రవ్య మనటం కన్నా ఒక వన్నెగానే ఇది పరిగణనీయం ఒక విధపు అతి సాగరిక నీలిమకుకూడా అప్రామాణికపు పేరుగా ఇది వాడుకలో ఉన్నది.

**royal green :** *ముదురు హరితం;*
*రాజహరితం.*

క్రోమ్ హరితానికి గల వివిధ పర్యాయ నామాలలో ఇది ఒకటి.

**royal red :** *ముదురు ఎరుపు.*

ఒక విధపు సంయోజిత కార్బనిక వర్ణద్రవ్యం; సూర్యకాంతి తగలగానే రంగు మాసిపోతుంది.

**royal scarlet :** *ముదురు శోణితవర్ణం*

ఉజ్జ్వలమై ఉండికూడా చలాగ్గా లెక్కకువచ్చే ఎర్రని రంజక వర్ణ ద్రవ్యం; ఒక సంయోజిత రంగద్రవ్యంనుంచి దీన్ని తయారు చేస్తారు.

**rubber cement :** *రబ్బరు సిమెంటు.*

బెంజోల్‌తోగాని, దానిని పోలిన ఇతర ద్రావణాలతోగాని, బాగా కలిపినప్పుడు తయారయ్యే జంకరబ్బరు; జిగటగా, ద్రవ రూపంలో ఇది ఉంటుంది. అధిసక్తకంగా ఇది బాగా పనికి వస్తుంది. అయితే తాత్కాలిక ప్రయోజనాలకు మాత్రమే ఉపకరిస్తుంది. కొద్ది కాలంలోనే నలుపువాక గోధుమరంగుగా మారి, అది అధిసక్తక గుణాన్ని కోల్పోతుంది. ఐద్ధలేఖ్యం (*frisket*) లో అధిసక్తక భూమికగానూ రేఖాశిల్పంలో నిరోధిగాను ఇదవి స్తృతంగా ఉపయోగంలో ఉంది. రేఖాశిల్పంలోనేగాదు, నీటిరంగుల చిత్రణ, జవుళి అద్దకం మొదలైన వాటిలోనూ, రంగు తగలవలసిన అవశ్యకతలేని అన్ని చోట్లనూ నిరోధిగా దీన్నే వాడతారు. దీనిని పట్టించటం చాలా సులువైన పని; అందువల్ల కాగితంలో మడతలేవీ ఏర్పడవు కాగితం కుంగదు; మెలి తిరగదు; దానితో అవసరం తీరిన వెంటనే వేలితో సులభంగా దాన్ని ఊడదీయవచ్చు.

**rubber mould :** *రబ్బరు సంయానం.*

పోతపనివల్ల రూపాన్ని సాధించే శిల్ప ప్రక్రియలో సంయానానికై సుధాపిష్టాన్ని వాడటానికి బదులుగా ఉపయోగించే ఒక ప్రత్యామ్నాయం; సుధాపిష్టపు దానికన్నా రబ్బరు సంయానం శ్రేష్ఠతరం ఒక మూలరూపంపై 'చల్లని రబ్బరు' అనే దానిని పైపూతగా పూయటంవల్లగాని, ఆ రూపం ఆ చల్లటి రబ్బరును దట్టంగా చల్లటంవల్లగానీ

ఈ సంయావాన్ని రూపొందించవచ్చును. (సంయోజిత రీతిలో రాసాయనికంగా తయారైన రబ్బరును ప్రాతిపదికగా గ్రహించి, తయారుచేసే ఒక విధపు యౌగికమే 'చల్లని రబ్బరు' (*cold rubber*) అనబడుతున్నది. సుధాపిష్టం కన్నా రబ్బరు సిమెంటు ఎక్కువగా పనికి రావటానికి ముఖ్యకారణం అందులోని ఒదుగుతనమే. అందువల్ల దాన్ని అతిక్లిష్టములు, ఎగుడుదిగుడువి అయిన మూల రూపాలకు వాడటం సులభమేకాక, పని ముగిసిన తరవాత దాన్ని లాగివేసి వేరొక దానికై తిరిగి ఉపయోగించటానికికూడా సౌకర్యం ఉంది.

**rubbing** : ఘర్షితం.

మలచిన లేదా చెక్కిన ఒక రచనయొక్క ఉపరితలాన్ని అనుసరించి చేతితో తీసిన ఒక ప్రతి రచన మూలరచనపై ఒక కాగితాన్ని గట్టిగా బిగించి పట్టి, ఆ కాగితంపై నల్లటి, లేదా వేరొక రంగుగల పదార్థాన్ని గట్టిగా రుద్దినప్పుడు ఈ ఘర్షితం రూపొందుతుంది. ఇటువంటి ఘర్షితములకై సాధారణంగా తండుల పత్రాన్ని, తేనెమసిసీ (*heelball*) వాడతారు ఇందులో తేనెమసి కన్నా, నూనెతో చిక్కగా కలిపిన గ్రాఫైట్ శ్రేష్ఠతరం. ప్రాచీన ఉల్బణ శిల్పాలకేగాక, చర్చిలలోని స్మారక ఫలకాలకూ, సమాధి ఫలకాలకున్ను ఇటువంటి ఘర్షితములను తయారు చేయించటానికి చాలా ప్రభుత్వాలు శ్రద్ధ వహించాయి. జపానులో చేపల రూపాలకు సైతం ఇటువంటి ఘర్షితములు తయారుచేయబడ్డాయి. కొందరు కళాకారులు దీన్ని ఒక సాంకేతిక ప్రక్రియగా అభివృద్ధిపరచి, మూల రచననుంచి సాధించిన ఘర్షితములకు రంగులలో రేఖలతో కూర్పులను చేర్పులను చేసి, ఒక నూతన కళాఖండాన్ని సృష్టించే మార్గాలు ఏర్పరచారు.



ఘర్షితం 15 వ శతాబ్దిలో తయారైన స్మారకపు ఇత్తడి శిల్పానికి, సమకాలీనమైన ఘర్షితమిది, డెర్బీషైరు లోనిది ఈ శిల్పం ఒక యోధుడు, అతని పత్ని ఇందు కననగుదురు. ఒక సింహము స్పష్టాస్పష్టముగ ఇందు రూపొందింప బడుటవలన ఆ యోధుడు యుద్ధమున మరణించెననుట ఊహ్యము.

**rubbing block or rubbing brick** : గరుకుడురాయి; ఘర్షవేష్టిక.

చలువరాయిపై నున్నదనాన్ని సాధించటానికై రుద్దడంలో ఉపయోగించే ఒక సాధనం; ముఖతలం గరుకుగా ఉండి, ఇటుకలాగా ఇది ఉంటుంది.

**Rubenisme : రూబెనీయ వాదం.**

17 వ శతాబ్దిలో ఫ్రాన్స్‌దేశంలో ప్రవర్తిల్లిన ఒక కళావాదం. సూత్రపాతంకన్నా రంగుకే చిత్రలేఖనంలో ఎక్కువ ప్రాముఖ్యం ఉందనటం ఈ వాదంలోని ముఖ్యవిషయం. పౌసినీయ వాదావలంబకులతో – రంగుకు మించిన ఆధిక్యం సూత్రపాతానికే ఉందనే– ఈ రూబెనీయవాదులు వివాద పడటమేకాక కొన్నిసందర్భాలలో ఘర్షణకుకూడా దిగారు. పై రెండు వాదాలున్నూ క్రమంగా, పీటర్ పాల్ రూబెన్స్ (1577–1610), నికలస్ పౌసిన్ (1598/94–1665) అనే ప్రముఖ చిత్రకారుల పేరులతో ముడివడిఉన్నా, వాళ్ళు చనిపోయినతర్వాతనే యథార్థానికి ఈవాదాలు రూపొంది, ఆయా ప్రముఖుల అనుయాయుల చేత ఆ పేర్లతో వ్యాప్తిలోకి వచ్చాయి.

**Rubens brown : రూబెన్స్ గోధుమరంగు.**

వాన్‌డైక్ గోధుమరంగులో ఒక విధమైనది.

**Rubens madder : రూబెన్స్ మంజిష్ఠ.**

మన్నిక కలిగి, పారదర్శకమైన ఒక రంజకం; గోదుమవాక నారంగ ఆధిక్యాన్ని దీనిలో చూడవచ్చు.

**rub-out : పేషణశోధనం.**

వివిధ వర్ణద్రవ్యాల రంగులను, గుణవిశేషాలను పోల్చిచూడటానికై వాడే ఒక విధపు శోధనం. వర్ణద్రవ్యాన్ని బాగా అవిసెనూనెతో రుబ్బి, ఆ పిండిని ఒక మచ్చగా ఒక గాజు ఫలకంపై ఉంచుతారు. అట్లానే ఇంకొక వర్ణద్రవ్యపు పిండి మచ్చను దానిపక్కన ఉంచి, గాజుఫలకంపై సూర్యకాంతి పడేట్లు తిప్పినప్పుడు ఆ వర్ణద్రవ్యాల మధ్యగల భేదాలను అనుభవజ్ఞులు గుర్తించగలుగుతారు.

**ruddle : జేగురుమన్ను.**

ఒక విధమైన ఎర్రటి మృద్వర్ణ ద్రవ్యం. సంస్కరించకుండానే దీన్ని వాడతారు.

**ruler : రేఖణి; రేఖిక; రూళ్ళకర్ర.**

**ruling pen : గీతకలం.**

రేఖనం (*drafting*) లో ఒక ప్రాథమిక పరికరం. ఒకే విధమైన లొద్దుతనం కలిగిన రేఖలను గీయటానికి ఇది ఉపకరిస్తుంది. ఈ పనిని సాధించటానికై దీనికి సాయపడేవి: ఫ్రెంచి వక్రరేఖిక మొదలైనవి. ప్రామాణికపు గీతకలానికి ఒక సన్నటి పొట్టి పిడి ఉంటుంది. దానికి సంధానించి ఉండే



గీతకలం

వ్రాత పనిముట్టుతో, సమానాంతరంగా రెండు వాదరలు అమర్చి ఉంటాయి. ఈ రెండు వాదరల మధ్య, బిందుపాతి (*dropper*) ద్వారా ఒక సిరాబిందువును వదులుతారు. గీసే రేఖపై ముద్దగా సిరా పడకుండా ఉండటానికి ఈ సిరాబిందువును

తగిన అదుపులో ఉంచుతారు కలంలోని రెండు వాదరల మధ్య దూరాన్ని పెంచటానికి తగ్గించటానికీ అనువుగా వాటిని జతపరుస్తూ ఒక మరపట్టు (*screw*) ఉంటుంది అందు వల్ల వెడల్పు రేఖలను లేదా సన్నటి రేఖలను గీయటానికిగాను వాదరల మధ్య దూరాన్ని మార్పు చేయవచ్చు ఈ గీత కలాం రకాల లోనే ఒక ప్రత్యేక రకం ఉంది; దానికి వంకరతిరి ఉండే వాదర ఒకటి అమర్చి ఉంటుంది. వక్రరేఖలను గీయటానికి ఇది పనికి వస్తుంది దీన్ని వర్తుల రేఖినియొక్క చల భుజానికి అమర్చి తగినరీతిలో వాడితే వక్ర రేఖలూ, వృత్తాలూ గీయవచ్చు. ఈ గీత కలాన్నే ఆలేఖిని (*drawing pen*) అని కూడా అంటారు.

**runner** : *పేషణిక.*

1. ఉలి ఆడిన తిరుగలిరాయిలాగా కర్కశ ముఖం గలిగిన ఒక విధమైన పరికరం. తైలవర్ణాలను పొడిచేయటానికి ఇది పనికి వస్తుంది.

2 అసరమునకు పర్యాయనామంగా పోతపనిలో వాడే ఒక పదం.

**runs** : *దిగజార్పులు.*

నిలువబెట్టి ఉండే ఒక రచనయొక్క ఉపరితలంలో పైపూతగా తడిరంగును పట్టించేటప్పుడు, అనుద్దిష్టంగా రంగు కొంత కిందికి దిగజారిపోవటం. ఇటువంటివి దాదాపుగా ఇటువంటివి అయిన లోటుపాట్లు మరికొన్ని ఉన్నవి. (చూ : *curtains, frilling; streamlines; teardrop*).

**Russian sable** : *రషియా సేబిల్.*

రషియాదేశపు మంచుపిల్లియొక్క తోకలో ఉండే రోమాలు. కళాకారులు వాడే కుంచెలకు అక్కడక్కడ వీటిని వాడటం ఉంది. ఎర్ర సేబిల్‌కన్నా రషియాసేబిల్, గుణవిశేషంలో మిన్న.

**rust** : *లోహమలం; తుప్పు.*

నీటితడి తగలటంవల్ల ఏర్పడే ఇనుప భస్మం. చెమ్మ దగిలేచోట ఉంచినప్పుడు ఇనుముకు లేదా ఉక్కుకు ఉపరితలంపై ఏర్పడే ఎరుపువాక గోధుమరంగు పదార్థం.

2. లోహమలం వలె కనపడే ఒక విధపు పన్నెకుకూడా ఈ పేరునే వాడతారు.

**rustication** : *విషమలేపం; గరుకు తుకు.*

వాస్తు విషయికమైన పారిభాషిక పదం. రెండు రాళ్ళను అతకవలసినచోట జరిపే తాపీ పనిలో, ఆ రాళ్ళను కావాలనే చక్కజేయకుండా గరుకుగా ఉప్పెత్తులుగా ఉండేట్లు వదలివేయటం, ఇందువల్ల ఉపరితలపు కాంతవంటలో ఒక నూత్నశోభా-మొత్తంమీద ఒక జానపద సహజతా-అందులో ద్యోతకమవుతుంది.

**rutile** : *రూతిలం.*

టిటానియమ్ లభించే ముడి ఖనిజం. టిటానియమ్ శ్వేతాన్ని తయారు చేయటానికి ఇది పనికి వస్తుంది.

**R. W. S.** : *ఆర్. డబ్ల్యు. యస్.*

నీటిరంగుల చిత్రకారులకై ఏర్పడ్డ రాయల్ సొసైటీలోని సభ్యులలో ప్రతి ఒక్కరూ తన పేరు చివర ఉంచుకొనే ప్రామాణిక సంకేతాక్షరాలు.

# S

**Sable** : *సేబుల్.*

సైబీరియాలో పందికొక్కువలె ఉండే ఒక జంతువు. దీని రోమాలు కళాకారుల కుంచెలకు ఉపయోగపడతాయి.

**sacra conversazione** : *పవిత్ర సన్నిధి.*

బాల జీసస్ క్రీస్తును ఒడినుంచుకొన్న మేరీ మాతను ఋషిపరివృతయై వున్నట్లు రూపొందించిన చిత్రం; అందులోని వివిధ మూర్తుల మధ్య సాన్నిహిత్యం అందు వాస్తవికరీతిలో చిత్రితం. 'శాక్రా కాన్‌వర్‌సేజియోని' అనేది ఇటాలియన్ భాషా పదం. 'పవిత్ర సంభాషణ' అని దాని నైఘంటికార్థం. 15 వ శతాబ్ది మధ్యకాలానికి పూర్వం రచితములైన ఇటువంటి చిత్రాలలో ప్రతిమూర్తికూడా ఒక ప్రత్యేక ఫలకంలో చిత్రితంకాగా, అవి అన్నీ ఒక వరసలో మరతబందులతో అతికించబడి ఏక ఫలకంగా కావలసినప్పుడు అమర్చబడేవి.

**safflor** : *కుసుంభము.*

కుసుమ వర్ణద్రవ్యానికి ఒక పర్యాయ నామం.

**safflower oil** : *కుసుమనూనె.*

పాండురవర్ణం కలిగి, త్వరగా వివర్ణత చెందక, విరార్ద్రిక తైలంగా ఉపకరించే ఒక తైలవిశేషం. చక్కటి పటలనిర్మాణ లక్షణం కలిగి, రంగును నిలిపి ఉంచడంలో ఇది పేరు పొందింది. భారతదేశంలో అతి దీర్ఘ



పవిత్ర సన్నిధి : బాల జీసస్‌ను ఒడినుంచుకొన్న మేరీమాత. పీటర్ ఋషియు ఇతరులును, ఆమెను, పరివేష్టించి యుండుట కననగును. తైలకలల చిత్రము. రచయిత జియోవాన్ని బెల్లిని (1430 - 1516)

కాలంనుంచికూడా ఇది వాడుకలో వున్నది. యు.స్టే.లో ఇది ఈ 20వ శతాబ్దంలో ప్రవేశ పెట్టబడి, అప్పటినుంచి విరివిగా సాగవు తున్నది; ఆ దేశంలో పారిశ్రామికరంగంలో దీని వుపయోగం ఎక్కువ; కళాకారుల రంగులలో అవిసెనూనెకు ప్రత్యామ్నాయకంగా కుసుమనూనెను వాడటం కొంతవరకు అమలులో వున్నది. కాని విజ్ఞానశాస్త్రీయదృష్టిలో గాని, అనుభవ దృష్టితోగాని ఈ తైలపు సామర్థ్యాన్ని గురించిన అనుశీలన ఏమాత్రమున్ను ప్రచురితం కాలేదు.

**safflower pigment** : *కుసుమ వర్ణ ద్రవ్యం.*

వాడుకనుంచి అంతరించిన ఒక చలవర్ణపు ఎర్రని రంజకం. కుసుమ రంగు ద్రవ్యంనుంచి దీనిని తయారుచేస్తారు.

**saffron** : *కాషాయవర్ణం; గోసాయిరంగు.*

ఒక చలవర్ణపు పచ్చని రంగ ద్రవ్యం; ఒక విధపు వృక్షపు పువ్వులను ఎండబెట్టి దానినుంచి దీనిని తయారు చేస్తారు. ప్రాచీనులు దీనిని అభిమానించారు; కాని ఈనాడిది వర్ణద్రవ్యంగా ఆదరణ పొందటంలేదు.

**sagger or saggar** : *క్షుద్ర పేటిక.*

మా ర్పమున, వాడుకలో వున్న ఒక విధపు పెట్టె. దీన్ని ఉష్ణమృత్తిక (*fire clay*) తో చేస్తారు. పక్కగోడలు చాలా పలచగ ఉంటాయి. సాధారణపు ఆవంలో సున్నితములైన మృణ్మయ వస్తువులను కాల్చవలసి ఉన్నప్పుడు, వాటిని ఈ పెట్టెలోఉంచి ఆవంలో పెడతారు. అందువల్ల ఆవపు నిప్పు మంటలు, నేరుగా ఈ సామగ్రికి తగిలే ప్రమాదం ఉండదు. కొన్ని క్షుద్రపేటికలలో అక్కడక్కడ కుదురులను, అడ్డుచక్కలను అమర్చే వసతులుంటాయి. అందువల్ల దానిలో ఉంచే సున్నితపు వస్తువులు-పెట్టె పక్కలకు కాక ఒకదానితో ఇంకొకటి తగిలి-పాడుకాకుండా ఉంటాయి. ఉంచబడే సామగ్రి కుదురుగా నిలిచి వుండటానికై కొన్నిటిలో అడుగున గరుసు(*bitstone*) ను పోసి పరచటంకూడా వుంది.

**Saint Andrew's cross** : *సంత్ యాండ్రూ సిలువ.*

ఆంగ్ల లిపిలోని యక్స్ (*X*) అనే అక్షరం లాగా వుండే ఒక విధపు సిలువ.

**Saint Anne marble** : *సంత్ యానీ చంద్రశిల.*

ఒక విధపు గాఢ నీలాసిత చంద్రశిల: దీనిపై తెల్లటి చారలు కనపడతాయి. ఇది బెల్జియంలోని సంత్ యానీ ప్రాంతంలో లభిం చటంవల్ల దీనికి ఆ పేరు వచ్చింది.

**Salian art** : *శాలీయ కళ.*

జర్మనీదేశపు కళాశైలులలో ఒకటి. 11 శతాబ్ది మొదటి పాదం మొదలుగా 12 శతాబ్ది మొదటి పాదంవరకూ ఈ శైలి వరిఢవిల్లింది. జర్మనీలో 918-1024 మధ్య కాలంలో పాలించిన ఆటోనియన్ చక్రవర్తు

కాలంలో వ్యాప్తిపొందిన కళలోని విభావనా రీతితోను, అందే అక్కడక్కడ ద్యోతకమైన అతిమాత్రపు ప్రగాఢతతోనూ విసుపెత్తిన కళాకారులు, పైవానికి ప్రతిచర్యగా రూపొందించినదియే ఈ శైలి అని తోస్తున్నది. ఆటోనీయ కళాశైలిని కాదని, ఈ కళాకారులు, అంతకు పూర్వకాలానివైన బైజాన్ టైన్ రచనలను అనుకరించి అందులోని స్థిరతకు, సమ్మిళితభావనా సూత్రాలకు తిరిగి ప్రతిపత్తిని కల్పించారు. చిత్రలేఖనంలోను, శిల్పంలోను ఆదరణను ఆ కాలమున ఆర్జించిన ఈశైలికి ముఖ్య కేంద్రాలు రీజెన్స్బర్గ్, సాల్స్బర్గ్ అనే నగరాలు.

**salmon pink** : *ప్లవనికా పాటలం.*

**Salon** : *ప్రదర్శన శాల.*

17వ శతాబ్దిలో కాల్బర్ట్, లెబ్రూన్ అనే వారు (ఫ్రాన్స్ దేశంలో వ్యవస్థిత శిల్ప చిత్ర కళల రాయల్ అకాడమీ సభ్యులు) తమ చిత్రాలకై ఏర్పాటు చేసిన ప్రదర్శన ఈ పేరుతో వ్యవహృతం. ఇటువంటి ప్రదర్శనలు మొదట పారిస్లోని లౌవ్రే మ్యూజియంలోని సాలన్ (స్వాగతశాల)లో జరగటంవల్ల ఈ పేరు దీనికి లభించింది.

**Salon des Independants** : *స్వతంత్ర ప్రదర్శన.*

పారిస్ నగరంలో ఏటేటా సాగే కళాప్రదర్శన. పాధికారమైన అకాడెమీవారిచే నిరాకరించబడిన రచనలలోని కొన్నిటి రచయితలు తాము ఒక వర్గంగా ఏర్పడి, 1884 లో ఒక ప్రదర్శనను తామే నిర్వహించడంతో ఈ వార్షిక ప్రదర్శనలలో మొదటిది జరిగింది. ఆ రచయితలలో ప్రసిద్ధ చిత్రకారులైన స్యూరత్, రెడాన్కూడా వుండిరి.

**Salon des refuses** : *ఉచ్ఛిష్ట ప్రదర్శన.*

1863 లో పారిస్ నగరంలో నిర్వహించిన ఒక కళాఖండ ప్రదర్శన. ఆధునిక చిత్రణయొక్క ఇతిహాసంలో ఒక మైలు రాయిగా ఈ ప్రదర్శన ప్రసిద్ధిపొందింది. పాధికార ప్రతిపత్తి కలిగిన అకాడెమీ (చూ : *Academie des Beaux-Arts*)వారు నిర్వహించే వార్షిక ప్రదర్శనలలో నిరాకరించబడిన చిత్రాలకు, ప్రకాశన పేటికగా వ్యవహరించే నిమిత్తమై, ఆ చిత్రాల రచయితల ప్రోత్సాహ ఫలితంగా, ఆనాటి ప్రభువైన నెపోలియన్ III చేత ఇది వ్యవస్థితమైంది. ఆ ప్రదర్శనలోని ఒక చిత్రం, చాలామందికి ఉద్రేక, సంభ్రమ జనకమైంది. దానిని రచించినవారు మానే. దైనందిన జీవితపుసంఘటన ఒకటి అందులో చిత్రితం. కాని అందులో వస్త్రాలు ధరించిన వారితో పాటుగా ఒక దిగంబరికూడా వున్నట్లు రూపితం. మానే రచించిన ఈ చిత్రమేగాక మోనే, పిస్సారో, విస్లర్ రచించినవికూడా అందులో ప్రదర్శితములు.

**salt glaze** : *ఉప్పుమెరుగు; లావణ్యాద్యుతి.*

మార్తవ సామగ్రికి మెరుగు పెట్టటంలో ఒక రకమైన ప్రక్రియ. ఈ మెరుగు పారదర్శకం. ఇండ్లలో వాడుక చేసే సాధార

ఇవు ఉప్పును, అవం పరమోచ్చ ఉష్ణస్థితిలో వున్నప్పుడు దానిమంటపై వేయటం ఇందులో జరుగుతుంది. అట్లా వేయబడిన ఉప్పు అవిరిగా మారి మార్దవ సామగ్రియొక్క ఉపరితలంతో మేళనమవుతుంది. తత్ఫలితంగా ఆ సామగ్రిపై సోడియమ్ సిలికేట్, కాచపటలం లాగా కుదురుకొంటుంది. ఈ ప్రక్రియ హాలండ్, జర్మనీ దేశాలలో 12 వ శతాబ్ది నాటికే పరిపుష్టతను ఆర్జించింది. 18 వ శతాబ్దిలో ఇంగ్లండులో ఈ ప్రక్రియ చక్కగా వికసనాన్ని పొందగలిగింది.

**Samian pottery** : సామియా మృత్సామగ్రి.
( terra sigillata)

**sandarac** [1] : *సాందారకము.*

వార్నిషుల తయారీలో వాడుక చేసే ఒక మెత్తని యక్షిధూపం. కాలం గడచినకొద్దీ నలుపు మీరటమో, ఎరుపు మీరటమో దీనిలో కనవడుతుంది. కాబట్టి దీనిని వాడటానికి బదులుగా ఇంకొక మృదుయక్షధూపమైన మాస్టికము(*Mastic*)ను తరచుగా వాడతారు.

**sandarac** [2] : *హరితాళం; అరదళం.*

**sand box** : *ఇసుకపెట్టె; సికతాపేటిక.*

లోహపు రేకుతో ఒక ఆకృతిని నిర్మించవలసిఉన్నప్పుడు, ఆ రేకుకు కింద దిండుగా ఉపకరించటానికై పోసిన ఇసుక ఉన్న ఒక చిదపు పెటె. రేకును సుత్తెతో కొట్టినప్పుడు ఈ ఇసుక, రేకుకు కిందినుంచి ఆఘాతం తగలకుండా, కాపాడుతుంది. పగిలినపింగాణీ, లేదా గాజువస్తువులను అతికించేటప్పుడు, అతికిన వాటిని ఈ సికతాపేటికలో ఉంచుతారు. అరిపోయేలోపల అవి విచ్చిపోకుండా పెట్టెలోని ఇసుక వాటికి అండగా ఉపకరిస్తుంది.

**sand casting** : *సికతా నిషిక్తము.*

లోహశిల్పాలను-అందునా సుషిర శిల్పాలను-పోతపోయటానికి కొలిమి ఇసుకతో తయారైన సంయానాన్ని వాడే ప్రక్రియ. మూల శిల్పాన్ని అనుసరించిన సుధాపిష్టపు పోత విగ్రహం చుట్టూ ఇసుకను తగినరీతిలో దట్టంగా పట్టిస్తారు. అయితే విగ్రహానికి ఒకే ఒక వర్గ్యాయం పట్టించక, అందులోని ఒక్కొక భాగానికి ఒక్కొక్కసారిగా పట్టించి, అటువంటి దొల్లలను బయటకు తీసి అన్నిటినీ ఉచిత రీతిని సంధించటంతో సికతా నిర్మితమైన ఆంశిక సంయానం (*piece mould*) రూపొందుతుంది. ఇది మూల శిల్పానికి వ్యస్త (*negative*) రూపంలో ఉంటుంది. దానిలోని ఖండాలు విడిపోకుండా ఉండటానికై ఆ సంయానానికి గట్టిగా చుట్టి ఒక ఇనుప చట్టమును అమరుస్తారు. లోహపు పోత ముగిసిన తరవాత ఆ నిషిక్తం చక్కగ గట్టిపడేవరకు, ఆ చట్టము అట్లాగే ఉంటుంది. ఇట్లా ఇనుప చట్టంలో సికతా సంయానాన్ని బిగుతుగా అమర్చిన తరవాత సుధాపిష్టపు అనురూపము (*Model*) తీసివేస్తారు. అప్పుడు శిల్ప కంకాళంలో ఇసుకతో రూపొందించిన అంతరిక (*core*) ను ఒకదానిని సంయానం

లోని డొల్లభాగంలో కొంత అక్రమించేట్లు ఉంచుతారు. ఆ తర్వాత మొత్తం సికతా సంయోగాన్ని చక్కగా నివ్వుపై బాగా అరేట్లు కాల్చిన తరవాత, దానిలోకి కరిగిన లోహాన్ని పోయగా, అది ఆ సంయోగం లోని డొల్లలో ఉన్న ప్రదేశాన్ని తప్ప తక్కినదానిని నింపుతుంది. సంయోగం ఇసుకతో చేసినది కావటంవల్ల లోహం చల్లబడే టప్పుడు వచ్చే ఆవిరియు, వాయువులును దాని నుంచే బయటకు పోగలవు. తర్వాత పోత అంతా చల్లబడిన తరువాత ఆ నిషిక్తమును, మధూచ్ఛిష్ట విధానవు దానితో చేసినట్లుగా, నునుపుచేసి తీర్చాలి. కొందరు శిల్పులు ఇంత శ్రమపడటం ఇష్టపడక తమ రచనను సమర్థుడైన ఒక కొలిమి పనివానికి పంపించి అతడి చేతనే ఈ ప్రక్రియలో ఈ సుషిర శిల్పాన్ని పోతపోయిస్తారు; తరవాత నిషిక్తమునకు తుదిమెరుగులు మాత్రం తామే దిద్దుతారు; లేదా తమ ఆధ్వర్యంలో దిద్దేట్లు చేస్తారు.

**sand coat or sand finish** : *ఇసుకపూత లేదా సికతా సంసాధనం.*

భిత్తిచిత్ర రచనలో సాగించే మూడవ పైపూత; గారసున్నం ఒక పాలులో, రెండున్నరనుంచి మూడుపాళ్ళ వరకు ఇసుకను గాని, చలువరాతి పొడిగాని కలిపితే ఈ పైపూత ద్రవ్యం తయారవుతుంది. ఒక్కొక్కప్పుడు ఇసుకపాలులో మూడవవంతు తగ్గించి దానికి ప్రత్యామ్నాయంగా కుండపెంకుల పొడిని చేర్చటంకూడా ఉంది. భిత్తిచిత్రరచనలో రెండో పూత అయిన గోధుమపూత బాగా బిగిసిన తరవాత దీన్ని వేస్తారు. అయితే దీనిని వేసేటప్పటికి గోధుమపూత తడి ఆరకుండా మాత్రం ఉండాలి. ఈ పూతను పట్టించటానికి పారకాపీ (*flat*) ని ఉపయోగించి పూతను ఆ కాపీతోనే నునుపుచేస్తారు. (చూ : *scratch coat; intonaco.*)

**sand coat-arenato** : *సికతాలేపనం; ఇసుక తప్పు.*

**sanders blue** : *చందన నీలం.*

అతిసాగరిక భస్మానికి అపభ్రంశనామం.

**sand finish** : *సికతా సంసాధనం.*

(చూ : Sand coat.)

**sand-grain ground** : *సికతాకణ భూమిక.*

ఒక విధమైన జలచ్ఛవి భూమిక. ఒక ఫలకంపై ఒక నిరోధితో నిండుగా పైపూతను పట్టించి దానిపై ఒక మెరుగు కాగితాన్ని బోరగిలవేసి ఆ మొత్తాన్ని ఒక సూచీముద్రణ యంత్రంనుంచి బయటకు తీయగా, భూమికపై ఏకరీతిలో, సమానాంతరత కలిగిన చిన్న గుంటలు ఏర్పడతాయి. తరవాత క్షయకరిని వాడినప్పుడు, ఈ గుంటలలో అది దంశనం సాగిస్తుంది. ఇటువంటి ప్రక్రియలో, అమెరికావాసి అయిన జోసెఫ్ పెన్నెల్ మేటి ప్రజ్ఞావంతుడుగా పేరు పొందాడు.

**sand painting** : *సికతా చిత్రణ; రంగవల్లి చిత్రణ.*

అనేక విధాల పేర్లతో నానాదేశాలలో వాడుకలో వుండే చిత్రణ. ఇందులో పొటిగా వుండే చూర్ణాలను చిత్రణకై వాడతారు. ఆదిమ నాగరికతలోను ఇవి కనవడుతున్నాయి. భారతదేశంలోనూ, దానిని అధికంగా అనుసరించిన వివిధ దేశాలలోనూ పూజా మందిరాలలో వేసే పిండిముగ్గులు, మండలాలు వీటి కోవకు చెందినవే.

**sand-paper** : *మెరుగుకాగితం; సికతావత్రం; ఉప్పుకాగితం; గరుకుకాగితం.*

**sandstone** : *సికతాశిల; ఇసుకరాయి.*

నిర్మాణాలకు పనికివచ్చే ఒక విధపు గట్టి రాయి. ఇసుక కణాలను ఒకదానితో ఇంకొకటి గట్టిగా సహజసిద్ధంగా అతికేట్లు చేయటం వల్ల ఈ రాయి రూపొందుతున్నది. ఈ కణాలను ఇట్లా గట్టిగా అతకటానికోసం అందులో ఒక విధమైన సున్నంవంటి పదార్థం ఇమిడి వుంటుంది. వివిధ వర్ణాలలో - పసుపు, గోధుమరంగు, ఎరుపు, ఆకుపసిమివాకలలో - ఇది లభిస్తుంది.

**sang de boeuf** : *వంగ పింగాణి.*

గాఢంగా కర్బురితమై కటిక ఎరుపుగా అక్కడక్కడ కనపడే ఒక విధపు పింగాణి. ఇది చాల శ్రేష్ఠమైన పింగాణి. చీనాదేశంలో మింగ్ రాజవంశపు కాలం(1868-1644)లో ఇది విస్తృతంగా తయారు చేయబడింది. పింగాణిపైన ఇచ్చిన రాగిమెరుగును తక్కువ ఉష్ణతలో మరగగాచినప్పుడు ఇటువంటి రంగురీతి ఏర్పడేది.

**sanggam** : *సంజమ ప్రక్రియ.*

మృత్సామగ్రిని అలంకరించడంలో కొరియా దేశీయులు అవలంబించుచున్న ఒక ప్రక్రియ. ఆదేశంలోనే వాడుకలో వున్న * మిషిమా అనేదానికన్నా ఇది వేరైనది. మిసిమాలోని సామగ్రిపైన నిమ్న భాగాలను ఏర్పరచటానికి అనువైన ముద్రలను వాడతారు. కాని సంజమ ప్రక్రియలో ముద్రలకు బదులుగా ఒక అనువైన సాధనంతో, కావలసిన ఆకృతులను మట్టిలోనే లోతుగా గీస్తారు. ఆ తరవాత ఆ నిమ్నప్రాంతాలకు మెరుగుగా వాడే ద్రవ్యాన్ని పట్టిస్తారు.

**sanguine** : *రక్తిక; రక్తఖటిక.*

తప్తస్వర్ణానికి సన్నిహితమైన ఒక విధపు ఎరుపువన్నె. ఆ రంగుకల ఒక ఖటికకుకూడా ఇదే పేరుంది.

**sans serif** : *అశోభిక.*

**sap green** : *సారహరితం; వనరురంగు.*

నేడు వ్యాప్తిలోలేని ఒక రంజక వర్ణద్రవ్యం; ఒకవిధపు వృక్షపు పచ్చికాయల నుంచి దీన్ని తయారుచేసేవారు.

**saponification** : *సర్జికా కరణం.*

**saponify : *సర్జీకరించు.***

సబ్బుగా తయారుచేయటం. ఒక నూనెను గాని, కొవ్వునుగానీ, మైనాన్నిగానీ ఏదైనా క్షారద్రవ్యంతో కలిపితే దానిని సర్జీకరించటానికి వీలవుతుంది.

**saponin : *సర్జికా చూర్ణం.***

ఫేనిల వృక్షపు బెరడును ఎండబెట్టి పొడి గొట్టినప్పుడు లభించే చూర్ణం. దీన్ని నీటితో కలుపగా వచ్చే నురుగువల్ల మృదువైన వస్తువులలోని మురికిని తొలగిస్తారు.

**sarcophagus : *శవభాజనము.***

ప్రాచీన కాలంలో ఈజిప్టు, గ్రీసు మొదలైన కొన్ని దేశాలలో శవాలను నిక్షిప్తం చేయటానికి శిలతోగాని, మట్టితోగాని తయారవుతూ వచ్చిన పేటిక. ఇటువంటి పేటికల పైనా, పక్కలనూ వివిధ చిత్రాలు ఉల్బణ రీతిలో రచితములయ్యేవి.

**sarrancolin marble : *సర్రంకలీన చంద్రశిల.***

ఒక విధమైన ఫ్రాన్సుదేశపు చంద్రశిల; ఇందులో ధూసర, అరుణ, పీత వర్ణాలలో ఏదోఒకటి ప్రాముఖ్యాన్ని ప్రదర్శిస్తుంది. పిరనీస్ పర్వతాలలోని సర్రంకలీన్ ప్రాంతంలో ఇది లభిస్తుంది:

**satinwood : *కౌశనిక.***

మచ్చల రవపలుకు గలిగి, వడ్రంగిపనికి చక్కగా ఉపకరించే సువర్ణస్థాయిక కఠిన దారువు.

**saturation : *సంలీనత; అతిసంవనం.***

వర్ణ పరిభాషలో వర్ణపు స్ఫుటత లేదా గాఢత, తెల్లవర్ణం లేదా రంగుమావు లక్షణాలు ఏవీ లేకపోవటం అనే అర్థంలో ఈ పదం వాడబడుతున్నది.

**saturnine red : *మందారుణం; శనిసిందూరం.***

సిందూరానికి పర్యాయనామం.

**sa yrs : *వనదేవతలు.***

ప్రాచీన గ్రీకులు ఆరాధించిన డయోనీసస్ అనే దేవుడికి పరివారంగా భావించే దేవతాగణం. కొండలకు, వనాలకు వీరు అధిదేవతలు. ఇందు కొందరికి పాదాలూ, కొమ్ములూ, తోకా-మేకలకున్నట్లు-ఉండేవి. కొన్నిటికి చెవులూ, పాదాలూ, తోకా-గుర్రానికి ఉన్నట్లు-ఉండేవి. ఈ రూపాల చిత్రాలు క్రీ. పూ. 7 వ శతాబ్దిలో మొట్టమొదట కలశాలపై కనపడుతున్నాయి. హెల్లెనీయ యుగానికి పూర్వపు శిల్పంలో ఇటువంటి రూపాలు ఎక్కడా కనపడటంలేదు.

**saunders blue : *చందనికా నీలం.***

చందన నీలానికి పర్యాయనామం.

**Saxon blue : *సాక్సన్ నీలిమ.***

కాచికకు పర్యాయనామం.

**scagliola** : *కల్పశారి.*

పరాసీయ సుధాపిష్టంతో లేదా సిమెంటుతో కొన్ని ఇతర పదార్థాలను కలపగా రూపొంది, అలంకరణకు ఉపయోగించే ఒక మిశ్ర ద్రవ్యం. ఇందులో పై రెండిటిలో ఏదో ఒకదానితోపాటుగా, చలువరాతి ధూళి-ఇంకా దానివలెనే జడతకు పేరొందిన కొన్ని పదార్థ శకలాలను - అవసరమయ్యేట్లయితే కొంత బంకకూడా కలుపుతారు. ఒక ఉపరితలం మీద దీన్ని తగిన రీతిలో పట్టిస్తే, చిత్ర విచిత్ర రీతిలో చలువరాతిలో వివిధ మణుల నతికినట్లు భ్రాంతిని అందులో పరిణామం కలిగిస్తుంది.

**scale**[1] : *నియతి; శ్రేణికానియతి;* ప్రమాణం; స్కేలు.

అలిఖితమయ్యే వస్తువులోని లేదా దృశ్యంలోని కొలతలకున్నూ, దానికి మూలంగా ఉన్నదాని ఆయా కొలతలకున్నూ మధ్య వేద్యమయ్యే నిష్పత్తి. ఈ కింది విషయాన్ని ఇందుకు ఉదాహరణంగా గ్రహించవచ్చు. ఒక భవనపు ఆలేఖనాన్ని తయారు చేసేటప్పుడు భవనములోని కొలతలతో- ప్రతి పది అడుగుల దూరాన్ని ఆలేఖనంలో ఒక అంగుళంతో సూచించితే ఆ ఆలేఖన నియతి 'ఒక అంగుళం = 10 అడుగులు' అవుతుంది.

**scale**[2] : *అడుగుబద్ద; మానదండిక.*

యాంత్రికాలేఖనంలో వాడే ఒక కొలబద్ద.

**scale**[3] : ప్రమాణం.

ఒక కళారచనలో కనపడే సాపేక్ష పరిమాణం లేదా విస్తృతి. ఉదాహరణకు 'ఒక చిత్రలేఖనం చాలా మహత్తమ ప్రమాణంలో చిత్రం' అనేటప్పుడు ఇటువంటి వాడుక కనపడుతున్నది.

**scale drawing** : *నియతి లేఖనం.*

మూల వస్తువు, నిర్మాణం లేదా దృశ్యంలోని వివిధాంగాల నిడువులు, వాటిమధ్యగల దూరాలు అనే వాటికి తగిన నిష్పత్తిలో అమరిన ఆయా వివిధాంగాలను సూచించే రీతిలో, అలిఖితమయ్యే ప్రాతికాల్పనిక ఆలేఖనం, విన్యాసం, దేశపటం, లేదా రేఖాపటం.

**scales, architicts; scales engineers'** : *వాస్తువిదుల అడుగుబద్దలు (మానదండికలు); ఇంజనీర్ల అడుగుబద్దలు (మానదండికలు).*

వాస్తువేత్త అడుగుబద్ద అనేది రెండు లేదా మూడు ముఖతలాలు కలిగిన కొలబద్ద. ఈ ముఖతలాలపై ఒక అడుగుకు వేర్వేరు నియతుల చొప్పున గురుతులు గీసిఉండి అంగుళాలలో ఉపవిభజన పొంది ఉంటాయి. నియతిని



వాస్తువిదుల అడుగుబద్ద

అనుసరించి ఆలేఖనాలను తయారుచేయటానికి వాస్తువిదుడు దీన్ని ఉపయోగిస్తాడు. సాధారణంగా 1''=1''; 1/2''=1''; 1/4''=1''; 1/8''=1'; 3/8''=1'; 1 1/2''=1'; 3''=1'; 3/32''=1'; 3/16''=1'; అనే నియతులలో ఈ అడుగుబద్దలు ఉంటాయి. దీని పద్ధతి దిగువ ఉదాహరణం వల్ల విదితం అవుతుంది. 3/8''=1' అనే నియతి కల అడుగుబద్దలలో ప్రతి 3/8'' న్ను 12 ఉపభాగాలుగా విభజితమవుతుంది. అప్పుడు ఇందులో ఒక్కొక్క ఉపవిభాగం. మూలంలోని 1'' కు సమానం అవుతుంది.

వాస్తువిదుల మానదండికలు, సాధారణంగా బొప్ప కొయ్యతో నిర్మితమవుతాయి. కాని ఇతర విధాలైన కొయ్యలతో చేయబడేవికూడా ఉన్నాయి. ఒక్కొక్కప్పుడు కొయ్యతో గాకుండా, కల్పకంతోగాని, అల్యూమినియంతోగానీ ఈ మానదండికలను తయారు చేయుటంకూడా వుంది. ఒక్కొక్క ముఖతలానికి రెండు అంచులలో ప్రతిదీ-రెండువైపులా ఒక్కొక్క అడుగుబద్దగా వ్యవహరిస్తూ-కొలతల అమరిక మాత్రం విభిన్న దిశలనుంచి సాగవచ్చు. ఈ తీరుగా చేసినప్పుడు ఒక్కొక్క ముఖాన నాలుగు విభిన్న నియతులను అనుసరించిన కొలతల ఏర్పాటు వుండే వసతి ఏర్పడుతుంది. వాస్తువిదుల అడుగుబద్దలలో బహుముఖాలు కలవికూడా వున్నాయి. సాధారణంగా లభ్యమయ్యేదానికి ఆరు ముఖతలాలు ఉంటాయి.

ఇంజనీరు అడుగబద్ద, వాస్తువిదుని అడుగుబద్దకన్నా వేరైన పద్ధతిలో ఉంటుంది. ఇంజనీరుల అడుగుబద్దలలో కొలతల ఏర్పాటు దశాంశ పద్ధతిలో జరుగుతుంది. అందువల్ల ఒక అడుగు దూరం-ఇక్కడ-అంగుళాలకు బదులుగా దశాంశాలలో సూచితం. సాధారణంగా ఇందులోని నియతులు 1''=10' మొదలుకొని 1''=60' వరకు అమరి ఉంటాయి. ఈ అడుగుబద్దలు ఒక దిశనుంచి మాత్రమే చదవటానికి వీలైనవి. అందువల్ల ముఖతలంలో రెండుమాత్రమే ఉండే వీలుంటుంది. ఈ విధంగా త్రిదళకమైన అడుగుబద్దలో ఆరు అడుగుబద్దలు మాత్రమే ఉండే వీలుంటుంది. పాండులేఖనాలను, ఆలేఖనాలను విస్తృతీకరించటానికి, లేదా న్యూనీకరించటానికి పలువురు కళాకారులకు వాస్తువిదులు, ఇంజనీరులు ఉపయోగించే ఈ రెండురీతుల మానదండికలను పనికివస్తున్నాయి.

**Scandinavian art** : స్కాండినేవియా కళ.

నార్వే, స్వీడెన్, డెన్మార్కు దేశాలు సమష్టిగా స్కాండినేవియా అని వ్యవహృతాలు. ఆ ప్రాంతంలో కళాకృషి అత్యంత ప్రాచీన కాలంనుంచికూడా నెలకొన్నది. భూగోళం హిమప్లవనంనుంచి విడివడినంతట మానవుడు శిలా యుగంలో అడుగుబెట్టిన కాలంనుంచి కూడా ఈ కృషి అక్కడ సాగినట్లు అక్కడి గుహలలోని అధిరేఖనాలవల్ల తెలుస్తున్నది. కాని అందులో అంతగా కళావిశిష్టత, మౌలికత కనపడదు. క్రీ.శ. 800 మొదలుగా, వైకింగులనే సాహసిక నావికులమూలాన ఈ దేశాలకు తక్కిన దేశాలతో పరిచితి, తద్వారా కళాభివృద్ధి [illegible]డాయి.

**scarlet lake : *శోణిత రంజకం.***

పారదర్శకమైన ఒక రంజక వర్ణద్రవ్య విశేషం. పూర్వంలో ఇది కిరిమి (*cochineal*) క్రిముల శుష్క కళేబరాలనుండి తయారు చేయబడేది. ఒక్కొక్కప్పుడు అందులో సిందూరం (*vermilion*) కూడా కలిపేవారు. కాని 19వ శతాబ్ది ఉత్తరార్థం మొదలుగా సంయోజిత వర్ణపదార్థాలనుంచి కాంతివంతములైన శోణిత రంజకాలు తయారవుతున్నాయి. ఈ రంజకాన్ని, కళాకారుల వర్ణద్రవ్యంగా ఈ కాలంలో పరిగణించటంలేదు; దానికి మన్నిక చాలా తక్కువ కావటమూ, అందులో కొన్ని రకాలను నూనెలో కలిపి పూతరంగులుగా వాడినప్పుడు అవి చెమ్మగిలటము ఇందుకు ముఖ్యకారణాలు. సంయోజితరీతిలో తయారైన శోణితరంజకాలు క్రిమినుంచిలభించే వాని కన్నా ఎక్కువ కాంతిమంతములే అయినా వాటి మన్నికకూడా చాల తక్కువే; అందువల్ల కళాకారులకు అవి పనికిరావటంలేదు.

**scarlet vermilion : *శోణిత సిందూరిక.***

సిందూరికలో నీలివాళగానో లేదా పసిమి తక్కువగానో ఉండేది.

**scenic colour : *రంగికా వర్ణం.***

ఒక విధమైన పూతరంగు; నిరార్ద్రమై, కాంతిభేద్యమైన వర్ణద్రవ్యాన్ని, వేడిగా ఉండే బంక ద్రావణంతోనూ, ఆ తర్వాత నూనెతోనో దధిచూర్ణంతోనో బాగా కలపగా ఈ వర్ణం లభిస్తుంది. దీన్ని పైపూతగా వాడి ఆరనిస్తే ఏర్పడే పటలం నీటిలో కరగదు. దీనిని, రంగస్థల దృశ్య చిత్రణలో వాడతారు. చిగురురంగులనూ, లంగుర వర్ణాలనూ, ఈ రంగికావర్ణాలు పోలి వుంటాయి. విస్తృత ప్రదేశాలను అలవోకగా చిత్రించటానికి ఈ వర్ణం బాగా ఉపయోగిస్తుంది. దీన్ని బౌకబారు కాగితంపైగానీ, కాటికపైగానీ, ఏ రకమైన ఉపాధులతో నిమిత్తం లేకుండా వాడవచ్చు. ఇది కాంత్యభేద్యం కావటంవల్ల ఆరిన తరవాత రంగును మార్చడం, లేదా పైన ఇంకొక రంగును వేయటం సులభ సాధ్యం. అయితే మన్నికగా ఉండవలసిన చిత్రాలకూ, మహార్థక చిత్రాలకూ దీన్ని ఉపయోగించరు. దీనికే ఆంగ్లదేశంలో సైజు రంగు (*size colour*) అనే పేరుంది.

**Scheel's green : *షీలీ హరితం.***

రాసాయనికంగా ఇది రాగి ఆర్సనైట్‌గా వ్యవహృతం. ఇది విషయుక్తపు వర్ణద్రవ్యం. కళాకారుల వర్ణద్రవ్యంగా దీనికి ఆదరణ లేదనియే చెప్పవచ్చు. షీల్ అనే ఒక జర్మన్ శాస్త్రజ్ఞుడు దీన్ని కనుగొన్నాడు.

**schema : *మాత్రలేఖనం.***

ఆలేఖనంలో రూపించే ఒక తొలిరేఖాచిత్రం; ఒక రచనలోని సంవిధానాన్ని, నిష్పత్తి రీతిని చక్కగా తప్పులేకుండా ఉంచడంలో, మార్గదర్శిగా ఇది ఉపకరిస్తుంది. మూర్తికాలేఖనం (*figure drawing*) లో విద్యార్థులకు శిక్షణ ఇచ్చే సమయంలో, మూర్తిలోని తల, కబంధం, అవయవాలు—అనేవాటి సాపేక్షక ఆకృతి

విశేషాలను, నిష్పత్తి రీతులను గోళ, ఘనా కృతులవల్లనూ రేఖలవల్లనూ తెలియజేయటానికి జ్యామితీయ సూత్రలేఖనం తరచుగా వినియుక్తం. తలకు సంబంధించిన సూత్రలేఖనం అండాకృతిగా ఉండగా, అందులో నిలువుగా గీసిన గీతలో ముక్కు, నోరు, గడ్డాలమధ్య బిందువులు రూపించబడతాయి. అడ్డంగా ఉండే వక్రరేఖలలో కళ్ళు, ముక్కుకొన, పెదవులు ఉండే చోట్లు నిర్దిష్టాలవుతాయి.

**Schnitzer's green** : ష్నిట్జర్ హరితం.

ఒక ప్రత్యేక రీతిలో తయారయ్యే క్రోమియమ్ భస్మహరితం.

**school** : సంప్రదాయం.

కళా విమర్శలో తరచుగా వినవచ్చే ఒక పద విశేషం. ఒక కళావిశేషం లేదా కళాకారుని రచన రూపొందిన దేశం (ఉ: ఫ్లెమిష్ సంప్రదాయం), ఆ కళాభావనా రీతి (ఉ : సహజతా సంప్రదాయం) ఏదో ఒక కళావాదానికి కట్టుబడి ఉండటం (అనుభావనావాద సంప్రదాయం) అనే వాటిని గుర్తించి ఇది నిర్దేశిస్తుంది. ఇంతేకాదు, ఒక ప్రత్యేక కళాకారుని వరవడినో, (ఉ : జియోట్టో సంప్రదాయం), ఒక నిర్దిష్ట దేశకాలాలకు సంబంధించి ప్రస్ఫుట ప్రభావంగల ఒక వరవడినో (ఉ : చీనీయ సంప్రదాయం) తెలియజేయటానికిన్నీ దీన్ని వాడతారు.

**school of Cologne** : కొలోన్ సంప్రదాయం.

14 వ శతాబ్ది ఉత్తరార్ధం మొదలుగా 16 వ శతాబ్ది మధ్యకాలం వరకు కొలోన్ నగరంలో తన కళాకృషిని సాగించిన ఒక చిత్రకార బృందం. ఈ బృందంలోని వారిలో అత్యధిక సంఖ్యాకుల పేర్లు తెలియరావటం లేదు. చర్చిలలో అలంకరణ చిత్రాలను రచించటంలో వారు ప్రముఖంగా తమ కళాభిజ్ఞతను వినియోగించారు. తాము చిత్రణకై గ్రహించిన వస్తువును ఆదర్శీభూతం చేసి, దాని పరిష్కృత ప్రాతికాల్పనిక రూపాలను కల్పించటంలో ఆ సంప్రదాయంవారు శ్రద్ధ వహించారు. హాలండు, బెల్జియములలోని కళాకారులు, ఇంతకన్నా తక్కువగా వాస్తవికతను ప్రదర్శించే చిత్రాల రచనకై నిరంతర శ్రద్ధ వహించి పని చేయటానికి పూనుకొన్న తరవాత, కొంతకాలం వరకుకూడా ఈ కొలోన్ సంప్రదాయపువారు, తమ మార్గం నుంచి వైదొలగక, తమ కృషి సాగించారు. ఈ సంప్రదాయపు చిత్రకారులలో అత్యధిక ప్రతిష్ఠను ఆర్జించినవాడు స్టీఫాన్ లోక్నర్. ఇతడు 15 వ శతాబ్ది మధ్యభాగంలో కొలోన్‌లో తన కృషి సాగించాడు. ఈ సంప్రదాయపు వారిలో చిట్టచివరి ప్రముఖుడు బార్థలోమియస్ బ్రూయిన్; ఇతడు 1555లో చనిపోయాడు.

**school of Paris : పారిస్ సంప్రదాయం.**

ద్వితీయ ప్రపంచ యుద్ధపు ఆరంభం వరకు, 20వ శతాబ్దంలో, పారిస్ నగరం కేంద్రంగా పనిచేసిన చిత్రకారులందరికీ, సర్వసాధారణంగా వ్యవహారంలో ఉన్న సామూహిక పదం. అయితే అధివాస్తవికతా, వివిక్తతావాదాలకుచెందిన కళాకారులు మాత్రం ఈ లెక్కలోకి రారు. ఈ 'పారిస్ సంప్రదాయం' 1920 లు, 1930 లలో పరాకాష్ఠ నందుకొన్నది. ఆ కాలంలో, ప్రపంచపు కళాకారులందరూ తమ కృషికి అనువైనదావు పారిస్ నగరం మాత్రమే అని భావించిరా అని అనిపించేటంతస్థాయిని అదిఅపుడందుకొన్నది. దీని పేరులో 'సంప్రదాయం' అనేపదం ఉండటంవల్ల ఇది ఒక ప్రత్యేక శైలిని సూచిస్తుందనుకోవటం ఒక అపోహ. వన్య, స్థూలతా వాదాలేగాక, ఇంకా పెక్కుకోవలకు చెందిన కళాకారులుకూడా ఈ సంప్రదాయానికి చెందినవారుగా పరిగణనీయులు. ఈ చివర తరగతికి చెందిన ప్రముఖులలో కొందరు : అమీడియో మోడిగ్లియానీ (1884-1920), జూలిస్ పాసిన్ (1885-1930) చెయిమ్ సౌటెన్ (1894-1943), మారే చాగల్ (జ. 1887), మారిస్ ఉట్రిల్లో (1883-1955), మొయిసే కిస్లింగ్ (1891-1953). నివాసరీత్యా అమెరికాకు చెందినవారైనా తమ ఇంట్లోనేఉండో, లేదా పారిస్‌లో కొంత కాలం వసించో, పారిస్ పోకడలను అనుకరించిన కళాకారులను సైతం పారిస్ సంప్రదాయపు అనుయాయులుగానే, అమెరికాలోని తక్కిన సంప్రదాయాల కళాకారులు భావిస్తారు. (స్థూలతా వాదానికి చెందిన పికాసోను ఈ సంప్రదాయపు అనుయాయులందరిలో విశిష్టమూర్తిగా పరిగణించటం పరిపాటి అయింది).

**Schweinfurt green : ష్వీన్‌ఫర్ట్ హరితం.**

మరకత హరితానికి పర్యాయనామం.

**scientist : వైజ్ఞానికుడు.**

**scooper : చూ : scorper.**

**scorper : ఖాత్రం.**

దారురేఖా శిల్పంలో వాడే ఒక పరికరం. లోహ నిర్మితమైన ఈ పనిముట్టు చూడటానికి ఒక చిన్న గరిటెలాగా ఉంటుంది. రేఖలను రూపొందించేటప్పుడు గాటులనుంచి కొయ్యముక్కలను తీసివేయటానికి ఇది ఉపకరించును. ఇందువలన అచ్చున పడవలసిన అవసరములేని భాగములు దిగువకుపోయి, కొయ్యదిమ్మెపై సమమట్టంలో ఉన్న భాగం మాత్రమే అచ్చులో వస్తుంది.

**scotia : పుటీతం.**

పుటాకృతిలోఉండే అభిరూపం. ఇందులో పుటాకృతిని రూపొందించే వక్రరేఖాగతి అతి విపులమై, దాని పార్శ్వభంగిమ ఒక వరా



పుటీతం

వంపు (*parabola*) రూపంలో ఉంటుంది. ప్రాచీన సంప్రదాయాలను అనుసరించే సంస్థలలో పీఠభాగంలో ఈ పునీతాన్ని, ముఖ్యంగా రూపొందిస్తారు.

**scrambled colours** : *అందరుకు రంగులు.*

రమ తాలి ఛాయలు ధారలుగానో, లేదా ఆవర్తికలుగానో అక్కడక్కడ కనపడే రీతిలో వర్ణఫలకంపైన తేలికగా కలపబడిన తైల వర్ణాలు; ఒకే ఒక ఏకరీతి ఛవి ఆలించేవరకు చక్కగా కలపబడిన వర్ణాలకు ఇవి వేరైనవి. బాగా కలిపిన వాటికన్నా అందరుకు రంగులు ఎక్కువ చైతన్యాన్ని, లేదా తీవనస్ఫూర్తిని ఉత్పన్నం చేయటం యథార్థమే అయినా, నిర్దిష్టమలైన కొన్ని శైలులకూ, ప్రక్రియలకూ బాగా కలిపిన రంగులే సముచితాలు.

**scraper** : *ఉల్లేఖిని.*

1. రేఖా శిల్పంలోను, తక్షిన లోహ ఫలక ప్రక్రియలలోను వాడబడే ఒక పరికరం. ఈ ప్రక్రియలలో ఫలకంపై కొన్ని భాగాలను నిశ్చత్రించటం అత్యవసరం. అటువంటి సందర్భంలో ఏదైనా గరుకంచు వంటివి మిగిలి ముద్రణలో నలుపుదనం అధికంచేసే ప్రమాదంఉన్నప్పుడు, అటువంటి గరుకంచునుగాని, అతిమాత్రపు గరుకుదనాన్ని గాని తొలగించటానికి ఈ ఉల్లేఖినిని వాడతారు. ఇందులో పొడవుగా త్రిభుజాకృతిలో వుండే ఒక లోహశలాక, మూడంచులలో మూడు వాదరలుండి, చివరకు కొనదేరు తుంది. శలాకలోని మూడు ముఖాలు కూడా పుటాకారంలో లోపలికి కుంచించుకొని వుంటాయి. ఈ శలాకను ఒక పిడిలో అమర్చి ఉంచుతారు.



ఉల్లేఖిని : త్రిభుజరీతిలో ఉక్కున తయారైనది. అధిరేఖనంలోను లోహ ఫలక ముద్రణలోను దీనిని వాడుతున్నారు.

2. శిలాలేఖన ముద్రణంలో వాడే ఒక ముఖ్యాగం. దీనిలో ఒక కొయ్యకడ్డీ ఉండగా, దానిచుట్టూ తోలుపటీ గట్టిగా చుట్టబడి ఉంటుంది. శిలాలేఖనానికై వాడే శిలాఫలకాన్ని ఈ కడ్డీక్రిందుగా పంపించినప్పుడు ఈ కడ్డీ (అంటే ఉల్లేఖిని) తన ఒత్తిడివల్ల సిరాను, దాతినుండి కాగితానికి మార్చివేస్తుంది.

**scraper board** : scratch board అనే పదానికి బ్రిటనులో వ్యాప్తిలో ఉన్న పర్యాయ నామం.

**scraping** : *విల్లేఖనం.*

**scraping knife** : *క్షురం.*

**scratch board** : *అంతాస్తరం;*
*లేఖాస్తరం; ఉల్లేఖన ఫలకం.*

ఒక ప్రత్యేక రీతిలో పైపూత కలిగిన ఒక విధమైన అట్ట. నల్లటి ఆలేఖనాలపై తెల్లటి రేఖలను సృష్టించటానికి దీన్ని వాడతారు. ఇటువంటి ఆలేఖనాలకు ప్రత్యుత్పన్నాలను తయారుచేసినప్పుడు అవి దారురేఖా

శిల్పాలలాగా కనపడతాయి. ఈ ఆస్తరమునకే ఉల్లేఖనా స్తరము (*scraper board*) అనే పేరు బ్రిటనులో ఉంది. ఇటువంటి ఆస్తరంపై లప్పపు పైపూత బాగా పట్టించి ఉండటంవల్ల ఉపరితలం చాలానున్నగా ఉంటుంది. దీనిపై కళాకారుడు ఆలేఖనపు సిరాతో ఒక పైపూత పట్టిస్తాడు. అప్పుడు ఒక పరికరంతో కొన్ని రేఖలలోను, తావులలోను సిరాలేకుండా చేసి, అక్కడ దిగువనుంచి తెల్లటి ఆస్తరం బయటపడేట్లుచేసి, ఒకఆలేఖనమును తెల్లగీతలో రూపొందిస్తాడు. ఈ పనిలో వాడే అ ప్రత్యేక పరికరాన్ని గీతకత్తి (*scratch knife*) అంటారు. ఇటువంటి గీతకత్తులు తాము చేయవలసిన ఒక్కొక్క తీరు పనికి ఒక్కొక్క తీరుగానో, లేదా ఒక పిడిలో అప్పుడప్పుడు ఆయా పనులకు తగిన వాదరలను ఇముడ్చటానికి వసతి కలిగినవిగానో ఉంటాయి. ఇటువంటి వాటిలో బహురేఖికా పరికరాలుకూడా ఉంటాయి. ఒకసారి గీతపడ్డ భాగాలు సరికుదరకపోతే వాటిపై మళ్ళీ సిరాపట్టించి, మళ్ళీ గీతకత్తిని వాడవచ్చు. సిద్ధకీలిలో లభించే రాస్ ఆస్తరము (*ross board*) ల వంటివికూడా లభిస్తాయి. వీటిని కొన్ని ప్రత్యేక ప్రక్రియలలో వాడుతారు.

అంతాస్తర ఆలేఖనం 19వ శతాబ్దిలో ప్రవేశపెట్టబడింది. వాణిజ్య కళలలో దీనికి ఎక్కువ వ్యాప్తి ఉంది; అయితే అత్యుత్తమ కళాఖండాలకు మాధ్యమంగా దీన్ని వాడరు.

**scratch coat** : *గరుకుపూత.*

భిత్తి చిత్రణను మొదలుపెట్టేటప్పుడు గోడమీద మొదట గరుకు గరుకుగా పట్టించే పైపూత. ఇందుకు వాడే గారగచ్చులో ఒక పాలు గారసున్నంతో ఒకటిన్నరపాలు గరుకిసుక కలిసి ఉంటుంది. సున్నపు కట్టుబడిగల గోడపైగాక చెక్క కూర్పుపై దీన్ని పట్టించేటప్పుడు మేకరోమాలు, లేదా నారపీచులు అందులో కలుపుతారు. ఉండలు ఉండలుగా గారగచ్చు చెక్కకూర్పునుంచి ఊడిపడకుండా, ఇందువల్ల ఉండగలుగుతుంది. (చూ: *brown coat; intonaco; sand coat*).

**scratch coating** : *గరుకుపూత.*

(చూ; fresco).

**scratch knife** : *గీతకత్తి.*

**screen** : *జవనిక*

**screw** : మరవట్టు.

**scrim** : మెత్త.

పోతపోయబడ్డ శిల్పానికి ఏమొప్పం కలగకుండా ఉండటానికి పైన అతికే గట్టి గుడ్డ; ఒక ఉపరితలం కుంగిపోకుండా, లేదా ముడతలు పడకుండా ఉండటానికై దానిపై బంకతో అతికించే ఒక గుడ్డకుకూడా ఈ పేరు వర్తిస్తుంది. సుధాపిష్టానికి వాడే మెత్త, ముతకనూలుది కావచ్చు; లేదా నారపట్టు శాటిక కావచ్చు.

**scrimshaw** : *తిమిశం.*

ఒక శిల్పవిశేషంగా మలచబడ్డ, లేదా రేఖా శిల్పాకృతిని కలిగించిన తిమింగిలపు ఎముక;

లేదా దంతము. ఈ రచనలకు కొన్ని సమయాలలో అనువైన వన్నెలు వేయటం జరుగుతుంది. ఇది ఒక జానపద కళ. అమెరికా



తిమిశం : తిమింగల దంతంతో అమెరికాలో నిర్మితాలైన రొట్టెకత్తులు. (18 వ శ.)

దేశపు నావికులు చాలామంది 19 వ శతాబ్దిలో ఇటువంటి జానపద శిల్పరచనలు సాగించారు.

**scroll : సర్పిలిక.**

1. ఒక ఆలంకారిక ప్రలక్షణం. సర్పిలాలుగా, లేదా సంవలయితాలుగా ఇందులో ఆకృతులు అమరి వుంటాయి. ఒక కాగితాన్ని చుట్టచుట్టి దాన్ని అడ్డుగ చేదించినప్పుడు వచ్చే మధ్యచ్ఛేదాన్ని ఇది దాదాపుగా పోలి వుంటుంది. వక్రరేఖాకృతిలో తీర్చబడ్డ ఉత్క్షేపానికికూడా ఇది వినియుక్తం; ఇటువంటి ఉత్క్షేపం మధ్యయుగాలకోని నిర్మాణాలలో తరచు కనపడేది.

2. చుట్టగా చుట్టబడిన చర్మవస్త్రం లేదా, వస్త్రం. దానిలో లేఖనమో లేదా చిత్రమో ఉంటుంది.

**scuffing : చూ : Dragging, strike.**

**sculp. : శిల్పితం.**

లాటిన్ భాషలోని '*sculpsit*' అనే పదానికి సంక్షిప్త సంకేత రూపమే '*sculp*'. ఆ పదానికి అర్థం 'దీనిని మలచెను' లేదా 'దీనిని రేఖాశిల్పితం చేసెను' అని. ఈ సంకేతాన్ని కొందరు శిల్పియొక్క సంతకపు చివర, శిల్పంపైన మూలలో ఉంచుతారు. దీనివల్ల అది మౌలికమైన రచనే అనీ అనుకృతిగాని, మూలానుసారమైన పోతగానీ గాదనీ స్పష్టమవుతున్నది. అట్లాకాక ఒక ముద్రాంకపు చివరి అంచులో దిగువ మూలన ఒక పేరుకు చివరన ఈ పదాన్ని ఉంచినప్పుడు, ఆ పేరుగల వ్యక్తి ఆ చిత్రమునకు ముద్రాంకనం నిమిత్తం రేఖాశిల్పాన్నో సూచీచిత్రణనో తయారు చేసినవాడని అర్థం (చూ. *del*).

**scul one : స్కల్ప్‌స్టోన్.**

సర్జికా శిలను పోలివుండి మలచటానికి సుకరంగా వుండే మెత్తని ఒక ద్రవ్యానికి వ్యాపారనామం. ఔత్సాహికులైన శిల్పులు దీనిని వాడతారు

**sculptor : మూర్తికారుడు; రూపకారుడు.**

**ప్రతిమాకారుడు, శిల్పి.**

**sculpture¹** : *శిల్పం; స్థాపత్యం.*

మలచటం, రూపీకరణ లేదా సమాహారం వల్ల ఒక మూడాయతనాల ఆకృతులను సృష్టించే కళ. మలచటంలో, తాను తల పెట్టిన ఆకృతికి అవసరంలేని వాటిని ముడి ద్రవ్యంనుంచి శిల్పి చెక్కివేస్తాడు. ఈవిధంగా అతడు-మైకేల్ ఏంజెలో చెప్పినట్లు-ద్రవ్య రాశిలో నిబద్ధమై గుప్తంగా వున్న ఆకృతిని వెలికి దీస్తాడు. ఆ ద్రవ్యరాసి అనేది-కొయ్య, రాయి, లేదా ఇతరమైన-ఏ కఠిన పదార్థమైనా కావచ్చు. రూపీకరణ ఇటువంటిది కాదు; ఇందులో శిల్పి అవ్యవస్థితమై, కల్పకధర్మం గల ఒక ద్రవ్యరాశిని సాయంగా గ్రహించి, ఆకృతిని రూపిస్తాడు. మట్టితో ఒకశిల్పాన్ని రచించడం ఇందుకు ఒక ప్రముఖ లక్ష్యం. కలకాలం నిలవగలిగే రీతిగా లోహంలో పోతను పోసే ప్రక్రియలో సైతం మట్టితో రూపీకరణ తప్పని సరి అవుతున్నది. ఇక సమాహారమంటే ఒక ఆకృతికి కావలసిన వివిధ భాగాలను ముందుగా వేరు వేరుగా, తగిన పద్ధతిలో తయారుచేసి చివరకు వాటిని క్రమరీతితో సంధించటం. లోహ నిర్మాణా లలో ఇటువంటిది సంధానం(*welding*)వల్ల జరుగుతున్నది. ఒక శిల్పియొక్క కృషి ఫలి తం, ఒక వర్తుల శిల్పమో, ఉల్బణ శిల్పమో, కావచ్చు (చూ. *lost wax process; sand coating, welding*).

**sculpture²** : *మూర్తికరణం; ప్రతిమాకరణం; మూర్తి కళ.*

**sculpture in the round** : *వర్తుల శిల్పం.*

స్వచ్ఛందంగా నిలవగలిగి, మూడాయత నాలను ప్రదర్శించే శిల్పం. ఉల్బణ శిల్పా నికి ఇది విభిన్నత. అన్ని పార్శ్వములూ, ఆకృతికి అనుగుణములుగ దీనిలో రూపిత ములు; దీనిని ఏ కోణంనుంచి అయినా పరి శీలించవచ్చు.

**sculpture painting** : *శిల్పచిత్రణ.*

అల్పోల్బణ శిల్పానికి ఇంకొక పేరుగా పూర్వకాలం వాడుకలో ఉండి, నేడు వాడు కలో లేని మారుమూలపదం.

**scumble** : *పైపాటు.*

1. ఒక తైల చిత్రణంలో ఒక నిర్దిష్ట ప్రదేశంలో, ఉన్న రంగుపూతపైననే ఇంకొక కాంత్యభేద్యకం లేదా అర్ధకాంత్యభేద్యకమైన ఒకరంగును పట్టించగావచ్చే సన్నపొర. ఈ పైపొర, దిగువవున్న చిత్రణను సంపూర్తిగా మరుగుపరచదు; కాని దానివల్ల మొత్తవ వర్ణపు అమరికలో కొంత మసకతనం, మందత, స్థాయిభేదం కనపడుతాయి. (చూ : *over painting*).

2. ఒక తైలచిత్రణం బాగా ఆరిన తర వాత దానిని పైపైన రుద్దటం, లేదా తుడ టం; ఈ పనికి ఒక తూలికనో, గుడ్డపీలికనో బొటనవేలి బంతినో వాడతారు. పై మెరుగున కట్టుదిట్టంగా కలిగించే ప్రక్రియకు ఇది వి న్నం.

8. ఒక ఆలేఖనపు ఉపరితలంలో తేలిక పూతగా పట్టించిన సీమసున్నం లేదా బొగ్గు మసి ఈ పైపూతను ఆలేఖనపు ఉపరితలంపై చక్కగా రుద్దగా అందులో మృదుత్వం ఎక్కువ కావటమూ, ఆలేఖనం రేఖామయంగా లేకుండా ఉండటం జరుగుతుంది.

**seal** : *అధిముద్ర.*

**sealer** : *రూఢీక.*

సుధాపిష్ట ఫలకంలోగానీ, దారుఫలకంలో గానీ చూషణ సమర్థతను తగ్గించటానికై వాడే ఒక విధపు జింక్, పారిశ్రామికరంగంలో పూతపనులలో దీనికి వాడుకవుంది

**sealing wax** : ముద్రాసిక్థం; ముద్రమైనం.

ఉత్తరాలను, వ్యవహార పత్రాలను మడిచి భద్రతకోసం పైన ముద్రవేయటానికి ఉపయోగించే ఒక మర్క- యౌగికం.

**seam line** : *అతుకు గీత.*

రెండు ముక్కలను అంచువట్టున కలిపి ఒక వస్తువును రూపొందించినప్పుడు, ఆ కలిపినచోట కనబడే మడత లేదా రేఖ. పోత ద్వారా రూపొందిన శిల్పంలో వివిధాంగాలను అందులో అతికిన చోట ఇటువంటివి కనబడతాయి వాటిని రుద్దివేసి, శిల్పి, ఆ చోటుకు జాగ్రత్తగా మిసిమి కల్గిస్తారు.

**seascape** : *సాగర దృశ్యం.*

సముద్రం అత్యధిక ప్రాధాన్యపు లక్షణంగా రాణించే చిత్రలేఖనం, ఆలేఖనం, ముద్రాంకం, లేదా ఛాయాచిత్రం. ఆ సాగర దృశ్యపు చిత్రంలో పడవలు మొదలైన నావికా సంబంధ వస్తువులు చేరివుంటే దానిని 'నౌ సంబంధికం' అంటారు.

**season** : *వశ్యీకరణ.*

ఆకుంచన, సంకోచన, విరళీకరణాలను నిరోధించే శక్తిని పెంపొందించి, దార్ఢ్యాన్ని వృద్ధిచేయటానికై కొయ్యకు జరిపే క విధపు చర్య. నియంత్రిత తాపక్రమ, తేమన వస్థితులలో స్వేచ్ఛగా గాలి తగిలే రీతిగా కొయ్యను కొంత కాలం నిలువ వుంచటంవల్ల దీనిని సాధిస్తారు.

**Secco** : *శుష్కకం.*

ఆరి గట్టిపడిన సున్నపు గచ్చుపూతపై కుడ్యచిత్రాన్ని చిత్రించే సాంకేతిక విధానం లేదా కళావిశేషం; అట్లా చిత్రితమయ్యే చిత్రానికికూడా ఈ పేరు వర్తిస్తుంది. *secco* (సెక్కో) అనేది ఇటాలియను భాషా పదం. ఎండిన (శుష్కించిన) అని దీని నైఘంటికార్థం. ఏదో ఒక బంధకంతో నూరిన రంగులను ఇందులో చిత్రణకు వాడతారు. ఇట్లా చిత్రించిన చిత్రపు ఉపరితలం నాతి కాంతితో కళ్ళకు రమ్యంగా కనపడుతూ, సద్యస్కాన్ని పోలి ఉంటుంది అయినా సద్యస్కంలోని కాంతిశోభా, స్వచ్ఛతా ఇందులో ఉండవు. అంతే కాదు; శుష్కకంలో వర్ణం ఉపరితలాన మాత్రమే నిలుస్తుంది; కాబట్టి

ఎక్కువకాలం మన్నికగా నిలవదు. సద్యస్కం ఇట్టాకాదు; పై పూతగచ్చు తడిగా ఉన్నప్పుడే దానికి, రంగులు వేస్తారు కాబట్టి రంగులు తడి గచ్చులోకి పీల్చుకొనబడి, గోడలో ఒక అభిన్నాంశంగా పరిణమిస్తాయి 'శుష్కకము' అనే ఈ ప్రక్రియ పురాతన కాలంనుంచికూడా ఆవృతమే అయినా, సద్యస్కానికి పోటీరాదనీ దానికి ప్రత్యామ్నాయంగా, లేదా దాని తరవాత ప్రముఖంగా లెక్కకు వచ్చేదిగా మాత్రమే గణనార్హమనీ విజ్ఞుల అభిప్రాయం. వ్యవధి చిత్రణతలం, ధనవసతి, లేదా తక్కిన పరిస్థితులు పరిమితావధులలో ఉండి తప్పనిసరి అయినప్పుడు మాత్రమే, సద్యస్కాన్ని కాదని శుష్కక ప్రక్రియను అవలంబించవచ్చు.

11వ శతాబ్దంలోనే ఈ శుష్కకంలో సాంకేతిక విధానంలో వివిధ ఘట్టాలు చెప్పగా చర్చితములైనవి. వాటిని ఈ క్రింది విధంగా సంక్షిప్త రీతిలో చెప్పవచ్చు తుది తీర్పులు తీర్చబడ్డ సున్నపుపూత గోడను మొదట బట్టీసున్నపు నీటితో, నీరు జారేట్లు తడుపుతారు. (సున్నపు నీటికి బదులుగా ముగ్గుసున్నపు నీటినైనా వాడవచ్చు). ఆ రాత్రి అట్లా దాన్ని ఉంచి, మరునాటి ఉదయం మళ్ళీ అదేరీతిగా తడుపుతారు. ఇందులో చిత్రణకు దధిచూర్ణ వర్ణాలను వాడతారు. ఈ వర్ణాలు సున్నంతో బాగా మేళనంచెంది విడదీయరాని గట్టిదైన శాశ్వత బంధాన్ని ఏర్పరచుకొంటాయి. ఇటువంటి పద్ధతికే చూర్ణప్రలేప చిత్రణ (*lime wash painting*) అనే పేరుకూడా ఉంది. శుష్కక ప్రక్రియలోనే ఇంకొక విధానం కూడా ఉంది. అందులో నీటిలో బాగా కలిపిన వర్ణాలను సున్నపుతేటతో కలిపి, ఆ మిశ్రమానికి కొంత దుర్బలంగా ఉండే దధిచూర్ణ ద్రావణాన్ని కలుపుతారు అయితే ఈ ద్రావణాన్ని అన్ని వర్ణద్రవ్యాల విషయంలో కలపరు త్వరగా పొడిదేరి రాలిపోయే స్వభావంగల వాటికే. అందునా ముఖ్యంగా నలుపులకు, నీలిమలకు మాత్రమే కలుపుతారు. ఉజ్జ్వలపు తెలుపురంగుల ఉపరితలంపై చిత్రణ సాగించటం ఎక్కువ క్లేశదాయకంగా పలువురు చిత్రకారులు భావిస్తారు. అప్పుడు సున్నపు తేటకు వేరొక వన్నెను కలపటం సముచితమని వారి అభిప్రాయం; అప్పుడు దాని స్థాయి కొంత పొందుపరతకు దిగుతుంది చిత్రణను రెండు పూతలలో ఇందులో సాగిస్తారు అందులో తుది చిత్రణలో వాడే వాటికన్నా తేలికపాటి వాటితో అధశ్చిత్రణం జరుగుతుంది.

సెన్నినో సెన్నిని (c 1370-c 1440) అనే ఇటాలీయచిత్రకారుడూ ఇంకా కొందరు ఆ దేశపు రచయితలున్నూ 'శుష్కకం' అనే దానిని ఆరినసద్యస్కంపై జరిపే మెరయింపు (***touching up***) గా భావించారు ఈ మెరయింపు అండనిర్యాసికతోగాని, ఒక బంధకపు రక్షణ అవశ్యకమైన కొన్ని రంగులతో (అండే స్వచ్ఛమైన 'అతిసాగరిక వర్ణం' వంటి వాటితో) గాని జరిపేవారు.

**secondary colour** : ***ద్వితీయశ్రేణి వర్ణం; ఉపవర్ణిత వర్ణం.***

**section d'or :** చూ : Golden mean.

**secular** : *లౌకిక.*

ప్రాథమిక వర్ణాలనుంచి జంటలుగా రంగులను గ్రహించి కలపటంవల్ల ఏర్పడే మూడు వర్ణాలలో ప్రతిఒకదానికి ఈ పేరు వర్తిస్తుంది. ఆ మూడురంగులు; ఆకుపసిమి (నీలిమ + పసుపు), నారింజ (ఎరుపు + పసిమి), నీల లోహితం (ఎరుపు + నీలం).
(చూ : *colour, colour circle*)

**seicento** : సియెసెంటో.

సియెసెంటో నేది ఇటాలియన్ భాషా పదం; 17 నూర్ల అనిమాత్రమే దాని అర్థం అయినా 17 వ శతాబ్దిలోని ఇటలీదేశపు కళకు ఒక పేరుగా దీనికి రూఢత ఏర్పడ్డది.

**self - hardening clay** : *స్వయం ఘనీభవక మృత్తిక*

సంయోజిత యక్షదూపాన్ని ఒక వర్ణద్రవ్యంతో కలిపి మందోష్ణంలో కాల్చి, తయారుచేసే ఒక విధపు మృత్తిక. ఇది చూపటానికి ఆవంలోకాల్చిన మార్దవసాసుగ్రిని పోలి ఉంటుంది.

**self – portrait** : *స్వమూర్తి చిత్రం.*

తన ఆకారాన్నే ప్రతిమానంగా గ్రహించి చిత్రకారుడుగానీ, శిల్పిగానీ రూపొందించే రచన. వేరుగా ఒక ప్రతిమానంకోసం శ్రమపడవలసిన అవసరం లేకపోవటంవల్ల ఇటువంటి చిత్రణకు కళాకారుడు పూనుకోవచ్చు; లేదా తన మూర్తికి, చిత్రంద్వారా చిరస్థాయిత్వాన్ని కల్పించి, రాబోయే పరంపరాలవారి దృష్టిలో తాను నిలిచిఉండటానికి కళాకారుడు ఆశించవచ్చు. ఇటువంటి చిత్రణకు పూను కొన్న కళాకారులు ప్రాచీన, మధ్యయుగాలలో సైతం ఉండేవారని తెలుస్తున్నది.

**semi - abstract** : *సామి వివిక్త;*
*అర్ధవివిక్త; అర్ధనైరూప్య.*

**semi-drying oil** : *సామిశోషక తైలం.*

గాలి తగిలినప్పుడు మాత్రం గట్టిపడకుండా ఉండి రాసాయనిక చర్యాప్రభావంవల్ల మాత్రమే ఘనపటలంగా రూపొందగల ఒక విధపు వనస్పతి తైలం

**semi - opacity** : *అర్ధకాంత్యభేద్యత.*

**semi-stylized** : *సామిశైలీకృత,*
*అర్ధశైలీకృత.*

**semitransparency** : *అర్ధ పారదర్శకత.*

**sensation** : *సంవేదన.*

**sensitiveness** : *గ్రహణశీలత*

**Sensitivity** : *గ్రహణశీలత.*

**sensitized** : *గ్రహణశీలిత.*

**Sepia** : *మీనకము.*

గోదుమరంగు కలిగి, అర్ధ పారదర్శకంగా ఉండే ఒక వర్ణద్రవ్యం. కొన్నిరకాల జలచరాల (కటిల్ చేపవంటి వాటి) లోని కోశాల నుంచి దీన్ని సేకరిస్తారు. మందకాంతిలో ఈ వర్ణం చాలవరకు నిలకడ కలదియే అయినా, ఉజ్జ్వలపు పగటి కాంతిలో త్వరితంగా వన్నె తగ్గి మాసిపోతుంది. అందువల్ల ఆధునికులు నీటిరంగుగాగాని, ఆలేఖనపు సిరాగాగాని దీన్ని వాడటానికి ఇష్టపడరు తైలంలో కలిసినా, ఈ రంగు ఏమంత బాగా పని చేయదు. 'సెపియా' అనే పేరుతో కొన్ని తైలవర్ణాలు బజారులో లభించటం నిజమేకాని అందులో మీనకంతోపాటుగా ఇతరమైనవి కూడా మిశ్రితములు. రోమనులు ఈరంగును సిరాగా వాడినా, దీనికి ఎక్కువ ఆదరణ 1780 తరవాత, ఒక శతాబ్దికాలం, లభించింది. 1780 వరకు ప్రలేఖనాలకు వాడుతూ వచ్చిన తారుగోదుమను తోసిరాజని అంతట మీనకం ముందుకు రాగలిగింది. పలచగా దీన్ని వాడినప్పుడు సిద్ధించే విస్తృత స్థాయీ వైవిధ్యరమ్యత ఇందుకుముఖ్యకారణం. మీనకాన్ని కవోష్ణపు ఎరుపువాలు గోధుమరంగుగా భావించవచ్చు. తారుగోదుమరంగుకన్నా ఇది వేరనటం చూడగానేతెలిసిపోతుంది. మీనకాన్ని తప్తస్విన్నంతోగాని మాంజిష్ఠ శోణిమతో గాని కలిపితే వచ్చే వర్ణాన్ని రోమనీయ మీనకం (*Roman sepia*) అంటారు.

**sepia drawing** . *మీనకచిత్రం.*

**serif** : *శోభిక.*

లిపి చిత్రణలోనూ; అర్థికాలేఖనంలోనూ, ఒక అక్షరపు గీతకు కల్పించే తుది నగిషీ. ఇది సాధారణంగా ఒక చిన్న గీతగా ఉంటుంది. అటువంటి గీతను కలిగిన అర్థికా రీతికికూడా ఇది వస్తుంది. అటువంటి అర్థికా రీతికే రోమన్ టైపు (ఋజ్వర్థిక) అనే వ్యవహారంకూడా ఉంది. గోథిక్ అర్థిక అని వ్యవహృతమయ్యే ఇటువంటి దానికి గీత ఉండదు. కాబట్టి అటువంటి దానిని అరేఖా శోభిక (*Sans serif*) అని వ్యవహరిస్తారు.

**serigrapher** : *కౌశేయ లేఖకుడు.*

**serigraphy** : *కౌశేయ లేఖనం.*

సర్ణనాత్మకమైన కౌశేయ ముద్రాంకకృతి. ఇందులో కళాకారుడే స్వయంగా సూత్రపాతాన్ని తయారుచేసి అనుగుణంగా రచనను సాగించి, తన తైజసాలను తానే ముద్రించుకొంటాడు. కౌశేయ యవనికా తైజసాలను తయారు చేయటంలో అవలంబించే ప్రామాణిక సాంకేతిక ప్రక్రియలన్నీ కౌశేయ లేఖనాలకున్నూ పనికి వస్తాయి. కాని వాటిలో కాలికా ప్రలేపిత విధానం (*Tusche wash-out method*), పటలతైజస విధానం అనేవి ఎక్కువగా ఇందులో అవలంబించబడు తున్నవి. వాటిలో సైతం మొదటి దానికి విశేషాదరణ ఉంది.

తక్కిన గ్రాఫిక కళాప్రక్రియలలోని రుజువులలో కనపడని ఒక ప్రత్యేక లక్షణం కౌశేయ లేఖనంలో కనవడుతుంది. ఇందు

లోని రంగుతావులను, అచ్చుసిరా ముద్రలను కంటన్నా చిత్రిత పటలాలు అనడం సముచితం. ఇంతేకాదు, అపరోక్ష రీతిలో, బహుముఖంగా పనిచేయగలిగే సాంకేతికరీతి దీనిలో కనపడుతున్నది.

ఈ బహుముఖతవల్లనే ఈ కౌశేయ లేఖనంలో అపరిమిత వర్ణాయతనమూ, తైల వర్ణాల ఉత్తురంగూ, నీటిరంగులలోని పారదర్శక ప్రలేపాలూ, పిండిరంగుల, గుహాన వర్ణాల పరిణామాలు దర్శించే అవకాశం కలుగుతున్నది. ఇందువల్లనే కౌశేయలేఖనం, చిత్రకారునితోపాటుగా ముద్రాంకకారునికి సైతము ఉపకరించే మాధ్యమంగా-పేరు పొందటం సముచితమని రుజువవుతున్నది. అందువల్లనే సరియైన కాగితాన్ని, సముచితములైన వర్ణద్రవ్యాలను, విపర్ణతకు గురికాని మాంజిష్ఠముల లేదా అల్కిడ్ పారదర్శకముల ఉపాధిని వాడినప్పుడు, లభించే ముద్రాంకములు, కలకాలం మన్నికగా ఉండటంలో దేనికీ తీసిపోవు.

కౌశేయ యవనికను, కళాకారుని మాధ్యమంగా వాడటం 1938లో న్యూయార్కులో మొదలైంది. ఫెడరల్ ఆర్ట్ ప్రాజెక్టు అనే సంస్థ ఆధ్వర్యంలో అక్కడ అప్పుడు పనిచేస్తున్న కళాకార బృందం, కౌశేయ యవనికపై తొలి ప్రయోగాలను కొన్నిటిని సాగించి, క్రమంగా దాన్నె ఒక చక్కటి ప్రక్రియగా తీర్చిదిద్దింది.

**serpentine** : *సర్పశిల.*

అలంకృతికి ఉపయోగించే ఒక విధమైన ఆకుపచ్చని శిల. ముసకపాటి ఆకుపసిమి రంగు కలిగిన ఈ శిలపై, పాము శరీరంపై లాగా, అక్కడక్కడ మచ్చలుంటాయి.

**set**[1] : *నిశితం.*

**set**[2] : *సజ్జించు.*

1. చిత్రలేఖనంలో ఒక వర్ణఫలకాన్ని తగిన వర్ణాలతో సన్నద్ధం చేయటం.

2 మార్తవంలో, ఒక బట్టీని, లేదా ఆవాన్ని కాల్చటానికి సన్నద్ధం చేయటం.

**sewing** : *కుట్టుపని.*

**seze sion** : చూ : Art Noveau.

**sfregazzi** : *ఛాయాద్యుతి, నీడమెరుగు.*

చిత్రంలోని శరీర వర్ణ స్థాయీలలో కలిగించే కోమలపు నీడల మెరుగులు; వేలికొనలతో ఒక క్రమరీతిగా తట్టి వీటిని కలిగించవచ్చు

**sfumato** : *ద్యుతిమేళనం.*

తైలవర్ణ చిత్రణంలో మృదువులూ, లలితములూ అయిన సమ్మిళిత నిష్పన్నాలను కలిగించటం ఒకస్థాయిని ఇంకొక స్థాయిలో (ముఖ్యంగా మెరుగుల విషయంలో) విలయనం చెందించటంవల్ల ఇది సాధ్యమవుతుంది. ఈపదం సాధారణంగా లియొనార్డో డా వించి

రచించిన చిత్రాల అనుశీలనలో వాడబడు తున్నది. చిత్రంలో గాలి కదలికల భావనను, వాతావరణ సంబంధ నిమ్నన్నాలను దర్శింపజేయటానికి ఇటువంటి ద్యుతిమేళనాన్ని మొదటగా ప్రవేశపెట్టిన ప్రముఖ చిత్రకారుడుగ అతడు సుప్రసిద్ధుడు.

**sgraffito** . *నికృత్తనం; ఛిద్రణప్రక్రియ.*

1. ఒక అలంకరణ విధానం, సుధామృత్తిక లేదా సుధాపిష్టపు పైపూతను అక్కడక్కడ, వాడిఅయిన పరికరంతో రేఖలు రేఖలుగా క్రమరీతిలో ఛేదించి, దీన్ని సాధిస్తారు ఇట్లా ఛేదించడంవల్ల దిగువపొర రంగుకొన్నిచోట్లబయల్పడి పైపొరలోని,సుధామృత్తికయొక్క, లేదా సుధాపిష్టపు రంగుతో వ్యత్యస్త రమ్యతను సాధిస్తుంది. ఇటలీలో పునరుజ్జీవన కాలంలో కుడ్యచిత్రణలో ఈ నికృత్తన ప్రక్రియను కళాకారులు తీసుకొని వచ్చి అభివృద్ధిపరచారు. అంటట అకాలంలో వివిధ భవనాల ముఖతలములపైని సుధామృత్తిక పొరపై ఈ ప్రక్రియను అనుసరించి ఖచితాలంకృతులవంటి వాటిని, తలుపులపై లతాగుల్మాలంకరణలను చెక్కటం పరిపాటి అయింది. ఆటువంటి వాటిలో నికృత్త రేఖలలో కనపడేది నలుపువాక గోధుమ రంగుగా ఉండేది. ఇటువంటి దిగువపొరను కల్పించటానికి సుధాపిష్టాన్ని కాల్చిన గడ్డితో కలిపి, అక్కడక్కడ పైపూతగా వాడేవారు. ఆధునిక కాలంలో దీనిని పునరుద్ధరించటానికి కృషి కొంత జరిగింది. ఆటువంటి ఈ దిగువ పొరపై రంగు కలిపిన సిమెంటును పూతగా వాడటం జరిగింది.

2. మృత్సామగ్రిని ఆవంలో కాల్చటానికి ముందుగా పైపొరపై లేపనాన్ని జరిపి అలంకరించటం.

3. కాచచిత్రణయందు పాటించటానికి వీలయ్యే ఒక విధపు ఆలేఖన విధానం. ఒక స్వచ్ఛకాచఫలకంపై రంగున్న కాచఫలకాన్ని సంధానించి (*Flash*), పై దానిని రేఖాకృతులతో ఛేదించి దిగువపొర రంగు బయట పడేట్లు చేసి, ఒక అలంకృతిని వర్ణవ్యత్యస్తతచే సాధించటం. కాచఫలకంపై చిత్రణకు ఆధునిక ప్రక్రియలు కనుక్కోక పూర్వం ఇటువంటి నికృత్తనమే ఆ చిత్రణకు సాధనంగా ఉండేది.

**shade** : *ఛాయ.*

1. వర్ణాలను గురించి చర్చించేటప్పుడు, లేదా పోల్చేటప్పుడు రెండు వర్ణాల మధ్య ఉండే అచ్చపు లేదా నిర్దిష్టమైన తరతమ భేదం సంగీతంలో రెండు స్వరాల మధ్య కనపడే భేదంవంటిదే ఇది అనవచ్చు. ఒకే నీలపురంగులో కొన్ని ఛాయలు ఎక్కువగా ఉన్నదీ, తక్కువగా ఉన్నదీ ఉండవచ్చు. అదే విధంగా ఈ ఛాయాభేదాలు ప్రతి వర్ణంలోనూ ఉంటాయి. అంతేగాక ఒక ఛాయాభిన్న వర్ణంలో, నలుపును కలిపి, దానిని న జరచినప్పుడు, అదికూడా ఛాయ అనే వ్యవహృతం.

2. చిత్రలేఖనంలో, ఆలేఖనంలో, గ్రాఫిక కళలో నలుపుగా, లేదా సాపేక్షకంగా నలు

పుగా—ఒక చిత్రితరూపంలో, వస్తువులో, దృశ్యంలో-కనవడేది.

**shading** : *వర్తనం; వరదాక్.*

1. స్థాయిలో తరతమ విభేదాలను కల్పించడం; లేదా ఒక ఛాయను ఇంకొక ఛాయలోను, ఒక విలువను ఇంకొక విలువ లోను మిశ్రితం చేయటం.

2. ఒక పటంలో ఉన్న భాగాను స్థాయీ కరించటం; లేదా పూరించటం. ఇందుకు రేఖావర్తనం లేదా ఒక రంగును తేలికపరచ టం, లేదా సలుపెక్కించటం అనేవి సాధ నాలు. ఇందువల్ల వివిధ ఛాయలను, మూడా యతనాల మూర్తులను, ఉజ్జ్వలతా, మంద్రత లను దర్శనీయాలుగా చేయటం సాధ్యమవు తుంది.

**shading film** . *వర్తనీపటలం.*

ఆలేఖ్యాలలో, దేశపటాలలో, రేఖాపటా లలో భాగాలపై వర్తన జరపటానికి వాడే ఒక పటలం, లేదా జవనిక. ఇది రేఖామయం లేదా బిందుమయం కావచ్చు. దీని వెనకతట్టు ఒక అధిసక్తం రాయుంచిన ఒక పటల శకలాన్ని, పూరించవలసిన భాగాకు తగి నట్లు కత్తిరించి, నేరుగా ఆ భాగాపై అతి కించడమో, లేదా దానిని పరివర్తన చేయ టమో ఇందులో జరుగుతుంది. ఇటువంటి పటలం లేదా జవనిక బిందుమయమైనప్పుడు ఆ రచనలో అర్ధస్థాయీ నిష్పన్నత సిద్ధి స్తుంది.

**shadow edge** : *ఛాయాంచలం.*

ఆలిఖితములు, లేదా చిత్రితములు అయిన మూర్తులలోను, వస్తువులలోను అంచున కన పడే కాంతివంతమైన ఒక పరిధిరేఖ. ఇది ఒక సుస్నిగ్ధత వనితనంగా గణించ తగింది. చిత్రానికి సహజంగా అంచును ఒకదాన్ని ఇట్లా సృష్టించటంవల్ల, అక్కడి గట్టి రంగు వల్ల చిత్రానికి రెండాయతనాల అమరిక చక్కగా పరిణతి చెందుతుంది. భూమికపై ఆ మూర్తి, లేదా వస్తువు అతికించినట్లు భ్రాంతినే అది జనింపజేస్తుంది. మూర్తిచిత్ర ంలో ఈ పద్ధతి ఎక్కువగా వాడుకలో ఉన్నది.

**shaft (column)** : *కాండం (స్తంభపు).*

**shale** : *మానెరాయి*

**shale black** : *మృత్ఫిలాకాలిమ; నేలరాతి నలుపు.*

పంకనలుపుకు పర్యాయనామం.

**shape** : *ఆకృతి; ఆకారరేఖ.*

**sheen** : *మందళోళ.*

పట్టుగుడ్డకాంతిలాగా ఒక ఉపరితలంపై, మందంగా వేద్యమయ్యే కాంతివిశేషం; కాంతిని ఆ ఉపరితలం ప్రతిఫలించటంవల్ల ఇటువంటిది కలుగుతుంది. అయినా ఈ ప్రతిఫలనం వరిళోళ (*gloss*) లో ఉన్నంత కాంతిమంతంగా ఉండదు. ఇది ఓజస్విత (*lustre*) కన్నా వేరైనది. గంభీరతకు

అనుభూతం చేసే తుదితీర్పుగా, ఒఖస్విత సాధారణంగా పరిగణ్యమవుతుంది.

**sheet** : పత్రం.

**sheet-fed gravura** : పత్రాధార ముద్రణ; ఫలకాధార ముద్రణ.

**sheet inlay** : రేకుపొదుగుడు.

**Sheffield plate** : తామ్రరౌప్య సామగ్రి.

రాగిరేకుపై వెండిని పైపూతగా వాడిన సామగ్రి. అచ్చపు పైపూతగామాత్రమే ఉంచక ఆరెంటిని, అత్యుష్ణతకు లోనుచేసి లీనీకరించటం ఇందులోని విశిష్టత. ఈ ప్రక్రియను మొదట 1741లో ఆంగ్లదేశంలోని షెఫీల్డ్ నగరవాసి అయిన థామస్ బోల్‌సోవరు అనే అతడు కనిపెట్టాడు. 18వ శతాబ్దిలో ఆ ప్రక్రియ పరిపుష్టతను ఆర్జించినది షెఫీల్డ్ నగరమే. ఆ ప్రక్రియలో మేలిరకపు వాటికి ఉత్పత్తిస్థానంగా ఆ శతాబ్దంలో రాజించింది. 19వ శతాబ్దంలో ఈ ప్రక్రియ, యూరపులోని తక్కినదేశాలలోను, యు. స్టే లోను కొందరికి జ్ఞాతమైంది. పరిణతి చెందిన ఈ ప్రక్రియలో ఒక వెండిరేకును, రాగి పాళాము (*In-got*) తో లీనీకరించటం జరిగేది; ఈ లీనీకరణకై గట్టి సీమబొగ్గుతో కాలే కొలిమిని వాడేవారు. లీనీకృతమైన ఈ లోహరాశిని చల్లార్చి, ఆమ్లపాత్రలో కడిగి, ఆ తరవాత పలచని రేకుగా చరిచేవారు. అప్పుడు సాధారణపు వెండిరేకులాగానే సామగ్రిని నిర్మించటానికి దాన్ని వాడేవారు. అట్లా తయారైనదానికి తగిన సాధనాలతో మెరుగుపెట్టటం జరిగేది

అయినా విద్యుత్లేపన ప్రక్రియ వాడుకలోకి వచ్చిన తరవాత ఈ తామ్రరౌప్య సామగ్రి నిర్మాణం మరుగునపడింది.

**shellac** : మేలిలక్క.

మద్యసారంలో కరిగే ఒక యక్షధూపం; శుద్ధిచేసిన లక్కలలో అత్యుచ్చశ్రేణికి చెందింది; మద్యసారంలో దీన్ని కలిపి తయారుచేసిన వార్నిషుకున్నూ ఈ పేరేవాడుతున్నారు. మేలి లక్కలో రెండు రకాలు— నారింజ మేలిలక్క, తెల్లని లక్క అనేవి— తయారవుతున్నాయి. ద్రవరూపంలో ఉండే మేలిలక్క వార్నిషు, చూడటానికి మసక మసకగా కనపడుతుంది బాగుగా కరుగని మైనాలు కొన్ని అందులో ఉండటమే ఇందుకు కారణం. ఈ వార్నిషును పైపూతగా వాడినప్పుడు, ఆరగానే ఒకవిధపు పరిశోభకలిగిన గట్టి తుదితీర్పు అందులో కానవస్తుంది. నేలలకూ, గృహాంతర సామగ్రికిన్నీ పై పూతగా దీన్ని ఉపయోగిస్తారు. కల్పకంతో సాగే పోతపనిలో, కల్పకపు సంయానాన్ని, కల్పకపు నిషిక్తంనుంచి వేరుపరచటానికి, సంయానంపై దీన్ని వాడతారు. అయితే కాలం గడచినకొద్దీ ఈ మేలిలక్కరంగు నల్లబడే స్వభావం కలది కాబట్టి, కలకాలం మనవలసిన చిత్రణం ఉపరితలపు పొరలపై దానినివాడరు. అయితే అది కొన్ని కార్యకలాపాలకు, పైన

ఇంకొక రంగుతో దాన్ని కప్పివేసినప్పుడు, బాగా వనికివస్తుంది. లప్పానికి సైజు (size) గా మేలిలక్కను, ఎక్కువ పాళ్ళ మద్య సారంతో పలచనజేసి వాడటం ఇందు కొక ఉదాహరణం.

**shell gold; shell silver** : *గవ్వబంగారం; గవ్వవెండి.*

బంగారు చూర్ణమూ, లేదా వెండి చూర్ణమూ, తుమ్మజిగురుతో బాగా నూరి తయారుచేసిన నీటిరంగును, చిన్న చిన్న బొట్లుగా విడిచి ఆరబెట్టగా బొత్తాములవలె తయారయ్యేవివి. వీటిని అచ్చుపు చిన్నగవ్వ లలో ఉంచి అమ్ముతారు. అట్లాకాక ఈ విలువైనవాటిని చిన్న చిన్న బిళ్ళలరూపంలో కూడాఅమ్ముతారు సాధారణంగా ఒక్కొక్క బిళ్ళ పరిమాణంలో, పైబొత్తాములు పదిందికి సమానంగా ఉంటుంది.

**shell marble** : *వరాటు చంద్రశిల*

గాఢపు ధూసర-కపిశ చంద్రశిల, దీని నిండుగా శిలాజపు గవ్వలు ఉంటాయి అందు వల్ల, నునుపు పరచినప్పుడు, ఉజ్జ్వలత కన పడుతుంది.

**shield of David** : *డేవిడ్ కటకం.*

(చూ : Solomon's seal).

**shim** · *చీలుబద్ద.*

శిల్పంలో, నిర్మాణకృషిలో, యంత్ర కృషిలో, సందూకా పనిలో, ఒక ఉపరి తలాన్ని ఇంకొక దానినుంచి వేరుచేయటానికి వాడే చిన్నముక్క. శిల్పానికి సంబంధించి నంతవరకు, ఇటువంటివాటిని లోహ ఫలకంనుంచి (సాధారణంగా ఇత్తడి ఫలకం నుంచి) కత్తిరిస్తారు. వీటిని మెత్తగా ఉండే ప్రతిమానంలో, 1/4 అంగుళం లోతుగా గుచ్చుతారు. సుధాపిష్టపు సంయానానికి ప్రతి మానానికి మధ్య ఒక తడికగా ఈ బద్దలు అంతట రూపొందుతాయి.

**shing yao** : *షింగ్ యావో.*

స్వచ్ఛపు పింగాణికి చీనీయనామం.

**Shiva Acrylic** : *శివా అక్రిలిక్.*

ఒక అమెరికన్ కంపెనీ తయారుజేసే అక్రిలీయ పాలిమర్ వర్ణాలకూ, తదనుబద్ధము లకూ వ్యాపారనామం.

**shivering** : *కంపనం.*

ఎక్కువ సంపీడనంవల్ల మార్దవ ద్యుతు లలో కనవచ్చే ఒక లోపం; ఇదికూడా దాదా పుగా జాలికాదోషంవంటిదే, అయినా ఇందులో నెరియ పక్కనే పైకిలేచిన ద్యుతికం కనపడు తుంది.

**short** : *అల్పక.*

1. కళాకారులు వాడే రంగులలో బంక వాటురీతిగా, దారపుసాగురీతిగా, విద్రుతా స్థిరతనుగానీ లేదా వెన్నవలె మృదుతాస్థిర తనుగానీ కలిగిన దానికి వాడే విశేషణం.

2. మృత్తికంలో, లేదా వేరొక ద్రవ్యంలో పనితనానికి తగిఉండడానికి విశేషణంగా కూడా, దీన్ని వాడతారు.

**shot** : *కల్పిత రంగు*

మార్పు పొందగల లేదా కళలతను ప్రద ర్శించగల రంగు ముఖ్యంగా జవుళీసరుకులో ఇది కనపడుతుంది. అందులో ఒకే వస్తువులో రెండు రంగులు ఒకేప్రదేశంలో కనపడతాయి. రెండు రంగుల నూలును వడుగుపేకలలో క్రిషిటితిలో కలిపి నేయడంవల్ల ఇటువంటి పరిణామం కలుగుతుంది; లేదా అద్దపు రంగులను వేర్వేరుతీరులలో గ్రహించే రెండు విధాల తంతువులను నేసి అద్దకం చేయడం వల్లకూడా ఇటువంటిది సాధ్యం.

**show-card brush** ·
చూ :Lettering b ush

**show card colours** : చూ Poster colours.

**show case** : *ప్రకాశన పేటిక.*

**shrinkage** : *ముంగుదల; సంకోచం.*

**shuttering** : *దారు సంయానంః కట్రకరువు.*

కాంక్రీటుతో శిల్పాలను పోతపోయటానికై, ఉపయోగించే ఒక విధపు కరువు; లేదా పొన్నచ్చు దీన్ని కొయ్యతో ప్రాయ

**sibyl** : *దివ్యవాణిక.*

**siccative** : *శుష్కంకరి.*

ఒక పూతరంగుకు-అది త్వరగా ఆరటా నికి (అంటే గట్టిపడటానికి) కలిపే పదార్థం.

**Sicilian brown** : *సిసిలీయ కపిశం.*

ముదీ తృణమణికి ప్రాచీననామం.

**Sienese school** : *సీనీయ సంప్రదాయం.*

13వ, 14వ శతాబ్దాలలో, ఇటలీదేశం లోని సియానా నగరంలో వర్ధిల్లిన ఒక కళా సంప్రదాయానికి చెందిన కళాకార బృందం. మధ్యయుగపు బైజానిటైయిన్ కళా సంప్ర



సీనీయ సంప్రదాయం : మహర్షులగు పీటర్, యాండ్రూలను ఆహ్వానించుట, రచయిత: డుచ్చియో డి బోనిన్‌సెగ్నా(రి.1255-1319)

దాయంనుంచి విడివడి, స్వతంత్ర ప్రతిపత్తిని ఆర్జించిన ఈ వాదపు కళాకారులు కలంమున (టెంపెరా)లో చిత్రణను సాగించారు. ఆ

చిత్రణ, అలంకారిక రేఖాసౌందర్యానికి పేరు పొందింది. బంగారు రంగులో వర్ణాద్యూ మిని కలిగి ఉండటం ఈ చిత్రాలలో చాలా వాటిలోని ఒక విశిష్టత. ఈ సంప్రదాయపు కళాకారులలో గణనీయులు; డుచ్చియో డి బోనిన్ సెగ్నా (ర. 1225-1319),సిమోనీ మార్తిని (ర. 1284-1344), ఆంబ్రో గియో సోదరులు (రచనల కాలం 1319-1348), పీట్రో (రచనాకాలం 1305-1348).

**sienna** . *స్విన్నం; సీనమృత్తిక.*

ఒక విధమైన మృద్వర్ణం. ఇది ముడి స్విన్నం, తప్తస్విన్నం అని రెండు విధాలు.

**signal red** : *సంకేతారుణం.*

పారారుణంలో ఒక కోపకు చెందింది. 20వ శతాబ్దపు తొలివరకాలంలో రైల్వే సిగ్నలులకోసం దీన్ని వాడేవారు.

**sign board** : *పేరువలక.*

**significant form** : *అభిదాయక రూపం.*

'కళావిమర్శ'లో పనికివచ్చే ఒకపదంగా క్లైవ్ బెల్ అనే పండితుడివల్ల వాడుకలోకి వచ్చింది(1914). ప్రతి ఒక కళారచనకూడా తనలోని రేఖల, వర్ణాల అమరికవల్ల ద్రష్టలో రేకెత్తించగలిగే ఒకవిశిష్ట సౌందర్యభావమిది. అచ్చంపు సాంకేతిక దృష్టిలో ఒక రచన ఎంత కృతకృత్యతను ఆర్జించినా, తన రూపంలోని సౌందర్య విషయికమైన అభిధే యతవల్ల భావోద్దీప్తిని, అది కలిగింప జాలక పోతే ఆ రచనను కళగా భావించటం చెల్లదని బెల్ స్పష్టీకరించాడు.

**sign paper or banner paper** :
*సంజ్ఞాపత్రం; పతాక పత్రం.*

చౌకగా లభించే ఒక విధమైన తెల్లని కాగి తము. ఇది చాల సున్నగా ఉంటుంది. ఇటు వంటి కాగితం, 50 అడుగుల పొడవుగా, ఉండి సౌకర్యానికై చుట్టంరూపంలో అమ్మకా నికి లభిస్తుంది. వాణిజ్య రంగంలో ఇది ప్రాతవనికి ఎక్కువగాఉపయోగపడుతున్నది. కళాకారులు మాత్రం నిండు పరిమాణంలో ఆరంభాలేఖనములను, వ్యంగ్య చిత్రాలను తాత్కాలికంగా రచించటానికి మాత్రం ఈ కాగితాన్ని వాడుతున్నారు. కొయ్యగుజ్జు నుంచి ఇది తయారవుతుంది కాబట్టి, స్థిర స్థాయి రచనకు ఇది పనికిరాదు. రంగు వేసిన సంజ్ఞాపత్రం కూడా లభిస్తు న్నది. అందులో రంగులు పాండురములు మొదలుకొని గాఢవర్ణాల వరకు వివిధ రీతు లవి ఉన్నాయి. ఈ కాగితపు చుట్టలలో కొన్నిటి వెడల్పు 107 అంగుళాల వరకు ఉంటుంది. అటువంటి దానిని భూమికాపత్రం అంటారు.

**sign-writer** : *ఆస్తరికుడు.*

**sign-writer's cutter** : *ఆస్తరిక ఛేదిక.*

ఉత్తమ శ్రేణికిచెందిన ఒకవిధపు తూలిక. చదనుగాటిరి, తెల్లగా ఉండే శూకములు దీనికి

అమరి ఉంటాయి. దీని కొనఅంచు ఉలి లాగా తీరి ఉంటుంది. ఈ మొత్తం ఒక పిడికి అనుసంధించబడుతుంది. ఈ పిడి వెడల్పు సాధారణంగా 1'' నుంచి 8'' వరకు ఉండవచ్చు; ఈ పరికరాన్నే సంక్షిప్తంగా



అస్తరిక ఛేదిక

'ఛేదిక' అనికూడా వ్యవహరిస్తారు. అస్తరికులే (*sign-writers*) గాక, చిత్రణలపై వార్నిషు పట్టించటానికి దీనిని చిత్రకారులుకూడా వాడతారు. దీనితో పట్టించిన వార్నిషు సన్నటి పొరగా అతకటంవల్ల ఇది ఆపనికి చాలా అనుకూలమైంది. అంతేకాదు; సాధారణంగా ఇంటిరంగుల పూతకు వాడే వార్నిషు కుంచెతో వచ్చే పొరఒలెగాక, ఈ పొర హెచ్చుతగ్గులు లేక ఒకే తీరుగా ఉంటుంది.

**sil** : *శిలవర్ణం.*

పసుపు గైరికానికి రోమన్ భాషలోని పదం.

**silex** : *సైకతం; సిలిక.*

**silhouette** : **స్పష్టాస్పష్టం**

1. ఒకే ఒక ఛాయలో, పార్శ్వ భంగిమలో, రచించిన మూర్తిచిత్రం, రేఖాకృతి, లేదా ప్రతిరూపం. ఒక కొవ్వొత్తి దీపం ద్వారా ఒక వస్తువు ఛాయ ఏర్పడే రీతిగానే నలుపులోగానీ, లేదా వేరే ఏదో ఒకే ఒక ఛాయలోగాని రూపొందిన దానినే మొదట్లో ఈ పేరుతో వ్యవహరించారు. అయితే ఆ మూర్తిలో కేశాలను, లేదా కేశరేఖను సూచించటానికి ఆ ఛాయలోనే లేతపాటిదానిని కొన్ని సమయాలలో వాడేవారు ఈ ప్రక్రియకు ఫ్రెంచివారు మొదట్లో 'సిల్‌హౌటి' అని పేరుపెట్టటానికి ఒక కారణం ఉంది అప్పట్లో (1759) ఆ రాజ్యపు ప్రభుత్వంలో ప్రజలకు నచ్చని ఒక ఆర్థికమంత్రి – ఈతేనే సిల్‌హౌట్టి అనే వ్యక్తి – ఉండేవాడు. బాహ్యరేఖ మాత్రమే స్పష్టంగ ఉండి, లోపలి భాగం అస్పష్టంగా ఉండే ఇటువంటి చిత్రం–ఆకారం మాత్రమే కనపడుతూ, తలలో ఏమీ సరుకులేని ఆ మంత్రివలెనే ఉన్నదని భావించి, దానికి, ఆనాటి సర్దారులు ఈ పేరు పెట్టారు. 18, 19వ శతాబ్దాలలో ఈ స్పష్టాస్పష్ట మూర్తిచిత్రాలకు ఎక్కువ ఆదరణ ఉండేది, అప్పుడు నల్లని కాగితాన్ని నిర్దిష్ట బాహ్యరేఖతో చక్కగా కత్తిరించి స్పష్టాస్పష్టాన్ని రూపొందించేవారు. ఒక్కొక్కప్పుడు రూపానురేఖిని (*physionotrace*) అనే పరికరాన్ని ఉపయోగించి ఉపవిష్టుని పార్శ్వభంగిమ రేఖను గీయటం జరిగేది.

2. ఒక వస్తువుయొక్క లేదా వ్యక్తియొక్క రూపబాహ్యరేఖ

**silica** : *సిలిక.*

ఒక విరవు స్ఫటిక శిల, పొడి కావటంవల్ల రూపొందేది; ఇది ఒక జడ పర్ణద్రవ్యం.

కరకు రవపలుకు కలది; పైపూత ద్రవ్యాల కున్నూ భూమికలకున్నూ రూక్షత కలిగించ టానికి ఇది తోడ్పడుతుంది.

**silica gel : సిలికా జలాతిని.**

సిలికయొక్క ఒకవిధపు పృథుకణరూపం. వెలవెలబోతూ తృణమణి వర్ణం, కలిగి గింజలవలె ఇది ఉంటుంది. ద్రవాలను త్వరిత రీతిలో ఈ కణాలు పీల్చుకొంటాయి. చెమ్మ దనంవల్ల భ్రంశతచెందే అవకాశం ఉన్న వస్తువుల కడ, ఈ కణాలు గల గుడ్డసంచులను ఉంచినప్పుడు, ఆ వస్తువులకు రక్షణ లభిస్తున్నది.

**silicones : సిలికాజములు.**

సిలిక కలసిఉండే కొన్ని రీతుల సంయోజిత యక్షరూపాలు. పారిశ్రామిక రంగంలో పైపూత ద్రవ్యాలలో వీటిని ఉపయోగిస్తారు.

**silicon ester : సిలికా యస్తరం.**

సిలిసిక్ ద్రావణానికి చెందిన కార్బనిక లవణాలలో దేనికైనా ఇది వర్తిస్తుంది.

**silk screen: కౌశేయ యవనిక; పట్టుతెర.**

ఒక విధపు తైజస ముద్రణ ప్రక్రియ. ఒక సన్నని యవనిక ద్వారా, వర్ణపదార్థాన్ని ముద్రాతలంపైకి, సంపీడకము (*squeegee*) ను ఉపయోగించి గట్టిగా నొక్కి పంపించటం ఇందులో జరుగుతుంది. ఈ విధంగా నొక్కటానికి పూర్వం, ముద్రించ నవసరంలేని తావులను మరుగుపరచటం జరుగుతుంది. ప్రకటన వస్త్రాలను, ప్రదర్శక పత్రాలను ముద్రించటానికీ, గుడ్డపైనా, గోడకాగితాలపైనా, గృహోపకరణాలపైనా, గాజు పింగాణీ సామగ్రులపైనా రేఖాకృతులనుసృష్టించటానికీ, వైద్యుతిక పరిమండలాలముద్రణకూ, తయారీ వస్తువులపై ఎన్నిటిమీదనో సూచనలు అచ్చు వేయటానికీ వాణిజ్య రంగంలో ఈ కౌశేయ యవనికా ప్రక్రియ ఎక్కువగా ఉపకరిస్తున్నది. కౌశేయ యవనికా ప్రక్రియను ననరించి కళాకారుడి తొలిముద్రాంకముల తయారీని కౌశేయ లేఖనం అని వ్యవహరిస్తారు.

సాధారణంగా ఇటువంటి యవనికకై సన్నని, సాధారణ నేతగలిగి పట్టుతో తయారైన జల్లెడ గుడ్డకు (అయితే అంత తరచుగా కాకపోయినా కొన్ని సమయాలలో వలనేత పట్టుగుడ్డను) వాడతారు. దీనిని ఒక కరర చట్రంలో బిర్రుగా సాగదీసి బిగిస్తారు. కళాకారుని రచనాశాలలో, ఇటువంటి చట్రాన్ని ఒక మేజాబల్లకో, వరుసబల్లకో మడత బందుతో బిగిస్తారు. ముద్రణను గ్రహింప వలసినదానిని అప్పుడిక దానిపై ఉంచుతారు. ఒక ఆనుడు కడ్డీ-చిత్రాంగం అనేది ఈ యవనికను కింది పరుపుకు తగలకుండా ఉంచ డంవల్ల ముద్రితమైన రుజువును తీసి, తాజా కాగితాన్ని అక్కడ ముద్రణకై పెట్టటానికి అనువుగా ఉంటుంది. ఒక ఉత్ప్రాస్ని (*spring*) ఉపయోగించికూడా ఈ పనిని జరపవచ్చు.

కౌశేయ యవనికను ముద్రణకై తయారు చేయటంలో ముద్రణ కానవసరంలేని భాగాలను, అందుకు తగ్గ ఏదో ఒక పద్ధతిలో మరుగుపరచటం జరుగుతుంది. యవనిక యొక్క కడ అంచులను మరగుపరచటం దీనిలో తప్పనిసరి. అందువల్ల సంపీడకము స్వేచ్ఛగా నడిపే వీలుకలుగుతుంది. ఈ ముద్రణకై ఒక ప్రత్యేకపు పూతరంగును వాడతారు. దీనిని యవనిక యొక్క కడ అంచులపై పోసి, అక్కడనుంచి అన్నివైపులకు సంపీడకపుసాయంతో దానిని నెరపుతారు. అపుడా పూతరంగు - మరగుపరచని అన్ని తావులనుండి-క్రిందకు, యవనిక కింద ఉన్న ముద్రాతలంపైకి దిగి తొలి రేఖాకృతికి ఒక అవిపర్యయమైన ప్రతీకృతి రూపొందుతుంది. బహువర్ణక ముద్రాంకముల విషయంలో (చూ: *colour prints*). ప్రతి రంగువాడుక (*colour run*) కు వేర్వేరు తైజసములను వాడాలి.

యవనికా తైజసమును తయారుచేయటానికి అనేక ప్రక్రియలు వాడుకలో ఉన్నాయి అయితే ఒక ముద్రాంకపు తయారీలో రెండు లేదా అంతకన్న ఎక్కువ పద్ధతులను సంయుక్తంగా వాడవచ్చు. అటువంటి విధానాలలో కాలికా ప్రలేపిత విధానం, ఈ కౌశేయ లేఖనంలో విరివిగా వాడుతున్నారు. సంస్కృత తైజసవిధానమూ; పటల తైజస విధానమూ కూడా కౌశేయ లేఖకులు వాడటం ఉంది. పత్ర తైజస విధానం, అందునా ముఖ్యంగా పటల తైజస పద్ధతి వాణిజ్య సంబంధ ముద్రణ కృషిలో కుడ్యప్రకటనలను, ప్రకటనలను రూపొందించటానికి ఎక్కువగా వాడుకలో ఉన్నాయి. ఈ రెండు పద్ధతులుకూడా కాలికా ప్రలేపితంతో పోల్చినప్పుడు తక్కువ గ్రహణశీలత కలవి



కౌశేయ యవనికా పరికరం.

కౌశేయ యవనికా కృషిలో అనేక విభిన్న ముద్రణ మాధ్యమాలు-సిరాలు తైలకలల వర్ణాలు, అద్దకపు రంగులు, మాయలక్కలు మొదలైనవన్నీ-అర్హములే. అయితే వాడటానికి ముందుగా అందులో ప్రక్రమపద్ధతిలో శీనత (*viscosity*), కల్పకత, (*plasticity*) శోషణ వ్యవధి (*drying time*) కుదురుకొని ఉండేట్లు చూడాలి. పైలక్షణాలు అన్నీ యవనిక నుంచి ఆ మాధ్యమం సులువగా దిగజారటానికి సహకరించేవిగా ఉండాలి శోషణ వ్యవధి తక్కువైతే ఆ మాధ్యమం త్వరలోనే గడ్డకట్టి యవనిక నుంచి కింవికి దిగలేదు. ప్రస్తుతం ఈకౌశేయ యవనికా ప్రక్రియకై-ఉన్న రీతిలో చక్కగా వివిధ ద్రవ్యాలు మేళనం చెందిన-మాధ్యమాలు సిద్ధకిటిలో బజారులో లభిస్తున్నాయి ప్రణవకి తైలవర్ణాలు (*process oil colour*) అనేవి, కాగితంపై కౌశేయ యవనికా ముద్రణ సాగించటానికి

చాలా అనువైనవి (పూతరంగుల కన్నా, కళాకారుల రంగులకన్నా వేరైనవి ఇవి అని తెలియజేయటానికై వీటికి ఈ ప్రత్యేకపు పేరు పెట్టడం జరిగింది.) ప్రబంధక కలశ వర్ణాలు కూడా ఈ ముద్రణకై వనికివచ్చేవిగా క్రమేణ ముందుకు వచ్చాయి. రాగద్రవ్యాలను, మాయ లక్కలను సాధారణంగా గుడ్డల అద్దకంలో మాత్రమే వాడుతున్నారు

ప్రాచ్యదేశాల తైజస ముద్రణనుంచి కౌశేయ యవనికా ప్రక్రియ రూపొందింది అనటం యథార్థమే అయినా, కొందరు దీని పరికల్పనను, ఆంగ్లదేశీయుడూ మాంచెస్టరు నగరవాసీ అయిన సామ్యుయెల్ సైమన్ అనే అతనికి అంటగిట్టారు ఈ ప్రక్రియను అతడు 1907లో లేఖ్య ప్రకాశితం (Patent) చేశాడు. వాణిజ్యరంగంలో ఈ ప్రక్రియ ఒక విస్తృత పరిశ్రమకు మూలమై రాణిస్తున్నది.

**silk screen colour** : *కౌశేయ యవనికా వర్ణం*

**sill** : *భువంగమం; దిగువపట్టీ.*

**silver-gilt** : *రంజిత రజతం*

నిగ్గుని బంగారు పొరను పైకప్పుగాగల వెండి.

**silver leaf** : *రజతపత్రము; వెండి ఆకు.*

రంజన ప్రక్రియలో వాడటానికి సన్నని ఆకురీతిగా చరచబడిన వెండి. బంగారానికి ఉన్నంతగా ఉద్వృత్తసీయత వెండికి లేనందు వల్ల స్వర్ణ పత్రం కన్నా, రజత పత్రం మూడింతలు మందంగా ఉంటుంది. అందు వల్ల దీనితో పనిసాగించటం సులభతరం. అయితే, కాంతి తగ్గిపోకుండా ఉండటానికి మాయలక్కనో, లేదా వార్నిషునో పూయ వలసి ఉంటుంది. బంగారుకు అటువంటివి ఏవీ అవసరంలేదు. ఈ లోపం వెండిలో ఉండ టంవల్ల, ఈ రజతపత్రానికి బదులుగా వల్లేడి యం పత్రాన్నో అల్యూమినియం పత్రాన్నో వాడటం, ముఖ్యంగా వాణిజ్య రంగంలో, జరుగుతున్నది వెండినీ, పల్లేడియమునూ కాదని ఒకనకిలీ చౌకబారుదానిని కూడా వాణిజ్య రంగంలో వాడటం జరుగుతున్నది. రంజన ప్రక్రియలో స్వర్ణపత్రానికున్న వ్యాప్తి రజత పత్రానికి లేదు

**silver point** : *రజత సూచి.*

సన్నటి కొన కలిగిన ఒక వెండికడ్డీ ఒక తెల్లని నర్గద్రవ్యం పూయబడిన కాగితంపై, దీని కొనను ఉంచి అడ్డంగా గీసినప్పుడు అత్యల్పపు రజతకణాలు, కాగితపు ఉపరి తలపై అంటుకొని నిలిచి ఒక ధూసరవర్ణపు రేఖగా పరిణమిస్తాయి కాలక్రమాన అందు లోని వెండి, మలినత చెందగా, ఆరేఖ నల్లటి రంగుగా మారుతుంది. ఇట్లానే ఈ రజత సూచిచేత ఆ కాగితంపైన గీసే ఆలేఖనంలో రేఖావర్ణం కాలక్రమాన ఎక్కువ నల్లదనం పొందుతుంది. అయితే ఈ రేఖలలో అటు వంటి పరిణతిలో కనపడేవర్ణం, లాలిత్యం చాల రమణీయమై పేగా భావిస్తారు సాంప్రదాయి కంగా వాడుకలో ఉండే రజతసూచి 8

నుంచి 4 అం. పొడవు కలిగి ఉంటుంది. తరచుగా దానికొద, కొంత మెలిక తిరిగి ఉంటుంది. ఇందువల్ల దీన్ని పట్టుకొని వాడటానికి ఎక్కువ సౌలభ్యం కలుగుతుంది. ఒక్కొక్కప్పుడు ఈ సూదియొక్క కొనలు రెండున్నూ మొనదేరి ఉండటమో, లేదా ఒకటి ఉలిబద్దగా తేలి ఉండటమో జరుగుతుంది. ఈ ఉలిబద్దంమువల్ల ఎక్కువ వెడల్పుగా రేఖలను, అవశ్యకమైనప్పుడు, గీయవచ్చు.

ఈ రజత సూచి, బజారులో లభించనప్పుడు, ఒక వెండిపనివానిచేత దీన్ని సులభంగా తయారు చేయించుకోవచ్చు. అయితే చాలామంది కళాకారులు ఒక తీగనే, ఇటువంటి రజత సూచికకు బదులుగా వాడతారు. వారు ఆ వెండితీగెను యాంత్రికపు పెన్సిల్ లోనో, సూచీ చిత్రణకు ఉపయోగించే సూది పిడిలోనో బిగించి, కొనను మెరుగు కాగితంపై బాగా రుద్ది సన్నగా చేసి వాడుకొంటారు.

రజత సూచిని వాడటానికి పనికివచ్చే చిత్రతలాన్ని రూపొందించటానికై, మధ్యయుగపు చిత్రకారులు కాగితం, చర్మపత్రం, లేదా అట్టమీద ఎముకబూడిదని బంకతో కలిపి పైపూతగా వాడేవారు. ఆధునిక కాలంలో రజతసూచీ చిత్రాన్ని-నాగిశ్వేతమును ఒక పరిపూర్ణ బంధకంతోనో, ఒక నీటిరంగుతోనో కలిపి, పైపూతగా ఒక గరుకుగాగితంపై దాన్ని పట్టించి రూపొందిస్తారు. ఛవిత వర్ణమే అవశ్యకమయ్యే పక్షంలో ఆ పైపూతలో అందుకు తగిన ఒక వర్ణద్రవ్యాన్ని కూడా కలుపుతారు. ఇట్లా తయారైన రజత సూచీ పత్రంపైన రేఖలను గీయటానికోసం మెత్తని లోహాన్ని-రాగి, సీసం, ప్లాటినం, బంగారంవంటి దానిని-దేనినైనా వాడతారు. బంగారు, ప్లాటినములకు ఈ ప్రక్రియలో వాడకం చాలా తక్కువ.

పునరుజ్జీవన కాలంలో రజతసూచి వాడకము అధికంగా ఉండినది ఆ కాలంలో అది పలక చిత్రణకే కాదు, కోమలములైన ఆలేఖనములకు సైతం వాడబడింది ఆ కోమలపు ఆలేఖనములు తెల్లటివి లేదా ఛవితములైన భూమికలపై లభింపబడేవి. అటువంటి ఆలేఖనములకు పై మెరుగులు దిద్దటానికిగాను నీటి రంగులను తూలికతో పట్టించేవారు. ఇప్పటికీ లలితమైన ఆలేఖనముల రచనలో ప్రామాణికుడైన కళాకారుడు అవలంబించే ప్రక్రియగా రజతసూచి నిలిచి ఉంది.

**silver powder** : *రజతధూళి*

సన్నని చూర్ణంగా చేసినవెండి. దీన్ని నీటి రంగువాహకంలో బాగానూరి, వెండిరంగుగల పైపూతగా రంజన ప్రక్రియలో వాడటం అక్కడక్కడ చూస్తాం. ఈ పూతకు మేలిలక్కనో వార్నిషునో పూయకపోతే అది త్వరలోనే మలినతచెంది నల్లబడుతుంది. అయినను, చిత్రలేఖనంలో దీనికి ఎక్కువ వాడుకఉంది. అందులో లలితరేఖలను గీసి, పిండివాక పై మెరుగులను కోమల రీతిలో రూపొందించటం ఇందువల్ల వీలవుతుంది. రజతధూళి బజారులో బిళ్ళలరూపంలోనో లేదా గవ్వల రూపంలోనో కొనటానికి లభిస్తుంది.

**silver stain** : *రజత వరివర్ణకం.*

వివర్ణకాచం (*stained glass*)లో కొన్ని చోట్ల వర్ణాన్ని మార్చటానికై వాడే ఒక ద్రావణం; రజత సంబంధ లవణాలు ఇందులో ఉంటాయి. అచ్చపు గాజుపలకపై దీనితో చిత్రణ సాగించి, తర్వాత బట్టీలో కాల్చినప్పుడు ఆ పలకకు గాఢపు పసుపును లేదా నారింజ రంగును, రజత వరివర్ణకం కల్గించగలదు. ఇక అదివరకే వర్ణలేపితములైన కాచఫలకాలపై దీన్ని పట్టిస్తే ఇతర వర్ణాలను సాధించవచ్చు. ఉః నీలిరంగుమీద దీనివల్ల ఉజ్జ్వల హరితాన్ని సాధించవచ్చు పశ్చిమ ఆసియా ప్రాంతంలో, మధ్యయుగాలలో కనుక్కొని వ్యాప్తి చెందిన ఈ రజత వరివర్ణకం, 14వ శతాబ్దిలో ఎల్లెడలా వాడుకలోకి వచ్చింది.

**silver white** : *రజతశ్వేతం.*

తుషారశ్వేతానికి పర్యాయనామం

**simple-solution varnish** . *సరళ ద్రావణ వార్నీషు*

**simultaneism** : *యుగపత్ వాదం.*

**simultaneity** : *ఏకకాలత.*

అనాగతవాదం అనే పేరుతో ప్రచారం పొందిన కళోద్యమపు ముఖ్యభావనల్లో, లేదా ప్రత్యంగములలో ఒకటి. ఒక కళాఖండాన్ని రచించే సమయంలో కళాకారుని మనస్సున నెలవు కల్పించుకొన్న భావవికారాలు, స్మృతులు, సంగతులు, భావనలు, సంకల్పాలు-ఇవన్నీ చక్కగ ఒక సర్జనకృషిగా సమ్మిళితం చెందే ఆవశ్యకతను అది నిర్దేశిస్తుంది. అనాగతవాదులు వాడక పూర్వమే ఈ పదాన్ని అపోల్లినైర్, స్థూలతా మూల తత్త్వ వివరణలో ప్రయోగించాడు. ఈ ఏకకాలత అనే పదం ఏకకాలీన ప్రతికల్పన అనే ఒక ప్రక్రియకే ఇంకొక పేరుగా వాడటం కూడా ఉంది.

**simultaneous representation** :

*ఏకకాలీన ప్రతికల్పన.*

ఒకే వ్యక్తిని లేదా వస్తువును, ఒకటి కన్నా ఎక్కువ దృష్టికోణాలనుంచి చూసినప్పుడు వచ్చే పరిణామాలను ఒకే చిత్రంలో



ఏకకాలీన ప్రతికల్పన : స్త్రీ శిరము; రచయిత. పికాసో [1941]; కాగితముపై ఆలేఖనము.

సూచించే ప్రక్రియ. ఉదాహరణకు పార్శ్వ భంగిమలో చూపబడిన ఒక ముఖపు ముఖ్య లక్షణాలు ఆ భంగిమకు తగినట్లే ఉన్నా, అభిముఖ భంగిమపు కొన్ని పోకడలనుకూడా అందులో చేర్చవచ్చు. పునరుజ్జీవన యుగం మొదలుకొని పరిభావనావాదపు కాలంవరకు చిత్రకారులు, ఏకకోణపు దృష్టికి సంబద్ధ మయ్యే వస్త్వంశంకన్నా ఎక్కువగా తమచిత్రా లలో ప్రదర్శించటానికి, ఆ వస్తువుయొక్క అద్దకపు ప్రతిబింబాలను ఒక నెపంగాగ్రహించ టంలో, ఇటువంటి ప్రక్రియ కొంతవరకు కనపడసాగిందని అనవచ్చు. అయినా మొట్ట మొదట్లో చక్కగ విరివిగా ఈ ప్రక్రియను వనిగొనినవారు ఘనతావాదులు - ఈ ఏక కాలీన ప్రతికల్పనకే ఏకకాలత అను వ్యవ హారం కలదు.

**Singapore damar** : *సింగపూరు డాంబరు.*

డాంబరులలో శ్రేష్ఠమైన రకపుది.

**singerie** : *కపి చిత్రణ.*

కొంటెపనులు చేస్తూనో, లేదా మానవుల వలెనే వివిధ కృత్యముల నిర్వహిస్తూనో ఉన్నట్లు కోతులను చిత్రించటం.

**single-fired** : *ఏకతప్తం.*

ఒకసారి మాత్రమే కాల్చబడిన మార్తవ సామగ్రికి విశేషణంగా ఉపయోగించే పదం.

**single-stroke brush** : *ఒంటివిసురు కుంచె; ఏకాహతి తూలిక.*

ఒక విధపు కుంచె. వెడల్పుగా, బల్లపరు పుగా ఉండి, ఎర్రశేబిల్ రోమాలు కలిగి ఉం టుంది. 1/8 అంగుళం మొదలుగా 1 అంగు ళంవరకూ వెడల్పుతో ఉండే వివిధ ప్రమాణా లలో ఇది లభిస్తుంది. మొదట్లో, అక్షరాల వ్రాతకూ, నామఫలకాలపైన రాయటానికీ దీన్ని ఉపయోగించేవారు. కాని ఈనాడది



ఒంటివిసురు కుంచె

అందరికీ నచ్చిన నీటిరంగుల తూలికగా పేరెన్నికకు వచ్చి, విశాలతలములలో రంగు పూతకూ, చదునంచు విసురుకుంచెగా సన్నని రేఖలను రూపొందించవలసినప్పుడూ వాడు కలో ఉంది. కొందరు కళాకారులు ఎక్కు వగా అభిమానించే చౌకరకపు ఒంటివిసురు కుంచెలలో, ఎర్రశేబిల్ రోమాలతోపాటుగా, ప్రతిఘాతక శక్తికి పేరొందిన ఎద్దురోమాలు కూడా కలగలుపుగా వాడుకచేయడం జరుగు తున్నది.

**sinking in** : *అవనన్నత.*

ఆరిన తరవాత ఒక తైలచిత్రంలో శోభా హీనపు, కళారహితపు మచ్చలు కనపడటం. చిత్రపు భూమికలో గ్రహణశక్తి ఒక్కొక్కచోట ఒక్కొక్క రీతిగాఉండటంవల్ల ఒక్కొక్కచోటఒక్కొక్క

తీరుగా పూతరంగు చొరబడటంవల్ల ఈలోపం తటస్థిస్తుంది. చిత్రంపైన పటపువార్నిషును పై పూతగా పట్టించి, ఈలోపాన్ని చక్క జేయవచ్చు. తైలవర్ణ చిత్రాలలో దాదాపుగా అన్నీ, ఆరిన తరవాత, ఈ అపసన్నతకు విధిగా గురి అవుతాయి. ఇటువంటి దానిని చక్కజేయటానికే పటపు వార్నిష ఉద్దిష్టం. వార్నిషును పట్టించినా చక్కబడని అపసన్నతపై, చిత్రపు పరిరక్షణ దృష్టిలో, సమర్థతరములైన చర్యలు తీసుకోవాల్సి ఉంటుంది. ఈ విధపు క్లిష్టమైన అపసన్నత, చిత్రణకు వాడిన ద్రవ్యాలలోని గుణలోపంవల్లగాని రంగు పట్టించటంలో అవలంబించే పద్ధతులలోని దోషాలవల్లగాని కలగవచ్చు అపసన్నతకే ఫ్రెంచిభాషలో 'ఎంబూ' అనే వ్యవహారం ఉంది.

**sinopia** : సినపేయం.

సహజసిద్ధమైన సిందూర భస్మ వర్ణ ద్రవ్యానికి ప్రాచీననామం. ఆసియా మైనరులోని సినోపీ నగరంలో లభించిన ఇటువంటి వర్ణద్రవ్యానికి మొదట ఆపేరు కలిగి, కొంతకాలం వ్యాప్తిలో ఉండినది.

**sinter** : ప్రదహింపు.

మార్తవ ప్రక్రియలోని ఒక పారిభాషిక పదం. ద్రవీభవన బిందువునరకు పోకుండా జరిపే ఒక విధమైన కాల్పు. ఈ కాల్పును ఆపి, దానికి మళ్ళీ నీరును కలిపితే, మొదటి ముద్దప్రకృతికే రూపొందే అవకాశం ఉంటుంది.

**site plan** : పదవిన్యాసం

**sitter** : ఉపవిష్టుడు; ఆసీనుడు.

**size** : పరిమాణం; సైజు.

**size; sizing** : సైజు.

ఒక యక్షధూపం, లేదా దానివి నీటి
కరిగిస్తే వచ్చే పలుచటి ద్రావణం ఒక ఉ
తలపు గ్రసనతను, లేదా సవిరళతను తగ్గి
టానికి దీన్ని ఆ తలంపై పూస్తారు. ఇం
వల్ల ఆ ఉపరితలం రంగుపూతను గ్రహిం
టానికి లేదా ఇంకొక పైపూత ద్రవ్యా
గ్రహించటానికి సుసంఖ్యత పొందుతుం
కాటికలపై తైలసూచికలను ఏర్పరచేటప్పు
సైజును పట్టించటం అతిముఖ్యం, లేకపో
కాటికకు తైలంతో నేరుగా సంపర
మేర్పడి, తత్ఫలితంగా కాటికలోని న
పీచులు పెళుసుబారి అంతరించే ప్రమా
ఉంది ఈ సైజుకై తోళ్ళు, ఎము
నుంచి తయారయ్యే చర్మసక్తం (*Hi*
*glue*)ను సామాన్యంగా వాడతారు. అయి
గట్టి ఉపరితలముపై - అంటే ఫలకా
గోడలవంటి వాటిపై అల్పదార్ఢ్యంగల వే
లక్కను వాడటం కూడా ఉంది.

**size colour** : scenic colour అనే పదా
ప్రిటనులో వాడే పదం. రంగికావర్ణం.

**sketch** : మాత్రలేఖ్యం; రూపరేఖ; స్కెచ్

ప్రాథమికమైన ఒక ఆలేఖనం, చిత్ర
లేదా అనురూపం. సాధారణంగా అసంగ

రితమై, కొన్ని సందర్భాలలో అతిత్వరితంగా దీన్ని రూపొందించటం జరుగుతుంది. ముందు రూపొందనున్న దానిలోని లాక్షణిక రేఖలను భావనలను మాత్రమే తెలియజేస్తూ ముఖ్యమైన కొన్ని వివరాలను ప్రదర్శించటానికై ఇందు శ్రద్ధ కనపరుపబడుతుంది. ఈ విషయంలో ఇది అను శీలనం(*Study*) కన్నా వేరైనది. అనుశీలన మనేది అయత్నకృతంగాదు; విషయం సమగ్రంగా అందుచర్చితమవుతుంది. సూత్రలేఖ్యం అనేది ఒక పాండులేఖ్యం కావచ్చు, లేదా ఒక ముఖ్యాంశాలూహకు విభావననో, లేదా ఒక వ్యక్తి చేసే ఒక చేష్టవంటి క్షణకాలికపు అనువృత్తాలనో చక్కగా గుర్తుంచుకోవటానికి తొందరగా తయారుచేసుకొన్న ఉద్దేశపత్రమో (*Note*) కావచ్చు. ఒక ప్రకృతి దృశ్యంపై వాతావరణ ప్రభావంవల్ల కనపడిన ఒక పరిణామాన్ని గుర్తుంచుకోవటానికి ఉంచుకొనే ఇటువంటి ఉద్దేశపత్రానికి ద్రుతచిత్రం (*pochade*) అనే వ్యవహారం ఉంది. ఒక కళాకారుడు తాను రూపొందింపదలచుకొన్న ఒక చిత్రాన్ని గురించి తనకు గల భావనలకు ఒక వ్యవస్థిత రేఖారూపాన్ని కల్పించుకొన్న రూపిక (*Esquisse*) కున్నూ సూత్రలేఖ్యమనే పేరే వర్తిస్తుంది. ఇటువంటి రూపిక, ఆ కళాకారుడి వద్ద పనిచేసే సహాయకులకు, చిత్రపు తుదిపరిష్కరణలో సాయపడుతుంది. రూబెన్ అనే కళాకారుడు తన్నర్థించి పలువురు పెద్దలు తనకు అప్పగించిన కళారచనలను సాగించటానికై, పెద్దయెత్తున ఒకచిత్ర నిర్మాణశాలనే నిర్వహిస్తూ, అందులో ఎందరినో అంతేవాసుల నియమించుకొని, ఈ విధంగా రూపికలను తయారుచేసి వారికి అప్పగించేవాడు. ఒక కళాఖండ రచనలో మొట్టమొదటి ఘట్టపు పనికికూడా సూత్రలేఖ్యమనే పేరు వర్తిస్తున్నది. ఉదాహరణకు ఒక శిల్పాన్ని చెక్కటంలో మొదట రాతిని చెక్కి, భావించిన రూపాన్ని స్థూలరీతిలో పోలిఉండేట్లు తయారుచేసే అసంస్కరిత శిల్పానికీ, ఒక కాటికపైన లేదా గోడపైన చిత్రాన్ని రచించటానికి ప్రాతిపదికగా దానిపై సాగించే అధశ్చిత్రణ, లేదా అధోలేఖనకూ సూత్రలేఖ్యమనే వ్యవహారమే ఉంది.

**sketch²** : సూత్రపాతం; రేఖాచిత్రణం

**sketch box** : కళాపేటిక.

కొయ్యతోగాని లోహంతోగాని దృఢంగా నిర్మితమై, తీసుకొనిపోవటానికి అనువుగా చేపిడితో ఉండే ఒక చిన్నపెట్టె. తైలచిత్రణకు అవసరమైన యావత్సామగ్రినీ, ప్రదేశాంతర పర్యటన సందర్భంలో తీసుకొనిపోవటానికై కళాకారులకు, ఇది ఉపయోగిస్తుంది. ఇందులో కొన్ని అరలో, లేదా ఒకదానితో వేరొకటి అమర్చటానికి వీలయ్యే తట్టపలక (*Tray*)లో లేదా ఆ రెండు తీరులవికూడానో ఉంటాయి. వీటిలో ఒక క్రమపద్ధతిలో తూలికలను, లేపనాళికలను, కర్పూరతైలం, అవిసెనూనెల సీసాలను అమర్చటం జరుగుతుంది. వ్యాపారరీతిలో బజారులో కొనసాగటానికి లభించే కళాపేటికలలో వర్ణఫలకాన్నికూడా

జతపరచిఉంచుతారు. కొన్నిటిలో ఆపేటికలో మూతదిగువన, చిన్నకాటికా ఫలకాలను కూడా సర్దిపెట్టుకోవటానికి అమరిక ఉంటుంది. చాలా చిన్నదైన కళాపేటికను ప్రుతచిత్ర పేటిక (*Pochade Box*) అనికూడా వ్యవహరిస్తారు

**sketchy** : *రేఖామాత్రపు.*

**skin** : *నిశ్చర్మీకరణ; వలిచివేయటం.*

ఒక తైలచిత్రణముపు చక్కగా తుడిచి సిద్ధం చేయటం. వార్నిషు జాతలన్నిటినీ తుడిచివేసినప్పుడు, చిత్రపు రంగులలో మసకబారు ఏర్పడుతుంది నిశ్చర్మీకరణ మనేది రంగును తుడిచివేయటానికి. అందునా ముఖ్యంగా ఉపరితలద్యుతిని తొలగించివేయ టానికి ఉద్దిష్టం ఒక చిత్రాన్ని శుభ్రం చేసే టప్పుడు, నిశ్చర్మీకరణ ప్రమాదం సంభ వించకుండా ఉండటానికి ఒక నిగ్రహిక (*Restrainer*)ను వాడతారు. కాని ఇటువంటి పరిస్థితిలో అన్నిటినీ మించి ప్రయోజనకర మైనది పరిరక్షకుని కుశలత.

**skkyphos** : *యావనిక.*

ప్రాచీన గ్రీసుదేశంలో వాడుకలో ఉన్న ఒక విధపు మృణ్మయ పానపాత్ర, గోళక వన్న పాదములో ఇది పెద్దది.

**sky blue** : *గగన నీలిమ*

ఒక విధపు ఆకాశనీలవర్ణానికి సన్నిహిత మైన పేరు కు నామం. నాగశ్వేతంతో అతి సాంద్రిక నీలిమను కలిపి రూపొందించే వర్ణా లకు ప్రాచీనకాలంలో ఈ పేరు వాడేవారు.

**slab** : *నూరుడు వలక.*

కళాకారుల రంగులను నూరటానికి ప వచ్చే వలకవంటి పరికరం, రాతితో గాజుతోగాని దాని ఉపరితలం నిర్మితం.

**slab method** : *వలకవద్ధతి.*

సారెపైకాకుండా చేతితో మృత్సామ రూపొందించే ఒక సాంకేతిక రీతి. ముద్ద ఉండే కుమ్మరిమట్టిని ఒక వలకపైవేసి, దవు కర్రవంటి పరికరపు సాయంతో దా ఆ వలకపై ఒదును చేస్తారు, చదును చే టంవల్ల రూపొందే మట్టిపొరయొక్క దళ తనం, ఉద్దిష్టమయ్యే మృత్సామగ్రియొ దళసరితనానికి అనుగుణంగా ఉంటుంది. పొర ఉన్న వలక కావలసిన రీతిలో వంచ నికి అనుగుణంగా ఉండేది కావటంవల్లనే వలకను వంచి, ఇదేపద్ధతిలో మట్టిపొరలు గిన వేరువలకలతో సరకపు (*sli* సాయంతో సంధించటం జరుగుతుంది. ఒకొ క్కప్పుడు ఆ రెండు భాగాలను కాపించ కూడా కద్దు.

**slant** : *వాలుదిమ్మె.*

ఏటవాలుగా అమరిన గుంట ఒకటో, గుంటలు అనేకములో కుదురుకొన్న ఒకది వలక. ఈ గుంటలలో సిరానో, నీటిర ఒనో. వలురీతుల చిక్కదనములు వాటిని నింపుతారు. శాలకారేఖనాలకు ప వచ్చే ఒర్ణఫలకం ఇది అని చెప్పవచ్చు.

వాలు గుంటలను, గుండ్రనిగుంటలను కలిగిన దానిని వాల్వావిదిమ్మె(*well slant*) అంటారు. ఈ రెండిలోను చిన్నవాటిని, అంటే లోతు తక్కువ గుంటలున్నదాన్ని పెంకు (*Tile*) అంటారు. ఈ వాలుదిమ్మెలు, ఇదివరలో



వాల్వావి దిమ్మె

పింగాణితో చేయబడుతుండేవి. కాని ఈ కాలంలో అవి తిరముగా కల్పకంతోనో, అల్యూమినియంతోనో తయారవుతున్నాయి. ఒక్కొక్కప్పుడు నీటిరంగుల పెట్టెయొక్క పై మూతనే, వాలుదిమ్మెగా రూపొందించి వాడుకోవటంకూడా ఉంది. వర్తులాకారంగాఉండి, చుట్టునూ అంచులలో ఆరో లేదా ఎనిమిదో గుంటలును, మధ్యన ఒక గిన్నెయో, గుంట పళ్ళెమో అమరిఉండే వాలుదిమ్మెకు 'వాలు పళ్ళెం' (*basin slant*) అనే పేరు ఉంది,

**ite pigments** : *తసుశిలా వర్ణద్రవ్యాలు.*

వలకరాతి పొడివన్నెలు. బూడిదవాక నలుపులో, మసక ఎరుపులో, పచ్చమట్టి రంగులో, మసక హరితంలో ఈ పొడులు లభిస్తాయి; చౌకబారు వర్ణద్రవ్యాలుగా వీటికి పారిశ్రామికరంగంలో వాడుక ఉంది.

**slice** : *నిర్ఘేళిని.*

వెడల్పైన కత్తిఅంచుగల ఒక విధపు ఉపకరణాలకు సామాన్య నామం. కుడ్య తూలిక ఈ కోవలేనిదే.

**slicker** : *విరుతూలిక.*

ఒక అంగుళం పొడవు మాత్రమే ఉన్న ఒక విధపు టంకతూలిక.

**slide projector** : *చలత్ ప్రక్షేపకి.*

**slide rule** : *జారుడు క్రొలబద్ద.*

**sliding bracket** : *జారుడు కుందలిక.*

**slime** . *పంకము.*

**slip**[1] : *సరకం.*

1 మా ర్పంలో వాడుకిలో ఉండే ఒక విధపు మట్టినీరు. కుమ్మరి మట్టితో నీటిని బాగాకలిపిదీన్నిరూపొందిస్తారు. ఒక్కొక్కప్పుడు వర్ణభస్మాలను కొన్నిటిసిదీనిలోకలపటంకూడా ఉంది. మృత్సామగ్రిని అలంకార శోభితం చేయటానికి దీన్ని వాడతారు. ఈ సరకమును సామగ్రిపై క్రమరీతిలో పోయటంవల్లనో లేదా బిందువులుగ జారవిడపటంవల్లనో ఈ అలంకరణ సాగుతుంది. సరక నిష్యందంలోనూ ఇది ఉపయోగపడుతుంది. ఒక రచనను వేరు

వేరు భాగాలలో తయారు చేసినప్పుడు వాటిని సంధించటానికన్నీ అదనపుగా సరకం వనికి వస్తుంది.

2. గట్టి పలుకుగల తైలశిలనుంచి తీసిన, క్రమబద్ధాకృతికల, చిన్న ముక్క. కొయ్యను మలచే, లేదా చెక్కే పరికరాలకు దీనిపై పదును పెట్టవచ్చు. ఆయా పరికరాల వాతరల రూపరేఖలకు అనువుగా ఉండేరీతిలో ఇటువంటి సరకాలు పలుతీరులలో తయారు చేయబడి లభిస్తాయి.

**slip ²** : *అలివేణిమన్ను.*

(చూ : Ochre)

**slip casting** : *సరక నిష్యందం*

గ్రసనశీలమైన సుధాపిష్టంతో తయారైన సంయానంలో సరకాన్ని పోసి తయారుచేసే మాత్రపసామగ్రి. సరకంలోని నీటిని సంయానం కొన్ని నిముషాలలో గ్రసింపగా, మట్టి గట్టిపడి ఒక గోడలాగా రూపొందుతుంది. ఇంకా ఏమైనా నీరు అక్కడ మిగిలిఉంటే ఆ నీటిని మెల్లగా పారపోస్తారు. అప్పుడు ఆ మట్టిరచనను సంయానంతోపాటుగా బాగా ఆరబెట్టగా, మట్టిరచన కుంగి, సంయానంనుంచి విడిపడుతుంది. (చూ : *slush moulding*)

**slip clay** : *సరక మృత్తిక.*

ద్యుతిక క్రియకై చాలినంతగా ద్రవసవనాన్ని కలిగిఉండే ఒక విధమైన సహజసిద్ధ మృత్తిక.

**slip decoration or slip trailing :**

*సరకాలంకరణ.*

ఒక పిచికారివంటి పరికరంతో సరకమును మృత్సామగ్రికి వట్టించి, ఆ సామగ్రిపై కొంచెం ఉబ్బెత్తుగా ఉండే రేఖాలంకారాలను పొందుపరచటం. యు. స్టే. లో పెన్సిల్వేనియా రాష్ట్రంలో తయారై 'డచ్ బ్రౌన్‌పై ప్లేటు' అనబడేసామగ్రి ఆటువంటిదేయైన ఇతర సామగ్రి ఇందుకు తగిన లక్ష్యాలు. అవి అమెరికాలో తొలువలసకాలపు కుమ్మరిపనికి సంబంధించినవి.

**slush moulding** : *కర్దమ నిష్యందం.*

ఒక సంయానంలో వినాలికా ద్రవం పంటి సిద్ధద్రవాన్ని పోసి, సుషిరముగ (డొల్లగా ఉండే) ఒక కల్పకపు నిషిక్తమును రూపొందించే ఒక సాంకేతిక ప్రక్రియ. అట్లా పోసిన ద్రవాన్ని బాగాకలియబెట్టి, అందులో, కొంతభాగం సంయానపు లోతట్టులలో గట్టిగా పొరదేలేవరకూ ఆగి, మిగిలిన ద్రవాన్ని పారబోస్తారు. సంయానకపు లోతట్టుకు అంటుకొన్నదానిని ఇంకా బాగాఆరి గట్టిపడనిస్తారు. అయినా ఇందుకు అనువైన ద్రవ్యాలును, రంగులును పరిమితములు కాబట్టి ఈ ప్రక్రియలో జరిగే పోతపని కూడా చాలా పరిమితం. అంతేకాదు; ఇందులోని ఫలితాలు కూడా తక్కిన నిష్యంద ప్రక్రియలవల్ల లభించే వాటికన్నా తక్కువ గుణం కలవి ఇది ఎట్లున్నా, డొల్లగాఉండే కట్టుబడి భాగం చాలా పలచగా ఉండే రచనలను రూపొందించటా

నికి, ఆర్థికంగా, ఇది చాలా చౌకపద్ధతి ముఖ్యంగా ఔత్సాహిక కళాకారులకూ, చేతి వృత్తులవలన జీవించేవారికీ ఇది చాలా ఉపకరిస్తుంది. (చూ slip casting)

**Small half length** : చిన్న అరనిలువు

(చూ.: Canvas sizes, portrait)

**small whole length** : చిన్ననిలువు.

(చూ : Canvas sizes, portrait)

**smalt** . కాచిక.

నేడు వాడుకలో లేని ఒక నీలవర్ణద్రవ్యం మాత్రవ వర్ణద్రవ్యంగా దీనికి వాడుక ఉండేది; అక్కడక్కడ కొందరు దీనిని ఈనాడు కూడా వాడుతున్నారు.

**smalto** : కాచపట్టిక.

చిత్రపటంగాగా కనపడే ఒక విధపు మాత్రప సామ్యగ

**smaraged green** : గారుత్మత హరితం

హెలాశికకు పర్యాయనామం.

**smillie's bath** : స్మిల్లీ క్షయంకరి; స్మిల్లీద్రావణం

హైడ్రోక్లోరిక్ ఆమ్లంతో పొటాషియం క్లోరేటును కలిపి తయారుచేసే ఒక ద్రావణం జలచ్ఛవిలో క్షయంకరిగా ఇది ఉపయోగిస్తుంది. దచ్ఛిక్షయంకరిలో ఉండే సాధన ద్రవ్యాలే ఇందులో ఉన్నా, ఎక్కువ సమువ చితమై, ఒక పాలు హైడ్రోక్లోరిక్ ఆమ్లమునకు అయిదు పాళ్ళ నీరు మాత్రమే కలిగి ఉంటుంది.

**smoking** : ధూపనం.

సూచీ చిత్రణలో, సూచీ ప్రక్రియలో, ఫలకంపై పారదర్శకంగా లేదా కాంతిభేద్యంగా ఉండే సూచీ భూమికను సంబరపటానికి అవలంబించే పనితీరు. ఇటువంటి ధూపనం జరపటంవల్లనే ఆక్కడి ఉపరితలం, సూదితో ఛేదించటానికి అనువుగా ఉండగలదు. కొన్ని మైనపు వత్తులను ఒకదానితో వేరొక దాన్ని పెనవేసి, పైకొన ముట్టిస్తే లభించే దీపాగ్ని నుంచి వచ్చే పొగ దాగా తగిలేట్లు ఫలకాన్ని బోరగిల ఉంచి, ఈ ధూపనమును సాగిస్తారు ఈ వనివల్ల భూమికపై దట్టపు మసిపూత ఏర్పడుతుంది, అటువంటి భూమికపై సూదితో రేఖలను గీసినప్పుడు, రేఖలు చక్కగా కనపడతాయి కొన్ని సూచీభూమికలు, సిద్ధరీతిలో నలుపురంగుతోనే, బజారున కొనటానికి లభిస్తాయి

**smooch** : విలిప్తం

మెత్తని పెన్సిలు, పిష్టకము, శిలాలేఖన ఖటిక వంటి మృదు మాధ్యమాన్ని వాడి ఒక ఆలేఖనంపై రుద్దటం, పూయటం, సాగించగా కనపడే తావు. వేళ్ళతో, లేదా చేయి అంతటితో ఉపయోగించి సాగించే ఈ విలేపనం, అలవోకగా, స్వచ్ఛందంగా చేయాల్సిన వర్తనం.

**smooth** : నున్నని; స్నిగ్ధ.

**snakewood** : సర్పదారువు.

ఎరుపువాక గోధుమచన్నె కలిగిన ఒక విధపు కరినదారువు; దీనిపై పాముశరీరం మీద వున్నట్లు, నల్లటి మచ్చలు కనవత తాయి.

**snap** : సంసక్తి.

అచ్చు సిరాలో కనవదే గుణవిశేషం; జిగటలాగా అధిసక్తతను ఇందువల్ల ఆ సిరా ప్రవర్శిస్తుంది.

**snow-white** : హిమధవళం

**soak** : స్తంభించు

మూర్తప ప్రక్రియలలో ద్యుతికారకపు కాల్పుల పరసలను ఒకే ఒక నిశ్చిత తావక్ర మండ్ల నిలిపిఉంచటానికి-పారిభాషిక రీతిలో-ఉపయోగించే పదం.

**soapstone** : స్నేహశిల, నబ్బురాయి.

అగ్నిశిలా జన్యమైన ఒక శిలావిశేషం; దీనిలో మెగ్నీషియం ఎక్కువగా ఉంటుంది. నున్నగా, తాకితే సబ్బును తాకినట్లు ఉండటం వల్ల దీనిని స్నేహశిల అంటున్నారు. మలచ టానికి ఇది చాలా అనువుగా ఉంటుంది.

**Socialist Realism** : సామ్యవాద వాస్తవికతాశైలి.

సోవియెట్ యూనియన్‌లో, సాధికార పరిగణనను ఆర్జించిన కళాశైలి, విప్లవా నంతరం కళాశైలిని నియమనంచేసే అధికా రాన్ని సోవియట్ ప్రభుత్వం చేపట్టినా, 1922 లో దాన్ని త్యజించింది. కాని మళ్ళీ 1932లో ఆ ప్రభుత్వము ఈ అధికారాన్ని తిరిగి చేపట్టటంతో, ఈ సామ్యవాద వాస్త వికతా శైలికి ప్రథమ గణ్యత కలిగింది, అంతవరకు రషియా దేశంలో కళారంగంలో సాగిన ప్రాయోగిక పద్ధతికీ, వివిక్త వాద భావనకూ, అంతటితో ముగింపు సంభవిం చింది. సోవియెట్ రాజ్యప్రతిపత్తిని, ప్రజా నీకాన్ని మహిమాన్వితములుగా ప్రవ ర్శించడం కళ యొక్క ధ్యేయమంటం ఈ శైలి సారాంశం. తక్కిన కళలవలెనే చిత్రలేఖన, శిల్పాలుకూడా ఈ శైలిని వర వడిగా గ్రహించి అప్పటినుంచి ముందుకు సాగాయి నేడుకూడా సోవియెట్ రాజ్యంలో ఈ శైలికే ప్రచారమూ ఆదరణా విరివిగా కనవడతాయి, అయినా కళారంగంలో ప్రాయోగిక రీతులపట్లను వివిక్త వాదంపట్లా ఆ ప్రభుత్వము ఇదివరలో ప్రదర్శించినంతగా తీవ్రవైరుధ్యం ఈ కాలంలో కొంతవరకు సడలించింది.

**soft-edged** : లేతయంచుల.

**soft-ground etching** : *మృదుభూమికా సూచీక్రియ.*

ఒక విధపు సూచీ చిత్రణ విధానం. శిలాలేఖనమున లేదా ఖటికారీతి ముద్రాంకమున కనపడేవిధంగా పలుకువాటపు రేఖలనూ లేదా ఖటికాహతులనూ గుర్తుకుతెచ్చే పలుకువాటపు రీతినీ రేఖామృదులతనూ వ్యక్తంచేసే ముద్రాంకములను రూపొందించటానికి ఈ విధానం పనికి వస్తుంది. ఫలకంలో, ఇందుకు ఒక ప్రత్యేక రీతిలో సూచీ భూమికను తయారు చేస్తారు. సాధారణంగా సూచీ చిత్రణలలో ఏర్పరచే భూమికకన్నా ఇది వేరైనది. ఇందులోని సాధక ద్రవ్యాలలో కొవ్వునూనె సగపాలుకు తక్కువ గాకుండా ఉండటంవల్ల భూమిక జిగురుబారి, సక్తత కలిగి ఉంటుంది. ఇటువంటి భూమికపై ఒక కాగితాన్ని పరచి పైన ఒక పెన్సిలుతో రేఖలను గీసేటప్పుడు, ఈ గీతలకింది భూమికాభాగం కాగితానికి గట్టిగా అంటుకొని, కాగితాన్ని పైకి ఎత్తగానే, దానితోపాటుగ లేచివస్తుంది. అంతట ఫలకాన్ని ఒక క్షయంకరిలో-సాధారణంగా డచ్చి క్షయంకరిలో-పెట్టగా, భూమిక లేచిపోయిన భాగంలో దంశనం మెల్లగా జరుగుతుంది. ఈ ప్రక్రియలో వాడే కాగితాల, పెన్సిళ్ళ వైవిధ్యాన్ని అనుసరించి పలు రీతులు, అనువృత్తులు రూపొందుతాయి కాగితాలకు బదులుగా జపుకీసరకులనుకూడా వాడి ప్రత్యేకరీతుల కాంతపములుగల ముద్రాంకములను సాధించవచ్చు.

ఈ ప్రక్రియకే ఫ్రెంచి భాషలో వెర్నిస్ మౌ(*vernis mow*) అనే వ్యవహారం ఉంది. 18వ శతాబ్ది మధ్యకాలంలో దీన్ని కనుక్కొన్నారు. అప్పట్లో శిలాలేఖనానికి ఉన్న ఆదరణవల్ల ఇది ముందుకు రాలేకపోయింది. కాని కొద్ది సంవత్సరాల కిందట దీన్ని పునరుద్ధరించటం జరిగింది. ఈ మృదుభూమికా సూచీక్రియను, త్వరితంగా ఫలితాన్నిచ్చే ఒక విధానంగా, దేనితోకలవకుండా కొందరువాడతారు. కొందరు తక్కిన అంతర్లేఖన పద్ధతులతో, ముఖ్యంగా జలచ్ఛవితో, కలిపి వాడతారు.

**soft paste; soft-paste porcelain** : *మృదుపిష్టం; మృదుపిష్ట పింగాణీ.*

అచ్చపు పింగాణీగా లెక్కకు రాక, వాటికన్నా మెత్తగా ఉండటమేకాక తక్కువ తాపక్రమంలో కాల్చటానికి వీలయ్యే ఒక విధపు పింగాణి.

**soft soap** : *మృదువర్తిక.*

ద్రవరూపంలో ఉండే సబ్బు. సాధారణంగా ఆకుపచ్చ సబ్బునుంచి దీన్ని తయారు చేస్తారు. శిల్పంలో విశ్లేషక మిశ్రమంగా దీన్ని వాడతారు. అందునా ముఖ్యంగా సుధాపిష్టపు నిషిక్తాన్ని, సుధాపిష్టపు సంయానాలనుంచి వేరుపరచి ఉంచటానికి ఇది పనికివస్తుంది

**soft - solder** : *మృదుటంకం.*

సులభంగా ద్రవీభవనం చెందే ఒక విధమైన టంకం.

**softwood** : *మృదుదారువు.*

మృ ర్జవృక్షపు కొయ్యలాగా గట్టిగా ఉండ కుండా మెత్తగా ఉండే ఒకవిధమైన కొయ్య. దేవదారువువంటి వృక్షాలనుంచి ఇది లభిస్తుంది

**soiled** : *మచ్చపడిన.*

**solder** : *టంకం.*

రెండు లోహాల ఉపరితలాలను అతకటా నికి ఉపయోగించే మిశ్రలోహం.

**solferino** : *ముదురుఎరుపు.*

ఎరుపువాక కలిగిన ఒక విధపు రాజనీల వర్ణద్రవ్యం; 19వ శతాబ్దిలో వాడుకలో ఉన్న ఒక చలవర్ణ రంజకం.

**solid** : *ఘనరూపం.*

**lidity** : *సంహతత్వం; ఘనరూపత.*

**Solnhofen stone** : *సల్నోఫెన్ శిల.*

నీల-ధూసరపు సున్నపురాయి; ఇది జర్మ నీలోని సల్నోఫెన్‌వద్ద లభిస్తుంది.

**Solomon's seal** : *సోలోమన్ రాజముద్ర.*

సమభుజ త్రిభుజాలు, ఒకదానితో ఇంకొ కటి పెనగొనగా, ఏర్పడే ఆరుకోణాలుగల నక్షత్రాకృతి. ఇది ఒక మహత్తమ ప్రభా వంగల సంకేతంగా, ప్రాచీనకాలంనుంచీ శతా బ్దాల తరబడి తాయెత్తుగా, మంత్రకవచంగా ప్రశస్తిని ఎన్నో దేశాలలో ఆర్జించింది. తరచుగా దీనిలోని ఒక త్రిభుజాన్ని నల్లటి రేఖలలోను, రెండవదానిని తెలరంగు రేఖల లోను చూపటం పరిపాటి. దీన్ని గీయ టంలో ఒక వింత సౌలభ్యం ఉంది. మొదలు



సోలమన్ రాజముద్ర

పెట్టింది మొదలు ఆపకుండా ఒకే ఎత్తున గీతను సాగిస్తూ దీన్ని రూపొందించవచ్చును. దానినిబట్టి దీనికి ఈవిధంగా లోకాతీత మహ త్త్వం ఆపాదితమయిందనిచాలా మంది భావన. (పంచకోణిక అనబడేదికూడా ఇటువంటిదే) యూదులు తమమతానికి ఒక ప్రత్యేక లాంఛ నంగా దీన్ని పరిగణిస్తారు దాన్ని వారు దావీదు నక్షత్రం అని అంటారు. భారత దేశంలో దాదాపుగా ఈవిధంగానే ఉండేదానికి శ్రీచక్రం పేరిట తంత్రశాస్త్రంలో అత్యంత ప్రశస్తి ఉంది.

**solubility** : *ద్రావణీయత.*

**soluble** : *ద్రావ్యం.*

చిత్రగా ఉండే తూలికకు రంగును నింపి, దాన్ని ఒక దువ్వెన వంద్లపై లాగి, కింద పడే బిందువులు. ధారలు మొదలైనవాటిని ఒక ఉపరితలంపై పడనిస్తే, అటువంటి దాన్ని సాధించవచ్చు. లేదా ఒక వాయుతూలికతో గాని, తుషారికతోగాని శీకరించికూడా చేయవచ్చు; అయితే వాటినుంచి ఎగసే జల్లు, చిన్న బిందువులుగా ఉండక, కొంతలావుపాటి బిందువులుగా పడేట్లు జాగ్రత్త వహించాలి; అట్టి బిందువులవలన ఏర్పడే పూత ఏకరూపంగా ఉంటుంది.

**spattering** : అవసేచన.

**spatula** : ప్రలేపకం

చిత్రలేఖనంలో వాడే ఒక పరికరం. చక్కగా చరచబడిన ఉక్కుతో చేయబడి పెద్దదిగా ఉండే, నమ్యమైన పాదర ఇది. కలపటానికి, నూరటానికి, కలియబెట్టటానికి, ఇంకా చిత్రాగారంలో సాగే పెద్దపనులకు దాన్ని వాడతారు. దీని వాదర దాదాపు 6 అంగుళాల నిడివితో ఉంటుంది.

**spectrophotometer** : వర్ణమాలామాపని

ఉపరితలపు రంగును, దాని తరంగదైర్ఘ్యం వగైరాల నిర్ణయంద్వారా, లెక్కించటానికి అనువైన ప్రయోగశాలా పరికరం.

**spectrum** : వర్ణమాల

సూర్యకాంతిని పట్టకంద్వారా ప్రసరింపజేసినప్పుడు, ఒక పట్టికగా ఒకదానికి పక్కన ఇంకొకటి అమరి కనపడే ఇంద్రధనుర్వర్ణాలు. వికీర్ణక శక్తియొక్క తరంగ దైర్ఘ్యాలను దృశ్యం చేస్తే, అవట్టికలో ఎడమ కడ అంచున నీలలోహితమూ, కుడి కడఅంచున ఎరుపు కనపడతాయి. వర్ణమాలా పటంలో నీలలోహితానికి అవతలనుంచి దృశ్యమౌ కాని దైర్ఘ్యమానాలను అతినీలలోహితములు ఎరుపుకు ఎగువ ఉండేవానిని అధిశోణములు వ్యవహరిస్తారు.

**spermaceti** : తిమిసిక్థం.

స్వచ్ఛమై, తెల్లగా ఉండి, కాంతిసర ధర్మంగల ఒక విధపు మైనం. తిమింగి లలో ఒక జాతికి చెందిన వాటి కపాలా నుంచి ఇది లభిస్తుంది. పూర్వం ఇది ఎక్కు వాడుకలో ఉండేది. కాని, దానికన్నా మే రకపుది ఇప్పుడు లభ్యం కావడంవల్ల దా వాడుక తగ్గిపోయింది.

**sphinx** : సింహిక.

అజ్ఞేయమైన అభిముఖ దృష్టితో ఉం ఒక మానవ ముఖాన్నో, లేదా ఇం ముఖాన్నో, కలిగి పడుకొనిఉండే సింహ రూపంలో మలచిన ఒక శిల్పం. ప్రా ఈజిప్టులోని కళలో జనరంజకతను ఆర్జిం ఒక ప్రతీకణ మిది. మానవ ముఖాన్ని క ఉండ్లే సింహికకు 'నరసింహిక' (*And sphinx*) అనే వ్యవహారంకూడా ఉంది. నరసింహికా రూపాలే ప్రాచీన ఈజిప్టు

తిరచుగా కనపడేవి. తరవాత మేషసింహిక, గరుడ సింహిక క్రమంగా లెక్కకు వస్తాయి. ఇప్పటికిన్నీ ఈజిప్టులో మిగిలిఉన్న సింహికా విగ్రహాలలో గిజేనగరపు ప్రాంతంలో, రాజసమాధుల(పిరమిడుల)వద్ద ఉన్నది గణనీయం. గ్రీకుల పౌరాణిక గాథలలోకూడా దాదాపుగా ఇటువంటిదే ఒకటి పేర్కొనబడుతున్నది. అత్యంత భీకరాకృతికల ఆ మూర్తికి రెక్కలుండేవి. సింహపు శరీరము, నారీశీర్షము, స్త్రీ సహజములైన స్తనములును దానికి ఉండేవి. చరిత్రలో దీనిని గురించిన ప్రస్తావన ఉంది.

**spider wheel** : *వెలి చక్రం*

సూచీముద్రణని పనిచేయించటానికై దానితో జతపరచి ఉంచే చక్రాలలో వెలుపలఉండే పెద్ద చక్రం

**spike oil or oil of spike lavender** : *లావేంద్రతైలం*

బాష్పశీలమైన ఒకవిధపు ద్రావణకరి; లావేంద్రమను వనస్పతినుంచి అభిషవించి దానిని రూపొందించవజేస్తున్నారు వార్నిషుతో కలిపి విరళీకరిగా ఇది వాడబడుతున్నది.

**spinning** : *భ్రమణం*

కొయ్య నమూనాపై లోహపు రేకును తిప్పి, దానికి కావలసిన రూపాన్ని ఒక లేతిమీద, సాధించడం. 1825 మొదలుగా వెండి మొదలైన వాటితో పాత్రం నిర్మాణం చాలావరకు ఈతీరుగానే సాగుతున్నది.

**spiral** : *సర్పిలం*

**spirit** : *సీధువు; వారుణి*

మద్యసారానికి ఒక పర్యాయనామం. ఆంగ్లదేశంలో మరికొన్ని అభిషవకోత్పన్నములకున్నూ కొన్ని పానీయాలకున్నూ, పెట్రోలియం నుంచి తయారయ్యే ఒక విధపు ద్రావకానికిన్నీ-ఈ పేరునే వాడతారు

**spirit fresco** : *వారుణీ భిత్తికం; వారుణీసద్యస్కం*

వర్ణద్రవ్యాలను వార్నిషుతో బాగా నూరినప్పుడు లభించే రంగుల నుపయోగించి రచించిన కుడ్యచిత్రం. 1880లో ఆంగ్లదేశంలో టి గేంబియర్-పేరీ అనే వ్యక్తివల్ల ఈ ప్రక్రియ రూపొందటంవల్ల దీన్ని గేంబియర్ పేరీ వారుణీ కుడ్యకం అనేవాళ్ళుకూడా ఉన్నారు. భిత్తి చిత్రానికి తీసిపోని రీతిలో కనపడుతూ, బ్రిటిష్ దేశపు తీవ్ర శీతోష్ణ పరిస్థితులకు తట్టుకొగలిగే చిత్రాలను రూపొందించటానికై ఈ సరళ సాంకేతికపద్ధతి పరికల్పితమైంది. అయితే ఈ ప్రక్రియ తగిన ఫలితాల నివ్వలేదనటం అచిరకాలంలోనే స్పష్టమై, ఆ కళాకారులు దాన్ని త్యజించారు.

**spirit of turpentine** : *కర్పూర సీధువు*

**spirit varnish** : *సీధువార్నిషు*

సరళ ద్రావ్య వార్నిషులలో దేనినైనా వర్తించే పదవిశేషమిది. మద్యసారం చేరి

ఉన్న వాటికే తొలుత ఈ పేరు వాడేవారు; అయితే కాలక్రమేణా, పారిశ్రామిక రంగంలో వాడబడే అటువంటి వార్నిషులకు - మద్యసారం అందులో ఉన్నా లేకపోయినా-ఈ పేరే వాడటం పరిపాటి అయింది.

**spit : త్యక్తం**

మాత్రపము తయారీలో ఆ సామగ్రిని బట్టీలో కాల్చేటప్పుడు బట్టీగోడలనుంచి రాలిన ఇటుక ముక్క, అందువల్ల మాత్రపసామగ్రిపై మచ్చ ఏర్పడుతుంది.

**spit - out : కాల్పుపోటు**

మాత్రప సామగ్రిని ఆవంలో కాల్చేటప్పుడు, ఆవంలోకి బుడగలుగా గాలి చొరబడటంవల్ల, సామగ్రిపై ఏర్పడే స్ఫోటం. ఇది ఒక దోషం (చూ. *blister glaze*)

**spitsticks : పొళికలు**

సంరేఖికలలో చాలా చిన్న పరిమాణపువి, దారుసంరేఖనంలో సన్నని రేఖాంకనూ, నాజూకు పనితనానికీ వీటిని వాడతారు.

**spline : ఆకుంచిక.**

యాంత్రిక ఆలేఖనంలో, వక్రరేఖలను గీయటానికి ఉపకరించే ఒక సాధనం పారదర్శకమై, నమనీయమైన కర్పూరపు సన్నబద్ద ఇది. దీన్ని కావలసిన వక్రరూపానికి వంచేందుకు వీలవుతుంది. అయితే నమనీయవక్రరేఖినిలాగా అమర్చబడిన రీతిలో అదే విధంగా దానంతట అది నిలవదు. అందుకై ప్రత్యేకంగా తయారుచేయబడిన సీసపు బరు



ఆకుంచిక

పులను ఆకుంచికలోని గాడిలోనికి నచ్చి పేరాపడీసి, దాన్ని, అమర్చబడిన స్థానంలో ఉండేట్లు చేస్తారు బజారులో ఈ ఆకుంచికలు 10 అడుగుల పొడవు ఉండే వాటివరకు ఎన్నో పొడవులలో లభిస్తాయి. పొడవుపాటి వక్రరేఖలను గీయాల్సిన వచ్చినప్పుడు నమనీయ వక్రరేఖినికి బదులుగా దీన్ని వాడతారు.

**spolvero : అనువ్యంగ్యిక**

ఒక వ్యంగ్య చిత్రపు మూలప్రతినుంచి అనులిఖితం చేయబడిన ఉపసర్జితం ఆపతన ప్రక్రియలో, వేధన (*pricking*) కై ఉపయోగించేది ఇదే. ఇందువల్ల మూలప్రతి ఏ విధంగానూ దెబ్బతినక నిలిచి ఉండగలదు, వ్యంగ్య చిత్రంనుంచి లేదా ఉపక్ర రేఖిక నుంచి వెలుపరింపబడే ఆపతనికవల్ల, చుక్కల చుక్కల రేఖలతోగోడపైగానీ, కాటికపైగానీ, ఏర్పరచే బాహ్యరేఖను కూడా అనువ్యంగ్యిక

అనే అంటారు. అవతలనిక ఉండే సంచికి, కొన్ని సందర్భాలలో అపతలనికకూ కూడా అనువ్యంగ్యిక అనేపేరు అక్కడక్కడ వాడుతున్నారు.

**spongineas** : *విరళత*

**spontaneity** : *సద్యస్ఫూరకత*

**spray (v)** : *శీకరించు*

**spray (n)** : జల్లు.

**sprayer** : *తుషారిక; శీకరిక.*

ఒక ఉపరితలంపై ఒక ద్రవపదార్థాన్ని జల్లుగా లేదా తుప్పరగా కొట్టి, ఏకరూపమైన సన్నని పైపూతను కలిగించటానికి ఉపకరించే ఒక పరికరం. తైలచిత్రాలకు నిరూఢకినీ, గ్రసనశీలపు ఉపరితలమునకు సైజునూ పట్టించటానికి తుషారికను వాడతారు. తుషారికలన్నిటిలో అతిసరళ నిర్మాణరీతి కలది ముఖధమని (*mouth blower*). దీనిలో సన్నని నాళిక, లావుపాటి నాళికకు సంధించబడి ఉంటుంది. ఈ మొత్తాన్ని మడిచి కావలసిన ప్రతి చోటికి తీసుకొని పోవటానికి సౌకర్యం ఉంటుంది. సన్ననాళిక విడికొనను ద్రవంలో ఉంచి, లావుపాటి నాళికయొక్క విడికొనను నోటికదనుంచుకొని, ఏకప్రమాణపు శ్వాసగతితో ఊదితే, ఆ గాలిదెబ్బకు సన్నవాళిక చివరి నీరుపైకి లేచి, జల్లుగ, దగ్గరఉన్న చిత్రోపరితలంపై పడును. నోటి నుండి వచ్చు గాలిలో చెమ్మదనము ఉండుట సహజం; కావున చిత్రానికి ఆ చెమ్మదనం ప్రాతే ఇబ్బంది ఉన్నది; అందువల్ల అటుల చెమ్మవలన ఏ విధంగానూ దెబ్బతినని వస్తువుపైనే ఈ ముఖధమనిని వాడుతారు. ఆధునిక కాలంలో తుషారిక కల్పకంలో తయారై బజారులో లభిస్తున్నది.



తుషారిక : ఎడమవైపున ఉన్నది: చల్లవంపిన ద్రవపు నాడియును ఒత్తిడిలో పనిచేయు ప్రేరకయు కలిగిన తుషారికం, కుడివైపున; ఒకసాధరణ ముఖధమని.

**spray gun** : *శీకరిణి.*

చదునుగా ఉండే ఒక తలంపై, వృథుల ప్రమాణంలో రచితమయ్యే చిత్రంపై జల్లుగా ద్రవపదార్థాన్ని చల్లి, ఏకరూపపు పైపూతను ఏర్పరచటానికి అనువై ఉండే దండివని తనవు పరికరం. పారిశ్రామిక రంగానికి చెందిన ఈ పరికరాన్ని, కళాకారులు చిత్రణకై గోడతను సిద్ధం చేసేటప్పుడున్నూ, కుడ్య చిత్రాలకు వార్నీషను పట్టించవలసినప్పుడున్నూ వాడతాడు. అయితే వార్నీషు పనికి చెమ్మలోను కలిగిన విద్యుత్ శీకరిణి ఎక్కువగా ఉపకరిస్తుంది.

**sprezzatura** : *అనవధానత.*

'సుచింతితమైన శ్రద్ధాహీనత' అని దీని విపులార్థం. ఎటువంటి రచనలో కళాకారుడు శ్రద్ధాపూర్వకమైన కృషిని సాగించినట్లు స్పష్టంకాకపోతుందో, అటువంటి చిత్రణపు లక్షణాలను వరించేటప్పుడు ఈపదాన్ని వాడతారు.

**spring** : *ఉత్ప్రేతకం.*

(చూ : **silk screen.**)

**sprue[1]** : *కాశముఖం.*

పోతపని జరిగేటప్పుడు, సంయానపు పై పొరనుంచి లోపలికి, లోహాదుల ద్రవం పోవటానికి అనువుగా ఏర్పరచి ఉంచే ప్రవేశ ద్వార రంధ్రం. ఈ కాశముఖాన్ని సంయానంతో సంధించే సన్నని కుల్యకలు ఉంటాయి. ఈ కుల్యకలను అరరము (*gate*) లు అంటారు.

**sprue[2]** : *అపవ్యయం.*

పోతపనిలో కాశముఖముల ద్వారా, కరిగిన పోతద్రవ్యాన్ని పోసినప్పుడు సంయానంలోకి పోయిందిగాక అరరములందు మిగిలే తుక్కు పదార్థం.

**sprue[3]** : *మూలవాహిక.*

(చూ : **gate**)

**squaring or squaring off :**

*చతురస్రీకరణ.*

ఒక తలంపై ఉన్న ఆలేఖనమును, ఇంకొక నియతికి అనుగుణంగా చిత్రింపవలసిన వేరొక తలానికి - ముఖ్యంగా మొదటి దానికన్నా పెద్దదైన తలానికి - పరివర్తన చేసే ఒక విధానం. అందులో రెండోది కాగితం అయినా కావచ్చు; గోడ అయినా కావచ్చు. చతురస్రీకరణకే జాలీకరణ (*graticulation*) అనేది పర్యాయనామం. ఈ విధానంలో మొదటి ఆలేఖనమును చక్కని చతురస్రములుగా విభజించడం జరుగుతుంది. అప్పుడు ఆ చతురస్రములను లెక్కపెట్టి, అన్ని చతురస్రములనే రెండో దానిలో గీస్తారు. మొదటి దానిలో ఒక్కొక్క చతురస్రములో కనపడే రేఖలను, ఆ చదరానికి ప్రతిగా రెండవ దానిలో ఉన్న చదరంలో తగినరీతిలో శ్రద్ధగా గీస్తారు. ఆలేఖనమును గోడయొక్క తలమునకు పరివర్తన చేయవలసి ఉన్నప్పుడు, ఆ తలంపై ఇటువంటి చదరములను మసిదారపు సాయంతో ఏర్పరుస్తారు. బాగా బొగ్గుమసిని లేదా అటువంటిదే అయిన ఇంకొక వర్ణద్రవ్యపు పొడిని పట్టించిన సన్నత్రాటికి, లేదా దారమును, గుర్తించిన రెండు బిందువులమధ్య గోడపై బిర్రుగా బిగదీసిఉంచి, మధ్యలో దారాన్ని ఎత్తి తటాలున వదలినప్పుడు, చతురస్రములకై ఆ గోడతలంపైన రేఖలను పొందుపరచవచ్చు. ప్రాచీన ఈజిప్టులోనే ఇటువంటి పరివర్తనములకై కళాకారులు ఈ విధానాన్ని వాడినట్లు నిదర్శనాలు ఉన్నాయి.

**squeegee** : *సంపీడకం.*

కౌశేయ యవనికలోనూ కౌశేయ లేఖనంలోనూ, పూతరంగును యవనికద్వారా దిగువ ఉండే ముద్రాతలంపైకి నెట్టటానికి ఉపకరించే పరికరం. సంయోజితమైన రబ్బరుతో చేయబడే ఈ పరికరం, చివరన దళసరిబద్దగా

రూపుదేలి ఉంటుంది. ఈ పరికరానికి ఒక కొయ్యపిడికూడా అమరి ఉంటుంది. చివర ఉన్న బద్దయొక్క నాలుగు మూలలూ సమకోణాలుగా అంచులు తీరి ఉంటాయి. అందుచేత ఈ అంచువల్ల నిర్దిష్టములు, స్పష్టములు అయిన ముద్రణలను పొందటానికి వీలు ఏర్పడుతుంది. ఈ అంచులు మొద్దుబారినప్పుడు మెరుగుకాగితంవంటివాటి సాయంతో పదును తెస్తారు.

నిర్మించాలనుకున్న ముద్రాంకం లేదా రేఖాంకం యొక్క ప్రమాణాన్ని అనుసరించి సంపీడకపు పరిమాణం మారుతుంటుంది. ముద్రించబడనున్న రేఖాంకం యొక్క వెడల్పుకన్నా కనీసం ఒక అంగుళమైనా ఎక్కువ పొడవు సంపీడకానికి ఉండాలి. సాధారణంగా కౌశేయలేఖకుడు వాడే సంపీడకానికి వెనకవైపున ఒక దళసరిగా ఉండే పొట్టి పిడి ఒకటి అమరిఉంటుంది. అయితే కొందరు, అటువంటి పిడిలేకుండా, పరికరపు వెనుకతట్టు వంపుతిరి, చేపట్టుకు అనువుగా ఉండటాన్ని అపేక్షిస్తారు. పొడుగుపాటి సంపీడకమును వాడవలసి వచ్చినప్పుడు దాన్ని రెండుచేతులతోనూ గట్టిగా పట్టుకొని వాడతారు. గుడ్డల అద్దకం, గోడకాగితాల ముద్రణ వంటి వాటికి ఉపకరించే సంపీడకములు విపరీతపు పొడుగులు కలిగి ఉంటాయి. (అందు కొన్ని 8 అ. పొడవు కలవికూడా ఉన్నాయి.) అటువంటి వాటిని ఇద్దరు మనుష్యులు పట్టుకొని పనిచేయిస్తారు.

కౌశేయ లేఖనంతో ముద్రణ సాధించటానికి, సంపీడకపు పిడిని ఏటవాలుగా పట్టుకొని యవనికపై ఒక వైపునుంచి వేరొక వైపుకు, ఒకేరీతి విసురుతో, గట్టిగా నెట్టటం జరుగుతుంది. అప్పుడు చివరఉన్న దళసరి బద్ద తనకు ముందున్న పూతరంగును ముందుకు తోస్తూపోగా, దాని దిగువఅంచు, పూతరంగును యవనికద్వారా దిగువకు తోస్తుంటుంది. ఒకసారి, ఒకవైపునుంచి నెట్టడం ముగియగానే, సంపీడకమును ఒక్కఊపున పైకెత్తి వేయాలి. ఈవిధంగా ఒక్కొక్క నెట్టుదలకు యవనిక దిగువన ఉన్న ముద్రాతలంపై ఒక్కొక్క ముద్రణ పడుతుంది. చాలా సంఖ్యలో రుజువులను పొందాలంటే ఈ నెట్టుదలలు, ఒకసారి కుడినుంచి ఎడమకూ, ఇంకొకసారి ఎడమనుంచి కుడికీ సాగాలి. ప్రతినెట్టుదలకు, దిగువ కాగితాన్ని మార్చడం జరుగుతుంది ఒక నెట్టుదల పూర్తికాగానే, సంపీడకపు పిడిని పట్టటంలో, కళాకారుడు చేతిని మార్చుకొంటాడు మంచి అనుభవం, అభ్యాసంవల్ల మాత్రమే ఈ పని నిర్వహణలో సౌలభ్యం అలవడుతుంది. ఇటువంటి పనిలో బాగా కుశలతను ఆర్జించిన కళాకారుడు తగినరీతిలో సంపీడకమును వాడి పూతరంగువ్యాప్తిని అదుపులో ఉంచుకోగలడు

**squeeze** : నిమ్నముద్రణం

మలచిన నతశిల్పంనుంచిగాని, ఉన్నతశిల్పంనుంచిగాని-దానిపై గట్టిగా ఒక కల్పక ద్రవ్యాన్ని, శిల్పంలోని అన్ని భాగాలపై

చక్కగా నొక్కి-తీసిన ఒక అనుముద్రణం ఇటువంటి సందర్భంలో తయారయ్యేది ఒక వ్యస్త ముద్రణగానే ఉంటుంది. దీనినుండి ప్రాప్తమయ్యే అనుకృతిని తిరవాత సాధించ వచ్చు.

**squeeze bottle** : *ఒత్తుసీసా; నిపీడనకూపిక*

**squinch** : *కర్ణకోదకం.*

వాస్తువిషయకమైన ఒక పారిభాషికపదం. ఒక చదరపు నిర్మాణానికి ఎగువన ఒక అష్ట కోణకి శిఖరాన్ని లేదా వృత్తాకారపు గుంబా జును నిర్మించాల్సి వచ్చినప్పుడు అందుకు ఆధారంగా నిర్మాణపు ఒక మూలన కర్ణ రేఖకు అడ్డుగా కట్టబడే కమాను (ఆర్చి).

**stability** : *ధృతి; స్థిరత.*

**stabilizer** : *స్థిరంకరి.*

రసాయన శాస్త్రసంబంధి కళాకారులు గ్రహించిన ఒక పదవిశేషం కళాకారులు తైలవర్ణాలలో వాడే సంకలయితను ఈ పదం సూచిస్తుంది. ఈస్థిరంకరిపల్ల తైలంలో వర్ణద్రవ్యం చక్కగా లగ్నమై, రంగునుంచి తైలం వేరుపడే అవకాశం సన్నగిల్లుతుంది.

**staccato touch** : *ఆకస్మిక సంస్పర్శ.*

**stacco** : *తావుమార్పు; స్థలాంతరీకరణ.*

ఒక గోడ సరియైన పరిస్థితిలో లేకుండా-సీటి ఇంకుదల, చవుడువట్టడం మొదలగువాటి వల్ల-దెబ్బతిన్నప్పుడు ఆ గోడపై నెలకొనిన ఒక భిత్తిచిత్రమును మరొక గోడయొక్క ఉపరితలానికి మార్చే విధానం. ఈ ప్రక్రియలో గోడపైని గచ్చుపూతలోని వర్ణోపాధితో సహా వర్ణాన్ని ఇవతలికి తీసివేయడం జరుగుతుంది. ఇందుకు మొదట్లో చిత్రంపై గుడ్డను పొరలు పొరలుగా పసిబంక (*Animal gum*) తో అంటిస్తారు. అంతట ఆ పొరలు గట్టిగా ఆరిన తరవాత, వాటినిలాగి వేస్తారు. ఆపివరకే మొదటి గోడ దెబ్బ తిన్నందువల్ల కొంతవరకు విడివడిన వర్ణోపాధి రంగతో సహా గుడ్డ పొరలకు అంటుకొని, వాటితోకూడా వెలుపలికి వచ్చివేస్తుంది. అట్లా వర్ణోపాధి బైటికిరాగా దాని వెనక వైపునగూడా ఎక్కువగా గుడ్డపొరలను అతికించి చిత్రంపై పొరలను మెల్లగా తొలగిస్తారు అప్పుడిక మిగిలినదాన్ని ఇంకొక తలంపై అతికించటం జరుగుతుంది.

**staffage** . *జంగమారోపణ.*

ఒక ప్రకృతిదృశ్యమునకు, నగరదృశ్యమునకు, వాస్తుసంబంధ లేఖనమునకు లేదా అటువంటిదే అయిన ఇంకొక దృశ్యమునకు ప్రతికల్పనం చేయటమే ధ్యేయంగా రూపితమైన ఒక చిత్రంలో మానవ, జంతురూపాలను అక్కడక్కడ చేర్చటం. ఇటువంటి రూపాలు-ఆచిత్రానికి సంబంధించినంతవరకు-

అచ్చంగా ఆనుషంగికములే అవుతాయి. సంరచనలో రంజకతను పెంచే తలంపుతో ఈ ఈ రూపాలను చేర్చటం జరుగుతుంది. ప్రకృతి దృశ్య రచయితలలో అత్యధిక సంఖ్యాకులు, తమ చిత్రాలలో ఇటువంటి రూపాలను తామే స్వయంగా చేర్చారు. కాని కొందరు – ముఖ్యంగా 17వ శతాబ్ది డచ్చి చిత్రకారులు – తాము చిత్రించిన ప్రకృతి దృశ్యాలలో ఇటువంటి రూపాలను చేర్చే పనిని ఇతర చిత్రకారులకు అప్పగించేవారు.

**stage (graphics)** : *ఘట్టం (గ్రాఫికులు).*

**stain¹** : *మాలిన్యం.*

**stain²** : *విలేపనము.*

1. ఒక కొయ్యపై దాని వలుకులోని కాంతనము మరుగుపడకుండా స్పష్టంగా కనపడే పద్ధతిలో రంగువేయటం, ఇట్లా వేసే రంగు రాగద్రవ్యం కావచ్చు; లేదా పారదర్శకమైన వర్ణద్రవ్యం కావచ్చు. ఈ పనికోసం వాడే రాగద్రావణానికి లేదా వర్ణద్రవ్యపు నీరుకు, లేదా పిష్టకానికికూడా విలేపనమనే వ్యవహారం ఉంది. కొయ్యపై రంగువేసే విలేపనాన్ని (దారు విలేపనాన్ని) నూనె, మద్యసారం, లేదా నీటిని ఆధారంగా తీసుకొని తయారు చేయవచ్చు. తైలవిలేపనం, కొయ్యయొక్క ఉపరితలపు నున్నదనానికి ఏటువంటి ముప్పునూ కలిగించదు. అయితే నీటితో తయారైనది మాత్రం కొయ్యపై వలుకును లేవదీసే ప్రమాదం ఉంది. పొటాషియం పర్మాంగనేట్ లేదా బైక్రోమేట్ ఏదో ఒకటైన రాసాయనికాల వేడిద్రావణాలలో కొయ్యను ముంచటంవల్లకూడా కొయ్యకు విలేపనం జరపవచ్చును.

2. కెమ్మరిమట్టి, సరకం, ద్యుతికంవంటి వాటికి కలిపే మాత్రవర్ణానికికూడా 'విలేపనం' అనే పేరుంది.

**stained glass** : *విలిప్త కాచం.*

కిటికీ తలుపులకు వాడే రంగు అద్దం. ఈ మాధ్యమాన్ని వినియోగించి, రచనలు రూపొందించే కళాకారులకూడా ఉవదం వర్తిస్తుంది. విలిప్తకాచపు కిటికీల రేఖాకృతులను తయారుచేయటంలో రెండుపద్ధతులు వాడుకలో ఉన్నాయి. 1. వేర్వేరు రంగులు వేసిన గాజు పలకలను పక్కపక్కన అమర్చటం, 2. స్వచ్ఛంగానో, అదివరకే ఒక రంగుతోనో ఉండే అద్దపు పలకపై రంగులతో చిత్రించడం 9 వ శతాబ్దంలో ధూసరికను కనుక్కొన్నప్పటినుంచి, పై రెండుపద్ధతులూ కొడుతోపుగా వినియుక్తము లవుతున్నాయి. రజతవిలేపం (*silver stain*), జింక్ కటిన్‌వంటి వర్ణపదార్థాలను కనుక్కొన్న తరవాత 16వ శతాబ్దిలో, కాచస్ఫోరక ఆఖాసికను (*enamel*) లలో వరిష్ఠమైన ఒక వర్ణఫలకమునే సమరించగలిగిన తరవాతను, పాత పద్ధతి మరుగునపడి ఒక కొత్తపద్ధతి వ్యాప్తిలోకి వచ్చింది. ఈ పద్ధతివల్ల విలిప్త కాచపు తయారీ, చిత్రలేఖన కళలో ఒక శాఖగా పరిణమించింది.

12వ శతాబ్దిలో వర్ణ ప్రకాచపు కిటికీలను తయారుచేసిన విధానాన్ని తెలుసుకోవటానికి ఆ శతాబ్దివాడైన థియోఫిలస్ ప్రెస్‌బిటర్ అనే అతడు రచించిన 'షెడూలా డైవర్సా రమ్ ఆర్టియం' అనే గ్రంథం సాయపడుతున్నది. ఇనుము, రాగి, మాంగనీజు, కోబాల్టువంటి లోహాల భస్మాలను, కరగిన గాజుతో కలిపి వివిధవర్ణాల గాజుపలకలను తయారుచేసేవాడు. స్వచ్ఛమైన గాజుపలకపై దట్టపురంగుతో దాదాపు పారదర్శకాలుగా ఉండే చాలా సన్నని పలకలను, కాచబంధము (*flashing*) అనే ప్రక్రియ సాయంతో, విలీనం చేసేవారు. వానిపై నికృత్తన ప్రక్రియను ఉపయోగించి ద్యుతికారుడు (*glazier*) పైనున్న దట్టపురంగును చెక్కటం, లేదా గీకి వేయటం జరిపి, క్రింది స్వచ్ఛపు రంగును అక్కడక్కడ వెలికివచ్చేట్లు చేసినప్పుడు వర్ణ వైవిధ్యం అందులో కలిగిస్తాడు.

ఒక వ్రాతబల్లమీద తెల్ల సీమసున్నపు ముక్కతో ఆదిపరకే కొన్ని ఆకృతులను వ్రాసిఉంచి, ఆ ఆకృతులను అనుకరిస్తూ కాచ ఫలకంపై జాగ్రత్తగా వేడి ఇనుప సీలతో (తరవాత కాలంలో వజ్రపు కీలంతో) ఆకృతులను రచించటం మొదట్లో జరిగేది. ఆ తరవాత ఆ ఆకృతుల ముక్కలను తాత్కాలికపు చట్టంలో అమర్చి, ధూసరికతో చిత్రించి, మళ్ళీ కాల్చుకు గురిచేయటం జరుగుతుండేది. అంతకు అదివరకే అటూఇటూ గాడులుండేట్లు పోతపోసి ఉంచిన సీసపు బద్దలలో ఆ గాజుఫలకలను ఇమిడ్చి, కిటికీలను తయారుచేసేవారు.

రంగువేసిన గాజుపలకలు రోమనుల కాలంలోనే వాడుకలో ఉండినవి. ముస్లిముల కాలంలో సుధాపిష్ట మృత్తికను. వర్ణ కాచాన్ని కిటికీలకు వాడేవారు. 8వ శతాబ్దికే ప్రాచ్యదేశాలలో రజత విలేపం వాడుకలో ఉండినది. పునరుజ్జీవనయుగంలో దొనాతెల్లో, డీరరు అనే ప్రసిద్ధ చిత్రకారులూ, 20వ శతాబ్దంలో రౌనాల్ట్, మాటిస్సె అనే ప్రసిద్ధ చిత్రలేఖకులూ వర్ణకాచపు కిటికీలను రూపొందించారు

**stained glass paint ng** : *కాచఖండ చిత్రణ.*

(చూ : flashing).

**staining power or coloring power** : *వర్ణశక్తి.*

ఛవిపటిమకు పర్యాయనామం.

**stamp (n)** : *సమ్ముద్ర.*

**stamp (v)** : *సమ్ముద్రించు.*

**standard** : *ప్రమాణం.*

**stand oil** : *మేలినూనె; స్థిరతైలం.*

చాలా ఎక్కువ శీనతగల సాంద్రతసీ తైలం. తైలవర్ణ మాధ్యమాలలోనూ కలం దుగ్ధకములందునూ వార్నిషు లందునూ సాధన ద్రవ్యంగా ఇది ఉపయోగంలో ఉంది. నేటికాలంలో వాడకంలో ఉండే పాండురవర్ణపు మేలినూనె - అవిసెనూనెను

అల్యూమినియం కాగులలోగాని, లోపలగాజు తట్టు కలిగిన కాగులలోగాని 550° ఫా. ఉష్ణోగ్రతలో 15 గంటలకు తగ్గనికాలం-మరిగిస్తే తయారవుతున్నది. అట్లా మరిగించేటప్పుడు కొన్ని రాసాయనిక చర్యలఫలితంగా అది తేనె లాగా చిక్కపడుతుంది. అట్లా మరగించటంలో ఆక్సీకరణ జరగకుండా ఉండటానికి ఈ మరగింపును అంతా నిర్వాత స్థితిలోనో లేదా కర్బన్ డయాక్సైడు మాత్రమే ఉన్న వాతావరణంలోనో సాగించడం జరుగుతుంది. అన్నిరకాల అవిసెనూనెలలో, ఈ మేలినూనె మాత్రమే వివర్ణతకు లోనుగానిది; అంతేగాక దృఢమయి ఉండికూడా నమ్యత కలిగిన పటలమును, రూపొందించి నున్నగా సమమట్టానికి తేలే గుణం దీనిలో ఉంది మధ్యయుగాలనుంచికూడా అతి సాంద్రములైన తైలాలలో ఎన్నో రకాలు, వాడుకలో ఉన్నట్లు తెలియవస్తున్నా మేలి నూనె అనేది 19వ శతాబ్దంవరకూ వాడుకలో ఉండినట్లు కనపడదు. ఇటువంటి నూనెను ప్రవేశపెట్టింది డచ్చి చిత్రకారులని చాలామంది అభిప్రాయం.

**standard oil colour** *ప్రామాణిక తైలవర్ణం.*

**stanniferous glaze** : *త్రపుద్యుతి.*

త్రపుభస్మాన్ని వాడి మార్తవములలో సాధించే ఒక విధపు ద్యుతి.

**Stapart's ground** : *స్టాపర్ట్ భూమిక.*

జలచ్ఛవిలో వాడుకలో ఉన్న ఒక సూచీ భూమిక. దీన్ని తయారుచేయటానికై మొదట ఫలకపు ఉపరితలంలో తెల్లటి మైనంతో భూమికను ఏర్పరచి, దానిపై ఉప్పును పూతగా చల్లుతారు. అప్పుడు ఫలకాన్ని వేడిచేస్తే ఉప్పుకణాలు మైనంలోకిచొచ్చుకొనిపోతాయి. వెంటనే ఫలకాన్ని చల్లటి నీటిలో ముంచితే ఫలకం చల్లబడి. ఉప్పుకణాలు నీటిలో కరిగి భూమికనుంచి వైదొలగగా, భూమికపై పువ్వులను పోలిన చిన్న గుంటలు ఏర్పడి, దిగువ ఫలకంపై క్షయంకరి తగిలే వీలేర్పడుతుంది. 1778లో పారిస్‌నగరంలో ఈ స్టాపర్ట్ భూమిక ఆవిష్కృతమైంది.

**stapler or staple gun** : *శలాకిని.*

చిన్నలోహ శలాకలను, కొయ్యలోకిగానీ అట్టలోకిగానీ, కాగితాలకట్టలలోగానీ నొక్కి అవి అందులో ఇమిడిపోయి కరచుకొని ఉండేట్లు చేసే ఒక పరికరం.

**star drill** : *చక్రఖరము;*
*తారావేధని.*

ఉలిలాగా తీరిఉండే ఒక ఉక్కు కడ్డీ. దీని ఉలి అంచును నక్షత్రంలాగా తీర్చి దిద్దటం జరుగుతుంది. రాతిలోను, కాంక్రీటులోను, పిష్టకంలోనూ దీని సాయంతో రంధ్రాలు వేస్తారు.

**state (graphics)** : *పరిస్థితి (గ్రాఫికులు).*

**state or stage** : *పరిస్థాయి*

గ్రాఫిక కళలలో వాడుకలోవున్న ఒక పారిభాషికపదం. క్రమాగత సంప్రదాయాన్ని ముద్రించటానికి ఉపయోగించే ముందుగా సన్నాహకస్థితిలో, ఏదో ఒకరీతిన ఉన్న ఫలకం లేదా అచ్చుదిమ్మె. అటువంటి ఫలకం లేదా దిమ్మెనుంచి, తరవాత కార్యక్రమానికి మార్గదర్శిగా ఉపకరించేందుకు తీసిన అనుముద్రణకుకూడా ఈ పేరే వర్తిస్తున్నది. అటువంటి తొలియత్నపు రుజువులను తీయటం అన్ని గ్రాఫిక ప్రక్రియలలోను ఉన్నా, అంతఃపాతిలో ఇది తరచుగా జరుగుతుంది. ఆ రుజువులు ప్రదర్శనార్థమైగానీ, వేరువిధంగాగానీ కళాకారుని చేతినుంచి, వేరొకరికి పోవలసినప్పుడు, వాటిని తీసిన వరసలోనే ప్రథమ అవాంతరిక, ద్వితీయ అవాంతరిక మొదలైన పద్ధతులలో-గుర్తులను పెడతారు. చక్కగా సన్నద్ధమైన ఫలకంనుంచి తీసిన క్రమాగత సంప్రదానం కన్నా వేరైనవి ఇవి అని తెలియజరచేందుకు ఆ గుర్తులు ఉపయోగపడతాయి. (చూ : ఎదుటి పుటలోని చిత్రాలు.)

**statue** : *శిల్పమూర్తి; మూర్తిశిల్పం.*

మలచిన లేదా రూపీకరించిన ఒక మూడాయతనాల ఆకృతివిశేషం, ముఖ్యంగా మానవాకృతికి, జంత్వాకృతికి ఇది వర్తిస్తుంది.

**statuette** : *మూర్తిక; శిల్పమూర్తిక.*

జీవప్రమాణంలో సగానికి మించని రీతిలో మలచిన లేదా రూపీకరించిన మూడాయతనాల ఆకృతి విశేషం.

**statuary marble** : *మూర్తికా చంద్రశిల.*

స్ఫటికాత్మకమై, తెల్లగా ఉండి, శర్కరిలకమైన ఒక విధపు చలువరాయి. శిల్పానికి ఇది ఎంతో బాగా పనికివస్తుంది.

**steatite** : *అభ్రశిల.*

ధూసర హరితంగానో గోధుమచాయగానో ఉండే ఒక విధపు సబ్బురాయి. ప్రాచీనులు దీనిని శిల్పాలనిమిత్తం వాడారు.

**stecca** : *పేషకం.*

మధ్యయుగాలలో రంగులను నూరటానికై వాడిన ఒక విధమైన పరికరం.

**steel** : *ఉక్కు; కాలాయసం*

స్వచ్ఛమైన ఇనుముతో కొద్దిగా కర్బనాన్ని, చాలా కొద్దిగా కొన్ని ఇతర లోహాలను చేర్చి రూపొందించే మిశ్రలోహం.

**steel blue** : *ఉక్కు నీలిమ.*

ప్రసియన్ నీలిమలో అత్యుత్తమ స్థాయికి చెందిన మూడింటిలో ఒకటి. తక్కినవి చీనీయ నీలిమ, మిలోరి నీలిమ.

**steel facing** : *శీద్రాధివసనం; ఉక్కుమునుగు.*

అంతఃపాతి ప్రక్రియలో వాడబడే సూచీలిఖితములు లేదా రేఖాశిల్పితములు అయిన





పరిస్థాయి : క్రూశత్రయం (1653). సూచీచిత్రణను, సూచీప్రక్రియను పనిగొని రెంబ్రాంట్ రచించిన చిత్రమిది. దానిలోని పరిస్థాయిలలో ఎగువనున్నది రెండవ పరిస్థాయి; దిగువనున్నది చివరదియగు నాలుగవ పరిస్థాయి.

రాగి ఫలకాలపై విద్యుత్ ఫలకీకరణవల్ల పొందువరచిన లోహపు పైపూత. ఇటువంటి పైపూతకు నికెల్‌నుగాని క్రోమియమునుగాని వాడతారు. ఇట్లా పైపూత పూయటంవల్ల ఒక సౌకర్యమేర్పడుతుంది. పైపూతలేని రాగిఫలకం అతి శీఘ్రకాలంలోనే అరుగు దలకు గురికావటంవల్ల, బాగా ఉండే పరిస్థితిలో దానినుంచి పొందగల చక్కటి ముద్రణల సంఖ్య తక్కువగానే ఉంటుంది. అట్లా కాక ఇటువంటి భద్రాధివసనాన్ని ఫలకంపై కల్పించినప్పుడు అందులోనుంచి చాలా ఎక్కువగా సంప్రదానములను పొంది, తద్వారా అనేకాలైన రుజువులను తీయటానికి వీలవుతుంది. ఆంగ్లంలో దీనికిగల 'స్టీల్ ఫేసింగ్' అనే పేరు అపార్థజనకం. ఇందులో ఉక్కు (*steel*) ఏ సందర్భంలోనూ వాడబడదు. భద్రాధివసనంవల్ల కొంత కీడుకూడా ఉందని కొందరనెదరు ఇటువంటి పూతలేనప్పుడువచ్చిన రుజువులలాగా, పూత తరవాత వచ్చిన రుజువులు నాణ్యంగా వుండవని వారుఆక్షేపిస్తారు. ఇది ఏమైనా భద్రాధివసనం ఒక ఆమోదనీయ ప్రక్రియగా గ్రాఫిక కళల్లో పేరుపొందింది.

**stele** : *స్మారశిల.*

ఒక సమాధిపై మృతుని ప్రశస్తిని తెలియ బరచే శిలకూ, లేదా రాజశాసనాన్ని ప్రజలకు విస్పష్టంగా తెలియజేసే శిలాఫలకానికీ ఇది వర్తిస్తుంది. ఇది ఒక్కొక్కప్పుడు శిలాఫలకంగా కాక మృత్ఫలకంగా సైతం ఉండవచ్చు. ప్రాచీన గ్రీకులలో క్రీ.పూ. ఆరవ శతాబ్దికిముందే సమాధులపై ఇటువంటి స్మారశిల ఉండేవి. క్రీ. పూ. ఆరవ శతాబ్దినుంచీ ఆటువంటి వాటిపై శిల్పమూర్తులను మలచటం, లేదా చిత్రించటం సంభవించాయి.

**stellate** : *తారాభం.*

నక్షత్రంలాగా ఆకృతి కలది, లేదా కాంతి కలది.

**stencil** : *తైజసం.*

**stencil cutter or stencil knife :**
*తైజస కృత్తిక; తైజస ఛేదిని.*

పదనెక్కిన ఉక్కుతో చేసిన ఒక చిన్న కత్తి. దీని పిడి చాలా సన్నగా ఉంటుంది. కొక్కె అంచు కోణం తిరివుంటుంది. అనులేఖనాలను, తైజసాలను ఛేదించటానికై తైజస ఛేదిని పనికివచ్చినా, ముఖ్యంగా కౌశేయ యవనికా తైజసము ఛేదనకే ఇది ఉద్దిష్టం. ఈ ఛేదనం చాలా సునిశితం. ఇందుకుగాను నాజూకై, వాడిగలిగి, అదుపులో ఉండే







తైజస కృత్తిక : పైగువది ప్రామాణికపు కృత్తిక; మధ్యది తిరుగుడు కత్తి; దిగువది జంట పాదం కత్తి.

వాదక అవసరం. ఈ పరికరాలలో పలు తీరులవి ఉన్నాయి. ఇందులో కొన్ని సమాంతర రేఖలను ఛేదించటానికి ఉపకరించేవి; కొన్ని తిరుగడు సీల అమరికతో అపక్రమ వక్ర రేఖలను ఛేధించటానికి పనికి వచ్చేవి.

**stencilling** తైజనవర్యం.

ఒక రేఖాకృతిని అనుసరించి బహుళ సంఖ్యలో ప్రతికృతులను సృష్టించే ఒక విధానం. పలుచనిదైనా, ఎక్కువ మన్నికగలదిగా గణనగలిగిన ఒక చత్వరం (*sheet*) నుంచి ఆ రేఖాకృతిని మొదట ఛేధిస్తారు. (ఈ చత్వరం ఇత్తడివంటి లోహమో, కల్పకమో, జల తైల ప్రతిరోధి అయిన అట్టో కావచ్చు). అప్పుడు ఛేదనంవల్ల ఏర్పడే సందులద్వారా వర్ణపదార్థాన్ని స్ఫాలనము (*dabbing*), అవతనము (*pouncing*), శీకరింపు (*spraying*)లలో ఏదో ఒకపద్ధతిని అనుసరించి దిగువకుపోయేట్లుచేస్తారు. కౌశేయ లేఖనమూ, కౌశేయముపనికియూ తైజసప్రక్రియలు అని వ్యవహృతాలుకావడం సముచితమే.

**stencil paper** : తైజస పత్రం.

**stenography** : సంక్షిప్తలేఖనం.

(చూ : croquis)

**stereo-chromy** : ఏకీకృతవర్ణచిత్రణ.

**stiff** . క్రియ్యాకారిన.

**Stijl** : స్టిజల్ పత్రిక.

హాలండుదేశంనుంచి వెలువడ్డ కళావిషయిక పత్రిక. దీనిని 1917లో థియోఫాన్ డోస్‌బర్గ్ అనే అతడు ప్రారంభించాడు. అందులో అతడికి చేదోడుగా వుండినవాడు పియెట్ మాన్‌డ్రియన్. 1928 వరకు డోస్‌బర్గ్ ఈ పత్రికకు సంపాదకుడుగా ఉండెను. అతని మరణానంతరం 1932లో, అతని స్మృతి చిహ్నంగా, ఈ పత్రిక ఆఖరుచివరి సంచికను, డోస్‌బర్గ్‌సతి వెలువరించింది. తొలుత ఈ పత్రిక నవకల్పకవాదాన్ని సమర్థించింది. కాని 1924లో డోస్‌బర్గ్ తన అభిప్రాయాలను మార్చుకొని దాదావాదులను తన పత్రికద్వారా బలపరచాడు. ఇట్లా అభిప్రాయ స్థిరతలేకుండా వ్యవహరించినా, మొత్తంమీద ఈ పత్రిక, రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో, యూరపున వెలువడిన పురోగామికళా ప్రచురణలన్నిటిలో ఎక్కువ పలుకుబడి, ప్రచారమూ కలదిగా రాణించింది.

**stile Liberty** : నవ్యకళ.

ఆంగ్లంలో నోవో ఆర్ట్ (*Noveau Art*) అనబడే దానికి ఇటాలియన్ భాషారూపమే స్టైయిల్ లిబర్టి. ఇటువంటి నవ్యకళలో అద్దకాలు కలిగిన జపనీ వస్తువులను పస్తువులను-లండన్‌లోని 'స్టైయిల్ లిబర్టి' అనే కంపెనీవారు-మొదట్లో విదేశాలకు ఎగుమతి చేసేవారు. దాన్నిబట్టి ఇటలీవారు, ఆ కంపెనీ పేరునే ఆ కళావాదానికి పేరుగా తీసుకొన్నారు.

**still life :** *స్తబ్ధచేతన*

ప్రతీకాత్మకం లేదా అచ్చంగా రహస్యాత్మకం అయిన ఒక విషయిక (*Theme*) ను అనుసరించి, కళాకారుడు తన విచక్షణను ఉపయోగించి చిత్రించిన లేదా అలిఖించిన, ప్రాణ రహిత వస్తుబృందం. సాధారణంగా గృహాభ్యంతర సీమయే అందులో చిత్రితం. దానిలో మానవనిర్మితమైన ఏదో ఒక వస్తువును చేర్చడం జరుగుతుంది. ఉదాహరణకు అది ఒకబల్ల కావచ్చు. ఆ బల్లపై, పైన పేర్కొనబడిన కల్పిత వస్తుబృందాన్ని అమర్చి ఉండవచ్చు. ఒకవేళ ఆ చిత్రం పుష్ప సంబంధి స్తబ్ధచేతనయే అయినప్పుడు అందొక పూలకుండిలో పూవుల అమరిక వున్నట్లుగా చూపవచ్చు. ప్రకృతి సహజ పరిస్థితులలో కన్పించే పూల దృశ్యానికి అచ్చంగా ఇది విభిన్నంగా ఉంటుంది.

రోమనుల కాలంనుంచికూడా ఇటువంటి స్తబ్ధచేతన ప్రక్రియ అమలులో ఉన్నా, 16వ శతాబ్దపు పూర్వం, ఈ చిత్రాలు ఇంకొక విశాల చిత్రంలో అంతర్భాగాలు మాత్రమే ఉండేవి. 16వ శతాబ్దిలో డచ్చి ఫ్లెమిష్ చిత్రకారులు దీనికి ఒక స్వతంత్ర ప్రతిపత్తి కల్పించారు. అయితే దీనికి పుష్టిని కల్పించినవాడు, 18వ శతాబ్దిలోని ఫ్రెంచి కళాకారుడు జె బి యస్. షార్డిన్. అనుకూపనా వాదులకూ పరిభాషనావాదులగు వాంగో, సిజానే వంటి ప్రముఖులకూ-ఇది ఒక అభిమాన ప్రక్రియగా ఖ్యాతి గాంచింది.

**stilts :** *ఉన్నయనులు.*

మూర్తన ప్రక్రియలో ఒక పారిభాషిక పదం. గట్టిగా కాల్చిన మృత్తికతో, పొయిలాగా తీర్చిదిద్దిన మూడు ఆధారాలివి. కాల్చవలసిన సామగ్రిని వాటిపై ఉంచుతారు.

**stimulus colours :** *ప్రదీపక వర్ణాలు.*

ఒక వస్తువును చూసేటప్పుడు కలిగే వర్ణ ప్రభావాలే-ఆ వస్తువు లేకుండానే-ఇతర ప్రక్రియలవల్ల నేత్రేంద్రియంలో కలిగేట్లుంటే ఈ పదాన్ని వాడతారు. ఏవైనా కొన్ని ఓషధులను సేవించినప్పుడుగానీ, కన్నుపై ఆఘాతం కలిగినప్పుడుగానీ కన్ను ఇటువంటి భ్రమకు లోనవుతుంది.

**stipple ·** *బిందువర్తన; బిందునలేఖనం.*

తూలికాగ్రంతో రంగును చిన్న చిన్న చుక్కలుగా చిత్రంలో ఉంచటం; ఉపరితలంపై కొనతగిలేట్లు నిలువుగా కుంచెనుంచి తట్టటం, ఆపతనంవంటి ఆకస్మిక సంస్పర్శలవల్ల బిందువులను ఏర్పరచటానికి ఈ పదం వర్తిస్తుంది.

**stipple engraving :** *బిందురేఖనం*

ఆలేఖనాల ప్రత్యుత్పాదనంకోసం, 18వ శతాబ్ది ఉత్తరార్ధంలోను, 19వ శతాబ్దిలో మొదటి దశాబ్దాలలోనూ అవలంబించిన ఒక అధిరేఖన ప్రక్రియ. ఇప్పుడిది అమల్లో లేదు. ఖడికాకృతికి దీనికి మధ్యఉండే అంత

రం చాలా తక్కువ; అందువల్ల సాధారణంగా దాంతోపాటే వాడుకలో ఉన్నది.

**stone** : *శిల.*

గనినుంచి విడిపోయేట్లు చేసిన రాయి; శిల్పానికి ప్రాచీన కాలంనుండికూడా దీని వాడుక ఉంది. సికతాశిల, చంద్రశిల, సుధాశిల, దృఢశిల (నల్లరాయి) ఇందుకు బాగా పనికి వస్తాయి.

**stoen green** : *శిలాహరితం.*

హరితమృత్తికకు పర్యాయనామం.

**stone ochre or stone yellow** : : *శిలాపీతం.*

పీత గైరికంలో ఉచ్ఛస్థాయికి చెందినది.

**stone sculpture** : *ప్రస్తర శిల్పం.*

రాతిలో శిల్పాన్ని రెండు రీతుల్లో నిర్వహిస్తారు. అవి: 1. పరోక్షరీతి. 2. అపరోక్షరీతి. పరోక్షరీతిలో, ఉద్దిష్టమయ్యే రూపానికి సుధాపిష్టంలో ప్రతిమానాన్ని నిర్మించినతరవాత దానిసాయంతో నిర్దేశన (*pointing*) పద్ధతిలో, దాన్ని శిలలోకి మార్చటంచేస్తారు. ఇటువంటి పద్ధతిలో శిలలో మూర్తిని కళాకారుడు చెక్కవలసిన అవసరం అంతగా ఉండదు. ప్రతిమానాన్ని అనుసరించి రాతిచెక్కడు పనివాడు ఎవడైనా దాన్ని మలచవచ్చు.

అపరోక్షరీతిలో ప్రతిమానం ఏదీ ఉండదు. శిలలో రూపొందవలసిన మూర్తిని మానసికంగా సంభావించి, శిలను తదనుగుణంగా కళాకారుడు మలచటం ఇందులో జరుగుతుంది. తన భావితమూర్తికి అనువుగా శిలపై చెక్కలను క్రమంగా కళాకారుడు చతురతతో తొలగిస్తాడు.

ఈ రెండు రీతుల శిల్పంకూడా ప్రాచీన కాలంనుంచి అమలులో ఉన్నది. ఆ శిల్పంలో వాడే పరికరాలు పూర్వంనుండీ ఈనాటి వరకూ దాదాపుగా ఒకే రీతిలో ఉన్నాయి.

**stoneware** : *శిలామార్తవం.*

మార్తవ సామగ్రిలో ఒక రకానికి చెందింది. అధికసాంద్రత, కాంతినిరోధకత, మన్నిక, నిరధిచూషణ,-అనే ధర్మాలు కలిగి మృదుపిష్టరీతిలో ఇది వుంటుంది.

అమెరికాలో 19వ శతాబ్దంలో దీనితయారీ మొదలయింది. ఇది కాంత్యభేద్యమై, గ్రసనశీలంగాక దళసరిగా వుంటుంది.

**stoneware clay** : *రాతిమట్టి.*

**stop** : *విధానం.*

భ్రంశత చెందిన ఒక కళారచనలో ఒక రంధ్రాన్నో, నిమ్నతనో పూడ్చి, బాగావున్న తక్కిన భాగంలాగానే శాంతవత, మట్టమూ కలిగి వుండేట్లు చేయటం. పరిరక్షకులు ఇందుకై వాడే పదార్థాలలో కొన్ని:- లప్పం, బొమ్మసున్నం, ఒకవేళ కాంక్రీటుపైనగానీ రాతిపైనగానీ ఈ విధానాన్ని జరపవలసివస్తే

చాయసిమెంటును వాడతారు. చిన్న చిన్న సురమ్మత్తుల సందర్భంలో మాత్రమే ఈ ప్రక్రియను ఉపయోగిస్తారు.

**stop-out process** : *స్తంభన ప్రక్రియ.*

**stopping out** : *అవరోధనం.*

1. సూచీ చిత్రణలోను, జలచ్ఛవిలోను, సూచీలిఖిత ఫలకంలోను కొన్ని నిర్దిష్ట రేఖలకూ తావులకూ అవరోధక వార్నిషును పట్టించటం. (ఈ అవరోధక వార్నిషు, ఆమ్ల ప్రతిరోధి అయిన ఒక నిరోధకం; ఇది ఈ పనికోసం మాత్రమే ఉద్దిష్టం. ఇది పలచగా వుండి ఆదువులో ఉంచడానికివీలుగాఉంటుంది.) సూచీలిఖిత ఫలకాన్ని ఒకసారి క్షయంకరిలో ముంచితీసి, అందుకొన్ని రేఖలూ, తావులూ చక్కగా దంశితములై, మరికొన్ని కావలసినంతగా దంశితములు కానప్పుడు-ఆ ఫలకాన్ని మళ్ళీ క్షయంకరిలో ముంచవలసి వస్తుంది. అప్పుడు ఇక ఎక్కువగా దంశనం అవసరంలేనివాటి రక్షణకోసం ముందుగా వాటికి ఈ అవరోధనం జరుపుతారు.

2. కౌశేయ యవనికా, కౌశేయలేఖక ప్రక్రియలలో యవనికలో కొన్నితావులను కప్పివేయటం ఈ తావులనుండి రంగుపదార్థం కిందికిపోయి ముద్రాంకనం ఏర్పడకుండా ఇది ఆపివేస్తుంది. ఇటువంటి అవరోధనానికి ఐంకో, మాయలక్కో, కాగితమో వాడబడుతున్నవి. తైజసంలో సన్నని రంధ్రాలు ఏవైనా కనిపిస్తే వాటిని పూడ్చటానికిన్నీ ఈ ప్రక్రియ ఉపకరిస్తుంది.

**stopping out varnish** : *అవరోధక వార్నిషు.*

**straight edge** : *ఋజుధార.*

పరిధానా (*mat*)లపై, కాగితంపై, చర్మంపై, గాజుపలకలపై, అటువంటివేఅయిన ఇతరములపై, ఋజురేఖాకీతిలో గీతలు గీయటానికి, అవసరమైనప్పుడు ఛేదించటానికి పనికివచ్చే ఐనుపైన చదునబద్ద. ఒక్కొక్కప్పుడు సాధారణపు రేఖిక (*ruler*) నే ఋజుధారగా వువయోగించవచ్చు.

**strainer** : *వికర్షణి.*

కాటికను పట్టుకొని బిగుతుగా ఉంచడానికి అనువుగా నాలుగ మూలలా సీలలుండువుండేఒక చట్టపుఏర్పాటు, లేదా కుదురు. నాలుగుమూలలా గట్టి బిగింపు వుండటంవల్ల ఇది వ్యాకోచించే అవకాశంలేదు. ఈ విధంగా ఇది ప్రసారణికి (*stretcher*) అచ్చంగా విరుద్ధం. మల్లుగుడ్డ లేదా సన్నని నారగుడ్డ బిగించిన తేలికపాటి వికర్షణులను-కాగితంపై రూపొందించిన-ముద్రాంకాలను పెట్టివుంచటానికై విస్తారంగా వాడతారు. వ్యాకోచనానికి అవకాశంలేని కుదురుగా లెక్కపవచ్చే ఇటువంటి వికర్షణిని కాటికపైన రచితమైన తైలచిత్రాలకు వాడటం తగదని పరిరక్షకుల అభిప్రాయం. తైలవర్ణంతో చిత్రితమయ్యే కాటికలు తరచుగా వ్యాకోచనకు లోనవుతాయికాబట్టి అయా సంద

ర్యాలను అనుసరించి చట్రాన్ని విస్తరింపజేయటం తప్పనిసరి. కాని వికర్షణితో ఇటువంటి దానికి అవకాశమేలేదు. అందువల్ల వికర్షణిపై బిగించిన కాటిక ఎన్నో కారణాలవల్ల సడలిపోయే ప్రమాదం వుంది. అటువంటి సడలింపును లెక్కలోకి తీసుకోక అశ్రద్ధచేస్తే, చిత్రంలో మడతలు, లేదా తదితర అవ్యవస్థలు చోటుచేసుకొని శాశ్వతంగా నిలిచిపోతాయి.

**straining pincers** : *బిగింపు గ్రావణం.*

బిగించే పట్టుకారుకు పర్యాయనామం.

**strappo** : *వ్యాకృతి.*

ఒక సద్యస్క (*Fresco*) మును, అది నెలకొన్న గోడనుంచి ఇంకొక గోడయొక్క ఉపరితలానికి మార్చటానికి అవలంబించే విధానం. ఈ విధానంలో చిత్రముఖంపై పొరలు పొరలుగా గుడ్డలను చాలా గట్టి పసిబంకతో అతికిస్తారు. ఆ బంక బాగా ఆరిన తరవాత గుడ్డను లాగితే దాంతోపాటుగా చిత్రపు రంగు పొరకూడా బయటకు వస్తుంది. అప్పుడు ఆ పూతకు వెనకన క్రొత్తగా గుడ్డతో అనుదును సవరిస్తారు. సద్యస్కమునకు ఆధారమైన అంతస్థపు గచ్చుపొర చాలా శిథిలత చెంది నప్పుడు తావుమార్పు (*stacco*) విధానానికి కూడా ఇది చాలా బాగా పనికివస్తుంది.

**strapwork** : *వరత్రకం.*

తోలుపట్టీలను బిగిబిగిగా అల్లినరీతిగా రూపొందించిన ఒక అలంకృతి విశేషం. ఇటువంటి అలంకృతిని రోసోఅనేచిత్రకారుడునూ, ఫోన్‌టెన్ బ్లూలోయునూ, ఆయన దగ్గర పనిచేర్చుకొన్నవారూ 1530 లలో రూపొందించారు. అచిరకాలంలోనే అది ఫ్లాండర్సుకు వ్యాపించి, అక్కడినుంచి పుస్తకాలమీద అటువంటి అధిరేఖనాల ద్వారాను, దేశాంతర గతులయ్యే పనివాళ్ళవల్లనూ ఇంగ్లండుకు చేరింది. ఎలిజబెత్ కాలంలోనూ జాకోబియల కాలంలోనూ ఈ అలంకృతి ఎక్కువగా వాడబడింది.

**Strasbourg turpentine** : *స్ట్రాస్‌బర్గ్ కర్పూర తైలం*

ఒక విధపు తైల యక్షధూపం.

**streamlines** : *మెరుపు చారలు*

ఒక చిత్రణను, నిట్టనిలువుగా నిలిపి, దానికి రంగును లేదా బొమ్మ వార్నిషును పట్టించినప్పుడు ఏర్పడటానికి అవకాశమున్న ఒక దోషం. ఇది సన్నిహితాలైన, సమాంతర లంబరేఖల రూపంలోనో లేదా హలరేఖా (*striation*) రూపంలోనో ఏర్పడుతుంది. ఇటువంటివే అయిన తక్కిన దోషాలు; *curtains* (తెరమడతలు); *frilling* (సతల్పు), *teardrops* (బాష్పబిందువులు).

**stretcher** : *ప్రసారణి; ప్రసారిక; ఫలకశయనం*

ఒక కళాకారుడి కాటికను చాచి పరచటానికి ఉపకరించే కుదురు లేదా కర్ర పనితనపు

చట్రపు అమరిక. కాటికను గట్టిగా దాచి, దీర్ఘచతురస్రాకారంగా ఉండే ఆ చట్రపు అంచులకు, అన్నివైపులా దాన్ని బిగించటం ఇందులో జరుగుతుంది. సాధారణంగా వాడే అమెరికాదేశపు ప్రసారణి, 1 3/4 అం. వెడల్పుగల కొయ్యబద్దలతో నిర్మితం. ఈబద్దలలో రెండువైపులా వాటి చివరలు, ఒక నిర్దిష్టదూరంవరకు ఏకసరి తగ్గి ముందుకు పొడుచుకొని ఉంటాయి. తక్కిన రెండింటిలో ఈ పొడుచుకొన్న భాగాలు పట్టునట్లుగా చివరలు గాడిదేలి ఉంటాయి. ఈ పొడుగులను



ప్రసారణి, బద్దలు, గసికలు

గాడులను ఒకే పరిమాణాలలో ఎప్పుడూ తయారుచేయబడి ఉంటాయి. కాబట్టి ఒక బద్దపోయినా అటువంటిదే ఒక దానిని సులభంగా బజారులో కొనవచ్చు. గాడులలోని పొడుగులను అమర్చి బిగించడంవల్ల ప్రసారణి రూపొందుతుంది. సటివి, వెడల్పుల బద్దలు పైరీతిలో సంధించేచోట్లలో త్రిభుజాకార కీలములను లేదా గసికలను కళాకారుడు సుత్తెతో కొట్టి బిగిస్తాడు. ఇందువల్ల కాటిక బిర్రబిగిసి ఉండే అమరిక ఏర్పడుతుంది. తరవాత కాటికలోని బిగింపు తగ్గితే ఈ గసికలను మరింతగా బిగించి దాన్ని సరిచేయవచ్చు. 19వ శతాబ్దపు ప్రసారణుల బద్దలు 2 1/2 అం. వెడల్పు ఉండి, కాటికలో బిగింపు ఎక్కువ చేయటానికిన్నీ, ఆకుంచనాన్ని నిరోధించి చిత్రాన్ని రక్షించటానికిన్నీ ఉపయోగపడేవి. కావలెనని ప్రత్యేకంగా కోరుకొంటే, ఈనాడున్నూ కళాద్రవ్య విక్రేతలు అటువంటివాటిని తెప్పించి ఈయగలరు; కొందరు కళాకారులు ఇటువంటివాటినే ఎక్కువగా అభిమానిస్తారు. మ్యూజియాలలోని సాంకేతికులూ, పరిరక్షకులూ, పైవాటికన్నా పటిష్ఠమైన వాటిని వాడతారు. వారు, కావలెనని అటువంటి పటిష్ఠతగల ప్రసారణులను తయారు చేయించుకొంటారు. వాటికి మూలలలో కొయ్యగసికల అమరింపుకు బదులుగా యాంత్రికపు దృఢీకరులు ఉంటాయి.

సాధారణంగా ఈ కాలంలో వాడుకలో ఉండే తేలికపాటి ప్రసారణి, గత శతాబ్ది కొట్టకొనన రూపొందింపబడింది. పొదుపరితనానికీ, సౌకర్యానికీ అది చెప్పదగింది. అయితే చట్రాలు కుదిరియుండే చిత్రణలకు మాత్రమే ఇవి తగినవి. చుట్టూ చట్రమే లేకుండా, లేదా అంచు బద్దింపు మాత్రమే ఉన్న చిత్రణలకు 2 1/2 అం వెడల్పు బద్దలు ఉండే ప్రసారణిని తప్పక వాడవలెను. లేకుంటే చిత్రంలో ఆకుంచనాలు ఏర్పడవచ్చు. చిత్రపు వ్యాకోచనాన్ని గుర్తింపకుండా ఎల్లప్పుడూ బిగించే చట్రాన్నే వికర్షణి అంటారు. కలకాలం మని ఉండవలసిన చిత్రణాలకు అది పనికిరాదు.

**stretching frame** : *బిగింపు చట్రము; ఆయామావరణిక*

ఒక ఆస్తరిక(*board*)పైన అతికించటానికి బదులుగా, నీటిరంగు చిత్రంకల తెలిక పాటి కాగితపు చత్వారాన్ని వర్తించటానికి వాడే ప్రయుక్తి (*device*), ఇందు రెండు దీర్ఘచతురస్రాకారపు చట్రాలుంటాయి. ఇవి కొయ్యతో గాని, అల్యూమినియంతో గాని నిర్మితమవుతాయి. వాటిలో ఒకటి పెద్దది, రెండోది చిన్నది. పెద్దదానిలో చిన్నది సరిగా అతికినట్లుగా కుదిరే ఏర్పాటు ఇందులో ఉంటుంది, కాగితపు అంచులను ఈ రెండు చట్రాల మధ్య ఇరికించి, బిగించి ఉంచుతారు. దీన్ని ఎక్కువగా, ఆరుబయట చిత్రణలకు మాత్రమే ఉపయోగిస్తారు. కాని 19వ శతాబ్దంలోనూ, ఇరవయ్యో శతాబ్దపు పూర్వకాలంలోనూ ఉన్నంతగా దీని వాడుక ఇప్పుడు లేదు.

**stria** : *బద్దె; లంబపర్శుక*

సీతారేఖనంలో రెండు లోయాళ్లకు మధ్య చిదురుబద్దవలె ఎత్తుగా అమరిఉండే బద్దె.

**striation** : *బద్దెధార.*

ఒకదాని వెనక్కాన ఇంకొకటిగా దాదాపుగా సమాంతరరీతిలో ఒక ఉపరితలంపై గీతలను, లోయలను అమరిఉండే రీతి.

**strike through** : *పైపొడుపు*

ఒక రంగుపూతను మరుగుపరచటానికై ఇంకొక రంగుపూతను వర్తించినప్పుడు, మొదటిపూత మరుగుపడకుండా ఏకీకృతంగానో, స్పష్టంగానో, మసకగానో వ్యక్తం కావడాన్ని ఇది తెలుపుతుంది.

**strip (n)** : *బద్ద; పేలిక*

**strip (v)** : *తొలగింపు*

ఒక తైలవర్ణపు పూతనుండి, వార్నిషును తొలగించటం.

**striper** : *చారకుంచె*

**strippling** ; *బిందుబవర్తన*

**stroke (brush)**: *విసరు; ప్రహారం(తూలిక)*

**stroke** : *ప్రేటు*

(చూ : rOcker)

**strontium white** : *స్ట్రాన్షియ శ్వేతం*

ముగ్గురాయిని పోలిన గుణవిశేషాలు కలిగిన ఒక విధమైన తెలుపు వర్ణద్రవ్యం, ఇప్పుడు దీని వాడుక చాలా తక్కువ.

**strontium yellow** : *స్ట్రాన్షియ పీతం*

మన్నిక కలిగి, సామికాంతినిరోధమై, వెలవెలపోయే నిమ్మపసిమి వర్ణద్రవ్యం.

**stucco** : *సుధామృత్తిక; చూర్ణలేపం.*

గోడలకు తుదితీర్పు తీర్చటానికిన్నీ, రక్షణకున్నూ పై పూతగా వాడే ఒక విధమైన సుధాపిష్టం. సాధారణంగా ఆ గోడల ఆరుబయలు భాగాలకు పట్టించే గరుకుపట్టు (*rough cast*) తీర్పుకే ఇది వినియుక్తం, అయినా అవసరమైతే స్నిగ్ధపు పరిష్కృతికిని సుధామృత్తిక పనికివస్తుంది. పోర్టులాండ్ సిమెంటుతో గచ్చు సున్నం లేదా జిప్సపు గచ్చునూ, ఇసుకనూ కలిపి సాధారణంగా దీన్ని తయారుచేస్తారు అయితే గరుకుపట్టు తీర్పు కావలసినప్పుడు మాత్రం ఆ మిశ్రమానికి గులకరాళ్ళను, లేదా అటువంటిదాన్నే వేరొకదాన్ని చేరుస్తారు. ఏదైనా రంగు ఆ సుధామృత్తికకు కావలసినప్పుడు, అటువంటి వర్ణద్రవ్యాలలో చూర్ణప్రతిరోధ (*lime-proof*) లైన వాటిని అందులో చేరుస్తారు.

ప్రాచీన కాలంలో గ్రీసులోనూ, రోము లోనూ ఈ సుధామృత్తికా వినియోగంతో నున్నగా, బాగా తీర్చిదిద్దిన, మిసిమిగల ఉపరితలానికే ఎక్కువ మన్నన ఉండేది పునరుజ్జీవన యుగంలో, బొంతరాతిపొడిని, చలవరాతిపొడితో కలిపి తయారుచేసిన సున్నపు మిశ్రమాన్ని ఈ సుధామృత్తికను తయారుచేయడంలో వాడేవారు. సరియైన పనితనపు కుశలతా, సముచితములైన సాధన ద్రవ్యాల మేళవింపూ సమకూరే పక్షంలో ఈ సుధామృత్తికవల్ల చక్కని ఉపరితలమును, రాతిలాగా మన్నిక వెలార్చే రచనలను రూపొందించవచ్చు. అటువంటి రచన చదునుతలాలపైన మాత్రమేగాక, ఒక ఉపరితలం లోపల కొయ్య సంయానాల సాయంతో రూపించే అలంకరణల రీతిగా కూడా సాగించవచ్చు. ఆ సంయానాలను వాడటానికి ముందుగా వాటిలో చలువరాతి పిండిని కొంత దట్టంగా చల్లుతారు. పునరుజ్జీవన యుగంలో సుధామృత్తికలో సాగిన భవన ముఖాలంకృతి, ఛిద్రణ ప్రక్రియవల్ల కూడా జరిగింది.

**studio** : *రచనాశాల; శిల్పశాల.*

సాధారణంగా ఏ కళాకారుడైనా పనిచేసే కర్మాగారానికి రచనాశాల, లేదా శిల్పశాల అనే పేరు వర్తించినప్పటికీ, ఉత్తరపు దిక్కుకు అభిముఖ ద్వారం కలిగి, వెలుతురు ప్రసరించటానికి చక్కగా అవకాశం ఉండి విశాలమైఉండేశిల్పశాలకే ముఖ్యంగా ఇదివర్తిస్తుంది అనేది సాంప్రదాయికార్థం. పాశ్చాత్య శిల్పాచార్యుడైన విట్రూవియస్ క్రీ.పూ. ఒకటవ శతాబ్దిలో తాను రచించిన గ్రంథంలో 'స్టూడియో' అనే దానికి ఈ అర్థమే ఉందని తెలిపాడు. అయితే లియొనార్డో డా వించీ ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తూనే, ఆ శాల, విస్తృతంగా ఉండక చిన్నదిగా ఉన్నప్పుడే కళాకారుడికి తన రచనకు తగిన ఏకాగ్రత సమకూరుతుంది అన్నాడు. పునరుజ్జీవన యుగంలో ఈ పదం శాలనేగాక, అక్కడ ఉండే కళాకారుని, అతడి సాహాయ్యకులను గూడా సమష్టిగా తెలియజేసేదిగా లెక్కకు వచ్చింది. క్రమంగా శిల్పశాలా రచన

(*studio work*) అనే పదం ఒకటి రూపొందింది, ఒక ప్రసిద్ధ చిత్రకారుడి శిల్పశాలలో అతడి మార్గదర్శిత్వ పర్యవేక్షణల కింద సాగిన రచన అనే అర్థం దానికి లభించింది.

**studio-size** : *శిల్పశాలోచితం.*

**study** : *అనుశీలనం.*

ఆలేఖనంలో, చిత్రణలో, శిల్పంలో ఈ పదానికి ఒక ప్రత్యేకార్థం ఉంది. సంకల్పితమైన రచనకు ప్రారంభకంగా, తరచుగా దానిలోని వివరాలకు—అంటే ఆ శిల్పంలోని తల, ఒక వృక్షము, ఒక ఆకృతి విశేషాంకు రేఖాకల్పన. ముందుగా దాన్ని మెరుగుపరచే భావనతోదనూ, దానికి పరిష్కృత రూపాన్ని కల్పించే కృషితో ఎదుర్కొవలసివచ్చే సమస్యలను ముందుగా అర్థం చేసుకోవటానికినీ, కళాకారుడు ఈ అనుశీలనకు పూనుకొంటాడు. ఒక సాంకేతిక ప్రక్రియ, లేదా ఒకానొక ప్రత్యేక ద్రవ్యవిశేషం— తాను తలపెట్టినసం రచనకు పనికి వస్తాయా అనే విషయాన్ని ప్రాయోగికరీతిలో తెలుసుకోవటానికీ, వాటిని స్వీకరించటంలో ఔచిత్యం మదింపువేయటానికికూడా కళాకారుడు ఈఅనుశీలనాన్ని ఉపయోగించుకోవచ్చు. తన ఆలోచనలకు, సాంకేతిక ప్రక్రియలకు కార్యరూపం కల్పించే సాధనంగా కళాకారుడు అనుశీలనను ఉపయోగించుకొంటాడు కాబట్టి అది రూపరేఖ (*sketch*) కన్నా ఎక్కువ వివరాలు కలిగిఉంటుంది.

**stump or stomp** : *లోటితం.*

బొగ్గుతోగాని, సుద్దతోగాని, పెన్సిలుతోగాని గీసిన గీతను సరిచేయటానికి వాడే ఒక సాధనం; కాగితం, తోలువంటివాటిని చుట్టగా





లోటితం (ఎగువనున్నది); దిగువది అవర్తిక.

చుట్టి దీన్ని రూపొందిస్తారు. రెండు చివరలూ కొనదేరి ఉంటాయి. సాధారణంగా దీని పొడవు 4 నుంచి 6 అంగుళాల వరకు ఉంటుంది.

**stun** : *ఘాత.*

శిల్పంలో, రాతిని మొ వోయిన ఒక పరికరంతో కొట్టి ఒక ముక్కను తేవదీసి, దానికి రూపవికృతి కలిగించటం; ఈ పని వల్ల కలిగిన లోపానికికూడా ఈ పదమే వర్తిస్తుంది.

**style¹** : *శైలి*

ఒకఆకృతిని ప్రతికల్పించటంలో విశదమయ్యే ఒక ప్రత్యేక భావప్రకటనారీతి. శైలులు ఎన్నో కోవలకు చెందినవిగా— అంటే ఒక చారిత్రకయుగానికో, జాతికో లేదా ప్రదేశానికో, లేదా ఒక నిర్దిష్ట కళాకార బృందానికో

చెందినట్లు - వింగధించబడుతున్నాయి. ఒక కళాకారుడిలో విశిష్టంగా కానవచ్చే ఒకసాంకేతిక ప్రక్రియకూ, అతడిలో మాత్రమే కనిపించే ఒక లక్షణ సంపత్తికీకూడా శైలి అనే పదం వాడతారు.

**style²** – చూ : **stylus.**

**style mecanique,le :** *యాంత్రికశైలి.*

స్వచ్ఛతావాదపు తొలిరూపం. దీన్ని అవలంబించినవారిలో ప్రముఖుడు ఫెర్నాండ్ లీజర్ (1881–1955).

**stylization :** *శైలీకరణ.*

ప్రకృతిలో కనపడే ఒక రూపానికి చిత్రంలో ప్రతికల్పన చేసేటప్పుడు, సహజంగా ప్రకృతిలో ఆ రూపం కళాకారుడి జ్ఞానేంద్రియాలకు వ్యక్తమయ్యే రీతికన్నా, కళాదర్శముల వెలుగున, లేదా కళాధర్మ రీతిలో రూపం ఉండేరీతికే ఎక్కువ ప్రాధాన్యం కల్పించి చిత్రించటం. ప్రాచీనకాలపు గ్రీసుదేశంలో శిల్పులు, మానవ శరీరాలను శిల్పీకరించి ప్రదర్శించేటప్పుడు, అవి వాస్తవిక ప్రపంచంలో కనపడే రీతిలో గాకుండా ఆయా శిల్పుల భావనాప్రపంచంలో మానవుల ఆదర్శమూర్తులు ఎట్లా ఉంటాయో ఆ రీతిగానే రూపొందించారు. వాస్తవిక ప్రపంచంలో కనపడే వ్యక్తిగత విభేదాలను ఇట్లా మరగుపరచటానికై యథార్థ రూపాలకు కొంత మార్పు కలిగించటమేకాక అతిశయోక్తికి కూడా అందులోస్థానంకల్పించి, ఒకమూసలో నుంచి తయారయ్యేవాటిలాగా రూపాలను తీర్చేపరిస్థితి ఇందు ఏర్పడుతుంది. చరిత్రలో మొదటినుంచీ కళారంగంలో ఇటువంటిదాన్ని అవలంబిస్తూనే ఉన్నారు. ప్రాచీనకాలపు ఈజిప్టులో మంచిన మార్గాలాకృతులను ఇందుకు ఒక లక్ష్యంగా గ్రహించవచ్చు. నిగనిగలాడుతూ, పొడవుదీరిన ఆకృతులలో పిల్లులు అందులో కనపడతాయి ఇది వాస్తవికతకు దూరం. అయినా అక్కడి శిల్పులు కావాలనే పిల్లిరూపంతో నైగనిగ్యాన్ని, పొడుగునూ అతిశయింపజేసి, తద్వారా ఆ శిల్పంలోని 'మార్జాలత'ను ద్రష్టయొక్క మనసుకు హత్తుకొనేట్లు చేయగలమని భావించారు. ప్రాగైతిహాసిక యుగం మొదలుకొని ఈనాటివరకు, ప్రతియుగంలోనూ ఈ శైలీకరణ లెస్సగా వినియుక్తమైంది.

**stylized :** *శైలీకృత.*

**stylograph :** *శైలిక; శైలికాలేఖిని.*

ఆలేఖనంలో వాడే ఒక విధమైన ఈటకలం. దీనిలో పాళీకి బదులుగా, ఒక సన్నని గొట్టం, కొనదేలి ఉంటుంది. ఇందులోనుంచి బయటకు వచ్చే సిరాధారలను క్రమబద్ధం చేయటానికి ఒక అడ్డువాల్వు అమరి ఉంటుంది. అక్కడ ఒక ప్రత్యేకపు తావున నొక్కినప్పుడు మాత్రమే సిరా వెలుపలికి వస్తుంది. ఈ ఏర్పాటువల్ల నియతరీతిలో, నియత

ప్రమాణంలో సిరా ప్రవహించి, తద్వారా నిర్దిష్టమైన, చక్కని రేఖలను గీయటానికి సదుపాయం కలుగుతుంది. చివరనుండే ఈ గొట్టాలు పలు ప్రమాణాలలో ఉండే పెక్కు రకాల శైలికలు బజార్లలో లభిస్తాయి. ఈ శైలికలే సూచ్యగ్రలేఖిని (*needle point pen*), శైలికాలేఖిని (*stylographic pen*) అనికూడా పేర్లున్నాయి. కాని దీని వ్యాపార నామమైన రేపిడోగ్రాఫ్ అనే పదానికే ఎక్కువ వ్యాప్తి ఉంది.

**stylus or style** : *గంటము; శైలిని.*

చివరన గట్టి సూదిమొన కలిగి, కళాకారులకు ఉపయోగపడుతూ, పెన్సిల్ ఆకారంలో ఉండే ఒక చిన్న పరికరం. మెత్తని తలాలపై (అంటే కుమ్మరిమన్ను, తడి సుధాపిష్టం, బంగారంవంటి వాటి తలాలపై) గీతలను గీయటానికి, అనులేఖపత్రం లేదా గ్రాఫయిట్ కాగితం సాయంతో ఒక ఆలేఖనమును మార్చిడి చేయటానికి ఈ పనిముట్టు ఉపకరిస్తుంది. కళాకారుడి పరికరాలలో కెల్లా ప్రాచీనతమముగ గంటం పేరొందింది. ప్రాచీనకాలమున గ్రీసులోనూ రోమ్ లోనూకూడా మెత్తటి మైనంపై అభిలిఖించటానికి గంటాలను వాడేవారు. అనాటి గంటానికి ఒకవైపున సూదిమొనా, రెండోవైపున గుండుకొనా ఉండేవి. సూదికొనతో అభిలిఖించేటప్పుడు తప్పు దొర్లితే దాన్ని వెంటనే గుండుమొనతో రుద్ది, అచటి తలాన్ని నునుపుచేయటం జరిగేది.

**styrene resin** : *స్టైరీన యక్షధూపం.*

అక్రిలీయ యక్షధూపాలను పోలిన గుణవిశేషాలు కలిగిన కొన్ని సంయోజిత యక్షధూపాల వర్గాంలో ఒకటి.

**subject** : *ఆలేఖ్యావస్తువు;*
ఆలేఖ్య విషయము.

**sublimity** : *ఉదాత్తత.*

ఈపదం ఉదాత్త (*sublime*) అనే విశేషణరూపంలో కళావిమర్శనలో 18వ శ. లో వాడుకకు వచ్చింది. సాహిత్యరంగంనుంచి కళారంగానికి వచ్చిన పదాలలో ఇది ఒకటి. 'సుందరం' అనే పదానికి ఇది విభిన్నం; అంతేకాదు; ఒక్కొక్కప్పుడు ఇది దానితో వివర్యయించేదికూడా కావచ్చు. వ్యంగ్యతచే సంభ్రమమును, ఉత్సుకతను ద్రష్టలో రేకెత్తించగలగటం అనేదానికి ఈ విశేషం వాడవచ్చును–అనే అర్థం క్రమంగా దీనికివచ్చింది. రెయినాల్డ్స్ అనే కళా విషయిక రచయిత ఈ విషయాన్నే చర్చిస్తూ చిత్రరచనలో 'ఉదాత్తత' అని చెప్పదగింది.సాహిత్యంలో అటువంటి లక్షణంలాగానే.మానవుని మనస్సును, హృదయాన్ని సంపూర్తిగా లోగొని, అతణ్ణి తన వశం చేసుకొని, అవ్విమర్శనకు ఎటువంటి ఆస్కారమూ, ప్రతివత్తీ లేకుండా చేసివేస్తుంది, కళాఖండంలో ఉండాలి ని కొంతరనుకొనే చిన్నచిన్న నగిషీలు ఆ ఉదాత్తతయందు నిలవలేవు. అవి

లేకపోయినే అని వ్యథపడేవాళ్ళు అప్పుడిక ఉండరు. పెద్దపెద్ద కళాకారులు, పండితులు అభిరుచి, సౌందర్యం మొదలైనవాటిని గురించి చెప్పిన నిర్వచనాలలో దేనికి ఇక్కడ ప్రసక్తి ఉండబోదు'.

ఇటువంటి ఉదాత్తతకు లక్ష్యంగా సిస్టైన్ ఆలయంలో మైకేల్ ఏంజెలో రచించిన 'ఈశ్వరుడు - దైవజ్ఞస్త్రీలు' అనేదాన్ని రెయ్‌వాల్డ్స్ పేర్కొన్నాడు.

**substandard** : *న్యూన ప్రమాణం.*

**substitute** : *ప్రత్యామ్నాయం.*

**subtractive colour** : చూ : **colour.**

**subtractive system** : *తీసివేత పద్ధతి; వ్యవకలన పద్ధతి.*

**suede effect** : *పార్శ్వ ప్రభావం.*

ఒకే తైలవర్ణంతో పక్కపక్కనే అడ్డంగా గీసిన కుంచెగీతలలోని వర్ణప్రభావాల పరీశీలనలో కనపడే శాశ్వత విభేదం.

**sumi** : *సూమీ.*

జాపనీయ సిరా; దీనినే నల్లటి నీటిరంగు అనికూడా వ్యవహరిస్తారు.

**Sunday painter** : *వైకాలిక చిత్రకారుడు.*

ఓటుసుపోకకై లేదా ఒక వ్యాసంగంగా చిత్రలేఖనాన్ని సాగించే అతడు. పదో వేరొక వృత్తిని జీవనార్థమై గ్రహించి, సెలవురోజులలోనూ పనిలేని సమయాలలోనూ చిత్రలేఖనాన్ని అతడు సాగిస్తాడని దీనిలో భావం.

**sunfast** : *ఎండమన్నిక (రంగు)*

**sunflower yellow** : *సూర్యకాంత పీతం.*

చీనీయుల చిత్రణలో వాడుకలో ఉన్న ఉజ్జ్వలమైన మధ్యస్థపు పసిమి వర్ణద్రవ్యం; హరితాళంనుంచి దీన్ని తయారు చేస్తారు.

**sunk relief** : *గర్భితోల్బణం.*

(చూ : **relief.**)

**sun-refined oil; sun thickened oil** : *రవిశోధిత తైలం; ఘర్మసాంద్రీకృత తైలం.*

పైవి రెండూ, సాంద్రాతసీ తైలంలో రెండు రకాలవి. అవిసెనూనెను నీటితోచేర్చి ఒక సీసాలో ఉంచి, ఆ సీసాపై సూర్యుని కిరణాలు నేరుగా వచ్చిపడేట్లు కొన్ని వారాల పర్యంతం ఏర్పాటుచేసి, అప్పుడప్పుడు ఆ సీసాను అటూఇటూ బాగా కుదుపుతూ ఉంటే చివరకు అందులో నూనె తెల్లబడి, స్వచ్ఛముగా కల్మషాలన్నీ కిందినీటిలోకి దిగజారిపోతాయి. ఇట్లా స్వచ్ఛత చెందినదాన్నే రవిశోధిత తైలం అంటారు. దీన్నే ఒకపళ్ళెంలో పోసి, గాలితగలనిస్తూ కొంతకాలం ఉంచితే అది ఆక్సీకరణ చెంది, తేనెలాగా చిక్కపడుతుంది. అప్పుడు దాన్ని ఘర్మ సాంద్రీకృత తైలం అంటారు. ఒక కోషకతైలాన్ని

ఎండలో ఉంచి సంస్కరించే అలవాటు. తైలచిత్రణ మొదలైన కాలంనుంచికూడా అమలులో ఉన్నది. ప్రాచీనకాలపు కొన్ని చిత్రగ్రంథాలూ శాస్త్రగ్రంథాలూ ఈసంస్కరణ పద్ధతులను గురించి సవిస్తరంగా పేర్కొన్నాయి. చిత్రరచనా మాధ్యమాలలో సాంప్రదాయికంగా వాడుకలో ఉన్న ఒక సాధన ద్రవ్యంగా రవిశోధిత తైలానికి మన్ననఉంది. కాని ఎటువంటి వివర్ణతకూ లోనుగాకుండా ఉండటంలో మేలితైలంకన్నా రవిశోధిత తైలం తక్కువ గుణం కలదని ఆధునికుల అభిప్రాయం, మేలితైలంకన్నా ఎక్కువ వేగగతితో ఈ తైలం ఆరిపోతుంది.

ఇక ఘర్మ సాంద్రీకృత తైలాన్ని వాడినప్పుడు కుంచెవిసురు లాంతనములు అట్టే నిలిచిఉండటం ఎక్కువగా ఉంది. మేలి తైలాల వాడుకలో కనపడే సున్నితనం అంతగా కనపడదు ఈ ఘర్మసాంద్రీకృత తైలం సీసాలలో అమ్మకానికి దొరుకుతున్నది. అయినా రవిశోధిత తైలంలాగానే దీన్ని స్వైరం ఇంటివద్దనే తయారుచేసుకోవచ్చు. కళాకారులు తామే స్వయంగా పూనుకొని సంస్కరిత తైలాలను చేసుకోవటానికి వీలుగా ఉండేవి ఈ రెండు ప్రక్రియలు మాత్రమే

**Superba White** . సువర్బావైట్.

సమ్మిశ్రిత శ్వేతవర్ణానికి వ్యాపారనామం.

**super realism** : చూ : **surrealism.**

'సర్రియలిజం' అనేదానికే పర్యాయపదంగా అరుదుగా ఆంగ్లంలో వాడబడేపదం.

**support** : అవలంబనం; ఆధారం.

ఒక చిత్రణలో, పూతపొర లేదా భూమికకు దిగువఉండే నిర్మాణ విశేషం. సర్వసాధారణంగా అవలంబనంగాఉండేది, చాచిపరచిన నారబట్టిక, కలంపట్టాలూ, దధిమూర్ఖ పర్ణాలూ కొయ్యపలకలు, లేదా గట్టి అట్టలు అవలంబనాలుగా ఉపకరిస్తాయి ఒక్కొక్కప్పుడు ఇటువంటి అవలంబనాలపై చిత్రీకరణ జరపటంకూడా ఉంది. నీటిరంగులకు, గహనవర్ణాలకు పిష్టవర్ణాలకు కాగితాన్ని అవలంబనంగా వాడతారు.

**suprematism** : *పారమ్యవాదం; పారమితావాదం.*

రష్యాదేశంలో కాజిమిర్ మేలేవిచ్ (1878-1935) 1913లో ప్రపంచించిన ఒక కళావాదం దాని వివరణపత్రం (*manifesto*) 1915లో ప్రకటితం స్థూలతావాదంనుంచి ఉత్పన్నమయిన ఈ పారమ్యవాదం అచ్చంగా అవస్తుగతం (*non objective*). ఇందులో మౌలిక జ్యామితీయ రూపాలనూ, సరళవర్ణాలనూ వాడేవి. చిత్రరచన అంతా 'స్వచ్ఛ భావనాగతి'ని ఆశ్రయించి సాగేది. 'తెలుపుపై తెలుపు' అనే అర్థమిచ్చే పేరుగల తన రచనలో ఈవాదపు పరాకాష్ఠను ప్రదర్శించిన మేలేవిచ్ మాత్రమేగాక, ఇంకాచాలామంది ఈ వాదానికి వ్యాప్తిని సమకూర్చారు వారిలో ఒకడు

అలెగ్జాండరు రాడ్ చెంకో (జ 1891), ఈతడు రచించిన 'నలుపుపై నలుపు' అనే చిత్రం సుప్రసిద్ధం. ఇంకా నిర్మాణవాదం (*constructivism*)తో సంబంధంగల చిత్రకారులు చాలామంది ఈ వాదాన్ని సమర్థించారు. 1922లో రష్యాలోని సోవియెట్



పారమ్యవాదం . పారమ్యవాదీయ సంరచన (ఎగురుతున్న విమానం); కాన్వాసుపై తైల వర్ణ రచన [1914], రచయిత - కాజిమిర్ మేలేవిచ్.

ప్రభుత్వం వివిక్త, ప్రాయోగిక కళావాదాలలో కృషిని నిషేధించింది. అంతట ఈ వాదావలంబకులలో ఎందరో దేశాన్ని వదిలిపెట్టిపోయారు. వారిలో కొందరు పారిస్ నగరానికి చేరి, తర్వాతి కాలంలో జ్యామితీయ వివిక్తత, క్రమవికసనం పొందటానికి తోడ్పడుతూ కాలం గడిపారు.

**surface** : ***తలం; ఉపరితలం; పరితలం.***

**surface - active agent or surfactant** : ***తలవర్తిని.***

శుభ్రం చేయటానికి, తడవటానికి, వికీర్ణం చేయటానికి వాడే కొన్ని ద్రవ్యవర్గాలలో దేనికైనా ఈ పేరు వర్తిస్తుంది.

**surface colour** : *తలవర్ణం*

1. పైభాగపు పూతయొక్క వర్ణం; వస్తువుకు మొత్తానికి వాడబడే రంగుకన్నా ఇది వేరైనది.

2. ప్రతిఫలిత కాంతిలో, ఒక వస్తువు యొక్క ఉపరితలంలో వేద్యమయ్యే వర్ణ ప్రభావం

**surface tension** : ***తలతన్యత.***

ఒక ఉపరితలంపై సమరీతిలో వ్యాపించక, ఒక ద్రవపదార్థం అక్కడక్కడ చిన్న చిన్న బిందువులుగా ఏర్పడే స్వభావం.

**surimono** : *సురిమోనో.*

జపానీయ చిత్రకారులు - అందునా ముఖ్యంగా ఔత్సాహికులు-సంవత్సరాది, జననం, పెండ్లి, లేదా నామపరివర్తనంవంటి ప్రత్యేక సందర్భాల సంస్మరణోత్సవాలలో రూపించే రంగుల అతివిచిత్రపు ముద్రాంకం.

**surrealism** : ***అధివాస్తవికతా వాదం.***

ఇరవయ్యో శతాబ్దపు ఇరవైలలోనూ తర్వాతనూ ప్రచలితమైన ఒక కళోద్యమం.

సర్జన కృషికి మూలమైన అంతశ్చేతన (*subconscious*) కువిశృంఖలతను కల్పించి సాంప్రదాయిక వాసనలనుంచి చిత్రరచనాశ యాలకు విముక్తిని చేకూర్చటానికి ఈ వాదాన లంబకులు కృషి చేస్తారు. డాడావాదానికి ఇది అనుగామి కావటంవల్ల, ఇందులో ఆ వాదపు సాంకేతిక ప్రక్రియలు-ప్రాప్త వస్తు పద్ధతిని అవలంబించుట మొదలైనవి- తావు కల్పించుకొన్నాయి. డాడావాదంతో పాటుగా ఇందులో కృషి సాగించిన వారిలో ఎర్నెస్ట్ ఆర్ప్, పికేబియాలున్నూ ఉన్నారు. జోన్ మీరో (జ. 1893) అనే అతడు ఒక విధపు వివిక్త అధివాస్తవికతావాదాన్ని అమ లుకు తెచ్చాడు. ఇంకా పలుమార్పులను ఈ అధివాస్తవికతావాతం పొందింది. అనపేక్షిత ములైన వివిధ వస్తువులను, లేదా ప్రకరణా లను పక్కపక్కన ఒక సంభ్రమజనకపు కాల్ప నిక వాతావరణంలో, స్వాప్నిక దృశ్యసంభ గిత వరిస్థితులలో ఉంచటం అందులో ఒకటి. ఇట్లా హేతువాద విరుద్ధములై-కొన్ని సంద ర్భాలలో అసహ్యభావన సైతం కలిగించేవైన- స్వాప్నిక ప్రపంచ దృశ్యాలను ప్రదర్శించే చిత్రాలను రచించినవారిలో ప్రముఖులు సాల్వ దార్ డాలీ (జ. 1904), జార్జియో డి చిరికో (జ 1888).

**surrealist** : అధివాస్తవికుడు.

**surveyor** : సూత్రగ్రాహి.

**Sussex marble** : ససెక్స్ చలువరాయి.

గవ్వ చలువరాయిలో ఒక రకానికి చెందింది, ఆంగ్లదేశంలో లభిస్తుంది. చలవ రాతి శిల్పంలో దీనివాడుక ఉన్నది.

**Swag** : చూ: festoon.

**Swedish green** : స్వీడియ హరితం.

కోబాల్టు హరితానికి పర్యాయనామం.

**symbolic** : ప్రతీకాత్మక.

**symbolism** : ప్రతీకవాదం.

1885 మొదలుగా కొందరు చిత్రకారుల లోను, శిల్పులలోను అక్కడక్కడ అవ్యవస్థిత రూపంలో జ్ఞాతమైన ఒక కళోద్యమం, లేదా కళావైఖరి. ఫ్రాన్సు దేశంలో సాహిత్యంలో అప్పట్లో చోటు చేసుకొన్న ప్రతీకవాదానికి సన్నిహితంగా ఇది ప్రవర్తిల్లింది. అనుభావనా వాదానికీ, వాస్తవికతా వాదానికీ ప్రతిక్రియగా ఈ వాదం రూపొందిందని చెప్పవచ్చు. వాస్త వికతావాది అయిన కోర్బే తన వాదాన్ని సమ ర్థిస్తూ'చిత్రలేఖనంఅచ్చంగారూపాత్మకం.వాస్త వాలూ,అస్తిత్వం కలిగినవీ అయినవాటినే అది రూపించగలుగుతుంది. వివిక్తమగు (రూవం నుంచి విడివడ్డ) వస్తువు చిత్రలేఖనపు వరిధి లోకి ఏనాటికీ రానేరాదు' అని అన్నాడు. దీన్ని ఖండిస్తూ ప్రతీకవాదపు వివరణ పత్రాన్ని, 1886 సెప్టెంబరులో జేన్ మోరే ప్రచురించి అందులో కళయొక్క ఏకైకధ్యేయం భావనకు సౌందర్య రూపాన్ని కల్పించటమే అని వివరించాడు. భౌతిక, ఆధ్యాత్మిక జగ

త్రంల సమన్వయమే ప్రతీకవాదపు లక్ష్యం. ప్రతీకవాదపు ప్రాతిపదికను విశదముగా ఆల్బర్ట్ ఆరియెర్ అను విమర్శకుడు వివరించెను (జ.1891) ఈ ప్రతీకవాదులు ఒకకొత్త చిత్రశైలిని దేన్నీ రూపొందించినవారుకారు తమకు తోచినరీతిగా వివిధశైలులనుండి కొన్నికొన్ని ప్రత్యేక విషయాలను గ్రహించి, తమ వ్యక్తిగత రీతులను అందుకు వారు జోడించారు. కాల్పనికభావనలను తాంత్రికచిహ్నాలద్వారానో లేదా మతవిషయకమైన ప్రోత్సాహకత ద్వారానో రూపించటంలోనే వీరు ఆసక్తి వహించి, కళాత్మకతను రూపాలలో ద్యోతకం చేయటానికి అంతగా శ్రద్ధ వహించిన వారు కారు.

**synchronism** : సమవర్ణవాదం.

(చూ : orphism)

**synonym** : పర్యాయపదం.

**synthesis** : సంయోజనం.

**synthetic** : సంయోజిత.

**synthetic cubism** : సంయోజిత స్థూలతావాదం. (చూ: cubism)

**synthetic organic pigments** : *సంయోజిత కార్బనిక వర్ణ ద్రవ్యాలు.*

బొగ్గుతారును అభిషవనం చేసినప్పుడు లభించే ఉత్పన్నాలను ముడిసరుకుగా గ్రహించి, వాటినుండి తయారుచేసే వర్ణ ద్రవ్యాలు.

**Syrian art** : *సిరియా కళ.*

సిరియాదేశంలో ప్రాచీనకాలమునందు ప్రవర్తిల్లిన కళావిశేషం. క్రీ.పూ. 8000 సంవత్సరాల క్రిందటనే ఆదేశంలో ఉత్తర ప్రాంతంలో వసించిన హిట్టియిటులలో ఉన్నత స్థాయిలో కళావికసనం సాగిందని అక్కడి తవ్వకాలలో బయటపడ్డ కళాఖండాలవల్ల తెలుస్తున్నది. ఆ కాలానికి దరిదాపులలోనే, మెసొపొటేమియాలోని సంస్కృతితో సిరియా వాసులకు పరిచితి కలిగిందనటానికి నిదర్శనాలున్నాయి. క్రీ.పూ. 2000–3000 మధ్య సిరియా దేశంలో సాగిన కళావికసనాన్ని గురించి ఏమీ తెలియరాకపోయినా ఆతరవాత ఈజిప్టుతోకూడ అక్కడివారికి పరిచితి ఏర్పడి, ఆనాటి కళలో ఈజిప్టు ప్రభావం ప్రవేశించింది. క్రీ.పూ 9వ శ. నుండి 7వ శతాబ్ది వరకు అస్సీరియన్ సైన్యాలు ఈ దేశంపై దండయాత్రలు జరిపి, దేశాన్ని వశపరచుకోవటంతో అక్కడి ప్రాచీన కళాకృతులు నశించాయి.

# T

**Table** : మేజాబల్ల.

**Table easel** : మేజా సారణి.

ఒక మేజామీదనో, వ్రాతబల్లమీదనో, లేక పనిబల్లమీదనో ఉంచి పని చేసుకోవటానికి అనువైన రూపరేఖతో నిర్మితమైన



మేజా సారణులు

చిన్నరకపు సారణి. ఇటువంటివి ఎన్నో రకాలవి ఉన్నాయి. చట్రము అమరింపు దీర్ఘ చతురస్రాకారంగానో లేదా తరచు త్రిభుజాకారంగానో ఉండేటట్లు, మేజాసారణి కొయ్యతోనో లోహంతోనో నిర్మితమవుతుంది. దానికి మధ్య ఒక నిలువుకడ్డీ, ఆ కడ్డీకి సంధించి ఒక అనుదు కడ్డీ ఉంటాయి. ఈ అనుదు కడ్డీని కావలసిన కోణప్రమాణంలో అమర్చే వీలు ఉంటుంది. కాబట్టి సారణిని కావలసిన వంపులో ఉంచుకోవటం సాధ్యమవుతుంది. వీటిలో అత్యంత సరళ నిర్మాణరీతి కలిగిన వాటిలో చట్రపు అడుగున వెడల్పు తక్కువ శరావం ఒకటి అమర్చబడి ఉంటుంది. ఇందులో కాటికనుగాని, ఆస్తరికనుగాని ఉంచుకోవచ్చు. తక్కిన రీతుల మేజాసారణులలో నడికడ్డీకి జతపరచి జారుడు కుండలిక (*sliding bracket*) ఒకటి ఉంటుంది. ఇందువల్ల పైపై పునదిగింపు సాధ్యమవుతుంది. మేజాసారణులనుకావలసినప్పుడు మడచి, సులభంగా తోడ్కొనిపోవచ్చు; లేదా పెట్టెలో పెట్టుకోవచ్చు.

**Table knife** : బత్తాయి చాకు.

**taboret** : మంజూష.

కళాకారుడు వాడుకొనుటకై-ఆలేఖనపు మేజావద్దనో, సారణివద్దనో-ఉంచబడే ఒక విధపు

పెట్టె. దానిపైన వర్ణఫలకాన్ని. తదితర పరికరాలను ఉంచుకోవటానికి అవకాశం ఉంటుంది. దానిలో తూలికలను, రంగులను, ఇంకా కొంత సామగ్రిని పెట్టి ఉంచటానికి సొరుగులును, తరచుగా అవసరం ఉండని వాటిని నిలువ ఉంచుకోవటానికి ఒక అల్మయిరాయును, వెనుకవైపున కాగితపు బొత్తాను, ఆస్తరికలను ఉంచుకోవటానికి ఏర్పాట్లును ఉంటాయి.

**tachisme** : *టాచిస్మే*.

(చూ : **action painting**)

చలచ్చిత్రణ (***action painting***) అనే దానికి పర్యాయరూపమైన ఫ్రెంచి భాషా పదం,

**acking iron** : *అతుకు పెట్టె*.

అలేవ సమారోపణంలో వాడుకలో ఉండే చాలా సన్నని ఒక రకపు ఇస్త్రీపెట్టె. విద్యుత్సహాయంతో ఇది పనిచేస్తుంది.

**tactile values** : *స్పర్శ్యామూల్యాలు*.

పునరుజ్జీవన యుగపు చిత్రాలలో చాలా వాటిలో ఉన్నట్టుగా కనపడే వాంతవత, లేదా స్పర్శవేద్యతవంటి వాటిని వివరించేటప్పుడు వాడే ఒక పదవిశేషం. ఆంగ్లంలో ఈ 'టాకెయిల్ వాల్యూస్' అనే పదాన్ని తాను రచించిన 'ఇటాలియన్ పెయింటర్స్ ఆఫ్ రినైజాన్స్' అనే గ్రంథంలో మొదటిసారిగా బెర్నార్డ్ బెరెన్‌సన్ అనే రచయిత ఉపయోగించాడు.

**Talc** : *శృంగశిల; గిరికామలం*.

సహజసిద్ధంగా లభించే ఒక విధపు శిల; దీని రాసాయనిక నామం మెగ్నీషియమ్ సిలికేట్. దీన్ని పొడచేసి, రంగుతో కలిపి పూరకంగా వాడతారు.

**tamp** : *ఘట్టింపు*.

కల్పకంతో పోతపని నిర్వహించేటప్పుడు కరువులోనికి బరువుగా ఉండే కల్పక మిశ్రమాన్ని గట్టిగా ఒత్తి చొప్పించటం.

**tan (colour)** : *శ్యావ* (వర్ణం)

**Tanagra figurines** : *తనగ్రా ప్రతిరూపికలు*.

ప్రాచీనపు గ్రీసుదేశంలో నిర్మితములై నేడుకూడా కానవచ్చుచున్న చిత్రితములగు చిన్న ప్రతిమలు; మట్టితోచేసి పైనగుద్దయతికిన బొమ్మలివి.







తనగ్రా ప్రతిరూపికలు : తప్తమృత్తికా మూర్తికలు; క్రీ.పూ. 4వ శతాబ్దిలో తదనంతర సన్నిహిత కాలానికి చెందినవి.

**tapestry** : చిత్రాంబరం.

**tapping** : తాటింపు; తట్టటం; ఆహననం.

చిత్రలేఖనంలోని ఒక పారిభాషిక పదం; చిత్రపు ఉపరితలానికి తూలికయొక్క కొన దగ్గరగా ఉండేట్లు నిలువుగా ఉంచిచేసే ఆపతనం వంటి వాటిలో సాగేపని.

**tar** : తారు.

పెట్రోలియమ్‌ను, రాక్షసిబొగ్గును, యక్ష్ రూప దారువులను అభిషవనం చేయటంవల్ల అవశిష్టోత్పన్నంగా లభించే ఒక నల్లటి, జంక సాగుడు పదార్థం.

**tarnish** : మలినీకరించు.

ఒక ఖనిజపు, లేదా లోహపు ఉపరితలాన్ని ఒక రాసాయనిక ప్రక్రియవల్లగాని, కిట్టపటలమును దానిపై ఏర్పరచిగాని మసక పరచటం, లేదా వివర్ణీకరించటం.

**tau cross** : టౌ శిలువ.

**t – chisel** : అడ్డఉలి

ఒక విధమైన ఉలి. దీని పిడికి అడ్డుగా ఉలి అంచు ఉభయపార్శ్వములలోను వుంటుంది. అందువల్ల ఇది రోమన్ లిపిలోని 'టి' అక్షరాన్ని పోలివుంటుంది.

**teacher** : ఆచార్యుడు

**tear drops** : బాష్పబిందువులు

నిట్టనిలువుగా చిత్రణను వుంచి, పలచని పూతరంగును లేదా బొమ్మవార్నిషును పట్టించేటప్పుడు, ఏర్పడటానికి అవకాశంగల ఒక దోషం. ఆ వార్నిషుగాని, పలచని రంగుగాని కిందకు దిగజారి, బిందువులుగా రూపొంది గడ్డకట్టటం ఇందులో జరుగుతుంది. అప్పుడవి, కిటికీకి అమర్చిన గాజు పలకపైపడిన వర్షపు నీటి బిందువులను పోలివుంటాయి.

**technical illustrator** : సాంకేతిక వ్యాఖ్యాకర్త

**technical mastery** : సాంకేతిక కుశలత

**technique** : సాంకేతికత; సాంకేతిక ప్రక్రియ; తకినిక

1. మాధ్యమాన్ని ఉపయోగించుకోవటంలో కళాకారుడు ప్రదర్శించే చేతి కుశలత, సాధన ద్రవ్యసంపత్తిపై అతనికిగల పని తనపు పటిమ, వీటికి తోడుగా తన కళను గురించి అతనికిగల సమగ్ర పరిచయం–ఇవి అన్నీ చేరి సాంకేతికత, లేక సాంకేతిక ప్రక్రియ అనబడుతున్నాయి. తాను ఉద్దేశించిన సౌందర్యస్ఫోరకతను తీసుకొనిరావటానికి కళాకారుడు–వర్ణసంయోజనము, వర్తికాభంగము అనేవాటిపై ఆధారపడతాడు. ఇటువంటి సాంకేతిక ప్రజ్ఞను స్వీయం చేసుకోవటా

నికి ఒక కళాతపస్వి దగ్గర అంతేవాసిత్వం, లేదా వృత్తిగా కళనభ్యసించే వ్యక్తి దగ్గర శిక్షణ అవసరమని సామాన్యంగా భావించటం యథార్థమే అయినా సహజ కల్పనాచాతుర్యంగల కళాప్రజ్ఞ అందులో మేళవించినప్పుడే అది రాణించగలదు.

2. చిత్రలేఖనం, శిల్పం-ఇంకా తదితరములైన అటువంటివే అయిన వాటిలో భావప్రకటనకై అవలంబించే ఒక నిర్దిష్ట పద్ధతి. కలల వర్ణప్రక్రియ, ద్యుతికల్పన మొదలైనవి ఇటువంటివే.

**echtiform** : *ధామరీతి*

ఇంటి ఆకారంలో ఉండే రచన.

**elamon** : *స్తంభవర్షణి.*

పురుషరూపంలో నిర్మితమైన ఒక భవన స్తంభం; స్త్రీ రూపంలో ఉండే ఇటువంటి దానిని 'స్తంభకన్య' అంటారు. టెలమాన్ అనేది లాటిన్ పదం. గ్రీకులు ఇటువంటి స్తంభాలను 'అట్లాంటిస్' అని వ్యవహరించారు.

**emmoku or temmoku** ; *తెన్ మోకు.*

ఒక విధమైన జపానీయ కులాల సామగ్రి; నల్లగానో, లేదా ముదురు గోధుమగానో ఉండే ఈ సామగ్రిపై సరళద్యుతికం అమరుస్తారు.

**emper** : *పదనుపెట్టటం; పరివేంచటం.*

1. పునరుజ్జీవన కాలంలో, వర్ణద్రవ్యాలను, తగిన బంధకం లేదా వాహకంతో కలిపి పూతకు అనువుగా చేయటానికి ఈ పదం వాడబడేది. ఇట్లా పదను పెట్టబడిన పూత రంగులు, సద్యస్క ప్రక్రియలో వాడే రంగులకు విభిన్నంగా ఉండేవి. సద్యస్కములలో పదనుపెట్టబడిన రంగులు (అంటే టెంపరు చేయబడినవి) వాడేవారుకారు. క్రమంగా ఇటువంటి రంగులకు టెంపెరా (కలల) అనేపేరు వచ్చింది.

2. ఒక లోహపు గట్టితనాన్ని, పటిమను క్రమబద్ధం చేయటానికి జరిపే ప్రక్రియను కూడా 'పదను పెట్టటం' అనే అంటారు. లోహ పరికరాన్ని లెస్సగా కాల్చి, తగిన సమయంలో నీటిలో తటాలునముంచి చలార్చగా, అది పదనెక్కుతుంది. పదనెక్కిన లోహం తొలుతటి దానికన్నా మెత్తగా ఉంటుంది, కాని అందులో పెళుసుదనం తక్కువ; పటిమ ఎక్కువ.

**tempera** : *కలల ప్రక్రియ; జిగురురంగు కలలవర్ణము; నిర్యాసిక వర్ణం.*

నీటిలో సులభంగా కలియగల ఒకదుగ్ధకాన్ని వాహకంగా-అందునా ప్రముఖంగా నీటితో కలసిన గుడ్డుసొనే దుగ్ధకవాహకంగా-ఉపయోగించి అందు రంగులను వికీర్ణం చేసి సాగించే చిత్రణ ప్రక్రియ. ఇటువంటి కలల వర్ణాల వాడుక మధ్య యుగంలో యూరపులో మొదలైంది. 15వ శతాబ్దిలో తైల చిత్రణ పరిపుష్టతను అర్జించేవరకూ పారతి

చిత్రణలో ఈ కలల ప్రక్రియయే ముఖ్యమైన ప్రక్రియగా ఆదరణ పొందింది. ఈ కలంలో వాడే వర్ణద్రవ్యాలను మొదట నీటితో సరిపాకపు ముద్దగా నూరి, జాడీలలో పెట్టి పైనకొద్దిగా నీరు జల్లి, జాడీలను మెలిచుట్టు మూతలతో బిగిస్తారు. చిత్రణకై రంగు కావలసినప్పుడు, రంగుముద్దను జాడీనుంచి కొంత తీసుకొని దానికి సరిపడే ప్రమాణంలో గుడ్డుసొనను దానికి కలిపి, అప్పటికి కావలసిన పూతరంగును చిత్రలేఖకుడు తయారు చేసుకోవడం జరుగుతుంది. అయితే కొందరు కళాకారులు కృత్రిమపు దుగ్ధకములను - నిర్యాస కలలము లేదా గుడ్డునూనె కలలము వంటి వాటిని-అవి ఉత్పన్నములు చేయగలిగే విశిష్ట లక్షణములను, పరిణామములను దృష్టిలో ఉంచుకొని ఉపయోగిస్తారు చక్కగా గ్రసనశక్తిగల అప్పపు పూత కలిగిన ఫలకంపై ఎర్రశేబిల్ రోమాల కుంచెనువాడి ఇటువంటి చిత్రణను సాగిస్తారు. చిత్రణంలో సాధ్యమైనంతవరకు ఎల్లప్పుడు తులికాగ్రమునే వాడతారు. దశాంతరాలను తెలిపే రేఖానర్తనకుకూడా ఇందులో తూలికాగ్రమునే వాడతారు కలల వర్ణమూలందు మేళనం జరగనేరదు కాబట్టి ఇటువంటిది సులభసాధ్యం చిత్రలేఖనంలో రేఖాబద్ధ శైలులకు ఎక్కువగా కలల ప్రక్రియ తగిఉంటుంది. ఇంక ఏ ఇతర ప్రక్రియన్లనూ ఈ ప్రక్రియవల్ల సాధించే మృదుదీప్త వర్ణలక్షణత కలగనేరదు. ఈ రంగు వేసిన వెంటనే ఆరి, పూత పొర జల్లు వలిరోధిగా తయారవుతుంది. వేసిన తరవాత ఎనిమిది నెలలకు పటలం అసాధారణ పటిమను ఆర్జించి, మన్నికను ఎక్కువ చేసుకోవటంవల్ల, శతాబ్దాల తరబడిగా ఆచిత్రంలో ఎటువంటి లోపాలూ పొడచూపవు; అయితే దీనికి రంగును తొలుత క్రమపద్ధతిలో తయారుచేసుకోవటం తప్పనిసరి. కలల పటలానికి వార్నిషుపూత అవశ్యకంకాదు, గ్రసనశీలమైన దూదిని ఉపయోగించి చిత్రంపై ఘర్షణను జరిపి, చిత్రానికి పట్టులాంటి తుదితీర్పును కలిగించవచ్చు.

కలల లేపములకు ఉపయోగించే ద్రవ్యాలు రోమనులకూ ప్రాచీన ఈజిప్టువాసులకూ తెలిసినవే. వీటిని వారు లేపాలకు బంధకాలుగా వాడారు. ప్రాచీన గ్రీకులుకూడా - గుడ్డుసొన, పాలు. బంకలు. జిగురులు మొదలైన బంధకాలను నీటిరంగులతో కలిపి వాడేవారని భావించేవారున్నారు. అయినా ఇందుకు తగిన ప్రామాణికాధారం ఏది లభించటంలేదు. ఇది ఎట్లున్నా 'కలల ప్రక్రియ' అని నేడు మనం వ్యవహరించేది, బైజాంటైన్ చిత్రణలో అపరిణత రూపంతో మొదట పొడచూపిందని భావించవచ్చు; అయితే ఆ నాటి చిత్రకారులు అందుకై వాడిన ద్రవ్యవిశేషాలు మనకు తెలియటంలేదు. తరవాత 14, 15 శతాబ్దాలలో ఈ ప్రక్రియ సుసంస్కృతమై, ప్రామాణికతను ఆర్జించి, పునరుజ్జీవన యుగపు తొలిఘట్టపు చిత్రకారులైన జియోట్టో, సిమాబూ, డుచ్చియో, లారెంజెట్టి సోదరులవంటి ప్రముఖుల కృషివల్ల రాణకెక్కి, ఫ్రా ఏంజిలికో,

చొన్నెసెన్ని రచనలలో సాంకేతిక ప్రజ్ఞా నిపుణతను అందుకొన్నది. 16వ శతాబ్దంలో కళలలో వచ్చిన క్రమగత పరిణామాలు కొత్త ఆకాంక్షలకు దారులుతీయగా, అందుకు కలం ప్రక్రియ సమర్థం కాకపోయినందువల్ల కళాకారులు మొదట్లో తైలద్యుతులను, తైలగుణం కలిగిన కొన్ని పూతరంగులను మధ్యస్థములైన ప్రక్రియలకై వాడటం ప్రారంభించారు. ఈ వాడుకయే క్రమశః, తైలవర్ణ చిత్రణకు దారితీసింది.

కలంప్రక్రియా పునరుద్ధరణ 19వ శతాబ్ది అంతంలోనూ 20వ శతాబ్ది ఆరంభంలోనూ జరిగింది. ముఖ్యంగా ఇంగ్లండు, జర్మనీ, యునైటెడ్ స్టేట్స్‌లలో, కళాకారులు తాము సాగించే చిత్రణలకి - అన్నిటా ముఖ్యంగా కావ్యచిత్రణకు - ఎక్కువగ తగినది కలంమే అని గుర్తించి ఈ పునరుద్ధరణకు తోడ్పడ్డారు. నాడు మొదలుగా కృత్రిమ దుగ్ధకముల తయారీకై వివిధ యోగవిధులు క్రమక్రమంగా రూపొందాయి. ఇటువంటి దుగ్ధకములు పరిమిత ప్రమాణాలలో లభిస్తున్నా, సాధారణంగా కలం ప్రక్రియను అభిమానించే కళాకారులలో పలువురు, తమకు అవసరమైన ప్రమాణంలో గుడ్డుసొనను, లేదా ఇతరములైన దుగ్ధకములను తామే స్వయంగా తయారు చేసుకొంటారు. పూర్వులు వ్రాసిన సాంప్రదాయిక కలం ప్రక్రియారీతులను వారు సమగ్రంగాఅనుశీలించి,తమకుకావలసినవచ్చిన దానిని గ్రహిస్తారు. ఇటాలీయ కలంప్రక్రియ విషయాలను గ్రహించటానికి ఎక్కువగా ఉపకరించేది, 'ఇల్ లైబ్రో డెల్ ఆర్టె' అనే గ్రంథం. దీన్ని రచించిన అతడు సెన్నినో సెన్నిని. 14, 15వ శతాబ్దాలలో జీవించిన ఈ ప్రముఖ చిత్రకారుడు, జియోట్టోయొక్క చిత్రాగారం (*studio*) సమగ్రంగా పరిశీలించి, విషయగ్రహణ చేసినవాడు.

'కలంము' అనేది నేడు అక్కడక్కడ అపార్థనకంగాకూడా వాడబడుతున్నది. గహన వర్ణములను తదితర కాంతిభేద్య జలవర్ణాలను తైలవర్ణాలనుండి, అవి వేరైనవని స్పష్టీకరించటానికి-కలంములని, గ్రంథ చిత్రకులను, వాణిజ్య కళాకారులను వ్యవహరించటం పరిపాటి. మందిరకపు ప్రపత్రి వర్ణాలను ఉంచి అమ్మే డాడీలపై ఆ వర్ణాల విక్రేతలు, 'కలంము' అనే పేరును అతికించటం కూడా ఉంది. అయితే అచ్చపు కలం వర్ణాలు నాళికలలో మాత్రమే ఉంచబడి, కొనటానికి లభిస్తాయి. ఫ్రెంచి భాషలో టెంపెరా (కలంము), డిస్‌టెంపర్ (జిగురురంగు) అనే రెండిటికిన్నీ 'డి ట్రెంపే' అనే పేరు ఉండటం వల్ల, ఫ్రెంచి భాషనుండి గ్రంథాలను అనువదించేవారు సామాన్యంగా తబ్బిబ్బుచెంది, తప్పుదోవ తొక్కుతున్నారు

**tempera emulsion** : *కలల దుగ్ధకం.*

**tempering** : *శామనం*

**Template** : *ప్రతిరేఖిక; అవలంబిక*

కొన్ని ప్రామాణిక ఆకారరేఖలను, ప్రతీకములను అభిలేఖించటానికి మార్గదర్శిగా లేదా

ఆదర్శకంగా వర్తించి రేఖాకర్తకు ఉపకరించే పరికరం. ఇది పలుచనైన ఒక చత్వరము; సాధారణంగా బరువై స్వచ్ఛమైన కల్పకంతో తయారుచేస్తారు. ఇందులో కొన్ని కొన్ని ఆకార రేఖలతో తీసిఉండే రంధ్రాలు, వివిధ ప్రమాణాలలో; కావలసిన తీరులలో ఛేదితములై ఉంటాయి. ఒక తైజసాన్ని వాడినట్లుగానే రేఖాకర్త ఈ ప్రతిరేఖికను ఉపయోగిస్తాడు. ఒక ఉపరితలంపై దీనినుండి, అంచున ఒక పెన్సిలును జోడించి దానిపరిధిని అనుసరించి కావలసిన ఆకార రేఖలో ముందుగ పోనిచ్చినప్పుడు దిగువతలంపై అటువంటి ఆకారరేఖయే వస్తుంది. ఒక ప్రతిరేఖిక ద్వారా రూపొందే అన్ని



ప్రతిరేఖిక

జ్యామితీయంగా ఒకే తీరుగా ఉంటాయి. వాటి ప్రమాణాలలో మాత్రం వైవిధ్యం ఉంటుంది. ప్రతి రేఖికలలో వృత్తరేఖికలు, అండవృత్త దర్శినులు ఎక్కువగా దొరుకుతాయి. రేఖాకర్తలకు అవే ఎక్కువగా ఉపకరిస్తాయి. అవేగాక విశిష్టములైన ప్రతి రేఖికలు కొన్ని - వాస్తువేత్తల, అధియంతల సంజ్ఞారూపములను తెలియజేసేవి, వివిధ జ్యామితీయ రూపాలను బహువిధాలైన ప్రమాణాలలో ఒకేఒకచోట తెలియజేసేవి-కలవు. ఒకే ప్రతిరేఖికలో వృత్త, త్రిభుజ, చతురస్ర షడ్భుజముల ఆకారరేఖల ఛేదనములు ఏలుండునవియు ఇటువంటివే. ఇవి కొనటానికి బజారులో లభిస్తున్నాయి. సంగీత శాస్త్రంలోనూ గణితశాస్త్రంలోనూ వాడే వివిధసంజ్ఞారూపాలను వివిధ ప్రమాణాల్లోను, అక్షర శైలులలోను, విదేశీయ లిపిరూపములలోను ప్రదర్శించు ప్రతిరేఖికలుకూడా ఉన్నాయి.

**temparory image** : *క్షణికబేరం.*

**Ten, the** : *దశకం.*

1895లో సమష్టిగా తమచిత్రాలను ప్రదర్శించిన ఒక అమెరికన్ కళాకార బృందము తమకుతాము పెట్టుకొన్న పేరు. వీరి చిత్రాలలో కొంతకొంతగా ఫ్రాన్సుదేశపు అనుభావనావాదపు పోకడలు కన్పిస్తాయి. వీరిలో చాలామంది పారిస్‌లోని అకాదమీ జూలియెన్‌లో చిత్రకళను అభ్యసించారు. ఆ పది మంది పేరులు : ఫ్రాంక్ డబ్ల్యు, బెన్సన్ (1862-1951); జోసెఫ్ ఆర్. డీకాంప్ (1858-1923); టి డబ్ల్యు. డూఋంగ్ (1851-1938), చైల్డ్ హస్సామ్ (1859-1935); విల్లార్డ్. యల్. మెట్‌కాఫ్ (1858-1925); రాబర్ట్‌రీడ్ (1862-1929); ఎడ్వర్డ్ ఈ సిమ్మన్స్

(1852-1931), ఎడ్మండ్ సి. టార్‌బెల్ (1862 - 1938); జె. హెచ్. ట్వాట్‌మన్ (1853-1902); జె. ఆల్‌డెన్ వీర్ (1852-1919).

**tenebrism** : *తమసా ప్రక్రియ.*

నలుపురంగులో, అధఃప్రదీప్తితో చిత్రణను సాగించే ప్రక్రియ లేదా సాంకేతికత. అటువంటి చిత్రణలో ఆకృతులు ఛాయా వరివృత్తముకై ఉంటాయి. అయితే అటువంటి అంధకార దృశ్యంలో ఒక కాంతిరేఖ-ఒక రాజకీయ సంఘటనలాగా-ఎక్కడనుంచోవచ్చి అందులో కొంత కాంతిని, కొంత ఊరటను కలిగిస్తున్నట్లు అంపు కనపడేట్లు తరచుగా చిత్రితమవుతుంది. ఇటాలియన్ భాషలోని తెనెబ్రోసో (అంధకారవు లేదా విషాదమయవు) అనే దానినుండి తెనెబ్రిజమ్ (*tenebrism*) అనే పదం రూపొందింది మైకేల్ ఏంజలోవంటి ప్రముఖులైన కొందరు కళాకారుల రచనలను విమర్శించే పట్టున ఈ పదాన్ని 16, 17వ శతాబ్దాల విమర్శకులు వాడారు.

**Tennessee pink** : *తెన్నెస్సీ పాలరం.*

అమెరికాలోని ఒకవిధపు చంద్రోలం. శిల్పానికి ఇది చాలా తగి ఉంటుంది.

**term** : *నూతిక.*

చతుష్కోణకమై, కింది కి దిగినకొద్దీ సన్నబడుతూ, పైభాగంలో శీర్షశిల్పాన్నో, ఉరస్కశిల్పాన్నో కలిగిఉండే స్తంభవిశేషం, దీనికి అగ్రమూర్తిక (*terminal figure*) అనే పేరుకూడా ఉంది.

**terminal figure** : *అగ్రమూర్తిక.*

**terra alba** : *మృత్తికాశ్వేతం.*

జిప్సం అనే మృత్తికా విశేషానికి పర్యాయనామం అయితే ఇది శ్వేతమృత్తిక (*white earth*) మాత్రం కాదు.

**terrace or terrase** : *వైకల్యం*

శిల్పంలోగానీ, రాతిచెక్కడులోగానీ, అందులై వాడినచలువరాతిలో ఒక్కొక్కప్పుడు కనపడే దోషవిశేషం. ఘాత (*steen*) కూడ ఇందేదెక్కకు వస్తుంది. ఇదిఉన్నచోట గుంట చేసి సిమెంటుతోనింపి, ఆదోషాన్నిచక్కజేసే వీలుంది

**terra-cotta** [1] : *తప్తమృత్తిక; మృద్వికారం.*

బాగా వేడిచేసి, లేదా ఆవంలో కాల్చిన మృత్తిక, సాధారణంగా ఇది గోధుమవాక ఎరుపురంగులో ఉంటుంది. మాత్రవ శిల్పులును, కుంభకారులును, కివ్పులు పెంకుల నిర్మాతలును ఈ పనికి సంబంధించినవారు. ఆకృతిరచనకూ ఆవంలో కాల్చటానికీ అనువుగా ఉండే ఏ విధపు మృత్తికనైనా తప్త మృత్తిక అనే వ్యవహరించటము ఉంది;

అయితే లలితకళలకైన పింగాణీ మృత్తికలు ఈ లెక్కలోకి రావు.

**terra-cotta ²** : *పక్వబింబం.*

**terra merita** : *ధరాపీతం.*

కేసరంనుండి తయారై నేడు వాడుకలో లేని పసుపు రంజకం.

**terra sigillata** : *మృత్తికాంకితం.*

మధ్యధరా సముద్రప్రాంత భూమిలో క్రీ.పూ. 300 ప్రాంతం మొదలుగా నిర్మిత మయిన మార్తవ సామగ్రి; ఇందులో ఉల్బణ రీతిలో మూర్తిశిల్పం ఉండేది. దీనికే సామీయ మృత్సామగ్రి (*samian pottery*) అనే పేరుకూడా ఉంది. ఆక్సీకరణ సామర్థ్యంగల వాతావరణంలో కాల్చిన బుచెరో సామగ్రియే క్రమపరిణామ గతివల్ల ఇటువంటి మృత్తికాంకిత సామగ్రిగా రూపొందింది. మృత్తికాంకితములలో మేలిరకపు వాటికి అరెటీయ సామగ్రి (*Arretine ware*) అనే పేరు ఉంది ఇటలీలో నేడు అరెజ్జో అని వ్యవహృతమయ్యే ప్రదేశంలో ప్రాచీన కాలంలో ఈ సామగ్రి తయారయ్యేవి.

**tertiary** : *తృతీయకం.*

**tertiary colours** : *తృతీయశ్రేణి వర్ణాలు.*

ద్వితీయశ్రేణి వర్ణాలను కలపడంవల్ల ఉత్పన్నమయ్యే ఛాయలలో దేనికైనా ఈ వసం వర్తిస్తుంది. వర్ణద్రవ్యాల మిశ్రమాలలోని అటువంటి రంగులు రంగుమాసి, నలుపువాలి తేలిఉంటాయి. సాధారణంగా ఊదారంగులకు, గోధుమరంగులకు ఇవి వర్ణతః కొద్ది మార్పులతో సన్నిహితంగా ఉంటాయి. ఉష్ణవర్ణాలవలెనే ఇవి కూడా కొన్ని సందర్భాలలో తరచుగా కళాకారులకు ఉపకరిస్తాయి.

**tessella** : *చిత్రపట్టిక.*

చిన్న ప్రమాణపు చిత్రస్థూణం (*tessera*)

**tessellated** : *చిత్రపట్టిత.*

**tessera** : చిత్రస్థూణం

గట్టిగా ఉండి, మన్నిక కలిగి, చిత్రాస్తరాన్ని (*mosaic*) తయారుచేయటానికి ఉపయోగించే చిన్నదైన దీర్ఘ ఘనరూపద్రవ్య విశేషం. సాంప్రదాయికంగా మధ్యయుగాల నుంచి వాడబడుతూ వుండిన వెనిస్‌నగరపు చిత్రస్థూణాలు, గాజుతో చేయబడేవి. ఈ గాజు కాంత్యభేద్య గుణం కలది; అటువంటి చిత్రస్థూణాలు అసంఖ్యాకమైన రంగులలో లభ్యాలు. ఇవి, భుజపుకొలత 3/8 నుండి 3/4 అంగుళాలవరకు మారుచూవుండే ఘన రూపాలుగా ఉంటాయి. ఆయారంగులుగల పెద్ద గాజుపలకలనుంచి ఉలితో నరకటం ద్వారానో, కత్తెరవంటి దానితో కత్తిరించటం ద్వారానో ఈ ఘనాలనురూపొందిస్తారు గాటు

వద్దభాగం పైకి ఉండేట్లు, వీటిని చిత్రాస్తరము నకై అమరుస్తారు. అందువల్ల ప్రతిఫలితకాంతి, చిత్రాస్తరతలానికి మిలమిలను దీప్తిని చేకూరుస్తుంది. ఒకవేళ చిత్రస్థూణపు సమతలమునే పైకి ఉంచవలసినప్పుడు దానిని కొద్దిగా ఒక కోణ దిశలో అమర్చినప్పుడు సైతం పై ఫలితాలను సాధించవచ్చు.

ప్రాచీన కాలపు గ్రీకుల, రోమనుల, తదితర సభ్యజనుల చిత్రాస్తరాలలో వాడబడిన చిత్రస్థూణాలు చాలా పెద్దవి. అత్యంత ప్రాచీనకాలంలో మొదటి ఘట్టమునకు చెందిన చిత్రాస్తరములలో వివిధ వర్ణముల కలిగిన గులకరాళ్ళే వాడబడ్డాయి. ఆకాలపు తరువాతి ఘట్టంలో, నానావర్ణాల చంద్రశిలా ఖండాలూ కుండపెంకులూ పింగాణీ తునకలూ వాడబడ్డాయి. బైజాంటెయిన్ సామ్రాజ్యకాలంలో ఆ సామ్రాజ్యపు కళాకారులు సువర్ణ చిత్రస్థూణం అనే దానిని వాడుకలోకి తెచ్చారు. స్వచ్ఛమైన రెండుగాజుపలకల మధ్య సువర్ణ పత్రం ఉంచి స్థిరతాపనం చేయటంవల్ల, ఈ సువర్ణ చిత్రస్థూణాలను తయారుచేసేవారు. ఇంతేకాదు; ఆ కాలపు చిత్రాస్తరములలో కొన్నిట, ఇటువంటి సువర్ణ చిత్రస్థూణాలకు ప్రత్యామ్నాయాలుగ, శుక్తిగర్భ (*mother of pearl*) ల అట్టసములనుకూడా వాడేవారు. పాతకాలంనుండి వాడుతున్న వెనీసీయ చిత్రస్థూణాలతో పాటుగా, రాతి పలుకులను, గాజుబిళ్ళలను, మార్తవములను, ఇంకా పలు రీతుల గులకరాళ్ళనుగూడా ఆధునిక చిత్రాస్తరకులు వాడుతున్నారు. నేలపై పరచే ఓడుబిళ్ళ (*tile*) కూడా ఒకవిధపు చిత్రస్థూణమే కాని, ఇది చిత్రస్థూణముకన్న ఎక్కువ ముఖతల వైశాల్యం కలిగి ఉంటుంది.

**text faces (printing)** : మూలముఖాలు (అచ్చుపని).

**textural white** : *తాంతవశ్వేతం* (చూ : **underpainting white**)

**texture** : *తాంతవము; ఊతిక; వర్ణముల కలయిక*

ఒక కళారచనలో, ఉపరితలాన్ని స్పర్శించటంవల్ల మాత్రమే వేద్యమయ్యే ఒక గుణవిశేషం. తాను చిత్రించిన, లేదా మలచిన ఉపరితలం ఉండవలసినది గరుసుగానా లేదా నునుపుగానా, క్రమబద్ధంగానా లేదా అపక్రమంగానా అనటాన్ని మొదట కళాకారుడు స్థిరపరచుకొని అంతట దానికనుగుణమైన సాంకేతికతను, దానిని ఉపయోగించే రీతిని ఎన్నుకొంటాడు. శతాబ్దాంతరబడిగా ప్రక్రియలలో సాధితమయ్యే పరిపుష్టతవల్ల, ప్రతి సాంకేతికతను అత్యంత ఫలదాయకమైన రీతిలో ఉపయోగించటానికి కొన్ని పద్ధతులు నిర్ణయింపబడినవి. ఫలితాలను సాధించటానికి అప్పుడు ఫలకంలోని దోషరహిత స్నిగ్ధత చక్కగా ఉపకరిస్తుంది; నీటిరంగుల పారదర్శకతవల్ల ద్యోతకమయ్యే ఉజ్జ్వలత (*bri-lliance*) కు మిలమిలకు పరిపుష్టతను సమకూర్చటానికి ఒలపర్ణ వస్త్రపు గరుకుతనం

బాగా సహకరిస్తుంది. తాను చిత్రించదలచినది వలచదేలి నునుపుమీద ఉండాలా? లేదా ఎగుడుదిగుడు ఒత్తురంసగా ఉండాలా అనే దాన్నిబట్టి అందుకు క్రమంగా చక్కగానేసిన మూర్తి చిత్ర వల్కలమునో, లేదా మొరటుగ గరుకుమీరి ఉండే నేత వల్కలమునో కళాకారుడు గ్రహిస్తాడు ఇటువంటి తాంతవమునే (సన్నగానో, గరుకుగానో) శిల్పాలలోనూ సాధించవచ్చు. ఇక తైలచిత్రణ విషయంలో విరివిగా వలుకీతులలో లభించే శాటికావస్త్రాల నుంచి, తన శైలికిన్ని సాంకేతికతకున్నూ తగిన దానినే కళాకారుడు తీసుకొంటాడు. అచ్చమైన సాంకేతిక విషయాలనేగాక ఇటువంటి రచనలలో, తన చిత్రమునకు తాను కల్పించవలచిన తాంతవము, ఆ చిత్ర వస్తువుకు సముచితంగా సరిపడుతుందా అనే విషయంకూడా కళాకారుడు లెక్కలోకి తీసికొంటాడు వివిక్తవాదపు చిత్రణలను, ప్రాయోగిక చిత్రణలను సాగించే కళాకారులు సాంప్రదాయిక ద్రవ్యగణం, తమ సృష్టిలో ఉండే సరికొత్త భావపరిణామాలను తగిన రీతిగా వెలువరించగాలదని భావించి, అటువంటి స్వీయ భావాలను ఎక్కువ ద్రఢిమతో, ఎక్కువ నిపుణతతో ప్రకటించి తమ నవ్యభావనలకు పుష్టిని చేకూర్చటానికై తరచుగా కొత్త కొత్త తాంతవములను ప్రవేశపెట్టారు అయినా తక్కిన ఆధునిక కళావాదాలను అవలంబించిన మరికొందరు కళాకారులు, తమ రచనలలో సాంప్రదాయికతకు స్వస్తిచెప్పినా, రచనా పద్ధతుల విషయంలో మాత్రం, కాలప్రవాహగతిలో నిగ్గుదేలి నిలచిన, పాతవాటినే అంటిపెట్టుకొని తమ కృషిని సాగించారు.

తైలవర్ణాలలో రచనను సాగించే చిత్రకారుడు, తన రచనలో ఒక ప్రత్యేకమైన తాంతవమును నెలకొల్పదలచినప్పుడు తాను వాడే ప్రామాణిక తైలవర్ణాలకు ఆయా సందర్భాలను బట్టి ఇసుక, చలువరాతి పొడి, సన్నగులక మొదలైన అన్యపదార్థాలను కలిపి, తన అభీష్టాన్ని సాధించుకొంటాడు. ఒక్కొక్కప్పుడు సిమెంటునుకూడా కలపటం ఉంది. ఒక్కొక్కప్పుడు కావలసిన గరుకు తాంతవములను పొందటానికి అధశ్చిత్రణ శ్వేతం (*underpainting white*) అనే దాన్ని వాడటంకూడా ఉంది. ఈ శ్వేతం సిద్ధరూపంలో లభిస్తుంది. శుద్ధమైన ఇసుకను సరైరీతిగ కలిపినప్పుడు, చిత్రపు మన్నికకు ఎటువంటి ఇబ్బందికూడా కలగదు. ఎందుకంటే ఆ ఇసుకరేణువులు, అవిసెనూనెలో కలపటంవల్ల వికీర్ణత చెంది, వర్ణద్రవ కణాలకు ఉపరిభాగంతో మాత్రమే అంటుకుంటాయి, దిగువభాగంకు ఎటువంటి నష్టంకూడా కలిగించవు కాని రంపపుపొడి, కాఫీగింజల నూక మొదలైన కార్బనిక ద్రవ్యాలను రంగుకు కలిపితే మాత్రం, చిత్రపు మన్నికకు దెబ్బ తగులుతుంది. చిరస్థాయిగా చిత్రం ఉండాలని భావించి, అందుకు అనుగుణమైన ద్రవ్యాలనే వాడినా పై కార్బనిక ద్రవ్యాలు చేరికవల్ల వాటికి నష్టం వచ్చితీరుతుంది. ఇసుకను సైతం ఒక పరిమిత

ప్రమాణానికి మించి వాడినప్పుడు, అది చిత్రంలో శోషణ గుణాన్ని హెచ్చించి, భూమికపై వర్ణద్రవ్యం కుదురుగా నిలిచి ఉందని వరిస్థితని కల్పించి, అవాంఛనీయ వరిణామాలకు దారితీస్తుంది ఇప్పటికి తెలియవచ్చినంతవరకూ, ఎటువంటి దుష్పరిణామాలకు తావు కల్పించని రీతిలో శాంతవముకు లేదా ఓత్తురంగునకై ఎంతవరకైనా పాలిమరు రంగులును, రూపపిష్టమును బాగా పనికి వస్తాయి.

**textured surface** : *భాంతవిత వరితలం.*

**Thalo blue, thalo green** : *తాలో బ్లూ; తాలో గ్రీన్.*

తాలోసియానిక నీలానికి, తాలోసియానిక హరితానికి అమెరికాలో వాడే వ్యాపార నామాలు.

**Thalo red rose** : *తాలో రెడ్ రోజ్.*

పంచామ్లారుణవు వసుపువాక లేదా గాఢ ఎవు చాయను వ్యాపార నామం.

**theme** : *ప్రకరణం.*

**Thenard's blue** : *తేనార్డు నీలిమ.*

కోబాల్ట్ నీలిమకు ప్రాచీన నామం.

**theoretically** : *సిద్ధాంతపరంగా; అర్థాపత్తిగా*

**theory** : *సిద్ధాంతం; అర్థాపత్తి.*

**thermoplastics** : *తాపకల్పకాలు, ఘర్మకల్పకాలు; ఉష్ణకల్పకాలు.*

**thermosetting** : *ఉష్ణనమనీయం; తాపఘనం*

**the three arts of design** : *మూలరూపాత్రయం.* (చూ : design)

**thickener** : *సాంద్రకారి*

**thimble** . *ప్రాపు.*

బట్టలో కాల్చేటప్పుడు మూర్తవ సామగ్రికి కింది ప్రాపుగా ఉంచే చిన్న పింగాణి వస్తువు.

**thinner** : *విరళీకరి; శాతకరి; విరళకం.*

పూతరంగులను, వార్నిషులను పలచచేయటానికి లేదా కృశీకరించటానికి వాడే ఒక విధమైన ద్రావణీం ద్రవపదార్థం కళాకారులు రెండు రకాల విరళీకరులను వాడతారు. అవి: 1. కర్పూరతైలం; 2. ఖనిజ రేణువులు

**thioindigs violet** : *గంధనీలలోహితం.*

ఉజ్జ్వలమైన సాంద్రమైన ఒక సంయోజిత నీలలోహిత కార్బనిక వర్ణద్రవ్యం. కళాకారుల వర్ణాంలో దీనికి స్థానం ఉంది.

**thistle** : *గోక్షర; వల్లేరు.*

**thixotropy** : *స్పర్శవికృతి.*

సినత కలిగిన రంగుపూత పదార్థాలలో కొన్నింట కనపడే ఒక ధర్మం. తూలికతో గట్టిగా రుద్దినప్పుడు అవి ఈ ధర్మంవల్ల ద్రవీభూతాలవుతాయి.

**three point perspective** : *త్రైబిందుక; దృక్క్రమగతి.*

(చూ : oblique perspective).

**three-quarter** : *ముప్పాతిక నిలువు.*

(చూ : canvas sizes, portrait)

**thumbnail sketch** . *అంగుష్ఠనఖ రేఖిక*

బాల కొద్ది ప్రమాణంలో రచితమైన అపరిష్కృత రేఖాచిత్రం. అంగుష్ఠనఖ (బొటన వేలిగోరు)అనేదానిని దీనికి అనుసంధించటానికి ఒక కథ ఉంది. విలియమ్ హోగర్తు అనే ఆంగ్లేయ చిత్రకారుడు, సిటీలో పోతూ ఒక పానశాల (*tavern*)ను అందులోని ఒక దృశ్యాన్ని చూసి వెనువెంటనే దాన్ని చిత్రీకరించాలని ఊహించాడు. కాని అప్పటికి అతడి దగ్గర కాగితం ఏదీ లేకపోయినందువల్ల తన బొటనవేలి గోరుపై, ఆ దృశ్యం రేఖాచిత్రాన్ని అపరిష్కృత రూపంలో, చిత్రించాడు ఆ సంఘటనను బట్టి అటువంటి అల్పప్రమాణపు రేఖాచిత్రానికి అంగుష్ఠనఖ రేఖిక అనే పేరు వచ్చిందని అంటారు.

**thumbtack** : *గోమకం*

ఉక్కుతో తయారుచేసిన ఒక విధమైన బిగింపు సాధనం. దీని తల కొద్దిగా బోడితిరియో, లేదా వెడల్పుగా ఛదునుతిరియో ఉంటుంది. ఆలేఖనంలోనూ, చిత్రణలోనూ, ఆలేఖనాస్తరికపై కాగితాన్ని బిగించి కదలకుండా ఉంచటానికి ఇది పనికివస్తుంది దీనికి బ్రిటనులో డ్రాయింగ్‌పిన్ అనే పేరుంది.

**tile** : *ఓడుతిక్క*

1. సర్జనాత్మకం లేదా అలంకారికం అయిన మార్దవ కృషిలో వాడే ఒక అల్ప ఫలక విశేషం. ఇది చదునుగా పంచగా ఉండే విధంగా మట్టితో రచితమవుతుంది; లేదా తప్తమృత్తికామయమై ఉంటుంది. సాధారణంగా చతురస్ర రూపంలోనే ఈ బిళ్ళపై మార్దవద్యుతి సాయంతో మందవర్ణంతోనో లేదా బహువర్ణాలతోనో రేఖాకృతులు రచితాలవుతాయి. గోడలకు ఛాదనంగాను, నేలపై పరుపుకుగనూ, ఇంకా ఇటువంటివే అయిన ఇతర వసులకున్నూ ఇది ఉపయోగిస్తుంది. కాని ఇటువంటిదే ఏకవ్యక్తి కృషివల్ల సాలంకృతమై రచితమైనప్పుడు అటువంటి బిళ్ళ, ఒక విశిష్ట మార్దవ వస్తువుగా పరిగణనకు వస్తుంది.

2. అక్కడక్కడ గుంటలు కలిగిన ఒక విధపు బిళ్ళ. ఈ గుంటలో సిరానుగాని, నీటిరంగు విలేపనాలుగాని నిలువ ఉంచుకొని కళాకారుడు వాడుకొంటాడు.

**timonox** : *టిమోనాక్స్*

సౌవీర శ్వేతానికి వ్యాపారనామం.

**tin** ; త్రపువు; తగరం.

**tincture** ; ఉద్గమం.

రాగచ్ఛాయకు, నేడు వాడుకలో లేని ఒక వర్ణాయనామం.

**tinge** : రాగచ్ఛాయ

ఒక రంగువల్ల ప్రాపించే మాలిన్యం లేదా వేధనం, ఇందువల్లవచ్చే కొద్ది పెర్ణవిక్రుతికిన్నీ ఈ పదమే వర్తిస్తుంది రెండు లేతనీలి రంగులు ఒక ఛాయగా కనపడినప్పటికీ, అందొకటి నీలలోహితపు రాగచ్ఛాయను కలిగి ఉండవచ్చు.

**tins** అడ్డుముక్కలు.

కాంస్య శిల్పంలో వాడుకలో ఉన్న ఒక పారిభాషిక పదం కరువున పోతపోయటానికి ముందుగా, వివిధ భాగాలను వేరువేరుగా ఉంచటానికై అందు పెట్టే సన్నటి లోహపు ముక్కలు

**tint** : ఛవి

1. ఇంకొక రంగును చాలాస్వల్ప ప్రమాణంలో కలిపినప్పుడు ఒక రంగులో ఏర్పడే పర్ణవ్యత్యయం లేదా ఓన్నెమార్పు చాలాకొద్ది ప్రమాణంలో ఎర్రని తైలవర్ణాన్ని, తెల్లని పూతరంగులో కలిపితే అది లేతగులాబిగా ఛవితమవుతుంది లేత నీలపు పూతరంగును ఎరుపుతో ఛవితం చేయగా, లవేంద్ర చ్ఛవి లభిస్తుంది. అట్లా కలిపే ఎరుపులో ప్రమాణాలను మార్చటంవల్ల ఇంకా వేర్వేరు ఛవులను పొందవచ్చు.

2. గ్రాఫికులలో ఒకే తీరగు ఛాయాంత రంగల తావు; ఇది గట్టి అనుముద్రణఉన్న తావులకన్నా విభిన్నంగా ఉంటుంది. ఉపరితలంపై, ఏకరీతిలో అమరేట్లు బిందువులను, రేఖలను, ఇంకా తక్కిన చిహ్నాలను రేఖాశిల్పంలో రూపొందించి ఈ ఛవిని కల్పించవచ్చు.

**tint block** ఛవిదారుకము

ముద్రాంకాలతయారీలో లఘుతస్థాయిలో వానిని సాధించటానికి వాడే ఒక దారుకం లేదా ఫలకం ఇందులో ఏకరీతికము, పరివ్యాప్తం అయ్యేట్లు పర్తన్నయ రేఖారూపం లోనో, బిందురూపంలోనో రేఖాశిల్పపు సాయంతో జరుగుతుంది. ఇటువంటి దానిని దారుకంగా ఉపయోగించినప్పుడు, అచ్చుపు తలంగల దారుకంవల్ల వచ్చే దానికన్నా లఘుతర స్థాయిలో ముద్రాంకం లభిస్తుంది.

**tinted** : ఛవిత.

**tinted paper** : ఛవిత పత్రం.

**tinting strength** ; ఛవిపటిమ.

పూతలకు, ఛవిని కల్పించడంలో ఒక వర్ణద్రవ్యం ప్రదర్శించే శక్తి.

**tint tool** : *ఛవీపరికరం.*

కొనగలిగిన ఒక విధపు పోగర్క లలిత మైన చక్రాని రేఖావర్తనంలో ఛవిని కల్పించడానికై దీన్ని వాడతారు.

**tinware, painted** : *చిత్రిత త్రపుసామగ్రి*

చిన్న పెట్టెలు మొదలైన తగరపు సామగ్రి. అందులో చిత్రితములయ్యే వాటికే ఈ పదం వర్తిసుంది.

**tin white** : *త్రపుశ్వేతం.*

మార్దవ ప్రక్రియలలో వాడుకలో ఉన్న తగరపు భస్మం.

**tissue paper** : *ఉల్లిపొర కాగితం.*

**titanium green** : *తైజన హరితం.*

ప్రసియన్ నీలంతో సంబంధం కలిగిన ఒక ముదురు ఆకుపచ్చి రంగు, టిటేనియమ్ అనే లోహంనుంచి దీన్ని తయారుచేస్తారు.

**titanium pigment** : *తైతన వర్ణద్రవ్యం*

తైతన శ్వేతంలో ఒక రకానికి చెంది నది; దీని తయారీలో తైతన దయాక్సిద ముకు ప్రత్యామ్నాయంగా బేరియం సల్ఫేతం వంటి జడద్రవ్యాన్ని వాడతారు.

**titanium white** : *తైతన శ్వేతం.*

సాంద్రత, కాంతి నిరోధకత కలిగిన ఒక తెల్లటి వర్ణద్రవ్యం. రాసాయనికంగా ఇది అత్యంతజడం; కాబట్టి కళాకారుల రంగులలో మన్నికకు చాలాపేరు పొందింది.

**title** : *ఆఖ్యా; శీర్షిక; బిరుదం.*

**toilet** : *ప్రతికర్మ; అలంకరణం.*

**toilet maid** : *ప్రసాధిక.*

**toluidine red** : *తులాదిక శోణం.*

ఉజ్జ్వలమై, పండెరుపు పసిమి రంగుగల ఒక సంయోజిత కార్బనిక వర్ణద్రవ్యం. పారిశ్రామిక రంగులలో మాత్రమే, పైపూతలలో దీని వాడుక వుంది. దీనికి మన్నిక తక్కువ కాబట్టి కళాకారులు దీన్ని ఆదరించరు.

**tonal area** : *స్థాయీపరిధి.*

**tonal mass** : *స్థాయిక నిచయం.*

**tondo** : *చిత్రవృత్తం.*

వృత్తాకారంలోవుండే చిత్రణం. సతోన్నతంగానో అక్షినంగానో రూపితమై వృత్తాకారంలోవుండే రేఖాలంకృతికిన్నీ ఈ పదం వర్తిస్తుంది

**tone** : *స్థాయి; వర్ణస్థాయి.*

స్ఫుటతా, మూల్యా, అతిసంచన లక్షణాలలో దేని ప్రసక్తి అయినా వచ్చినప్పుడు స్థూలరీతిలో వాడే ఒక పద విశేషం. ఎరుపువాకస్థాయి, ఉపపన్నమైన పసుపుపచ్చ స్థాయి - వంటి ప్రయోగాలు స్ఫుటతకు చెందినవి; లేతస్థాయి, ముదురు

స్థాయి సంబంధి మూల్యసంబంధాలు; గాఢ స్థాయి, పాండురస్థాయి, కాంతియుత స్థాయి, మందస్థాయి సంబంధి అతిసంచనముకు సంబంధించినవి. చిత్రంలోని స్థాయిక నిచయాలు అనేవి అందలి రేఖికా నిచయాలకన్న వేరైనవి; ఇందు మొదటివి వర్ణపుతావులు.

**toned ground** : *స్థాయీకృత భూమిక.*

తైలచిత్రంలో ఒక విధపు భూమిక. భూమికపై ఉండే కాంతిమంతపు తెలుపు రంగులో మార్పు కలిగించే రీతిగా దానిపై ఒక రంగుతో పారదర్శకపు నిపీతాన్ని చేర్చినప్పుడు ఆ భూమికను స్థాయీకృత భూమికగా వ్యవహరిస్తారు తెలుపు భూమికనుంచి ప్రతిఫలితమయ్యే కాంతివల్ల లభించే ఉజ్జ్వలతను, ప్రవేప్తతకు ఎటువంటి భంగం కలగని రీతిలో, అవసరంగా ఒక వర్ణఘటనను సమకూర్చటానికి ఈ స్థాయీకృత భూమిక సహకరిస్తుంది.

**toner** : *స్థాయికరి, స్థాయికారి.*

ఒక వర్ణద్రవ్యంగా ఎటువంటి కలగలుపు లేకుండానే, వాడవగిన అద్రావణీయ యౌగికంనుండి, ప్రత్యేకంగా సాధించటానికి వీలైన ఒక సంయోజిత కార్బనిక వర్ణద్రవ్యపు సముచిత రూపం.

**toning or toning down** : *స్థాయికరణం; లేదా స్థాయితగ్గింపు.*

ఒక ఉపరితలంపై కలగలియు ద్యుతికమును ఒకదాన్ని పట్టించి, అదివరకు అక్కడ అలముకొన్న రంగును, తైలచిత్రణంలో మార్పుచేయటం.

**tooth** : *దూశత*

తైలచిత్రణంలో కొన్ని భూమికలలో కనపడే ఒకవిధపు అల్పస్థపు గరుకుతనం లేదా అల్పకణముయక ఇది అపేక్షణీయమైన లక్షణం: ఇటువంటిది ఉంటే కూలిగా వసారానికి సౌకర్యం ఏర్పడి, తత్ఫలితంగా, భూమికకు రంగు గట్టిగా అతుక్కొని చిరకాలం ఉంటుంది.

**topia** : *వనచిత్రం.*

టోపియా అనేది ఒక లాటిన్ భాషాపదం. ఒక ప్రకృతి దృశ్యాన్నో, లేదా అచ్చపు ఒక వనాన్నో, వస్తుపుగా గ్రహించి అతి విపుల ప్రమాణంలో సాగించిన చిత్రణకు దీన్ని పేరుగ రోమనులు వాడారు.

**topographic** : *స్థానవర్ణక.*

**topographic art** : *స్థానవర్ణక కళ.*

కొన్ని ప్రదేశాలను-అందునా ముఖ్యంగా పట్టణాలను, భవనాలను, భవనావశేషాలను, సహజ దృశ్యాలను-రూపించే ఆలేఖ్యకళ లేదా గ్రాఫిక కళ. ప్రాదేశిక చిత్రానికి ఇది విభిన్నమని చెప్పవచ్చు. ప్రాదేశిక చిత్రం అచ్చంగా సౌందర్య స్ఫోరకంగా మాత్రమే ఉద్దిష్టం; స్థానవర్ణక కళ అటువంటిది కాదు; ఆయా ప్రదేశాలను గురించిన

కొంత సమాచారాన్ని తెలియజేసే ఫలితనం అందులో కనపడుతుంది. ప్రాదేశిక చిత్రంలో రూపితమయ్యేది యథార్థపు దానికన్న కొంత విభిన్నంగా ఉన్నా క్షంతవ్యమే; కాని స్థానవర్ణక కళలో ఇటువంటి లోపం సహించరానిది. ఇట్లా కొంత భేదమున్నా వీటి రెంటికి మధ్య సీమారేఖను గీయటం సాధ్యం కానేకాదు. స్థానవర్ణక కళలోనూ, యథార్థ రూపానికి మెరుగుపెట్టటానికై కొన్ని భవన ప్రతిరూపాలకు చెట్టుచేమల వరిసరాలను జత చేయటం ఉంది.

పట్టణాలు, దూరస్థజనపదాలు మొదలైన వాటిని గురించి, సమాచారాన్ని సాధారణ ప్రజలకందించే దృష్టితో ఇటువంటి స్థానవర్ణక కళ మొదటినుండీ-ప్రాచీన గ్రీకు, రోమన్, భారతీయ కాలాలనుంచికూడా-అవలంబింపబడిందనటానికి నిదర్శనాలున్నాయి. కాని వీటిలో చచ్చిరపు నిర్దిష్టత 16వ శతాబ్ది ఉత్తరార్ధంనుంచి మాత్రమే కనపడుతుంది అయినను కాంతిలేఖనం (ఫొటోగ్రఫీ) అమలులోకి వచ్చిన తర్వాత ఇటువంటి చిత్రకళకు ఆవశ్యకత క్రమంగా సన్నగిల్లింది. అయినా అక్కడక్కడ కొందరు ఈ కళను అంటి పెట్టుకొని కొంత ప్రశస్తికూడా సంపాదించారు. ఇటువంటి వారిలో రిచర్డు యూరిక్ (జ. 1903) గణనీయుడు ఇతడు రచించిన దన్‌ వుక్కనుండి ఉపసంహారణ అనే స్థానవర్ణక చిత్రం ఎంతరి మన్ననలో పొందింది.

**topograghic landscape** : స్థానవర్ణక ప్రకృతిదృశ్యం

ఒక విశిష్ట దృశ్యానికి సంబంధించిన భూతలవిశేషాలను, తదితరములనువిస్పష్టమూ



స్థానవర్ణక ప్రకృతి దృశ్యం: థామస్ కోల్ రచించిన 'ఆక్స్ బౌ' (కొన్నెక్టికట్ నదియొక్క మలుపు): గుడ్డపై తైలచిత్రము-1846.

నిర్దిష్టమూ అయిన రీతిలో రూపించిన ప్రకృతి దృశ్య చిత్రణం. యు స్టేట్ లో కొన్నెక్టికట్ అనే నదియొక్క ఒకమలుపును 'ది ఆక్స్ బౌ' అనే పేరుతో, థామస్‌కోల్ అనే చిత్రకారుడు రూపించిన చిత్రాన్ని దీనికి మేలి లక్ష్యంగా చెప్పవచ్చు.

**toptone** · మాఢాస్థాయి

(చూ **mass tone**)

**torchon paper** : *రవ్వకాగితం*

ఉపరితలంలో ముతకపాటి రవ కలిగిన ఒక విధపు కాగితం. నీటిరంగులతోను, గహనవర్ణాలతోను చిత్రణకు ఇది చాలా అనువుగా ఉంటుంది

**toreutics** : *తాక్షకం*

ఉబ్బెణరీతిలోగాని, అంతఃపాతి రీతిలోగాని-ముఖ్యంగా లోహంపై-శిల్పాన్ని సాగించే సాంకేతిక పద్ధతి, లేదా కళావిశేషం, ఈ కళావిశేషంలోనే ఉత్సేదం. అనుధావనం, రేఖాశిల్పం, మలచేపనికూడా చేరిఉన్నాయి.

**tormented colour** : *అతిప్రసారిత వర్ణం.*

ఒక శైలచిత్రణంలో అతిమాత్రంగా ప్రవహితమైన రంగు కొన్ని తీరుల రచనలలో ఇటువంటి రంగుపూత అంతగా లెక్కలోకి తీసుకోవాలిసిందిగా ఉండదు. అయితే కొన్ని చిత్రణ శైలులలో మాత్రం ఇటువంటి అతిమాత్రపు పైపూతపల్ల చిత్రాలలోని నవ్యతకు, సద్యస్ఫోరకతకు, ఉజ్జ్వలతకు, ఔత్సర్గిక ప్రతిపాదకతకు భంగం వాటిల్లే ప్రమాదం ఉంది.

**torso** : *కబంధము.*

శిరస్సూ, తక్కిన అవయవాలూ లేకుండా మొండెంగా ఉండే శిల్పం, కొన్ని ప్రాచీన శిల్పాలు, అవయవాలను కోల్పోయి, ఇటువంటిరూపాలతో తద్వకాలలో-పునరుజ్జీవన కాలంలో-అక్కడక్కడ కనపడగా అప్పటి కళాకారులు, తమ ప్రతిభను ఉపయోగించి, ఉప్పావయవాల శిల్పాలను ఆ మొండెములకు అనుగుణంగా తయారుచేసి, వాటికి అతికించి పూర్ణమూర్తులను తయారు చేసేవారు. ప్రజ్ఞాపాటవానికి ఒక నిదర్శనంగా ఇది ఆ కాలంలో లెక్కకు వచ్చింది.

కాని 19వ శతాబ్దంలో, ఉద్దేశ పూర్వకంగా కబంధాలను రూపించి అందులో సౌందర్యభావనను స్ఫోరకం చేయటానికి వీలుంటుంది అనే భావనకు తావేర్పడింది. ఇటువంటి పనితనంలో పేరొందిన వారిలో రోడిన్, మైలోల్ గణనీయులు. విభాపనావాదంలో చాలామంది కబంధాన్ని తమ చిత్రాలలో రూపించారు. శిల్పులలో హెన్రీ మూర్ వంటి ప్రముఖులుకూడా ఈ శిల్పాలను వెలయించారు.

**tortillon** · *ఆవర్తిక.*

బిరుగా చుట్టిన బూడిదరంగు కాగితపు, లేదా తెల్లకాగితపు చుట్టముక్క. దీని ఒకవైపు

కొంతవరకు కొనదేలి ఉంటుంది. ఈ అవర్తికను ఉపయోగించి, దాని కొనతో బొగ్గు పొడిని. పిష్టవర్ణాలను కలుపుతారు. ఇటువంటి అవర్తికలు ఎన్నో ప్రమాణాలలో లభిస్తాయి. సాధారణంగా వాడుకలో ఉండేది 2 1/2 అంగుళాలపొడవు 1/8 అం. వ్యాసం కలిగి ఉంటుంది.

**totem** : 1. *లాంఛిక.*

2. అంగారకారుణానికి పర్యాయనామం.

**totempole** : *గోత్రయష్టి.*

ఉత్తర అమెరికాలో ఆదిమజాతులైన అమెరికన్ ఇండియనులలోని కొన్ని తెగలలో మతదృష్టితోను, ఆధిక్య దృష్టితోను నిలుపబడే ఒక విధపు స్తంభం. ఈ స్తంభాలు సాధారణంగా దేవదారు కర్రతో నిర్మితములై అందులో గోత్రాధిదేవతల ప్రతిరూపాలు వరసగా చెక్కి ఉంటాయి. ఇందులో ఆ గోత్రయష్టిని నెలకొల్పిన జాతివారి గోత్ర ప్రతిమలేకాక, ఆ తెగవారికి లోబడిన తెగవారి గోత్రములుకూడా వరసగా చేర్చబడేవి. ప్రతిమల సంఖ్యలో ఆధిక్యం, ఆ యష్టిని నెలకొల్పిన వ్యక్తి గొప్పతనానికి కొలబద్దగా ఉపకరించేది.

**touch** : *స్పర్శనం; సంస్పర్శ.*

1 ఒక వస్తువుపై దాని నిర్మాతను తెలియజేయటానికై ఉంచే ముద్ర లేదా లలామం. ముఖ్యంగా నిర్మాతకు చెందిన లలామమో దాని పరీక్షకుని ముద్రో లేదా ఉభయులముద్రలో ఆ స్పర్శనములు కావచ్చు. త్రపుష సామగ్రిపై ఇటువంటివి కనపడతాయి. బ్రిటనులో ఇటువంటి వాటిపై, నిర్మాత, పరీక్షకుల స్పర్శనములేకాక, ఆ కాలంలో దేశాన్ని పాలించే పాలకుడిదికూడా ఉంటుంది. ఇంగ్లండ్ దేశంలో త్రపుష సామగ్రిపై ఇది తప్పనిసరి. తక్కిన చాలా ప్రదేశాలలో ఇది ఐచ్ఛికం.

2. చిత్రించే ఉపరితలంలో ఒక్కచోటున పట్టించే పూత. ఇందుకు ఉదాహరణంగా చెప్పదగింది తూలికతో ఉపరితలంలో జరిగేఒక విసురులేదాపిష్టఖటికతోగానిరంగుచాకుతోగాని చేసేఒకవ్రాత. ఇటువంటిపలుసంస్పర్శనముల కూడికే పై రంగుగా పరిణమిస్తుంది. 'తుదితీర్పు స్పర్శనం' (*finishing touch*) అనే చోట ఈ పదం ఆలంకారికరీతిలో మాత్రమే వాడుకలో ఉంది.

**touching up** : *మెరయింపు.*

**toughness** : *పటిమ.*

**tower** : *అట్టాలకం.*

**town hall** : *రథ్యాగృహం.*

**trace (n)** : *అనులేఖనం; ట్రేసు.*

**trace (v)** . *అనులేఖించు; ట్రేసువేయటం.*

**tracery** : అనుమర్శిక.

వక్రరేఖామయంగానో, వక్రరేఖాలంకరణ రీతిలోనో గవాక్షాలపైనా తోరణద్వారాలపైనా రాతిలో సాగిన ఒక విధపు శిల్పకృషి. గాథిక వాస్తువులో ఇది తరచుగా కనపడుతుంది. అటువంటి దానిని అనుకరిస్తూ దానిరీతిలోనే అల్లిబిల్లిగా సాగిన వక్రరేఖాలంకరణకు లేదా చిత్రరేఖాంకితికకూడా ఈ పదం వర్తిస్తుంది.

**tracing** · అనులేఖనం.

ఒక మూలప్రతిని అనుసరించి, దానిని మార్గదర్శిగా పరవడిగా గ్రహించి, ఒక పెన్సిల్‌తోగాని, అటువంటిదే వేరొక వాడి మొన పనిముట్టుతోగాని వేరొక ఉపరితలంపై తయారుచేసిన నకలు. ఒక చిత్రానికిగాని ఒక రేఖాకృతికిగాని అనులేఖనాన్ని - ఒక పలిపిరి కాగితాన్ని మూలప్రతిమీద ఉంచి-అనులేఖించి తయారుచేయవచ్చు దళసరి కాగితాన్ని వాడి కూడా అనులేఖించవచ్చు.కాని అటువంటి సందర్భంలో, మూలప్రతిపై దళసరి కాగితాన్ని ఉంచిన తరువాత మూలప్రతిక్రింద అనులేఖన పేటికను ఉంచాలి. అనులేఖనాన్ని ఒక ఉపరితలంనుంచి ఇంకొక ఉపరితలానికి మార్చటానికి ఇంకొక పద్ధతికూడా ఉంది. అందులో మొదట మూలప్రతిని బోరగిలవేసి వెనకవైపు బొగ్గుమసినో, ఇంకో చిక్కదనపు పొడినో బాగా పద్దుతారు. అప్పుడిక ఆ మూలప్రతిని సరితిరుగా, ఆలేఖ్యాన్ని గ్రహించవలసిన ఉపరితలంపై ఉంచి, ఆలేఖపు రేఖలలో పెన్సిల్‌తోగాని గంటంతోగాని మెల్లగా గీస్తే దిగువ ఉపరితలంపై, ఆ రేఖలపక్కే, ఆలేఖనపు నకలు అక్కడ ఏర్పడుతుంది. దీనికే ఇంకొక పద్ధతికూడా ఉంది. మూలప్రతి వెనకవైపున రంగుపొడి రుద్దటానికి బదులుగా మూలప్రతికి ఆలేఖనపు నకలును గ్రహించే ఉపరితలానికీ మధ్య మసికాగితాన్నిగాని నల్లసీసపు కాగితాన్నిగాని ఇరికించి, మూలప్రతిలోని ఆలేఖనపు రేఖలపై పైపైకిగానే గీయవచ్చు. అయితే ఈ రెండు పద్ధతులలోనూ, మూలప్రతిలోని రేఖలు వికృతములయ్యే ప్రమాదం ఉంది. అటువంటి దురవస్థకు ఇష్టపడని కళాకారుడు మూలప్రతిపై ఒక సన్నటి పారదర్శక అసితేతర చిత్రాన్ని ఉంచో లేదా అనులేఖన పత్రాన్ని వాడో ఫలితాన్ని పొందవచ్చు. పునఃకల్పన, విస్తృతీకరణ, న్యూనీకరణలకై వినియుక్తములయ్యే రూపప్రసారిణి, ప్రసారపేటిక, రూపవివర్తినివంటి సాధనాలు ఈ అనులేఖన సాంకేతికతనే వాడుతున్నాయి.

అనులేఖనం అనేపదం, మూలాయతనాల వస్తువుల బాహ్యరేఖయొక్క ఆలేఖనానికి కూడా వర్తిస్తుంది. ఒక పెన్సిలును ఆ వస్తువుయొక్క పరిధిరేఖలలో వెంబడి ఆనించి తరలించినప్పుడు, దిగువఉన్న ఉపరితలంపై దాని బాహ్యరేఖ పడుతుంది. ఈ విధంగా పరికించినప్పుడు ప్రతిరేఖికతో గీసే ఆలేఖనాన్ని సైతం ఒక విధమైన అనులేఖనంగానే సంభావించవచ్చు.

**tracing - caulking** : అనులేఖనం.

**tracing box** : అనులేఖన పేటిక.

సాధారణపు అనులేఖన పత్రంకన్నా ఎక్కువ దళసరిగా ఉండి, దాదాపుగా కాంత్యభేద్యంగా ఉండే కాగితంమీద ఒక ఆలేఖనాన్ని అనులేఖించటాన్ని సాధ్యంచేసే ఒక పరికరం. ఆలేఖనాన్ని కలిగిన మూల ప్రతిపై ఒక దళసరి కాగితాన్ని ఉంచి, ఆ జంటను కిటికీ గాజుపలకకు ఆనించటంలో వ్యక్తమయ్యే పద్ధతినే ఇందులోకూడా అవలంబిస్తారు. అటువంటి పరిస్థితిలో కిటికీయొక్క గాజుపలకద్వారా పయనించే కాంతివల్ల ఆలేఖనపు రేఖలు, తమపై ఉన్న దళసరి కాగితం మీదకూడా స్పష్టంగా కన్పిస్తాయి. ఈ పద్ధతిని అనుసరించి పనిచేసే ఈ అనులేఖనపేటిక ఎత్తువిషయంలో చాలా పట్టసంగా ఉండి, చదునుగానో, వాలుగానో రూపొందుతుంది. దాని పైభాగంలో ఒక మసక గాజుపలకా, దాని దిగవన కాంతి ప్రతిఫలించేట్లు చేయటానికి ఒక అద్దం అమరి ఉంటాయి కృత్రిమమైన ఒక కాంతికేంద్రంనుంచి వచ్చే వెలుతురు అద్దంపైపడి అక్కడ ప్రతిఫలితమై అక్కడనుంచి గాజుపలకద్వారా ప్రసరించి దానిపై ఉండే మూలప్రతిలోని ఆలేఖనపు రేఖలను. ఆపైనున్న దళసరి కాగితంమీద ప్రస్ఫుటం చేస్తుంది. చదునై సమపట్టంగా తీసిఉన్న పరితలంపై అనులేఖనం జరపటానికి కళాకారులకి ఈ పరికరం సాయపడుతుంది.

**tracing cloth** : అనులేఖన వస్త్రం.

అనులేఖన వస్త్రానికి ప్రత్యామ్నాయంగా వాడదగిన ఒక విధపు మల్లుగుడ్డ. ఇది ప్రమాణంలో పెద్దదే అయినా, చాలా పలచగా అర్ధపారదర్శకతతో ఉంటుంది. వాస్తువిదుల విన్యాసాలకు, సాంకేతిక వ్యాకర్తల, అధియంతల, రేఖాకర్తల కృషిఫలితాలు మొదలైనవాటికి సంబంధించి, సిరాలో తీర్చిన ఆలేఖనాలను అనులేఖించటానికి ఈ అనులేఖన వస్త్రం సహాయపడుతుంది. ఈ గుడ్డకు గంజిపెట్టి ఉండటంవల్ల, దాని పరితలం బిర్రబిగిసి సమతలంగా, ఒకేతీరుగా ఉండి, సిరాను త్వరగా గ్రహించగలుగుతుంది. దానిని అక్కడక్కడ తిప్పడంలో దానిలోని అనులేఖనం చెడిపోని రీతిలో ఆ పరితలం ఉంటుంది, అటువంటి అనులేఖనాలను తుదివిన్యాసంగా రూపొందించే వీలుకలుగుతుంది.

చుట్టలాగా అమర్చిన ఇటువంటి వస్త్రం కొనటానికి లభిస్తుంది. ఇది తెలుపుగాగానీ నీలంగాగానీ వుంటుంది. అది ఒకవైపున నిగనిగలాడుతూ, ఇంకొకవైపున కాంతిరహితంగానూ ఉంటుంది. దీనిని ప్రత్తినూలుతోనే నేస్తారు కానికొందరు దీనిని అనులేఖన వల్కలం(*tracing linen*) అని వ్యవహరించటంకూడావుంది. ఆధునిక కాలంలో ఇటువంటి అనులేఖన వస్త్రాలకై కొందరు 'నైలాను' మొనలైన సంయోజిత ద్రవ్యాలతో చేసిన వస్త్రాలను వాడుతున్నారు.

**tracing linen** : అనులేఖన వల్కలం.

**tr tracing paper** : *అనులేఖన పత్రం.*

సన్నగా, పారదర్శకంగా లేదా అర్ధపార దర్శకంగా వుండి, అనులేఖనానికి ఉపకరించే కాగితము. మూలప్రతిలోని రేఖాను చక్కగా అనుగమించటానికి వీలువడేటంత పారదర్శకంగా ఇది ఉంటుంది. బొత్తుల రూపంలోనూ, వెడల్పైన చుట్టల రూపం లోనూ ఇది కొనటానికి లభిస్తుంది. ఇందులో పారదర్శకతకు సంబంధించి ఎన్నో రకాలవి వున్నాయి. అట్లానే పరితలపు తాంతవమునను వేరేవేరే తీరులలోవున్నాయి. ఒక రేఖాకృతిని లేదా ఆలేఖనాన్ని తేటపరచటానికి, మెరుగు పరచటానికి, విస్తృతీకరించటానికి ఈ అను లేఖన పత్రం పనికి వస్తుంది. రేఖారచనలో ముద్రాంకాలను అనులేఖన పత్రంపై ఉండే ఆలేఖనంనుంచి తయారు చేయచ్చు. పరి వర్తకి శిలాలేఖనంలో కూడా దీన్ని ఉపయో గింపవచ్చు ఈ అనులేఖన పత్రాలలో అత్యంత పారదర్శకత అవసరమైనప్పుడు, అందుకోసం అసితేతమును తడితర కల్పక పత్రాలను వాడవచ్చు ఇటువంటివి ట్రేసీ యోలీన్ అనే వ్యాపారనామంతో బజారులో కొనటానికి లభిస్తాయి. వీటిలో ప్రతిదానికీ ఒకవైపున పరితలం వెలతెలగా ఉంటుంది.

**tracing wheel** : *అనులేఖన చక్రం.*

(చూ : perforating wheel)

**traction fissure** : *లాగుడు నెరియ.*

పాతపడిన తైలచిత్రణంపైని పూత వట లంతోగానీ, వార్నిషుతోగానీ ఏర్పడే ఒకవిధ మైన పగులు. అవటలం పగిలి, ఆ పగులు యొక్క చిలు వెనక్కి విరిగి, ఆ అంచుల్లో గ్గ్గలేర్పడి పెద్దపెద్ద వెలితిప్రదే శాలు ఏర్పడ్డప్పుడు వాటిని లాగుడు నెరియలు అంటారు. వెలుతురులో చూసినప్పుడు చిత్రపు దిగువ పూత, లేదా భూమిక కనపడు తుంది. దీనినే కొందరు అపార్థజనకంగా దోగాడే నెరియ (*creeping fissure*) లేదా, పారాడే నెరియ(*crawling fissure*) అంటారు. ఈ రెండున్నూ బలవర్ణ చిత్రాల లోని దోషాలకే స్తాయి.

**tradimark** : *వ్యాపార చిహ్నం.*

**traditional** : *పరంపరాగత.*

**trail, traile or trayle** : *ద్రాక్షిక.*

గోతిక కళలోని ఒక అలంకృతి విశేషం, ద్రాక్షవల్లు ఆకులు, రెమ్మలు మొదలైన వాటి ప్రతిరూపాలను కొయ్యపైగానీ, రాతిపై



ద్రాక్షిక

గానీ మలచగా ఈ అలంకృతి రూపొందు తుంది. దీనికే ఆంగ్లంలో విగ్నెట్టి(*vignette*) అనే పేరుంది.

**transfer** : *పరివర్తన.*

చిత్రణముల పరిరక్షణకోవాడే ఒక పారిభాషిక పదం. భూమికతోగూడ ఒక చిత్రలేప పటలాన్ని, చెడిపోయిన ఆధారంనుంచి విడదీసి ఒక కొత్త ఆధారంపై దానిని పునరధిష్ఠించటం దీనివల్ల జరుగుతుంది. చాలా విసుగెత్తించేపనే అయినా 18వ శతాబ్దినుంచికూడా ఈ పరివర్తన తరచుగా అక్కడక్కడ జరుగుతూనే ఉన్నది. వల్కలంపైన, కాటికపైన, కొయ్యపైన చివరకు గచ్చుగోడలపైన ఉన్న చిత్రాలను పరివర్తన చేయటం తరచు జరిగింది. తైలచిత్రణం ఉన్న కాటిక శిథిలదశలో ఉన్నప్పుడు దానికి వెనక అతుకుగుడ్డవేసి చక్కబరచటం సాధారణంగా ఉంది. అయితే ఒక్కొక్కప్పుడు ఆ శిథిలత ఎక్కువై చక్కజేయటానికి వీలుకాని సందర్భంలో, పరివర్తనను జరపటం తప్పనిసరి అవుతుంది ఈ పనిలో, మొదట ఒక ప్రత్యేక విధపు ఉల్లిపొర కాగితాన్ని చిత్రపు ముఖతలంలో అతికిస్తారు. పటలంలో విడివడిన చిన్నచిన్న ముక్కలు రాలిపడిపోకుండా నిలుపటానికి ఇది తోడ్పడుతుంది. అప్పటికే కాటికను ఒక తాత్కాలికపు చట్టంలో కదయంచులవద్ద బిగిజాగా ఉండేట్లు బిగిస్తారు. అప్పుడు ఆ పాత కాటిక వెనకభాగాన్ని తడపటంద్వారా, రాపిడిద్వారా, నిర్లిఖనంద్వారా వదలుచేసి మెల్లగా, జాగ్రత్తగా ఇపతలకు లాగివేస్తారు. ఆ తరవాత, చిత్రణపు వెనకభాగాన్ని శుభ్రపరచి దానిపై ఒక కొత్తవల్కలాన్ని మధ్మకల్పకసిక్త-యుక్తమావంతో దృఢంగా అతుకుతారు. ఈ కార్యక్రమం పూర్తి అయినతరవాత, ఇదివరకుచిత్రపు ముఖతలానికి అతికించి ఉంచిన ఉల్లిపొర కాగితాన్ని తడిపి తీసివేస్తారు. ఇట్లా కొత్తవల్కలంపై చేరిన చిత్రాన్ని ప్రసారణిపై చేర్చి తుది సంస్కరింపు చేస్తారు. సద్యస్క చిత్రాలను తావు మార్పు పద్ధతిలోగాని వ్యాకృతి పద్ధతిలోగాని పరివర్తన చేస్తారు.

**transfers** : *బదిలీలు.* (చూ: decal)

**transfer lithography** : *పరివర్తక శిలాలేఖనం.*

ఇది ఒక విధమైన శిలాలేఖనం. ఇందులో ఆలేఖాన్ని నేరుగా రాతిపైనే లిఖించటం జరగదు ఆలేఖనమును మొదట ఒక కాగితంపై లిఖించి, ఆ తరవాత దానిని ఒకసరళ ప్రక్రియవల్ల రాతిమీదికి, లేదా ఫలకానికిమారుస్తారు ఈ మార్పులను - వృత్తిరీత్యా ఇందులో కుశలత నార్జించిన-శిలాలేఖక ముద్రాపకుడు నిర్వహిస్తారు. అయితే, అప్పుడప్పుడు ఆ ఆలేఖనాన్ని గీసిన కళాకారుడే ఈ పరివర్తనను సాగించటంకూడా ఉంది. అప్పుడిక రాతిని, సాధారణ పద్ధతిలో ముద్రణకు తయారుచేసిన తరవాత రుజువులను తీస్తారు. శిలాఖచికను స్వీకరించగలిగి, అందులకనువుగా రవ కలిగిన ఏ కాగి

దాన్నైనా పరివర్తక పత్రంగా వాడవచ్చు. సాధారణంగా ఈ పనికై అనులేఖన పత్రాన్ని, బొగ్గుకాగితాన్ని వాడటం పరిపాటి. కొన్ని కర్మాగారాల ప్రతి కార్యక్రమాలకై ప్రాథమిక పరివర్తక పత్రం తయారవుతున్నది. కాని కళాకారులు అంతగా దీన్ని ఆదరించరు. సర్వసౌలభ్యకమైన ఆలేఖనపు సౌకర్యాన్ని, ఇబ్బంది కల్గించే శిలాలేఖనపు రాతికి బదులుగా సహానీయమైన మాధ్యమాన్ని ఉపయోగించే సౌలభ్యాన్ని అభిలషించే వారికి పరివర్తక శిలాలేఖనం ఒక వరప్రసాదం వంటిది. వ్యస్తరీతిలో శిల్పి కృషి సాగించే దురవస్థకూడా ఇందువల్ల కళాకారుడికి దూరమవుతుంది. ఇప్పుడు అతడు ప్రాప్త (*positive*) రీతిలో కాగితంపై ఆలేఖనాన్ని గీయగా. దానిని రాతిపై బోర్లించినప్పుడు వ్యస్త రీతిలో అది రాతిపై పడుతుంది. రాతిని ముద్రణకు సన్నద్ధం చేసే సాంకేతిక ప్రక్రియలో అనేకవ సూక్ష్మతలతెలిగానీ, కావాలనిగానీ కుశలతను ఆర్జించకనే శిలాలేఖనపు ఫలితాలను ఉపయోగించటానికి ఇష్టపడే కళాకారులుకూడా పరివర్తక శిలాలేఖనాన్ని ఉపయోగించుకొంటారు. రేఖీయ కృషికీ, రేఖామాత్రపు సాంకేతికకలకూ చాలా బాగా పరివర్తక శిలాలేఖనం పనికి వస్తుంది. కాని స్థాయిసృష్టిని సంపూర్ణంగా పెంపొందించటానికి సూక్ష్మగుణవిశేషాల విభిన్నాంతరాలను ప్రస్ఫుటం చేయటానికి అంతగా పనికిరాదు. అయితే నేరుగా శిలపై అలిఖించినప్పుడువచ్చే ముద్రిత ప్రదేశాలకన్నా గుణవిశేషంలో తక్కువ రకపువి మాత్రమే పరివర్తక శిలాలేఖనంవల్ల లభిస్తాయి. ఇది ఇట్లాఉన్నా ఈపద్ధతివల్లవచ్చే రుజువులను మూలపు రుజువులుగానే అంగీకరిస్తున్నారు. టౌలోజ్-లాట్రెక్, డామియెర్ అనే వాళ్ళు ఈ పరివర్తక శిలాలేఖనాన్ని అమలుకు తీసుకొనివచ్చారు. అప్పటినుంచీ 1887 మొదలుగా ఇది వాడుకలో ఉన్నది.

**transfer paper** : పరివర్తక పత్రం.

ఏదో ఒక పదార్థపు పైపూత ఉండి, ఒత్తిడివల్ల, చెమ్మదనంవల్ల, లేదా వేడితోచేరిన ఒత్తిడివల్ల ఆ పైపూతను ఇంకొక పరితలం మీద ముద్రించగలిగిన ఒకవిధమైన కాగితం. ఒత్తిడిల్లా ఇటువంటి పరివర్తనను చేయగలిగేవి మసికాగితమూ నల్లకాగితమూ. ఇందులో పైపూతలేని భాగంలో అంటే కాగితపు వెనక భాగంలో గట్టి పెన్సిలుతోనో, గంటంతోనో ఒత్తిడి ప్రయోగించటం ఇందులో జరుగుతుంది. అయితే కళాకారులు సాధారణంగా ఈ విషయంలో నల్లసీసపు కాగితాన్నే ఎక్కువగా అభిమానిస్తారు. దీనిమీద వద్ద గుర్తులను సులభంగా తుడిచివేయవచ్చు. మసికాగితపు పైభాగం ఎక్కువ జిగురుగా ఉండటంవల్ల దాన్ని కళాకారులు అంతగా ఇష్టపడరు. ఏదో అవసరానికి సర్దుబాటు చేసుకోవలసివచ్చినప్పుడు అనులేఖనపు పత్రాన్నో, లేదా ఆవిధంగానే చాలా పలచగ ఉండే వేరొక పత్రాన్నో మెత్తటి పెన్సిలుతోనో సీసమున్నంతోనో రుద్దిగాని లేదా వర్ణద్రవ్యపు పొడిని

కమ్మీకగా చల్లిగాని, పరివర్తన పత్రాన్ని కళాకారుడు తయారు చేసుకొంటాడు అయితే అనుముద్రితం చేయవలసిన పరితలపు స్వభావాన్ని అనుసరించి, పై పద్ధతులలో ఏదో ఒకదాన్ని కళాకారుడు అనుసరిస్తాడు చెమ్మదనంవల్ల పనిచేసే పరివర్తన పత్రాలకోవకు చెందిందే ఉపసంక్రామక పత్రము (*decalcomania papar*). దీని నుంచి తీసిన ఖండపటలాన్ని పింగాణికి, గాజుకు, లేదా చలవరాతికి అతికించవచ్చు. కాగితం, గుడ్డ, కల్పాసములు, చర్మం మొదలైన వాటిపై వేడిఅచ్చు ముద్రారోపణ జరపవలసి ఉన్నప్పుడు, స్వర్ణపత్రంతోనో, బ్రాంజి లేదా ఒక వర్ణద్రవ్యపు పొడితోనో కమ్మీకగా పైపూత జరిగిన అపేక్షిత పత్రంలో వేడితోపాటుగా ఒత్తిడి ప్రయోగించటం జరుగుతుంది. ఇటువంటి పరివర్తన పత్రానికి ఆధారంగా ఉపకరించేది తరచుగా కాచపత్రం (*glassine*) అయి ఉంటుంది పరివర్తక శిలాలేఖనానికి ఉపయోగించే విశిష్టపు పత్రాలనూ, పరివర్తక పత్రాలనే వ్యవహరిస్తారు.

**transite** : *ట్రాన్‌సైట్.*

రాతినార పలకకు వ్యాపారనామం.

**transitional** : *స్థిత్యంతరిత.*

ఒక యుగంలో ప్రముఖలక్షణాలుగా గణనకెక్కిన శైలులూ, పద్ధతులూ క్రమదశలో క్షీణించిపోతూ, కొత్త శైలులుగా పరిణత పొందుతున్న సంధియుగంలో ప్రచలితములుగా ఉండే అవాంతర శైలులకు, లేదా సాంకేతికతా గణానికి విశేషణంగా ఉపయుక్తమయ్యే పదం. ఉదాహరణకు, కలలపర్ణానికి బదులుగా, క్రమగతిలో తైలద్రవ్యాలు ముందుకు వచ్చేకాలంలో అక్కడక్కడ ప్రాయోగిక రీతిలో వచ్చిన మాధ్యమాలు ఇటువంటివే. రెండు శైలులలో తొలుతటిదానిని తరవాతిది అవతలకు తోసివేయటానికి ప్రయత్నించే సమయంలో పూర్వశైలిలో ఉన్న లక్షణాలు పరశైలిలో కొన్నిటితో సంకరత చెందగా ఏర్పడేదే స్థిత్యంతరిత శైలి అని భావించవచ్చు

**translucence** : *కాంతిసారకత.*

(చూ : polyester resin)

**translucency** : *కాంతిసరత; వ్యతిగత కాంతిమయత.*

స్పష్టమైన దృశ్యత లేకుండగానే కాంతిని తద్ద్వారా పోనివ్వటానికి ఒక ద్రవ్యంలో ఉండే సామర్థ్యం ఇటువంటి సమర్థతకలిగిన పదార్థాన్ని కాంతిసరళ (*translucent*) మని అంటారు.

**translucent** : *కాంతిసరకం*

**trasmitted light** : *ప్రసారితకాంతి.*

**transparency** : *పారదర్శకత*

(చూ : opacity)

**transparent** : *పారదర్శక.*

**transparent base** : *పారదర్శకవర్ధకం.*

కౌశేయ యవనికలోనూ కౌశేయ లేఖనాలలోనూ సహజంగా కాంత్యభేద్యాలుగా ఉండే కళాకార వర్ణాలలోనూ సంస్కరిత తైలవర్ణాలందునూ కాంత్యభేద్యతను తగ్గించి కావలసిన శ్రేణికి పారదర్శకతను తెచ్చి సంపీనకంతో పాటు-రచనా సమర్థతను పెంపొందించటానికి-వాడే మాధ్యమం లేదా వర్ణవిస్తారకం. ఇటువంటి వర్ధకాలలో రెండు రకాలవి ఉన్నాయి అందులో చిరస్థాయిత కలిగిన మేలిరకపుది, పెట్రోలియం జెలీలాగా పారదర్శకత కలిగి ద్యుతిమంతమై ఉంటుంది అల్యూమినియం స్టీరేటును విసర్జకాలిగాని ఆల్కైడ్‌తోనో, ఆక్రిలీయ యక్షధూపంతోనో మేళవించి, దానికి ఖనిజ శీధువులు చేర్చి ఈ మేలిరకపు పారదర్శక వర్ధకాన్ని తయారుచేస్తారు. దీన్ని పెద్ద మొత్తాలలో వర్ణాలకు కలిపినా, వర్ణఘటనలలో మార్పులు ఏవీరావు. ఇదిగాక చౌకరకపు వర్ధకంకూడా ఇంకొకటి గారసున్నంలాగా కనిపించటమేగాక, తాకిచూచినా అది అటువంటిదిగానే కన్పిస్తుంది. దీన్ని రంగులకు కలిపినప్పుడు వాటి ఉజ్జ్వలత తగ్గిపోతుంది; వ్యాపారరీతిలో భారీ ఎత్తున సాగే కౌశేయయవనికా ప్రక్రియలో ముఖ్యంగా దీన్ని విస్తారకంగా వాడతారు పారదర్శక వర్ధకం ఎన్నో కుతూహలకరమైన ఘటనలకు దారితీస్తుంది. ఒక పారదర్శక వర్ణాన్ని వేరొక వర్ణంపై ముద్రించినప్పుడు అధోవర్ణము అది వెలువరిస్తూ కొత్తకొత్త వర్ణఘటనలను సృష్టించగలదు. వేరు వర్ణద్రవ్యాలను ఎన్నింటిని వాడినా ఇటువంటి ఘటనలు సమకూరవు. ఆ వర్ణద్రవ్యాల పూతలు కాంత్యభేద్యకాలు కావటమే ఈ పరిస్థితికి మూలకారణం.

**transparent brown** : *పారదర్శక కపిశం.*

హరితమృత్తికను భస్మీకరించగా లభించే ఒక కపిశ వర్ణద్రవ్యం. లాలిత్యానికి, స్పష్టతకు, గాఢతకు ఇది పేరు పొందింది.

**transparent copper green** : *పారదర్శక తామ్ర హరితం*

ఒక తామ్ర యౌగికంతో రోచనిని కలిపి కాల్చి ద్రవీభూతంచేయగా లభించే ఒక హరిత యక్షధూపం. మధ్య యుగాలలో కొంత కాలం ఇది వాడుకలో ఉండినది.

**transparent gold ochre** : *పారదర్శక స్వర్ణగైరికం.*

సహజసిద్ధమై లభించే ఒక పసుపు గైరికం. దీనికి మందపు సమష్టిస్థాయీ, కాంతివంతపు పారదర్శిక అధస్థాయీ ఉంటాయి.

**transparentizer** : *పారదర్శనిక.*

1. తయారుచేసే సమయంలోగాని, తయారైన తరవాతనేగాని ఒక పూతరంగుకు

దాన్ని పారదర్శకంగా చేయటానికై కలిపే ఒక పాదకం.

2 వాణిజ్యరీతిలో తయారయ్యే ఒకానొక ద్రవవిశేషం దగసరిగా ఉండే ఆలేఖన వస్త్రంపై వ్రాయబడ్డ సిరా ఆలేఖనాలకు దీన్ని పట్టిస్తే, ఆ వస్త్రం తగినంత పారదర్శకంగా పరిణమించి తుది విన్యాసాల తయారీకి ఉపక రిస్తుంది పాతపడ్డ లేదా మన్నుపడిన అను లేఖనాలను, ఆలేఖనాలను పునర్నవీకరింపటా నికికూడా పారదర్శనికను వాడతారు.

**travesty** : అవహేళన.

కళావిమర్శలో వాడబడే పారిభాషికపదం. గంభీరమైన ఒక కళారచనను ఉద్దేశపూర్వ కంగా కింది స్థాయికి లాగే దృష్టితో దాన్ని అపహేళనాత్మకంగా అనుకరించి సాగించిన చిత్రణకు ఈ పదాన్ని విమర్శకులు ఉపయో గిస్తారు ప్రాచీన గ్రీకుల కాలంలోకూడా వారి దేవతల మూర్తులను, ఎగతాళిచేసే దృష్టితో కొన్ని కలశాలపై ఇటువంటి రచ నలు సాగాయి.

**tray** : కరావం; పళ్ళెం; తట్టుపలక.

**treatment** : అభివ్యక్తీకరణ.

**trecento** : త్రిశతి

'ట్రెసెంటో' అనేది ఇటాలియన్ భాషా పదం. దీని అర్థం 'మూడువందలు' అని. కాని క్రీస్తుశకంలో ఒకవేయిజరిగిన తరవాత గడచిన మూడువందలు అని దాని భావార్థం. 14వ శతాబ్దిలోని ఇటాలియన్ కళకు ఇది పేరుగా వాడబడుతున్నది.

**trefoil** : చూ : foil

**trellis work** : జాలకర్మ; జాలీపని.

**triangle** : త్రికోణము; త్రిభుజం.

రేఖాకర్త వాడే ఒక విధమైన పరికరం. చదునుగా ఉండే ఈ పనిముట్టు కల్పకం తోనో, కొయ్యతోనో, తదితర పదార్థంతోనో తయారవుతోంది. పలుతీరుల కోణాలను తెలిపే రేఖలను గీయటంలో సహకరించే ఈ త్రికోణములు, త్రిభుజరూపాలలో అనేకవిధ మైన ప్రమాణాలలో, తీరులలో లభిస్తాయి. ఇందులో ఎక్కువగా వాడుకలో ఉండేవి సమకోణ త్రిభుజాకారం గలవి అందులోనూ రెండు విధాలున్నాయి అందొకరకపుదానిలో సమకోణంగాక మిగిలిన రెండుకోణాలు సమంగా-అంటే ఒక్కొక్కటి 45° చొప్పున- అమరిఉంటాయి. రెండోరకపు దానిలో సమ కోణంగాక మిగిలిన రెంటిటిలో ఒకటి 60°గా, రెండవది 30ం గా ఉంటాయి ఈ రెండు త్రికోణాలను ఒకదానివెంబడి ఒకదాన్ని జతపరచి, కింద భూమిరేఖ స్థానంలో దంత చతురస్రమును ఉంచి వాడినప్పుడు 15°ల, 75°ల కోణాలనకూడా సాధించవచ్చు ఇటు వంటి త్రికోణాలలో ఒక దానిని సరిఅయిన రీతిలో నిలిపి ఉంచి, రెండవ దానిని తొలి దాని అంచురేఖను అనుసరించి నడపినప్పుడు

సమాంతర రేఖలను గీయవచ్చు. ఇట్లా వేర్వేరు త్రికోణాలను వాడటానికి బదులు సమనీయ త్రికోణము ఒకదానినే, తన కార్యసాధనకు రేఖాకర్త వాడుకోవచ్చు.

**trimetric** : త్రిమాత్రికా; త్రిమితీయ.

**trimetric projection** : త్రిమితీయ ప్రక్షేపణం; త్రిమాత్రికా ప్రక్షేపణం.

యాంత్రిక ఆలేఖనంలో వాడుకలో ఉండే ఒక విధపు ప్రక్షేపణం. ఇందులోని మూడు అక్షరేఖల క్షయవృద్ధి స్థాయిలు- వాటి పొడవులకు సంబంధించినంతవరకు- విభిన్న రీతులలో ఉంటాయి అందువల్ల మూడు ఆయతనాలను మూడు విభిన్న నియతులను అనుసరించి రూపొందించవలసి వస్తుంది. ఇందువల్ల మూడుఅక్షరేఖలు కలిసే చోట ఇవి చేసే కోణాలుకూడా విభిన్నాలుగా ఉంటాయి. (చూ: *projection*)

**triptych** : ముప్పలక; పలకత్రయి

మూడు చిత్రాలు లేదా ఉల్బణ శిల్పాలను మడతబందులతో అతికిన ఒకసంపుటి; ఇందులోనిచిత్రాలు ఏకవస్తువుకే సంబంధించి ముడిపడి ఉంటాయి. ఈ మొత్తపు ముప్పలకను ఎక్కడికి కావలసివస్తే అక్కడ అమర్చటానికి అనువైన వేదికాలంకృతిగా వాడుకోవటం జరుగుతుంది. ఈ పలకలలో నడిమిదాని వెడల్పు, రెండు వక్కల ఉన్నవాటిలో ప్రతి దాని వెడల్పుకు రెండింతలుంటుంది. అందువల్ల పక్క ఉండేవాటిని (వీటినే రెక్కలు. లేదా ఉదంచనములు అంటారు) మడత బందుల వద్ద వంచినప్పుడు, అవి నడిమిపలకను సంపూర్తిగా మూసివేస్తాయి ఇటువంటి అమర్పులకు వంకల సంఖ్యను బట్టి మడత పలక (*diptych* - రెండు పలకలుగలది) బహుపలకము (మూడుకన్న ఎక్కువపలకలు- సాధారణంగా-అయిదు పలకలు కలవి) అనేవి కూడా ఉన్నాయి వీటిలో మడతపలకను మడచి పుస్తకంలాగా పట్టుకొని పోవచ్చు ముప్పలకలో మధ్యనున్న ఫలకంలో చిత్రించటానికి ఉద్దేశించినదానిలో ముఖ్యవిషయం చిత్రితమై, పార్శ్వములలో అనుషంగిక విషయాలు చిత్రితములవుతాయి ఈ పలకల మొత్తాన్ని తెరచి ఒక వేదికపైనంటి దానిపై ఉంచటానికి తగిన అమరింపుకూడా ఉంటుంది. ఆ వేదికయే పీండిక (*predella*) అని వ్యవహృతం. ఈ పీండికకూడా చిత్రితంగానో, శిల్పితంగానో ఉంటుంది. ముప్పలకవంటి ఇటువంటి వేదికాలంకృతులు చిత్రలేఖనంలో, మణికాచంలో, దారువులో, దంతంలో, లోహంలో నిర్మితమవుతు- బైజాన్‌టెయిన్ సామ్రాజ్యపు కాలంలో ఆ రాజ్యపు చర్చిలలోనూ, మధ్యయుగ పునరుజ్జీవనయుగాల కాలంలో పశ్చిమ యూరపులోని చర్చిలలోనూ సమధిక గౌరవాన్ని ఆర్జించాయి. ఇటువంటి వంకల చట్టాలు సుపరిష్కృత రీతిలో మలచబడటమో, స్వర్ణ

రంజితములు కావటమో, బహువర్ణ భూషితాలు కావటమో జరిగేది. మువ్వంకల రూపంలో ఎన్నో ప్రసిద్ధ కళాఖండాలు రూపొందాయి. వాటిలో యాంద్రియా మాంటెనా (1459) రచించిన 'సాన్ జెనో వేదికాలంకృతి', జియోవాన్ని బెల్లిని రూపొందించిన ఫ్రారి మెడోన్నా (1488) అనేవి గణనీయాలు. ఆధునిక యుగంలో మేక్స్ బెక్‌మాన్ 1937లో రచించినది 'నిష్క్రమణం' అనే మువ్వంక.

**tristimulus values : ఉత్తేజకపు విలువలు.**

వర్ణమాపకంలో వాడుకలో ఉన్న, పారిభాషిక పదం. వర్ణరంజితమైన ఒక ఉపరితలాన్ని వర్ణమాలా వర్ణోత్తేజకములు (ఉదా : ఎరుపు, ఆకుపచ్చ, నీలము)-వివరణతో తెలియచేయుటలో విశదమయ్యే సూత్రాంగాలు.



మువ్వంక : దారుఫలక నిర్మితమైన వేదికాలంకృతి [ 420- 481]; కాలో. యా వాసియగు ఒక అజ్ఞాత చిత్రకారుని రచన ఇది. ఇందలి ప్రముఖ చిత్రాంశమూ, పంచశయ్యా ఆంద్రూ మహర్షియొక్క జీవిత విశేషాలను రూపిస్తున్నాయి.

**triumphal arch** : *విజయతోరణం.*

ప్రాచీన రోమనులు కల్పించిన సంస్మరణ వాస్తు నిర్మాణం. యుద్ధంలో సాధించిన విజయానికి ఒక ప్రతీకగా దీన్ని వారు వెలయించారు. కాని తరవాత కాలంలో నగర వీధుల సౌందర్యాన్ని ఇనుమడింపజేసే సంకల్పంతో చాలా నగరాలలో వీటిని నెలకొల్పటం జరిగింది. ఈ విజయతోరణాలలో రోమనుల తోరణానికి(ఆర్చికి)గ్రీకుల వాస్తువులోని వివిధ రీతుల స్తంభాలను-ముఖ్యంగా కొరింతియన్ సంప్రదాయపు స్తంభాలను-జతపరచటం జరిగింది.

**trompe l'oeil** : నేత్రవంచన (వాదం)

'ట్రాంపీ లాయిల్' అనేది ఒక ఫ్రెంచి భాషాపదం. 'కళ్ళను వంచించటం' అని దీని అర్థం. వాస్తవికత నిండి వెల్లివిరుస్తూ, చూసేవారికి అక్కడ రూపితములయినవి యథార్థవస్తువులేగాని వాటి చిత్రిత ప్రతిరూపాలు కావని భ్రమింపచేసే ఛాయాచిత్రక వాస్తవికత కలిగిన చిత్రణకు ఈ 'నేత్రవంచన' అనేది వర్తింపజేస్తారు. చిత్రణలోని ఒక శైలికి (వాదానికి) దీనిని పేరుగా వాడుతున్నారు. నేత్రవంచన అనే దానికే భ్రాంతి వాదం అనే పర్యాయనామం కూడా ఉంది. యు స్టేట్‌లో ఇటువంటి శైలిలో 19వ శతాబ్దంలో రచనలు సాగించిన వారిలో ప్రముఖుడు విలియమ్ మైకేల్ హార్నెట్ (1848-1892). ఇరవయ్యో శతాబ్దంలో అటువంటి శైలిని అవలంబించిన అమెరికన్ చిత్రకారులలో ఆరాన్ బొహరోడ్ (1907 జ.) సుప్రసిద్ధుడు.

ఇరవయ్యో శతాబ్దంలో ప్రచలితమయిన జాలవాస్తవికతా వాదం అని వ్యవహృతమయ్యే ఒక వాదంలో 'ఛాయాచిత్రక' వాస్తవికత ఒక ముఖ్యలక్షణంగా పేరెన్నిక పొందింది. అధివాస్తవికతలోనూ ఇటువంటి



నేత్రవంచన విలియమ్ మైకేల్ హార్నెట్ రచించిన 'సంగీతము, చక్కని అదృష్టము' [1888]. కాగితపై తైలచిత్రణం.

ఛాయాచిత్రక వాస్తవికత తరచు చోటు చేసికోవటం ఉంది అనటానికి సాల్వడార్ డాలీ యొక్క రచనలలో కొన్నిటిని లక్ష్యాలుగా పేర్కొనవచ్చు.

నేత్రవంచన శైలిని తరచుగా భవనాలలో (ముఖ్యంగా బరోక్ శైలిలో నిర్మితములయ్యే వాటిలో) కొన్ని వాస్తుంగములను, స్తంభ కుడ్యాలు, నిజస్తంభాలు, భిత్తిశీర్షకములు చివరకు హర్మ్యశిఖరములను సైతం-వాస్తవంగా అక్కడ ఉన్నట్లు భ్రాంతిని కల్పించే రీతిగా చిత్రించటంలో చూడవచ్చు. ఇటు వంటి చిత్రణ అత్యంత వాస్తవికమైన దృష్టి ప్రక్రమగతిలో సాగుతుంది. రేఫేల్ రచించిన 'ఏతెన్స్ విద్యాశాల' 'డిస్పూటా'ల వంటి విపులమైన ఆక్లిష్టములకు, వాస్తువిషయికములయిన అమరికలను చిత్రితములుగా చట్రపురూపంలో తగినరీతిలో అమర్చటం కూడా జరిగింది. ఒక పైకప్పు లోకట్టులో గాని, గోడ పైభాగంలోగాని ఉద్బంధనపు దృష్టిప్రక్రమగతిలో, వాస్తవికత ఎక్కువగా ద్యోతకమై యుండేట్లు సాగిన చిత్రణను దేనినైనా ఒక రకపు 'నేత్రవంచన'పు చిత్రంగానే భావించవచ్చు. సిస్టీన్ దేవళంలో పైకప్పు లోకట్టున 1508లో ప్రారంభించి మైకేల్ ఏంజెలో రచించిన 'ప్రవక్తల, దివ్యవాణికల' మూర్తులును, నగ్నవిగ్రహాలనూ దృష్టిప్రక్రమ గతిలోని అతికుశలతవల్ల సాధించిన నేత్రవంచనకు చక్కటి లక్ష్యాలు.

**trucage** : *కూటత.*

నిజమైన వస్తువు కాకపోయినా, ఇతరులకు దానిని నిజమైనదిగా చూపి వంచించటం. 'ట్రూకేజ్' అనేది ఫ్రెంచిభాషా పదం.

**trunk** : *మొండెం; కబంధం; స్కంధం.*

**T square or tee square** : *దండ చతురస్రం.*

రేఖాకర్త వాడే ప్రాతిపదిక పరికరాలలో ఒకటి; పొడవుగా, చదునుగా ఉండేట్లు కల్పకంతోనో, దారువుతోనో నిర్మితమైన పరికరం. దీని ఒక కడఅంచులో లంబరీతిగా అడ్డంగా జతపరచిన బద్ద ఒకటి ఉండటంవల్ల, ఇది చూడటానికి ఆంగ్లలిపిలోని T (టీ) అనే అక్షరాన్ని పోలి ఉంటుంది. అందువల్లనే ఆంగ్లంలో దీనికి టి స్క్వేర్ (*T square*) అనే పేరు వచ్చింది. వ్రాతబల్లయొక్క అంచుకు ఈవరికరవు అడ్డబద్దను ఆనించినప్పుడు రేఖిణిని సరిఅయిన స్థానంలో ఉంచి లంబరేఖనో, అనుప్రస్థరేఖనో, కావలసిన దానిని చక్కగా గీయటం వీలవుతుంది. త్రికోణమును ఉపయోగించి కోణాలను గీయవలసినప్పుడు, దీని అడ్డబద్దను భూమిరేఖగా వాడవచ్చు.

**tube** *నాళిక.*

కళాకారులు ఉపయోగించటానికి తగి ఉండి, ముద్దపాకంలో ఉండే వర్ణాలను కలిగిన సంకోచ్య లోహసంచయని. 1840 నుంచి ఇది వాడుకలో ఉన్నది. రంగులను చెడకుండా నిల్వచేయటానికి, ఆక్సీకరణకు లోనుగాకుండా కాపాడటానికి, త్వక్కులు ఏర్పడకుండా కాపాడటానికి, బాష్పీభవనాన్ని అలస్యం చేయటానికి ఈ నాళికలు ఎంతో

గానో ఉపకరిస్తాయి. తక్కిన విధాల సంచయులు ఉన్నా వాటిని ఒకసారి మూతవేసి, ఏ కొద్దిగానో వాడినంతనే, అవి నాళికలలాగా రంగులను కాపాడలేవు కాబట్టి తగరంతో చేసిన నాళికలు చాలా నాణ్యమైనవిగా లెక్కకు వచ్చినవి.

ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి పూర్వం మేలి లక్షణాల రంగులకు తగరపు నాళికలనే తప్పనిసరిగా వాడటం జరిగింది. ఆ యుద్ధకాలం మొదలు తగరం తగినంతగా లభ్యపడక పోయినందువల్ల ఉన్న కొద్దితగరమును ఇటువంటి నాళికలకే వినియుక్తం అవుతుంది అనే భయంతో చాలా దేశాల ప్రభుత్వాలు ఇటువంటి వినియోగాన్ని నిషేధించాయి. అందువల్ల, సీసం, అల్యూమినియం, ఈ రెండిటి మిశ్రలోహం మొదలైనవాటిని తగరానికి బదులుగా వాడి, నాళికలను తయారు చేస్తున్నారు. ఇవిఅన్నీ కొన్నిసాంకేతిక కారణాలవల్ల తగరంవలె ఏవిధంగానూ ఉపయోగపడకున్నవి. తగరపు నాళికలకు బదులుగా పాలిఎథిలీన్‌తో చేసిన నాళికలూ, ఒత్తుకుసీసాలూ రంగులకై వాడటం జరుగుచున్నది. అయితే పైవాటిలో ఏవీ తగరపు నాళికలగా ప్రయోజనకారులు కావు. చాలా చక్కగా తయారుచేసిన తైలవర్ణాలు నాళికలలో ఎంతకాలమున్నా వాటిరంగుచెడదు, కాని నీరుకలిపిన పూతరంగులు, భాష్పశీలక ద్రావణాలతో మేళవించిన పూతరంగులు మాత్రం నాళికలో ఉంచిన తరవాత–అందునా ముఖ్యంగా నాళికను ఒకసారి తెరచి వాడిన తరవాత–తాత్క్రమాన గట్టిపడటమో ఆరిపోవటమో పూర్తిగా సంభవిస్తుంది. శిల్పకాలోచితమై ప్రామాణికంగా భావించే ఇటువంటి నాళిక 1"×4" ప్రమాణంలో, 37 ఘ.సెం.మీ.కు తగ్గని పూతరంగును కలిగి ఉండాలి. పౌండు నాళిక అనేదికూడా ఒకటి ఉంది దీనిలో తెలుపురంగులను మాత్రమే నింపుతారు. ఇది 1 1/2 × 6 అంగుళాల ప్రమాణం కలిగి, 150 ఘ సెం మీ కి తగ్గని పూతరంగు కలిగి ఉంటుంది. రమారమి 1840 ప్రాంతాన విస్తృత క్రేతల మూత్ర వర్తికలలో సంకోచ్య నాళిక అగ్రగణ్యస్థానమార్జించి శీఘ్రకాలంలోనే, అదివరలో పూతరంగులను ఉంచుకొనే క్లోమాలను అవలకు నెట్టివేసి వాటి స్థానాన్ని కైవసం చేసుకుంది. ఇట్లా కళారంగంలో ఈ నాళిక ప్రవేశించటాన్ని చారిత్రకంగా ఒక ప్రముఖ ఘట్టంగా పేర్కొనవచ్చు. తరవాత కాలంలో కళాకారుల అలవాట్లలో ఎన్నో మార్పులకు ఈ నాళిక కారణమైంది. పూతరంగులతో ప్రతిఒకదానిని తయారు చేసుకోవటానికై కొత్తరంగులను నూరుకోవలసిన దుర్వస్థనుంచి కళాకారుడు, ఈ నాళికవల్ల రక్షితుడైనాడు, వహనీయ ప్రలేపపేటికా, ఆరుబయలు చిత్రణలు రూపొందటానికి ఇదే కారణభూతమైంది.

**tube colour** : *నాళికావర్ణం.*

**tufa** : *పొంతరాయి.*

సరంధ్రం, అత్యల్ప స్ఫటికసంతం అయిన ఒక విధపు సున్నపురాయి ప్రాచీ

నులు దీన్ని శిల్పానికై అవసరమైనప్పుడు ఉప యోగించారు

**turbid medium : ఆవిల మాధ్యమం.**

బురదనీటిలాగానే, కాంతిని తన ఘనరాశి అంతటినుంచీ విక్షేపించే పదార్థం ఏదైనా దానికి ఈ పేరు వర్తిస్తుంది. విస్తృతార్థంలో అటువంటి ధర్మాన్నే ప్రకటించే ఏ పూత రంగుకైనా, వర్ణపదార్థానికైనా ఈ పేరును వాడుతున్నారు ఇది వర్ణవిజ్ఞానానికి సంబంధించిన విషయమేగాని చిత్రకారుడి పరిభాషకు చెందింది మాత్రంకాదు

ఒక మాధ్యమంలో ఉన్న ఆవిలత (*turbidity*) యొక్క స్థాయిని, ఆ మాధ్యమం విక్షేపించే కాంతి పరిమాణాన్నిబట్టి నిర్ణయించవచ్చు ఆవిలతలోని వివిధ స్థాయిలను తెలియజేయటానికి పాలలో ఒక క్రమపద్ధతిలో నీటిని కలపటాన్ని ఒక సాధనంగా గ్రహించవచ్చు వాతావరణంలో ఆవిలతఉంది. వాయుగత దృష్టిప్రక్రియత అనేదాన్ని, వాతావరణపు ఆవిలతకు అనుకృతి అనచెప్పాలి.

**Turkey red : టర్కీఎరుపు.**

ఒక ఛాయ పేరు, గాఢంగా, సంపన్నమైన ఎరుపు వర్ణంతో దాదాపు కాలాయనపు రీతిగా ఇది కనపడుతుంది ఇది ప్రామాణిక వర్ణంగా గుర్తింపు పొందలేదు.

**Turkey umber or Turkey brown : టర్కీకపిశం.**

తామ్ర ధాత్రికానికి పర్యాయనామం; ధాత్రి కాలో అత్యుత్తమైన రకంగా పేరుపొందింది.

**turmeric : హరిద్రం.**

సహజసిద్ధమైన ఒక రంగద్రవ్యం, పసుపు మొక్కయొక్క గడ్డలనుంచి ఇది తయారవుతుంది. వర్ణద్రవ్యంగా పూర్వం దీనికి వాడుక ఉండేది ప్రస్తుతం ఇది ఆరీతిగా వాడుకలో లేదు,

**Turnbull's blue : టరన్ బుల్ నీలిమ.**

ఒక ఆకాశనీలపు యౌగికం; ప్రష్యన్ నీలపు తయారీలో మధ్యంతర ఉపోత్పన్నంగా ఇది లభిస్తుంది.

**Turner's yellow : టర్నర్ పీతం; టర్నర్ పసిమి.**

ఈ కాలంలో వాడుకలోలేని ఒక ప్రాచీన వర్ణద్రవ్యం ఉజ్జ్వలపీతంనుంచి, నారంగ వర్ణాల వరకు వేర్వేరు ఛాయాభేదాలలో ఇది లభిస్తుంది. రాసాయనికంగా ఇది సీసపు ఆక్సీక్లోరయిడు. అల్పకాలంలోనే నలుపుగా పరిణమించటంవల్ల ఇది ఆదరణ కోల్పోయింది.

**turning tool : సారె పలక.**

తిరిగే కుమ్మరిసారెపై ఉంచే మట్టిముద్దకు గాని, సుధాపిష్టానికిగాని రూపకల్పన చేయ

దంలో సహకరించే ఒక పరికరం ఇది చాలా తీరులలో ఉంటుంది. అయినా అన్నిటికీ సర్వ సామాన్యంగా ఒక చేపిడీ, దానిలో నాటిఉండే ఒక ఉక్కుకడ్డీ ఉంటాయి. ఇక కడ్డీకి సం



సాగె పంకి

ధించబడిఉండే చదునైన ఉక్కువలకమాత్రం ఉద్దిష్టమయ్యే రూపకల్పనను అనుసరించి రకరకాలుగా ఉంటుంది కాని ఆ తీరులలో మూడు మాత్రం ప్రముఖమైనవి 1 బాప్లు బిందువు పోలిఉండేది 2 త్రిభుజం, 3 పాంపలయంలాగా ఉండి, ఒక పక్కమాత్రం నిలువుదీరి ఉండేది.

**turnsole** : *శ్యామకం.*

సహజసిద్ధమైన ఒక రాజనీలపు రంగ ద్రవ్యం. యూరప్‌లో పెరిగే ఒక విధపు పొద్దుతిరుగుడుచెట్టు విత్తనాలనుంచి దీన్ని తయారు చేస్తారు మధ్యయుగంలోను, పున రుజ్జీవన యుగంలోను ఇది వాడుకలో ఉండినది.

**turn table** : *తిరుగుడు బల్ల.*

(చూ. modeling stand)

**turpentine** : *కర్పూర తైలం; నర్సరసం; టర్పెన్‌టయిన్.*

వర్ణరహితమైన ఒక విధపు బాష్పశీలక ద్రావణం; కళాకారులు దీన్ని తైలచిత్ర ణంలో, విరళీకరిణిగా వాడతారు. అది ఇంపైన వాసనతో ఉంటుంది. దీని బాష్పీకరణ గతి చాలా ఎక్కువ కావటంవల్ల చిత్రరచనా కృషు లలో అత్యధికంగా వాడుకలో ఉంది. సాధా రణ పరిస్థితులలో, అపాయకరమైన రీతిలో అది జ్వలనశీలం కాదు, ఆరోగ్యానికి భంగ కరంకూడా కాదు. అయితే కొంతమంది వ్యక్తులకు మాత్రం ఇది తత్త్వతః సరిపడక శరీరంపై మంటకలిగిస్తుంది. వారిక్రామిక రంగంలో దీని వాడుకకు అపతలకు నెట్టి ఖనిజశీధువులు ముందుకు రాగలిగాయి. కొంతమంది కళాకారులు సైతం కర్పూర తైలానికి బదులుగా ఖనిజ ద్రవ్యామ్లాయా లను ఎక్కువగా అభిమానిస్తున్నారు మేలి రకపు కర్పూరతైలం, విక్రేతలచేత కర్పూర తైలపు స్వచ్ఛ నిర్యాసశీధువులు (*gum spirits*) అనే పేరుతో అమ్మబడుతున్నది. ఇంతకన్నా చౌకగా దొరుకుతూ, ఎక్కు వగా వాడకంలో ఉన్నది దారు కర్పూర తైలం (*wood turpentine*). అయితే దీని కన్నా తొలుతటిది విశిష్టతరం. దేవదారు వృక్షాల గీతవల్ల లభించే భావవంతమూ శ్యానమూ అయిన బాల్సమ్ తైలాన్ని అభిష వించి కర్పూరతైలాన్ని తయారు చేస్తారు. యు. స్టే. లోని ఆగ్నేయ ప్రాంతంలో పంట

పైరుగా పెంచబడే 'పచ్చదేవదారు' వంటి వాటినుంచికూడా దీన్ని తయారు చేస్తారు. శంకువలక (conifer) జాతికి చెందిన వృక్షాలనుంచి లభించే క్షారవంతములైన అన్ని రీతుల తైలయుక్తరూపాలుకూడా కర్పూర తైలాలుగానే మొదట్లో వ్యవహృతములైనాయి. వెనిస్ కర్పూర తైలం, స్ట్రాస్‌బర్గ్ కర్పూర తైలంవంటి వాటిలో ఆ సంప్రదాయం నేడు కూడా కనవడుతున్నది.

ప్రాచీనులైన రోమనులకున్నూ గ్రీకులకున్నూ కర్పూరతైలం సుపరిచితమే. దాన్ని తయారు చేయటానికై దేవదారు తిండుకని ఒక కటాహంలో ఉంచి, ఆ కటాహముఖకు పై మూతగా గొర్రె తోలును కప్పి కట్టేవారు. అట్లా కట్టటంలో ఉన్ని ఉండే భాగం కటాహపు లోవైపుకు ఉండేట్లు వారు జాగ్రత్తవహించేవారు. అప్పుడికి ఆ మొత్తాన్ని మరగగాచి, ఆ తరవాత గొర్రెతోలును బయటకు తీసి పిండగా ఉన్నినుంచి కర్పూరతైలం కిందికి పడేది. అయితే ఆ ప్రాచీనులు దీన్ని చిత్రలేఖనంలో వాడినవారుకారు. ఒకకర్పూర తైలమేగాదు, మద్యసారం మొదలైన తిక్కిన బాష్పశీల ద్రావణాలలో సైతం దేన్నిగానీ కళాకారులు క్రీ.శ. 1400వరకు ఉపయోగించలేదు. అభిషవన క్రియలోసులభవద్ధతులనుకనుగొన్న తరవాత చిత్రలేఖనంలో వాటికి వాడుక లభించింది

**turpeth mineral** : *రేచక ఖనిజం.*

అత్యంత విషమయమై, ఉజ్జ్వలత కలిగిన పచ్చని ఒక వర్ణద్రవ్యం. కొద్దికాలంలోనే ఇది నలుపుగా మారటంవల్ల వాడుకనుంచి ఇది అంతరించింది

**turquoise green** : *వైడూర్య హరితం.*

అల్యూమినియం, క్రోమియం, కోబాల్టుల భస్మాలను పండగాల్చటంవల్ల ఇది లభిస్తుంది. నీలివాక-ఆకుపసిమి రంగుతో స్పష్టతకు పేరొంది అరదుగా లభించే ఈ వర్ణద్రవ్యం మన్నిక గలది. మార్దవ ప్రక్రియలలో దీనికి కొంత వాడుక ఉంది.

**turret** : *వలభి*

**Tuscan red** : *తస్కన్ శోణం.*

సుసంపన్న కాలారుణ రంజక వర్ణద్రవ్యం. పారిశ్రామిక రంగంలో దీనికి వాడుక ఉంది,

**Tuscan school** : *టుస్కన్ సంప్రదాయం.*

ఇటలీలోని ఫ్లారెన్స్, సియెన్నా, పీసా, లుక్కా, అరెజ్జో నగరాలలో వెలసి, ఆయా నగరాల పేరులతో ప్రశస్తి కెక్కిన వివిధ కళా సంప్రదాయాలకు సమష్టి నామం.

**tusche** : *కాలీయం; ద్రవఖటిక.*

సిరాతో బాగా మేళవించగల ఒక నల్లటి ద్రవపదార్థం. శిలాలేఖక ఖటికలోని వసామయ సాధనద్రవ్యాలే ఇందులోనూ ఉన్నాయి. ఒక రాతిమీద లేదా ఫలకంమీద, కూలికతోగాని కలంతోగానీ ఒక రేఖాకృతిని

కల్పించటానికి శిలాలేఖనంలో ఉన్న వాడతారు ఖటికవల్ల త్వరితగతిలో సాధించ వీలులేని ఘటనలను సృష్టించటానికి కాలీయాన్ని ఉపయోగిస్తారు. అయితే కుంచెతో గాని, కలంతోగాని రూపించిన రేఖలూ, చోట్లూ, అచ్చంగా నల్లటి రూపాలతో ముద్రణములను సృష్టిస్తాయేగాని, ఖటికను ఉపయోగించినప్పుడు వచ్చే వలకువాటపు ఘటన అందులో కనపడదు. లిప్త కౌశేయ యవనికా తైజసమును, కాలీయ లిప్త విధానము తయారుచేయటంలో కూడా కాలీయాన్ని వాడతారు. కౌశేయ లేఖనంలో యవనికను తయారుచేయటంలో ఈ పద్ధతికే ఎక్కువ ఆదరణ ఉంది. కాలీయాన్ని సిరా అని అనకూడదు. రుజువులను తీయటానికి పనికి వచ్చే అచ్చుసిరాకే సిరా అనే పేరు వర్తిస్తుంది, (చూ *lithography ink*)

**tusche – washout method**

**కాలీయ లిప్తపద్ధతి, కాలీయ ప్రధావన విధానం**

కౌశేయ యవనికలోనూ, కౌశేయ లేఖనంలోనూ వాడుకలో వున్న ఒక సాంకేతిక పద్ధతిలో యవనికపైనే నేరుగా ముద్రితములు కావటానికి ఉద్దేశించిన తావును కాలీయంతో రూపించటం జరుగుతుంది. ఆ తర్వాత నీటిలో బాగా కరిగే ఒక బంకను పైపొరగా మొత్తం యవనికపై పూస్తారు. ఇటువంటి పూతకు సంపీడకాన్ని వాడతారు. కాలీయం వున్న తావులలో బంక వున్నా, అది కాలీయాన్ని అంటుకోదు; కాలీయంలోని వసామయతవల్ల ఇటువంటిది జరుగుతుంది. ఆ తరవాత ఆ యవనికను ఖనిజశీధువులతో కడిగివేస్తారు. దీనివల్ల కాలీయం నీటిలో కరగటమూ, దానిపై ఉన్న బంకపొరకూడా దానితోపాటుగానే వెలికిపోవటమూ జరుగుతుంది. కాని ముద్రిత పటలు కానవసరంలేని చోట్లు మాత్రం బంకపూతతో చెక్కుచెదరకుండా ఉంటాయి. ఈ విధంగా రూపీకృతమయ్యే తావులు మాత్రం బయటికి వెల్లడవుతూ, ముద్రణ సమయంలో, సంపీడనంవల్ల నెట్టబడి జాలరం ద్వారా వచ్చే పూతరంగులవల్ల ముద్రితమవుతాయి. వక్రికాభేద పద్ధతిలో మాదిరిగానే ఈ కాలీయ లిప్త పద్ధతిలో కూడా, నీటిరంగులతో ముద్రణను సాగించే వీలులేదు. నీటిరంగులలోని నీటిలో బంక కరిగిపోవటమే ఇందుకుగల కారణం. ఈ కాలీయ లిప్త పద్ధతిలోగాకుండా, ముద్రణకు అవసరమైన తావులను నిండుగాగాని, పాక్షికంగాగాని శిలాలేఖన ఖటికవల్ల రూపొందించవచ్చుగాని, పట్టుగుడ్డపై ఖటికను అదుపులో వుంచుకోవటం చాలా కష్టసాధ్యం.

కౌశేయ తైజసాల తయారీకి అవలంబించే పద్ధతులలోకెల్లా ఈ కాలీయ లిప్త పద్ధతియే కౌశేయలేఖకులలో అత్యధిక సంఖ్యాకుల ఆదరాభిమానాలు ఎక్కువగా పొందింది. ఈ పద్ధతిలో సాంకేతికతలోగాని ఘటనలోగాని వైవిధ్యానికి అవకాశం వుంది. స్వచ్ఛందములు, అనిబద్ధములు అయిన చిత్రణములకు నేరుగా, స్వతస్సిద్ధంగా పునఃకల్పనను

సాధ్యంచేసే ప్రక్రియ ఇది. కాలీయాన్ని ఉపయోగించి చేసే ఒక తూలికా పరిమర్శన, శిలాఖండంతో చేసే ఒక అనేక గీత-ఇవి అన్నీ ముద్రాంకమున నూతరంగులో కనపడతాయి. రాస్ అస్తరం, శాటిక, లేదా సిల్కు పత్రంపై కౌశేయాన్ని పరచి దానిపై శిలాఖండికతో అలిఖించటంద్వారా కాంతివిత పరితలములనుకూడా ఇందులో పునఃకల్పన చేయవచ్చు. కాలీయమును పట్టించటానికి దంతకూర్చిక (*tooth brush*), దువ్వెన, ఇంకా తక్కిన వివిధ పరికరాలనుకూడా అవసరాన్ని బట్టి వాడవచ్చు కాలీయంతో బిందు పర్తనను, లేదా అవసేచనను జరపటం కూడా సాధ్యమే. యవనికకు బాగా గంజి పట్టించి వుంచినప్పుడు, ఈ కాలీయాన్ని సన్నని తూలికతోగాని, కలంతోగాని తీసుకొని పటలంపై సన్నటి రమ్యరేఖలను, జాలికాకృతినాన్ని రూపొందించే వీలవుతుంది.

**twill canvas** : *కర్ణకాశాటిక.*

పరస్పరనేతకు బయిటగా కర్ణరేఖారీతిలో సాగిన నేతగలిగిన శాటిక. 18, 19వ శతాబ్దాలలో-ముఖ్యంగా అమెరికాలో-చిత్రకారులు ఇటువంటి శాటికను ఎక్కువగా ఆదరించారు.

**two-point prespeetive** : *ద్విబిందుక దృక్క్రమగతి*

చూ : **angular prespective.**

**tympanum** : *తుంబుకము.*

వాస్తువిషయకమైన పారిభాషిక పదం. ఒక కిటికీకిగాని, ద్వారబంధానికిగాని పైనున్న అడ్డుదూలానికీ, అంతకుపైన ఉండే ఆర్చి రేఖకు మధ్య ఉండే ప్రదేశం.

**type** [1] : *అర్ణిక; అర్ణం; టయిపు (టైపు)*

**type** [2] . *తీరు; రీతి; కోవ.*

**type (print)** [3] : *ముద్రారీతి*

**type face** : *అర్ణికాముఖం.*

**type-high** : *అర్ణోచ్ఛ్రితం; ఉన్నతార్ణకం.*

వాణిజ్య ముద్రణలలో తరచుగా వాడే అర్ణికల ఎత్తును, అంటే 0.9186 అంగుళపు ఎత్తును కలిగిఉండే ముద్రణ దారుకాన్ని, లేదా ఫలకాన్ని తెలియజేసే పదం. ముద్రాంకాలకై వాడే ఇటువంటి లావుపాటి దారుకాలను ప్రామాణికపు చదునుపరుపుడు (*flat bed*) ముద్రణ యంత్రంలో ఉంచి ముద్రించ వీలవుతుంది. సమీనికా తక్షణం, దారుతక్షణంలో దారుకములు సాధారణంగా అర్ణోచ్ఛ్రములుగానే చేయబడుతాయి.

**typography** : *అర్ణికాలేఖనం.*

కదల్చటానికి వీలయ్యే అర్ణికలను ఉపయోగించి ముద్రించే కళావిశేషం. ముఖ్యంగా అటువంటి ముద్రణలో అవలంబించే ప్రక్రాంతన,

సంధాన కౌశలం అనేవాటికే కళ అనేపేరు వర్తిస్తుందని చెప్పవచ్చు (అక్షరాలను అమర్చే ప్రక్రియయే సంధానమని వ్యవహృతం). ప్రకాంతము ఒక ముఖ్యమైన ప్రక్రియాంశం. అక్షరాముఖాన్ని (*type face*) నిర్ణయించుకోవటంలో కనపడుతుంది. ఈ అక్షరాముఖం అనేదానిలో ఉదీరం (*font*), పరిమాణం (*size*), అవలంబించే అంతరింపు (*spacing*) అనేవి చేరిఉన్నాయి ఇంతేగాక అక్షరవైఖరి కూడా దానిలోనే లెక్కకువస్తుంది. ఈ అక్షర వైఖరులలో ఋజుక (*Roman*), దక్షిణక (*Italic*), ప్రతిభాముఖ (*Bold face*) మొదలైన వైఖరులున్నాయి. 'ప్రక్రాంతం' అనే దానిలో ఆయా అక్షరాల రూపరేఖా విశేషమే (*configuration*) గాక, పుటలోని ముద్రిత పాఠపు నిడివి వెడల్పుల నిష్పత్తి, కదంచులకు అముద్రిత పాఠంతోను, ఆ కద అంచులలో ఒకదానికి వేరొకదానితోను గల సంబంధం, పుటను ఒకటిగానో లేదా అందుకు మించిన పుటాంశాలు (*columns*)గానో విభజించటంలోని ఔచిత్యంకూడా చేరిఉంటాయి. ఇటువంటి అక్షరా ప్రక్రాంతంతో ముడిపడి, ముద్రిత పాఠంలోని లక్ష్యచిత్రణ (*Illustration*), దాని ఉనికి ఉంటాయి. ముద్రితపాఠంతో సమన్వయం పొందిన లక్ష్యచిత్రణకు ఆ ముద్రితపాఠంతో ఆద్యక్షరాలను రమ్యరీతిలో తీర్చిదిద్దటాన్ని ఒక నిదర్శనంగా చెప్పవచ్చు

ఉపయోగించే తీరునుబట్టి అక్షరాలను స్థూలరీతిలో రెండు వర్గాలుగా విభజించవచ్చు:

1 మూలముఖములు : ఇది వ్రాతప్రతిని ముద్రించటానికి సర్వసాధారణంగా ఉపయోగించేవి, 2 వికాశన ముఖాలు : వాణిజ్య రికలలో, శీర్షికలకు, ప్రకటన నినాదములకు, అటువంటివే అయిన ఇతరములకు గ్రంథాల విషయంలో ఉపోద్ఘాతానికి, అధ్యాయ శీర్షికలకూ ఇది వాడబడుతుంది వికాశన ముఖములు, ఎప్పుడు కూడా మూలముఖాలకన్నా ఎక్కువ ప్రస్ఫుటాలుగా ఉండి, ఎక్కువగా శైలీకరణ చెంది ఉంటాయి. ఈ శైలీకరణ ఒక్కొక్క సమయంలో, ఒక విధమైన లిపి చిత్రణనుంచి ఉత్పన్నమైనదికావచ్చు ద్రష్టలను ఆకర్షించే ఉద్దేశంతో ఈ వికాశనార్థికాముద్రణ తరచుగా పెద్ద పరిమాణాలలో, ఎక్కువ అంతరింపుతో సాగుతుంది. ఇటువంటి అంతరింపు పల్లి అక్షరాపంక్తుల మధ్య బాగా ఎక్కువగా వుండగలదు. పంక్తుల మధ్యనేగాక పదాల మధ్యనుకూడ అంతరింపు ఇందులో ఎక్కువగానే ఉంటుంది.

కదల్చటానికి వీలయ్యే అక్షరాల సాయంతో ముద్రణచేసే ప్రక్రియను మొదటిసారిగా 15వ శతాబ్దంలో జోహాన్ గూటెన్‌బెర్గ్ పరికల్పించాడు అంతతో గ్రంథాలను వ్రాతమూలకంగా రూపొందించే పని ఒక్కసారిగా అంతరించింది; అచిరంలో అమృదిమ్మెలతో గ్రంథాలను ముద్రించే పనికన్నీ అంతటితో స్వస్తి చెప్పడం జరిగింది. కాలక్రమేణా, ఈ కదలిక అక్షరాల పద్ధతిలోకూడా పరంపరగా అభివృద్ధికరాలైన మార్పులువచ్చి,

చివరకు అన్నిటికీ తలమానికంగా అక్షికా సంధానాన్ని సాగించే యంత్రాలే వరికల్పితములైనవి ఏకాక్షికా (*monotype*) రేఖాక్షికా (*linotype*) యంత్రములు ఈ శతాబ్ది మలుపులో వరిపుష్టతను ఆర్జించాయి. అక్షికల చేయమరికకన్నా, ఎంతో ఎక్కువ వేగంతో, ఎక్కువ పొదపున ఈ యంత్రాల వల్ల అమర్చటానికి వీలవుతున్నది ఇందువల్లనే ప్రామాణికాలైన చిన్న తీరుల అక్షికలను అచ్చంగా యంత్రంచేతనే సంధానించటం ఈ కాలంలో వరిపాటి అయింది. అంతగా ఎక్కువగా వాడుకలో ఉండని పెద్ద అక్షికలను-వికాశనాదులకై ఉపయుక్తమయ్యే వానిని-నేడుకూడా చేతితోడనే అమరుస్తున్నారు.

**Tyrian purple** : *త్తైరీయ ధూమ్రం.*

రోమన్ యుగంలోను, తదనంతరమున కూడ కొంతకాలంవరకు వాడుకలో ఉండిన ఒక సుప్రసిద్ధ ధూమ్రవర్ణం. కొన్ని విధాల బొచ్చె దేవలనుంచి దీన్ని తయారు చేసేవారు. ప్రస్తుతం దీనినే పోలిన సంయోజిత వర్ణద్రవ్యాలు లభించటంవల్ల ఈ ధూమ్రం వాడుకనుంచి తొలగిపోయింది.

**Tyrolean green earth** : *త్తైరోలీయ హరితమృత్తిక.*

హరితమృత్తికలలో వ్యాపారరీత్యా మేలు రకాలుగా పేరుపొందిన వాటిలో ఒకటి.

# U

**U-gouge** : చూ · **gouge**

**ultraism** *అతిమాత్రతా వాదం.*

అంతకు పూర్వం వ్యాప్తిలో ఉన్న సాంప్రదాయిక, పాండితీయ సిద్ధాంతాలను వ్యతిరేకిస్తూ ఇరువయ్యో శతాబ్దంలో కళా ప్రపంచంలో బయలుదేరి విజృంభించిన తీవ్రవాద భావనలకు అన్నిటికీ కలసికట్టుగా వాడే పదం. యథార్థంగా ఇది సాంప్రదాయికతావాదులు, తీవ్రవాదాలపట్ల తమకుగల నిరసనను తెలియజేయటానికి వాడిన పదమేగాని, నిష్పాక్షికంగా, అర్థవిచారణచేసి, వాడినపదిమాత్రం కాదు.

**ultramarine ash**: *అతిసాగరిక భస్మం.*

అతి సాగరిక నీలాన్ని తయారు చేయటంలో ఉపోత్పన్నంగా లభించే ఒక వర్ణద్రవ్యం. దుర్బలమై, తటస్థమైన ధూస

రపువాకగల నీలపు వర్ణంగలది ఇది. మన్నిక గల నీలిరంగు వర్ణద్రవ్యంగా దీనికి కొంత వాడుక ఉంది.

**ultramarine blue** : *అతిసాగరిక నీలిమ.*

ఒక విధమైన నీలవర్ణ విశేషం దీని బాహ్యస్థాయి, ఉజ్జ్వలమైన మధ్యమ నీలం (కొందరు దీన్ని అచ్చనీలం అనికూడా అంటారు). ఇది బాహ్యస్థాయిలో చెప్పదగినంతగా ఆకుపసిమివాకగా గానీ ధూమ్రపువాకగాగానీ ఉండకనే, అంతఃస్థాయిలోమాత్రం చాలావరకు ధూమ్రపువాకగాను, లేదా తప్పక ఆకుపసిమివాకగాను ఉండగలదు. ఇటువంటి గుణవిశేషం తక్కిన దీర్ఘస్థాయి నీలిమలలో దేనిలోనూ కనపడదు. అతిసాగరిక నీలిమ ఒక ఉద్మాన ఉత్పన్నం. సౌకణిచిత్రణలన్నిటా ఇది చిరస్థాయిగానే వర్తిస్తుంది కాని సద్యస్కంలో మాత్రం వాడబడదు. దీనితో జరిపే చిత్రణపై ఒక బంధకమో, పటలమో ఉంచి దాన్ని రక్షించకపోతే, వాతావరణంలోని ఆమ్ల కాలుష్యాలవల్ల ఇది దెబ్బ తినే అవకాశం ఉంది. కాబట్టి సద్యస్కములకు ఇది పనికిరాదు

పూర్వకాలం ఈ అతిసాగరిక నీలిమను ఇంద్రనీల మణులనుంచి తయారుచేసేవారు పాశ్చాత్య దేశాలలో దీని తయారీ, 12వ శతాబ్ది తరవాతనే, సాగిందని తెలుస్తున్నది. అంతకు ఆరు శతాబ్దాల పూర్వంనుంచే ప్రాచ్యదేశాలలో అది విరివిగా తయారయ్యేది.

ఇటలీదేశపు భాషలో ఈ అతిసాగరిక నీలిమను అజ్జురో ఒల్ట్రేమారినో (సముద్రాలకు ఆవతలనుంచి వచ్చే నీలిమ) అని వ్యవహరిస్తారు మొదట్లో ప్రాచ్యదేశాలైన ఆఫ్ఘనిస్తాన్ మొదలైన వాటినుంచి ఈ నీలిమ ఇటలీకి పోయేది. కాబట్టి ఆపేరు దానికి కలిగింది. ఇంద్రనీలమణినుంచి ఈ రంగును అతిక్లిష్టపు ప్రక్రియవల్ల ఆకాలంలో సాధించేవారు. అప్పటి స్వచ్ఛమైన అతిసాగరిక నీలిమ- పలేపన ద్రవ్యాలన్నిటిలో - విపరీతమైన ఖరీదుతో ఉండేవి. ఒక్కొక్కప్పుడు తూకంలో ఒకపాలు అతిసాగరిక నీలానికి రెండుపాళ్ళ బంగారంకూడా ఇవ్వటం జరిగేది ఈ రంగును ఆ కాలంలో మహారాజులు మాత్రమే తయారు చేయించుకోగలిగేవారు. తమ దగ్గర పనిచేసే చిత్రకారులకు వారి అవసరాలనుబట్టి కొద్ది ప్రమాణాలలో ఆరంగును ఆ మహారాజులు పంచి ఇచ్చేవారు. ఈ రంగులలో ఏకొద్దిగానైనా తాము మిగుల్చుకోవాలనే దురాశతో చిత్రకారులు, ఈ రంగును వాడిన తూలికలను నీటిలో మాటిమాటికీ కడిగి, ఆ తరవాత ఆ నీటినుంచి ఏరపంత రంగునో సాధించి దాచుకొని తమ స్వంతరచనలకు వాడుకొనేవారు. చాల విలువగల చిత్రాలకు మాత్రమే ఈ రంగును ఆ కాలంలో వాడేవారు. సాధారణపు చిత్రాలకు తక్కువరకపు నీలిమలనే ఉపయోగించేవారు.

కృత్రిమపు అతిసాగరికనీలిమను తయారుచేయటానికి యాదృచ్ఛిక పరిశీలనలు తోడైనాయి. వీటిలో మొదటిదానికి లిఖితరూపాన్ని

ఇచ్చినవాడు గెటే మహాకవి (1787) సిసిలీ దేశంలో సున్నపురాతిని కాల్చే బట్టీలలో, వాటి పైభాగంలో, ఒక విధపు నీలిరంగు అట్టగా తయారవుతుందనీ, దాన్ని స్థానికులు నీలిరంగుకోసం పర్యాయ ద్రవ్యంగా వాడతారనీ ఆయన ఒకరికి తెలియజేశాడు. ఆ 18వ శతాబ్ది అంతానూ, 19వ శతాబ్ది ఆరంభంలోనూ ఆపకుండా సాగిన కొన్ని పరిశీలనలు ఇందుకు సహకరించాయి. సోడియమ్ కర్బనితం (సోడాఉప్పు)ను తయారుచేయటానికి 1791 మొదలుగా ఉపయోగించే 'లెబ్లాంక్' ప్రక్రియకు సంబంధించినవి ఈ పరిశీలనలు. ఆ ప్రక్రియలోని కొలిముల పైభాగంలో, అతిసాగరిక నీలిమను అన్ని విధాల పోలిన ద్రవ్యం అట్టలు గడుతున్నట్లు యాదృచ్ఛిక పరిశీలనలవల్ల స్పష్టమైంది. ఈ పరిశీలనలను ప్రాతిపదికలుగా గ్రహించి, ఫ్రాన్స్, జర్మనీలలోని రసాయనికులూ, వర్ణకారులునూ, అతి సాగరిక నీలిమను సంయోజితం చేసే పద్ధతికోసం అన్వేషణ సాగించారు. అయితే అతి సాగరిక నీలిమలో అంతర్భూతమై ఇనుము ఉంటుందనే అపోహ వల్ల వారు కృతకృత్యులు కాలేకపోయారు. 1806లో డెసోర్మెస్, క్లెమెంటు అనువారలు, అతిసాగరిక నీలిమను నిర్దేశించి అందులో గంధకం, సోడాఉప్పు, సిలికా, అల్యూమినాలు చేరిఉంటాయని నిర్ణయించారు. 1814లో యస్. ఎల్. వాన్ క్వెలిన్ అనే అతడు దీనిని ధ్రువపరచాడు.

దీనినంతా గమనించిన వర్ణనిర్మాతలు సరి అయిన ప్రోత్సాహం లభించే పక్షంలో వైజ్ఞానికుడెవడైనా అతిసాగరిక నీలిమను సంయోజిత ప్రక్రియలో రూపొందించగలడనే నిర్ణయానికి వచ్చారు. అటువంటి భావనకు ఫలితంగా, ఫ్రాన్సు దేశంలోని జాతీయ పారిశ్రామిక ప్రోత్సాహక సంఘం కిలోగ్రాము 1కి గిటుబాటు విలువ 300 ఫ్రాంకుల మించని రీతిలో, అతిసాగరిక నీలిమను సంయోజిత రీతిలో ఉత్పత్తిచేసే ప్రక్రియను రూపొందించే వైజ్ఞానికుడికి 6,000 ఫ్రాంకులు బహుమతి ఇవ్వగలమని ప్రకటించింది. (నవంబరు, 1824) అప్పుడు అటువంటి దానిని తాను కనుక్కొన్నట్లు రుజువుచేసిన జె బి గ్విమెట్‌కు 1828 డిసెంబరులో ఆ బహుమతి ఇవ్వడం జరిగింది. అయితే యథార్థానికి ఈ విధానాన్ని 1826లోనే అతడు కనుక్కొని, అతిసాగరిక నీలిమను తయారు చేశాడు కాని ఆ ద్రవ్యాన్ని తమ చిత్రాలలో వాడి ఫలితాలను తనకు తెలియజేయవలసిందిగా కోరుతూ కొందరు ప్రసిద్ధ చిత్రకారులకు ఒక్కొక్కరికి కొంతరంగును గ్విమెట్ అందజేశాడు. వారి నివేదికలు తనకు పూర్తిగా నమ్మకం కలుగజేసిన తరవాతనే గ్విమెట్ దానిని బహుమతికై పంపాడు. బహుమతిని అందుకొన్న తరవాత కూడా ఈ నిర్మాణ ప్రక్రియను గ్విమెట్ చాలా గోప్యంగా ఉంచాడు. ఇంతలో ఈ ప్రక్రియను గురించి ఏమీ తెలియకుండానే స్వతంత్రంగా ఒక అన్వేషణను సాగించి, జర్మనీదేశంలో టీబిన్‌జెన్ నగర నివాసి

అయిన క్రిష్టియన్ గ్మేలిన్ అనే అతడు అతిసాగరిక నీలిమను కృత్రిమంగా తయారుచేసే ప్రక్రియను ఒకదాన్ని ప్రకటించాడు. ఆ తరవాత వెంటనే మరికొందరుకూడా - ఇటువంటివే అయిన ప్రక్రియలను వెల్లడించారు ఈకృషికి ఫలితంగా 1880 లలో యూరపు అమెరికా లలో చాలా ప్రదేశాలలో కర్మాగారాలను నెలకొల్పగా, అతిసాగరిక నీలిమ విరివిగా తయారై వర్ణక్రమంలో, కళలలో సర్వసాధారణమైన వాడుకలోకి వచ్చింది. ఒక్క అతిసాగరిక నీలిమమాత్రమేకాదు; ప్రష్యన్‌నీలిమ, థాలో సియానిన్ నీలిమ అనేవికూడా ఈతీరుననే కొన్ని యాదృచ్ఛిక ఘటనల సాయంతోనే ఆవిష్కృతాలైనాయి.

**ultramarine green** : *అతిసాగరిక హరితం.*

సంరచనలోనూ, ఉత్పాదనరీతిలోనూ అతిసాగరిక నీలిమతో చాలా సామ్యం కలిగిన పాండుర హరితం 1828లో జర్మనీలో దీన్ని కనుక్కొన్నా, ప్రజాదరణను ఏనాడు ఇది విస్తృతంగా పొందలేదు. అయినా చౌకబారు నీటిరంగులలోను, తైలవర్ణాలలోను ఇప్పుడు కూడా దీనికి కొంత వాడుకఉంది.

**ultramarine violet** : *అతిసాగరిక రాజనీలం.*

చాలా దుర్బలమైన ఒక వర్ణద్రవ్యం; అది పొడిగా ఉన్నప్పుడు పాండుర లావెండ్రవర్ణంగానూ, తైలంలో కలసి ఉన్నప్పుడు చీకటి సబువుగానూ, కొంత మందదీప్తిలో కనపడుతుంది. అతిసాగరిక నీలిమకూ దీనికి వర్ణద్రవ్య ధర్మాలలో సామ్యం ఉంది.

**ultraviolet** : *అతినీలలోహితం.*

**ultraviolet light** : *అతినీలలోహితకాంతి*

దృష్టి గోచరమయ్యే వర్ణమాలలో ఒక చివర ఉండే రంగుకు అవలివైపున ఉండే అగోచర కాంతిభాగం; దృష్టి గోచరమయ్యే కాంతియొక్క తరంగ దైర్ఘ్యాలకన్నా, అతి నీలలోహిత కాంతియొక్క తరంగ దైర్ఘ్యాలు కురచగా వుంటాయి అతినీలలోహిత వికిరణాలను కలిగివున్న కాంతి అక్టినిక ధర్మం కలది, అంటే అదికూడా కాంతిరాసాయనిక ప్రతిచర్యలను-వర్ణద్రవ్యాలూ రాగద్రవ్యాలూ రంగువెలిసిపోవటం, పూతరంగులో విదురత వ్యాపించటం, కాంతిరేఖా పత్రంపైగాని పటలంపైగాని ప్రతిచ్ఛాదం ఏర్పడటం మొదలైన వాటికి దారితీసే ప్రతిచర్యలను-ఉత్పన్నం చేయగలదు పరిశోధన శాలలో పరిత్వరిత శోధన ప్రక్రియలలో సమువచిత అతినీలలోహిత కాంతిప్రభవాలనుఉపయోగిస్తారు నేరుగా వచ్చేవడే సూర్యకాంతిలో ఉండే అతినీలలోహితాంశం, కార్బనికమైన ప్రలేపద్రవ్యాలను నిర్మూలించే శక్తి కలది అందువల్లనే సాధారణంగా ఒక కళాకారుడు వాడే ద్రవ్యాలలో చిరస్థాయిత ఎంతగ ఉండగలదనటం-ఆ ద్రవ్యాలను ఉపయోగించి-నిర్మించిన-కళాఖండం ఇంటి నాలుగుగోడల మధ్యన పరివ్యాప్తమయ్యే సూర్యకాంతిలోగానీ, కృత్రి

మపు కాంతిలోగానే ఉండవలసి ఉంటుంది అనే అంశాన్ని దృష్టిలో పెట్టుకొనే నిర్ణయించడం జరుగుతుంది

**ultra-violet ray** : *అతినీలలోహిత కిరణం.*

**umber** : *తృణమణి, అంబరు; జాహ్లికం.*

ఒక గోధుమరంగు వర్ణద్రవ్యం. ఇందుకు సంబంధించి కళాకారుడికి పనికివచ్చే రెండు ప్రధానస్థానాలు-ఆమ తృణమణి, తప్తతృణమణి లభిస్తున్నాయి ఇవి మట్టిరంగులు, ఇందులో మాంగనీజు భస్మమేగాక ఇనుప భస్మంకూడా చేరిఉంటుంది. ఆమతృణమణి చల్లటి ఆకుపసిమివాక గోధుమరంగుతో ఉంటుంది. తప్తతృణమణి నలుపుముదిరిన ఎరుపువాక గోధుమరంగుగా ఉంటుంది. ఈ రెండింటికి మంచి నిగూహన శక్తి ఉన్నది అయితే ఆమతృణమణి కన్నా కొంతఎక్కువ పారదర్శకత కలది తప్తతృణమణి రెండు కూడా చిరస్థాయులే, రెండింటిలోనూ ఉత్కృష్ట వర్ణధర్మాలున్నాయి. తెలుపుతో కలిపి వాడినప్పుడు ఈ రెండింటిల్లోనూ స్వచ్ఛ, విభిన్న వర్ణఛాయలను పెక్కింటిని సాధించవచ్చు తైలంతోకలిపి ఈ రెండింటినీ వాడితే ఆసిత స్థాయిమిశ్రమాల సద్దపాటుకు అది దారితీయవచ్చు. ఇవి రెండునూ, తైలంలో అతిశీఘ్ర శోషణులుగా వర్తించి, పటిష్ఠ, నమనీయ, చర్మసగుణ పటలాలను ఏర్పరుస్తాయి అందువల్ల వీటిని నిండు వటిమతో అధశ్చిత్రణలకు వాడరు. అధశ్చిత్రణకు నమనీయములైన ఇట్టివాటినివాడినప్పుడు, అధిచిత్రణకు తక్కువ నమనీయత కలదానిని వాడితే చిత్రానికి చేటు వాటిల్లగలదు.

అతి ప్రాచీన కాలంనుంచీ వర్ణద్రవ్యంగా తృణమణి వాడుకలో ఉండేదనటంలో సందేహానికి తావులేదు. కాని పునరుజ్జీవన యుగి ఉత్తరార్ధానికి పూర్వం దీని వ్యాప్తి విస్తృతంగా ఉన్నట్లు కనపడదు. మంచి రకపు తృణమణి సైప్రస్ దీవిలో లభిస్తుంది దానినే సైప్రస్ తృణమణి, లేదా తుర్కీ తృణమణి అంటారు.

**under colour** : *అధోవర్ణం.*

**undercut** : *ఎగుడుదిగుడు.*

**underglaze** : *అధోద్యుతికం.*

మార్తస ప్రక్రియలలో ఒక పారిభాషిక పదం మృత్తికాకారానికి పారదర్శక ద్యుతికమును ఉపరితలంలో పట్టించటానికి పూర్వం వర్తించే వర్ణానికి ఈ పదం వర్తిస్తుంది.

**underpainting** : *అధశ్చిత్రణ.*

అధిచిత్రణకు లేదా తుదిపూతకు దిగువన లిప్త ఉపరితలంపైన ఉండే మొదటిరంగు పొర లేదా రంగుపొరలు. ఒక తెల్లటి భూమికను ఛవిలితం చేయటానికి ఉపయోగించే నిర్జీవం మొదలుగా, ఒక పారదర్శకపు ద్యుతికంచే చిట్టచివరకు కప్పబడే వలుపొరల వరి

తలంపరకు పెక్కుతీగల అధశ్చిత్రణ వాడుకలో ఉన్నది. సంవచనను, వర్ణఘటనలను వినిర్మించటానికై మార్గదర్శిగా ఉపకరించటానికి, మొదటిరంగు పొరను తనూకృత తైల వర్ణాలతో మెరుగుపరచవచ్చు
(చూ. abbozo, Macchia ebauche, grisaille).

**underpainting white or textural white :** *అధశ్చిత్రణ శ్వేతం లేదా తాంతవ శ్వేతం,*

ఒక చిత్రానికి విస్ఫుట సాంద్రలేప స్పర్శలు సమకూర్చటానికిన్నీ తాంతవముల వినిర్మించటానికిన్నీ వాడటానికై ప్రత్యేకరీతిలో తయారుచేసే ఒక తైలప్రలేపం 1950లలో యుస్టేలో ఇది విస్తృతమై, పొందు నాళికలలో అమ్మకానికి లభిస్తున్నది వివిధ విక్రయశాలలలో దొరికే ఈ అధశ్చిత్రణ శ్వేతంలో చేరివుండే సాధక ద్రవ్యాల వివరాలు దాని నిర్మాతలకు మాత్రమే తెలుసు వాటి చిరస్థాయిని గురించిగాని, వాటిలో ప్రతిఒకటీ స్వయంగాగాని, లేదా నూనెరంగులతో కలిసినప్పుడుగాని ప్రదర్శించే ప్రవర్తన ఫలితాన్ని గురించిగానీ సమాచారమేమీ తెలియటంలేదు. పెచ్చులు పెచ్చులుగా ఉండే ఈ తెల్లరంగు మూడుపాళ్ళనూ, ఒకపాలు తుత్తుగాగవు లేదా టిటేనియం ఆంటకిలలపు తెలుపుతో కలిపి, విస్ఫుట స్పర్శలకు అనువైన సాంప్రదాయిక పు తెలుపును రూపొందిస్తారు

**undertint** . అంతచ్ఛవి.

(చూ : veil)

**undertone** : అధస్థాయి.

ప్రసారిత కాంతి సాహాయ్యంతో ఒక వర్ణద్రవ్యాన్ని పరీక్షించినప్పుడు వేద్యమయ్యే వర్ణఘటన తెలుపుచే తనూకృతం చేయబడినప్పుడు ఒక పూతరంగులో లేదా వర్ణద్రవ్యంలో కనపడే వర్ణలక్షణ విశేషానికికూడా ఈపదం వర్తిస్తుంది తనకుండే బాహ్యస్థాయికన్నా వేరే వర్ణలక్షణాలను ఒక వర్ణద్రవ్యపు అధస్థాయి కలిగి ఉండవచ్చు, ఉదాహరణకు మాంజిష్ఠ ఘనారుణం, నీలివాకను అధస్థాయిగా కలిగిఉంది కోబాల్టు పసిమి తైలవర్ణం క్లాంత శ్యావ బాహ్యస్థాయి కలిగిఉంటుంది కాని దాన్ని పలుచగా సన్నపొరగా పరచినప్పుడు పారదర్శకమైన బంగారు, పసిమి రంగును పొందుతుంది, తప్తస్వర్ణం మూడు వర్ణఘటనలను ప్రదర్శించగలుగుతున్నది అవి: 1. ఒక మహాగనీ బాహ్యస్థాయి 2. ప్రసారితకాంతివల్ల చేకూర్చే ఉజ్జ్వల నారంగి అధస్థాయి, 3 తెలుపుతో కలిపి ఉపయోగించేటప్పుడు ప్లవనితా పాటలపు అధస్థాయి. తక్కిన వర్ణ ద్రవ్యాలలో-క్వాడ్మియములు మొదలైన వాటిలో, తెలుపుతో కలిపినప్పుడు కనవచ్చే అధస్థాయి, బాహ్యస్థాయిలోని వర్ణలక్షణాలనే కలిగి ఉన్నది.

**unholy** అనంన్కృతం.

**unlettered proof, proof before letter :** *అనాలిఖితపు రుజువు.*

**unreversed** : *అవిపర్యాయ.*

**unsized paper** : *గరుకు కాగితం.*

**upper cloth** : *ఉత్తరీయం; పైవస్త్రం.*

**uranium yellow** : *యురేనియం పసిమి.*

యురేనియం లోహపుభస్మం. ఇది ఉజ్జ్వలపు పసిమిరంగు కలిగి మన్నిక కలిగిన వర్ణద్రవ్యం. దీని ఖరీదు చాలా ఎక్కువ కావటం వల్ల దీని వాడుక చాలా తక్కువ,

# V

**vacuum** : *నిర్వాతం; శూన్యభూమి.*

**value** : *విలువ, మూల్యం.*

తెలుపునుంచి గోధుమవరకు క్రమంగా మారే ధూసరముల శ్రేణికా నియతిలో కాంతితా వస్థాయికి, కళాకారుడు వాడే పారిభాషిక పదం. ఈ విధంగానే ఛాయాభిన్నాలకు కూడా విలువ గట్టవచ్చు శ్యామతరములైన వర్ణాలు విలువలో తక్కువరకపువిగా లెక్కించబడతాయి ఆటువంటి వాటినే తక్కువ కీలకంలో ఉన్నవనీ అంటారు. విలువనే వైజ్ఞానికులు 'కాంతిత' అని వ్యవహరిస్తారు

**Van Dyke brown** : *వాన్ డైక్ కపిశం.*

18వ, 19వ శతాబ్దాలలో విస్తృతాదరణను ఆర్జించిన ఒక గోధుమమట్టి రంగు, కాని తమ చిత్రాలకు చిరస్థాయితను ఆశించే కళాకారులు ఎవరూ దీనిని ఇప్పుడు ఆదరించటంలేదు. సాధారణంగా మట్టిరంగులలో ఉండే కార్బనిక భస్మాలూ, సిలికేటులూగాక, ఈ వాన్ డైక్ కపిశంలో చెదారం (*humus*) కూడా కొంత శాతం కలసి ఉంటుంది. ఇందువల్ల అటువంటి కపిశాన్ని పూతరంగుగా వాడినప్పుడు వర్ణస్థిరత లోపించి, తైలవర్ణాలలో నెరియలు ఏర్పడటమూ, నీటిరంగులు త్వరగా వెలిసిపోవటమూ, తద్వారా సంభవిస్తాయి. ఒకప్పుడు ఈ వాన్ డైక్ కపిశం అసాధారణ స్వచ్ఛతతో, సుద్దపాటులేని రంగుగా పేరుపొందింది. కాని దానిలోని కొన్ని లోపాలవల్ల దాని స్థానాన్ని ఈనాడు పారదర్శక కపిశమూ, తప్తసిన్నమూ–ముఖ్యంగా మిశ్రమములందు–ఆక్రమించాయి.

వాన్ డైక్ కపిశంతో మిశ్రితమయిన మరకత హరితాన్ని ఒకప్పుడు ఒక మంచి పూత రంగుగా భావించారు కాని ఈనాడు దానికి బదులుగా థాలోసియానైన్ నీలిమతో చేర్చిన తప్తసిన్నం వాడుకలోకి వచ్చింది. కాసెల్ మృత్తిక (దీనినే కోలోన్ మృత్తికఅనికూడా అంటారు) అనేది వాన్ డైక్ కపిశాన్ని చాలవరకు పోలిఉంటుంది వాన్ డైక్ కపిశంలోనే ఒక రకానికి చెందింది రూబెన్స్ కపిశం.

**Van Dyke red** : *వాన్ డైక్ శోణం.*

ఉజ్జ్వలమై గోధుమవాక రంగునుంచి ఎరుపువాక కపిశంవరకు రంగుమార్పులు కలిగిన ఒక వర్ణద్రవ్యం. రాసాయనికంగా తామ్రఫెర్రో సయానైడు అని ఇది వ్యవ

హృతం. ఇది విషమయమేగాక, దీని స్థిరత కూడా సందేహాస్పదం కావటంవల్ల దీని వాడుక విరివిగా లేదు.

**Van Dyke umber** : *వాన్ డైక్ బాహ్లికం*

తప్త బాహ్లికంలో ఒక రకానికి చెందింది. వాన్ డైక్ కపిశానికి ఇది చాలా సన్నిహితంగా ఉంటుంది.

**vanishing point** : *తిరోధానక బిందువు; తిరోభవత్ బిందువు.*

రేఖాగత దృష్టి ప్రక్రమతలో సమాంతర రేఖలుగా సంభావితములయ్యే రెండు లేదా అంతకు మించిన రేఖలు చక్రవాళరేఖపై అనంతదూరంలో సముపగమించే ఒక బిందువు. ఇట్లా ఒక తిరోధానక బిందువు దగ్గరను సముపగమించటం అనే ధర్మం-రైలుపట్టాల లాగా సమాంతరాలుగా అమరిఉన్న వాటి గతిని, వాటిపై ఒక నిర్దిష్ట స్థలంనుంచి పరికించినప్పుడు అవి అతిదూర చక్రవాళరేఖపై ఏదో ఒక బిందువువద్ద సంగమించేటట్లు దృష్టిభేద్యం కావటం అనే - అనుభవసిద్ధ దృగర్థంపై ఆధారపడి ఉన్నది. ఒక చిత్రపు సంరచనలోని అక్షాల కుదిరికతీరు, వాటి సంఖ్య-అనేవాటిని అనుసరించి దృష్టిక్రమతలో లిఖితమయ్యే ఒక ఆలేఖనంలో ఒకటి లేదా అంతకుమించిన తిరోధానక బిందువులు ఉండవచ్చు. ఇటువంటి బిందువులు అన్నీ చక్రవాళరేఖపైనేగాని, లేదా చిత్రతలానికి అవతలవైపున ఉండే ఆరేఖయొక్క పొడిగింపుపైగానీ ఉండి తీరుతాయి. తిర్యక్ దృష్టిప్రక్రమగతిలో-అంటే విహంగదృష్టిలో గాని, కీటక దృష్టిలోగాని-ఆలిఖితమయ్యే ఒక దీర్ఘచతురస్రక ఘనవస్తువు, మూడు తిరోధానక బిందువులు కలిగి ఉంటుంది. అయితే ఆ బిందువులలో ఒకటి మాత్రం చక్రవాళరేఖపై ఉండక, దానికి దిగువనో, ఎగువనో (అంటే విహంగదృష్టిలోని ఆలేఖనంలో దిగువను, కీటక దృష్టిలోని ఆలేఖనంలో ఎగువను) ఉంటుంది (చూ: *Linear perspective, perspective*)

**vaporization casting** : *బాష్పీభవన నిక్షిప్తం.*

చ్యుతాధార నిక్షిప్తానికి పర్యాయనామం.

**variety** : *వైవిధ్యం.*

**varnish** : *వార్నిషు; కుక్కుళం.*

ఒక బాష్పశీలక స్రావకంలో యక్షధూపాన్ని కరగజేసినప్పుడు లభించే ద్రావణం; ఒక పరితలంపై దీనిని తూలికతో పట్టించినా లేదా శీకరించినా, అది ఆరినతరవాత, కఠినమై, నిగనిగలాడుతూ, సాధారణంగా పారదర్శకంగా ఉండే ఒక పటలంగా ఏర్పడి, పరితలానికి రక్షకంగానో, అలంకారంగానో, లేదా ఆ రెండుతీరులుగానో వ్యవహరించే పైపూతగా తయారవుతుంది. అటువంటి పై పూతకు సైతం ఈ పదమే వర్తిస్తుంది. ఈ రకపు వార్నిషులలో

రెండు తీరులవి ఉన్నాయి: 1. సరళద్రావణ వార్నిషు: దీన్ని తయారుచేయటంలో యక్షధూపాన్ని నేరుగా స్రావకంలో కలుపుతారు. 2. నూనె వార్నిషు–దీన్ని రూపొందించటానికై ఒక శోషక తైలంలోను, శోషణితోను యక్షధూపాన్ని కలిపి లేదా మరగించి, తరవాత స్రావకంచే పల్చన చేస్తారు కోటవార్నిషు, స్పార్ వార్నిషు వంటి పారిశ్రామిక వార్నిషులు, ఇటువంటి మరగింపు పద్ధతిలోనే తయారవుతూ ఉండేవి. అవి మాత్రమేకాదు, చిత్రాలకై వార్నిషుగాను, ప్రలేప మాధ్యమంగాను ఒక కాలంలో విస్తృతంగా వాడుకలో ఉండిన కోపల వార్నిషు సైతం ఆ విధంగానే తయారయ్యేది. ఈ కాలంలో పారిశ్రామిక వార్నిషులో అత్యధిక సంఖ్యాకమైనవి సంయోజిత యక్షధూపాలద్వారా తయారవుతున్నవి కళాకారులు వాడే ఆధునికవు వార్నిషులు అన్నీ సరళ ద్రావణ రీతికి చెందినవే; డంబార్ వార్నిషు, అక్రిలీయ వార్నిషు ఈ రీతికి చెందినవే. పారిశ్రామిక వ్యవహారంలో సరళ ద్రావణ వార్నిషే శీతలముద్ర అనబడుతున్నది; పేరా విధంగా ఉన్నా, ద్రావణం చక్కగా త్వరలో తయారుకావటానికి ఆవిరినో, కొంచెంవేడినో ఉపయోగించవలసిన అవసరంకూడ ఉండవచ్చు. సరళద్రావణ వార్నిషులలో చాలాకాలం వాటిని శీధువార్నిషులు అని అంటారు. ఈ పేరు అపార్థజనకము. ఆ వార్నిషులోవాడే స్రావకం 'శీధువు' (మద్యసారం) మాత్రమే కానక్కరలేదు; కర్పూర శీధువు, అమిల్ యసిటేటు వంటి వాటినికూడా వాడవచ్చు.

తయారుచేసే సమయంలోనే వార్నిషులకు తగిన రంగులు సమకూర్చవచ్చు. అందుకై తగినంత చిరస్థాయిత కలిగిన యక్షధూపక రాగద్రవ్య విశేషాలను వాడవలెను. తైలంలో గాని, మద్యసారంలోగాని కరిగే సంయోజిత రాగద్రవ్యాలను వాడి, వార్నిషులలో ఉజ్జ్వలకాంతిగల వాటిని ఎన్నోరకాలలో తయారుచేయవచ్చు. అయితే ఇటువంటివి పారిశ్రామిక ఉత్పన్నాలలోను, ఆలంకారిక కృషిలోను వాడదగినవేగాని కళాకారులకు ఉపయోగించేవిగా ఉండవు. పారదర్శక ద్యుతికములను రూపొందించటానికి వీటిని వాడదం ఉంది. కాని చిరస్థాయిత కలిగిన ఫలితాలను పొందటానికి చిరస్థాయివర్ణద్రవ్యాలచే–అంటే కోబాల్ట్ పసిమి, హంసాపసిమి, మాంజిష్ఠ ఘనారుణంవంటి వాటిచే–ద్యుతి కల్పన సముచితం. కళారంగంలో వార్నిషుల నిర్దిష్టోపయోగాలు ఇదివరకే ఈదిగువ ఆరోపాల దగ్గర చర్చించటం జరిగింది: ***picture varnish; Isolating varnish.*** (అదనపు వివరముల కొరకు చూ: ***Intermediate varnish; retouch varnish; fixative***).

**varnishing day** పురాదర్శనం.

ఒక ప్రదర్శనకు సంబంధించి, సర్వజనులకు ప్రవేశం కల్పించటానికి ముందుగా ఒక కళాకార సమూహంవారుగాని, బృందంవారు

గాని - మ్యూజియంలోగాని, అటువంటిదే అయిన ఇంకొకసంస్థలోగాని-కొందరు ప్రత్యేక వ్యక్తులకు మాత్రమే సందర్శించటానికి పిలుపు కల్పించే సందర్భం. సార్వజనిక సందర్శనానికి ప్రదర్శనం తెరువబడనున్న రోజుకు పూర్వం ఆరోజు అపరాహ్ణముననో, సాయంసమయముననో ఈ పురాదర్శనం ఏర్పాటవుతుంది. ఆహూతులైనవారు మాత్రమే, అక్కడికి ఆ సమయంలో వచ్చి ప్రదర్శనాన్ని చూస్తారు. సాధారణంగా దానిని ఒక సమాదరణ సమావేశంగా నిర్వహిస్తారు. ఈ కాలంలో 'పురాదర్శనం' అనేది పాతపడిపోయి దానికి ప్రత్యామ్నాయంగా ఉపక్రమణం (*opening*) అనే పదం వాడుకలోకి వచ్చింది. ఈ ఉపక్రమణం అనేది ఏకైక ప్రేక్షణానికి కూడా వర్తిస్తుంది. మొదటి రోజుల్లో 'పురాదర్శనం' రచయిత కొరకుమాత్రమే ఉద్దిష్టం తానురచించిన దానిని ప్రదర్శనకు ముందుగా రచయిత మళ్ళీ ఒకసారి సరిచూసి, అవసరమైనచోట తుదిమెరుగులు దిద్ది చక్కగా సవరించటానికి ఆ కాలం వినియుక్తమయ్యేది కాలక్రమాన ఇటువంటి కార్యక్రమంలో తమ సలహాలను ఇచ్చి రచయితకు తగిన స్ఫూర్తిని ఇవ్వటానికి కళా విమర్శకులను పిలవటంకూడా పరిపాటి అయింది. అప్పటినుంచి పురాదర్శనం అనేది ఒకకొత్త అర్థాన్ని-నేను మరమువాడేకింగా-సంతరించుకొన్నది.

**Varnolene** : *వర్నోలీన్.*

ఖనిజ శీధువులలో ఒక రకపు తయారీకి వాడుకలో ఉన్న వ్యాపారనామం.

**vase** : *కలశం.*

**vase shapes** : *కలశాకృతులు.*

గ్రీసుదేశంలో ప్రాచీనకాలంలో మృణ్మయ సామగ్రి వివిధ సాంప్రదాయిక రూపాలలో విస్తృత సంఖ్యలో తయారయ్యేది. అటువంటి వాటిలో కలశాలు ఒక కోవకు చెందినవి; ఆ కలశాలు సామాన్య రూపవిశేషంలో ఒక ప్రామాణిక పద్ధతిని అనుసరించే ఉన్నా, అందులో స్థానిక విభేదాలనుబట్టి కాలపు మార్పులను బట్టీ, వైవిధ్యంకూడా వచ్చింది. ఇందులో ఇక్కొక్క రీతిది ఒక్కొక్క నిర్దిష్టపు యోజనానికి తగినరీతిలో రూపొందేది అటువంటి వాటిలో కొన్నిటిని గురించిన విషయాలు ఈ గ్రంథంలోనే ఈ దిగువ శీర్షికలలో చూడవచ్చు: *alabastron; amphora, askos, blackfigured pottery, cantharis, hydria, krater kylix, lagyns, lecythus, loutroph rus, oenochoe olpe, psvkter, redfigure pottery, rhyton.* (చూ: ఎదుటి పుటలోని కలశాకృతుల లక్ష్యచిత్రాలు).

**vault** : *తోరకం*

వాస్తు పారిభాషికపదం. ఒక తోరణరీతిలో కుదిరి ఉండేట్లు ఇటుకతోగాని రాతితోగాని రూపొందించిన పైకప్పు లోపల చూడటానికి ఇదిగూడా బండిలో కప్పులాగా ఉంటుంది. ఆ కప్పుకు తగినంతగా కలప, లభ్యంగాని ప్రదేశాలలో మాత్రమే-ప్రాచీన మెసొపొటోమియాలో-ఇది మొదట్లో రూపుదాల్చి అక్కడ



కలశాకృతులు :

1. జలపాత్ర 2. యవనకలశం 3. తుల్లక. 4. గాలవి 5. శృంగిక 6. వలయికా పుటగ్రీవం 7. స్థూణపుటగ్రీవం 8. ఘంటా పుటగ్రీవం 9. కర్ణికా పుటగ్రీవం 10. సుగ్రీవకం 11. ఐకగ్రీవం 12. శీరకం 13. స్తమనిక 14. లలితకం 15. కరీషక 16. అస్కృమము 17. సంపేటిక 18 అండిక 19. అర్ధగోళిక 20. ఖాండిక 21. కర్ణిక 22. జన్మిని 23. స్థాలిక

నుంచి గ్రీకులద్వారా తక్కిన ప్రదేశాలకు వ్యాపించింది. క్రీ.శ. 1వ శతాబ్దివాడైన హెరాన్ (అలెగ్జాండ్రియావాసి) ఈ శోధక నిర్మాణపు సాంకేతిక వివరాలను తెలియజేస్తూ ఒక గ్రంథం రచించాడు.

**veduta** · *పౌరేయకం*

ఒక నగరం, లేదా పురం అంతటినీ, చూపించే ఆలేఖ్యం, చిత్రణ, లేదా ముద్రాంకం. ప్రసిద్ధ సూచీ చిత్రకారుడు పిరనేసి (1720-78) రోమునగర దృశ్యాల రేఖా శిల్పంలో రూపొందించిన చిత్రరచనా శ్రేణి ఇందుకు ప్రముఖ లక్ష్యం. 'సంభావిత పౌరేయకం' అనేది ఇంకోరకంకూడా ఉంది దీనికి మూలం వాస్తవిక నగరదృశ్యమే అయినా పరికల్ప రచన మాత్రం భావనాబలమును ఊహాకల్పనను అనుసరించే ఉంటుంది. (చూ : *capricces* కూడా)

**veduta ideata** : *సంభావిత పౌరేయకం.*

**vegetable materials** : *ఉద్భిజ్జ ద్రవ్యాలు.*

**vegetable black** : *వనస్పతి నలుపు.*

దీపమషికిన్నీ, ద్రాక్షమషికినీ, బొగ్గుమషికిన్నీ అక్కడక్కడ పర్యాయనామంగా వాడే పదవిశేషం; ఇది ప్రామాణికతను మాత్రం ఆర్జించింది కాదు.

**vegetable violet** : *వనస్పతి రాజనీలం*

అమెరికాలో సహజసిద్ధంగా లభించే లాగ్ వుడ్ అనే రంగు ద్రవ్యంనుంచి తయారు చేయబడే ఉజ్జ్వలమైన రాజనీల చలరంజకం.

**vehicle** ; *వాహిక; వాహికం; ధారణం.*

పూతరంగుగా రూపొందటానికి వర్ణద్రవ్యాలను వికీర్ణించే ద్రవవిశేషం. రంగులను వహించి తీసుకొనిపోయేది కాబట్టి వాహిక అనే పేరు దీనికి వచ్చింది ప్రలేప వాహికలు నాల్గు విధులు నిర్వర్తిస్తున్నాయి. 1. సాధకవిధి: రంగును ద్రవరూపంగానో కల్కరూపంగానో మార్చి పూతకు అనుకూలతను కల్పిస్తుంది. 2. బంధకవిధి: వర్ణద్రవ్యాలను పరస్పరము పెనవైచి ఒక సంలగ్నరాశిగా లేదా పటలంగా బంధిస్తుంది 3 అధిసక్తక విధి: ఆరినకొద్దీ బంకలాగా లేదా సిమెంటు లాగా వ్యవహరిస్తూ, రంగులు భూమికకు అంటి ఉండేట్లు చేస్తుంది 4 చాక్షుషవిధి: వర్ణద్రవ్యాల రంగులలోని సాంద్రతను, గభీరతను, వెలికితెచ్చి, పొడిగా వున్నప్పుడు వాటిలో కనపడే రంగులకన్నా వేరైనవాటిని కళ్ళకు ద్యోతకం చేస్తుంది

**veil** : *నివీతం, ముసుగు, అవగుంఠనం*

1. ఒక తెలుపు భూమికపై పట్టించిన ఒక పలచని పారదర్శకపు పొర లేదా తెలవర్ణ ద్యుతికం. ఇందువలన తనలో సహజంగా ఉండే ఉజ్జ్వల ప్రతిఫలన శక్తిని కోల్పోకుండానే, ఒక రంగును భూమిక సమ

కూర్చుకో గలుగుతుంది. అట్లాకాక మొదట్లోనే రంగునేదైనా తెలుపుతో కలిపి భూమికను రూపొందిస్తే అటువంటి భూమికలో తగు ప్రతిఫలన శక్తి ఉండదు. విసీతమునే అంత చ్ఛవి లేదా అభిముద్ర అనికూడా అంటారు.

2. గ్రాఫిక కళలో వాడే కార్పాస విరళ కల బొద్ది; నునుసన్నని గుడ్డలపొంతర. అంతః పాతి ఫలకంపైన సిరాను సమ్మార్జన చేయటానికి దీన్ని వాడతారు. (చూ *Imprimatura*).

**vein stone : *సిరాశిల***

అతిసాగరిక భస్మానికి ఒక ప్రాచీన పర్యాయ నామం.

**velatura : *వేలాతురం.***

ఆరిన అధశ్చిత్రణంపై ఒక నిపీతం లేదా ఒక సన్నటి వర్ణద్యుతికం.

**vellum : *వాత్సకం.***

ఒక నునుసన్నటి చర్మపత్రం; ఆవుల పసిదూడల చర్మాలను పదనెక్కించి దీన్ని తయారు చేయడం సాంప్రదాయికంగా తరచు కనపడుతున్నది. మేకపిల్లల, గొర్రెపిల్లల చర్మాలనుకూడా దీనికై వాడటం ఉంది. అప్పుడప్పుడు మృతవత్సాల (గర్భంలోనే చచ్చి బయలుపడిన దూడల) చర్మాలనుకూడా ఇందుకు వాడతారు. కాగితం విరివిగా వాడుకలోకి వచ్చిన తరవాత చర్మపత్రాలతో పాటుగా వాత్సకముల వాడుక కూడా లుప్తమైంది. కాని కాగితాలలోనే కొన్ని తీరులవాటికి చర్మపత్రం, వాత్సకం అనే పేర్లు సంకేత నామాలుగ వాడుకలో ఉన్నాయి. ఈ తీరుల కాగితాలు దళసరి తనానికి పేరుపొందాయి.

**vellum paper : *వాత్సకపత్రము; వెల్లం కాగితం.***

1. దళసరిగా ఉండికూడా, నాణ్యపు తరగతికి చెందిన ఒకవిధమైన కాగితం. ఇది సహజవర్ణంలోనో లేదా మీగడరంగులోనో ఉండటంవల్ల దీనిని, ధ్రువపత్రాలకు, అధికిరణికలకు వాడుతున్నారు.

2 వాత్సకాన్ని పోలినటువంటి పైతీరు గల కాగితం. చర్మపత్రంకన్నా ఇదిఎక్కువ నున్నదనం కలిగి, చక్కటి పరితలంతో, వ్రాతకు అన్నివిధాల శ్రేష్ఠంగా ఉంటుంది. అందువల్ల వ్రా పనిలో దీనివాడుక అత్యధికం.

**velvet brown : *సౌరపటు కపిశం; మృదుకకపిశం.***

తప్త బాష్ఠికంతోగాని తప్తస్విన్నంతో గాని గైరికమును (ముఖ్యంగా నల్లటి గైరికాన్ని) కలిపి రూపొందించే ఒక విధమైన సమ్మిశ్రిత వర్ణద్రవ్యం.

**veneda : *మార్జకాలిక.***

నల్ల ధూసరవుఛాయగా ఉండే నలుపు రంగు. సత్యస్కములకై ఇటువంటిరంగును

వాడవలసి ఉన్నప్పుడు ఒక నల్లటి వర్ణ ద్రవ్యాన్ని సున్నంతో కలిపి దీన్ని తయారు చేస్తారు. అయితే లప్పు ఫలకాలమీదను, చర్మపత్రంపైనను కలం వర్ణంగా ఇటువంటి దాన్ని వాడవలసినప్పుడు 'నల్లటివర్ణద్రవ్యంతో తెల్లసీసాన్ని కలిపి దీనిని తయారుచేస్తారు. హరిత ములను, అందునా ముఖ్యంగా తరుచ్ఛదాన్ని, చిత్రించవలసినప్పుడు దానికి అధశ్చిత్రణగా దీనిని సద్యస్క చిత్రణలోను కలం చిత్రణ లోను వాడతారు. 11వ శతాబ్దానికి చెందిన డియోఫిలస్ ప్రెస్‌బిటర్ అనే అతడు కళలను గురించిరచించిన ఒకగ్రంథంలోను, 16శతాబ్ది వాడైన జెహాన్ లీబ్గాగ్గీ రచించిన ఒక గ్రంథంలోనూ ఈ చూర్ణకాలిక పేర్కొనబడింది.

**veneer** : విధానం; కూర్పుచెక్క.

సన్నగా కోసిన ఒక రమ్యమైన కొయ్య పలక: రంగును, రపపలుకున్ను ఇందులో రంజకంగా ఉంటాయి. కొయ్యసామగ్రిపై పైకప్పు పలకగా దీన్ని బిగిస్తారు

**Venice turpentine** : వెనిసీయ కర్పూర ద్రావకం.

ఆస్ట్రియాలోని ఒకజాతి వృక్షంనుంచి వచ్చే జిగుపుగల ద్రవపదార్థం తైలవర్ణాల లోను ద్యుతికమాధ్యమాలలోనూ దీనికివాడుక ఉంది.

**Venetian blue** : వెనిసీయ నీలం

ఇటలీయ నీలిమకు పర్యాయనామం.

**Venetian red** : వెనిసీయ శోణం; వెనిస్ ఎరుపు.

సహజసిద్ధంగా లభించే ఒక మృత్తికా వర్ణ ద్రవ్యానికి ఇది పేరుగా ఉండేది. ఈకాలంలో అందులో 25 శాతం ముగ్గుసున్నం కలిపి దానికికూడా ఈ పేరే వాడుతున్నారు.

**Venetian school** : వెనిస్ సంప్రదాయం

16వ శతాబ్దంలో వెనిస్ నగరంలో తైల వర్ణచిత్రణకు పరిపుష్టతను సమకూర్చటంలో కృషిని సాగించిన కళాకారబృందానికి సమష్టి నామం ఈ సంప్రదాయపు చిత్రణలు సుసంపన్న దీప్తికి చిరస్థాయితకు పేరొందినవి. కవోష్ణతా, సంహతులలో వైవిధ్యాన్ని ప్రకటించే వేర్వేరు రంగులతో పొరవెంబడి పొరగా నిర్మితిని సాగించి ఆ కళాకారులు ఈ స్థాయిని సృష్టించగలిగారు. తమకు పూర్వపు కళాకారులు రేఖలో రేఖాకృతిలో ఒక అలంకార మాత్రంగానే వర్ణాలు సంభావించగా ఈ వెనిస్ సంప్రదాయానుయాయులు, నిర్మితికే వర్ణాన్ని సర్వసాధారణంగా ఉపయోగించి అభివ్యాప్తంగా సౌవర్ణ దీప్తిని దానిలో నెలకొల్పి ఒక కొత్తమార్గానికి దారిచూపించారు. 15వ శతాబ్దిలో ప్రచలితమయిన రేఖా లక్షణతనుండి, అరసికతలనుండికూడా వీరు వైదొలగి, ఒక విప్లవకర వరిపర్తనను తీసుకొని వచ్చారు. వీరి రచనలలో కన్పించే సమృద్ధ, ఊర్మిమయ రూపవిశేషాలు తక్కిన కళాకారులను ఆకర్షించి వారుకూడా తైల

చిత్రణను అవలంబించేట్లు చేసినవి లౌకికము లైన వస్తువులకు చిత్రాలలో ప్రాధాన్యము కల్పించటంలోను, చిత్రవస్తువుకు పశ్చాద్భూమిగా పరిసరప్రకృతికి స్థానం కల్పించటంలోనూ ఈ వెనిస్ సంప్రదాయపువారే వైతాళికులుగా గణనీయులు. ఈ సంప్రదాయపు ముఖ్యప్రవర్తకులలో కొందరు. 1, జార్జియోనీ (1478-1510); 2. జియోవాన్ని బెల్లిని (1430-1516); 3. టిటియన్ (ర. 1490-1576), 4. టింటొరెట్టో (1518-1594).

**verdaccio** . *పాలాశిక.*

తత్తస్వింన్నమూ. గైరికమూ, దీపమషీ, సీమసున్నమూ బాగా కలిపినప్పుడు వచ్చే ఒక రంగు. ఇది తటస్థవర్ణమునో, లేదా ముడి అంబరులాగా ఆకుపసిమివాకగల గోధుమ రంగునో కలిగి ఉంటుంది. బాహ్యరేఖనకూ, వర్తనకూ, అధశ్చిత్రణకూ ఇటలీదేశంలో తొలుతటి సవ్యస్క-, కలం చిత్రకారులు దీన్ని వాడేవారనీ. సెన్నినో సెన్నిని రచించిన ఒక గ్రంథంవల్ల తెలుస్తున్నది.

**verdet** : *తాలకాళం.*

ఉజ్జ్వలత కలిగి ముదురు ఆకుపసిమి రంగుతో కనపడుతూ విషమయమై, ఉండే ఒక వర్ణద్రవ్యం. దీని మన్నిక సందేహాస్పదం; నీటిలో ఇది కరుగుతుంది. కాబట్టి నీటిరంగుగా దీనికి పూర్వం వాడుకఉండేది.

**verdigris** : *జాంగలి; తామ్రకిట్టం; తామ్రమలం; కిలుము; అరవిపచ్చ; రాగికిలుగు.*

నీలివాక ఆకుపసిమి రంగుగల ఒకవర్ణద్రవ్యం వెలుతురులో మన్నిక కలదేగాని, రంగుపూతంలో మాత్రం నిలకడ చాలా తక్కువ.

**verditer, blue; verditer, green** : *నీలతామ్రిక; హరితతామ్రిక.*

బ్రెమెన్ నీలానికీ, బ్రెమెన్ హరితానికీ క్రమంగా ఇవి పర్యాయ నామాలు.

**verism** : *తథ్యతావాదం*

1. ఇరవయ్యో శతాబ్దిలో ప్రచారంలో ఉన్న ఒక కళోద్యమం : కళకు ధ్యేయవస్తువు, పూర్వకాలీన ప్రమాణాలననుసరించి సౌందర్య ఉదాత్తతా వీరత్వాలకే ముడిపడనక్కరలేదనీ దైనందిన జీవితంలో తటస్థించే ప్రతి విషయంకూడా-చివరకు అసభ్యమూ హేయమూ అయినా - రస ప్రతిపత్తి కలిగిఉంటుందనీ కాబట్టి అవికూడా చిత్రణకు వస్తువులు కావచ్చునని ఈ వాద సారాంశం.

2. నవ్యస్వాభావికతవాదానికి అనుబద్ధమై ఉండే ఒకరీతి చిత్రణ. ఇందులో చిత్రణ నిశితంగా వస్తుగతమై ఉంటుంది.

**vermilion** . *సిందూరం.*

మానవ కృషివల్ల తయారయ్యే రసగంధకం; ఇది ఉజ్జ్వలమైన, స్వచ్ఛశ్వేతరక్తవర్ణద్రవ్యం; చాలా కాంత్యభేద్యత కలది; ఖరువైంది. తైలంలో కలిపినప్పుడు తూలికకు చక్కగా ఒదుగుతుంది. చైనీయులకు ఇది అతి ప్రాచీన కాలంలోనే సుపరిచితం. చీనీయ భాషలో దీన్ని చూషూ అంటారు. యూరపులో 8వ శతాబ్దంనుంచి మాత్రమే దీని వాడుక కనపడుతున్నది. స్వయంసిద్ధంగా భూమిలో రసగంధకంగా లభించే రక్తపాషాణం (*cinnabar*) కన్నా గుణవిశేషంలో ఇదిమిన్న. అందువల్ల దాని స్థానాన్ని అంతటా ఇది ఆక్రమించగలిగింది. మధ్యయుగాలనుంచి ఇరవయ్యో శతాబ్దివరకు కళాకారుల వర్ణంగా ఈ సిందూరము మన్నన ఆర్జించినా దీనిచిరస్థాయిత నమ్మదగిందికాదు. ముఖ్యంగా దీనితో రచించిన చిత్రంపైన వార్నిషునో, మైనాన్నో, ద్యుతికమునో వాడి దానిని పరిరక్షించకపోతే దాని చిరస్థాయితకు భంగం తరచుగా ఏర్పడుతుంది. కొన్ని చిత్రాలలోని సిందూరవర్ణం చెక్కుచెదరక శతాబ్దాల తరబడిగా నిలిచిఉన్న మాట యథార్థమే అయినా అక్కడక్కడ కొన్ని చిత్రాలలో మాత్రం నలుపుమచ్చలు తేలి, నల్లటి రసగంధకంగా మారటం కనపడుతుంది. ఇందులో రాసాయనిక కారణమేమిటో వైజ్ఞానికులకు సైతం ఇప్పటివరకూ అంతుపట్టలేదు. అందువల్లనే ఈ శతాబ్దపు ఇరవైలలో సిందూరపు స్థానాన్ని తేలికపాటి కాడ్మియం ఎరుపు ఆక్రమించింది. ఈ కాడ్మియం ఎరుపు ఎటువంటి ఆరకొరలేకుండా విశ్వసనీయంగా వర్తిస్తుంది.

**vermilionette** . *సిందూరికావళి, సిందూరకం.*

అమెరికా సిందూరానికి పర్యాయనామం.

**vernalis** : *వెర్నాలి*

సద్యస్క వర్ణద్రవ్యంగానూ మూర్తముల రంగుపూతలోనూ వాడే విక్టోరియా హరితానికి బ్రిటిష్ చిత్రకారసంఘం కల్పించిన ఒకనామ విశేషం.

**vernet green** : *వెర్నెట్ హరితం*

బ్రెమెన్ హరితంలో ఒక రకానికి చెందినది. వెర్నెట్ అనే ఫ్రెంచి చిత్రకారుడు 18వ శతాబ్దిలో దీన్ని కనుక్కొన్నాడు.

**vernice liquids** : *యక్షధూప ద్రావణాలు.*

యక్షధూపంతో నూనెను కలిపి తప్తం చేయగా లభించే ద్రావణ విశేషాలు బొమ్మ వార్నిషుగా దీనికి వాడుకవుంది.

**vernicle** : **వస్త్రపటం.**

క్రీస్తుదేవుని ముఖప్రతిరూపం చిత్రితమైన ఒక వస్త్రం. క్రీస్తుదేవుడు సిలువను మోసుకొని వధ్యస్థానానికి పయనించేటప్పుడు వెరోనికా అనే ఆమె ఆయనను అనుగమించి, ముఖం చెమటను తుడుచుకోవటానికి ఒక గుడ్డను

ఇచ్చిందనీ ఆయన దానితో తన ముఖాన్ని తుడుచుకోగా ముఖ ప్రతిరూపం ఆ గుడ్డపై ముద్రితమయిందనీ ఒక గాథ క్రైస్తవులలో ప్రచారంలో ఉంది. ఇందువల్ల క్రీస్తు ముఖ ప్రతిరూపం ముద్రితమయ్యే వస్త్రానికి దేనికైనా ఒక పవిత్రత సిద్ధించగా, 15వ శతాబ్ది నుంచి 17వ శతాబ్దివరకు ఎంతోమంది చిత్రకారులు ఇందులో తమ ప్రతిభను ప్రదర్శించారు.

**vernis martin** . *కాంస్యవార్నిష్*

కవోష్ణస్థాయి లేదా ఎరుపువాక కలిగిన ఒక విధపు వార్నిషు కాంస్యచూర్ణంతో కలిపిన ఫ్రెంచి వార్నిషుకు 18వ శతాబ్దిలో ఈ పేరు వచ్చింది.

**Verona brown** : *వెరోనా కపిశం.*

పారదర్శక కపిశానికి పర్యాయనామం.

**Verona green** : *వెరోనా హరితం.*

వివిధ హరితమృత్తికలలో ఉత్తమాలుగా పేరుపొందిన వాటిలో ఒకటి.

**Verona yellow** : *వెరోనా పసిమి.*

టర్నర్ పసిమికి పర్యాయనామం;

**Veronese green** . *వెరోనీస్ హరితం.*

ప్రామాణికతను ఆర్జించని ఒక విధపు ఆకుపసిమి వర్ణద్రవ్యం. వెనిస్ నగరవాసి అయిన ఒక చిత్రకారుడి పేరుతో దీనికి ఈ పేరు వచ్చింది.

**vert antique** : *కిలుము పట్టింపు; కిలుమురంగు.*

సుధాపిష్టపు నిష్క్రమములను, ఇతర పరితలములను కాంస్యీకరణ చేయటంలో వినియుక్తమయ్యే తుదితీర్పు; ఇందువల్ల పాతపడ్డ కంచు, లేదా రాగివస్తువులపై కనిపించే చిలుములవంటి ఆకుపసిమి, ఆ నిష్క్రమములు మొదలైన వాటి పరితలములకు లభిస్తుంది. మొదట్లో పరితలంపై దధిచూర్ణపు రంగు పూతను, పాతబడ్డ పైసా రంగులాగా ఉండేట్లుగా పట్టించి, దానిపైన అర్ధకాంత్యభేద్యమైన ఆకుపసిమి రాగికార్బనితంతో బిందుపర్రన జరిపితే కిలుము పట్టింపు లభిస్తుంది. వాణిజ్య కళలలోకూడ కిలుము పట్టింపుకు స్థానం ఉంది. చిలుముపట్టిన రాగిరేకులాగా కనపడేట్లు చేయటానికై ఇంటికప్పుకు కిలుము పట్టింపు జరపటాన్ని ఇందుకు లక్ష్యంగా పేర్కొనవచ్చు.

**vert emeraude** : *వెర్ట్ యమెరాడ్.*

పాలాశికకు ఫ్రెంచి పదం.

**vertical line** : *ప్రలంబరేఖ.*

**Vestorian blue** : *వేస్తరీయ నీలం.*

ఐగుప్తనీలానికి పర్యాయనామం.

**vibrate** : *స్పందించు.*

శిల్పంలో వాడుకలో ఉండే పారిభాషిక పదం. పోతపనిలో సంయానాన్ని, దాంతో

vel పాటుగా దానితోని ద్రవవిశేషాలను, లయబద్ధ రీతిలో కుదపటం; ఇందువల్ల నిషిక్త ద్రవ్యాలన్నీ సమరీతిలో ఆయాస్థానాలలో కుదురుకోవటమూ, తత్ఫలితంగా ప్రాస్తనిషిక్తమున ఉండవలసిన లక్షణాలన్నీ సాధ్యమైనంతవరకు చక్కగా అమరటమూ జరుగుతుంది.

**Victoria green** : విక్టోరియా హరితం

80 భాగాలు పాలాశిక, 40 భాగాలు నాగ పీతం, 10 భాగాలు నాగశ్వేతం చేరింపగా సంభావితమయే ఒక సమ్మిశ్రిత వర్ణద్రవ్యం.

**Victoria red** : విక్టోరియా శోణం

క్రోమ్ ఎరుపుకు పర్యాయ నామం.

**vienna blue; Vienna ultramarine** : వియెన్నా నీలం; వియెన్నా అతిసాగరిక.

కోబాల్టు నీలానికి పూర్వం ఈ రెండు కూడా పర్యాయనామాలుగా ఉండేవి.

**Vienna green** : వియెన్నా హరితం.

మిట్టిస్ హరితానికి పర్యాయనామం.

**Vienna lake** : వియెన్నా రంజకం.

జతుస వర్ణానికి పర్యాయనామం.

**Vienna red** : వియెన్నా ఎరుపు.

క్రోమ్ ఎరుపులో ఒక రకం.

**Vienna white** : వియెన్నా శ్వేతం.

గారసున్నంనుంచి తయారుచేసే ఒక విధమైన సున్నపుపొడి.

**viewer** : ద్రష్ట; ప్రేక్షకుడు.

**vignette** : ద్రాక్షిక.

1. చిత్రలేఖనంలోనూ, కాంతిలేఖనం (ఛాయాచిత్ర లేఖనం) లోనూ విస్పష్టంగా గుర్తింపబడిన అంచులు ఏటువంటివీ లేకుండా కొనఅంచులు మెల్లిమెల్లగా మరుగుపడి, పశ్చాద్భూమిలో మేళవించటం.

2. వాస్తుశిల్పంలో స్తంభమకుటాలపై, రూపీకరించిన ద్రాక్షాఫలముల, ద్రాక్షాలతల, ప్రతానాలు.

3. పుస్తక ముద్రణలో ముఖపత్రంపై గాని, గ్రంథంలో ప్రకరణాంతాలలో గాని అలంకారికంగా ద్రాక్షలతా ప్రతానరేఖాకృతి. (చూ : *trail*)

**vine black** : ద్రాక్షమసి; ద్రాక్షబొగ్గు

నీలివాక అధస్థాయి కలిగిన ఒకమాలిన్య యుతకార్బనికవర్ణద్రవ్యం. ద్రాక్షతీగలనూలేక అటువంటివే అయిన కొన్ని విశిష్టఉద్భిజ్జద్రవ్యాలను మసిగాకాల్చి దీన్ని తయారుచేస్తారు. దీపమసి, కుజమసి, అనే వాటిలో దేనితోపోల్చినా ద్రాక్షమసిలోని సాంద్రత, ఛవివదిమ, రాసాయనిక స్వచ్ఛత చాల తక్కువనే

చెప్పాలి. 19వ శతాబ్దిలో ప్రాభవమసి, కళాకారుల రంగులలో స్థానం ఆర్జించగలగటం యథార్థమే అయినా, ఈ శతాబ్దిలో దాని ప్రసక్తే కనపడదు.

**vinyl resin :** ***వినీలికా యక్షధూపం.***

వివిధ వినీల యౌగికాలను పాలిమరీకరణం చేయటంవల్ల లభించే ధర్మకల్పిక సంయోజిత యక్షధూప కుటుంబంలో దేనికైనా ఈ పదం వర్తిస్తుంది.

**violet carmine :** ***రాజనీల జతునం.***

ఇది ఒక సమ్మిశ్రిత వర్ణద్రవ్యం; సహజసిద్ధంగా లభించే కొన్ని రంగద్రవ్యాలనుంచి పూర్వం తయారు చేసేవారు. కాని ప్రస్తుతం కోబాల్ట్ రాజనీలంవంటి సంయోజిత కార్బనిక వర్ణద్రవ్యాలు దీని స్థానాన్ని ఆక్రమించాయి.

**violet madder-lake :** ***రాజనీల మంజిష్ఠ రంజకం.***

మాంజిష్ఠ రాజనీలానికి పర్యాయనామం,

**violet pigments :** ***రాజనీల వర్ణద్రవ్యాలు***

**violet ultramarine :** ***రాజనీల అతిసాగరికం***

అతిసాగరిక నీలలోహితానికి పర్యాయనామం.

**virgin :** ***మేరీకన్య***

క్రీస్తుదేవుని మాత అయిన మేరీకన్య క్రైస్తవులకు-అందునా ముఖ్యంగా రోమన్ కేతలికులకు, ప్రాచ్యక్రైస్తవసంప్రదాయానుయాయులకు-అత్యంతం ఆరాధ్యగా వాసికెక్కింది. మేరీ కన్యకతోకూడి శిశురూపమున క్రీస్తుఉన్న సామూహిక శిల్పానికి, లేదా చిత్రానికి క్రైస్తవ ప్రపంచంలో అధిక మాన్యత ఉంది అందువల్ల వివిధ రకాలలో ఇటువంటి ప్రతిరూపాలను రూపొందించటంలో చాలామంది కళాకారులు తమ ప్రజ్ఞాపాటవములను ప్రదర్శించారు.

**viride aeris** ***విరిడే యేరిస్.***

తాంగలికి లాటిన్ భాషా నామం.

**viridian :** ***విరిదం***

ఉజ్జ్వల హరిత వర్ణద్రవ్యం; ఇది పారదర్శకమై, శీతలత కలిగి, మరకత హరితపు అధస్థాయికలది. హరితంకొంత ముదిరినప్పుడు నలుపుఛాయగాకూడా ఇది కనపడుతుంది కాబట్టి ఇది నలుపుగా పరిణమించే అవకాశం కూడా ఉంది. ఇది చాలా మన్నికగలందిగా కళాకారుల ఆదరణను ఆర్జించింది క్రోమియం హైడ్రాక్సైడ్ అనే యౌగికంనుంచి దీన్ని తయారు చేస్తారు.

**virtu, virtuoso :** ***కళాభిరతి; కళారక్తుడు***

కళాఖండాలపట్ల, అపురూపవస్తువులపట్ల -మొత్తంమీదలలితకళలపట్లా-ఉండే మక్కువట

మైన మక్కువనూ ఆసక్తినీ కళాభిరతి అంటారు. నాగరికుడికి ఉండవలసిన ముఖ్యలక్షణంగా దీనిని ఇటాలియన్ రచయితలు 16వ శతాబ్దంలో పేర్కొన్నారు. కళాఖండాల మంచి చెడ్డలను విచక్షణచేసే సమర్థుడైన వ్యక్తి కళారక్షకు, కళాఖండాలను విరివిగా సేకరించే వ్యక్తికీ కొందరు ఈ పదాన్ని వాడారు. కళనే వృత్తిగా గ్రహించిన వ్యక్తికికూడా కళారక్షకుడు అనే పేరు వాడుకలోఉంది.

**viscosity** : *శినత.*

**visible** : *దృష్టిగోచర.*

**vitreous** : *కాచసోర్పరత.*

గాజుయొక్క గుణాలు–గట్టితనం, మెరుగు నునుపు, రసాయనిక చర్యకు నిరోధకత–కలిగిఉండే ఏ పదార్థానికైనా విశేషణంగా ఈ పదం వాడతారు. పింగాణీ ఆభాసికంతో కొన్ని రకాలకుకున్నా, మంచి గట్టి ద్యుతికం కలిగిన పింగాణీ సామగ్రికీన్నీ ఈ విశేషణం వాడతారు.

**vitreous enamel** : *కాచాభాసిక.*

పింగాణి ఆభాసికకు పర్యాయనామం.

**Vitruvian scroll or wave scroll** : *తరంగ సర్పిలిక.*

వాస్తుశిల్పంలో, అందునా రోమక వాస్తుశిల్పంలో, ప్రాకారములలో కనపడే ఒక అలంకారిక ప్రలక్షణం. ఇందులో తరంగ పరంపరలను పోలిఉండే సంవలయాకృతుల పరసలు ఎన్నో కనపడతాయి.



తరంగ సర్పిలిక

**volatile** : *బాష్పశీల; ఉత్పతత్.*

**volet** : *ఉదంచనం; పార్శ్వం.*

ముప్పలక లేదా పల్పలకలో మధ్య ఫలకంపై మూతలుగా మడచటానికి వీలయ్యే పలకలలో ఒకటి. (చూ : *triptych*)

**vorticism** : *ఆవర్తతావాదం.*

ఆంగ్లదేశంలో, రచయితగానేగాక చిత్రకారుడుగానూ పేరుపొందిన విండ్‌హామ్ లూయిస్ (1882–1957) అనే వ్యక్తివల్ల, 1912లో ప్రవర్తితమై, ప్రథమ ప్రపంచ సంగ్రామ విజృంభణతో లుప్తత చెందిన ఒక కళోద్యమం. ఈ కళ, వివిక్తం; కొన్నిచోట్ల అది అత్యంతంగా వస్తురహితమై ఉండేది. ఆ ఉద్యమం అల్పకాలమే ప్రవర్తిల్లి లూయిస్‌కూ అతని సన్నిహితులైన కొందరు చిత్రకారులకూ, శిల్పులకూ రచయితలకూ మాత్రమే పరిమితమై ఉన్నా ఫ్రాన్సుదేశపు స్థూలతావాదాన్ని, ఇటలీదేశపు అనాగతావాదాన్ని అది ప్రభావితం చేయటంవల్ల బ్రిటిష్ చిత్రకారులను ఇతర దేశీయుల ప్రభావాలకు గురిచేసింది. 'బ్లాస్ట్' అనే పేరుతో వెలువడ్డ ఒక ప్రచురణలో రెండు సంచికలు, ఈ వాదానికి సంబంధించిన వివరణ పత్రాన్ని, తక్కిన వివరాలను ప్రకటించినవి. ఈ వాదంతో సాన్నిహిత్యాన్ని నెలకొల్పుకొని వ్యవహరించిన వారిలో ఈ దిగువ శిల్పులు గణనీయులు: 1 జేకబ్ ఎప్‌స్టీన్ (1880–1959), హెన్రీ గాడియెర్ బ్రెజెస్కా (1891–1915). ఇతర చిత్రకారులు విలియమ్ రాబర్ట్స్, ఎడ్వర్డ్ వాడ్స్‌వర్త్ (1889–1949), సి. ఆర్. నెవిన్‌సన్.

**vulgar** : *అసభ్య.*

# W

**wad clay or wadding clay :** మృదుమృత్తిక.

ఉష్ణమృత్తికలతో తక్కువ రకపుది. బట్టీలలో అరలను చదును చేయటానికిన్నీ, మూతలను నింపటానికిన్నీ దీనిని వాడతారు

**wall arcade or blind arcade :** కుడ్యతోరణాళి

**wallboard :** కుడ్యాస్తరం.

కొయ్యగుజ్జువంటి పదార్థాలతో తయారై, గట్టిగావుండే ఆస్తరము. గృహనిర్మాణంలో లోపల గోడలకూ, కప్పులో తట్టులకూ, చిన్న అరలుగా గదులను విభజించటంలోను దీన్ని వాడతారు. 1920 మొదలుకొని ఇటువంటి కుడ్యాస్తరములపై కళాకారులు చిత్రలేఖనం సాగించారు.

**walling wax or bordering wax :** మేలిలక్క; గోడమైనం; లేదా అంచుమైనం

తేనెమైనాన్ని, ముద్దపాకం వచ్చేవరకూ, కాచి, దీన్ని తయారుచేస్తారు. సూచీచిత్రణ ఫలకానికి అంచున ఎత్తుగా ఒడ్డు కట్టటానికి దీన్ని వాడతారు. ఈ ఒడ్డును కట్టటంవల్ల లోపలి ఫలకం పైభాగం, తొట్టిలాగా తయారై క్షయకారిని నేరుగా దానికి పట్టించటానికి సౌకర్యంగా ఉంటుంది. ఇట్లా అంచుమైనాన్ని వాడటంవల్ల, మొత్తం ఫలకాన్ని ఆమ్లపాత్రలో ముంచాల్సిన ఆవశ్యకత లేకుండా పోతుంది. సూచీ చిత్రణను పెద్దఫలకంపై జరిపినప్పుడు, ఆమ్లపాత్రలో దాన్ని ముంచటానికి యత్నించటం వెర్రిపనేగాదు, వ్యయమూలం కూడాను.

**wall paper :** కుడ్యపత్రం

**wall primer :** కుడ్యప్రాథమికం.

(చూ: plaster primer)

**wall scraper :** కుడ్యోల్లేఖని.

దోకుడుపారలాగా ఉండే ఒక విధమైన పరికరం. ఇది ఉక్కుతో నిర్మితమై పిడితో



కుడ్యోల్లేఖని

ఉంటుంది. తైలవర్ణాలను నూరేటప్పుడు ఆ వర్ణరాసిని ఒకచోట చేర్చటానికి ఇది పనికి వస్తుంది.

**walnut oil** : అక్రోటునూనె; అక్రోటు తైలం

చిత్రలేఖనంలో వాడుకకు వచ్చిన మొదటి నూనెలలో ఒకటి తొలుతటి కాలంలో తక్కిన నూనెలకన్నా, ఎక్కువగా సర్వ సాధారణంగా ఈ నూనెనే తైలవర్ణ చిత్రణలో వాడేవాళ్ళు అవిసెనూనెకన్నా ఇది ఆరిపోవ టానికి ఎక్కువ కాలం పట్టటం నిజమేఅయినా దానిలాగా త్వరగా విచ్ఛిత్తి చెందదు రంజక వర్ణాలతో కలిపి వాడటానికి ఇది చాలా చక్కగా పనికివస్తుంది. అయినా ఈకాలంలో దీని వాడకం దాదాపుగా లేదనే చెప్పవచ్చు.

**Wanderers** : చారణులు.

రష్యాదేశంలో నికొలస్ క్రామ్స్కాయ్ అనే వ్యక్తి చేత, 1871లో వ్యవస్థితమైన ఒక కళోద్యమం. అప్పటి రష్యాదేశపు చక్ర వర్తి సాగించిన నిరంకుశపాలనవల్ల ప్రజ లలో నానాట పెంపొందిన అసంతృప్తిని ప్రకటిస్తూ సాంఘిక ప్రచారలక్ష్యాలతో రూపొందించిన వాస్తవిక చిత్రణలే ఈ ఉద్య మం తమ చిత్రాలను, రాష్ట్రాల ముఖ్యనగరా లలో ప్రదర్శించి, తద్వారా కళనే సాధ నంగా చేపట్టి ప్రజలకు విషయబోధ చేసి, వారిలో చైతన్యాన్ని రేకెత్తించటానికి ఆ చార ణులు కృషి చేశారు. ఈ బృందంలో గణ నీయులు: 1. వి వి. పెరొవ్‌జిన్, 2. ఇలియా రేపిన్, 3 వ్లాడిమిర్ మకోవస్కీ, 4. దట్లిమ్ పొలెనోవ్, 5. లెబెదియా.

**warm** : కవోష్ణ; గోరువెచ్చ

**warm colors** : కవోష్ణ వర్ణాలు, నులివెచ్చ రంగులు.

ఎరుపూపసిమి ప్రాముఖ్యము వహించే అన్ని రంగులు వసువువాకగానో గోధుమవాకగనో ఉండేవి పరవర్ణాలు అని వ్యవహృతాలు. వర్ణచక్రంలో ఎరుపు-పసిమి సగము (రక్తపీతార్థం)లో కవోష్ణ వర్ణాలు కుదురుకొని ఉంటాయి. (చూ : *cool colour*).

**warm grays** : కవోష్ణ ధూసరాలు

**warmth** : కవోష్ణత.

**warning coat** : ప్రదర్శన లేపం; హెచ్చరికపూత.

నిరస్త్ర సంయానంలో వాడే సుధాపిష్టపు రంగుపూతపొర. ఆ సంయానాన్ని ఛేదించి, నిష్క్రమును వెలికి దీసేటప్పుడు ఈ ఛేదనలో ఇటువంటి పొరరాగానే, దగ్గరే నిష్క్రమం ఉన్నది అనే హెచ్చరికగా ఇది ఉపకరిస్తుంది. అందువల్ల ఛేదనను మెల్లగా జరిపి, నిష్క్రము నకు ఎటువంటి దెబ్బకూడా తగలకుండా చూడడం సాధ్యపడుతుంది.

**warping** : అకుంచనం.

**warping of picture** : చిత్రాకుంచనం; బొమ్మవంపు.

చిత్రఫలకం వెనకకో, ముందుకో వంగి తోరణంలాగా వంక ఏర్పడటం. తెమ్మదనం,

వేడి, లేదా శోషణవల్ల అంతటా ఒకేవిధంగా సంకోచనం జరగక, కొన్ని భాగాలలో ఎక్కువగా, కొన్ని భాగాలలో తక్కువగా జరగటంవల్ల ఫలకం వంగుతుంది. నేర్పరులైన పనివాళ్ళు తగిన చట్రాలలో ఫలకాన్ని బిగించేట్టయితే ఇటువంటిది జరగదు. కొయ్యఫలకాలు వంగిపోకుండా చదునుగా చిరకాలం ఉండాలంటే వాటి పరిసరాలలో వాతావరణంలో చెమ్మ దసందాదాపు ఒకే శాతంఉండాలని మ్యూజియంలవారి అనుభవం తెలుపుతున్నది. వంగిపోయిన ఫలకాలను-అందులోని చిత్రాలకు దెబ్బతగలని రీతిలో-చక్కగా చదును చేయటానికి, ఆ పనిలో ఆరితేరిన వాళ్ళు చేసే సంధారణ చర్యలు ఆవశ్యకములు

సాధారణపు తేలికపాటి ప్రసారణిపై రచితమయ్యే చిత్రాలను, చట్రాలు లేకుండా వేలాడదీస్తే అవి ఆకుంచనం చెందే అవకాశం ఉంది. కాబట్టి వాటిని గట్టివైన చట్రాలలో బిగించి నష్టపడకుండా చేయవచ్చు. 2 1/2 అం.పు ప్రసారణులపై బిగించినప్పుడు కాటికలు ఇట్లా ఆకుంచనం చెందవు.

**wash** : *ధావనం; విలేపనం క్షాళనం.*

తనూకృతమైన నీటిరంగును కాగితానికి పట్టించటం నిండువటిమ గల లేదా సముపచితమైన రంగును వాడకుండా విరళీకృతములైన రంగులతో చేసే పారదర్శక స్పర్శ ఎటువంటిదైనా, దాన్ని ధావనం అనటం సముచితమే; అయినా, పెద్దతూలిక నిండుగా రంగును తీసుకొని విస్తృతప్రదేశంలో అతి త్వరితగతిలో పట్టించి, ఆకసమువంటి వాటిని రూపొందింపజేయటానికే సాధారణంగా ధావనం అనే పదాన్ని వాడుతున్నారు. ఒక్కొక్కప్పుడు తనూకృతమైన నీటిరంగును చాలా తడిగా ఉండగానే పట్టించి, ఆ కాగితముండే ఆస్తరికను నిలువుపాటున కొద్దివాలుగా వంచి, నీటిలాగా ఉండే రంగును కిందికి దిగజారేట్లు చేయడం జరుగుతుంది. అంతట ఎగువభాగపు కాగితం ముందుగా ఎండగా, దిగువకు వచ్చిన కొద్దీ రంగు క్రమగతిలో సముపచితం కావటంవల్ల అనుక్రమ స్థాయి దాంట్లో కుదురుకొంటుంది. (చూ; *wash drawing*)

**wash drawing** : *ధావనాలేఖనం; క్షాళనాలేఖనం.*

ఏకవర్ణపు నీటిరంగుయొక్క, లేదా ఇండియా సిరాయొక్క తనూకరణ పెక్కింటితో తూలికను ఉపయోగించి ఒక కాగితంపై రచించిన ఆలేఖనం. ఇటువంటి ధావనాలేఖనాలలో చాలావాటిలో రేఖావయవాలు విరివిగా ఉంటాయి బ్రిటనులో వీటిని కలమ ధావనాలేఖనం అనే అర్థమిచ్చే (*pen and wash drawing*) పేరుతో వ్యవహరిస్తారు.

**waste mould** : *విరస్త్య సంయానం.*

మూర్తవంలోగాని శిల్పంలోగాని పోత పనికై, ఒకసారిమాత్రమే వాడటానికి పనికి

వచ్చే కల్పకపు సంయానం. అందులోని నిషిక్తమును వెలికితీయటానికి ఆ సంయానాన్నే ముక్కలుగా ఛేదించవలసి ఉన్నందువల్ల, ఆ సంయానాన్ని రెండోసారి వాడే ప్రసక్తి ఉండనే ఉండదు.

**watercolour** : *నీటిరంగు*;

తుమ్మజిగురులో విస్తృతమైన వర్ణ ద్రవ్యాలతో చిత్రణను సాగించే సాంకేతిక రీతి. అట్లా రచితమయ్యే కళాఖండానికీ, అందు వాడే పూతరంగుకుకూడా ఈ పేరే వర్తిస్తుంది. ఈ నీటిరంగులో బంధకంగా జిగురు వర్తిస్తుంది. అదీగాక పూతకై వాడే ఈ నీటిరంగులో ఇంకా కొన్ని సాధక ద్రవ్యాలు-కల్పనిగా వ్యవహరించటానికై జల మధువులేదా చక్కెరనీరు. పూతరంగులో చెమ్మదనం నిలువ ఉండటానికి గ్లిసరీను, పూతరంగు వరితలముపై ఏకరూపతతో ప్రవహించేటట్లు చేయటానికై ఒక క్లేదకం, ఫెనాల్‌వంటి పరిరక్షకం-చేరిఉంటాయి నిర్దిష్టంగా చేతితో నిర్మితమై నీటిరంగు కాగితం (జలవర్ణపత్రము) అని వ్యవహృతమయ్యే, ఒకవిధపు కాగితంపైన నీటిరంగులతో చిత్రణ జరుగుతుంది. ఇటువంటి చిత్రణకై రోమాలతో నిర్మితములయ్యే తూలికలను వాడతారు. అటువంటి తులికలలో, ఎర్రసేబిల్ రోమాలతో చేసినవి, అన్నిటికన్నా, ఎంతో ప్రశస్తమైనవి. (చూ : ***brush, red sable***).

కాంతిమంతమైన పారదర్శకతను కలిగి ఉండటం, నీటిరంగుల విశిష్ట లక్షణం. అయినా గహనవర్ణంలో చిత్రణకూడ, కొన్ని సందర్భాలలో కాంత్యభేద్య జలవర్ణ సాంకేతిక రీతిగా పరిగణితమవుతున్నది అప్పుడు నీటిరంగులను చాల తరచుగా స్వచ్ఛందములు విశ్లథములు అయిన ప్రవాహాలతోను విస్తృతధావనములతోను వర్తిస్తారు నీటిరంగు కాగితంలో సహజంగా ఉండే వలుకుదనం, తీర్చిదిద్దిన రచనలోని ఉజ్జ్వలతకూ, చకచ్చకితకూ మెరుగుపెట్టగలుగుతుంది.

చర్మవస్త్రాలతో గ్రంథాల వ్రాతప్రతులను రూపొందించిన మధ్యయుగాలలో, ఆ గ్రంథాలలో ప్రతదీపనంకోసం నీటిరంగు పూతలు ఉపయుక్తములైనాయి. 16వ, 17వ, 18వశతాబ్దులలో నీటిరంగువాడుక అక్కడక్కడ అలంతి చిత్రాల చిత్రణలోతప్ప వేరుగాఉన్నట్లే కనవడదు ఆ అలంతి చిత్రాల చిత్రణ ఆ కాలంలో పత్రకం (*card*) పైనో దంతం మీదనో, ఎక్కువగా జరిగేది; ఆ వేగాక చర్మపత్రమునూ, పింగాణినికూడా ఉపయోగించే వాళ్ళు. సన్ననిజవులసరుకుల-నునుసన్నని వట్టుగుడ్డవంటి వాటి - పైనా, చెట్టు పట్టనో బియ్యాన్నో వాడి తయారుచేసిన కాగితంపైనా నీటిరంగులతో చిత్రణను, జావనీయ, చీనీయ చిత్రకారులు విరివిగా సాగించారు.

ఈనాడు అమలులో ఉన్న పారదర్శక జలవర్ణ చిత్రణలోని సాంకేతిక ప్రక్రియ,

ఇంగ్లాండులో, 18వ శతాబ్ది ఉత్తరభాగంలోను, 19వ శతాబ్ది మొదటి దశకాలలోను వృష్టిని క్రమక్రమంగా ఆర్జించింది. అంతకు పూర్వం కలం-సిరా రేఖారూపాలను రచించి వాటిపై మీగడనో నీలచ్ఛవులనో అద్దివేయించేసేవారు, 18వ శ ఉత్తరభాగంలో మొట్టమొదటిసారిగా ఆ పూర్వప్రక్రియకు బదులుగా ఏకవర్ణాన్ని వాడటం మొదలైంది. అటుతర్వాత కాలక్రమాన ఏకవర్ణ ప్రక్రియను కాదని బహుముఖ సాంకేతికత చోటు చేసుకొన్నది ఇటువంటి సాంకేతికతలో రంగును పూర్వంకన్నా మిన్నఅయిన స్వేచ్ఛతో, ఊహావటిమతో వర్తించటానికి సౌకర్యం ఉంది.

నీటిరంగు ప్రలేపాలు వ్యాపారరీతిలో తయారుకావటం 18వ శతాబ్ది ఉత్తరకాలంలో మొదలైంది. అవి మొట్టమొదట గట్టి బిళ్ళల రూపంలో-రమారమి 8/8'' × 1 1/4'' × 1/4'' ప్రమాణంలో తయ్యారయ్యేవి. ఇందులో సగం ప్రమాణంకలవి కూడా ఉండేవి. ఆ రెండు రకాలవాటిలో ప్రతిదానిపైన తయారుచేసిన వ్యాపారసంస్థ పేరు ఉండేది. 1886లో ఇందులో ఒక మార్పువచ్చి చెమ్మరంగులు (సార్ద్ర వర్ణాలు) వాడుకలోకి వచ్చాయి. నీటిరంగులకు గ్లిసరీనును కలిపి, వీటిని తయారుచేసి పాత్రల్లో అమ్మేవారు. గ్లిసరీను ఇందులో చేరిఉండటం వల్ల పాత్రలలో గడ్డకట్టక ఇవి నిలువఉండేవి. అందువల్ల అటువంటిది చిత్రణకు బాగా పనికివచ్చేది. పిండిముద్ద రూపంలో సంకోచనీయ నాళికలలో నీటిరంగును ఉంచి అమ్మటం 1900 లో మొదలైంది వాడుకకు ఈ నాళికాలు ఎంతగానో సుకరమై విస్తృతంగా లోకవ్యాప్తిని ఆర్జించాయి

ఈనాటి జలవర్ణప్రక్రియలో వర్ణరాసులను విస్తృతరీతిలో ద్రుతత్వంతో వాడగలగటం ఒక విశిష్ట లక్షణంగా రాణిస్తున్నది; అందువల్లనే ఇది ఎక్కువగా మన్నన ఆర్జించింది. ఆధునికకాలంలో కుశలతకు పేరెన్నిక పొందిన నీటిరంగు చిత్రకారులలో, చాలమంది, ఇంగ్లండుకో, యు.స్టే.కో చెందినవారే. 18వ, 19వ శతాబ్దులలో ఈ ప్రక్రియకు ప్రోదిచేసిన ఆంగ్ల చిత్రకారులలో గణనీయులు: జాన్ రాబర్ట్ కోజెన్స్ (1752-1797), విలియం బ్లేకు (1757-1827), జాన్ సెల్ కోట్‌మన్ (1782-1842). వారిని అనుగమించిన అమెరికనులలో ప్రముఖులు విన్‌స్లో హోమర్ (1836-1910), జాన్‌మారిన్ (1872-1953), ఎడ్వర్డ్ హొపర్ (1882-1967), చార్లెస్ డీమత్ (1883-1935), చార్లెస్ బర్చ్‌ఫీల్డ్ (1893-1967)

**watercolour paper** : *జలవర్ణపత్రం; నీటిరంగుకాగితం.*

నీటిరంగు చిత్రణలో భూమికగామాత్రమే గాక ఆధారంగా సైతం ఉపకరించే కాగితం.

చిరస్థాయితను, అత్యుత్తమమైన పనితనాన్ని చిత్రాలలో కోరుకొనే చిత్రకారులు, చేతితో తయారైన కాగితాన్ని-అందునా నారగుడ్డల ముక్కలతో, ఏకొద్దిగానో దూదిగుడ్డ ముక్కలు సైతం కొద్ది సందర్భాలలో కలిపి తయారు చేసిన దాన్నే-అభిమానిస్తారు. అటువంటి కాగితంలో, వివర్ణకావశేషం ఎటువంటిదికాని, ఇతర విధమైన పదార్థం ఏదీగాని చేరి ఉండ గూడదు. అయితే సైజుఇంక మాత్రం కొద్దిగా కలిపి ఉండాలి. ఈ సైజువల్ల గ్రసనశీలత చాలావరకు తగ్గిపోతుంది. ఇటువంటి కాగితం యూరపియ దేశాలనుంచిమాత్రమే ఎక్కువగా లభిస్తున్నది ఆంగ్లదేశపు ప్రమాణాల ననుసరించిన నిడివి వెడల్పులు (చూ : **_paper dimensions_**) గల తావులు 500 చేరిఉన్న ఒక రీముకట్ట తూగేతూకాన్ని అనుసరించి, నీటిరంగు కాగితాన్ని పలుతీరులుగా వింగడించటం జరిగింది. అన్నిటిలోను తక్కువది 72 పౌనుల తూకపుది, దీనికి రెట్టింపు ధర కలది 140-పౌనుల కాగితం. ఈ రెండే సాధారణపు వాడుకలలో విరివిగా కనపడుతున్నాయి ఏదైనా చిత్రరచనను సాగించవలసివచ్చినప్పుడు ఆ తావును ఒక ఆలేఖనాస్తరికపై పరచి బిగించి, రచన సాగిస్తారు 280 పౌ. మొదలుగా 400పౌ. వరకు తూకం కలవి భారీ తరగతులకు చెందినవి. వీటిని ఆలేఖనాస్తరికపై పరచవలసినవసరంలేదు. తావును తీసుకొని దానిపైనే రచన చేయవచ్చు. ఈ భారీరకపువాటిలోని విస్పష్ట తాంతవతలు, మిలమిల మెరిసే ఘటనలు, కరకు పనితనానికి-అంటే రంగుకత్తితో గీకటం మొదలైన వాటికి-తట్టుకొని నిలవగలగటం అనే గుణాలు, నీటిరంగు చిత్రకారులు ఆ కాగితాలను ఎంతో అభిమానించటానికి కారణాలైనాయి.

చేతయారీకాగితాలు పలు తాంతవములతో లభిస్తున్నాయి *C. P* (సిపి) అనే గుర్తు కలది పరిమిత స్థాయిలో ముతకగా ఉండేది. *R.* అనేది గరుకుగాఉండే (**_rough_**) దానికి చిహ్నం. ఇదే కొన్ని సందర్భాలలో *N. P.* (యన్,పి.) అనే గుర్తుతో ఉంటుంది. ఆ గురుతుకు చక్కజేయబడనిది (**_not pressed_**) అని అర్థం. ఈ రకపువే తరచుగా వాడుకలో ఉన్నాయి. అయితే అవి తగ్గుతూకం కన్నా భారీతూకపు రకాలలోనే ఎక్కువగా లభిస్తున్నాయి ఇంకొకటి *H P* అనే గుర్తుండేది కూడా ఉంది ఈ గుర్తుకు వేడితో చక్కజేయబడినది (**_hot pressed_**) అని అర్థం. ఇది చాల దళసరిగా ఉండి, నున్నగా ఉంటుంది. పారదర్శకపు నీటిరంగుల చిత్రణకు దీన్ని ఉపయోగించరు కాని గహనవర్ణ చిత్రణకు, ఆలేఖనానికి ఇది బాగా ఉపకరిస్తుంది. సన్నటి చేతయారీ కాగితం బొత్తుల రూపంగాను, కట్టలరూపంగాను కూడా లభ్యమవుతున్నది.

నీటిరంగు కాగితపు నాణ్యత కాలము గడచినకొద్దీ ఎక్కువవుతుంది. కాబట్టి కళాకారులు సాంప్రదాయికంగా పాత నిలవలనుంచి కాగి

తాన్ని కొనుగోలు చేస్తారు. నీటిరంగు కాగితంపై నిర్మాతపేరు, లేదా వ్యాపారచిహ్నం దాని తయారీ సంవత్సర సంఖ్య-ఇవన్నీ నీటి గురుతుగ తమకు అనుకూలంగా ఉన్న విషయం సరిగా పరిశీలించిన తర్వాతనే కళాకారుడు దానిని స్వీకరిస్తాడు. నీటిరంగు గుర్తు లేదా వ్యాపార చిహ్నముద్ర ఉన్న చేతయారీ కాగితాలలో అది ఉన్న పార్శ్వం 'క్రమ' మైనదిగా సాధారణంగా సంభావితం. అయితే అత్యుత్తమపు శ్రేణికి చెందిన నీటిరంగు కాగితంలో దోషాలు ఏ పార్శ్వంలోనూ ఉండవు; అందువల్ల దానిలోని ఏ పార్శ్వమైనా చిత్రణకు అనుకూలిస్తుంది.

**water gilding** : *జలరంజనం.*

అమూల్యలోహాల పత్రాలను అతికించే ఒక విధపు సాంకేతికప్రక్రియ. లప్పపు భూమికపై లేదా జిగురుమట్టి భూమికపై, నీటితో ముందుగా తడిచేసి తరవాత లోహపత్రాన్ని దానిపై అతికించటం ఇందులో జరుగుతుంది. క్షయకరితో జరిగే పత్రరంజనం కన్నా ప్రాచీనతరమైనది జలరంజనం. సన్నటి చట్టాలకూ, ఆలంకారిక రచనకూ, వ్రాతగ్రంథాలలో చదుపుతలాన్ని ప్రతదీపనం చేయటానికీ, పుస్తకాల ముఖపత్రాల అలంకరణకూ, లప్పపు ఫలకాలపైనా కలప రచనపైనా జరిపే పత్రరంజనానికి ఇది బాగా ఉపకరిస్తుంది. అవసరమైతే జలరంజనంపై చక్కగా మెరుగుపెట్టి ఉచ్చశ్రేణికి చెందిన ముకుర పరిష్కరణ (*mirror finish*) ను సాధించవచ్చు. క్షయకరీ పత్రరంజనంలో ఇటువంటి పరిష్కరణ సాధ్యపడదు.

**water glass** : *జలకాచం.*

క్షార గుణవిశేషాలు కలిగి శీనతాశీలమైన ఒక ద్రవపదార్థం. రాసాయనికంగా దీనిని సోడియమ్ సిలికేట్ అని వ్యవహరిస్తారు. వర్ణబంధకంగా 19వ శతాబ్దంలో దీనిని కొందరు వాడారు. కాని అది విఫలప్రయత్నమైంది.

**water-glass painting** : *జలకాచచిత్రణ.*

(చూ : mineral painting)

ఒక విధపు అక్లిన్న చిత్రణ. వర్ణద్రవ్యాలను మొదట అచ్చపు నీటితో కలపి, సుధా పిష్ట భూమికపై చిత్రణను మొదట ఇందులో నిర్వహిస్తారు. ఆచిత్రంపై జలకాచద్రవాన్ని పైపూతగా పట్టిస్తారు (పొటాషియం సిలికేట్, లేదా సోడియంసిలికేటును తగిన రీతిగా నీటిలో కలపగా వచ్చే ద్రావణమే జలకాచ ద్రవం). ఈ జలకాచం ఆరిన తరవాత చిత్రంపై చక్కటి పొరగా ఏర్పడి చిత్రానికి రక్షణ కల్పిస్తుందని సంభావితంకాని; ఈ అభిప్రాయం పొరపాటని తెలియవచ్చిన తరవాత, ఈపద్ధతిని చక్కజరచి 'ఖనిజచిత్రణ' అడాల్ఫ్ కీమ్ అనే అతడు దీనిని రూపొందించాడు.

**water-in-oil emulsion** : *తైలవక్త జలదుగ్ధకం.*

**watermark** : *నీటిగురుతు; జలాంకనం*

ఒక కాగితంలో అంతర్గతమై కనపడే రేఖాకృతి, రీతిరేఖ లేదా గురుతు. కాగితపు తయారీ సాగేకాలంలోనే దాని నిర్మితి కువకరించే సాధనంలో కొద్ది ప్రదేశాన్ని ఎత్తుగా ఉంచటంవల్ల సాధారణంగా ఈ నీటిగురుతు ఏర్పడుతుంది. ఇట్లా గురుతు ఏర్పడిన తావు తక్కిన తావులకన్నా తక్కువ దళసరితనం కలిగివుండటంవల్ల కాగితాన్ని వెలుతురువైపు ఎత్తి పట్టివుంచినప్పుడు, ఆ తావున నీటి గురుతు స్పష్టంగా కనపడుతుంది. చేతయారీ కాగితంలో తయారీకాలంలోనే ఇటువంటి గుర్తులు రూపొందించటానికి నతశిల్ప సంయానములను లేదా సన్నటి తీగతో చేయబడ్డ రేఖాకృతులను, ముద్దదేలిన కాగితపు గుజ్జు చేరే జవనికపై అమరుస్తారు.

**waterproof** : *జలప్రతిరోధి.*

**water-white** : *జలశ్వేతం.*

గ్లిసరీనువంటి పారదర్శక, వర్ణరహిత ద్రవ్యాలకు వాడే పదం.

**wavelength** : *తరంగ దైర్ఘ్యం; తరగ నిడివి; అలపొడవు.*

**wave scroll** : *తరంగ సర్పిలిక.*

(చూ : Vitruvian scroll)

**wax** · మైనం; సిక్థం.

తేనెటీగల వల్ల స్రవించే ఒక కల్పిక ద్రవ్యానికీ, దాన్ని అన్నివిధాల భౌతికధర్మాలలో పోలి ఉండే ఇతర ద్రవ్యాలకున్నూ ఈ పదం వర్తిస్తుంది. తేనెటీగల వల్ల లభించే దానికి తేనెమైనం, లేదా మధూచ్ఛిష్టం అనే పేర్లున్నాయి. చీనీయ కీటక సిక్థమూ మధూచ్ఛిష్టమూ జంతుజాలు; ఇట్లాకాక ఉద్భిజ్జ జన్యములైనవికూడా ఉన్నాయి. వీటిలో కర్నబామైనం, కండీలామైనం, జపాన్ మైనం ప్రసిద్ధాలు. ఖనిజాలకు చెందిన మైనాలను ఖనిజసిక్థా లంటారు. వీటిలో మెరుగు మైనం, మాయమైనం, కాష్ఠికసిక్థం లాటిమైనం చెప్పదగినవి. మైనాలకు తైలాలతో సన్నిహిత సంబంధం ఉంది; కాని సాధారణపు ఉష్ణోగ్రతలలో అవి ద్రవరూపంలో ఉండవు. కాని యక్షధూపాలకన్నా తైలాలకన్నా, ఈ మైనాలలో, చెమ్మదనానికి వశ్యత చాలా తక్కువకావటం వల్ల, పరిరక్షక ప్రలేపాలుగా అవి ఎంతగానో పనికివస్తాయి. అయితే వీటిలో ఎక్కువగా కనపడే మృదుత్వం వల్ల, ఆపాకర్యం ఏదీలేని పరిస్థితిలో మాత్రమే, అవి అటువంటి పరిరక్షక ప్రలేపాలుగా పనిచేయగలవు. జంతుజములు ఉద్భిజ్జజన్యములు అయిన మైనాలు చాలావరకు జంతుజ, ఉద్భిజ్జ జన్య తైలాల వలెనే వ్యవహరిస్తాయి. సబ్బీకరణ, దుగ్ధకీకరణం విషయంలోనేగాక, తక్కిన విధాలుగా కూడా ఇవి ఆయా తైలాల

వలెనే ప్రపంచర్యలు జరుపుతాయి. ఖనిజ తైలాల మాదిరిగానే ఖనిజసిక్థాలను రసాయనికంగా జడాలు. మైనానికి నిర్దిష్టమైన ద్రవీభవన బిందువు ఏదీ ఉండదు దాని ద్రవీభవన విస్తృతికి గరిష్ఠ కనిష్ఠాంకాలు సెంటిగ్రేడు డిగ్రీలలో ఇవ్వబడతాయి. మైనాలలో ఏదైనా 100° సెం. గ్రే. లోపలనే ద్రవీభవనం చెందుతుంది నీటియొక్క బాష్పీభవనబిందువు 100° సెం గ్రే కావడంవల్ల మైనాన్ని మరిగే నీటిలో ద్రవీభవించవచ్చు. ఆయా మైనాలకుండే గుణవిశేషాల ననుసరించి కళాకారుడు తన భావనకు తగిఉండే గుణాలు కలిగిన మైనాన్ని తనరచనకై ప్రత్యేకించుకొంటాడు. ఇటువంటి గుణవిశేషాలలో ముఖ్యమైనవి: ఆ మైనపు ద్రవీభవన విస్తృతి, ఘనపదార్థముగా ఉన్నప్పుడు దాని గట్టిదనం ఏదైనా ఒక రచనకై కళాకారునికి నిర్దిష్టమయ్యే ద్రవ్యాలలో మైనం అనేది అనిర్దిష్టంగా పేర్కొనబడినప్పుడు వివర్ణితమైన తెల్లటి తేనె మైనమే అది అని భావించాలి

**weaving** : *తంతుకర్మ; నేత.*

**wedge** : *గనిక.*

**wedge (v)** : *సంబాధించు.*

1. మార్దవప్రక్రియలో మృత్తికను తయారుచేసే పనికి ఈ పదాన్ని వాడతారు. అప్పడాల పిండిని గంటుపెట్టి, ముద్దచేయటం చాలా పర్యాయాలు పొగించేట్లుగా ఈ పని జరుగుతుంది.

**weld** : *గౌరం.*

పశ్చిమయూరపులో పెరిగే ఒక విధమైన వృక్షంనుంచి సహజసిద్ధంగాలభించే ఒక రంగద్రవ్యం. ఇది ఉజ్జ్వల పీతవర్ణం కలది. 16వ శతాబ్దిలో దీన్ని కళాకారులు విరివిగా వాడారు కాని 19వ శతాబ్దిలో దీనికన్నా మేలిలక్షణాలు కలిగిన ఇటువంటిరంగద్రవ్యం, సంయోజికరీతిలో తయారుకావడంతో, సహజసిద్ధ గౌరవు వాడకం అంతరించింది.

**welding** : *సంధానక్రియ; అతకటం.*

రెండు లోహశకలాలను అతిసన్నిహితంగా చేర్చి, కాల్చి, వాటి అంచులను ద్రవీభవింపజేసి, ఆ శకలాలను సంధించే ప్రక్రియను ఈ పదం తెలియజేస్తుంది.

**well slant** : *వాల్బాలి దిమ్మె.*

(చూ : slant)

**wet clay** : *పిష్టమృత్తిక.*

శిల్పి వాడే మృత్తికా విశేషం; శిల్ప మృత్తికకన్నా వేరైంది. మృత్తికతో నీటిని కలిపి దీన్ని తయారుచేస్తారు.

**wet-into-wet** : *తేమపై తేమ.*

అదివరకే ఆర్ద్రపు పైపూత కలిగిన పరితలంపై పూతరంగు పట్టించటం. తేమగా

ఉన్న తైలవర్ణపు పూతపై కలఁపు పూత రంగును పట్టించటమూ లేదా అందుకు విపర్యయంగా చేయటమూ తేమపై తేమలో ఒక రీతికి లక్ష్యాలు (చూ. *mixed technique*)

**wetting agent** : క్లేదకారకం; క్లేదకం; ఆర్ద్రకం

నీటి రంగుకు. చాలా అల్ప ప్రమాణంలో అంతటంతటా కలిపే జలం; ఈ రీతిగా కలపటం వల్ల జలపు ఉపరితల తన్యత తగ్గి, సరిమట్టపుటీటిలో ఒకే తీరుగా కాగితంపై రంగు వ్యాపించేందుకు వీలవుతుంది.

**whetstone** : సానరాయి.

వాదర గలిగిన పరికరాల వాదర అంచుకు పదును పెట్టటానికి వాడే ఒకవిధమైన కఠినశిల.

**white earth** : తెల్లమట్టి; శ్వేతమృత్తిక.

హరితమృత్తికతో, వర్ణద్రవ్యగుణ విశేషాలలో. సామ్యం కలిగిన ఒక అచ్చతెలుపు మట్టి. రంజకాల తయారీలో ప్రాతిపదిక ద్రవ్యంగా దీన్ని వాడతారు. మృత్తికాశ్వేతం కన్న ఇది వేరైంది.

**white lead** : తెల్లసీసం.

ప్రాతిపదికమైన సీసకార్బనితం (లెడ్ కార్బనేట్) తయారీ వర్ణద్రవ్యాలు లేదా కృత్రిమ వర్ణద్రవ్యాలలో తెల్లా ఇది ప్రాచీన ద్రవ్యం. యూరప్ చీనాల లిఖితాధార చరిత్రలలో మొదటి యుగాలలోనే దీని వాడుక ఉన్నట్లు తెలుస్తున్నది; తరవాత తైలవర్ణాలలో దీనికి వాడుక కలిగింది. చిరస్థాయి వర్ణద్రవ్యాలన్నిటిలో ప్రశస్తతమమైన వర్ణద్రవ్య లక్షణాలు దీనిలో మాత్రమే కనవస్తాయి. ఇది మంచి శోషణి కావటం వల్ల తూలికాకర్మకు చాలా అనువుగా ఉంది, కలకాలం మనగలిగే పటిష్ఠ లేపనపటలాన్ని తయారు చేయగలుగుతున్నది. తక్కిన విధాల తెల్లటి వర్ణద్రవ్యాలను వాడేవారు, దీనిలోని కొన్ని చిన్న దోషాలను - విషస్వభావం కొంతకలిగి ఉండటం, గంధకాన్ని తాకిన వెంటనే అది పసిమిగానో గోధుమరంగుగానో మారడం అనే వాటిని-కొండంతలుగా పేర్కొని విమర్శిస్తారు. పై దోషాలలో రెండోది-తైలచిత్రాలకు సంబంధించినంతవరకు-ఏమంత లెక్కలోకి తీసుకోవలసిందికాదు, తైలవర్ణచిత్రణలో వర్ణద్రవ్యం తైలంలో నిక్షిప్తమై ఉండడంవల్ల వాతావరణంలోని గంధకవాయువుల తాకిడి వల్ల దానికి ముప్పు కలగదు. అంతేగాక సాధారణంగా కళాకారుల రచనలన్నీ గంధకపు సముపచయనం నుంచి దెబ్బతినకుండా ఉండేట్లు పరిరక్షితములయ్యే ఉంటాయి. తైలాలలో కలిపిన తెల్లసీసం-ఆమోదితములైన చిరస్థాయి వర్ణద్రవ్యాలతో అంటే-కాడ్మియములు, అతిసాగరిక నీలాలవంటి వాటితో,

రాసాయనికంగా ప్రతిక్రియ జరపదు; అయితే కాడ్మియములు మొదలైనవి చాల తక్కువ రకపువై, గంధకాన్ని తమలో కలిగి ఉన్నప్పుడుమాత్రం ప్రతిక్రియ జరుగుతుంది సీసం సహజంగా విషమయం; శరీరంలో అది కూడినకొద్దీ దాని దుష్ఫలితాలు ఎక్కువ అవుతుంటాయి.కాబట్టి ద్రవలేపాలలోను, పిష్టకములలోను, పసిబిడ్డలు ఉపయోగించే వివిధవర్ణాలలోను తెల్లసీసాన్ని వాడరు. అయినా శౌచవిధులను చక్కగాపాటిస్తూ, ఆ తెల్లసీసపు రంగును నోటిలో వేసుకొని మింగకుండా, అతె సీసపు ధూళిని పీల్చకుండా జాగ్రత్త వహిస్తూ మెలగే నిపుణ కళాకారులు సీసపు విషబాధకు ఎంత మాత్రం లోనుకారు

తెల్లసీసాన్ని చాలా పద్ధతులతో తయారు చేస్తున్నారు. అయితే కళాకారుని తైలలేపాలలో వాడదగిన ప్రశస్తమైన తరగతికి చెందింది మాత్రం చాలవరకూ 'పురాతన దచ్చి ప్రక్రియ' వల్ల తయారవుతున్నది. కళాకారులువాడే ఇటువంటి తెల్లసీసం 'తుషారశ్వేతం' అని వ్యవహృతం. కళాకారుల వర్ణంగా ఆమోదితమయికూడా పైదానిలాగా తరచుగా లభ్యంకాని వేరొకరకపు తెల్లసీసం 'క్రెమ్నిట్ శ్వేతం' అనేదికూడా ఉంది. ఇరవయ్యో శతాబ్దం వరకూ మొత్తపు కళాత్మక తైలవర్ణ చిత్రణ చరిత్రలోనే కాంత్యభేద్యపు తెల్లని వర్ణ ద్రవ్యంగా వాడుకలో నిలిచి ఉండగలిగింది తెల్లసీసం మాత్రమే.

తైలచిత్రణపు సాంకేతిక ప్రక్రియ విజయవంతమై, కాలునిలువదొక్కుకొని నిలవగలగటానికి కొంతవరకు తెల్లసీసపు ప్రశస్త లక్షణాలే కారణాలని చెప్పవచ్చు. నాగశ్వేతం, టిటానియశ్వేతం–అనేవి విషాత్మకాలు కాకపోవటమే కాక విపర్ణతకున్నూ లోనుగాని కళాకారుల రంగులుగా ఆమోదితములయినవే అయినా చాలా విషయాలలో అవి తైలవర్ణాలుగా తుషారశ్వేతానికి సరిరావు

మార్దవాలలోనూ, తక్కువఉష్ణోగ్రతలలో కాలుపు జరిపే ద్యుతికముల విషయంలోనూ సాధారణపు ప్రసవంగా తెల్లసీసం ఉపకరిస్తున్నది.

**white lead in oil** : తైలంలో తెల్లసీసం.

ముడి అవిసెనూనెలో విద్రావితం చేయబడ్డ తెల్లసీసం, ఇది గట్టిపిండిగా తయారవుతుంది. గృహాలంకరణ చిత్రణకూ పారిశ్రామికపు పూతపనులకు దీని వాడకం ఉంది,

**white-line cut** : శ్వేతరేఖా రీతి.

ఒక విధమైన ఉల్బణముద్రాంకనం; నల్లటి భూమిపై తెల్లటిరేఖలతో ధ్యేయవస్తువు దీనిలో రూపొందుతుంది. దారురేఖా శిల్పాలలో అనేకాలు శ్వేతరేఖారీతిలోనే ఉంటాయి. శ్వేత రేఖారీతికై రేఖాశిల్పాన్నిగాని సూచీలేఖనను గాని జరిపేప్రక్రియకే 'నలుపునుంచి తెలుపుకు కృషి' అనే వ్యవహారం ఉంది.

**white–on-white** : తెలుపుమీద తెలుపు.
(చూ : blind printing)

**white pigments** : శ్వేత వర్ణ ద్రవ్యాలు; తెల్లటి వర్ణ ద్రవ్యాలు.

వర్ణక ప్రమాణం చేత, తైలవర్ణాలకై ఈ దిగువ తెల్లటివర్ణద్రవ్యాలు ఆమోదితములైనవి, సారణిక చిత్రణలోని సాంకేతికతలందన్నిటా (అన్యథా సూచితమైనప్పుడు తప్ప)ఇవి సర్వే సర్వత్రా అంగీకృతములుగా ఉన్నవి:

1. తుషారశ్వేతం (పిష్టకిములలోనూ జల మాధ్యమాలలోనూ తప్ప)

2 టిటానియంశ్వేతం 3. నాగశ్వేతం. తైలాలలో తమతెలుపుదనాన్ని, పూర్ణకాంత్యా ఛేద్యతను నిలుపుకొనలేని తెల్లటివర్ణద్రవ్యాలను 'జడవర్ణద్రవ్యాలు' అని వర్గీకరించటం జరిగింది. కొన్ని పైపూతలలో కొన్ని జడవర్ణద్రవ్యాలే తెలుపులుగా ఉపయోగపడుతున్నవి ఉదా : గహన వర్ణములలోని శ్వేతోపాధి

**whitewash** : సుధాలేపనం; సున్నపు కొట్టుడు.

గోడలకూ లోకప్పులకూ సామూహికలో ఆపరిష్కృతంగా, వ్యయం అంతగలేకుండా, వేసే తెల్లటి పైపూత ఇది చిరస్థాయిగా నిలవదు, జలనిరోధి కూడా కాదు సాధారణంగా కాల్చినసున్నపురాతితో నీటిని కలిపిన దానికే ఈ పదం వర్తిస్తుంది అయితే ఆలేపసుధకన్నా, తరతరములైన చౌకబారు తెల్లటి పైపూతలకున్నూ కూడా ఈ పదాన్నే వాడతారు ఒకప్పుడు రచితములైనచిత్రక, సదృశ్య-అక్లిన్నచిత్రాలుతరువాతికాలపు మత, రాజకీయాభిప్రాయాలకు సరిపడకపోతే వాటిని మరుగుపరచటానికి సుధాలేపనాన్ని గతకాలంలో వినియోగించారు అట్లా మరుగుపడ్డ ఎన్నిటినో ఆధునిక యుగంలో ఆ సుధాలేపనపు పై పూతను కడిగివేయడంద్వారా పునరుద్ధరిస్తున్నారు

**white wax** : తెల్ల మైనం.

బాగా సంస్కారం పొంది తెల్లబడ్డ తేనె మైనం.

**whiting** : ధవళకము.

సహజసిద్ధమైన కాల్షియమ్ కార్బనేటు, ప్రపంచంలో వివిధ ప్రాంతాలలో గనులలో ఇది లభిస్తున్నది. లప్పం వంటివాటిలో ఇది జడవర్ణద్రవ్యంగా వాడుకలో ఉన్నది ఎక్కువ ఉష్ణోగ్రతలలో కాల్చబడే మార్తపద్యోతికాలకు ముఖ్యప్రసవంగా సైతం దీనికి వాడుకఉంది. ధవళకమున ప్రామాణికపు తరగతికి చెందిన దానిని 'అతిరంజకం' అని వ్యవహరిస్తారు. ఇది ధూసరపువాకగానో, మీగడవాకకు దగ్గిన తెలుపుగానో, ఏకరీతిగాఉండే సన్నని పొడిగ మాలిన్యములు లేకుండా ఉంటుంది. అయితే తక్కువ రకానికి చెందిన ధవళకంకూడా ఒకటి ఉంది దానిని 'వాణిజ్యకం' అంటారు. అది ఎక్కువ ధూసరవర్ణం కలిగి ఉంటుంది. దానిని తక్కువరకపు పనులకు-కిటికీకి మొదటి

పూత మొదలైన వాటికి-మాత్రమే వాడు తున్నారు ఈ ధవళకంలోనే చాలా మేలి రకాలకు చెందినవికూడా ఉన్నాయి: స్పానీయ శ్వేతం. పారిస్ శ్వేతం మొదలైనవి ఇటు వంటివే: వీటిని బాగా సంస్కరించి రూపొం దిస్తారు.

ఇవి సాధారణంగా బజారులలో కొనటానికి దొరకవు ధవళకమునకే 'ఆంగ్ల శ్వేతం' అనే పేరుకూడా ఉంది. ఆంగ్లదేశపు సున్నపురాతి కొండశిఖరాలనుంచే ధవళకం అత్యధిక భాగం లభించటంవల్ల, దానికి ఆపేరు వచ్చింది రాసాయనికంగా తయారుచేసే కాల్షియం కార్బనేట్‌ను 'అవక్షిప్త ఖటిని' అంటారు ఇది సహజసిద్ధమైన ధవళ కంకన్నా ఎక్కువ తెల్లగా ఉంటుంది

**whole length** : పూర్తి నిలువు

(చూ : canvas sizes, portrait).

**wing** : రెక్క

(చూ triptych)

**Winsor blue, Winsor green**

-విన్ నర్ బ్లూ; విన్ నర్ గ్రీన్

థాలోసియానైన్ నీలిమకు, థాలోసియా నైన్ హరితానికి క్రమంగా, బ్రిటన్‌లో, వ్యాపారనామాలు.

**wiping** : ఆమార్జనం తుడిచివేత

ఫలకాలలో (అచ్చుకావలసినవికాని) పరి తలాలనుంచి సిరాను తొలగించివేయటం, ఇందు వల్ల సూచీలిఖితములు, లేదా రేఖాశిల్పిత ములూ అయిన రేఖలలోమాత్రమే సిరా నిలిచి ఉండగలదు ముద్రణలలో స్వచ్ఛమైన తెల్లటి తావులను, స్పష్టరేఖలను పొందాలంటే ఫలకంపై ఈ ఆమార్జనం తప్పకుండా జర గాలి. సాధారణంగా ఇటువంటి పని అర చేతితో చేసేవారు (చేతితుడిపివేత), లేదా ఇందుకు సన్నటి గుడ్డను వాడతారు (గుడ్డ తుడిపివేత) అయితే కొందరు గ్రాఫిక కళాకారులు ఇట్లా తుడిచేటప్పుడు సిరానంతా బాగా తుడిచివేయ కుండా, గీతలను మసకపరచి, వర్ణ స్వ రమ్యతలను సాధిస్తారు ఇందువల్ల చక్కగా తుడిచిన ఫలకంనుంచి లాగే ముద్రణలోని అన లంకృతత్వమును, ఉదాసీనతను తగ్గించటా నికి వీలుపడుతుంది ఇటువంటి పనికి అవలం బించే ఒక పద్ధతి: ఫలకాన్ని నిపీతములు (మూతి ముద్దలు, లేదా గడ్డలపీలికల) సాయంతో మన్నంతో నింపటం. ఈ సాంకే తిక ప్రక్రియనే 'పునరావిర్భూతి' అని వ్యవహ రిస్తారు. ఇటువంటి నిపీతములవల్ల చాలా ప్రయోజనములున్నాయి. అంతఃపాతి రేఖల రమ్యతకు భంగము కలగకుండానే, ఒకవిధపు రమ్యతను ఇవి చేకూర్చగలవు ఒక్కొక్క ప్పుడు సిరాను ఫలకంనుంచి తుడిచివేసిన తర వాతనే ఒక వస్త్రంలో రేఖలనుంచి కొంత సిరాను తీసి రేఖల పక్కల నిలుపుతారు దీనిమూలంగా సూచికా ప్రక్రియలో సంభవము వల్ల సాధించిన రీతిగా ముద్రణలో రేఖలు వస్తాయి. ఇటువంటి నిపీతములు ఫలకంలోని

కొన్ని లోపాలను-ఒక రేఖ విషమదర్శనం చెందటం వంటి వాటిని-మరుగు పరచటానికి పనికివస్తాయి అందువల్లనే కొందరు విశుద్ధతా వాదులు, దీన్ని ఆమోదించరు. యథాతథమైన రుజువును, స్వచ్ఛమైన దాన్ని ఈయకుండా ఈ ప్రక్రియ దోషాలను మరుగుపరుస్తుందని వారు దాన్ని నిందిస్తారు

**wire - mesh cloth** : *వలనేత గుడ్డ.*

**wood** : *దారువు; కొయ్య.*

**wood beetle** : కొయ్యలద్దె పురుగు.

**wood-carving** ; *దారుశిల్పం*

దాదాపుగా కనీసం గత 5000 ఏండ్ల కాలంలో దారువు శిల్పమాధ్యమంగా వాడుకలో ఉంది. అంతకు పూర్వంకూడా మాధ్యమంగా అది ఉండేదని భావించటానికి తగిన నిదర్శనాలు కనపడటంలేదు. కొయ్య అతి దీర్ఘకాలం మన్నికగా ఉండేది కాకపోవటం అంతకు పూర్వపువి అంతరించికూడా ఉండవచ్చు. వర్తుల శిల్పంలోనేకాక, ఉల్బణ శిల్పానికికూడా కొయ్య వాడబడుతున్నది; అంతేకాదు వాస్తువులో, వాస్తుశిల్పాలంకృతులకు, గృహోపకరణ సామగ్రికి, ఇది విశేషంగా ఉపయోగంలో ఉంది.

శిల్పానికి వినియుక్తమయ్యే కొయ్యలో రెండు రీతులవి- కఠినములు, మృదులములు అనేవి-ఉన్నాయి, కఠినపు వాటిలో- మృదులములైనవాటిలోకన్నా-పలుకు వాటం దట్టంగా అమరి ఉండి, ఎక్కువ మినిమి కల్పించటానికి అనువుగా ఉంటుంది. ఆధునిక శిల్పులు, కొయ్యను శిల్పానికిగాను వాడేటప్పుడు, చెట్లలో పెరుగుదలయందు సహజరీతిలో కుదురుకొన్న విశిష్ట లక్షణతకు అత్యధిక ప్రాముఖ్యాన్ని కల్పించటమేకాక, కొయ్యలోని పలుకుదారను సహజావ్యవస్థతలను సౌందర్య స్ఫోరకాలుగా ఉపయోగించటాన్ని ఇష్టపడతారు. దారు శిల్పంలో ఇటువంటి పనితనం పూర్వకాలంలో కూడా కొన్నిచోట్ల ఉండేదని, ఈస్టరుదీవుల్లో లభించిన ప్రాచీన దారు శిల్పాల అవశేషాల వల్ల తెలియవస్తున్నది.

**wood-carving knife**: *కొయ్యమలచే కత్తి.*

దారుశిల్పంలో, ఉలులతోపాటుగా, మలచటంలో పనికివచ్చే, ఉక్కు కత్తుల రకాలలో దేనికైనా ఈ పదం వర్తిస్తుంది

**wood-carving tools** . దారు *శిల్ప పరికరాలు*

శిల్పి, దారుశిల్పంలో వాడే వివిధ పరికరాలు-ఉలులు, పంపులులు, ఫాటనులు,కొయ్య మలచే కత్తులు. వీటికి అన్నిటికీ కొయ్యతో చేసిన పిడులు అమర్చి ఉంటాయి సుత్తితో ఈ పిడులమీద, పనికాలంలో కొట్టాల్సిన అవసరం ఉంటుంది కాబట్టి ఇవి అందుకై పట్టుకునేట్లు దృఢంగా నిర్మితమవుతాయి. దేవదారు,



దారుశిల్ప పరికరాలు : (A) సాదా ఉలి (B) బద్దు ఉలి (C) సాదా వంకి (D) కొనవంక ఉలి (E) నిడివి వంకి (F) చేపతోక ఉలి (G) చీలిక ఉలి (H) కొయ్య మలుపు కత్తులు (I) కొయ్యకాణా

ఆకురాయి కూడా కొయ్యపనిలో ఉపకరిస్తాయి కొయ్యపై జరిగే శిల్పంలో వాడుకలో ఉండే ఈ నరుకుడు వసిమొట్లు సాధారణంగా 8 నుంచి 12 అంగుళాల మధ్య పొడవులు కలవి వీటి ప్రమాణాలు వివిధరీతులుగా ఉంటాయి. అంచు వద్ద 1/16 అంగుళం మొదలుగా 1 అంగుళం వరకూ వెడల్పుగల కర్తనములను వీటివల్ల సాధించవచ్చు. వాదరల ఆకృతులను ఎన్నో రీతులుగా-కొన్ని U-ఆకారంలో, మరికొన్ని V-ఆకారంలో, ఇంకా కొన్ని ఋజువుగా ఉంటాయి అందువల్ల వివిధాకృతులను, వలు తీరుల లోతులను గల కర్తనములను పొందే వీలుంది గ్రాఫిక్ కళలలో, దారుతక్షనమునకు, సాధారణపు దారుతక్షన పరికరాలలో పరిమాణంలో సగం మాత్రమే ఉండేవాటిని వాడతారు దారుశిల్పపరికరములను, దారు తక్షన పరికరాలను సానకంమీద సానబె పదునుచేస్తారు

**woodcut** : *దారుతక్షనం; దారుఖండనం.*

ఒక విధమైన ఉబ్బెణముద్రణకు తగిఉండే సాంకేతిక ప్రక్రియ ఇందులో ముద్రాతలాన్ని -కొయ్యదిమ్మెను ఒకదానిని-దారుతక్షన పరికరాలచేత మలచి రూపొందిస్తారు. ఈ ప్రక్రియకు ఫలితంగాజరిగిన ముద్రణనుంచి తీసే మౌలిక ముద్రాంకముకున్నా దారుతక్షనమనే పేరు వర్తిస్తుంది. చెట్టుబోదెను పైనుంచి దిగువకు కోయడంవల్ల ఏర్పడే చెక్కబల్లనుంచి దారుతక్షనమునకు కావలసిన దిమ్మెను నరికి తీసుకొంటారు. బోదెను నిలువుకోత కోయటం

పని ఈదిమ్మలో పంపలకు చాలులుదారలుగా సమాంతరరేఖలుగా కుదురుకొంటుంది. దారురేఖా శిల్పానికిన్నీ, దారుతక్షణమునకున్న మధ్యగల ముఖ్యభేదమిదే. దారురేఖా శిల్పానికి గ్రహించే దిమ్మె, చెట్టుబోదెను అడ్డుకోత కోయటంవల్ల లభిస్తుంది. యాపిల్, పియర్, బీచి సైకమూరు వంటి కఠిన దారుజాతి వృక్షాల కొయ్యను దారుతక్షణమునకై దిమ్మెగా వాడతారు. కాని 20వ శతాబ్దిలో పెద్దముద్రాంకనాలను, పెద్దవైశాల్యం గలవాటిని తయారుచేయవలసిన అవసరం ఏర్పడింది. అందుకోసం చౌకబారుగా ఉండి, ఎక్కడైనా లభించే అవకాశం ఉన్న దేవదారువంటి మృదుదారువుల చెక్కలనుకూడా వాడటం జరుగుతున్నది. అయితే సాంప్రదాయికపు దారుతక్షణానికి ఇటువంటి మృదుదారువులను ఏనాడూ ఉపయోగించరు, కఠినదారువున శిల్పం ఎటువైపు సాగవలెనన్నా స్వేచ్ఛగా అట్లా జరపటానికి అవకాశముంటుంది; అందులోని, పలుకుకీతి రుజువులందును కనపడుతుంది. మృదు దారువుతో ఇటువంటిది సాధ్యంకాదు. ఆధునిక ముద్రాంకనకారులు కఠినదారువులోని పలుకుకీతిని చక్కగా ఉపయోగించి పెద్ద ముద్రాంకనాలలో ఈ పలుకుకీతినే రచనలో ఒక ముఖ్యభాగంగా రాణింపచేస్తున్నారు.

దారుతక్షణమున చెక్కుడుపని ఎంతో జరగవలసి ఉంటుంది. ఈ కాలంలో గ్రాఫిక కళాకారులు, ఈ పనికై ఒక చిన్న విద్యుత్ వేధని (*Drill*) ని ఉపయోగిస్తున్నారు. దారుతక్షణంలో ముద్రాతలమున సిరాను పట్టించటానికి హస్తావర్తిని వాడతారు. 19వ శతాబ్దికి పూర్వం ఇటువంటి పనికై తోలుతో చేసిన స్పాంజిని వాడేవారు. దారుకము (***block***) ఉన్నతార్థకం (***type-high***) అయినప్పుడు సాధారణ ముద్రాయంత్రంలోని చదునుశయ్య మీదనే దాన్ని ముద్రించే వీలుంది. ఒకప్పుడు కొయ్యతో చేసిన దారుకాలను ముద్రించటానికి చేముద్ర (***hand-printing***) పద్ధతిని అవలంబించేవారు. ఆ పద్ధతి ఇప్పుడు కళాకారుల శిల్పాగారాలలో మాత్రమే విరివిగా వాడుకలో ఉన్నది. ఈ పద్ధతిలో, దారుకంపై బాగా సిరాపూసి, రుజువుకాగితాన్ని దానిపై పరచి, అందుపై మళ్ళీ ఒక కాగితాన్నిగానీ, అట్టనుగానీ పరచి దానిపై చక్కగా సాగిపోయే ఒక పరికరంతో రుద్దుతారు. ఇటువంటి రుద్దుడు పనికి మర్దనికనో లేదా కొయ్యగరిటె చిప్పనో వాడతారు.

జవుళీ సరుకులపై కొయ్యదిమ్మెతో అద్దకం చేసే తీరునుంచి క్రమపరిణతిపొంది రూపొందిందే దారు తక్షణం. 14వ శతాబ్ది అంతం నుంచి యూరప్‌లో ఇది వాడుకలోకి వచ్చింది. ఇటువంటి దారుతక్షణ పద్ధతిలోనే ముద్రణను పొందిన వాటిలో మొట్టమొదటివి పేకాట ముక్కలు. 15వ శతాబ్దపు దారుకపుస్తకాలలో దృశ్యచిత్రాలు సాధారణంగా రేఖా

కృతులు గలిగి, చేతితో వేయబడిన రంగులు గలిగిఉండేవి. ఈ మొట్టమొదటికాలపు ముద్రాంకనములు, ముఖ్యంగా మత విషయాలకు చెందినవి; అవి సాంకేతికతలోనూ, వర్ణ విషయికంగానూ చాల మొరటుగా ఉండేవి. అయినా క్రమంగా 16వ శతాబ్దినాటికి, జర్మనీలో దారుతక్షన కళ చాల ముందుకువచ్చి, సాంకేతికంగాను, సౌందర్య స్ఫోరకతలోను ఉచ్ఛస్థానాన్ని అందుకోగలిగింది. ఇందుకు ఆనాటి కుశలురైన దారుశిల్పులే కారణమని చెప్పవలసి ఉంది. కళాకారులు ఇచ్చిన రేఖాకృతులను ఆధారంగా గ్రహించి ఈ పనివాళ్లు దారుకములను తయారు చేయగలిగేవారు. అట్లా వారి పనితనాన్ని ఉపయోగించుకొన్న ప్రసిద్ధ కళాకారులలో గణనీయులు: 1. అల్‌బ్రెక్ట్ డ్యూరరు (1472-1558); 2. లూకాస్ క్రానాచ్ (1472-1553). 3 హాన్స్ హాల్‌బీన్-కనిష్ఠ (1498-1543). వీరిలో కడపటివాని 'మృత్యునాట్యం' అనే చిత్రానికి దారుతక్షనం తయారుచేసిన కుశలశిల్పి హాన్స్ లూజెల్ బెర్గర్. ఈ పనివాళ్ళు అత్యంత కుశలురు కావటంవల్ల కళాకారులు రేఖాకృతులు మాత్రమే వారికి అప్పగించి, అటు పిమ్మట వారు చేసేపనిని అప్పుడప్పుడు పర్యవేక్షణ మాత్రం చేసేవారు. ఆ కాలంలోనే ఇటలీదేశంలో కూడా దారుతక్షనము ముందడుగువేసి వికసనమును సాధించింది. రీతివాద కళాకారుడైన ఫ్రాన్సెస్కో పర్మిజియానినో (1508-1540) ఎన్నో ఆలేఖనాలను రచించి వాటికై దారుతక్షములను ఉగో డా కార్పి అనే వ్యక్తిచేత తయారుచేయించాడు.

17వ శతాబ్దంలో ఋజురేఖాశిల్పం, సూచీచిత్రణా ముందుకు వచ్చి దారుతక్షణమును అవతలకు తోయగా, అది ఆకాలంలో ఒక ప్రత్యుత్పాదక ప్రక్రియగా మాత్రమే నిలవగలిగింది. ఇక దారురేఖాశిల్పం 18వ శతాబ్దిలో ఎంతో పురోగమించి ప్రత్యుత్పాదక స్థానం నుంచి కూడా దారుతక్షణమును అవతలకు నెట్టింది. అయితే 19వ శతాబ్దపు ఉత్తరార్ధంలో దారుతక్షణానికి మళ్ళీ ఫ్రాన్సులో ఆదరణ లభించింది. అప్పట్లో దానిని ఒక కళామాధ్యమంగా ప్రముఖ కళాకారులైన గొగాయెన్, మిల్లెట్ ఉపయోగించారు. ఇంకొక సుప్రసిద్ధుడు ఎడ్వర్డ్ మంచ్, రేఖాకృతులను మాత్రమే రచించటంతో ఊరుకోక, అందుకై దారుతక్షణములను తానే స్వయంగా రూపొందించుకొంటూ, ఆ మాధ్యమంతో ఎన్నో ప్రయోగాలను సాగించి, దాని పునరుద్ధరణను ప్రోత్సహించటానికి ఎంతో తోడ్పడ్డారు.

**woodcut tools** : *దారుతక్షన పరికరాలు.*

ఈ పరికరాలలో ఉలులు, పంకులులు, పోటనులు, కత్తులు (తక్షణములు) మొ॥ వి చేరి ఉన్నాయి. దారుతక్షనపు దాయకాన్ని తయారుచేయటానికి ఇవి పనికివస్తాయి. దారుశిల్పంకోసం శిల్పి వాడే పరికరాలే ప్రమాణంలో తగ్గుదల వహించి ఈ పరికరాలుగా

రూపొందుతున్నాయి. వీటి నిడివి 5 అం. నుంచి 8 అం మధ్య ఉంటుంది. అందుకు తగినట్లుగానే వాటి వాదరలు కూడా చిన్నవిగానే ఉంటాయి. ఈ దారుతక్షన పరికరాలపై సుత్తెతో కొట్టే అవసరంలేదు కాబట్టి వాటి పిడులు నిడుపు పిరి, పట్టుకొని పనిచేయటానికి అనువుగా ఉంటాయి.

**wood engraving** . *దారు సంలేఖనం.*

ఉబ్బెత్తు ముద్రణలోని సాంకేతికప్రక్రియలలో ఒకటి; ఒక కొయ్యబొమ్మను పోగరతోగాని సంలేఖితోగాని ఖాత్రంతోగాని కర్తనించి, ముద్రాతలమును సృజించి, దానిలోనుంచి మౌలిక ముద్రాంకణను లాగుతారు ఇందుకు వాడే కొయ్యబొమ్మను ఒక చెట్టుబోదెను అడ్డంగా కోసి తీసుకొంటారు దీన్నే అడ్డుకోత చెక్క లేదా తుదిపలుకు చెక్క అంటారు ఇటువంటి దిమ్మెలను కఠినజాతి కొయ్యలలో కెల్లా కఠినతమములైన వాటినుంచి మాత్రమే తీసుకొంటారు ఇట్లా అడ్డుకోతచెక్కను తీసుకోవటంలోనే ఇది దారుతక్షణంనుంచి విభేదిస్తున్నది (చూ దారుతక్షణం) ఈ దారు సంలేఖనమునకు బాక్సుచెట్టు దుంగలు ఎక్కువగా ఉపయోగిస్తాయి. అయితే ఎర్రమేపిల్ కొయ్య కూడా వాడుకలో ఉన్నది బాక్సుచెట్టుబోదెలు అంతగా లావుగా ఉండవు; కాబట్టి పెద్ద దిమ్మెలను చేయటానికి బాక్సు కొయ్య దిమ్మెలను, ఒకదాని పక్కన వేరొకదాన్ని అనుసంధిస్తారు ఆ దిమ్మెలపై కర్తనం జరపటానికి ముందుగా, రేఖాకృతిని పెన్సిల్‌తో పరితలంలో లిఖిస్తారు అట్లా లిఖించటానికి ముందుగా పరితలానికి వికశితమైన చీనీయ శ్వేతపు నీటిరంగును పైపూతగా పట్టిస్తారు ఇటువంటి పైపూత ఒకభూమికగా ఉపకరించి పెన్సిలుగీతలు చిక్కగా కనబడేట్లు చేయగలదు; అంతేగాక అంకాన్ని గ్రహించటానికి తగిన రూక్షతకూడా ఆ పరితలానికి లభించగలదు ఇటువంటి రేఖాకృతిని అనుసరించి కర్తనం జరిపేటప్పుడు దిమ్మెను, ఇసుక నింపిన ఒక తోలుదిండుపైపెట్టి పని సాగించవచ్చు ఇట్లా పరితలంలో కర్తనం పూర్తికాగానే, భూమికగా వ్యవహరించిన నీటిరంగును కడిగివేస్తారు తరువాత ఈ విధంగా దిమ్మెనుంచి రూపొందిన దారుకానికి సిరా పట్టించి-దారుతక్షనపు దారుకంతో ముద్రణ సాగించే విధంగానే అంటే - ఉన్నతార్థమైనప్పుడు సాధారణ ముద్రణ పద్ధతిలోను, అట్లాగాని వత్తంలో చేయచ్చు పద్ధతిలోనూ- ముద్రించవచ్చు దారుసంలేఖనమనేది అచ్చపు శ్వేతరేఖా సాంకేతిక ప్రక్రియ; ఎందుకంటే రుజువులలో వచ్చే ఆకృతి, దారుకంలో ముద్రితములుగాని గావులవల్లనే రూపొంది వేద్యమవుతుంది

18వ శతాబ్ది ఉత్తరార్థంలో ఇంగ్లాండు దేశంలో దారుసంలేఖనం సంవర్ధనం పొందింది ఆ ప్రక్రియలో మొదటి నిపుణుడు థామస్ బీవిక్ (1758-'828). ప్రకృతి

లోని అనేక దృశ్యాలను గ్రంథాలలో లక్ష్య చిత్రాలుగా అతడు ఈ ప్రక్రియలో రూపొందించి విస్తృతంగా మన్నన ఆర్జించాడు. విలియమ్ బ్లేక్ (1757-1827) కూడా ఈ ప్రక్రియలో కుశలుడే; అతడే స్వయంగా దారుకముడై చెక్కుడు పనిని సాగించేవాడు 19వ శతాబ్ది మధ్యకాలానికి, పత్రికలలోను, గ్రంథాలలోను లక్ష్యచిత్రాలను రూపొందించటానికి ఉత్తమోత్తమప్రక్రియ దారుసంలేఖనమే అనే ప్రశస్తి కలిగింది ఎంతోమంది సంలేఖకులు. ముఖ్యంగా అమెరికాలో-ఆలేఖనలకు, చిత్రాలకు, ఛాయాచిత్రాలకు ప్రత్యుత్పాదనలను చేయడంలో సిద్ధహస్తులుగా పేరు ఆర్జించగలిగారు. ఇంతలో ఇటువంటి వనితవానికిగాను దారుసంలేఖనమును వాడటాన్ని అడ్డుకొని కాంతి సంలేఖనం త్వరలోనే ముందుకువచ్చి, సంపూర్తిగా దాని స్థానాన్ని ఆక్రమించ గలిగింది. కాని 20వ శతాబ్దిలో దారుసంలేఖనాన్ని పునరుజ్జీవింపజేసి, మౌలిక ముద్రాంకనాలతయారీకి దానిని ఒకలలితకళాప్రక్రియగా రాణింపజేయడం జరిగింది. దారుసంలేఖనపు ఘటనలను చాలగ అనుకరించేదే లేఖాస్తరం వాణిజ్య ప్రకటనరంగంలో దారుసంలేఖనపు శ్వేతరేఖా ఘటనల స్ఫుటీకరించే లక్ష్యచిత్రణలో దాదాపుగా అంతా రేఖాస్తరంపైనే జరుగుతున్నది.

**ood stain** : దారు విలేపనం.

**wood turpentine** : దారు కర్పూరిని, దారు కర్పూర తైలం.

జిగురు కర్పూరతైలానికి, (బంకతైలానికి) ప్రత్యామ్నాయంగా వాడటానికి వీలుంకి దాని కన్నా చాలా చౌకగా లభించే ఒకవిధపు కర్పూర తైలం. దేవదారు వృక్షాల కొయ్య ముక్కలను బెరడులను అభిషవించి దీన్ని తయారు చేస్తారు. ఇది మంచి ద్రావణశక్తి కలిగి, విరళీకరిగా ఉపయోగింపదగినదైనా, దాని వాసనలో ఉండే ఘాటుకనంవల్ల కళాకారులు దీన్ని ఆదరించటంలేదు.

**workshop** : ప్రావేశనం; ఆవేశనం; కార్యాగోష్ఠి.

కళాబృందాలను, వరిష్ఠ కళాకారుడు తన సహాయకుల సాయంతో, సమష్టి కృషివల్ల తన మార్గదర్శిత్వంలో రూపొందించే కర్మాగారం. ఇందులో పలువురుపాల్గొన్ననూ మార్గదర్శిత్వం సాగించి, తుదిమెరుగులు దిద్దిన వరిష్ఠ కళాకారుడిదిగానే ఆకళాఖండం లెక్కకు వస్తుంది ఇటువంటి అలవాటు చాలా పురాతన కాలంనుంచికూడా అమలులో ఉన్నట్లు నిదర్శనాలున్నాయి. అందులో ఒక కళాఖండాన్ని ఒక వరిష్ఠ కళాకారుడు స్వయంగా రచించాడా లేదా కొందరుసహాయ్యకులమీద ఆధారపడ్డాడా అనే విచక్షణ 19వ శతాబ్దికి పూర్వం ఉండేదికాదు. అంతకు పూర్వపు ప్రముఖ కళాకారులు-రూబెన్స్, రెయినాల్డ్స్, మొదలైనవారికి పేరు ప్రతిష్ఠలు తెచ్చిన

కళాఖండాలన్నీ ఈ తీరుగా రూపొందినవే. ప్రస్తుతం కళావిమర్శకులు శిల్ప, చిత్రలేఖనాలలో కలగలుపు పనివల మేలిరకపు కళాఖండాలు రావని అంటుంటుంది కాని పూర్వకాలం ఇటువంటివాటి విరివిగా పలువురిలో కానవచ్చిన పనితనపు కుశలత ఈనాడు ఏ ఒకరిలో మాత్రమే ఉండటం, వారి అభిప్రాయానికి రావటానికి కారణమైఉంటుంది. కాని తక్కిన కళారంగాలలో-వాస్తునిర్మాణాలలో, పారిశ్రామిక రేఖాకల్పనంలో, సినిమాతయారీలో-సమిష్టికృషి అత్యంత సత్ఫలితాలివ్వటం నేటికీ కనపడుతూనే ఉంది.

**World of Art or Mir Iskusstva :** *విశ్వకళ.*

రష్యాదేశంలో ప్రచలితమైన ఒక కళోద్యమం 'చారణులు' (*The Wanderers*) వ్యాప్తిలోకి తెచ్చిన ఉపదేశక వాస్తవికతకు ప్రతిచర్యగా 1890లో ఇది వ్యవస్థితమైంది. 'కళార్థమే కళ' అనే సిద్ధాంతాన్ని ఆ వాదం చేపట్టింది, దీనిపై ఫ్రాన్సు దేశపు అనుభావనావాదపు ప్రభావం కూడా ఉంది. 1905లో రష్యాలో ప్రజ్వరిల్లిన విప్లవానికి తరవాత, అవిపరలో ప్రాకృతిక ప్రపంచాన్ని వ్యాఖ్యానించటమే సంకల్పంగా గ్రహించిన ఈ కళాకారులు రేఖాబద్ధశైలివైపుకు తమ దృష్టి మరల్చారు. ఈ శైలియే ఆ కాలపు అల్పిన చిత్రణలను, గ్రంథాల అక్షరచిత్రాలను గ్రాఫిక్ కళను, నాటకరంగాలంకరణను- ముఖ్యంగా రష్యాదేశపు నృత్యనాటికా కళను-ప్రభావితములు చేసింది. ఈ ఉద్యమానికి ముఖ్యుల బృందపు అగ్రనాయకుడు అలెగ్జాండర్ బెనోయిస్. తక్కిన ప్రముఖులలో గణనీయులు లియోన్ బక్స్ట్, గోలోవిన్, సుడికైన్, నికొలస్ రోరిక్. విప్లవ పూర్వపు నీలపాటలు (*Blue rose*) వర్గానికి చెందిన కాన్‌స్టాన్టిన్ సోమోవ్ కూడా ఈ బృందంలో లెక్కించదగినవాడే

**worm's-eye view** *కీటకదృష్టి; కీటక సమీక్ష.*

దిగువనుండే ఒక బిందువునుంచి చూచినప్పుడు కనబడే దృశ్యం వేరుమైన రీతిలో



కీటక దృష్టి 'వధస్థానానికి కొనిపోబడుచున్న జేమ్స్ ఋషి', సద్యస్క రచన ( 944లో నిర్మూలితమైనది చిత్రం) రచయిత యాంద్రూ మాంటెగ్నా [1431-1506]. పాడువా నగరమందు ఎరిమితాని చర్చిలోని చిత్రమిది. క్షితిజరేఖ, చిత్రమునకు దిగువన ఉండుటయు, ముఖ్య తిరోహిత బిందువు, చిత్రక్షేత్రానికి కుడివైపున ఒక అగోచర రేఖపై ఊహింపబడి యుండుటయు ఇందు గమనింపదగును.

రచితమైన ఆలేఖనం లేదా చిత్రం, నిర్దిష్టంగా రచితమయ్యే అటువంటి కీటకదృష్టి రచన నామక దృగ్గతిలో ఉంటుంది. (చూ : *linear perspective* ).

ఈ రచనలో చక్రవాళరేఖను చిత్రంలో దిగువ భాగంలోనో, లేదా అంతకుకూడా దిగువనో ఉంచటం లేదా ఊహించడం జరుగుతుంది. ఇందువల్ల చిత్రతలానికి సమాంతరంగా పయనించే శీర్షక రేఖలన్నీ ఎగువనే ఒకచోట మేళవించనున్నట్లు ఉంటాయి. ఈ విధంగా రచన సాగేటప్పుడు స్థితిబిందువు దిగువనే ఉండితీరాలి కాబట్టి, తదనుగుణంగా దిగువకు లాగబడిన చక్రవాళరేఖవల్ల సంరచన అంతా, లేదా అందులో అత్యధిక భాగం ఆ చక్రవాళరేఖకు ఎగువనే ఉండగలదు తలను పైకెత్తి, ఒక దృశ్యాన్ని చూసినప్పుడు వేద్యమయ్యేదానిని నిర్దిష్టంగా రూపించటానికి కీటక దృష్టిమాత్రమే బాగా పనికి వస్తుంది. (చూ : *birds-eye view*)

**wrinkles : ముడతలు**

తైలవర్ణముల, పాలిమరువర్ణముల, వార్నిషుల, మాయలక్కల పూతలలో, కాలక్రమేణా కానవచ్చే నాగేటిచాలులవంటి ముడతలు. పూతరంగును తయారుచేయడంలో దోషయుక్త పదార్థాన్ని వాడటంవల్లగాని, పూతను పట్టించటంలో సరిఅయిన పద్ధతులను అవలంబించకపోవటంవల్లగానీ ఇట్టివి ఏర్పడుతాయి.

**wrought iron : కృష్ణాయసం; పోత ఇనుము.**

---

# X

---

**Xoanon : శిలకం.**

ప్రాచీన గ్రీకులలో ఆరాధనకై వినియుక్తమయ్యే కొయ్య విగ్రహం. ఇది చాలా మొరటుగా చెక్కబడిఉండేది. ఎక్కడికైనా మోసుకొని పోవటానికి వీలుగా ఉండేది. ఒక్కొక్కప్పుడు ఒక నిడుపుకర్రకే వస్త్రాలు అలంకారాలు తొడిగి ఊరేగించేవారు. ఈ విషయాలన్నీ సారస్వతంవల్ల కానవస్తున్నవేగాని ఆ ప్రాచీన మూర్తుల అవశేషాలు ఏవికూడా దొరకడంలేదు.

**xylography : దారులేఖనం.**

దారు శిల్పానికిన్నీ, దారుతక్షనమనే కున్నూ వాడబడే పదం. కాని ఈ పదానికి వ్యాప్తి చాలా తక్కువ.

# Y

**yachting style : తేలినౌకా శైలి.**

**yeast black : కిణ్వమషి.**

బ్రాక్షమషికి పర్యాయనామం.

**yellow : పీతవర్ణం; హరిద్రావర్ణం; పసిమిరంగు; పసుపురంగు.**

**yellow (v) : వివర్ణమగు.**

**yellow carmine : పచ్చ జతునం.**

చాలగా చలితత కలిగి, పచ్చగా ఉండే ఒక రంజక వర్ణద్రవ్యం; ఒక విధపు వనస్పతినుంచి దీనిని తయారుచేస్తారు; దచ్చి పాటలిలో ఒక కోవకు చెందినదానిగా దీన్ని భావించే అవకాశం ఉంది.

**yellow earth : పచ్చమట్టి; పీతమృత్తిక.**

పీతగైరికానికి పర్యాయనామం.

**yellowing : వివర్ణత.**

ఒక చిత్రంలో వచ్చే వర్ణభ్రంశత, లేదా స్థాయీపతనం. ఇది ఈ దిగువ కారణాలలో దేనివల్లనైనా కలగవచ్చు:

1. కాలం గడచిన కొద్దీ గోధుమవాకగా మారడం, లేదా వివర్ణత చెందటం-అనేవాటికి నైసర్గికంగా ప్రవణత కలిగిన తైలాలను, వార్నిషులనూ వాడటం.

2. తైలవర్ణాన్ని తయారుచేసే సంచర్యంలో అవిసెనూనెకు తగిన నిష్పత్తిలో వర్ణద్రవ్యాన్ని కలపకపోవడం. అవిసెనూనెలో వివర్ణత తెచ్చే స్వభావం కొద్దిగా ఉంది. వర్ణద్రవ్య అంశం తగినదానిలో ఉండక తగ్గి, అవిసెనూనె ఎక్కువైనప్పుడు, వివర్ణత వెలికివచ్చి, ఆధిపత్యం చూపుతుంది.

3. కాలుష్యం ఎక్కువగా చేరి, ఉపరితలాన్ని కప్పుతూ వార్నిషులో కుదురుకోవటం.

పైవాటిలో మూడోదే వివర్ణతకు తఱుచుగా కారణంగా కనపడుతున్నది. ఇటువంటిదాన్నే కొన్ని సందర్భాలలో అనువివర్ణత (*after-yellowing*) అంటారు. చాలా చెడ్డగా వివర్ణత చెందిన తైలవర్ణ చిత్రాల పాత వార్నిషును తొలగించి, కొత్తగా వార్నిషు పైపూతను పట్టించటంవల్ల వాటితొలుతటి రంగులను పునరుద్ధరించవచ్చు.

**yellow lake** *పీత రంజకం.*

సహజసిద్ధమైన రంగద్రవ్యాల నుంచి తయారుచేసే పారదర్శక పీత రంజకాలలో దేనికైనా ఈ పదాన్ని వాడేవారు ఇప్పుడు అటువంటి సంయోజిత రంగద్రవ్యాలకుకూడా ఈ పేరే వాడుతున్నారు దీని మన్నిక చాలా తక్కువ

**yellow ochre** [1] : *పీతగైరికం; స్వర్ణ గైరికం; గోపీచందనం*

సజలమైన ఇనపభస్మంవల్ల రంగుదేలి- సాధారణంగా బంకమట్టిని కలిగిఉండే- మెరుపు పసిమి మృత్తికలను సంస్కరించగా లభించే కాంతిభేద్యమైన ఒక వర్ణద్రవ్యం. కళాకారుని ప్రాతిపదిక వర్ణాలలో ఇది ఒకటి పురాచారిత్రక కాలంనుంచికూడా ప్రతిసంస్కృతిలోనూ ప్రతి నాగరికతలోనూ దీని వాడుక కనపడుతూనేఉంది. ప్రపంచంలో వివిధ ప్రాంతాలలో గనులనుంచి ఇది తీయబడుతున్నది వీటిలో నాణ్యమైన గైరికాలు, ఫ్రాన్సుదేశంలో, పలురీతి భేదాలతో లభిస్తున్నాయి 'ఆక్స్‌ఫర్డ్ గైరికం' అనే పేరు పొందినది మేలితరగతికి చెందింది ఇంగ్లాండులో పరిమిత ప్రమాణాలలో ఇది దొరుకుతున్నది ఇనుమును కలిగిఉండే తక్కిన మట్టిరంగులవలెనే గైరికం సైతం భస్మీకృతమైనప్పుడు ఎరుపుగా మారుతుంది. పీతగైరికానికే పచ్చమట్టి (*yellow earth*) అనే వ్యవహారంకూడా ఉంది. పీత గైరికమనటానికిబదులుగా గైరికంఅనికూడా సంగ్రహంగా అంటారు

**yellow oxide of iron** : *పచ్చని లోహ భస్మం.*

అంగారక పీతానికి పర్యాయ పదం.

**yellow pigments** : *పీత వర్ణద్రవ్యాలు.*

వర్ణప్రమాణపు లెక్కను అనుసరించి తైల వర్ణాలుగా ఈదిగువ పీతవర్ణద్రవ్యాలు ఆమోదితాలైనవి: పీతగైరికం ముదిసున్నం, పారదర్శక గైరికం, కాడ్మియం పసిమి, నేపుల్స్ పసిమి, కోబాల్ట్ పసిమి, హన్సాపసిమి.

**yellow ultramarine** · *పసిమి అతిసాగరిక.*

బేరియం పసిమికి పూర్వకాలంలో వాడుకలో ఉండిన పేరు.

**yellow varnish** : *పచ్చ వార్నిషు.*

అసిసెమూనెలో దామరు యక్షధూపాన్ని కలిపి వేడిచేస్తే ఇది లభిస్తుంది. ఇది ఈ కాలంలో వాడుకలో లేదు

**yolk** : *గుడ్డు సొన.*

**young fustic** : మొక్కపసుపు.

దక్షిణ యూరపులోనూ, పశ్చిమ ఆసియాలోనూ పెరిగే ఒకవిధపు చెట్టునుంచి తయారయ్యే ఒక సహజమైన పసిమి రంగద్రవ్యం, గుడ్డలపై అద్దకానికై దీన్ని ఇదివరలో వాడేవారు.

# Z

**zaccab :** *జాకాబు.*

సున్నంలో తెల్లమట్టిని కలిపితే లభించే ఒక పదార్థం. అమెరికాలోని యూకటానులో ప్రాచీనకాలంలో గోడల కట్టుబడికీ, పూతలకూ దీన్ని వాడేవారు.

**zaffer or zaffre :** *జఫర్.*

నీలవర్ణద్రవ్యమైన కాచికను తయారుచేయటానికై వాడే కోబాల్ట్ భస్మానికి పర్యాయ నామం.

**ziggurat :** *జిగ్గూరాత్.*

ఇది బేబిలోనీయ భాషాపదం. ప్రాచీన కాలంలో బేబిలోనియా అనబడిన దేశంలో (ప్రస్తుత ఇరాకు న) వెలసిన ఆలయాల గోపురాలు ఆ భాషలో ఈ పేరున వ్యవహృతాలు. పచ్చి ఇటుకలతో బృహత్ ప్రమాణంలో అందొక్కొక్కటీ నిర్మిత మయ్యేవి. కొన్ని గోపురాలకు పైతొడుగుగా కాల్చిన ఇటుకలపైపొర అమర్చబడేది. ఈ గోపురాలు చాలా అంతరువులలో నిర్మితాలు. పైకి పోయేకొద్ది అంతరువుల పొడవు, వెడల్పులు, ఎత్తు తగ్గుతుండేవి. ఇందులో కొన్ని గోపురాలు ఏడంతరువులను సైతం కలిగి ఉండేవి.

**zinc chromate or zinc chrome :** *నాగ క్రోమిక.*

నాగపీతానికి పర్యాయనామం.

**zinc etching :** *నాగలేఖనం.*

**zinc green :** *నాగ హరితం.*

కోబాల్టు హరితానికి పర్యాయనామం; నాగపీతం, ప్రసియన్ నీలం, ముగ్గుసున్నం కలిపిన సమ్మిశ్రిత వర్ణద్రవ్యానికిన్నీ ఈ పేరే వాడుతున్నారు.

**zinc oxide** *నాగభస్మం.*

ఎన్నో తిరకమభేదాలుండేరీతిలో తయారుచేయబడుతున్న ఈ పదార్థం పలువిధాలుగా—నాగ శ్వేతవర్ణ ద్రవ్యాలు, ఔషధద్రవ్యాలు, అంగరాగాలు మొదలైనవాటిలో—ఇది వాడుకలో ఉంది. మార్దవ ద్యుతికోంలలో సౌధకద్రవ్యంగాసైతం కొన్ని సందర్భాలలో దీన్ని ఉపయోగిస్తారు. ఇత్తడిని తయారుచేయడంలో తుత్తునాగపు ముడిఖనిజాన్ని ప్రాచీనకాలంనుంచికూడా వాడ

టం యథార్థమే అయినా 1746లో జర్మనీలో మార్‌గ్రాఫ్ అనే వ్యక్తి తుత్తునాగాన్ని ఒక ప్రత్యేక ధాతువుగా రుజువుచేసేవరకూ దీన్ని ఒక లోహంగా పరిగణించేవారుకారు.

**zinc white :** *నాగశ్వేతం.*

నాగభస్మంలో ఒక రీతిదానికి కళాకారులు వాడే ప్రత్యేకనామం, ఉజ్జ్వలమై, హిమధవళమైన వర్ణద్రవ్యమిది. నీటి రంగులలోను తక్కిన జలక్షయలేపములందునా ఇది ఎటు వంటి పొరపొచ్చెం లేకుండా కలిసిపోతుంది. శ్వేతవర్ణంలో ఇది తక్కిన్ని శ్వేతాలను అధిగమింపగలిగినా, తైలంలో ప్రయోగించేటప్పుడు మాత్రం తక్కిన లక్షణాలలో తుషారశ్వేతం కన్నా ఎంతో తక్కువగానే ఉంటుంది ఇది అర్ధకాంత్యభేద్యత కలది; శోషక లక్షణం చాలా తక్కువ; దుర్బల పటలాలను కల్గించే ప్రవృత్తి కలది. అయితే, వాతావరణంలోని గంధక వాయువుల చర్యలవల్ల తుషారశ్వేతం వివర్ణత చెందగా, నాగశ్వేతం అట్లా వివర్ణత చెందదు. 1782లోనే, వర్ణద్రవ్యంగా,నాగభస్మపు స్థానాన్ని నాగశ్వేతానికి కల్పించటానికిగాను రాసాయనికులు తమ యత్నాలను సాగించటం ప్రారంభించారు. 1834 లో మొదటిసారిగా కళాకారులకు నాగశ్వేతం పరిచితం చేయబడింది; చీనీయశ్వేతం అనే పేరుతో ఆంగ్లదేశంలోని విన్‌సర్ అండ్ న్యూటన్ కంపెనీవారు దీన్ని ఒక నీటిరంగుగా కళారంగంలో ప్రవేశపెట్టటంతో ఆ కృషి మొదలైంది. 20వ శతాబ్ది ప్రథమపాదంలో దాని తయారీలో చక్కని అభివృద్ధికరమైన మార్పులు జరిగి, తుషారశ్వేతానికి ప్రత్యామ్నాయంగా సంతృప్తికరమైన రీతిలో అది పనిచేయగలదనే ప్రశస్తి దానికి లభించింది. తుషారశ్వేతానికి గల పరమోత్కృష్టతను కాదనేవారు ఎవరూ లేకపోయినా కళాకారులు -అందునా ముఖ్యంగా తుషారశ్వేతపు విషలక్షణాలకు భయపడేవారు-విస్తృతంగా నాగశ్వేతాన్నే వాడుతున్నారు

**zinc yellow :** *నాగపీతం.*

నాగక్రోమికకే ఇంకో పేరు. నిమ్మపండు పసిమి కలిగిన వర్ణద్రవ్యమిది. కలకాలం మన వలసిన చిత్రాల రచనకు ఇది పనికిరాదు.

**zinnober green .** *జినోబర హరితం.*

క్రోమ్ హరితానికి — పారిశ్రామిక వర్ణద్రవ్యంగా-ఉన్న వివిధ పర్యాయనామాలలో ఇది ఒకటి (జినోబర్ అనేది ఒక వృక్ష విశేషం).

**zirconium oxide :** *జిర్కోనికా భస్మం.*

మూర్తవప్రక్రియలలోనూ, గాజు తయారీలోనూ వాడే ఒక ద్రవవిశేషం. జిర్కోన్ అనే యౌగికంనుంచి దీన్ని తయారు చేస్తారు.

విపరీతపు ఖరీదు కలది కావడంచేత దీన్ని కళాకారులు అంతగా వాడరు.

**zircopax** : *జిర్కోపాక్స్.*

మార్దవ ద్యుతికాంలో వాడే ఒక కాంతి నిరోధకికి అమలులో ఉన్న వ్యాపారనామం.

**zones of recession** : *తిరోగామి మండలాలు.*

ఒక సంరచనలో ప్రాదేశిక గభీరతను తెలియజేయుటానికిగాను కృషి చేసేటప్పుడు పురోభూమికి, మధ్యస్థభూమికి, పశ్చాద్భూమికి ఈ పేరు వాడబడుతున్నది